# శ్రీ శ్రీ

# అనంతం

## ఆత్మచరిత్రాత్మ చరిత్రాత్మక నవల

శ్రీ శ్రీ సాహిత్య సర్వస్వం—20

కూర్పు : చలసాని ప్రసాద్

శ్రీ

25 రూ. విరసం ప్రచురణ ఆగస్టు 1986 ప్రతులు : 3000
హక్కులు : జూనియర్ శ్రీశ్రీవి ముద్రణ: ప్రగతి ప్రింటర్స్
ముఖచిత్ర రూపకల్పన: గోపి

ప్రతులకు—
1. సి.ఎస్.ఆర్.ప్రసాద్ సి—132, ఎస్.వి.ఎన్. కాలనీ, గుంటూరు—522 006
2. నవోదయ పబ్లిషర్స్ 3. అరుణా పబ్లిషింగ్ హౌస్
4. న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్
5. జయంతి పబ్లికేషన్స్ ఏలూరు రోడ్డు, విజయవాడ
6. నవయుగ బుక్ హౌస్ సుల్తాన్‌బజార్, హైదరాబాద్
7. బుక్ సెంటర్ మెయిన్‌రోడ్, విశాఖ
8. రేడియంట్ బుక్ హౌస్ జగదాంబ బిల్డింగ్స్, విశాఖ—530 020

# ముందుమాటలు

"ఇప్పుడు మనం 20వ శతాబ్దంలో ఉన్నాం. ఈ శతాబ్దం నాది! (తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు!) నేను 1910లో పుట్టేను (తోకచుక్కలాగ). మూడుమార్లు మృత్యువుతో పోరాడి గెలిచాను. 1918లో మొదటి గీతంరాశాను (గణ యతి ప్రాసలంటే ఏమిటో తెలియకుండా!). 1920లో మొదటినవల (వీరసింహ విజయసింహులు) రాసిపారేశాను. 1925లో మొదటి నవల (పరిణయ రహస్యం) అచ్చయింది. దాని ప్రతులు ఇప్పుడులేవు విశాఖపట్టణం హిందూ రీడింగు రూము లైబ్రరీలో ఉండేది.

1928లో మొదటి ఖండకావ్య సంపుటి (ప్రభవ) మా నాన్నగారిచ్చిన డబ్బుతో రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్‌లో అచ్చువేయించాను. దీని ముద్రణ వ్యవహారమంతా మిత్రుడు పురిపండా చూసుకోవడమేగాక, కృష్ణశాస్త్రి కృష్ణపక్షాన్ని శివశంకరశాస్త్రి లోకానికి పరిచయం చేసినట్లు, నా తొలి కవితను తన ఉపోద్ఘాతంతో లోకంమీదికి వదిలేడు.

1930లో నేను 63 రోజులు టైఫాయిడ్ జ్వరంతో బాధపడ్డాను. జీవితం మృత్యువుతో ఎలా పోరాడుతుందో స్వయంగా తెలుసుకున్నాను. ("ఇక లాభంలే"దని నన్ను మంచంమీదనుంచి కిందకు దించెయ్యడం నాకు బాగా జ్ఞాపకం). ఇది నా రెండవ మృత్యువు. 1955లో మెంటల్ క్లినిక్‌లో ఉండడం మూడవది. మొదటిసారి నేను పుట్టిన తొలినెలల్లోనే చచ్చిపోవలసింది. మా బంధువొకాయన చుట్టచురకలతో నాటు వైద్యం చేసి నన్ను బతికించాడట. దీనికి గుర్తుగా నా నుదుటిమీదా, మెడవెనకాతలా, చేతిమణికట్లమీదా మచ్చలున్నాయి.

1930 దాకా తెలుగు సాహిత్యం నన్ను నడిపించింది. ఆ తర్వాతనుంచీ దాన్ని నేను నడిపిస్తున్నాను. అప్పటినుంచీ తెలుగుసాహిత్యం చరిత్ర శ్రీ శ్రీ స్వీయచరిత్ర. ఈ శతాబ్దపు తొలిపాదంలో జమీందారీ కవిత్వంమీద భావకవిత్వం తిరుగుబాటు చేసింది. చిన్నప్పటినుంచీ తిరుగుబాటు మనస్తత్వంగల నేను భావ కవిత్వాన్ని మనస్ఫూర్తిగా ఆహ్వానించాను. (నాకు బాగాజ్ఞాపకం, ఆరోజుల్లో మా బంధువొకాయన నా కవితాశక్తిని తెగ మెచ్చుకుంటూ, నేనొక సలక్షణమైన మహాప్రబంధం రాస్తే బాగుంటుందని సిఫార్సు చేశాడు. ఆ సిఫార్సును నేను బుట్టదాఖలా చేశాను).

1925 నుంచి 50 దాకా సాగిన రెండో పాతికేళ్ళలో భావకవిత్వం మీద యువ కవుల తిరుగుబాటు సాగింది. ఈ పాతికేళ్ళలోనే రెండో ప్రపంచయుద్ధం ప్రారంభం కావడం, పోవడం, మనకి స్వరాజ్యం రావడం జరిగాయి. స్వరాజ్యం వచ్చినకొత్తరోజుల్లో— "భావకవిత్వం : ఒక శవపరీక్ష" అనే వ్యాసం రాద్దామని నేను చాలా ఉబలాటపడ్డాను. వ్యాసం అయితే రాయలేదుకాని భావకవిత్వం మాత్రం సాహిత్యరంగంనుంచి నిష్క్రమించిందన్న యథార్థాన్ని బుజువుచెయ్యవలసిన అవసరం లేకపోయింది.

అలా నిష్క్రమించిన భావకవిత్వం స్థానాన్ని అభ్యుదయకవిత్వం ఆక్రమించింది. ఆక్రమించి ఈ కొత్తకవిత్వం ఏమిటి సాధించింది? ఈ ప్రశ్నకి నాకన్నా, నా కవితా

సోదరుడు సోమసుందర్ చక్కని, సమగ్రమైన జవాబివ్వగలడు. నేనిక్కడ చెప్పదలిచింది ఒకే ఒక్క విషయం మాత్రం. అభ్యుదయోద్యమం తెలుగు సాహిత్యంలో గ్రాంధికభాష కు శాశ్వతంగా ఉద్వాసన చెప్పింది. నవలల్లో, నాటకాల్లో, పత్రికా సంపాదకీయాల్లో, రేడియో ప్రసంగాల్లో సర్వత్రా వ్యావహారిక భాష విజయపతాకం ఎగురవేసింది. కవిత్వంలో గణబద్ధ ఛందస్సుల ఫ్యూడలిజం నడ్డి విరగ్గొట్టి మాత్రాబద్ధ ఛందస్సుల ప్రజాస్వామ్యాన్ని స్థాపించింది.

ఆ రోజుల్లో నేను—

"నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధనొక్కటి...
ఆహుతిచ్చాను"

అంటూ సింగిల్ పన్నా కవిత్వాలు రాస్తూవుంటే అబ్బూరి రామకృష్ణారావుగారు హాస్యాని కొక వచనగీతం ఉదాహరించేవారు.

"కాళీ పే
కేజీ పె
ట్టెలు అ
మ్మబడును"

ఇదో కర్రల అడితీవద్ద బల్లమీద స్థలం చాలకపోవడంవల్ల నిలువుగా వ్రాసిన ప్రకటన. దీన్ని "కాళీ పేకేజీ పెట్టెలు అమ్మబడును" అని చదువుకోవాలి. తెలుగులో వచనగీతానికి ఈ విధంగా హుషారిచ్చినవారు శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు. (నా కవిత్వాన్ని ఎంత వేళాకోళం చేసేవారో నాకంత ప్రోత్సాహంకూడా ఇచ్చేవారు) చాలాకాలం కిందట నేను వ్రాసిన "పొలాలనన్నీ హలాలదున్నీ" అనే గేయాన్ని మెచ్చుకుంటూ అభ్యుదయ రచయితల లండన్ మానిఫెస్టో సారాంశం అంతా ఇందులో దించేశావోయ్ అన్నారు. ఇది నా మనస్సులో పదిలంగా దాచుకున్న పొగడ్తలలో ఒకటి!

ఇంకోటి ఇక్కడే చెప్పాలనివుంది. ఈ సింగిల్ పన్నా గేయాలు రాసే రోజుల్లోనే ఒకసారి అడివి బాపిరాజుగారు భీమవరంలో ఒక కవిసమ్మేళనం ఏర్పాటుచేశారు. అందులో నేను కవితాపఠనం చేస్తూవుంటే వెనకనుంచి ఒక పది పన్నెండేండ్ల కుర్రాడు, "ఓస్, ఇదే కవిత్వం అంటే ఇలాంటిది నేనూ రాసెయ్యగలను" అనడం వినిపించింది. ఆ వయస్సు కుర్రాడిచేత అలా అనిపించగల కవిత్వం వ్రాసినందుకు ఇప్పటికీ నేను గర్విస్తున్నాను.

పికాసో చిత్రాన్ని చూసిన ఒక అమెరికన్ కోటీశ్వరుడు, "ఓస్! ఇలాంటి చిత్రాన్ని నా పదేళ్ళ కొడుకుకూడా గీకెయ్యగలడు" అన్నాడట. పక్కనేవున్న ఇంకోకోటీశ్వరుడు— "చిత్రలేఖనం అంటే ఏమిటో తెలిసినవాడు పికాసో చిత్రాన్ని మాత్రం లక్షల ఖరీదుకి కొంటాడని మరిచిపోకు బ్రదర్" అన్నాడట!

మొన్న ఈమధ్యనే, హైద్రాబాదు వీరశైవ హాస్టల్‌లో విప్లవ రచయితల సంఘం ద్వితీయ వార్షికోత్సవం జరిగినప్పుడు శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు నాకు మరో యోగ్యతాపత్రం ప్రసాదించారు. "You are waging a heroic battle" అన్నారు. సాహిత్య అకాడమీలో సభ్యత్వంకన్నా మిన్నగా దీన్ని ఎన్నుకుంటాను.

అన్నట్లు వి.ర.సం దాకా ఇంకా రాలేదు కదూ? అరసం తొలిరోజుల్లోనే ఉన్నాం కదూ! ఆ రోజుల్లో — స్వరాజ్యం వచ్చిన కొత్తదినాల్లో నెహ్రూగారి చమ్కీ ఉపన్యాసాల మధ్య భారతదేశంలో సామ్యవాద భానూదయం అయిపోతున్నట్టుగానే అందరమూ భ్రమపడ్డాం. నెహ్రూ ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా తెలంగాణా ఉద్యమాన్ని అణగద్రొక్కినా కాంగ్రెస్‌మీదా, గాంధీగారిమీదా ప్రజల్లో ఉన్న భక్తి ఏమాత్రమూ చెక్కుచెదరలేదు. కాంగ్రెస్‌ద్వారా సామ్యవాదం సిద్ధిస్తుందని ఇంకా నమ్ముతున్న అమాయకులు ఇప్పటికీ ఉండడమూ, అందులో అభ్యుదయ రచయితలు అగ్రేసరులుగా నిలబడడమూ ఈనాడు చరిత్ర మనమీద ప్లేచేస్తున్న ప్రాక్టికల్ జోక్స్‌లో ముఖ్యమైనది. 25 సంవత్సరాల కాంగ్రెస్ పరిపాలన తర్వాతకూడా సాహిత్యంలో సమ్రాట్టులూ, సార్వభౌములూ, చక్రవర్తులూ ఉట్టికట్టుకుని ఊరేగుతున్నారంటే భూస్వామ్య వ్యవస్థ పునాదులింకా చెక్కుచెదరకుండా నిలిచే ఉన్నాయన్నమాట. ఈ పునాదులను పెళ్లగించడం కోసమే వి.ర.సం ఆవిర్భవించింది. నిస్సందేహంగా తన చారిత్రక కర్తవ్యం నిర్వహిస్తుంది.

75 శాతం నిరక్షరాస్యులమీద 25 శాతం అక్షరాస్యులూ, 90 శాతం దరిద్రులమీద 10 శాతం ధనవంతులూ పరిపాలన సాగిస్తున్న వ్యవస్థ మనది. ఇదే ప్రజాస్వామ్యం అనుకోవడమంత సిగ్గుచేటు ఇంకోటి ఉండదు. ఈ వ్యవస్థను మార్చాలని ఉద్ఘోషించడంకన్నా ఇంకో ఉత్కృష్టధర్మం ఏ సాహిత్యపరుడికైనా ఎలావుంటుందో నేనూహించలేను. మరి ఈ వ్యవస్థకి రకరకాలుగా కొమ్ముకాచే రాతగాళ్ళంతా నా దృష్టిలో ప్రజాద్రోహులే.

ఈ వ్యాసంలో ఇకమీదట ఏంవ్రాసినా విప్లవసాహిత్యం మీదనే వ్రాయవలసి ఉంటుంది. వి.ర.సం గ్రంథాలను నిషేధిస్తూ, వి.ర.సం రచయితలను నిర్బంధిస్తూ విప్లవ సాహిత్యాన్ని ప్రదర్శించే వీరయ్యలమీద కూడా దాడిచేస్తూ ఈ ప్రభుత్వం ఎలా సామ్యవాదాన్ని స్థాపించగలదో నాకర్థంగాదు. ఒకటిమాత్రం నిశ్చయం, యువతరం బేషరతుగా విప్లవాన్ని ఆహ్వానిస్తోంది. ఆ తరానికి మన పాలకవర్గం దూరమై ఆకాశ హర్మ్యాల్లో నివసిస్తోంది. యువతరం విజృంభించడం, దాని ఫలితంగా, పాలకవర్గం పతనంకావడం త్వరలోనేతప్పనిసరి అనిచెప్పడానికిఏ మీనమేషాలను గుణించనక్కరలేదు.

1970లో నా షష్టిపూర్తి జరిగింది. అప్పుడే తెలుగు సాహిత్యం ఒక పెద్ద మలుపుతీసుకుంది. ఆ ఏడే విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. దానికి నన్ను అధ్యక్షుడిగా ఎన్నుకున్న వారందరికీ నా ధన్యవాదాలు.

ఇండియాకు రాష్ట్రపతి కావడంకన్నా, వి.ర.సం అధ్యక్షుణ్ణి కావడమే నాకు మహదానందకరం. తెలుగు కవితా రంగంలోనూ, కథానికా రంగంలోనూ విప్లవ రచయితలు జేగీయమానంగా ముందుకుపోతున్నారు. ఇతరక్షేత్రాల్లో కూడా ఎన్నిక చెయ్యదగ్గ విజయాలు సాధించడానికి ఎంతో కాలం పట్టదు.''

'మహతి' (యువభారతి వారి సమీక్షావ్యాస సంకలనం—1972)లో శ్రీశ్రీ మాటలివి.

ఈ శతాబ్దం ఆరంభంనుంచి మన సమాజం మనకు 'అనంతం'లో గోచరిస్తుంది. జీవిత వాస్తవికత పుష్కలంగా మన కళ్ళకు కడుతుంది 'అనంతం'. ఎవరెవరో

ఎందరెందరో వ్యక్తులు మనకు ఇందులో తారసపడతారు. ఈ వ్యక్తుల వెనకాల ఉన్న సామాజిక శక్తుల చిత్రణ 'అనంతం'లో మనకు దొరకుతుంది.

విశాఖపట్టణం ఒడిలో పారిశ్రామిక విప్లవం బడిలో పెరిగాడు శ్రీశ్రీ. వాటితో పాటే తాను ఎదిగానని కూడా చెప్పుకున్నాడు శ్రీశ్రీ.

సామాజిక జీవితంతో, రాజకీయ రంగంతో, ప్రజా ఉద్యమాలతో అత్యంత సన్నిహితంగా ఉన్నాడు శ్రీశ్రీ. అందుకే తన జీవితకాలంలో తెలుగు సాహిత్యం తిరిగిన అన్ని మలుపుల్లోనూ ఉన్నాడు శ్రీశ్రీ. పరిస్థితులు తోసుకువచ్చినప్పుడు కీలకపాత్ర వహించగలిగాడు శ్రీశ్రీ. ఉద్యమం ఉధృతం అయినప్పుడు నాయకత్వం వహించగలిగాడు శ్రీశ్రీ.

'అనంతం' శ్రీశ్రీ స్వీయచరిత్ర. శ్రీశ్రీ జీవితకథ. శ్రీశ్రీ కవితా జీవితం. శ్రీశ్రీ జీవితకావ్యం. ''అన్నిరకాల చైతన్యమూ జీవితంనుంచే పుట్టాలి. అనేక మతాలూ, తాత్త్వికభావాలూ, సాహిత్యమూ జీవితమే పునాదిగా గలవి. జీవితం దేశ, కాల ప్రభావాలకు అనుగుణంగా మారుతుంది'' అన్నారు కొడవటిగంటి కుటుంబరావు గారు.

అందుకే 'అనంతం' మీ ముందుంచుతున్నాం. ఏ ముసుగులూ, దాపరికాలు లేకుండా ఉన్నదున్నట్టు రాశాడు శ్రీశ్రీ. చాలామందికి ఇదే నచ్చలేదు. ఇందులో మనకు అక్కర్లేనివి కొన్నివున్నాయన్నారు కొందరు. మనం మింగలేని చేదునిజాలూ వినలేని సంగతులూ, చూడలేని దృశ్యాలూ కూడా 'అనంతం'లో ముందుకు దూసుకువచ్చాయన్నారు మరికొందరు. ఏది ఏమయినా ప్రజలు హంసల లాంటివారు పాలు, నీరు వేరుచేసుకోగలరు.

ఇక దీని రచనాపద్ధతి గురించి ఒక చిన్నమాట. ఒకచోట కుదురుగా కూర్చుని తీరిగ్గా, తాపీగా రాసిందికాదు 'అనంతం' అప్పుడప్పుడూ, అక్కడక్కడా రాస్తే ఎప్పుడెప్పుడో, ఎక్కడెక్కడో అచ్చయ్యాయి. 1950కి ముందు చాలాకొద్దిగా రాశాడు ఎక్కువ భాగం 1975–1977 లో ప్రజాతంత్ర వారపత్రికలో రాశాడు. 1979–1980లో స్వాతి మాసపత్రికలో మళ్ళీ మొదలెట్టి కొనసాగించాడు. వేరేసందర్భాలలో రాసిన కొన్నింటికి 'అనంతం'లో చోటు కల్పించాడు శ్రీశ్రీ. ఆ వివరాలన్నీ ఇందులో పొందుపరిచాం.

మరోమాట. 'అనంతం' ఒక క్రమంలో కూడా రాయలేదు శ్రీశ్రీ. అందుకే ''ఆరునెలల నుంచి హైదరాబాద్ రావాలనుకుంటున్నాను. 'అనంతం'లోని వివిధ ఘట్టాలను ఒక క్రమంలోకి తెచ్చి ఒక సంపుటంగానూ, చైనాయాత్రను ఇంకో పుస్తకంగానూ అచ్చువేయించే పనిమీద. అక్కడ కనీసం వారంరోజులైనా ఉండవలసి ఉంటుంది'' అంటూ 5.7.1977న దేవిప్రియగారికి జవాబులో రాశాడు శ్రీశ్రీ. ఇది మా మనసులో ఉంచుకుని 'అనంతం'లో క్రమంకోసం ప్రయత్నించాం. మా ఈ ప్రయత్నం ఎంతవరకు నెరవేరిందో మీరే చెప్పాలి.

చలసాని ప్రసాద్

విశాఖపట్టణం,
15.6.1986

# కృతజ్ఞత

తమ దగ్గరున్న 'అనంతం' భాగాలు పంపి
తోడ్పడిన వీరిని మరువలేము.
కె.వి.ఆర్—కావలి, వి.చెంచయ్య—కావలి
వి.సుబ్రహ్మణ్యం—కావలి, కడియం సాంబశివరావు—కలకత్తా
పడాల జోగారావు—టెక్కలి, శివరామకృష్ణ—విశాఖపట్టణం
దేవీప్రియ—హైదరాబాద్, వేమూరి బలరాం—స్వాతి అధినేత, విజయవాడ

'అనంతం' పుస్తకరూపంలో మీముందుకు
రావడానికి ఎంతో సహాయపడిన
'ఉదయం' ప్రొడక్షన్ మేనేజర్ తులసీదాస్,
'ఉదయం' ఫోటో కంపోజింగ్ సెక్షన్
ఆర్టిస్టులు బి.నరసింగరావు, గోపి, చంద్రశేఖర్‌లు
ప్రగతి ప్రింటర్స్ పరుచూరి హనుమంతరావు
వసంతలను
శ్రీశ్రీ సాహిత్యసర్వస్వం 20 సంపుటాలుగా
వెలువడడానికి ఆర్థికంగా మాకు చేయూతనిస్తున్న
మిత్రులను విరసం ఎన్నటికీ మరువలేదు.

# ప్రత్యేక కృతజ్ఞత

'అనంతం' అందమైన అక్షరాలతో
పుస్తకంగా రావడానికి తోడ్పడ్డవారు
తారకప్రభు పబ్లిషర్స్ అధినేత, 'ఉదయం' చీఫ్ ఎడిటర్
దాసరినారాయణరావుగారు.
శ్రీశ్రీ మీద గౌరవంతో ఈ పుస్తకాన్ని
ఉచితంగా కంపోజ్ చేయించి యిచ్చి మాకు ఎంతగానో
సహాయం చేశారు.
వారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు.

# అంతరంగం

# ప్రారంభం

## ఒకటి

ఇన్నాళ్ళూ నేను కాలం కంట్రోల్‌లో జీవిస్తూ వచ్చాను. ఇప్పుడిప్పుడే నా కాలాన్ని నా అదుపులో పెట్టుకోవాలని ప్రయత్నిస్తున్నాను. అంత సులువుగా ఒకడి చెప్పుచేతల్లో నడుస్తుందా కాలం? దానికి దేవుడి లక్ష్యమేలేదు, నిన్నూ నన్నూ ఖాతర్ చేస్తుందా?

అయితే, అనాకారమూ అనంతమూ నిర్జీవమూ అయిన ఈ కాలానికి ఒక గుణం ఉంది. తన అధికారంలో ఉన్నవాణ్ణి, ఎంత అధఃపాతాళాని కణిచేస్తుందో అంతగానూ తన్ను శాసిస్తున్న వాడికి బానిస అయిపోతుంది. ఈ సంగతి మానవుడికి తెలియక తానే కాలానికి బానిసననుకొంటాడు. కర్మం అంటాడు. దైవం అంటాడు. లలాటలిఖితం అంటాడు. ఇలాగే ఎన్నో విధాల తన్ను మోసం చేసుకుంటూ ఇతరుల్ని మోసగిస్తూ ఎలాగో బతికేస్తాడు.

ఆదిమానవుడు అడవుల్లోని కార్చిచ్చును చూసి జడుసుకున్నాడు. తర్వాత దాన్ని తన యింట్లోనే తయారు చేసి, అన్ని పనులూ చేయించుకోవడం నేర్చుకున్నాడు. అగ్నిహోత్రం ఆరాధ్యదైవం అయింది. ఎందుకు? సాటి మానవుణ్ణి జడిపించడానికీ, వాడి చాకిరీని దోచుకోవడానికీ! ఈ పురోహిత వర్గానికి తెలుసు-నిప్పు, నీరు, గాలి, నేల, నింగి- ఏదీ దేవుడు కాదని. కాని ఒక ఉత్సవవిగ్రహం అవసరమయింది. కార్మికుల కండబలం దోచుకోవడానికి మేధావుల మెదడు సృష్టించిందొక మిథ్యాదైవాన్ని!

విద్యుచ్ఛక్తినే తీసుకుందాం. అదీ నిర్జీవమైనదే, నిరాకారమైనదే. అంతమందికీ అది అడ్డమైన చాకిరీ చేసి పెడుతుంది. పొరపాటున ఎవడైనా దాని మీద చెయ్యి వేశాడో అక్కడికక్కడే వాణ్ణి హఠాత్తుగా హతమారుస్తుంది.

నన్ను చాలా మంది అడుగుతూ ఉంటారు. "పోనీండి, మీకు దేవుడి మీద నమ్మకం లేదు, కానీ ఏదో ఒక తెలియని శక్తి ఈ విశ్వాన్ని నడిపిస్తోందని ఒప్పుకుంటారా"? అని. నేను నవ్వుకుంటాను.ఈ సకల చరాచరజగతిలో నాకు తెలిసిందే కొంచెం, తెలియంది బోలెడు! అంచేత "నేను తెలివితక్కువ వాణ్ణి, ఎందుకూ కొరమాలిన వాణ్ణి, ఎవడో ఆ తెలియని వాడా! నీ కాళ్ళు పట్టుకుంటాను. నన్ను రక్షించు" అంటే వాడు నాకు సమస్త సదుపాయాలు చేస్తాడట! ఇదే అసలైన పిసలైన బానిస మనస్తత్వం! ఈ తత్వాన్ని ఎదుర్కోవ డానికే ఇక నాకు మిగలిన కాలాన్ని వినియోగించదలచుకున్నాను! అంతేకాదు. ప్రపంచం అంతటా ఇది ఓడిపోతున్న తత్వం. మాది గెలుస్తున్న తత్వం.

ముప్ఫైమూడు కోట్ల దేవతలు కాపాడుతున్న ఈ దేశంలో పరాంకోటి మంది దరిద్రులున్నారు. నాకు దేవతలూ వద్దు. దరిద్రమూ వద్దు. ఉత్తర కొరియా లాంటి ఒక చిన్నదేశంలో ఇప్పుడు దరిద్రమూ, దాస్యమూ, దైవమూ లేవు. ఇక చైనా విషయమంటారా? ఆ సంగతి చెప్పాలంటే చాలా వుంది. చెబుతాను. తప్పకుండాచెబుతాను. అయితే ఇప్పుడు కాదు.

ప్రస్తుతం నా జీవితంలో ఒక పంచముఖ పోరాటం సాగిస్తున్నాను. మొన్నీ మధ్య హైదరాబాద్‌లో జరిగిన 'రాడికల్ స్టూడెంట్స్ యూనియన్'[1] సభలో ఈ విషయమే నేను ప్రస్తావించాను. "ఇవియేనున్ సతతంబు నాకును గరం బిష్టంబులైయుండు"[2] ఈ అయిదూ ఏవిటంటే 1.భారత చైనా మిత్రమండలి, 2.పౌరహక్కుల రక్షణ, 3.విప్లవ రచయితల సంఘం 4.చలనచిత్ర రంగం 5.కాలం, అనగా దైవంతో పోరాటం.

పోరాటం అని ఎందుకంటున్నానంటే, తెలిసి కొందరం తెలియక కొందరం ఈ అనంతమైన జీవిత సమరం సాగిస్తూనే ఉన్నాము. ఇందులో పరాజయాలు వస్తాయి. విజయాలు లభిస్తాయి. ఓడిపోయామని క్రుంగి పోవడం ఎంత అవివేకమో, గెలిచామని పొంగిపోవడం కూడా అంత అనుచితమే. అరవయ్యయిదేళ్ళ నా జీవితాన్ని ఒకసారి సింహావలోకనం చేస్తే నాకు అఖండమైన విజయాలే ఎన్నో కనబడుతున్నాయి. అక్కడక్కడ చిన్న చిన్న పరాజయాలు కలగకపోలేదు. వాటిన్నేను లక్ష్యపెట్టను. అయితే అవి చెప్పే గుణపాఠాల్ని మాత్రం అలక్ష్యం చెయ్యను. ఇంకా నేను బతికి ఉండడమే ఒక గొప్ప విజయంగా భావిస్తున్నాను. ఆ మేరకు నేను కాలాన్ని ఓడిస్తున్నానని కూడా నాకు తెలుసు. అంతిమ విజయం కాలానిదే అనుకుంటారు కొందరు! కాదు మానవుడిదే అని గర్జిస్తాన్నేను.

*ప్రజాతంత్ర 13–4–1975*

1 *రాడికల్ స్టూడెంట్స్ యూనియన్ **(RSU)***
*మొట్టమొదటి మహాసభలు హైదరాబాదులో 1975 ఫిబ్రవరి 22, 23 తేదీల్లో జరిగాయి. 23వ తేదీ ఊరేగింపులో శ్రీశ్రీ ముందు నడిచాడు— దాదాపు 20 కిలోమీటర్లు. ఆ సాయంత్రం బహిరంగసభకు కూడా అధ్యక్షత వహించాడు.*

2 *ఇవి యేనున్ సతతంబు నాయెడ గరంబిష్టంబులై యుండు బా*
*యవు భూదేవ కులాభితర్పణ మహీయః ప్రీతియున్ భారత*
*శ్రవణాసక్తియు బార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహో*
*త్సవమున్ సంతత దాన శీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్.*

*శ్రీమదాంధ్ర మహాభారతం ఆదిపర్వం ప్రథమాశ్వాసం అవతారికలో నన్నయ్య రాసిన పద్యం. రాజరాజ నరేంద్రుడు నన్నయ్యను పిలిచి తనకు ఈ అయిదూ ఇష్టమని చెప్పాడు.*

*ఆ అయిదూ ఏమిటంటే*

*1. బ్రాహ్మణ కులానికి తర్పణలివ్వడం 2. భారతం వినడం 3. శివపూజ చెయ్యడం*
*4. నిత్యదానం 5. సాధుసాంగత్యం*

*కానీ తనకి ఏ అయిదూ అంటే ఇష్టమో శ్రీశ్రీ వేరే చెప్పనే చెప్పాడు.*

# రెండు

ఎప్పుడు పుట్టానేను?

ఎక్కడ? విశాఖపట్టణంలో, 1910లో. నా పుట్టిన రోజు గురించి స్పష్టమైన దాఖలాలు లేవు. మిత్రులు కె.వి.రమణారెడ్డి, చలసాని ప్రసాద్‌లు చాలా ప్రయత్నించారు గాని ఆ తేదీ దొరకలేదు. 1910 ఏప్రిల్ నెలలో అనుకుంటాను, మా నాన్నగారు చెబుతుండే దాన్నిబట్టి. ఆయనే నా స్కూలు ఫైనలు చిఠ్ఠాలో 2-1-10 అని వేయించారు, 1925మార్చి నాటికి నేను 15 ఏళ్ళ వాణ్ణి కావడం కోసం.

1910 నుంచి 30 దాకా నేను అఖండైశ్వర్యం అనుభవించాను, 1930 నుంచి 50 దాకా భయంకర దారిద్ర్యం పీడించింది. (ఇందలి మొదటి దశాబ్దంలోనే నా మహాప్రస్థానం గీతాలు చాలా మట్టుకు రాయడం జరిగింది) 1950 నుంచి మళ్ళీ నా జీవితం మారింది. 70లో నా షష్టి పూర్తి జరిగింది. అంతటితో ఒక జీవితం ముగిసిందంటూ ఇప్పుడు నా కొత్త జీవితంలో ఇది అయిదో ఏడని అందరి దగ్గరా నేను చమత్కరిస్తూ ఉంటాను. రెండో అయిదో ఏడు కాబట్టి మళ్ళీ అక్షరాభ్యాసం ప్రారంభించాను.

మా నాన్నగారి నూర్రూపాయల జీతంతో నా చిన్నప్పుడు అఖండైశ్వర్యం ఎలా అనుభవించానని ఎవరికైనా అనుమానం కలగవచ్చును. నేను పుట్టక ముందో, పుట్టిన కొత్త రోజుల్లోనో తిప్పర్తి వారి వీధిలో మా యింటి పునాదులు తవ్వుతున్నప్పుడు (ఇందులో మా అమ్మ కూడా స్వయంగా పాల్గొన్నదట. మట్టీ, ఇటుకలూ తట్టల్తో ఎత్తిందట) బిందెలతో బంగారం దొరికిందట. బహూశా ఇది పుకారు కాదనీ, నిజమే అనీ అనుకుంటాను. ఎందువల్ల నంటే మా గుడ్డి మామ్మకి మెడనిండా బంగారం ఉండేది. "మామ్మా! అంత బంగారమూ నీకేనా?" అని నేనడగడం నాకు బాగా జ్ఞాపకం ఉంది. ఆ మర్నాడే నా ఒంటినిండా ఆభరణాలు! అదీ నాకు జ్ఞాపకమే. చేతికి మురుగులూ, వంకీలు, కాళ్ళకి మువ్వలు, మెడ నిండా మొలనిండా నగలు.

నేను ఏణ్ణర్థం శిశువుగా ఉన్నప్పుడు మా అమ్మ చచ్చిపోయింది. మద్రాసులో వైద్యానికి తీసుకు వచ్చినప్పుడు ఏదో ఇంట్లో కొళాయి నీళ్ళతో ఆడడం నాకు జ్ఞాపకం. తర్వాత ఆవిడ చచ్చిపోయింది. అప్పటినుంచీ నాకు తల్లీ,తండ్రీ మా నాన్నగారే. ఏడిస్తే ఎక్కడ నేను అమ్మా అని ఏడుస్తానో అని నా నోటంట ఆ మాట రాకుండా నన్ను మా నాన్న పెంచాడని మా వాళ్ళు చెప్పుకుంటారు.

నాకు అటు అక్కలూ, అన్నలూ లేరు. ఇటు తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ లేరు. ఒక విధమైన ఒంటరితనంలోనే నా బాల్యమంతా గడిచింది. నిజమే, నేను కొండ మీది కోతిని తెమ్మని అడిగితే మా నాన్న తెప్పించేవాడు. కాని నేను మాతృప్రేమకీ, సోదరప్రేమకీ, సోదరీ ప్రేమకీ దూరంగా బతికేను. అందువల్లనే ప్రేమంటే ఒక అపనమ్మకం నాలో చిన్నప్పటి నుంచీ వర్థిల్లుతూ వచ్చింది.

నా అయిదో ఏట ఉపనయనమూ, అక్షరాభ్యాసమూ జరిగేయి. వీటిలో ఏది ముందు జరిగిందో జ్ఞాపకం లేదు. ఉపనయనం తిరుపతి కొండ మీద జరిగింది. అప్పటికే మా నాన్న గారు ద్వితీయ వివాహం చేసుకున్నారు. నా సవతి తల్లి సుభద్రమ్మ ఒక తాసిల్దారు గారి అమ్మాయి. (నా మొట్టమొదటి ఖండకావ్య సంపుటి "ప్రభవ" ఈవిడకే అంకితం) సవతి తల్లిని రాక్షసిగా అందరూ ఎందుకు చిత్రిస్తారో నా కర్థం కాదు. మా సుభద్రమ్మ నా పాలిటి దేవత.

మా తిరుపతి ప్రయాణం నాటికి ఆవిడ వయస్సు పదిహేనో, పదహారో! మరోపావుగంటలో గూడూరు చేరుతామనగా నేను కక్కసుకి వెళ్ళవలసి వచ్చింది. మా సుభద్రమ్మ వెండి మరచెంబుతో నీళ్ళు పట్టుకొచ్చింది. వెండి గ్లాసుతో ముడ్డి కడుగుతుండగా ఆ గ్లాసు జారిపోయింది. ఏదో ఒక ఖరీదయిన వస్తువు పోయినట్లు మా కెవ్వరికీ అనిపించలేదు. ఆ విషయం అప్పటికప్పుడే మరిచిపోయాం! ఇప్పుడు మాత్రం ఈ సంఘటన నిన్నగాక మొన్న జరిగినట్టు జ్ఞాపకం వచ్చి ఇది రాస్తున్నాను.

అంతకు ముందు నా మూడో (లేక నాలుగో) పుట్టిన రోజున తలంటి నీళ్ళు పోయించుకొని మా తాతగారి ఇంటి తలుపుకొడుతుండగా నా ఎడమచేతి చిటికెన వ్రేలిని తేలుకుట్టింది. (నాది చిన్నప్పటి నుంచి ఎడమచెయ్యి వాటం. అక్షరాలు కూడా ఎడం చేత్తో రాస్తూ ఉంటే మా నాన్నగారు మాన్పించారు) తేలు కుట్టగానే అమ్మా అని అరిచానేమో జ్ఞాపకం లేదు. కాని నన్నెత్తుకున్న మా బంట్రోతు అప్పలస్వామి గభాలని నా చిటికెన వేలు నోట్లో పెట్టుకుని విషమంతా పీల్చేసి ఉమ్మేశాడు. నాకు తేలుకుట్టినట్టే లేదు.

*ప్రజాతంత్ర 20–4–1975*

## మూడు

ఎంత ద్వ్యర్థం, సృష్టి..

"సృష్టి ఒక గొప్ప శ్లేషకావ్యం" అన్నాడు.

సముద్రతీరాన కెరటాలతో కాళ్ళు తడియనిస్తూ నడుస్తున్నారు వాళ్ళిద్దరూ. ఒక బ్రాహ్మణాధముడు; ఇంకొకడు శూద్రోత్తముడూ. ఇద్దరిలో ఎవడో ఒకడు ప్రసంగవశాత్తూ అన్న పై వాక్యం నాకు జ్ఞాపకం వచ్చి ఇక్కడ రికార్డు చేశాను.

ఇద్దరిలో ఎవరిదో ఈ అమూల్య ప్రకటన! అసలా ఇద్దరిలో ఎవడు బ్రాహ్మణుడో, ఎవడు శూద్రుడో? గుణిత్వమే అనుమానాస్పదమైపోయిన ఈ సందర్భములో గుణాలా నిలుస్తాయి? వారిలో ఎవడు ఉత్తముడో,ఎవడు అధముడో? ఇంతకీ ఆ యిద్దరిలో ఒకడామాట అన్నాడో లేక నేనే అని వాళ్ళన్నారనుకున్నానో? కాకపోతే నేనే సముద్ర తీరాన కెరటాలతోకాళ్ళు తడుపుకుంటూ నడుస్తున్నపుడు నాకు కనబడ్డ నీడ నాకన్నా ముందుగా నడుస్తూ ఈ కాస్తమాట కాలు జారిందో?

నేను చేసేననుకుంటున్నాను ఈ ప్రకటనను ఉపసంహరించుకోవడానికి కూడా నాకు హక్కు లేకుండా చేస్తూన్న దుర్బలమైన భాషని పట్టుకొని సృష్టి రహస్యాపరాధ పరిశోధక నవలారచనకి ఉపక్రమించడం వల్ల ఎంత అనర్థం!

వాస్తవత్వంలో ఉన్న అనంతత్వాన్ని అన్వేషించడానికి ముందు ఒక క్షణం కళ్ళు మూసుకోవడం మంచిది. ఎదురుగా మనకి కనిపించే వస్తువు ఒకటే ఉండగా, కళ్ళుమూసుకున్న ప్పుడు మన మనస్సులో నిద్రించే అదే వస్తువు శబ్దరూపంలో సాక్షాత్కరిస్తుంది. శబ్దరూపమయిన కాలాన్ని అక్షరాలలోకి అనువదించి స్థలంలో బంధిస్తున్నాము. అయితే కాలానికి వెలుపల స్థలంగాని స్థలానికి వెలుపల కాలం కాని లేవు.

వాస్తవికత ఒక ప్రతీక, చిహ్నం. వస్తువుల వాస్తవికత ఒక చిహ్నమయితే ఆ చిహ్నానికి చిహ్నం భాష. అందుచేత భాష విధిగా రెండర్థాలను మోసుకు తిరుగుతూ ఉంటుంది. రెండు కళ్ళలోంచి మనస్సులోకి వెళ్ళేది ఒకే వస్తువయినప్పటికీ అది అనుక్షణం రెండర్థాలతో బైటికి వచ్చేస్తూ ఉంటుంది. ఇప్పుడు తెలిసిందా ఎందుకంటున్నానో ప్రతిదానికీ రెండర్థా లుంటాయని?

(రెండే అని తాత్కాలికంగా అంటున్న మాట. అనేకం అనిత్వరలోనే ఋజువు చేస్తాను) మొదటి అర్థం స్వయంగా దానికున్నది. రెండవది సరిగ్గా దానికి వ్యతిరేకమయిన అర్థం. ఔను అనే మాటకి ఔను అనే మొదటి అర్థంతో బాటు కాదు అనే రెండో అర్థం కూడా ఉంది. ఈ యోగపద్యం, ద్వైధీభావం సృష్టి లక్షణం. అది యెట్లన్నన్.

అస్తి ఎప్పుడూ నాస్తికి నేస్తం. ఏటిది అవినాభావ సంబంధం. ద్వంద్వాలు అంటారే అవి ఒక మాటకే మనం చెప్పకునే రెండర్థాలు.

ఎప్పుడయితే మనం ఎంతో చిత్తశుద్ధితో నిజమే చెప్పాలని నిష్ఠురమైన సంకల్పంతో ప్రసంగిస్తామో అప్పుడే మన ప్రాణస్నేహితుడు మనం చెబుతున్నదంతా అబద్ధమే అని ఆగ్రహిస్తాడు. నవీన ప్రపంచాన్ని విస్పష్ట రూపంలో చూస్తున్నానని కవి అంటే ఇది పురా ప్రపంచమే అని నిర్ధారణగా చెబుతున్న వాళ్ళు కూడా ఉన్నారు.

ఇంతెందుకూ? ''వస్తాను'' అని అంటూ వెళ్ళిపోతాము! కళ్ళు లేని వాడితో కూడా ''చూశారూ'' అని అంటాము.

నిజం చెప్పడం వల్ల లాభం లేదంటే అబద్ధం చెప్పడం వల్ల నష్టం వుందని అర్థం కాదు. నిజానికి అబద్ధం, లాభానికి నష్టం, చీకటికి వెలుతురూ, చావుకి బ్రతుకూ కేవలం వ్యతిరేకార్థకాలు కావు. ఈ ద్వంద్వాలకి మధ్య అనేకమయిన అర్థభేదాలతో అనేక భావాలుంటాయి. ఉదాహరణ: చీకటి, చీకటి కాని దానికి వ్యతిరేకం. చీకటి కానిది వెలుతురు కాదు. మరేదయినా కావచ్చును. అలా కాదగ్గవి అనేకం. అలాగే వెలుతురు, వెలుతురు కాని దానికి విరుద్ధం. కాని అది చీకటి కాదు. ఆ కానివి ఇంకో అనంత సంఖ్య. ఎటొచ్చీ మొదటి అనంతంలోనే రెండో అనంతం గర్భితమయి ఉంటుంది. అందుకే అన్నాను ఎంత ద్వ్యర్థం సృష్టి! అని. అసలు ఇలా రెండు అనంతాలు లేవు. ఇటు నుంచి బయలుదేరినవీ అటు నుంచి

వస్తున్నవీ ఎక్కడో కలిసిపోతాయి. ఏకం నుంచి బయలుదేరి అనంతం దాకా వెళ్ళడంలోనే అనంతం నుంచి బయలుదేరి ఏకం దాకా రావడం ఉంది. మనం జీవిస్తున్నంతసేపు అనుమానిస్తూనే ఉంటాము ఇది మృత్యువు కాబోలునని. అనుమానమే తప్ప నిశ్చయంగా దేని సంగతీ చెప్పలేమని మాత్రం నిశ్చయంగా చెప్పగలం. అన్నట్టు అదీ అనుమానాస్పదమే.

ఇదేమిటి! ఒకటి రాద్దామనుకుని యింకొకటి రాసేస్తున్నాను!

పోనీ, యిందాకా అన్నదే మళ్ళీ అంటాను. సృష్టి ఒక గొప్ప శ్లేషకావ్యం. ఎంత అసందర్భమైన వాక్యం? ఇది నేనన్నానని పైగా చెప్పుకోవడం ఒకటా? ఇందాకా యిదే నాకు గంభీరమయిన సత్యంలాగోచరించింది. ఇంతట్లోకే ఇంత పరిహాసాస్పదమైన అబద్ధమై పోయింది. అందుకే నిజం అబద్ధమనీ, చీకటి వెలుతురనీ, ప్లస్ మైనస్ అనీ అనేస్తున్నాను. అందుకే నా రచనలకీ, మహాభారతానికీ,వావిళ్ళ వారి కేట్లాగుకీ ఒకటే విలువ. నా జీవిత చరిత్ర రాసుకుంటే సృష్టి చరిత్ర రాసినట్టే. ఏ ఒక్క క్షణాన్ని వర్ణించినా అనంత కాలాన్ని వర్ణించినట్టే. నా జీవితం ఒక క్షణం. ఇదే అనంతం. ఇది నేను రాయకముందే పూర్తి అయింది. రాసినప్పటికీ రాయనట్లే అవుతుంది. రాయకపోయినా రాసినట్టే అవుతుంది.

1944లో 34 ఏళ్ళ వయస్సు కలిగి ఉండడానికి వీలుగా నేను 1910 లో జన్మించడం సంభవించినది. 1910కి పూర్వం గాని తర్వాత గానీ పుట్టి వుంటే ఈ 44లో నా వయస్సు యింకా ఎక్కువగాని తక్కువగానీ అయివుండేది. ఈ రాస్తున్నదే యింకో యేడు రాస్తే నా వయస్సు కూడా ఇంకో సంఖ్యగా మారిపోతుంది. తూర్పున సూర్యుడు ఉదయిస్తూన్నసమయానికే నేనుభూమి మీద పడ్డానని మా నాన్న అంటూ వుండడం నాకిప్పటికీ జ్ఞాపకం. గురజాడ కవి ముత్యాలసరాల రచన, బరంపురంలో నానాజాతిభోజనం, తోకచుక్క కనబడడం మొదలయిన సంఘటనలకీ నేను-జన్మించిన సంవత్సరానికి కాకతాళీయమైన సంబంధం తప్ప నేను గర్వించదగ్గ మరే కారణమూ లేదు. అంతర్జాతీయ వార్తాపత్రికలు తిరగేస్తే 1910లో నేను జన్మించడాన్ని మించిన ప్రాముఖ్యం గల సంఘటనలు అనేకం కనబడతాయి. నేను పుట్టినప్పుడు గాలి కోసమని గుక్కతిప్పకుండా ఏడ్చానట. ఇప్పటికీ నేను ఆహారపానీయాలయినా లేకుండా ఈడ్చుకురాగలను కాని గాలి లేకపోతే క్షణమైనాగడవదు. నాకే అన్న మాటేమిటి? ఎవరికైనా అంతే. 2-1-1910 అని నా స్కూలుఫైనలు పుస్తకంలో ఉన్న దాఖలా తప్ప నా పుట్టుకతేదీ విషయమై యింకో సాక్ష్యం ఏదీ లేదు. ఈ పుస్తకంలో నా వేలిముద్రలున్నాయి. ఎడంచేతి వేళ్ళవి. సర్కారు వారి మిలిటరీ రికార్డులలో కూడా ఇవివున్నాయని చెప్పడానికి సంతసిస్తున్నాను. నా జాతకం మా బంధువుల్లో యెవరి దగ్గరయినా వుందేమో తెలియదు. నేను ఏ యింట్లో ఏ గదిలో పుట్టానో ఆ యిల్లు ఆ గదితో సహా యిప్పటికీ విశాఖపట్టణంలో కులాసాగా వుంది.

నా జననం గురించి వ్రాస్తున్నాను కాబట్టి ఇదే నా నవలకి ప్రారంభమని అనుకోవద్దని శాసిస్తున్నాను. నా మరణం తేదీకూడా కావలిస్తే అంచనావేసి చెబుతాను. అది 1960

అనుకోవచ్చును తాత్కాలికంగా. ఏ గ్రహగతులనూ పరిశోధించి నేనీమాట వ్రాయలేదు. ఈ భూామిమీద ఏభైయేళ్ళకంటే ఎక్కువ బతకడం *bad taste* అని నా ఉద్దేశం. గురజాడ అప్పారావు (1865-1915) ఏభై ఏళ్ళే జీవించాడు. ఈ వాదం నచ్చనివాళ్ళని సంతోషపెట్టడానికని ఇక్కడికిది నిలిపివేస్తున్నాను.

కాని నా రచన నిలవదు అని తెలిసినా వ్రాయడం మానలేను. దీనికి ప్రారంభం ఎలాగయితే లేదో అలాగే అంతంకూడా లేదు. అంచేత ఇది నా యావజ్జీవితం సాగవలసిందే. ఇదివరకే ఇది ప్రారంభమయింది. అంతకుముందే అంతమయింది. అందలి శకలాలని అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకొనే ప్రయత్నమే ఈ రచన. దీని ఆకారం క్షణానిది. శూన్యానిది. గోళానిది. వెలుపలికి పరిధులుగా విస్తరించిపోతున్నట్లే లోపలి కేంద్రములో సూక్ష్మాతిసూక్ష్మ రూపాల లోనికి కుంచించుకుపోతుంది. ఈ నవలలో గర్భితమై ఎన్నో నవలలున్నాయి. ఇందులోంచి బైటికి పోయేవి ఎన్నో ఉన్నాయి. ఇందులో ప్రతీఘట్టం ఒక నవల. ప్రతీప్రకరణం ఒక నవల. ప్రతీ వాక్యం ఒక నవల. ప్రతీపదం ఒక నవల. ప్రతీ అక్షరక్షర క్షణక్షణం ఒక నవల.

ప్రతిపదం ఒక పథం, ప్రతి పదం ఒక శపథం.

నాకు అడకువలేదు. ఉంటే ఇది వ్రాయలేనని ఒప్పుకుందును. ఇంతబరువు నేను మొయ్యలేనని మొత్తుకుందును. అసాధ్యమని తెలియదని తెలియకపోతే వ్రాయకపోదును. ఇంకెవరయినా దీన్ని సాధించడానికి నా ఆటంకం లేదు. ఈ స్వాతంత్ర్యాన్ని నేను సర్వస్వామ్య సంకలితం చేసుకోలేదు.

అనంతమైన ఈ సృష్టిలో ఏ అర్థమూలేని జీవితం నా దొక్కటే కనబడుతోంది. అందుకే దీనికి రెండర్థాలు చెప్పుకుంటున్నాను. పద్యం రాయడానికీ రాయకపోవడానికీ, సిగరెట్టు కాల్చకపోవడానికీ కాల్చడానికీ మధ్యవున్న దూరాన్ని ఎవరు కొలవగలరు?

నాకు నమ్మకం మీద నమ్మకం పోయింది.

ప్లస్‌కీ మైనస్‌కీ అభేదాధ్యవసాయాన్ని చెప్పుకుంటున్న నేను కొన్ని అభిప్రాయాలను ఆదరించి కొన్నిటిని నిరాకరించలేను. అయితే భౌతికమైన ఆవరణలవల్ల, అసమగ్రమైన విద్యవల్ల, అసమస్తమైన అనుభవంవల్ల కొన్ని అభిప్రాయాల మీద అభిమానం కలుగుతుంది. అందుకే ''ఇంక్విలాబ్ జిందాబాద్'' అన్నప్పుడు నాకు కలిగే ఉత్సాహం ''గాడ్ సేవ్ ది కింగ్'' అన్నప్పుడు కలగదు.

ఎంతసేపూ నా సంగతే చెప్పుకుంటున్నందుకు నాకు చాలా కష్టం కలుగుతోంది. కాని నేనేం చెయ్యను? ఇంకొకలాగ వ్రాయడానికి వీలులేకుండా చేస్తోంది ఈ ఇనుపశాసనం.

దీన్ని ధిక్కారపు ఫిరంగులతో ఎదుర్కోవాలి. ఏ చండశాసనుడికీ లేని శక్తి భాషకి ఉంది. సంఘానికి పోలీసులు ఎలాంటివారో భాషకి వ్యాకరణం అలాంటిది. ఆస్తి ఉన్నవాళ్ళ నేరాలను పోలీసులు కామాపుచేస్తారు. పండితుల దోషాలను ప్రౌఢప్రయోగాలంటుంది వ్యాకరణం. భాషలో కూడా రాజులూ, బానిసలూ ఉన్నారు. ఈనాడు సంఘంలో రావలసిన

విప్లవం ముందుగా భాషలో రావాలి. భాషను మార్చడానికి భావాలను మార్చాలి. జీవితపు పోకడలనే మార్చాలి. వీటిలో ఏదిముందు, ఏదివెనుక అని నేనాలోచించను. భావంవల్ల భాషవల్ల సంఘంవల్ల భావం మారుతుందో, భాషవల్ల సంఘంవల్ల భావంవల్ల భాష మారుతుందో, సంఘంవల్ల భావంవల్ల భాషవల్ల సంఘం మారుతుందో అది అనవసరం. నాకు కావలసింది మార్పు.

*ఆనందవాణి జనవరి 1945*
*పునర్ముద్రణ: శ్రీ శ్రీ సాహిత్యం రెండు వచన విభాగం 1970*
*: ప్రజాతంత్ర 20–4–1975*

*"..... షేక్స్పియర్ గాని, కాళిదాసుగాని సహజ కవచకుండలాలతో జన్మించలేదు. వారికి పూర్వం, వారిచుట్టూ అపారమైన విజ్ఞానం ఉంది. ఆ విజ్ఞానానికి అందమైన ఫలంగా వారు రూపుదాల్చారు....."*

*శ్రీ శ్రీ, 1949 అక్టోబరు*

# మరో ప్రారంభం

1910-1925

## ఒకటి

అనంతం అనాదికూడా! అందుచేత దీన్ని ఎక్కడ ప్రారంభించాలో, ఎలాగ ప్రారంభించాలో తెలియడంలేదు.

అబద్ధం! ఆరంభంలోనే అబద్ధం! 1910తో ప్రారంభించాలని ముందే అనుకోలేదూ?

లేదు. ఇది ప్రారంభంకాదు. నిజంగానే నాకు తెలియకుండా ఉంది ఈ అనంతాన్ని ఎలా, ఎక్కడ ప్రారంభించాలో!

కృత్యాద్యవస్థ, ఆరంభం పెద్ద అవస్థ. నా జీవితం గురించి నిజం చెప్పాలని తహతహ! చెప్పలేనేమోనని అనుమానం. చెప్పగలనని ధైర్యం.

ఒకప్పుడారంభించాను. ఆపేశాను. మళ్ళీ ఆరంభించాను. మళ్ళీ మానేశాను.

ఇది మరో ప్రారంభం!

ఇదివరలో ప్రారంభించినప్పుడు "ఎంత ద్వ్యర్థం సృష్టి!" అన్నాను ఇప్పుడూ అదే అంటున్నాను. ఈ సృష్టి వ్యర్థంకాదు. ద్వ్యర్థం. దీనికి రెండర్థాలున్నాయి.

ఆమాటకొస్తే అనేకార్థాలున్నాయి. అదే అనంతం. ఇదే నా జీవితం. సృష్టిలోని యాగపద్యాన్ని నా జీవితంలో సమన్వయించుకోవడానికే ఈ ప్రయత్నం.

ఏకకాలంలోనే నా జీవితం సత్యమూ, అసత్యమూ కూడా. అదెలాగవుతుందా?

సోమదత్తుడు యజ్ఞదత్తుడు కానూవచ్చును; కాకపోనూవచ్చు. ఒకేసారి అవడం, కాకపోవడం ఎలాగ? ఏదో ఒకటే నిజం. రెండూ కావడం అబద్ధం అనే వాదాన్ని తిరస్కరిస్తూ రెండూ కావచ్చునన్నాడు మన ప్రాచీన తార్కికులలో ఒక ప్రముఖుడు.

ఈనాటి *Existentialism* కు మూలపురుషుడైన *Soren Kierkegaard* ప్రకటించిన *Either or* ఫిలాసఫీకన్నా ఇది ప్రాచీనమైనది.

అందుకే ఇది ప్రారంభమా అంటే కాదంటాను. అంటూనే ఔననికూడా అంటాను.

మార్క్సిస్టు శ్రీశ్రీయేనా ఇది రాస్తుంట? ఔను. ప్రపంచాన్ని మార్చగల శక్తి ఒక్క మార్క్సిజానికి మాత్రమే ఉందని ఇప్పటికీ నేను అచంచలంగా విశ్వసిస్తున్నాను. అయినా నేను *Sartre*[1] (సర్త్)ని కూడా అధ్యయనం చేశాను. సమవయస్కులం కాకపోయినా, సమకాలీనులమైన మా ఇద్దరి జీవితాలకి చాలాపోలికలున్నాయి. అయితే సర్త్ నోబెల్ బహుమతిని సహా నిరాకరించిన మహనీయుడు. నేనంతవాణ్ని కాను.

1 *జీన్‌పాల్ సార్త్రే (1905—1980) ప్రపంచప్రఖ్యాత ఫ్రెంచిరచయిత అస్తిత్వవాద తత్వవేత్త.*

మళ్ళీ మొదటికొస్తున్నాను. ఇది నా అనంతం. ఆటోబయోగ్రఫీ. (అంటే మోటారుకారు జీవితచిత్రణకాదు) నా స్వీయచరిత్ర. దీన్ని నేను ఆత్మ చరిత్రాత్మక "నవల"గా అభివర్ణించడానికో ముఖ్యకారణం ఉంది.

నవల అనగానే అందులో ఎన్నో అభూతకల్పనలూ, అతిశయోక్తులూ, ఆఖరికి పచ్చి అబద్ధాలూ ఉండవచ్చు. ఎందుకున్నాయని అడిగే హక్కు ఎవరికీలేదు. పైగా ఎంత చక్కని అబద్ధాలుంటే అదంత గొప్పనవలని కొందరి అభిప్రాయం. (అలాంటివాటి కుదాహరణలు విశ్వనాధవారి, లతామ్మవారి నవలలు) నా నవలలో నాజీవిత వాస్తవికతను యథాతథంగా చిత్రించాలని, మామూలు మార్కెట్ సరుకులో పుష్కలంగా లభించే అదనపు ఆకర్షణలేవీ లేకుండేటట్టు చూడాలనీ నా తాపత్రయం. తిట్టదలచుకున్న వాళ్ళనందరినీ ధారాళంగా తిడతాను. అయినా వాళ్ళు చట్టబద్ధంగా నామీద ఏ విధమైన చర్యా తీసుకోవడానికి వీల్లేని సదుపాయం నవలా రచనకుంది. అందుకే నా "అనంతం" ఆత్మచరిత్రాత్మ చరిత్రాత్మక నవల!

మళ్లీ మొదటికొస్తున్నాను. నా పుట్టిన సంవత్సరం (1910)తో ఈ కథనం ప్రారంభించాలనుకున్నాను గాని అలా చెయ్యలేదు. నా పుట్టినరోజుతోనే ప్రారంభించాలని ఉంది. కాని ఆ తేదీయేదో ఎవరికీ తెలియదు. సంవత్సరం మాత్రం 1910 అని తెలుసుకాని, జననంతోకాదు మరణంతో నా ఆత్మకథ ప్రారంభం కావాలి. అలాగే కానిస్తా.

ఈ క్షణంలోనో, మరుక్షణంలోనో మరో శతాబ్దంలోనో నేను మరణించాను. ఎందరు మరణించలేదు? అందరిలో నేనొకణ్ని. ఎంత మరణం గురించి రాసినా నా ధ్యాసంతా జీవితం మీదనే! బతకడం అంటే ఏమిటి? బతకడం అనేది ఎందుకు? ఈ రెండు ప్రశ్నలకూ జవాబులు వెదుక్కోవడమే ఈ రచన.

జీవితం ఒక జిగ్సాపజిల్. "అనంతం" ఒక ప్రహేళిక. ఎంత చిక్కుముడినైనా విప్పడానికి వీలయిన సూక్ష్మసూత్రాలు ఆ గ్రంథంలోనే గర్భితమై ఉంటాయి.

ప్రశ్నని లెస్సగా అధ్యయనం చేస్తే ప్రత్యుత్తరం అందులోంచే బయటికి వస్తుంది.

ఓ చెరిగిపోయిన అక్షరాల్లారా! కరిగిపోయిన క్షణాల్లారా! ప్రవహించండి నా కలంలో సిరాలాగా!

సరే. మరణించాను. నాకు 1990 లలో చచ్చిపోవాలని ఉంది. బహుశా విమానప్రమాదంలో లేదా జలగండం వల్ల? అదీ ఇదీ కాకపోతే నేలమీదనే కాలధర్మం.

నా శవం చుట్టూ చాలామంది చేరి ఏడుస్తున్నారు. "ఎందుకేడుస్తారు? ఇప్పుడేమయిందని" అని నేనెంతో ధారాపాతంగా అరుస్తున్నా ఎవరికీ నా మాటలు వినబడవు. "అనంతర కార్యక్రమం గురించి ఆలోచించమన్నారెవరో! దహన సంస్కారం ఎజెండాలోకి వచ్చింది. అదే వీల్లేదన్నా నేను. మతానికి సంబంధించిన ఏవిధమైన కర్మకాండకి నా (సజీవ లేదా నిర్జీవ) కళేబరాన్ని అంకితం చెయ్యడం అనే పనికి నేను సుతరామూ అంగీకరించను. *After all it is my corpse, is'nt it? or, is it?*

చుట్టూ మూగినవాళ్లలో కొంతమందికి నేనొకసారి రాసిన మరణశాసనం జ్ఞాపకం వచ్చింది. అందులో నేను, నేను చచ్చిపోయాక జరగవలసిన మొట్టమొదటి పని నా శవాన్ని విశాఖపట్టణంలోని కింగ్‌జార్జి ఆసుపత్రికి అప్పగించడం అని రాశాను. ఆ తర్వాత జరగవలసిన పని అక్కడున్న మెడికల్ కాలేజీ విద్యార్థుల్లోని నిరీశ్వరవాదుల ఆధ్వర్యంకింద జరగాలని నా ఆకాంక్ష.

ఏడ్చి ఏడ్చి ఆగిపోయినవాళ్ళు ఆగిపోయినా, ఏడుస్తున్న వాళ్ళింకా ఏడుస్తూనే ఉన్నారు. ఏడవమనండి నాకు అభ్యంతరంలేదు.

పత్రికల వాళ్ళకి కావలసినంత కాపీ. ఏమిటేమిటో రాసేస్తున్నారు. రాసుకోమనండి నా అభ్యంతరంలేదు.

విరసం వాళ్ళు నన్నూరేగిస్తామన్నారు. నా అభ్యంతరంలేదు. నా శవం మీద ఎర్రజెండా కప్పడం మాత్రం మరిచిపోకండని మరీమరీ అభ్యర్థించాను.

నాకొడుకే వచ్చి తనచేతుల్తో నా తలకి కొరివి పెడతానన్నాడు. ఇది వాడికి పుట్టిన బుద్ధి కాదనుకుంటాను. ఎవరో చెప్పించిన ట్యూషన్. అయినా అదే వీల్లేదంటాన్నేను.

మతంతోనూ, మతం తాలూకు మూఢవిశ్వాసాలతోనూ ఆమరణాంతం పోరాడే నన్ను మళ్ళీ ఆ ఊబిలోని కెవరు దించదలచుకొన్నా నేనెంత మాత్రమూ అంగీకరించను.

ఎందుకోగాని దేవుడిమీద కూడా నమ్మకంలేని నాకు నేను చనిపోయేలోగానే మనదేశం లో సామ్యవాదం వచ్చేస్తుందనే విశ్వాసం కుదిరింది. అయినా సమాజస్వరూపమే మారిపోవచ్చు ను గాని మనుషుల్లోని మతం జిడ్డు ఒకపట్టాన వదలదు. సామ్యవాదుల్లో కూడా దైవభక్తి, దైవభీతి ఉండవచ్చు. ఈ రెండూ సమూలంగా నాశనం కావాలి. భక్తులకి, పిరికిపందలకి ఈ ప్రపంచంలో స్థలం ఉండకూడదు.

ఒక కొత్తరకం విశ్వాసం- మనిషిమీద, మనిషి మనీషమీద- అదీ కావాలి. జీవితాంతం నేనీ విశ్వాసాన్నే ప్రసారం చేస్తాను. నేను కీర్తిశేషుణ్ణయినప్పుడు ఇదే నాకు మిగిలేకీర్తి.

అందరి జీవితాలూ మరణంతో అంతమైతే నా జీవితం మాత్రం మరణంతో ఎందుకు ప్రారంభం కావాలి? మళ్ళీ వెదుక్కుంటున్నాను నా ఆరంభాన్ని.

1910లో నేను పుట్టానంటే 1909లో ఎప్పుడో, ఏదోనెలలో, ఏదో రోజున ఏ క్షణంలోనో మా అమ్మ కడుపున నేను పడ్డానన్నమాట.

"నా జనని గర్భంలో
ఆకారం లేకుండా నిద్రిస్తున్న
నా అహంకారానికి
ఆకలి గొల్పించిన నాడో..."

కాలం గడియారాన్ని కొన్ని దశాబ్దాల దాకా వెనక్కి తిప్పేసి నా ఆరంభాలను జ్ఞాపకం చేసుకుంటున్నాను.

1909లో నేనింకా పుట్టలేదు. పుట్టడానికి ప్రయత్నిస్తున్నాను.

అది నా జనని గర్భంలో *amniotic fluid*[2] అక్కడ పరిభ్రమిస్తున్నాను.

అకస్మాత్తుగా విశాఖపట్టణం కనిపించింది. గట్టిగా కౌగిలించుకున్నాను.

"ఇదేమిటి? పట్టపగలు! నడివీధిలో!"

"అయితే పద. అలా సముద్రంలోకి పోదాం" అన్నాను.

ఇద్దరం సముద్రంలో ఈదుతున్నాం.

తీర్థపు రాళ్ళదగ్గర మునిగి, లాసన్స్ బే దగ్గర తేలాం.

"ఉత్తర దిక్కుకి వద్దు, దక్షిణంగా," యారాడకొండ దిగువ డాల్ఫిన్స్ ముక్కువద్దకు చేరుకున్నాం.

ఏమిటో కాలికి గుచ్చుకుంటోంది.

"సోల్జర్ పేట"

ఆ దగ్గరలోనే మా కాకాయమ్మగారిల్లు వుంది. ఆ ఇంట్లోనే నేను పుట్టబోతున్నాను. అది నా మాతామహుల ఇంటిపక్కనే ఉంది. కాకాయమ్మగారిది ఘరానా సెట్టి బలిజ కుటుంబం. మా వాళ్ళు నిప్పును సహా నీటితో కడిగి శుభ్రపరిచే శ్రోత్రియ బ్రాహ్మణులు. అలాంటి భేదాలేవీ నాకు అప్పుడూ లేవు. ఇప్పుడూ లేవు.

ఎన్నెన్నో జ్ఞాపకాలు వడగళ్ళ వానలా కురుస్తున్నాయి.

విశాఖపట్టణం ఒకనిద్ర. అందులో స్వప్నాలే నా జీవిత సంఘటనలు.

విశాఖపట్టణాన్ని కౌగిలించుకోవడం అంటే విశాఖ విశ్వాసాన్ని నా అక్కున చేర్చుకోవడమే అని నా భావన.

ఒథెల్లో డెస్టిమోనాను కౌగిలించుకుని "ఇలాగే మనం ఇద్దరం ఈ కౌగిటిలోనే చచ్చిపోతే ఎంత బాగుండునో!" అంటాడు.

"ఈ బాహుబంధంలో మనం ఇద్దరం ఇలాగే బతికుంటే ఎంతబాగుండును" అని అంటాన్నేను ఈ విశాలవిశ్వంతో.

ఈ విశాల విశ్వంలోని విశాఖపట్టణంలో నేను 1910 జనవరి రెండవతేదీని పుట్టానంటుంది నా స్కూల్‌ఫైనల్ సర్టిఫికెట్ పుస్తకం. కాని అది నిజంకాదు, మా నాన్నగారి కల్పన.

నేను స్కూల్‌ఫైనల్‌కి వచ్చేసరికి నాకు 15 ఏళ్ళు అని బుజువుచెయ్యడానికి ముందుచూపుతో మా నాన్నగారు చేసిన చిన్న సవరణ.

నేను శ్రీరామనవమి రోజుల్లో పుట్టానని మా అమ్మమ్మ అంటూవుండేది.

చైత్రశుద్ధ షష్టినాడు సూర్యుడూ నేనూ ఒకేసారి ఉదయించామని మా పెద్దబావ (భాగవతుల నరసింగరావు ఆరుద్ర తండ్రి) తన గణితానికి తిరుగులేదనేటట్టు చెప్పేవాడు.

2 ***AMNIOTIC FLUID*** అంటే ఉమ్మనీరు. తల్లిగర్భంలో శిశువు ఈ నీటిలో తేలుతూ ఉంటాడు.

వాడో చిన్నరకం సిద్ధాంతి. నా జాతకచక్రం కూడా గుణించాడు. ఒక చిన్నపుస్తకంలో ఆ చక్రంతోబాటు జరిగిపోయినవీ, జరగబోయేవీ ఎన్నో సంఘటనలు రాసిచ్చాడు జరిగిపోయినవన్నీ సరిపోయాయి.(అన్నీ వాడికి తెలిసినవే కాబట్టి?) జరుగుతాయన్న వాటిలో మాత్రం ఏదీ జరగలేదు.

ఆ పుస్తకం ఎక్కడో పోయింది!

*స్వాతి జూలై 1979*

## రెండు

నా ఏణ్ణర్థం వయస్సప్పుడు మా అమ్మ ఏయే గ్రహాలు ఏయే గదుల్లో ఉండడంవల్ల చచ్చిపోయిందో మా పెదబావ స్పష్టంగా ఆ పుస్తకంలో రాశాడు.

నా పదిహేనో ఏట నా పెళ్ళి ఎలా తప్పిపోయిందో, అనుకున్న పెళ్ళికూతురితోనే మళ్ళీ మూడురోజులు తిరక్కుండా మూడుముళ్ళూ ఎలా, ఎందుకు పడ్డాయో తిథీ, వార, నక్షత్రాలతో సహా రాసిపెట్టాడు.

నా 62 రోజుల టైఫాయిడు[1] జ్వరం గురించి రాశాడు. ప్రయాణాలు, శుభాశుభ కార్యాలు, ఒకటేమిటి ఎన్నో రాశాడు. అన్నీ అప్పటికయిపోయినవే! అయినా కన్యాశుల్కంలో లుబ్ధావధాన్లులాగ "చిన్నప్పటినుంచి నా జాతకం గట్టి దాఖలా ఇస్తోంది" అని నేను నమ్మలేదు.

ఎందుకంటే "ఇకనీకు పిల్లలు పుట్టర"న్నాడు మా పెదబావ. నాకు నలుగురు పిల్లలు పుట్టారు.

రాష్ట్రంలో (బహుశా కేంద్రంలో) ఒక మంత్రిపదవి లభిస్తుందన్నారు. ఇంతవరకు లేదు. ఇకముందుకూడా రాదు (అని నా దృఢ విశ్వాసం).

నా ఆయుర్దాయం 90 ఏళ్ళన్నాడు. ఇది ఇంకావేచి చూడవలసిన విషయం. అందుచేత వాడు చెప్పినజోస్యం అబద్ధమని అప్పుడే కొట్టిపారెయ్యడానికి వీల్లేదు. ఒకప్పుడు 50 ఏళ్ళు బతికితే చాలనుకున్నాను (గురజాడ లాగా). ఇప్పుడు 80 ఏళ్ళు పైగా ఎన్నాళ్ళు బతికినా అదో బోనస్ అనుకుంటాను.

ఎనభై ఏళ్ళని ఎందుకంటున్నానంటే ఇరవయ్యో శతాబ్దం పుట్టిన పదేళ్ళకి నేను పుట్టాను (1910 లో). ఈ శతాబ్దం మరోపదేళ్ళకి పోతుందనగా (1990లో) నేను పోవాలను కుంటున్నాను. అనుకోవడాలు పనికిరావని నాకు తెలుసు. అయినా అనుకోవడం మానలేను.

ఇదేమిటి 1990 అంటున్నాను, ఇంకా నేను 1909లోనే ఈదుతుంటే!

1909 స్విన్‌బర్న్ చనిపోయిన సంవత్సరం. *Algernon Charles Swinburne (son of Admiral Charles Henry and Lady Jane Swinburne. Born on 5th April 1837 at 7-*

1. *శ్రీశ్రీ కి టైఫాయిడ్ జ్వరం 1930లో వచ్చింది.*

*Chestor st, Grosuenor place, London. Died on 10th April 1909, at the pines, putney Hall, London).*

మాతృగర్భ మహాసముద్రంలో ఈదులాడుతున్నప్పుడే నాలో స్విన్‌బర్న్ కవిత్వం ప్రసరిస్తూ, ప్రవహిస్తూ ఉండివుండాలి. స్విన్‌బర్న్‌కి సముద్రం అంటే ఎంతో ఇష్టం. నాకూ అంతే. జీవితానికి ప్రతీక సముద్రం. జీవిత నాటకంలో లేస్తూ, పడుతూ, పడుతూ, లేచే తెరల్లాంటివే సముద్రంలో తరంగాలు.

సముద్రం నా ఆవేశం నా ఆనందం! *Triumph of Time* (కాలవిజయం)లో ఒకచోట *Swinburne* ఇలా అన్నాడు.

*I will go back to the great sweet mother,*
*Mother and lover of men, the sea.*
*I will go down to her, I and none other*
*close with her, kiss her and mix her with me,*
*cling to her, strive with her, hold her fast:*
*O fair white mother, in days long past*
*Born without sister, born without brother,*
*set free my soul as thy soul is free.*

(దీన్ని *Swinburne* టాగూరు నుంచి దొంగిలించలేదు)

ఇక్కడ నా "విశాఖపట్టణం జ్ఞాపకాలు" కొన్ని.

విశాఖపట్టణం ఎప్పుడు పుట్టిందో నాకు తెలియదుగాని విశాఖపట్టణంలో 1910వ సంవత్సరంలో నేను జన్మించాను. అప్పటినుండి నేనూ, విశాఖపట్టణమూ కలిసే పెరుగుతూ వచ్చాము.

విశాఖపట్టణానికి హార్బరు[2] వచ్చినప్పుడు నాకు యౌవనం వచ్చింది. అందరూ ప్రేమగీతాలు రాసే ఆ ఋతువుల్లో నేను పారిశ్రామిక విప్లవాన్ని కౌగిలించాను.

ఆరోజుల్లోనే ఆంధ్రవిశ్వవిద్యాలయం, అబ్బూరి రామకృష్ణారావుగారూ విశాఖ విచ్చేశారు. అప్పుడు నా ఊహలకే రెక్కలు వచ్చాయి. గ్రంథగతమైన మహాకవిత్వాన్ని రక్తమేధోమాంస మజ్జాస్థిగతం చేసుకున్నాను.

మరిచిపోలేదు. నాకంటే ముందుగానే పిచ్చాసుపత్రి వెలిసింది. నా ఆవేశంలో ఆగ్రహం, అనుకంపా సరిసమానంగా తులతూగడానికి విశాఖపట్టణము వెర్రాసుపత్రే కారణం. దరిమిలాను ఫ్రాయిడ్‌ని చదివి అర్థం చేసుకోవడానికి అనుకూలమైన వాతావరణం అతఃపూర్వమే నా మనస్సులో కలిగించగలిగిందని పిచ్చాసుపత్రి అంటే నాకు కృతజ్ఞత.

2. విశాఖపట్టణం రేవులోకి 7–10–1933న మొట్టమొదటి ఓడ జలదుర్గ వచ్చింది.

విశాఖ శ్మశానం పేరు "తుమ్మెదలమెట్ట"[3]. (అక్కడ ఒక్కో స్థలానికొక్కో పురాణం ఉంది.) విశాఖ వాస్తవ్యులందరూ "తుమ్మెదలమెట్ట" కాపేరు ఎలా వచ్చిందో ఎరుగుదురు. అక్కడికి నేను మొదటిసారి మా తాతయ్య (మాతామహుడు) గారితో వెళ్ళాను. అతనక్కడే ఉండిపోయాడు. నేను స్నానంచేసి తిరిగి వచ్చేశాను.

యారాడకొండ మీద ఒంటరిగా నిలబడి ఒక్కొక్క రోజు ఒక్కొక్కరకపు విశాఖ పట్టణాన్ని చూశాను.

అసలు నాకు కనిపించే విశాఖపట్టణం అందరూ చూసేదికాదు. తీర్థపురాళ్ళ[4] కెదురుగుండా సముద్రంలో ఒక విశాఖపట్టణం ఉంది. అశోకుని కాలంలో కళింగరాజు దాన్ని కట్టించాడు. అప్పుడప్పుడు నా స్వప్నాలలో ఆ విశాఖపట్టణం కనబడుతూ ఉంటుంది.

నాకు బాగా జ్ఞాపకం. ఒకమారు ఇద్దరు స్నేహితులతో యూనివర్శిటీ లైబ్రరీక వెళ్ళాను. తిరిగిపోయేటప్పుడు మాతో తలా ఒక పుస్తకం ఇంటికి పట్టుకుపోదామనుకున్నాం. ఎవరిపుస్తకం వాళ్ళం ఎంచుకున్నాం.

ఇద్దరూ వాళ్ళవాళ్ళ పుస్తకాలను భద్రంగా దాచుకొని ధైర్యంగా బైటికి వచ్చేశారు. నేను మాత్రం దొంగిలించాలనుకున్న పుస్తకాన్ని టేబుల్ మీదనే వదిలేసి వచ్చేశాను.

ఆ పుస్తకం పేరు "*poems and Ballads*". నాకెంతో ఇష్టమైనది. రచయిత స్విన్‌బర్న్!

అందులో నేనెప్పుడూ మరిచిపోలేని ఖండకావ్యాలలో ఒకటి "కాలం గెలుపు". ఆ కావ్యంలో నన్నమితంగా ఆకర్షించిన గీతపాదాలు ఇవి.

*There lived a singer in France of old*
*By the tideless dolorous midland sea.*

3. తుమ్మెదల మెట్ట

పద్దెనిమిదో శతాబ్దంలో మరాఠీలు, పిండారులు, తురుష్కులు విశాఖపట్టణం పరిసరప్రాంతాలమీద దండెత్తి కొల్లగొట్టారు. ఇక్కడికి ఇంచుమించు 15 కిలోమీటర్ల దూరంలో ఉన్న సింహాచలం గుడిని పాడుచేశారు. ఆ గుడిలో దేవుడు విష్ణుమూర్తి. అతన్ని ఉద్దేశించి—

'వైరి హర రంహ సింహాద్రి నారసింహ' అనేమకుటంతో శ్రీ సింహాద్రి నారసింహ శతకం ఉంది. ఈ శతకం గోగులపాటి కూర్మనాథకవి (1720—1790) ఆశువుగా చెప్పాడని వినికిడి. శత్రుమూకలు విధ్వంసం చేస్తూంటే చూస్తూ ఊరుకున్నందుకు దేవుడిని ఈ కవి తిడతాడు. వాళ్ళని దునుమాడమని అడుగుతాడు. ఈ శతకం నిందాస్తుతిలో కొనసాగుతుంది.

అలా 60 పద్యాలు చెప్పేసరికి దేవుడికి రోషంవచ్చి ఉక్కుముక్కల తుమ్మెదలను దండుగా పంపాడని, ఆ తుమ్మెదలు శత్రుమూకలను తరిమికొట్టాయని ప్రతీతి. దండులోని కొన్ని తుమ్మెదలు విశాఖపట్టణం వరకు తరుముకొచ్చి అక్కడ మెట్టలో అంతర్థానమయ్యాయి. అందుకని ఆ ప్రాంతానికి తుమ్మెదలమెట్ట అని పేరొచ్చింది. ఇది ఇక్కడ జనంలో ప్రచారంలో ఉన్నగాథ.

ఈ తుమ్మెదల మెట్ట వాల్తేరు రైల్వేస్టేషన్‌కి రెండు ఫర్లాంగులలో ఉంది. ఇప్పుడు దీన్ని చావుల మదుం (మదుం అంటే తూము) పీనుగుల వంతెన అని కూడా అంటారు. ఇటీవల కాన్వెంట్ జంక్షన్ అని వాడుకలోకి వచ్చింది— సెయింట్ జోసెఫ్ కాన్వెంట్ ఇక్కడ ఉన్నందున.

4. తీర్థపురాళ్ళు

కింగ్‌జార్జి ఆసుపత్రి దగ్గర సముద్రతీరంవెంట తీర్థపురాళ్ళు ఉన్నాయి. వాటికి ఎదురుగా చాలాదూరంగా సముద్రంలోపల విశాఖస్వామి ఆలయం, విశాఖ అనే ఊరు ఏనాడో మునిగిపోయాయని అసలు విశాఖపట్టణం అదేనని వాడుకలో ఉంది.

*In a land of sand and ruin and gold*
*There shone one woman, and none but she.*
*And finding life for her love's sake fail,*
*Being fain to see her, he bade set sail,*
*Touched land, and saw her as life grew cold,*
*And praised God, seeing; and so died he.*

అందుకే నేనన్నాను స్విన్‌బర్న్ మీద రాసిన ఒక గేయంలో

కడలి వలపూ, వలపు కడలీ
కవీ, నీ పాటల్!
అని

ఇంకా ఈదుతూనే ఉన్నాను, మాతృగర్భ మహాసముద్రంలో. ఇంకా 1910 రాలేదు. ఇంకా అది ఇరవయ్యో శతాబ్దపు బాల్యావస్థ. ఎంతో గర్విస్తున్నాను, ఈ శతాబ్దం నాదే అని చెప్పుకోవడానికి.

ఇప్పుడు మళ్ళీ ప్రారంభిస్తున్నాను. ఎన్నోసార్లు రాయాలనుకున్నాను. రాశాను. ఆగిపోయాను. మళ్ళీ ప్రారంభించాను. ఆగిపోయాను. ఇప్పుడూ అంతే. ఇదో ప్రారంభం కానేకాదు.

స్వాతి ఆగస్టు *1979*

## మూడు

ఇప్పుడు ప్రారంభిస్తున్నాను, 1910తో. ఆ యేడు ఏ నెల ఏ తేదీలో పుట్టానో నాకు తెలియనప్పటికీ 1910 మాత్రం ఒక నికరమైన కొండగుర్తు. ఆ సంవత్సరం నేను పుట్టడానికి మించిన గొప్పగొప్ప సంఘటనలెన్నో జరిగాయి. కొన్నిటిని మాత్రం ఇక్కడ ఉటంకిస్తాను.

ఆ యేడు గురజాడ మొట్టమొదటి సారిగా ముత్యాలసరాల రచన చేశారు. అనేకానేక సంవత్సరాల తర్వాత మళ్ళీ ఒక తోకచుక్క కనబడడం ఆ యేడే. ధూమకేతువును అందరూ అరిష్టదాయకంగా భావిస్తే గురజాడ దాన్ని దూరబంధువుగా గుర్తించాడు. అయితే ఆ సంవత్సరం ఏడవ ఎడ్వర్డు మరణించడం, ఐదవ జార్జి బ్రిటిష్ సామ్రాజ్యసార్వభౌముడుగా మూర్ధాభిషిక్తుడు కావడం జరిగాయి. ఒక పాతరాజు పోయాడు. ఒక కొత్తరాజు వచ్చాడు. ఇది అరిష్టం అనాలా, ఆనందదాయకం అనాలా?

అదేయేడు బరంపురంలో నానాజాతి భోజనం. అలాగే ఇంకా ఎన్నో చరిత్ర ప్రసిద్ధమైన సంఘటనలు ఆ యేడు జరిగాయి. అంతర్జాతీయ పత్రికలు తిరగేస్తే కోకొల్లలుగా దొరుకుతాయి, అన్నీ అత్యంత ప్రాముఖ్యం కలిగినవే! వీటన్నిటి మధ్యా 1910 నేను పుట్టినయేడు కావడం కేవలం ఒక కాకతాళీయమైన సంభవం.

ఈ శతాబ్దానికవి ఉదయపురోజులు. అవే నా బాల్యానికి కూడా ప్రారంభం. ఇరవయ్యో శతాబ్దంతో నేనూ ఎదుగుతూ వచ్చాను.

లోగడ ఒకసారి నేను *Star Trekking* అనే ఇంగ్లీషు రచన చదివాను. రచయిత

పేరు *Russell Baker*. ఆ రచన నా అవస్థకు అద్దంపట్టినట్లు ఉండడంవల్ల ''నక్షత్రయానం'' అనే శీర్షికతో కొంతవరకు తెనిగించి ఆగిపోయాను. ఇప్పుడు పూర్తి అనువాదాన్ని ఇస్తున్నానిక్కడ.

''ఇక్కడ కూర్చున్నాన్నేను సూర్యుడికి 150 మిలియన్ కిలోమీటర్ల దూరంలో.''

''గంటకు 1500 కిలోమీటర్ల చొప్పున పరిభ్రమిస్తున్న గుండ్రని బండమీద''.

''అరుచుకుంటూ దూసుకుపోతున్నాను. రోదసిలో ఎవరికీ తెలియని ఎక్కడికో ఎవరికీ తెలియని దేనినో ఎవరికీతెలియని ఎందుకోసంధించాలని''.

''మరి నా చుట్టూ మహామహా ఖండాలు ఈ గ్రహం ఉపరితలంమీద తల్లివేరు లేకుండా పల్లటిల్లిపోతూంటే''.

''ఆసియా పొత్తికడుపుకింద ఇండియా కుమ్ముతూ ఉంటే, అలాస్కా దారిమీదుగా అమెరికాలో ఒకభాగం చైనా వైపు దిగజారుతూ ఉంటే''.

''ఇక యుద్ధానికి 25 మిల్లీమీటర్ల చొప్పున ఆఫ్రికానుంచి అంటార్కిటికా ఎగబాకుతూ ఉంటే''.

''మరి నా శిరస్సు రోదసి దిగువకు చూపుడువేలు చూపిస్తుంటే నాకూ అనంతానికీ మధ్య నన్ను ఆదుకోవడానికి భూమ్యాకర్షణశక్తి అనేదేదోతప్ప మరేదీ లేకపోతే, అదేమిటో అని నాకర్థమైనా కాకపోతే, భూమ్యాకర్షణ శక్తిలేని రోజుల కోసం దాచుకోవడానికి దాన్నెక్కడయినా కొనుక్కుందామంటే దొరక్కపోతే''.

''ఈలోగా నా ఉత్తర దిక్కువైపు ధ్రువమండలపు మంచుటోపీ బహుశా''.

''లేదా నిధిగా''.

''ఎదురుగా ఉన్న సమస్తాన్ని తమలోనికి పిలుచుకోవడానికి పెద్దపెద్ద సముద్రాల చేర హిమపర్వతాలను పంపించడానికి సన్నాహాలు చేస్తూంటే''.

''అదిగో అక్కడ తూర్పుదిక్కుగా సముద్రం భూమిని చింపేస్తుంటే సముద్ర గర్భంలోనికి పిండేస్తుంటే ఇంకా ఇంకా కావాలన్నట్టు మళ్లీమళ్లీ తిరిగివస్తుంటే''.

''ఎందువల్లనంటే సముద్రం నిశ్చయించుకుందేమో ప్రాణాంతక మధుమక్షికాలు రావడానికి ముందే భూతలాన్ని యావత్తూ తానే దిగమింగాలని-''

''దక్షిణ అమెరికానుంచి ఉత్తరదిశగా ఈ మక్షికాలు నిర్దాక్షిణ్యంగా ఎగిరెగిరి వస్తూ''

''భూతలాన్ని స్వాధీనం చేసుకోవడానికి ముందే''

''అయితే ఏమనిపించుతోందంటే ఆదికిముందే ఉపరివాతావరణంలో రక్షాకవచంగా ఉన్న షో ఓజోన్ పొరలు బద్దలయిపోవచ్చునని''

''దయారహితంగా ప్రవర్తిస్తున్న మహామారణశక్తి కలిగివున్న విశ్వవైశ్వానర కిరణాల ధాటికి మనందర్నీ అనగా సముద్రాన్నీ హంతక మధుమక్షికాన్నీ ఆఖరికి నన్నుకూడా ఆహుతివ్వవచ్చునని''

''నేనిక్కడ కూర్చున్నాను. గిరగిరా తిరిగే జోరుగా సాగే ఈ శిలాఖండం మీద''.

''నా చుట్టూ నాలుగువేల మిలియన్ల జనం''

''ఎనిమిది గ్రహాలు''

''భయానకమైన ఒక నక్షత్రమండలాల పోగు''

''ముప్ఫయిసార్లు నన్ను చంపడానికి సరిపోయే హైడ్రోజన్ బాంబులు''

''మరి నన్ను తుడిచిపెట్టుకుపోతూ మొత్తం నక్షత్ర మండలమంతా ఈ విశాల విశ్వపు దూరపుగోడని ఢీకొనడానికి తీస్తున్న వెర్రిపరుగులు''

''అద్దుగా ఎంతదూరం అంటే, అక్కడకు మనం చేరుకొనేసరికి నా వయస్సు 8 లక్షల సంవత్సరాలవుతుంది''

''అంటే ఈలోగా ఈ మొత్తం గెలాక్సీ విసురుగా వస్తున్న ఇంకో నక్షత్రమండలం లోనికి ఎక్కడో అస్పష్టంగా సూచితమైన విశ్వాంతర సంకేతస్థలంవద్ద చొరుచుకుపోయి మనందర్నీ రోదసీగహ్వరపు చెత్తకుప్పలో తోసివెయ్యకపోతే''.

''లేక ఈ లోపున సూర్యుడు కాలిపోయి నుసి అయిపోకపోతే''

''లేక అగాధ రోదసీ కుహరంలో ఏదో చోటునుంచి విపరీతమైన తెలివితేటలున్న ఫెర్న్‌జాతి వృక్షాలు మన భూమిమీదికి ఎగిరే ఫెర్న్‌కుండలలోంచి దిగి మున్ముందు తాము జరపబోయే శాస్త్ర పరిశోధనల నిమిత్తం నన్నో ఆకుపచ్చని ఇంట్లో నిర్బంధించకపోతే''.

''కాబట్టి నేను చెబుతున్నట్లుగా ఇక్కడ కూర్చున్నాన్నేను. కదిలిపోతున్న ఆసియా మొదలైన ఖండాలతో, కలిసివస్తున్న హంతక మధుమక్షికాలతో, కరిగిపోతున్న మహాసముద్రాలతో, విశ్వాంతరాళంలో విసురుగా పరుగులు తీస్తున్న తారామండలాలతో''.

''30 సార్లు చంపగలిగిన థెర్మో న్యూక్లియర్ బాంబులు నా చుట్టూ గుట్టలుగా పడివుండగా''

''ఒక్క భూమ్యాకర్షణశక్తి మాత్రమే నన్నీ రాతిదిబ్బకు అదిమిపెట్టి ఉంచగా''

''దాన్ని నువ్వు మనకు దగ్గర్లో ఉన్న ఆర్క్ ట్యూరస్ నక్షత్రం నుంచి చూసినా కనిపించనంత చిన్నది, ఎంపైర్ స్టేట్‌భవనం చివరి అంతస్తునుంచి చూస్తే సహారా ఎడారిలో సంచరిస్తున్న చీమకన్నా ఏమీ పెద్దదికాదు''

''మరి నేనిక్కడ ఇలాగ కూర్చుండగా...''

''సూర్యునికి 150 మిలియన్ కిలోమీటర్ల దూరంలో''

''ఇప్పుడు బొత్తిగా నాకు మనశ్శాంతి లేదు. ఏమైపోతానో ఏమో అని బెంగగా ఉంది. శైత్యం పట్టిందేమో అని బాధపడుతున్నాను''

ఇదీ ఆ రచన.

కానీ ఆఖరిముక్కలు మాత్రం నా అవస్థకు అన్వయించవు. ఏమయిపోతానో ఏమో అన్న బెంగ నాకు ఏమాత్రమూలేదు. అయితే ఇది 1910 నాటి అవస్థకాదు. అప్పటికింత జనాభా లేదుకదా! హైడ్రోజన్ బాంబులు లేవు కదా.

ఇప్పుడు అనగా ఇది రాస్తున్న సమయంలో నా పరిస్థితి- ఇవాళ తేదీ 29 జూన్ 1979.

నా స్వీయచరిత్రలో ఎవరిదో రచనకు అనువాదం ఎందుకు చేర్చాలని కొందరికైనా సందేహం రావచ్చును. రామరాజ భూషణుడు ఇంకొకరు రాసిన పద్యం కొనుక్కొని తన వసుచరిత్రలో వాడుకున్నాడు. నందితిమ్మన రాసిన ముక్కుమీద పద్యం అది. అందులోని కల్పనాచాతుర్యం భట్టుమూర్తిని ఆకర్షించింది. ఆ పద్యం ఇది!

"నానాసూన వితాన వాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి, బల్ కాకన్ దపంబొంది యో
షానాసాకృతి ధాల్చి, సర్వసుమనస్సౌరభ్య సంవాసమై
పూనెం బ్రేక్షణ మాలికా మధుకరీపుంజంబు లిర్వంకలన్"

ఇందులో చాలామట్టుకు అనునాసికాక్షరాలే ఉండడం ఒక అదనపు విశేషం. ముక్కుమీద రాసిన పద్యం కదా మరి!

ఇది రాసినందుకే నందితిమ్మనకు ముక్కుతిమ్మన అనే పేరు వచ్చిందంటారు.

సరే మళ్ళీ ప్రారంభానికి వద్దాం.

నేను పుట్టినతర్వాత నా మొట్టమొదటి జ్ఞాపకం మద్రాసులో ఒక ఇంట్లో కుళాయితిప్పి ఆ నీళ్ళతో ఆడుకోవడం. అప్పుడు నా వయస్సు కొన్నినెలలు మాత్రమే. అప్పటికే మా అమ్మగారి అస్వస్థత చాలాముదిరిపోయింది. ఎన్నో వైద్యాలు చేయించిన తర్వాత ఆయుర్వేదం లో దిగ్దంతిలాంటి ధర్మవరం గోపాలాచార్యులుగారికి చూపించడానికి మా నాన్నగారు మద్రాసుకు మా అమ్మను తీసుకువచ్చారు. ఆ తర్వాత నాయేణ్ణర్థం వయస్సప్పుడు మా అమ్మ చచ్చిపోయింది.

నాకు మాట్లాడడం వచ్చిన కొత్తల్లోనే పాటలు పాడుతూ ఉండేవాణ్ణి.

"ఇక ముసంగి ముసిలాడంట" అంటూపాడడం నాకు బాగా జ్ఞాపకం.

మా తాతయ్య శ్రీరంగం సూర్యనారాయణగారు (మానాన్న పూడిపెద్దివెంకట రమణయ్య గారిని పెంచుకున్న తండ్రి) నన్ను ఒళ్ళో కూచోబెట్టుకుని భారత రామాయణ కథలుచెప్పేవారు. నాచేత పాటలు పాడించేవారు. నేను కళ్ళు తెరచిన నాటికే ఆయనకు దృష్టి మందగించింది. నా పితామహి పూర్తిగా అంధురాలు. అందుకే ఆవిణ్ణి నేను గుడ్డి మామ్మా అని పిలిచేవాణ్ణి.

సూర్యనారాయణగారు స్వయంగా ధనవంతులు. కాగా మా ఇల్లు కట్టడానికి పునాదులు తీస్తూ ఉంటే బంగారపు బిందెలు దొరికాయని మావాళ్లు చెప్పుకునేవాళ్లు. దానా-దీనా చిన్నప్పుడు నా ఒళ్లంతా బంగారమే.

పగవాడికైనా రాకూడదన్నంత దారిద్ర్యంతో బాధపడినవాడిగా నన్ను నా పాఠకు లెరుగుదురేకాని నా చిన్నతనమంతా రాజభోగాలతో గడిచిందన్న సంగతి చాలామందికి తెలియదు.

"గుడ్డిమామ్మా! నీకేనా బంగారు గొలుసు? నా మెడలో కూడా వేయించవూ?" అని నేననీ అనగానే సరికొత్త సువర్ణహారం నాకోసం చేయించిందావిడ.

ఆవిడ ముందుగా చచ్చిపోయింది. ఆ తర్వాత కొద్దికాలానికే మా తాతగారు చనిపోయారు. "మీ గుడ్డిమామ్మ ఏదీ?" అని నన్నెవరయినా అడిగితే "కాశీకి వెళ్ళిపోయింది" అనేవాణ్ని. ఆవిడేకాదు, చనిపోయిన వాళ్ళెవరయినా కాశీకి వెళ్ళిపోయారనే అంటూ ఉండేవాణ్ని.

సూర్యనారాయణగారి ఆఖరుక్షణాలు నాకు బాగా జ్ఞాపకం. "కాశీకి వెళ్ళమని తాతయ్యకు చెప్పు" అని మా నాన్న అన్నాడు. "తాతయ్యా! క్షేమంగా కాశీకి వెళ్ళు" అన్నాను. అంతవరకూ మూసుకున్న కళ్ళని తెరిచి మా తాతయ్య నన్ను ఆప్యాయంగా చూశాడు. ఆ తర్వాత కళ్ళుమూతలు పడ్డాయి. మరుక్షణం ఆయన ఆఖరుశ్వాస వదిలి (ఆనందంగా అనుకుంటాన్నేను) ఈ లోకం నుంచి నిష్క్రమించారు.

అప్పటికింకా నాకు అయిదేళ్ళయినా లేవు. నా చిన్నతనంలో విశాఖపట్టణం కూడా నాలాగే ఒక చిన్న ఊరు. నన్నూ ఒక చిన్న ఊరుగా జమకట్టుకుంటే నా కభ్యంతరం లేదు. ఊళ్ళో ఎక్కడనిలబడి చూసినా నాలుగు దిక్కులూ కళ్ళబడేవి. మా మేడ ఎక్కి చూస్తే తూర్పున బంగాళాఖాతం, పడమటన ఉప్పుటేరూ, ఉత్తరాన తుమ్మెదలమెట్టా, దక్షిణాన యారాడకొండా కనపడేవి. ఆకాశంకూడా చెయ్యి ఎత్తితేచాలు అందుకొచ్చేటంత దూరంలో ఉండేది. క్రమక్రమంగా విశాఖపట్టణంతో బాటు నేనూ, నాతోబాటు విశాఖపట్టణమూ ఎదుక్కొంటూ వచ్చేం. నా పదోయేటిదాకా నేను నరవాహనం మీదనే బతికాను. అనగా ఎవరో ఒకరు నన్ను ఎత్తుకుంటూనే ఉండేవారు. తన భుజాలమీద ఎక్కించుకొని మా లింగంమామయ్య నన్ను తిప్పుతూ ఉండేవాడు. ఎప్పుడూ నల్లమందు మైకంలోనే ఉండేవాడు.

చిన్నతనంలో మా అమ్మ చనిపోవడంవల్ల నా అయిదో ఏటిదాకా ఎందరమ్మలో నాకు చనుబాలిచ్చి బతికించారు. ఆరోజుల్లో మా సావిట్లో ఒక మేకకూడా ఉండేది. గాంధీగారి కన్నా ముందుగానే నేను మేకపాల సారాన్ని పీల్చుకున్నానన్నమాట. అది బహుశా నా రెండో ఏడో, మూడో ఏడో. ఒకమారు మేకనుకట్టిన చేంతాడు దాటుతూ పడిపోయాను. నాకింది పెదిమను కొరుక్కున్నాను. బాగా నెత్తురొచ్చింది. ఆ తర్వాత గాయం మానిపోయినా ఇప్పటికీ దానిచిహ్నం నా కిందిపెదవి వెనుక ఎడమభాగంలో ఎత్తుగా నిలిచిపోయే ఉంది.

అయిదో ఏట తిరుపతిలో ఉపనయనమూ, విశాఖపట్టణంలో అక్షరాభ్యాసమూ జరిగేయి. చిన్నప్పటినుండీ నాది ఎడంచెయ్యివాటం. అక్షరాలు కూడా ఎడం చేతితోనే రాస్తుండేవాణ్ణి. ఎలాగో మానాన్న ఆ అలవాటు తప్పించాడు.

మా అమ్మ చనిపోయిన తర్వాత మా నాన్న మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. నా రెండో తల్లిపేరు సుభద్రమ్మ. ఒక గొప్ప తాసిల్దారుగారి అమ్మాయి. ఆవిడ తొలిచూలులో కొడుకుని కని వాడు ఏడాదికో ఏణ్ణర్థానికో చచ్చిపోయాక, ఆవిడ స్తన్యాన్ని కూడా

నేను సేవించి జీవించాము. నల్లని శిఖరంగల ఒక తెల్లని చిన్న వెండిపర్వతం నా కప్పుడప్పుడు కళ్ళుమూసుకుంటే కనబడుతూ ఉండేది. మా అమ్మకి కూడా నాకన్నా ముందుగా ఒక కొడుకు పుట్టి పురిట్లోనే సంధికొట్టేశాడట. అంతకుముందు చాలాసార్లు మా అమ్మకి గర్భస్రావాలయ్యాయట. ఈ మాటలు చెబుతూ మా నాన్న నాకన్నా ముందుగా పుట్టినవాడు చచ్చిపోవడానికి కారణం మంత్రసాని చేతకానితనమే అని మాటిమాటికీ అంటూ ఉండేవాడు.

*స్వాతి సెప్టెంబర్ 1979*

## నాలుగు

అప్పటికింకా 1915 రాలేదు. అనగా నాకింకా అయిదేళ్ల లోపు వయస్సు. ఉపనయనం కాలేదు. అక్షరాభ్యాసం కాలేదు. ఈ రెండూ 1915లో మొదటిది తిరుపతిలోనూ రెండవది విశాఖపట్నంలోనూ జరిగేయి.

ఇది 1980 జనవరి 1. ఇప్పటికి 65 సంవత్సరాల కిందటి విషయాలు రాస్తూ కూర్చుంటే ఎవరైనా చదువుతారా అని ఒకొక్కప్పుడు నాకు సందేహం కలుగుతూ ఉంటుంది. అయినా ఇది నా ఆత్మచరిత్ర. ఇక చారిత్రకక్రమంలో ఈ రచన సాగించాలనుకున్నాను. చిన్నప్పటి జ్ఞాపకాలు, అందులోకీ మరీ చిన్నప్పటి జ్ఞాపకాలు అసత్యాలూ, అభూతకల్పనలూ లేకుండా రాయాలని నా సంకల్పం. ఇక వాస్తవానికి చిలవలూ పలవలూ కల్పించి రాసుకుపోతే ఆ రచన చదవటానికయితే బాగానే ఉండవచ్చును. ఒక గొప్ప నవలగా కూడా అది చలామణీ కావచ్చును. కాని నేను రాస్తున్నది అటువంటి నవలకాదు.

ఉదాహరణకు నా చిన్నతనంలో మా బంధువే ఒకాయన ఉండేవాడు. ఆయన పేరు గోదావరయ్య. నల్లగా, పొడుగ్గా ఉండేవాడని మాత్రమే జ్ఞాపకం. ఆయన గురించి ఉన్నవీ లేనివీ బోలెడు రాస్తూ ఎంతయినా గ్రంథం సాగించవచ్చు. సరిగ్గా అదే నాకు ఇష్టం లేదు.

గోదావరయ్య ఒక స్కూలు మాస్టరు. బతకలేక బడిపంతులనే మాటకు ఆయనే ప్రత్యక్ష నిదర్శనం. ఎవరికైనా చదువు చెప్పేవాడా అంటే అదో సందేహమే! అతనొక మాస్టరూ కాదు, అతనికో స్కూలూ లేదు. స్కూళ్ల తణిఖీ అధికారి వస్తాడంటే కొంతమంది కుర్రాళ్లను పోగుచేసి అప్పటికప్పుడే ఒక వీధిబడిని సృష్టించేవాడు. తర్వాత అది అంతర్థానమయిపోయేది. అధికారి చెయ్యి తడి చేసి, అతడిప్పించే గ్రాంటును గోదావరయ్య మాస్టరు తన జేబులో వేసుకునే వాడని నేను రాస్తే అది అబద్ధమే అవుతుంది. ఎంచేతనంటే అటువంటి దృశ్యాన్నెప్పుడూ నా కళ్లతో నేనయితే చూడలేదు.

అపర బ్రహ్మపదార్థం లాంటి గోదావరయ్య బడిలో నాలుగేళ్లలోపు వయస్సులో నాకు తొలిసారిగా అక్షరాభ్యాసమయింది. అయితే అందుకో పలకా లేదు, బలపమూ లేదు. గుంట ఓనమాలు అంతకన్నా కావు. (బియ్యంలో పసుపుకొమ్ముతో 'ఓం నమశ్శివాయ' అని దిద్దడం నా అయిదోయేట జరిగిన అక్షరాభ్యాసంలో).

సాధారణంగా చిన్నపిల్లలు స్కూలుకు వెళ్లాలంటే భయపడతారు. ఏడుస్తారు. నాకా భయం లేకపోవడానికి, ఏడుపు రాకపోవడానికి గోదావరయ్య మేస్టరే కారణం. కాబట్టి అతనికి నా కృతజ్ఞత తెలుపుకుంటున్నాను.

అక్షరాభ్యాసానికి ముందు నా చదువు రంగులతోనూ, గీతలతోనూ ప్రారంభమయింది. రంగుసుద్దముక్కలతో గోడలనిండా బొమ్మలు గీసేవాణ్ణి. ఇల్లంతా ఖరాబు చేస్తున్నానని నాకు తెలియదు. నేను వేసిన బొమ్మలు నా మట్టుకు నాకు బాగానే కనబడేవి. చూసిన వాళ్లు కూడా చాలా బాగున్నాయనేసరికి నేనో గొప్ప చిత్రకారుణ్ణయిపోయాననుకున్నాను. నా కోసం మా నాన్న ప్రత్యేకంగా మా మేడమీద ఒక మూల ఓ చిన్న నల్లబల్ల కట్టించాడు. (ఇంటిగోడల్ని నా దాడినుంచి రక్షించడానికే ఈ పని చేసి ఉండవచ్చును. అయినా గంటల తరబడి ఆ నల్లబల్ల ముందు నాకు కాలక్షేపం జరిగేది).

ఆ తర్వాత మా నాన్న ఎన్నో నీటి రంగుల, కుంచెల పెట్టెలు కొనిపెట్టేడు. వాటితో ఎక్కువగా జంతువుల బొమ్మలూ, చెట్ల బొమ్మలూ చిత్రించేవాడ్ని. ఒక మారు వరుసగా నాలుగు చెట్లు చిత్రించి దాన్ని 'అడివి' అని పిలవాలన్నాను. మా రమణయ్య మామయ్య నన్ను తీవ్రంగా విమర్శించాడు. అరణ్యంలో వృక్షాలు పటాలంలో సిపాయిల్లాగ వరుసగా నిలబడవన్నాడు. ఆకుపచ్చ రంగులో కూడా అనేకానేక ఛాయాభేదాలుంటాయన్నాడు. చిత్రలేఖనంలో ఇన్ని చిక్కులున్నాయా అని అప్పుడనుకున్నాన్నేను.

ఆ రోజుల్లోనే, నేనో గొప్ప చిత్రకారుణ్ణయిపోవాలనీ, చిత్రలేఖనంలో ఉన్నత శిఖరా లందుకోవడమే నా జీవిత ధ్యేయం చేసుకోవాలనీ అనుకున్నట్లు రాశానంటే అది అబద్ధమే అవుతుంది. ఎందుచేతనంటే నేనెప్పుడూ అలా అనుకోలేదు. అసలు ఇదో జీవితమనీ, దీనికో ధ్యేయం ఉంటుందనీ అప్పట్లో నాకు తెలియనే తెలియదు! నేనేది అడిగితే అది మా నాన్న తెచ్చేవాడు, లేదా తెప్పించేవాడు. వాటర్ కలర్స్ కావాలన్నాను. కొనిపెట్టేడు. సరదాగా ఏవో బొమ్మలు వేసేవాణ్ణి. అలా కొంతకాలం సాగింది. ఆ పిమ్మట ఆ అధ్యాయం ముగిసింది! అంతే!

విశాఖపట్టణంలో ఏటేటా శ్రీరామనవమి పండుగలు ఎంతో వైభవంగా జరిగేవి. (ఇప్పటికీ జరుగుతూనే వున్నాయి) ఆ పండుగలో నేను మొగానికి నీలిరంగు పూసుకొని (రాముడు నీలమేఘశ్యాముడు! 'రామాలాలి! మేఘశ్యామాలాలీ' అనే పాట నాకు కంఠస్థం!) వెదురుకర్రకు నులకతాడు కట్టిన ధనుస్సుతో చీపురుపుల్లల బాణాలతో నేనే రాములవారినని గెంతేవాణ్ణి. తన ఒళ్లో నన్ను కూర్చోబెట్టుకుని మా తాతయ్య చెప్పిన రామకథలన్నీ చుట్టూ వున్న వాళ్లకి చెప్పేవాణ్ణి. (మొదటిసారిగా రామాయణ కథను మా తాతగారు చెబితే మహాభారత కథలు ఆయన పెంపుడుకొడుకు మా నాన్నగారు చెబుతుంటే విన్నాను).

ఈ కథలన్నీ నన్నెంతో ఆకర్షించిన మాట నిజమేకాని మా మాతామహుడు భాగవతుల వెంకటరత్నంగారు ఎన్నోసార్లు చెబుతానంటూ ఎప్పటికీ చెప్పని ఒక కథ నన్నింకా ఎక్కువగా

ఆకర్షించింది. అదేదో కాశీమజిలీకథల్లోనిదనుకుంటాను. కథపేరు 'ఆకులు- అపరంజి' అని మాత్రం తెలుసు. అంతే తెలిసినా అది అన్ని పురాణగాథల కన్నా మిన్నగా ఉంటుందని అత్యంత దృఢంగా విశ్వసిస్తున్నాను.

రామనవమి రోజుల్లో మా లింగంమామయ్య నన్ను తన భుజాలమీద కూర్చుండ బెట్టుకుని ఊరంతా తిప్పేవాడు. అతను ఇరవయి నాలుగ్గంటలూ నల్లమందునిషా మీదనే ఉండేవాడని ఇంతకుముందే చెప్పాను. ఆయనది ఒక రకం నిషా అయితే, మా ఓం ఓం తాతయ్యది ఇంకోరకం నిషా. ఈ తాతయ్య నాకు ఏ విధంగా తాతయ్య అవుతాడో నాకు తెలియదు. బహుశా మా మాతామహులవైపు వాడనుకుంటాను. ఆయన అసలు పేరేమిటో కూడా నాకు తెలియదు. అందరు పిల్లల్లాగే నేనూ ఆయన్ని 'ఓం ఓం తాతయ్యా' అని పిలిచేవాణ్ణి. ఎప్పుడూ ఓం ఓం అని తనలో తాను గొణుక్కొనే వాడు. ఎప్పుడూ మడికట్టుకున్నట్టే కనపడేవాడు. నొసట విభూతి, కుంకుమ బొట్టూ, మెడను రుద్రాక్ష మాలా ధరించేవాడు. ఆయనది ఆధ్యాత్మికమైన నిషా అని అభివర్ణించవచ్చును.

ఇరవయ్యో శతాబ్దం పుట్టిన 14వ యేట మొదటి ప్రపంచ మహా సంగ్రామం ప్రారంభమయింది. ఆ మహాసంవత్సరమే గురజాడ అప్పారావు మరణం. కాని అప్పటి నా వయస్సులో ఈ రెండు సంఘటనలూ సంభవించినట్లే అనిపించలేదు.

ఇంతవరకూ మందకొడిగా సాగుతున్న కాలం ఇరవయ్యో శతాబ్దంలో వేగం పుంజుకుంది. ఇప్పుడు ఆకాశాలలో విమానాలు ఎగురుతున్నాయి. సముద్ర గర్భాలలో జలాంతర్గాములు తిరుగుతున్నాయి. (మద్రాసు నగరంమీద ఎమ్‌డెన్[1] నౌకచేసిన దాడిని ఇప్పటికీ మరిచిపోలేము!)

1918లో నా యెనిమిదో యేట శివరామయ్యగారి స్కూలులో లడ్డుండలు పంచిపెట్టినప్పుడు ఏదో పెద్దయుద్ధం ముగిసిపోయినట్లు తెలిసింది.

శివరామయ్యగారి స్కూలులోనే నా విద్యాభ్యాసం 1915లో ప్రారంభమై 1920 దాకా సాగింది. ఇంగ్లాండులో ఈటన్ స్కూలు ఎలాంటిదో విశాఖపట్టణంలో ఈ స్కూలు అలాంటిది. శివరామయ్య మేస్టారంటే మా అందరికీ సింహస్వప్నం. ఆయన చేతిలో నేనెప్పుడూ దెబ్బలుతినలేదు. అయినా ఏదో భయం.

అలాగే మా క్రిష్ణయ్య మామయ్య దగ్గర కూడా భయమే. ఆయన కూడా నన్నెప్పుడూ కొట్టలేదు. మహా అయితే గట్టిగా గద్దించేవాడు. అది చాలు నేనేకాదు, మా కుర్రకారంతా నిశ్శబ్దం పాటించడానికి.

*1.ఎమ్‌డెన్ జర్మనీలో ఒక రేవుపట్టణం. ఆ పేరుతో మొదటి ప్రపంచయుద్ధంలో జర్మనీ యుద్ధనౌక ఒకటి ఉండేది. ఇది 1915లో మద్రాసు రేవులోకి చొచ్చుకొచ్చి కొంతనష్టం కలిగించింది.*

*గొప్పతనానికి, సమర్థతకి ఎమ్‌డెన్ పర్యాయపదం అయింది. ఈ మాట తెలుగులో బాగా వాడుకలోకి వచ్చింది. పల్లెటూళ్ళల్లో "ఈ ఎద్దు మంచివేనా?" అని అడిగితే "వాటికేం ఎమ్‌డెన్" అనే వాళ్ళు. ఎమ్‌డెన్ మీద శ్రీకాకుళం ప్రాంతంలో పల్లెపాటలు ప్రచారంలో ఉండేవి. జీవితంలో ప్రభావాలు— ముఖ్యంగా పారిశ్రామిక యుగంలో— ఎంత విస్తృతంగా ఉంటాయో తెలుసుకోవచ్చు.*

'పెద్దల పట్ల భయభక్తులుండాలి' అని కదా చిన్నప్పటి నుంచి జరిగే నీతి బోధ!

మా అమ్మ చనిపోయిన కొద్దికాలానికే మా నాన్న ద్వితీయ వివాహం చేసుకున్నాడు. అవి బాల్య వివాహపు రోజులు. (నాకు కూడా చిన్నతనంలోనే పెళ్లి అయింది. అప్పటికింకా శారదా బిల్లు రాలేదు) మా నాన్నది గజపతినగరం తాసిల్దారుగారింటి సంబంధం. పేరును బట్టి గజపతినగరం అంటే ఏదో పెద్ద ఊరనుకున్నాను. తీరా చూస్తే ఊరంతా చుట్టడానికి అయిదు నిమిషాలు కూడా పట్టలేదు.

నా సవతి తల్లిపేరు సుభద్రమ్మ. ఆవిడనెప్పుడూ నేను సుభద్రమ్మ అనే పిలిచేవాణ్ణి. సవతితల్లి అంటే ఒక రాక్షసి- అని సాధారణంగా జనాభిప్రాయం. నాకు మాత్రం మా సుభద్రమ్మ ఒక దేవతలా కనబడేది.

పెళ్లయిన ఏడాదికో రెండేళ్లకో ఆవిడ కాపురానికి వచ్చింది. కళావిహీనమైన ఈ ఇల్లు మళ్లీ కళకళలాడింది.

అయిదో ఏట అక్షరాభ్యాసమూ, ఉపనయనమూ జరిగిన 1915 నా జీవితంలో ఒక ముఖ్యమైన సంవత్సరం. అంతకు ముందు విశాఖ నుండి ఉత్తర దిక్కున విజయనగరం దాకానూ, దక్షిణ దిక్కున యలమంచిలి దాకానూ మాత్రమే ప్రయాణం చేశాను. ఉపనయనానికి తిరుపతి వెళ్లడం అంటే అదో సుదీర్ఘ ప్రయాణం. గూడూరు దాకా ఒక బండి. అక్కడి నుండి తిరుపతికి మరో బండి. ఏడుకొండలెక్కి ఎగువ తిరుపతికి మళ్లీ డోలీల మీద ప్రయాణం.

అప్పటికి నాకు అయిదేళ్ల జుత్తు ఉండేది. మొత్తం అంతా మొక్కుబడి ప్రకారం భగవదర్పితమై పోయింది. ఉపనయన కర్మకాండ ప్రకారం అయిదు చోట్ల నెత్తిమీద పంచశిఖలుంచాలి. కాని అలా జరగలేదు. పూర్తిగా గుండుగీయించారు. అయిదుచోట్ల మాత్రం ఒకటీ అరా తల వెంట్రుకల పరకలు కనపడీ కనపడనట్టుగా ఉంచారు.

అద్దంలో నాకో కొత్త మొగం కనిపించింది. అయిదేళ్ల జుత్తు పోయిందే అని కొంచెం బాధపడ్డాను. కాని ఆ బాధ ఎంతోసేపు నిలవలేదు. 'పోతే పోయిందిలే! మళ్లీ వస్తుంది కదా!' అని ధైర్యం. ఒక అమ్మపోతే మరో అమ్మ వచ్చిందిగా! అలాగే ఇదీనూ!

అందుకే జీవితంలో ఎన్నెన్ని కష్టాలు ఎదుర్కొన్నా చలించలేదు! ఎన్ని సుఖాలు అనుభవించినా పొంగిపోనూ లేదు!

తిరుపతి వెళ్లేటప్పుడో, తిరుగు ప్రయాణంలోనో మా సుభద్రమ్మ నన్ను కక్కసులోకి తీసుకెళ్లింది. వెండిచెంబో, మూతో పారేసింది. మా నాన్న చాలా కోప్పడతాడనుకున్నాను. ఆయనేమీ అనలేదు. 'పోతే పోయింది గానీ, మళ్లీ వస్తుందిలే' అనేదే ఆయన మనస్తత్వం.

దీన్నిబట్టి నాదీ, మా నాన్నదీ ఒకే మనస్తత్వమని ఎవరయినా అనుకోవచ్చును. కాని అందులోనే ఒక సున్నితమైన భేదం వుంది. మా నాన్న ఎంత గొప్ప గణితశాస్త్ర పండితుడో అంత గొప్ప జూదగాడు. (మా మేడమీది హాలులో తరచుగా పేకాట సాగిపోతూండేది. ముఖ్యంగా మూడుముక్కలాట!) 'గెలిచినప్పుడు గెలుస్తాం ఓడిపోయినప్పుడు ఓడిపోతాం'

అనేది మా నాన్న మనస్తత్వం. 'గెలవడానికి ఆడాలి, ఓటమిని అంగీకరించకూడదు' అనేది నా మనస్తత్వం.

గెలుపూ, ఓటమీ అంటున్నా, జీవితాన్ని మా నాన్నలాగ నేనో జూదంగా పరిగణించలేదు. ఒక స్పోర్ట్‌గా తీసుకుంటాను. అంతకన్నా మించి ఒక ఛాలెంజ్‌గా కూడా తీసుకుంటాను. ఇదో పెద్ద సవాల్! దీన్ని అడుగడుగునా అంగీకరించి తీరాలి!

## 1915 - 20

ఇది అయిదు సంవత్సరాలు. అయిదో ఏటి నుంచి పదో ఏటిదాకా. '15లో శివరామయ్య స్కూలులో ఒకటో తరగతి మొదలు '20లో మిసెస్ ఏ.వి.యన్. కళాశాల హైస్కూల్‌లో ఫస్టు ఫారం వరకు.

చదవడం ప్రారంభించినప్పటినుండి ఏ పుస్తకం దొరికినా (తెలుగు పుస్తకాలే) దాన్ని పూర్తిచేసేదాకా నాకు తోచేది కాదు. 'స్వసంఘ గ్రంథాలయం' ఒకటీ, సుబ్బా బ్రదర్సు వారి గ్రంథ విక్రయశాల ఒకటీ నేనారోజుల్లో తరచు కనిపించే చోట్లు. 'జగన్మిత్ర సమాజం' నాటక కంపెనీలో చిన్నపిల్లల వేషాలు వెయ్యడం కూడా ఆ రోజుల్లోనే! రాగయుక్తంగా పద్యాలు 'పాడ'గలిగిన వారంతా అప్పుడు నట శిఖామణులే! నటీమణులు లేనేలేరు. (సురభి నాటక కంపెనీ ఒకటి వుండేదని అప్పట్లో నాకు తెలియదు).

ప్రపంచ యుద్ధం ముమ్మరంగా సాగిపోతున్నా విశాఖపట్టణపు మధ్య తరగతి జీవితానికి దాని తాకిడి తగలలేదు. మరో వెయ్యేళ్లదాకా బ్రిటిష్ వాడి బావుటా ఎగురుతూనే వుంటుందని పెద్దపెద్ద కొమ్ములు తిరిగిన మేధావులు విశ్వసించేవారు. కొంతమంది మాత్రం 'జర్మన్లంటే ఎవరనుకున్నారు? శర్మణులు! అనగా బ్రాహ్మణులు. అథర్వణవేదంలో చెప్పిన ఆయుధాలన్నీ వాళ్లదగ్గర వున్నాయి' అంటూ బ్రిటిష్‌వాడి పరాజయాన్ని కోరుకునేవారు. అందువల్ల మన దాస్యవిముక్తి అవుతుందా, కాదా అనేది వేరే సంగతి!

ఎక్కువగా వచనం, ముఖ్యంగా డిటెక్టివ్ నవలలు చదువుతుండే నాకు పద్యం రాయాలని సరిగా ఏ యేట బుద్ధి పుట్టిందో తెలియదుగాని, ఎనిమిదో ఏట అనుకుంటాను. ఒక పొట్టి పాదమూ, ఒక పొడుగుపాదమూ, తర్వాత మరో పొట్టి పాదము, ఒక పొడుగు పాదమూ వ్రాసి దాన్ని కందపద్యం అన్నాను. 'కందం వ్రాసిన వాడే కవి' కాబట్టి నేనో కవినైపోయానను కున్నాను.

మా నాన్న నా కవితాసక్తిని నిరుత్సాహ పరచలేదు. పైగా కవితాశక్తికి దోహదంగా వుంటుం దని 'సులక్షణసార' గ్రంథం కొని యిచ్చాడు. 'ఆదిమధ్యావసానేషు' ఇత్యాది శ్లోకాలతో తానే ఛందోరహస్యాలు నాకు బోధించాడు.

*స్వాతి మార్చి 1980*

## ఐదు

మా నాన్న నాకు శ్రీనివాసరావు అని ఎందుకు నామకరణం చేయించాడా అని అప్పుడప్పుడూ నేననుకుంటూండేవాణ్ణి. ఇప్పుడాలోచిస్తే పి.టి. శ్రీనివాసయ్యంగారి పట్ల

మా నాన్నకున్న అపార గౌరవభావమే ఇందుకు కారణమని తోస్తోంది. శ్రీనివాసయ్యంగారు విశాఖపట్నంలోని ఏ.వి.ఎన్.కాలేజి ప్రిన్సిపాలు. అనేక విద్యలలో అఖండ ప్రజ్ఞాశాలి. నాకు జ్ఞానం వచ్చేసరికే ఆయన మద్రాసు వెళ్లిపోయి, మరో సరికొత్త డిసిప్లిన్‌లో, దక్షిణ భారతదేశ చరిత్ర గురించి అశేష పరిశోధనలు సాగించి అమూల్యమైన ప్రామాణిక రచనలు కావించాడు.

గిడుగు, గురజాడలతో బాటు వ్యావహారిక భాషను ప్రవచించిన శ్రీనివాసయ్యంగారొక రని తెలుగుసాహిత్యం గురించి ఏ కొంచెం పరిచయమున్న వాళ్లకైనా తెలుసు. ముగ్గురనా అన్నాను? కాదు నలుగురని చెప్పాలి. ఆ రోజుల్లో విశాఖ జిల్లాలో విద్యాశాఖాధికారిగా ఉండిన యేట్స్ దొరగారు నాలుగోవాడు. వీళ్లతో పాటు సెట్టి లక్ష్మీనరసింహం (సెట్టి మేష్టారు) గారిని కూడా కలుపుకుంటే వ్యావహారిక భారత యుద్ధం చేసిన పంచ పాండవులూ మనకు జ్ఞాపకం వస్తారు.

శ్రీనివాసయ్యంగారికి తాగుడు అలవాటుండేది. మెసానిక్ లాడ్జిలో మెంబరు, థియోసోఫిస్టు కూడా. 'ఏ ఫిస్టు అయితేనేం? సత్ప్రవర్తన ముఖ్యం' అనేవారట, విశాఖ పట్టణంలో అందరూ కవిగారని పిలిచే మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు.

తాగిన మైకంలో ఒకసారి, శ్రీనివాసయ్యంగారు కాలేజీ గోడమీంచి పడిపోయి కాలు విరుచుకున్నారట. ఇప్పటికీ నా స్మృతిపథంలో ఆయన ఖరీదయిన చంకకర్రలు ధరించి నడుస్తున్నట్టే ఉంటుంది.

ఆయన ప్రిన్సిపాలుగా ఉన్నప్పుడు మా నాన్న అదే కళాశాలలో గణిత శాస్త్రాధ్యాపకుడు. అప్పుడప్పుడు నన్ను తనతో కాలేజీకి తీసుకు వెళ్లేవాడు. నేను సరాసరి ప్రిన్సిపాలు గదిలోకి పోయి వారి టేబిల్‌మీద ఉన్న రొట్టెముక్కలూ, పాలూ సేవించేవాణ్ణి. నా మీద శ్రీనివాసయ్యంగారికి అపారమైన వాత్సల్యం.

బహుశా, ఆయనంతవాణ్ణి కావాలని కాబోలు మా నాన్న నాకు 'శ్రీనివాసరావు' అని పేరు పెట్టేరు!

పి.టి. శ్రీనివాసయ్యంగారికి ఒక రిక్షా ఉండేది. అందులో కూర్చుని ఆయన కాలేజీకి వెళ్తూ ఉండేవాడు. ఆ రోజుల్లో అదే ఒక గొప్ప స్టేటస్ సింబల్.

మా నాన్నా, మరో ఇద్దరుముగ్గురు లెక్చరర్లూ ఒక పెట్టెబండిలో కాలేజీకి వెళ్లేవారు. ఒంటెద్దు లాగుతుండే ఈ పెట్టెబళ్లు విశాఖపట్టణం ప్రత్యేకత అనుకుంటాను. లోపల నలుగురు కూర్చోవచ్చు. ఆ బండి తోలేవాడి పేరు అప్పడు.

అప్పడు బండిలో నేను చాలాసార్లు కాలేజీకి (మా నాన్నగారితో) వెళ్తూ ఉండేవాణ్ణి. అప్పుడు నా వయస్సు అయిదు సంవత్సరాలలోపు.

ఇంచుమించు ఆ వయస్సులోనే నన్ను రమానాధరాజు సైకిలుమీద కూర్చోబెట్టుకుని వాయువేగంగా కాలేజీ దిబ్బనుంచి దిగేవాడు. (రమానాధ రాజు అంటే విక్రమదేవ వర్మగారి కొడుకు, విక్రమదేవ వర్మగారంటే ఆ రోజుల్లో మాడుగుల రాజా. తర్వాత చాలా కాలానికి

వృద్ధాప్యంలో ఆయనకు జయపురం సంస్థానం వారసత్వదావాలో సంక్రమించింది. (ఆంధ్రా యూనివర్శిటీకి చెందిన జె.వి.డి. కాలేజీ అంటే జయపురం విక్రమదేవ వర్మ కాలేజీ)

ఆ రోజుల్లోనే నేను గుర్రపుబళ్ల జట్కాల వేగానికి అబ్బురపడేవాణ్ణి. కొత్తగా మోటారుకార్లు అనే వాహనాలు కొత్తవేగాన్ని సాధించాయని చెప్పుకునేవారు. పదేళ్ల తరువాత నేను విశాఖ సంపన్నులలో ఒకరైన చాకురుపండా వెంకటరమణమూర్తిగారు కొన్నకారులో ప్రయాణం చేశాను. ఆ విశేషాలు మున్ముందు చెబుతాను.

బ్రిటిష్‌వాడు దేశం అంతటా ఆసరికే రైలుమార్గాలు వేసి అదే తన సామ్రాజ్య సుస్థిరతకు పునాది అనుకున్నాడు. (ఇండియాలో రైలు మార్గాలు వెయ్యడం వల్ల బ్రిటిష్ సామ్రాజ్యం తన సమాధిని తానే తవ్వుకుందని కార్ల్ మార్క్స్ కరెక్టుగానే జోస్యం చెప్పాడు).

నా చిన్నతనంలో ఈ రైలుబళ్ల ప్రయాణం ఉత్తరదిక్కున విజయనగరం వరకూ, దక్షిణాన యలమంచిలి దాకా మాత్రం పరిమితమయ్యాయి.

ఇవన్నీ ఎందుకు చెబుతున్నానంటే కాలం ఇరవయ్యో శతాబ్దపు బాల్యకాలంలోనే అంత క్రితం అయిదువేల సంవత్సరాల నుంచీ కనీవినీ యెరుగని అధికవేగం సాధించిన కాలంలో నేను జన్మించానని చెప్పడానికే. నా కన్న ఒక పది సంవత్సరాల ముందుగా జన్మించిన ఈ శతాబ్దంతోబాటే నేనూ పెరుగుతూ వచ్చానని చెప్పడానికే!

యాభయివేల సంవత్సరాల పాటు మానవుడు ఉన్నచోట ఉండకుండా తిరుగుతూ, వేటకాడుగా మసలుతూ ప్రకోపించే ప్రకృతిశక్తులకు బానిసగా బతుకుతూ వచ్చాడు. ఆ తర్వాత, ఇప్పటికి గడచిన అయిదువేల సంవత్సరాలప్పుడు మానవ జీవితంలో పెద్ద విప్లవం వచ్చింది. వ్యావసాయ నాగరికత ప్రారంభమయింది. మనిషికో స్థిరత్వం కుదిరింది.

నాటినుంచి నేటిదాకా భూస్వామ్య విధానం అప్రతిహతంగా పరిపాలిస్తూ వచ్చింది. రాచరికం ఏదో ఒక రూపంలో కొనసాగుతూనే వచ్చింది. ఎవరనుకున్నారు- ఈ శతాబ్దంలో సింహాసనాలూ, కిరీటాలూ, ఆ కిరీటాలను ధరించిన చక్రవర్తుల శిరస్సులూ, నేలను దొర్లి పొర్లాడుతాయని? ఎవరనుకున్నారు- రవి అస్తమించని బ్రిటిష్ మహా సామ్రాజ్యం ఛిన్నాభిన్న మయిపోతుందని?

నా చిన్నతనంలో మాత్రం, మానసికంగా ఇంకా గత శతాబ్దాలలో జీవిస్తున్న వాళ్లంతా ఇంకో వెయ్యేళ్లదాకా ఇండియా దేశం బ్రిటిష్ వాడి ఏకచ్ఛత్రాధిపత్యం కింద ఉండి తీరుతుందన్న ధీమాతో కులాసాగా నిద్రపోతూ ఉండేవారు.

విక్టోరియా రాణీ పోయింది. సప్తమ ఎడ్వర్డు వచ్చాడు. ఆయన పోయాడు. ఐదవ జార్జి వచ్చాడు. ఆ తర్వాత అతని కొడుకు వస్తాడు. ఇలా రాజరికం నిరాఘాటంగా కొనసాగి పోతుంది. ఇదీ ఆలోచన.

వెండి రూపాయ నాణాలుండేవి. వాటిమీద విక్టోరియా ముద్ర, ఏడవ ఎడ్వర్డు ముద్ర, పంచమజార్జి ముద్ర. రూపాయికి పదహారణాలు. అణాకు నాలుగు కాణీలు, కాణీకి పన్నెండు దమ్మిడీలు.

(దమ్మిడీకి రెండు ఖోళీలు కూడా ఉండేవట. కాని వాటిని నేను చూడలేదు. పూర్ణోళీ కాణులంటూ మాత్రం ఉండేవి. ఒక్కొక్కదానికి ఒకటిన్నర దమ్మిడీ విలువ!)

చిన్నప్పుడు సంక్రాంతి రోజుల్లో భోగిపండుగనాడు నాలుగయిదేళ్ల లోపు పిల్లలకు భోగిపళ్లంటూ పోసేవారు. (ఆ సంప్రదాయం ఇప్పటికీ ఉంది) చెరుకు ముక్కలూ, రేగుపళ్లూ, సరికొత్త రాగి దమ్మిడీలూ కలిపి చిన్న పిల్లలకు మూర్ధాభిషేకం చేసేవాళ్లు. నేనలాగ ఎన్నోమార్లు దమ్మిడీల వానలో తడిశాను.

'అదృష్టవంతుణ్ణి నేను! చిన్నప్పుడే మా అమ్మ చనిపోయింది. ఎన్నో చన్నుల పాల్గుడిచాను.

ఎన్నెన్నో దమ్మిడీల వానల్లో తడిశాను. (ఇది కవిత్వంలో నా స్వీయరచన చెయ్యాలను కున్నప్పుడు చేసిన ప్రారంభం. అనంతరం 'అనంతం' వ్రాయాలన్న ఉద్దేశం ఈ అయిడియాను తుడిచేసింది).

పై కావ్యంలోనే ఒక చోట నేను కాళిదాసుకన్నా, షేక్స్పియరుకన్నా అదృష్టవంతుడినని బాహాటంగా ప్రకటించాను. అందుకు కారణం కూడా అందులోనే చెప్పాను. కాళిదాసాదుల కవిత్వం ఆస్వాదించి, ఆనందించగల స్థితిలో నేనున్నాను. పాపం, వాళ్లది మాత్రం నా కవిత్వాన్ని ఏ లవలేశమూ చవిచూడలేని దురదృష్టం!

పూర్తిచెయ్యకుండా వదిలేసిన ఎక్కడో పారేసుకున్న ఆ కవితాఖండికలో ఇంకోటి కూడా అన్నాను. 'జీవితంలోనూ, కవిత్వంలోనూ నడకకే అత్యంత ప్రాధాన్యం ఇచ్చే నేను, వీధులంట నడుచుకు పోతూ ఉంటే ఆ అడుగుల చప్పుడులో నా హృదయస్పందన ధ్వనించేది. ఎన్ని వంకరటింకర్లుగా, డొంకతిరుగుళ్లుగా నడుస్తున్నా, అందులో నా గుండెల్లోని సిస్టోలీ, డయాస్టోలీ క్రమం తప్పకుండా గానం చెయ్యడం వినబడేది'.

అందుకే నేనెప్పుడూ అంటూ ఉంటాను. 'వెనకటి కవిత్వంలో నాలుగుచక్రాల శకటాల వేగం ఉండేది. నేటి కవిత్వానిది విహాయసాలలో (విహమంటే విమానాలవేగం) రోదసిలో చీకట్లను దూసుకుపోయే రాకెట్ల వేగం!' అని.

వేగంవిషయంలోనే కాక వెలుతురువిషయంలో కూడా ఈ నా యిరవయ్యో శతాబ్దం సాధించిన విప్లవం అనిదంపూర్వమైనది. (అప్పుడే ఇది నా శతాబ్దం అనేస్తున్నాను. కాని తొలి దినాలలో నేనుకూడా గతంలో జీవించినవాణ్నే, గతకాలపు అన్ని ఒత్తిడులలోనూ సతమతమయిన వాణ్నే! ఇది నా శతాబ్దమని గుర్తించడానికి ఎంతో కాలం పట్టింది).

వ్యావసాయిక విప్లవ కాలం నుంచి పందొమ్మిదో శతాబ్దం దాకా వేగానికి అశ్వశక్తి, వెల్తురికి కొవ్వొత్తుల శక్తి కాలమానాలుగా ఉండేవి. నా చిన్నతనపు రోజుల్లో ఎంత గొప్పవాళ్ల ఇళ్లలో నయినా కిరసనాయిలు దీపాలే. పెళ్ళిళ్లూ మొదలైన ప్రత్యేక సందర్భాలలో గ్యాస్‌లైట్లు వెలిగేవి. మా ఇంట్లో హరికేన్ లాంతర్లూ, బుడ్డిదీపాలూ ఉండేవి. వీధుల్లో మున్సిపల్ దీపాలు వెలిగినప్పుడువెలిగేవి, లేనప్పుడు లేదు.

*స్వాతి అక్టోబర్ 1979*

ఆరు

నాకు పదో ఏడు వచ్చేదాకా నరవాహనం మీదనే బతికేను. అనగా ఎవరో ఒకరు నన్ను ఎత్తుకుంటూ వుండేవారు. మా లింగంమామయ్య వచ్చినప్పుడూ తన భుజంమీద ఎక్కించుకుని వూరంతా తిప్పేవాడు. అతని నల్లమందు ప్రియత్వమే అతనిగురించి నాకు జ్ఞాపకమున్న ఒకేఒక విశేషం! కునుకుపాట్లు పడుతూనే నన్ను మోసేస్తూ వుండేవాడు. "పడిపోతాను మావయ్యా" అని నేనరుస్తున్నా లెక్కచేసేవాడు కాదు. నల్లమందులో ఏం మహత్యం ఉందోమరి!

ఇవన్నీ నేనిప్పుడు రాస్తున్నానే గాని, అసలు నే పుట్టిన ఓ ఏడాది లోగా చనిపోయి వుండవలసింది. అదే మృత్యువుతో నా మొదటి పోరాటం, అది నా జీవితాఖ్యానంలో ముఖ్యమైన ఉపాఖ్యానం. ఆ కథనం ప్రారంభించడానికి ముందుగా మా శివప్రసాదరావు మామయ్య గురించి చెప్పాలి. ఎందుకంటే మొట్టమొదటిసారిగా మృత్యుముఖం నుంచి నన్ను తప్పించినవాడు అతనే కాబట్టి.

విప్పర్తివారి వీధిలోని మా ఇంటిపక్కనే వాళ్ల ఇల్లుండేది. (ఉండేదేమిటి.. ఇప్పటికీ వుంది.) మాది శ్రీరంగం వారిల్లనుకుంటే వాళ్లది ఆరాధ్యుల వారిల్లు. రెండిళ్ల మధ్యనే ఉన్న ఒక తలుపుతెరిస్తే ఒక ఇంట్లోంచి ఒకింట్లోకి ధారాళంగా రాకపోకలుసాగే వీలుంది. ఆరాధ్యుల వారి ఇంటి వీధి గోడకున్న మునిసిపల్ దీపం, ఇటో పది గజాలు అటో పది గజాల మేరకు వెలుతురు ప్రసాదించేది.

మా శివప్రసాదం మావయ్య గురించి నాకెన్నెన్నో జ్ఞాపకాలున్నాయి. *He is a typical character out of a Dicken's novel.* అతనికి తగ్గ, లేదా తగని భార్య మా సూరీడత్త. మామయ్య 3 1/2 అడుగులు, అత్త 5 అడుగులు ఎత్తు. ఒక విధంగా వాళ్లని ఆదర్శదంపతులనే అనాలి. ఎప్పుడూ సంస్కృతంలోతప్ప మరో భాషలో మాట్లాడుకునేవారు కాదు. తరుచు అదే భాషలో కొట్లాడుకోవడం కూడా కద్దు (ఇక్కడో చిన్న వివరణ అవసరం! మిగిలిన తెలుగు ప్రాంతాల సంగతి నాకు తెలియదుగాని విశాఖ జిల్లాలో మాత్రం సంస్కృతం మాట్లాడటమంటే పచ్చిబూతులు వాడడమన్న మాట). ఎటువంటి మనోనిరోధాలూ లేకుండా వాళ్లు ఆ దేవభాషలో మాట్లాడుకునేవారు, కొట్లాడుకునేవారు. ఆ దగ్గర్లో నేనుండటం చూస్తే నన్నా ఇరుపంచలా వుండనిచ్చేవారు కారు మా పెద్దలు. ఇందువల్ల నేనెంతో భాషాసంపత్తిని కోల్పోయాను.

శివప్రసాదం మామయ్య కలెక్టరాఫీసులో శిరస్తాదారుగా చేసేవాడు. ఉద్యోగపు దుస్తులు పూర్తిగా యూరోపియన్ పద్ధతి. సూటూబూటూ నెక్‌టై ఇత్యాదులు. ఎప్పుడూ స్టేట్సుమన్ పత్రిక తెప్పిస్తూండేవాడు. (అదో స్టేటస్ సింబల్ మాత్రమే. అది అతను చదువుతూండగా నేనెప్పుడూ చూళ్లేదు).

ఇంటికి రాగానే పాశ్చాత్యవేషం విప్పేసి తలపాగా చుట్టిన ఏడడుగుల జరీ గుడ్డని ఒక గోచీగా మార్చేసేవాడు. ఉదయం వేళల్లో కూడా ఇలాగే! అంటే ఇంట్లో మొలగుడ్డ, రచ్చని

తలగుడ్డ అయేది. తెల్లారగానే దంతధావన చేసి, కాఫీ తీసుకుని వీధిలోకి వచ్చే వాడు. విప్పర్తి వారి వీధి ఈ కొసనుంచి ఆ కొసకి కొలిస్తే వందగజాల లోపునే వుండేది. మామయ్య ఒక చేత్తో చుట్టలకట్ట, ఒక చేత్తో వాచీ ధరించి నగ్నసుందరంగా నాట్యం చేసేవాడు. ఎవరైనా 'చుట్ట ఇప్పించండి' అంటే తిట్టేవాడు. 'ఊదొత్తి ఇవ్వండి' అని అడగాలి. అలా అడిగిన వాళ్లకి లేదనకుండా ఇచ్చేవాడు. అలాగే, 'టైమెంతయింది?' అని అడిగితే 'రెండు పట్టుకొని ఒకటి కొడుతోంది' అనేవాడు. 'గ్రీనిచ్ ఎంతయింది?' అనడగాలి. (తర్వాత దేశంలో స్వదేశీ తత్వం వ్యాపించిన రోజుల్లో గ్రీనిచ్‌ని ఉజ్జయినిగా మార్చేడు). టైమెంతని అడక్కూడదు. ఉజ్జయిని ఎంతైందని అడగాలి.

జానపద గేయాల్లోని మాధుర్యం మా శివప్రసాదం మామయ్య ద్వారానే చవి చూశాను. రాగయుక్తంగా పాడతాడని కాదు. ఆ మాటకొస్తే సాగదీసిన వచనం లాగే వుండేది అతని కవితాగానం.

''ఆర్లీళ్ళ దర్మాన అబ్బాయి పుడితేను
తండ్రి పేరెట్టమని తాబట్టు పట్టేడు
ఈడబ్బ సొమ్మేమి నేను దిన్నానా?'' అంటూ లాగుతూ పాడేవాడు. సంగీతం తెలిసిన వాళ్లకది సంగీతం కాకపోవచ్చు. సాహిత్యం తెలుసుననుకుంటున్న వాళ్లకది సాహిత్యం కాకపోవచ్చు. కాని నాకు ఒక చెవిలో సంగీతం, మరో చెవిలో సాహిత్యం నూరిపోసిందాయనే. ఆయనే నన్ను చుట్టనిప్పుతో కాల్చి బతికించాడు. 'చిన్నపిల్లల జబ్బు' (బాలపాప చిన్నెలవి కాబోలు దీన్నంటారు)తో నేను గిలగిలలాడి పోతుంటే మా నాన్న గాభరాపడి డాక్టర్ మల్లిక్ గారి దగ్గరికి పరుగెత్తాడు. (మల్లిక్ డాక్టరుగారి గురించి తర్వాత రాస్తాను). మా నాన్న డాక్టరుగారితో తిరిగి వచ్చేసరికి నేను హాయిగా పాడలేదు గాని ఆడుతున్నానట. గండం గడిచిందని అందరూ సంతోషించారు. నేను మళ్లీ పుట్టానని కొందరు వ్యాఖ్యానించారు.

ఆనాడు మా శివప్రసాదం మామయ్య నాటువైద్యం చేసి చుట్టనిప్పుతో కాల్చినప్పటి గాయాలు మానిపోయిన తర్వాత, మానకుండా నిలిచిన మచ్చలు నా శరీరం మీద ఆరుచోట్ల ఇప్పటికీ ఉన్నాయి.

ఆ తర్వాత అనుకుంటాను, లేదా అంతకు ముందే కావచ్చు. ఒక ఫకీరు తాయెత్తొకటి, నా మెడలో కట్టేడు. రాగి తొడుగున్న ఆ రక్షరేకు మీద బంగారంతోనూ, ఒక బంగారపు గొలుసుతోనూ చాలా కాలం నా మెడలో ఉండేది. ఎట్టి పరిస్థితుల్లోనూ దాన్ని నా ఒంటిమీద నుంచి తొలగించకూడదని ఫకీరు శాసించాడట.

కాని, మా ఆర్థిక పరిస్థితులు దిగుముఖం పట్టిన దుర్దినాలలో ఒకవాడు మా నాన్న రక్షరేకును నా జబ్బకు కట్టి ఏడుస్తూ బంగారాన్ని పట్టుకుపోయి అమ్మేశాడు.

ఆ తర్వాత నేనే తీసేశానో, లేక అదే రాలిపోయిందో తెలియదుగాని ఆ తాయెత్తు ఎక్కడో పోయింది.

డాక్టర్ మల్లిక్ గారి పూర్తిపేరు డాక్టర్ చాట్రాతి మల్లికార్జునరావు *F.R.C.S.* ఆయన ఎడింబరోలోనూ, గ్లాస్గోలోనూ వైద్య విద్య అభ్యసించి వచ్చినవాడు. స్వదేశానికి వచ్చిన తర్వాత పెద్దపెద్ద సర్కారుద్యోగాలను నిరాకరించి ప్రైవేటు ప్రాక్టీసు పెట్టినవాడు. 1930లో నన్ను 63 రోజుల టైఫాయిడు జ్వరం నుంచి కాపాడిన వాడు. ఎప్పుడూ నన్ను "శ్రీనివాసా" అని పిలిచేవాడు.

*స్వాతి సెప్టెంబర్ 1979*

## ఏడు

నా గత శైశవ రాగమాలికల ప్రతిధ్వనులకై,
పోయిన బాల్యపు చెరిగిన పదముల చిహ్నాల కోసం,

వెతుక్కుంటూ జ్ఞాపకాలు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ ఇది రాసేస్తున్నాను. నా చిన్ననాటి జ్ఞాపకాలలో ఒక ముఖ్యమైనది మెట్ల మీదనుంచి దొర్లిపోతూ పడిపోవడం. అనగా అది నడవడం కూడా సరిగా తెలియని వయస్సన్న మాట.

నారాయణబాబు[1] అంటూ వుండేవాడు. ఫ్రాయిడ్[2] చెప్పింది నిజమే! కొన్నికొన్ని చిన్ననాటి అనుభవాలు మనల్ని వెంటాడుతూనే వుంటాయి! అని తన చిన్నప్పటి సంఘటన ఒకటి చెప్పేవాడు. అది చెప్పడానికిముందు కొన్ని బంధుత్వ వివరాలు.

మా నాన్నగారిని పెంచుకున్న శ్రీరంగం సూర్యనారాయణ గారి తమ్ముడు విజయ నగరంలో ఒక సంపన్న గృహస్థుడు. ఆయనకు ఒకే ఒక్క కొడుకు శ్రీరంగం సుందర నారాయణ. అనగా నాకు చిన్నాన్న. ఆయనకు ఇద్దరే ఇద్దరు కొడుకులు, అప్పదు పంతులూ, నారాయణబాబూ. నేను అప్పదు పంతుల్ని పెద్దన్నయ్యా అని, నారాయణ బాబుని చిన్నన్నయ్యా అని పిలుస్తూండేవాణ్ణి. తర్వాత చాలాకాలానికి నారాయణబాబు నన్ను ఒరే శ్రీశ్రీ అనీ, నేను నారాయణబాబుని ఒరే నారాయణబాబూ అనీ పిలుచుకునేవాళ్లం.

ఒకసారి నారాయణబాబుని అప్పదు పంతులు, ఇంట్లోబీరువాలోని అరలో బంధించి తలుపు మూసివేశాడట. ఈ సంగతి చెబుతూ నారాయణబాబు 'ఆ చిన్నప్పటి చీకటి నన్నెప్పుడూ వెంటాడుతూనే వుంది' అనేవాడు. నేను మెట్లమీంచి దొర్లిపోవడం సంఘటన కూడా ఇలాంటిదే. అయితే అది మరీ చిన్నతనంలో జరిగింది. కాబట్టి ఎప్పుడేనా అది జ్ఞాపకం వస్తే నాకేమీ భయం కలిగేది కాదు.

నా మూడవ లేక నాలుగవ పుట్టిన రోజున నన్నొక తేలు కుట్టింది. ఎర్ర తేలు. ఎడం చేతి చిటికెనవ్రేలి మీద! అన్ని వివరాలు జ్ఞాపకమున్నప్పటికీ ఈ సంఘటన కూడా నాకు భయం కలిగించలేదు. కారణం ఏమిటంటే తేలుకుట్టిన కొన్ని క్షణాలలోనే ఆ బాధంతా పోయింది. నన్నెత్తుకుని ఆడించే అప్పలస్వామి నా వేలిని నోటిలో పెట్టుకుని విషమంతా పీల్చి ఉమ్మేశాడు.

*1. శ్రీరంగం నారాయణబాబుగారి (1906–1962) 'రుధిరజ్యోతి' ఖండకావ్యం 1972లో వెలువడింది.*
*2. సిగ్మండ్ ఫ్రాయిడ్ (1856–1939) సైకో ఎనాలసిస్ సిద్ధాంతకర్త. మనంచేసే ప్రతిపనికీ ఏదో ఒక ప్రేరణ ఉంటుందని, మన ఆలోచనలకే ఎక్కువగా సెక్సుప్రేరణ ఉంటుందని చెప్పాడు.*

తేలువిషంగాని, పాములవిషంగాని రక్తంలోకి వ్యాపిస్తుంది. అలా జరగక ముందే మా అప్పలస్వామి నన్ను కాపాడాడు. అప్పటిలో వాడి వయస్సు ఏ పది పన్నెండేళ్లో ఉంటుంది. ఆ కుర్రాడి సమయస్ఫూర్తి నన్ను రక్షించింది.

ఆ తర్వాత కొన్ని సంవత్సరాలకి అప్పలస్వామి మా ఇంట్లో నౌకరీ మానేశాడు. తనకి కానిస్టేబుల్ ఉద్యోగం దొరికిందన్నాడు. అదే ఆఖరిసారి నేనతణ్ణి చూడటం.

భాగవతుల వెంకటరత్నంగారు నాకు మాతామహుడు. వెంకటరత్నం అంటే ఎవరికీ తెలియదు. ఆయన్ని 'అందరూ 'అమ్మోరయ్యోరు'గా ఎరుగుదురు. అమ్మవారి గుడిలో ఆయన పూజలు చేయిస్తూ ఉండేవారు.

ఆయనకొక కొడుకూ, ముగ్గురు కూతుళ్లూ. నేను పెద్దకూతురి కొడుకును.

నా మేనమామ కృష్ణయ్యపంతులు గారు ఆ రోజుల్లో కెనడాదేశపు సన్‌లైఫ్ ఇన్సూరెన్స్ కంపెనీ ఏజెంటుగా పని చేసేవారు. ఎన్ని జీవితాలను భీమా చేశారో తెలియదుగాని వారికున్న మూడిళ్లలోనూ ఒకదాన్ని ఆఫీసు ఇల్లు అనేవారు. మూడిళ్లూ దగ్గరదగ్గరనే ఉండేవి. ఒక ఇంట్లో ఎప్పుడూ ఎవరో అద్దెకు ఉండేవారు. (కొంతకాలం ఆ ఇంట్లో చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి సోదరి అద్దెకుండేది) మూడో ఇంటిలో (ఇది ఆఫీసు ఇంటికి ఎదురుగా ఉండేది) నా బాల్యం చాలా మట్టుకు గడిచింది. ఈ ఇంటి డాబా మెట్లనించే నేను దొర్లిపోతూ ఉండేవాడిని.

విశాఖపట్టణంలో అందరూ నన్ను బాబాయి అని పిలిచేవారు. మా ప్రాంతంలో ఆ మాటకి కుర్రవాడని అర్థం. గోదావరిజిల్లా మొదలు ఇతర ప్రాంతాలలో ఆ మాటను పినతండ్రి అనే అర్థంలో వాడుతూ ఉంటారు. మా బంధువులకి నేను పెద్ద బాబాయి. ఎంచేతనంటే క్రిష్ణయ్యపంతులుగారి మూడవ చెల్లెలు మా అచ్చమ్మపిన్ని కొడుకుని చిన్న బాబాయి అనేవారు.

మా నాన్న నన్ను బాబా అని పిలిచేవారు. నేను మా నాన్నని బాబా అని పిలిచేవాణ్ణి. (ఇప్పటికీ డైరెక్టర్ తిలక్ నన్ను గురూ అని పిలుస్తూ ఉంటాడు. నేను కూడా అతన్ని గురూ అనే పిలుస్తూ ఉంటాను. డైరెక్టర్ ప్రొడ్యూసరు విశ్వేశ్వరరావును నేను బాస్- అని పిలుస్తూ ఉంటాను. నన్నాయన కూడా బాస్ అనే పిలుస్తూ ఉంటారు.)

కృష్ణయ్య పంతులుగారి పెద్దకొడుకు పేరు భాగవతుల నరసింగరావు. (ఈయన ఆరుద్ర తండ్రి) రెండో కొడుకు పేరు భాగవతుల వెంకటరావు. వీళ్లిద్దరినీ నేను వరుసగా పెద్దబావ, చిన్నబావ అని పిలుస్తుండేవాణ్ణి.

మా పెద్దబావ డెబ్బయ్యేళ్లకుపైన జీవించి చనిపోయాడు. చిన్నబావ నలభై ఏళ్లలోపునే (రెండో ప్రపంచ యుద్ధపు ముగింపు రోజుల్లో అనుకుంటాను) మరణించాడు.

మా చిన్నబావ చిత్రమైన మనిషి. ఎప్పుడు, ఎందుకు, ఏ పని చేస్తాడో తెలియదు. చిన్నతనంలో వాడూ శ్రీపతి భద్రయ్యపంతులు (విశాఖ సంపన్న గృహస్థులలో ఒకరు) గారి కొడుకూ ఇళ్లలోంచి కొన్ని వందల రూపాయలు దొంగిలించి పట్టుకుపోయారు. సొంతానికి

వాడుకోవడానికి కాదు. ఆ డబ్బుతో వాచీలూ, రిస్టు వాచీలూ కొన్నారట. వాటన్నిటినీ రైలు పట్టాలమీద పెట్టి రైలుబండి వెళ్లిపోయే దాకా కాచుకుని కూర్చున్నారట.

తర్వాత ఏం జరిగిందీ, మన కనవసరం. రెండురోజులు కనబడకుండా పోయిన పిల్లలిద్దరూ సురక్షితంగా ఇళ్లు చేరినందుకు వాళ్లవాళ్ల తల్లిదండ్రులు ఎంతగానో సంతోషించారని మాత్రం చెప్పుకుంటే చాలు.

మా చినబావకి చిన్నప్పటి నుంచీ నాటకాల సరదా మెండు. ఒక్క నాటకంలోనూ వేషం వెయ్యకుండా ఎన్నో నాటకాలాడించాడు. అందరూ వాడిని జమీందారు అని పిలిచేవారు. అందుకు కారణం లేకపోలేదు. వాడు 'భాగవతుల జమీందారీ'కి వారసుడు. నిజంగానే లటువ ంటి జమీందారీ వుండేది. అయితే అది మా మాతామహుల కాలం నాటికే నామరూపాలు కోల్పోయిందనేది వేరేసంగతి.

మా చినబావ ఈ నాటకాల సందర్భంలో వాల్తేరునుంచి మద్రాసుదాకా కలకత్తా మెయిలు మీద అటూ ఇటూ తరచుగా ప్రయాణాలు చేసేవాడు. ఎప్పుడూ టిక్కెట్టు కొని రైలుబండి ఎక్కలేదని సగర్వంగా చెప్పుకొనేవాడు.

ఒకమారు వాడిని పవరుపేటలో ఒక టిక్కెట్టుకలెక్టరు బండినుంచి దింపేశాడట. వెంటనే మా చినబావ ఊళ్లోకిపోయి పరుగెత్తుకుంటూ ఏలూరు స్టేషను చేరుకుని అదే రైలును మళ్లీ అందుకున్నాడట.

అవి మండపాక కొండలరావుగారు మాజిక్కులుచేసే రోజులు. (ఈయనే గురజాడ వారి గిరీశానికి నమూనా అని అనుకునేవారు) ఈయన దగ్గర మా చినబావ మెస్మరిజం నేర్చుకున్నాడో లేదో తెలియదుగాని నన్ను కొన్ని సాయంకాలాలు సముద్రపుటొడ్డుకు తీసుకు పోయి అరగంటసేపు, గంటసేపు నన్ను ఇసుకలో నిలబెట్టి నా మీద తన మెస్మరిజం చర్య ప్రయోగించేవాడు. అది పారేది కాదు. ఇంకా కొంతసాధన అవసరమని సరిపెట్టుకునేవాడు!

మా చినబావ అప్పుడప్పుడు చేసే మరో మ్యాజిక్ నాకు బాగా జ్ఞాపకం ఉంది. 'అణాడబ్బులు తే!', ఇద్దరికీ ఉప్మాతోసహా టీ వస్తుందనే వాడు. నేను తెచ్చిన డబ్బులతో ఇంట్లోలేని వస్తువులు కొని, వాటితో ఉన్న వస్తువు కలిపి అన్న ప్రకారం ఉప్మా, టీ సిద్ధం చేసేవాడు. ఇద్దరమూ ఉప్మా భుజించి టీ సేవించేవాళ్లం.

నా చిన్నప్పటి బంధువులలో కాసిగాడు, కీయప్ప అని ఇద్దరుండేవారు. వృత్తిరీత్యా శవ వాహకులు. అయితే బ్రాహ్మణ శవాలను మాత్రమే మోసేవారు. వీరిద్దరిలో కాసిగాడి పేరు. వినడమే గాని నేనెప్పుడూ అతణ్ణి చూడలేదు. నేను కళ్ళు తెరవక ముందే అతడు కన్ను మూయడమే ఇందుకు కారణం. అయినా వారిద్దరి పేర్లూ జంటకవుల పేర్లలాగే కలిసి మెలసి లోకుల రసనల మీద మసలుతూ ఉండేవి. తిరుపతికవి చిన్నతనంలోనే మరణించినా మనమెప్పుడూ శతావధానాల గురించి చెప్పుకోవలసి వస్తే తిరుపతి వెంకటేశ్వర కవులనే అంటూ ఉంటాముకదా! పైగా శతావధానం వల్ల పురుషార్థం మాత్రమే సిద్ధిస్తుందికాని శవ

వాహనం పుణ్యదాయకమని మన హిందూ మతం విశ్వసించమంటుంది.

మనది శకునాల మీద నమ్మకమున్న జాతి కాబట్టి, తెల్లారగట్టే కీయప్ప కనబడితే అంతా జడుసుకునేవాళ్ళు. కన్యాశుల్కంలోని బైరాగిలాగ కీయప్ప ఎప్పుడూ యోగసమాధిలోనే ఉండేవాడు. అది తెల్లవాడి హయాం కాబట్టి మద్యనిషేధమన్న మాటే వినబడేది కాదు. అయితే సమాజంలోని ఉన్నతవర్గాల వారు సీమసారా స్వీకరిస్తూ వుంటే దిగువవర్గాల వారు నాటుసారా తీసుకునేవారు.

మా తాతయ్య (మాతామహుడు, భాగవతులు వెంకటరత్నంగారు) చనిపోతే ఆయన శవాన్ని మొయ్యడానికి వచ్చినవారిలో కీయప్ప ఒకడు. ఎందువల్లనో అతణ్ణి చూస్తే నాకేమీ భయమనిపించలేదు. పైగా నవ్వొచ్చింది. ఎంచేతనంటే ఆఫీసు ఇంట్లో మా తాతగారి శవం మీద ఆపాదమస్తకంగా గులాబిరేకులు ముమ్మరంగా జల్లి ఉన్నాయి. బ్రాహ్మణులు మంత్ర పఠనం చేస్తున్నారు. కీయప్ప గుప్పిళ్లతో గులాబిరేకులు తీసుకుని 'తాతగారి ప్రసాదం' అంటూ తింటూవుంటే అది నవ్వకూడని సమయమైనా నవ్వొచ్చింది.

నా చిన్నతనంలో నేను చూడటానికి వీలుండికూడా చూడలేక పోయానే అని చింతించవలసిన వాటిలో ముఖ్యమైనది తిరుపతి వెంకటకవుల శతావధానము, ఆదిభట్ల నారాయణదాసు హరికథా కాలక్షేపమూ. అయితే అందుకొక చిన్న ఉపశమనం ఏమిటంటే ఒకే ఒక్కసారి అయినా కోడిరామమూర్తి సర్కస్ ప్రదర్శనం చూడగలగడం. ఒక విధంగా ఆలోచిస్తే ఆ రోజుల్లో శతావధానాలకీ హరికథా కాలక్షేపాలకీ మించిన ప్రజాదరణ కోడి రామమూర్తిగారి సర్కస్ ప్రదర్శనల కుండేది. పైగా అవి మన దేశంలోనే గాక విదేశాలలో కూడా ప్రదర్శిత మైనాయి. మా అప్పలస్వామిని సాయమిచ్చి మా నాన్న నన్ను సర్కస్ ప్రదర్శనకి పంపించాడు. నా సంతోషానికి మేరలేదు. ఆ రోజు ఆఖరి ప్రదర్శనం. రోజంతా వాన కురుస్తోంది. వాన కురిసినా సర్కస్ ప్రదర్శన ఆపబడదన్న హామీ ఉన్నప్పటికీ ఏమో ఏం చెప్పగలం?

ఏమయితేనేం ఆంధ్ర వీరకంఠీరవ కోడి రామమూర్తి ఛాతీమీదుగా ఏనుగు నడుచుకు పోయిన దృశ్యాన్ని చూడగలిగాను.

అప్పలస్వామి నన్నెత్తుకున్నాడు. (కొంత దూరం నడిపించాడు) కాని వానలో తడుసుకుంటూనే ఇల్లు చేరుకున్నాము.

స్వాతి జనవరి *1980*

## ఎనిమిది

కొంతకాలం క్రిందట అజ్ఞాతవాసంలో వున్న ఒక రాజకీయవాది కూతురికి నేనో ఆదర్శ వివాహం జరిపించాను. అది రాయలసీమలో ఒక పల్లెటూరు. ఒక వంద మంది కూర్చోడానికి సహాయవసతి లేని ఊరు. (ఒక్క దేవుడిగుడి మినహా). ఆ దేవాలయంలోనే ఈ పెళ్లి జరిగింది. వందమందికి పైగానే జనం వచ్చారు. వివాహానంతరం వాళ్లనుద్దేశించి పది నిమిషాల పాటు

మాట్లాడాను. దాని సారాంశం: 'వివాహాలకు ఏ దేవుడి సాక్ష్యమూ అక్కరలేదు. ఆఖరికి మనం అందరూ కూడా అనవసరమే. ఒక పెళ్లికి ఇద్దరే ఇద్దరు కావాలి- పెళ్లికొడుకూ, పెళ్లి కూతురూ!'

1925లో నా వయసు 15 సంవత్సరాలు. నాకు ఉద్దేశించిన అమ్మాయి వయస్సు తొమ్మిది. అవి బాల్య వివాహపు రోజులు. 'ఈ పిల్లను పెళ్లాడుతావా?' అని మా నాన్న అడిగితే 'సరే' అన్నాను. 'దీన్ని పెళ్లాడొద్దు' అని మా అమ్మమ్మ అంటే దానికీ 'అలాగే' అన్నాను.

మర్నాడు పెళ్లి. మా నాన్న ఉత్త వెర్రిబాగులవాడు. నన్ను పెళ్లికొడుకును చేసి ఉదయం పంపిస్తానంటే మా అమ్మమ్మగారింట్లో ఉండనిచ్చారు నన్ను. ఆ ఇంటికీ మా ఇంటికీ మధ్య రెండు మూడు వందల గజాలు మాత్రమే దూరం.

ఆ సాయంత్రానికి సాయంత్రం మా అమ్మమ్మ నన్ను విశాఖపట్టణానికి సుదూరంలో వున్న బారువా గ్రామానికి మా పెద్దబావ (ఆరుద్ర నాన్న)ను తోడిచ్చి పంపించివేసింది. ప్యాసింజరులో ప్రయాణం (బారువా మెయిలు ఆగే స్టేషన్ కాదు). నన్ను బారువాలో ఒక సెట్టి బలిజల ఇంట్లో వదిలిపెట్టి భాగవతుల నరసింగరావు (వయస్సు 25) తరువాతి ట్రైన్‌లో విశాఖపట్నం వెళ్లిపోయాడు.

ఆ విధంగా మరునాడు జరుగవలసిన నా పెళ్లికి నేను వెళ్లకపోవడం సంభవించింది.

ఆ రోజురోజంతా విశాఖపట్నం స్తంభించిపోయింది (అని చెప్పగా విన్నాను). మా నాన్న ఆత్మహత్య చేసుకుంటానన్నాడట. పెళ్లికూతురు నన్ను తప్ప మరెవ్వరినీ పెళ్లి చేసుకో నన్నదట. మా చిన్నాన్న (పోలీసు సబ్ ఇన్స్‌పెక్టర్ పూడిపెద్ది సోమనాధంగారు) ఊరంతటినీ గడగడలాడించేశారట. ఫలితం నన్ను వెంటనే పంపించివెయ్యవలసిందిగా బారువాకు టెలిగ్రాం.

బారువాలో నేను ఒక్కరోజు మాత్రం ఉన్నాను. అత్తెసరు పెట్టి అన్నం వండుకుని అప్పడం కాల్చుకుని తిన్నాను. రాత్రి బండిలో టిక్కెట్టు కొనిపెట్టి కూర్చోపెట్టాడు. (అతని పేరేమిటో మరిచిపోయాను). మర్నాడు తొమ్మిదికో, పదికో విశాఖపట్టణం రైలు స్టేషన్‌లో దిగాను. (ఇప్పుడా స్టేషన్ లేదు. వాల్తేరు స్టేషనే విశాఖస్టేషన్, ఇప్పుడు 1976లో)

మా నాన్న అసలు పేరు పూడిపెద్ది వెంకట రమణయ్య. శ్రీరంగం సూర్యనారాయణ గారి దత్తపుత్రుడుగా ఇంటిపేరు మారింది. మా నాన్నా, చిన్నాన్న కవలపిల్లలు కాదు గాని మూడుమూర్తులా ఒకేలాగ ఉంటారు. అందుకే సోమనాధంగారిని నేను 'ఇంకో నాన్నా' అని పిలుస్తూ వుండేవాణ్ణి. ఆయన పిల్లలు మా నాన్నని 'ఇంకో నాన్నా' అనే వారు!

పెళ్లికూతురి పేరు మూలా వెంకట రమణమ్మ. రాత్రికి రాత్రి మమ్మల్ని భీమునిపట్నం తరలించి, మరునాడు విజయనగరం సమీపంలోని రామతీర్థాల కొండమీద ఏకరాత్రివివాహం జరిపించారు మా పెద్దలు.

శ్రీరంగం వెంకటరమణమ్మ ( నాకష్టసుఖాల భాగస్వామినిగా) నాతో యాభై సంవ

త్సరాలు కాపురం చేసింది. రెండుమూడు కడుపులు పోయాయి. ఒకమ్మాయిని ఆసుపత్రినుంచి తెచ్చి పెంచుకున్నాము. ఉప్మా చెయ్యడం ఢిల్లీలో నా పెద్దపెళ్లామే నేర్పింది. ఆవిడ చనిపోయిన రాత్రి నేను చిత్తుగా తాగేసి సహగమనం చేస్తానంటూ అరిచేను.

పెళ్లికి ఒకటి రెండు నెలల క్రిందట నా మొదటి నవలిక 'పరిణయ రహస్యం' అచ్చు వేయించాను మా నాన్న డబ్బివ్వగా.

*ప్రజాతంత్ర 26-12-1976*

*కవి ధరించవలసినది కలమా? ఖడ్గమా? అనే ప్రశ్నకు కలమే అని జవాబివ్వడం చాలా సులభం. కాని ప్రతిజాతి జీవితంలోనూ ఒక్కొక్క పరీక్షాసమయం వస్తుంది. అప్పుడు కవి అన్నవాడు కలం పారేసి కత్తిని ధరించవలసిందే.*

*శ్రీశ్రీ, 1.8.1976*

# విశాఖపట్నం జ్ఞాపకాలు

విశాఖపట్టణం ఎప్పుడు పుట్టిందో నాకు తెలియదుగాని విశాఖపట్టణంలో 1910వ సంవత్సరంలో నేను జన్మించాను. అప్పటినుంచీ నేనూ విశాఖపట్టణమూ కలిసే పెరుగుతూ వచ్చాము. మొన్న 'జల-ఉష'[1] (ఏం వికారపు పేరు!) సముద్ర ప్రవేశం చేసినప్పుడు నేను విశాఖపట్టణంలో లేనుగాని ఆరోజు నేనుకూడా ఆధ్యాత్మికంగా ఒక సముద్ర ప్రారంభం చేశాను.

ఇది నిజం! నా కవిత్వానికి సముద్రమే ఆవేశం. సమీపంలో సముద్రంలేని స్థలం నన్ను చంపేస్తుంది. ఢిల్లీలోనూ, లక్నోలోనూ ఎన్నో నెలలు నేను జీవించాను. కాని ఒక్క గీతం కూడా ఊదలేకపోయాను. రోజూ వెళ్లకపోయినా దగ్గరలో మహాసముద్రం ఉందంటే చాలు, ఖర్చు పెట్టకపోయినా బ్యాంకులో పదివేలు పద్దున్నవాడికెంత ధైర్యం!

మిత్రుడు పాలూరి సీతాపతిరావు[2]ని పెళ్లానికి విషంపెట్టి చంపినందుకు సెంట్రల్ జైలులో ఉరితీశారు. ఆఖరుకోరికగా ఒక సిజరు సిగరెట్టు అడిగి తెప్పించుకుని కాల్చి ''ఇక మీ పని కానివ్వండ''న్నాడట అతను. కొన్ని వందల గ్రంథాలు చదివినా కలగని అనుభవాన్ని ఈ సన్నివేశం విన్న క్షణంలో సంపాదించాను.

నా విశాఖ సంస్మృతుల ప్రధానరసం బీభత్సమే అని ఒప్పుకుంటాను. కాని అభౌమమైన మహదానందం అనుభవించిన క్షణాలు కూడా అనేకం ఉన్నాయి. రాళ్లతోటలో కొన్ని చలికాలపు ప్రాతఃకాలాలు కుసుమించిన గులాబిమొక్కల మధ్య గడిచిపోయాయి. యారాడకొండమీద ఒంటరిగా నిలబడి ఒక్కొక్కరోజు ఒక్కొక్కరకపు విశాఖపట్టణాన్ని చూశాను.

ఎప్పటికైనా నేనొక పదిహేనాశ్వాసాల మహాకావ్యం రాస్తాను. దానిపేరు విశాఖపట్టణం.

*నవోదయ వారపత్రిక 2–5–1948*
*పునర్ముద్రణ: శ్రీశ్రీ సాహిత్యం రెండు వచన విభాగం*
*ప్రజాతంత్ర 25–5–1975*

1 *విశాఖపట్టణంలోని భారత నౌకానిర్మాణకేంద్రం నిర్మించిన మొట్టమొదటి ఓడ జలఉష 14–3–1948వ జలప్రవేశం చేసింది.*

2 *పాలూరి సీతాపతిరావు తాసిల్దారుగారబ్బాయి. మెడికల్ విద్యార్థి.L.M.P. మూడోఏడు చదువుతున్నాడు. అన్నంలో పొటాషియం సైనేడ్ కలిపి భార్యను చంపాడు. 1928లో ఉరిశిక్షవిధించి, 1931లో ఉరితీశారు.*

# సినిమా సరదాలు

## ఒకటి

నా సినీమా సరదాలు చిన్నప్పుడే, అనగా పది పన్నెండేళ్ళ వయస్సులో ప్రారంభం అయాయి. ఆ రోజుల్లో విశాఖపట్టణం లైటుహౌసుదగ్గర ఒక గుడారంలో జోస్ ఎలెక్ట్రిక్ బయస్కోప్ అనే కంపెనీ ఆడుతూ ఉండేది. కుర్చీ, బెంచీ, నేల అనే తరతమభేదాలు లేవక్కడ. అణా టిక్కెట్టు తీసుకుంటే ఎక్కడైనా కూర్చోవచ్చు, ఇసుకలో! చీకట్లో తెరమీద బొమ్మలు కదుల్తూవుంటే, దానికనుగుణ్యంగా ఏదో ఒక మూలనుంచి వాద్యసంగీతం (తరుచూ హార్మోనియం నుంచి) వినిపిస్తూ ఉంటే మా పిల్లలకిది చాలా సరదా అనిపించేది. అప్పటికింకా అది పెద్దలకళగాని, వ్యాపారంగాని కాలేదు. చూసేది చిన్నపిల్లలు, చేసేది చిన్నతరహావ్యాపారం. ఆ రోజుల్లో సినీమా అనే మాటకూడా చలామణీలోకి రాలేదు. మేం బయస్కోపు చూసేవాళ్ళంగాని, సినీమాకు వెళ్ళేవాళ్ళం కాము.

త్వరలోనే మేం బజారుభట్టు, మాస్టర్ విఠల్, జుబేదా, సులోచనా, ఎర్మిలైన్ మొదలైన తారల్ని గుర్తించడం నేర్చుకున్నాము. అప్పుడు *Maciste* అనే ఒక ఇటాలియన్ హీరో చిత్రం ఒకటి (భాష లేదు, మూకీచిత్రం కదా!) వచ్చింది. మా నాన్నగారు ఆ వూళ్ళోని ఒకే ఒక కాలేజీలో హెడ్మాస్టరు కాబట్టి ఆయనకొక కాంప్లిమెంటరీ టిక్కెట్టు వచ్చింది. అప్పటికప్పుడే లైట్‌హౌసువద్ద పెర్మనెంటు థియేటరూ, రిజర్వుడు, కుర్చీ, బెంచీ, నేల తరగతులు వెలిశాయి. రిజర్వుడు క్లాసులో కూర్చున్నాను. నాకేమీ కనబడలేదు. చిన్నప్పటినుంచీ నాది షార్టుసైటు. బి.యే. రెండోయేట ప్రవేశించేదాకా కళ్ళజోళ్లు లేవు.

కొంచెంసేపు చూశాక కుర్చీకి మారేను. అంతా మసకగానే ఉంది. బెంచీకి మారేను. లాభంలేదు. నేలమీద కూర్చుంటే అప్పుడు కొసదాకా పిక్చరు చూడడానికి వీలయింది. సగం కథ పోతేనేం. *Maciste* సాహసకృత్యాలు కథతో సంబంధం లేకపోయినా ఆస్వాదించవచ్చు.

సుమారు 40 ఏళ్ళతర్వాత, మద్రాసులో మొదటి అఖిలభారత చలనచిత్రోత్సవం సందర్భంలో బైసికిల్ దొంగలు *Roma Citta-Aperta* వంటి ఇటాలియన్ భాషాచిత్రాలు చూశాక, ఇటాలియన్ సినీమాగురించి ఇంకా తెలుసుకుందామనే జిజ్ఞాసతో హిగ్గిన్‌బాదమ్స్‌కి వెళ్ళి *'The Italian Cinema'* అనే పుస్తకం కొని చదివేను. ఇందులో మళ్ళీ మచిస్టీ తారసపడ్డాడు.

*"Then for the character called Maciste in d' Annunzio's script Pastrone needed a large man, almost a giant, of exceptional strenth, Pastrone spent*

*months looking for a man suitable for this part, he interviewed by the hundred, wrestlers from Paris, fire men from Milan, and Porters from Trieste. Finally he found him; he was a docker at Genoa called Bartolomeo Pagano, herculean in stature and with an enormous grin. He could barely read and write, but that was unimportant. Pastrone signed him up, and in so doing made the fortune of the man who was to become one of Italy's most popular actors."*

హాలీవుడ్ అనే పేరుకూడా ప్రపంచానికి తెలియని 1912లో *Giovanni Pastrone* అనే ప్రొడ్యూసరు - డైరెక్టరు *Cabiria* అనే చిత్రంలో నటించడానికి బుక్‌చేసిన *Pagano* అనే హార్బరు కార్మికుడు మెచిస్టీగా విశాఖపట్టణంలో తెరమీద కనిపించాడు. (అయితే CABIRIA అనే చిత్రంలోకాదు) మెచిస్టీ చిత్రాలప్పుడు ప్రపంచమంతా ఆడుతుండేవి.

అతనిగురించి మరికొన్ని విశేషాలు:

*Maciste, who never used his own name again, had been earning 12 lire (19 Shillings)a day as a docker; Pastrone offered him 20, and that was enough to decide Maciste. It is doubtful if, at that time, the giant ever imagined that in a few years he would be earning the fabulous sum of 750,000 lire (97,000 Shillings) a year. When the Italian industry reached the depths of its slump a few years later, Maciste was one of the last actors to be paid off. The ending is atleast a happy one, for Maciste, like the good Genoese that he was - the genoese are always called the scots of Italy - had saved his money and invested it sensibly. He retired into private life to enjoy the riches that fortune had dropped into his lap.*

షెల్లీబైరన్‌లతో సరిపోల్చదగిన ఇటాలియన్ మహాకవి *d'Annunzio* సినిమా స్క్రిప్టులూ, సబ్‌టైటిల్సూ రాసేవాడని ఆ పుస్తకం చదివేక తెలిసింది.

లైట్‌హౌస్ సినిమాలో చాలా మూకీచిత్రాలు చూశాను, ఎప్పుడూ నేలమీదనే కూర్చునే వాణ్ణి. కారణం చెప్పేను కదూ! నాతోబాటు పురిపండా కూడా నేలటిక్కెట్టే తీసుకునేవాడు. కథలో లీనమైపోయి నన్ను పొడిచేస్తూ చరిచేస్తూ ఉండేవాడు. "మనం తెరమీద నీడల్ని మాత్రమే చూస్తున్నా"మని అప్పుడప్పుడతనికి జ్ఞాపకం చెయ్యవలసి వచ్చేది.

మచిస్టీ సంగతి వచ్చినప్పుడు మరో ముఖ్యమైన విషయం కూడా ఇక్కడ ఉల్లేఖించాలి. *"Maciste was, ofcourse, the real forerunner of Tarzan. The formula was simple in the extreme. Maciste was always a very good, very strong man, who was confronted by the most frightful of physical dangers which he overcame entirely by the use of his great physical strength. The very titles of his films as so often, tell one exactly what they were like : Maciste contro la Morte* (మృత్యువుతో మచిస్టీ) *Maciste all Inferno* (నరకంలో మచిస్టీ), *Maciste nella gabbia dei Leoni* (సింహాలగుహలో మచిస్టీ).

ఇప్పుడు సరిగా జ్ఞాపకంలేదుగాని నేను చూసిన చిత్రం *Maciste among the*

*skyscrapers* అనుకుంటాను. ఎందుకంటే ఈ దీర్ఘకాయుడు ఇరవై ముప్ఫయ్ అంతస్తుల భవనాలను (గోడల మీదుగా) ఎక్కిపోయే దృశ్యం నా స్మృతిపథం నుండి తొలగిపోలేదు. ఈనాటి *space-walkers* లాగ మచిస్టీ గాలిలో తేలిపోవడం కూడా చూశాను.

*ప్రజాతంత్ర 10–8–1975*

## రెండు

ఒకమారు విశ్వనాథ సత్యనారాయణగారు[1] విశాఖపట్టణం వచ్చారు. అప్పుడే కొత్తగా ప్లీడరీ ప్రాక్టీసు పెట్టిన మిత్రుడు కాళూరి నరసింగరావు[2] తన ఇంటికి విశ్వనాథవారిని భోజనానికి పిలిచాడు. కాళూరికీ నాకూ ఆరాధ్యదైవమైన విశ్వనాథని చూడడం అదే మొదటిసారి అనుకుంటాను. భోజనానంతరం సినిమాల ప్రస్తావన వచ్చింది. ''ఈ బయస్కోపులంటే నాకు ఇష్టంలేదు'' అని సత్యనారాయణగారు మమ్మల్ని చాలా నిరుత్సాహపరిచారు. చలనచిత్రాలలో కూడా కళ ఉండవచ్చునని ఎలా వారికి నచ్చచెప్పాలో నాకు తోచడంలేదు. గడుసువాడు కాబట్టి కాళూరి, ''సత్యనారాయణగారూ, మీరు చూసేది బయస్కోపు కాదు, *BIAS*- స్కోపు'' అన్నాడు.

తర్వాత చాలాకాలానికి లండన్‌లో గాంధీగారిని చార్లీచాప్లిన్[3] చూసినప్పుడు చలనచిత్రాలను తూలనాడుతూ గాంధీగారు మాట్లాడబోతే, చాప్లిన్ కాస్తగట్టిగానే ఇచ్చుకున్నాడు. తానే ప్రపంచప్రసిద్ధుడయిన వ్యక్తి అయినట్లుగా గాంధీగారు చాప్లిన్ పేరే వినలేదనీ, అసలు సినిమా ఎలా ఉంటుందో తన కనవసరమనీ, అయినా ఈ యంత్రనాగరికత అంటేనే తనకు పరమ అసహ్యమనీ ఆ అంగవస్త్రధారి మాట్లాడితే చాప్లిన్ తనకు కూడా ప్రపంచపు మారుమూలల్లో సహా కాస్త పేరుందనీ, ప్రపంచ ప్రజలందర్నీ ఏకం చెయ్యగల ఒకే భాష మూకీ చిత్రం మాట్లాడుతుందనీ, ఇంతకీ గాంధీగారు మెచ్చుకొనే రాట్నం కూడా ఒక యంత్రమే అనీ, మనం తిట్టవలసింది యంత్రాలనికాక వాటిని సాటిమానవుణ్ని దోచుకునే సాధనాలుగా ఉపయోగించే మానవుల్నే అనీ, ఇలా యెడాపెడా వాయించాడు. ఈ కమ్యూనిస్టుతో వాదించి లాభంలేదనుకున్నాడో యేమో అక్కడితో గాంధీగారు మౌనంలోకి నిష్క్రమించారు.

మానవసమాజాన్ని ఎంతో ప్రభావితం చెయ్యగల సినిమా ఇప్పటికీ నాకో సరదాగానే మిగిలింది. కాకపోతే నాకూ నా వాళ్ళకీ కూడా గుడ్డా పెట్టే సాధనంగా పనికొస్తోంది. నాకున్న

*1.విశ్వనాథ సత్యనారాయణ (1895–1976) గారు కవి, పండితుడు, విమర్శకుడు, నవలా కారుడు, నాటకకర్త. వేయిపడగలు చాలా పెద్దనవల. కిన్నెరసాని పాటలు బాగా పేరుపొందాయి. వీరి రామాయణ కల్పవృక్షానికి 1971లో జ్ఞానపీఠ అవార్డు (లక్ష రూపాయలు) లభించింది.*

*2.కాళూరి వెంకట నరసింగరావుగారు మంచి సంప్రదాయకవి. కవితాసమితి వ్యవస్థాపకుల్లో ఒకరు. శ్రీశ్రీ ప్రియమిత్రుడు. శ్రీశ్రీ మద్రాసులో బి.ఎ చదివేప్పుడు నరసింగరావుగారు లా చదివేవాడు. ఇద్దరూ కవితా వ్యాసంగంలో మునిగితేలేవారు. 'అవలీదళాలు', 'అన్వేషణ' అనే రెండు ఖండకావ్యాలు 1965లో వెలువడ్డాయి. ప్రస్తుతం విశాఖపట్టణంలో ప్లీడరు వృత్తిలో ఉన్నారు.*

*3.చార్లీచాప్లిన్ (1889–1977) ప్రపంచప్రసిద్ధ సినిమా నిర్మాత, దర్శకుడు, నటుడు. పదునైన హాస్యం ద్వారా సామాజిక వ్యవస్థను ఎండగట్టాడు. కమ్యూనిస్టని అమెరికానుంచి వెళ్ళగొట్టేశారు.*

*మాన్స్యూర వెర్దూ, మోడరన్ టైమ్స్, గ్రేట్ డిక్టేటర్ మొదలైన చిత్రాలు నిర్మించాడు.*

ఇన్ని సంవత్సరాల సినీమా అనుభవంతోనూ లవలేశమైనా సామాజిక ప్రయోజనం సాధించలేకపోయాను. ఏమో, ఇకపైన సాధిస్తానేమో. ఇంతవరకున్నవి సినీమా సరదాలు మాత్రమే.

మొన్న, 1975 జూలై 20వ తేదీ ఆదివారం దక్షిణభారత ఫిలిం రచయితల సర్వసభ్య సమావేశం జరిగింది. ఆ రోజంతా మేము సభాకార్యక్రమంలోనే నిమగ్నులమై ఉన్నాము. సాయంత్రం జరుగవలసిన ముఖ్యమైన ఉపన్యాసాలలో కొన్ని జరగలేదు. (వ్యవధి చాలకపోవడం వల్ల) వాటిలో ఒకటి "సినీమా రచయితల సాంఘికబాధ్యత" అనే విషయం మీద కనీసం ఒక అయిదు నిమిషాలయినా మాటాడాలనుకున్న మహారధికి ఆమాత్రం టైముకూడా దొరకలేదు. మరికొందరితోబాటు అతనూ విరమించుకున్నాడు.

కాని, ఈలోపున తన ఉద్దేశాలను కొన్నిటిని నాతో చర్చించాడు మహారథి. మేమిద్దరమూ ప్రక్కప్రక్కనే కుర్చీలమీద కూర్చున్నాము. తన ప్రసంగాన్ని "సినీమా రచయితలంతా సాంఘికబాధ్యతను మరచిపోయిన తర్వాతనే సినీమారంగంలో ప్రవేశించారు" అనే వాక్యంతో ప్రారంభిస్తానన్నాడతను. నేనతనితో ఏకీభవించాను. కాని, అంతటితో వదలిపెట్టవద్దనీ, ఉపన్యాసం ముగించేముందు ఈ సాంఘిక బాధ్యతను జ్ఞాపకంచేస్తూ కర్తవ్యాన్ని ప్రబోధించమనీ హెచ్చరించాను. అలాగే అన్నాడు మహారథి. ఉపన్యాసం మాత్రం ఉపసంహరించబడింది!

మద్రాసులో బి.ఎ రెండవ సంవత్సరంలో ప్రవేశించేదాకా నాకు కళ్ళజోడు లేదు. 1928-29 సం.లో నేను చాలా తక్కువ సినీమాలు చూశాను. 29 వేసవిలో మా నాన్నగారు మల్లిక్‌డాక్టరుగారి అల్లుడిచేత (ఆయనకూడా డాక్టరే) తనిఖీచేయించి సులోచనాల జోడు కొనిపెట్టారు. 29-30 లో నేను కొన్నివందల సినీమాలు చూశాను. సగటున రోజుకి రెండేసి సినీమాలు చూసివుంటాను. అన్నీ మూకీలే. అప్పటికి మధ్యాహ్నం 3 గంటల ఆట ఇంకా అమల్లోకి రాలేదు. 6-30 కి ఒకటీ, 9-30 కి ఒకటీ ఉండేవి. మద్రాసులో అప్పుడు మూడు నాల్గు థియేటర్లకన్న ఎక్కువలేవు. అందుచేత ఒక్క కొత్తపిక్చరు కూడా మిస్‌కాకుండా అన్నిటినీ చూసేవాణ్ణి.

అందరిలాగే నేనూ అప్పుడు ఆడా, మొగా తారల్ని ఆరాధిస్తూ ఉండేవాణ్ణి. అయితే రోజుకొక కొత్తతార సాక్షాత్కరిస్తూండడంవల్ల అభిమానతార అంటూ ప్రత్యేకంగా ఎవరూ నాకు లేకపోయారు. *Picture Goer* అనే వారపత్రికలో రెగ్యులర్‌గా తారలతీరులు చదువుతూ ఎవరెవరు ఎంతెంత గొప్పవాళ్ళో తెలుసుకుంటూ ఉండేవాణ్ణి. ఎంతసేపూ హాలీవుడ్ చిత్రాలూ, అప్పుడప్పుడు బ్రిటిష్ చిత్రాలూ తప్ప ఇంకోదేశంలో తయారయిన పిక్చర్లేవీ మనదేశానికి వచ్చేవి కావు. ఇటలీలోనూ, జర్మనీలోనూ గొప్పగొప్ప చలనచిత్రాలు తయారవుతున్నాయని చదవడమే తప్ప చూడలేదు. విప్లవానంతరం రష్యాలో వెలువడ్డ చిత్రాలు ఫిలిం టెక్నిక్‌నే మార్చేశాయన్న సంగతి పుడోవ్‌కిన్ రచించిన *Film Technique* అనే గ్రంథం చదివేదాకా తెలియనే తెలియదు.

*Greta Garbo* స్వీడన్‌లో ఒక హోటేల్‌లో *Waitress* అనీ, *Renolysh Valentino* ఇటలీలోని ఏదో హోటేల్‌లో చిప్పలు కడిగేవాడనీ, *Dougles Fairbanks*, చార్లీ చాప్లిన్

నూటికి నూరుపాళ్లు ఇంగ్లీషువాళ్ళనీ తెలుసుకోవడం వరకే ఆనాటి నా సినీమా పరిజ్ఞానం పరిమితం. అయితే మెట్రో-గోల్డ్‌విన్ సింహాన్నీ, *Paramount* శిఖరాన్నీ, *Warner Brothers* మోనోగ్రాంనీ గుర్తించడం ముందుగానే నేర్చుకుని *Banner Value* అంటే ఏమిటో తెలుసుకున్నాను. పెట్టుబడిదారీ విధానంలో ఈ పతాకాలదే విలువ అనీ, పెద్దపెద్ద తారలంతా ఏదో ఒక కంపెనీ తాలూకు ఖరీదయిన ఉంపుడుకత్తెలనీ, తరుచు ఒక కంపెనీ ఇంకో కంపెనీకి తన తారల్ని ఎరువిస్తూ ఉంటుందనీ నాకు బాగా తెలుసు. కొంతకొంతమంది ప్రముఖతారలు తామే ఒక కంపెనీగా (ఉదాహరణకి *United Artists*) ఏర్పడడం కూడా నాకు తెలుసు.

అప్పటికే మూకీచిత్రాలు మాట్లాడడంకూడా నేర్చుకుంటున్నాయన్న పుకార్లు బాగా వ్యాపించాయి. ఇవి ఉత్త పుకార్లు కావనీ, యథార్థమే అనీ హిందీలో ఆలం ఆరా, తెలుగులో ప్రహ్లాద[4] బుజువుచేశాయి. "ఆలం ఆరా" మద్రాసులో విడుదల అయినరోజు సినీమాప్రియులకు మరచిపోరానిది. ప్రహ్లాద విడుదలయినప్పుడు నేను మద్రాసులో లేను.

*ప్రజాతంత్ర 17–8–1975*

## మూడు

*Silent Films* గురించి రాయాలంటే చాలావుంది. అదంతా రాస్తూ అనేకుల్ని విసిగించడం నాకిష్టంలేదు. ఒకటిమాత్రం చెప్పాలి. మూగబొమ్మలు మాట్లాడడంవల్ల గొప్పగొప్ప తారల కొంపలు మునిగాయి. ఆమాత్రం ఈమాత్రం పాడగలిగినవాళ్ళంతా పైకొచ్చారు. చలనచిత్రం ఒక ప్రపంచభాషగా రూపొందుతున్న సమయంలో ధ్వనిముద్రణ వచ్చి సినీమాకు హానికలిగిస్తోందని చాప్లిన్‌వంటివాళ్లు మొదట్లో అభిప్రాయపడ్డారు. తన చిత్రాలకు ధ్వని అనవసరమని కూడా చాప్లిన్ వాదించాడు. కాని తర్వాత, తర్వాత- ప్రగతిశీలమైన విజ్ఞానం కలిగించే సదుపాయాలన్నింటినీ కళాకారుడు వినియోగించుకోవలసిందే అని చార్లీచాప్లిన్ ఎన్నో టాకీలను నిర్మించడమేకాక తన పాతమూకీలలో ముఖ్యమైనవాటికి ధ్వనిముద్రణ కూడా చేశారు.

తన గొంతుకకు కూడా *Star Value* ఉందని *Chaplin* నిరూపించాడు. *The Great Dictator*లో హిట్లర్‌గాను, భయగ్రస్తుడైన యూదు మంగలిగానూ చాప్లిన్ తన గొంతుతోనే అమోఘంగా నటించాడు. *Empress of molten emotions* అని పేరు గడించుకున్న *Dolores del Rio* కంఠధ్వని బాగులేని కారణంగా మరుగున పడిపోయింది. *Ramona* అనే మూకీచిత్రంలో కొడుకు చచ్చిపోయినప్పుడొకమారూ, మొగుడు చచ్చిపోయినప్పుడొకమారూ *del Rio* క్లోజప్పులో ఏడుస్తూంటే నేనుకూడా వెక్కివెక్కి ఏడ్వడం ఇప్పటికీ నాకు బాగా జ్ఞాపకం.

*Charles Farrell, Janet Gaynor* కాంబినేషన్‌లో వచ్చిన *Seventh Heaven* అనే మూకీచిత్రాన్ని చూస్తున్నంత సేపూ ఏడుస్తూనే ఉన్నాను. అదేకథ టాకీగా వచ్చినప్పుడు ఆఖరు

4 ఆలం ఆరా (1931) మొట్టమొదటి హిందీటాకీ.
ప్రహ్లాద (1931) మొట్టమొదటి తెలుగుటాకీ.

ఘట్టంలో, యుద్ధంలో చనిపోయాడనుకున్న భర్త కళ్ళుపోయి బతికివచ్చిన సందర్భంలో కథానాయిక అతనితో "నాకు రెండు కళ్ళున్నాయిగా! అవే ఇద్దరం పంచుకుందాం" అంటుంది. అంటుందని ముందే నాకు తెలుసు. అయినా ఉద్వేగం పట్టలేక పోయాను.

ఒక సెకన్డుచిత్రం చూసి జేబులో మిగిలిన మూడు నాలుగు రూపాయలూ ఒక సుండమీద ఖర్చుపెట్టినవాడినయాను. ఔను! సినిమాల ప్రభావం అలాంటిది!

*ప్రజాతంత్ర 24—౮—1975*

## నాలుగు

ఇరవయ్యో శతాబ్దం రాజకీయంగా లెనిన్ శతాబ్దం. వైజ్ఞానికంగా రాకెట్ [illegible]. తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు ఈ శతాబ్దాన్ని శ్రీశ్రీ సొంతంచేసుకున్నాను. మరి సినిమా రంగంలో ఈ శతాబ్దం ఎవరిది? హాలీవుడ్డుదా? ప్రథమప్రపంచ యుద్ధానంతరం సభ్యలోకం అంతటినీ దిగ్భ్రాంతిలో ముంచిన రష్యన్ సినిమాదా? లేక సినిమా ప్రారంభాల నుంచి నేటిదాకా అగ్రశ్రేణిన నిల్చిన ఇటాలియన్ సినిమాదా? ఏమో చెప్పడం కష్టమే.

అయినా చెబుతున్నాను. ఇరవయ్యో శతాబ్దపు సినిమా సర్ చార్లీ చాప్లిన్‌ది!

ఇలా నేను చెబుతున్నందుకు కారణాలు, అంతర్జాతీయ చలనచిత్ర రంగం గురించి ఏ కొంచెం తెలిసినవారికయినా బాగా తెలిసినవే. రాజ్‌కపూర్‌గాని, మనోజ్‌కుమార్‌గాని ఈ విషయాన్ని నాకన్నా బాగా వివరించగలరు!

చాలాకాలం "భారతి" మాసపత్రికకు సంపాదకుడుగా ఉండిన గన్నవరపు సుబ్బరామయ్య గారికి సినిమాలంటే ఇష్టంలేదు. "భారతి" కార్యాలయమూ, మా హాస్టలూ ఒకేవీధిలో ఉండడంవల్ల, నేను తరచు సుబ్బరామయ్యగారిని కలుసుకుంటూ ఉండేవాణ్ణి. ఒకసారి చాప్లిన్ చిత్రం *"Modern Times"* మద్రాసులో ఆడుతోంది. చాప్లిన్ చాలా గొప్పవాడనీ, అతని చిత్రం మీరు చూసితీరాలనీ పట్టుపట్టి ఎలాగో సుబ్బరామయ్యగారిని ఒప్పించాను.

తెలుగువారిలో నాటికీనేటికీ సంస్కృతభాషను క్షుణ్ణంగా చదువుకున్న కొద్దిమందిలో సుబ్బరామయ్యగారొకరు. తన గురువుగారైన పురాణం సూర్యనారాయణ తీర్థులుతో మద్రాసు హైకోర్టు ఆవరణలోని పచ్చిక తివాసీమీద కూర్చుని ఇద్దరూ అభిజ్ఞాన శాకుంతలాన్ని ఆపోశన పడుతూ ఉంటే నేను నోరు వెళ్ళబెట్టుకుని వింటూ ఉండేవాణ్ణి.

*"Modern Times"* ఈనాటి యాంత్రిక నాగరికత మీద చాప్లిన్ చేసిన చలనచిత్ర వ్యాఖ్యానం. అందులో మొదటిషాట్ గుంపుగా వస్తున్న ఒక గొర్రెలమంద. దాన్ని డిజాల్వ్‌చేయగా, ఫ్యాక్టరీకూలీలు మందలుగా బయటికి వస్తూంటే వాళ్లలో ఒక కార్మికుడుగా చాప్లిన్ కనబడతాడు!

వెంటనే సుబ్బరామయ్యగారు నాతో అన్నారు. "వీడెవడో ఘటికుడులా ఉన్నాడు! నాందీశ్లోకంలోనే కథాంశం యావత్తూ సూచించడం సంస్కృత నాటక మర్యాద! ఎంత చక్కగా ఆ మర్యాద పాటించాడీయన!" అని మొత్తం చిత్రమంతా తదేకదీక్షతో చూసి, ఒక

కొత్త, మంచి అనుభవం కలిగించావంటూ నన్నభినందించారు.

చాప్లిన్ ఆరంభాలన్నీ ఇలాగేవుంటాయి. *Monsieur Verdoux* అనే చిత్రం గులాబీపూల కోతతో ప్రారంభం కావడం ఎంత కావ్యార్థ సూచకమో నేను చెప్పనక్కరలేదు.

చాప్లిన్ చిత్రాలను చూస్తూ ప్రపంచమంతా తెగనవ్వింది. నాలాంటి కొందరు మాత్రం ఆ నవ్వువెనుక ఉన్న మహత్తర మానవదుఃఖాన్ని పసిగట్టి కంటతడిపెట్టుకుంటారు. డికెన్సు నవలలు హాస్యరసప్రధానమనే అందరూ అనుకుంటారు. కాని ఆ నవ్వువెనుక ఉన్న దుఃఖమే ఆనాటి సామాజిక వాస్తవికత మీద డికెన్స్ సాహిత్యవ్యాఖ్య! విజయపురం విక్రమదేవవర్మ అంతటివాడు గురజాడ ''కన్యాశుల్కం'' ఒక ఫార్సు (అనగా ప్రహసనం) అని కొట్టిపారేశాడు. నేనుమాత్రం అది బీభత్సరస ప్రధానమైన విషాదాంతనాటకంగా ఎన్నికచేసి మన్నిక చూపుతాను.

ఇప్పుడంటే (1975లో) సినిమాగురించి కోకొల్లలుగా పుస్తకాలు వెలువడుతున్నాయి గాని నేను కన్ను తెరిచిననాటికి అవిచాలా కొద్దిగావుండేవి. మిత్రుడు నార్ల మూర్‌మార్కెట్టు లో తరుచు, రకరకాల సెకండ్‌హాండ్ పుస్తకాలు కొంటూ ఉండేవాడు. ఇది అతనికో వ్యసనం అని చెప్పినా తప్పులేదేమో! పుస్తకమా, భోజనమా? అన్న సమస్య వచ్చినప్పుడు పుస్తకాన్నే కొనేసేవాడు, తినేసేవాడు!

నాకళ్ళు తెరిపించిన పుస్తకాల్లో నార్లదగ్గర ఎరువు తీసుకుని చదివిన *"A Grammar of the Film"* ఒకటి.

మూకీచిత్రాల్లో *Marie Dressler* అనే ఆవిడ నటించేది. అప్పటికే ఆవిడ వయస్సు యాభయికి పయిచిలుకు. ఇంచుమించు ఆవిడలేని చిత్రమే ఉండేది కాదనడం అతిశయోక్తి కాదు.మహామహా నటీనటులకే ఆవిడంటే హడలు. ఏ కోశానా లవలేశమూ గ్లామర్‌లేని ఆవిడతో ఒకే ఫ్రేములో కనబడడమంటే అందరికీ భయమే. తన పక్కని ఎందరున్నా అందర్నీ తినేసి జీర్ణించుకునేదావిడ! అందుకే ఆమెను *"Scene Stealer"* అని విమర్శకులు అభివర్ణించడం నేనెరుగుదును.

మచిస్టీ సకాలంలో సినిమారంగం నుంచి నిష్క్రమించి శేషజీవితాన్ని సుఖప్రదంగా జరుపగలిగాడు గాని, పెట్టుబడిదారీ విధానంలో తారలందరి జీవితాలూ సుఖంగా ముగియవు. మన చిత్తూరు నాగయ్య[1] కస్తూరి శివరావులు[2] ఇందుకో ఉదాహరణ, *Italian Cinema* అనే

1.చిత్తూరు నాగయ్య (1904–1973) గారు 1940–1950 ల మధ్య తెలుగు సినిమాలలో ప్రధానపాత్రలు ధరించేవారు. భక్తపోతన, యోగివేమన, త్యాగయ్య, స్వర్గసీమ, బీదలపాట్లు మొదలైన చిత్రాల్లో నటించారు. తన 37 ఏళ్ళ సినిమా జీవితంలో తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ, హిందీ రంగాల్లో మొత్తం 320 చిత్రాల్లో నటించారు వయసు మీరాక ముసలిపాత్రలు వేసేవారు.

చివరిదశలో మూత్రవ్యాధి వల్ల ఆసుపత్రిలో చేరారు. డాక్టర్ని వెంటపెట్టుకుని ఆసుపత్రి నుంచి అవుట్‌డోర్ షూటింగులకు వెళ్ళేవాడు. దానితో మరీ డీలాపడిపోయారు. ఒకవైపు ఆర్థికబాధ, మరోవైపు అనారోగ్య బాధ. నాగయ్యగారి జీవితం అలాముగిసింది.

2.కస్తూరి శివరావుగారు హాస్యపాత్రలకు పెట్టింది పేరు. బాలరాజు, కీలుగుర్రం, ద్రోహి మొదలైన చిత్రాల్లో నటించారు. అక్కినేని నాగేశ్వరరావుగారు హీరోవేషం వేసిన ప్రతి సినిమాల్లోనూ శివరావుగారు హాస్యపాత్ర వేసేవారు. శివరావు, నాగేశ్వరరావు అని ఈ వరుసలో ఉండేది పబ్లిసిటీ.1945 నుంచి 1955 వరకు ఉచ్ఛదశలో ఉన్నారు. స్వయంగా కొన్నిచిత్రాలకు దర్శకత్వం కూడా వహించారు.

చివరిదశలో గడవడమే కష్టమయిపోయిందాయనకు.

గ్రంథంలో ఒక నటుని గురించి నేను చదివింది ఇంకో ఉదాహరణ:

*Emilio Ghione was a slender, elegant, nervous, and extravagant young man, who began as an extra, working for Italian Film in Turin, in which capacity he earned 90 lire (12 pounds) a month..... from 1915 onwards he earned fabulous sums-he himself admitted to receiving 100,000 lire (13,000 pounds) a month in 1915-and lived like a Renaissance prince. Extremely generous by nature he distributed largerse far and wide; but when the post-war crisis reached its climax, his life declined into a melancholy oblivion. Forgotten by his one time legion of admirers' he worked in small revue companies until, years later, ill, worn-out, and old before his time, he ended up in the charity-ward of a Turin hospital. There, after some months of a painful and lingering illness, he died, a sad ending for a man who had formerly been the adored and elegant idol of the Cinema public.*

పేరు ప్రతిష్ఠలూ, డబ్బూ సంపాదించి, ఊరూ పేరూ లేకుండా మరణించినవారిని మనం కనీసం స్మరించనైనా స్మరిస్తున్నాముగాని సినిమా రంగాన్నే అంటిపెట్టుకుని, అంతఃపురంలో ప్రవేశించలేక, కక్కుసుదగ్గర కుళ్లు కాలువల ఒడ్డున బతుకుతూ చస్తూన్నవారినీ, చావలేక బతికున్నవారినీ ఎవ్వరూ జ్ఞాపకం పెట్టుకోరు. ఎందుకు పిచ్చిలాగ అయిపోతున్నారని ఎవ్వరూ ఆలోచించరు. బహుశా ఇందుకు మన సామాజిక వ్యవస్థే కారణమని ఇంచుకంత అనుమానం కూడా రాదు.

*ప్రజాతంత్ర 31–8–1975*

## ఐదు

మాటవరసకి, మద్దాలి కృష్ణమూర్తి[1] గురించి ఎవరూ రాయరు. అతని కుటుంబం ఏమయిపోయిందో ఎవరికీ తెలియదు. అతను సహజంగా చచ్చిపోయాడో, లేక ఆత్మహత్యే చేసుకున్నాడో నికరమైన నిజం ఎవరికీ అక్కర లేదు. అతని సాయం వల్లనే నేను *Miracle in Milan* అనే అద్భుతమైన ఇటాలియన్ చిత్రం- డీ సికా డైరెక్టు చేసింది- చూడగలిగాను.

ఇండియాలో మొట్టమొదటి అంతర్జాతీయ చలనచిత్రోత్సవం మద్రాసులో జరిగింది. (ఆ తర్వాత బొంబాయిలో మొదటి అఖిలభారత చలనచిత్రోత్సవం జరిగింది. దానికి నేనూ, ఆత్రేయ మద్రాసు ఫిలిం ఛాంబరు పనుపున- మా ఖర్చుమీద- జడ్జీలుగా వెళ్లేము.) ఆరోజుల్లో పుష్కలంగా నా చేతుల్లో డబ్బు ఆడుతూ ఉండేది. పుడోవ్కిన్, ఫ్రాంక్ కాప్రా వంటి సుప్రసిద్ధ డైరెక్టర్లను మద్రాసులోనే చూశాను. రష్యన్, ఫ్రెంచ్, ఇటాలియన్ పిక్చర్లను చూశాను. నన్ను ముఖ్యంగా ఆకర్షించినవి ఇటాలియన్ చిత్రాలు. ఒక్క చిత్రాన్ని కూడా వదలకుండా అన్నిటినీ చూశాను.

*1.మద్దాలి కృష్ణమూర్తి ప్లేబాక్ ఆర్టిస్టు. 'దొంగరాముడు' సినిమాలో సావిత్రి 'రావోయి మా ఇంటికి' అని ఆర్.నాగేశ్వరరావును ఉద్దేశించి ఒకపాట పాడుతుంది. ఆ పాటలో ఆర్.నాగేశ్వరరావు మాటలకు మద్దాలి కృష్ణమూర్తి గారే గొంతు ఎరువిచ్చారు.*

మినర్వా థియేటరులో మూడుగంటల ఆటకి *Miracle in Milan* చూడడానికి వెళ్ళాను. అది చాలా చిన్న థియేటరు. అన్ని తరగతుల కిటికీల దగ్గరా పెద్ద క్యూలున్నాయి. నేను నిలుచున్న క్యూ పూర్తికాకముందే బుకింగు ముగిసిపోయింది. నేనూ, మద్దాలి కృష్ణమూర్తీ, మరికొందరం మిగిలిపోయాం. తనకా పిక్చరు చూడాలని పెద్దపట్టింపు లేదనీ, క్యూలో మొదటివాడిగా నిలబడి ఆరుగంటల ఆటకి నాకు టిక్కెట్టు తీసుకుంటాననీ, ఈలోగా ఇక్కడా అక్కడా తిరిగి వచ్చెయ్యమనీ కృష్ణమూర్తి నాతో అన్నాడు. ఎలాగయినా ఇటాలియన్ చిత్రాన్ని చూసితీరాలనుకున్నాను కాబట్టి టిక్కెట్టు డబ్బు అతనికిచ్చి కిటికీముందు నిలబెట్టి, ఆ దగ్గర్లోనే ఉన్న సెలెక్టులో ఆడుతున్న ఒక ఫ్రెంచి చిత్రం (*M.Vincent*) చూడడానికి వెళ్ళిపోయాను. నేను తిరిగి వచ్చేసరికి టిక్కెట్టుతో అతను సిద్ధంగా ఉన్నాడు. టిక్కెట్టూ, మిగిలిన చిల్లరడబ్బులూ నా చేతిలోపెట్టి, నేనివ్వబోయిన కరెన్సీ నోటును తీసుకోకుండా వెళ్ళిపోయాడు. ఆ విధంగా నేను ప్రపంచ ప్రసిద్ధమైన ''మిరకిల్ ఇన్ మిలాన్'' చిత్రాన్ని చూశాను.

సెలక్టులో ఒకరోజు *Festival of Youth*[2] అనే రష్యన్ డాక్యుమెంటరీ చిత్రాన్ని చూశాను. అనేక దేశాల యువతీయువకులు లక్షలసంఖ్యలో జెండాలు ధరించి కవాతు చెయ్యడం, రకరకాలవిద్యలు ప్రదర్శించడం, క్రమశిక్షణ నేర్చుకున్న మహాసముద్ర తరంగాలలాగ కదలిపోవడం-ఇలాంటివే ఎన్నో దృశ్యాలు. అన్నిటిలోనూ మరపురానిది రష్యన్ యువతీ యువకుల ప్రదర్శనలో *Top-angle* నుంచి తీసిన బ్రహ్మాండమైన సుత్తీకొడవలి దృశ్యం. ఆ దృశ్యాన్నిచూస్తూ థియేటర్‌లో చాలామంది కరతాళధ్వనులు చేశారు. కొంత మంది మాత్రం చప్పట్లుకొడితే ఏం కొంప మునిగిపోతుందో అని ఊరుకున్నారు.

ఆట ముగిసి బైటికివస్తూ ఇద్దరు తమిళ యువకుల సంభాషణ శకలం విన్నాను. వారిలో ఒకడు - అరవంలోనే ''ఇదేం చెత్తచిత్రం, ఒక కథాలేదు, పాడూలేదు'' అన్నాడు. రెండోవాడు ''ఓరి వెధవాయా! నువ్వు చూసింది కథ కాదు. జీవితంరా, జీవితం!'' అన్నాడు. కొన్ని డజన్ల కెమేరాలతో, కొన్ని వేల అడుగుల ఫిలిం తీసి 45 నిమిషాల చిత్రంగా ఎడిట్‌చేసిన డాక్యుమెంటరీ ఆ చిత్రం అని తర్వాత నాకు తెలిసింది.

ఇప్పటికీ కొంతమంది మన పెద్ద డైరక్టర్లనుకునేవాళ్ళు ఏదైనా చిత్రాన్ని ఈసడించవలసి వస్తే ''ఇదేదో డబ్బింగ్ ఫిల్ములా ఉందనీ, డాక్యుమెంటరీలా ఉందనీ''ఎందుకంటారో నాకర్థం కాదు.

మొన్న (18-8-75) వాహినీ *B* థియేటరులో ఒక డబ్బింగ్ చిత్రం చూసి బైటికివస్తుంటే మిత్రుడు పేకేటి శివరాం తాను ఆంధ్రప్రభ ప్రభుత్వం తరఫున తీసిన ప్రపంచతెలుగు మహాసభల డాక్యుమెంటరీ చూసి తీరాలని నన్ను ఆపేశాడు. అప్పటికే రాత్రి

2. ఫెస్టివల్ ఆఫ్ యూత్ అనే రష్యా చిత్రాన్ని 1952 లో మనరాష్ట్రంలో కూడా ప్రదర్శించారు. రెండో ప్రపంచయుద్ధం ముగిశాక (1945 తరువాత) రష్యాలో వెల్లివిరిసిన నూతనోత్సాహం నిర్మాణదీక్ష కళ్ళకు కడుతుంది. ఇందులో స్టాలిన్ స్వయంగా కనిపించాడు.

9-30 అయిపోయింది. ఇంటికెలా వెళ్ళడమని నేను తటపటాయిస్తున్నట్టు కనిపెట్టి శివరాం, "పర్వాలేదు. మూడే రీల్సు! ఎంత రాత్రయినా, నాకారులో దిగబెడతా"నన్నాడు. చిత్రం చూస్తున్నంతసేపూ ఏడురోజుల సంఘటనల్ని 30 నిమిషాల్లోకి ఎలా కుదించాడనే నేను ఆశ్చర్యపోతున్నాను.

కారు డ్రైవుచేస్తూ పేకేటి ఈ చిత్రం తియ్యడానికి తానెంత శ్రమపడ్డదీ వివరించాడు. అతనిపక్కనే కూచున్నాన్నేను. వెనకసీటులో కాగడా శర్మ కూర్చున్నాడు. "పిక్చరు తీస్తున్నప్పుడు నానా ఇబ్బందులూ పెట్టిన పెద్దలే తర్వాత అందులో తనబొమ్మలేదని వాపోయా"రంటూ పేకేటి నవ్వితే నాకూ నవ్వొచ్చింది. ప్రపంచ తెలుగుమహాసభలు అతివైభవంగా జరిగాయనడానికి సందేహం లేదు. ఆ వైభవాన్నంతటినీ చక్కగా *Capture* చేశాడు పేకేటి! అయితే, అప్పుడూ ఇప్పుడూ నాదొక్కటే పేచీ! అయిదుకోట్ల తెలుగువాళ్ళలో అన్నవస్త్రాలు ఉన్నవాళ్లు ఎంతమంది? ఎవరి ప్రయోజనాలని ఎగసనతొయ్యడానికీ సభలు జరిగాయి? ఎంతసేపూ నిన్నటి గొప్పలేనా, రేపటి సంగతి ఆలోచించడం ఏమైనా ఉందా? ఇదే నేనడిగేది! "ఒక సినిమా పత్రిక ప్రారంభోత్సవం ముఖ్యమంత్రిగారి ఆధ్వర్యంలోనే జరిగింది. అయినా కారణాంతరాల వల్ల దాన్ని కట్ చెయ్యవలసి వచ్చింది" అన్నాడు పేకేటి!

"విదేశాల ప్రతినిధులు తెలుగులో మాట్లాడారా?" అని అడిగాను. "మాట్లాడారుగాని వారి ఉచ్చారణ వింటే జనం నవ్వుతారని ధ్వనిముద్రణ చెయ్యలేదు" అన్నాడు పేకేటి. "ఏం? ఫక్రుద్దీన్ అహ్మద్‌గారి తెలుగు ఏమంత బాగుంది? శ్రోతలు కరతాళధ్వనులు చేశారుగా!" అన్నాను. విదేశీయులు కష్టపడి నేర్చుకున్న తెలుగు అపరిపక్వ బుద్ధులకు కర్ణకఠోరంగా వినబడుతుందేమోగాని నా చెవులకు మాత్రం అమృతోపమానంగా ఉంటుంది. ఈ నాటికీ అరవదేశంలో కోటిమంది తెలుగువాళ్లున్నారు. రాజపాళయం నుంచి వచ్చిన ఒకరిద్దరు క్షత్రియమిత్రులు "మేం తెలుగు మాట్లాడితే మీరు నవ్వుతారేమో" అని తమ యాసలో అనడమూ, "నవ్వను, ఆనందిస్తాను" అని నేననడమూ అందుకే!

*ప్రజాతంత్ర 7–9–1975*

## ఆరు

వెండి తెరమీద రచయితగా పూర్తిక్రెడిట్, 1950లో "నీరా ఔర్ నందా" అనే హిందీఫిలింకు తెలుగు అనువాదంతో నాకు లభ్యమయినప్పటికీ అంతకు ముందు అనేక సంవత్సరాలక్రిందటే 'కాలచక్రం' అనే చిత్రంలో నా మరో ప్రపంచం గేయం తెరకెక్కింది. దానికి రావలసిన 25 రూపాయల పారితోషికం ఇప్పటికీ నాకు అందలేదు. ఇకమీద అందదుకూడా! ఎందువల్లనంటే ఆ డబ్బు నాకివ్వడానికి ఒప్పుకున్న 'కాలచక్రం' హీరో బందా కనకలింగేశ్వరరావు ఇప్పుడు విగతజీవి.

'కాలచక్రం' మొదలు ఆహుతిదాకా చాలా సంవత్సరాలు సినీమా అంచుల్లోనే జీవించాను. ''గాంధీనగర్'' అనే చిత్రానికి చలంగారు సంభాషణలూ, నేను పాటలూ రాయడానికి ఏర్పాటు జరిగినప్పుడు నేను నిజంగానే సినీరంగ ప్రవేశం చేసినట్లు భ్రమించాను. కాని అదో మిథ్యాప్రారంభం మాత్రమే. అయితేనేం, ఆ సందర్భంగా నాకు వాడపల్లి సూర్యనారాయణరావు అనేవ్యక్తితో పరిచయం లభించింది. (ఈ వ్యక్తి అనే విశేష్యానికి విశేషణం ఏదయినా చేర్చాలని, అపూర్వ, అద్వితీయ, అద్భుత, అపురూప మొదలైన అకారాదులనుంచి, బిందుసమేత, క్షకారందాకా ఎన్నోమాటలు ఆలోచించాను. గాని ఏవీ అతణ్ణి వర్ణించడానికి వీలులేనివే!) అతనో వ్యక్తి! అంతే, 'ఒక' అనడం కూడా తప్పే! అతనిలో సవాలక్ష వ్యక్తులున్నారు. నేను ప్రొఫెషనల్ నోవలిస్టునయి ఉంటే అతడిమీద కేంద్రీకరించి వెయ్యిపేజీల నవల రాసివుందును.

బొంబాయిలో మొదటిసారి అతని పరిచయం అనుకోనివిధంగా మాకు కలిగింది. నేనూ, 'గాంధీనగర్' డైరెక్టు చెయ్యబోయే పెద్దమనిషి బొంబాయిలో లాటరీలు కొడుతున్న రోజులవి. మ్యూజిక్ డైరెక్షన్ చెయ్యవలసిన సి.రామచంద్ర అడ్వాన్సు ఇస్తేనేగాని హార్మోని యంమీద వేళ్ళు పెట్టనన్నాడు. రాజమండ్రి నుంచి రెండుమూడురోజుల్లో డ్రాఫ్టు వస్తుందనీ, ఈలోగా కవి గారితో- అనగా నాతోకలిసి కూర్చోమనీ మా డైరెక్టరు చాలా ప్రాధేయపడ్డాడు. డ్రాఫ్టువచ్చి, కాష్ అయిన తర్వాత సావకాశంగా కూచోవచ్చని చెప్పి మమ్మల్ని మర్యాదగా సాగనంపివేశాడు మ్యూజిక్ డైరెక్టరు.

డ్రాఫ్టురాలేదు. తెచ్చినడబ్బు ఖర్చయిపోయింది. ఏదో వీధిలో నడుస్తున్నాం ఇద్దరమూ ఏవేవో మాట్లాడుకుంటూ! బొంబాయిలో అది వానాకాలం. తుంపురులుగా చినుకులు పడుతున్నాయి. కాని, తుఫాను పట్టినా చలించని ఎనుబోతులం మేము! మా డైరెక్టరుగారు శాంతారాం దగ్గర పనిచేశాడట. ఆ ముచ్చటలూ, మున్ముందు మా కార్యకలాపాలు ఇంకా ఇలాటివే ఏవో చెబుతున్నాడు. ఇద్దరం మాటాడుకుంటూ నడుస్తున్నాం. ఏం మాట్లాడుకుంటున్నా ఇద్దరి మనస్సుల్లోను ఒకటే ఆలోచన, తర్వాతి భోజనం ఎక్కడనుంచి వస్తుందా అని!

''నేనూ తెలుగువాడినేనండీ'' అంటూ ఒకాయన నా వీపుమీద చెయ్యేసి అంటూంటే గతుక్కుమని వెనుదిరిగి చూశాను. అతనే వాడపల్లి సూర్యనారాయణరావు. యుద్ధకాలంలో బట్టల వ్యాపారం చేసి లక్షలార్జించి లక్షలు తగలవేసినవాడు. ఒక పిక్చర్లో నటించడానికి, దాన్ని డైరెక్టు చెయ్యడానికి నటకావతంస స్థానం నరసింహారావుకి లక్షరూపాయలు అడ్వాన్సు ఇచ్చినవాడు. (కనీసం, ఇచ్చానని నాతోచెప్పినవాడు). శ్రీ శ్రీ అంటే ఎవరో తెలియకుండానే ఆ రెండు అక్షరాలమీద విపరీతమైన అభిమానం పెంచుకున్నవాడు. అప్పట్లో వ్యాపారం బాగా దెబ్బతినేసినా కూడుగుడ్డలకు లోపం లేనివాడు.

అతగాడు మమ్మల్ని సుమారు 15 రోజులు బొంబాయిలో కాపాడాడు, అన్నంపెట్టి, ఆశ్రయం ఇచ్చి! అప్పుడప్పుడు నాకు డ్రింకులు కూడా ఇచ్చి!

తర్వాత కొన్ని సంవత్సరాలు గడచిపోయాయి. ఇంకా ''ఆహుతి'' చిత్రం ప్రారంభంకాలేదు. అకస్మాత్తుగా ఒకరోజు మద్రాసులో సాక్షాత్కరించాడు వాడపల్లి. ఎవరెస్టు హోటల్‌లో బసచేశాం అన్నాడు. ''ఎవరెవరు'' అని అడిగాను. ''నలుగురయిదుగురం! ఇప్పుడదంతా ఎందుకు? పదనాతో'' అని జార్జిటౌనుకి తీసుకువెళ్లాడు. ఒక గుజరాతీ వ్యాపారస్థుడితో అయిదు నిమిషాలు అనర్గళంగా గుజరాతీ భాషలో మాట్లాడి నా కళ్ళయెదుటే వెయ్యిరూపాయలు చే బదులు పుట్టించాడు.

ఇద్దరం కలిసి లోన్‌స్క్వేర్‌వద్ద ఒక బార్‌రూంలో బీరు వేసుకున్నాం. అప్పటికి మద్రాసులో మద్యనిషేధం లేదు. ప్రారంభించడమయితే బీరుతోగాని అంతటితో ఆగిపోలేదు. ఆరోజు నేనెన్నటికీ మరచిపోలేను. ఎందువల్లనంటే అతడారోజు నాకు పెట్టుబడిదారీ విధానం అంతటికీ కీలకప్రాయకమైన భగవద్గీతా వాక్యంలాంటి ఒక సుభాషితాన్ని నూరి పోశాడు.

బీరునుంచి బ్రాందీకిమారి, బటానీ మసాలా ఉభయములమూ సేవిస్తుండగా, వాడపల్లి నన్నడిగేడు: *Mr. Sri Sri, can you define a market place?* అని. ''విపణిస్థలం అంటే ఏమిటో నిర్వచించగలవా?'' అని ఇంగ్లీషులో అడిగాడు, నాకు తెలియదని నా నోటనే తెలుసుకుని తానే సవ్యాఖ్యానంగా నిర్వచించాడు.

''ఇద్దరు వ్యాపారస్తులు ఒకటేబులుముందు ఎదురెదురుగా కూర్చున్నారనుకో, మనలాగే! వాళ్ళిద్దరిలో ఎవరు ఎవరిని ముందుగా, హెచ్చుగా మోసం చెయ్యగలరనేది ఒక్క క్షణంలో తేల్చుకునే స్థలమే మార్కెట్‌ప్లేస్!'' అన్నాడు వాడపల్లి.

పెట్టుబడిదారీ విధానపు వేదాంతసారమంతా కాచి వడబోసి సూత్రీకరించాడు వాడపల్లి! అప్పుడు నాకు చిన్నప్పుడు చదువుకున్న శ్లోకం ఒకటి గుర్తుకొచ్చింది.

'సంగ్రామేషు భటేంద్రాణాం, కవీనాం కవిమండలే,
దీప్తిర్వా దీప్తిహానిర్వా ముహూర్తాదేవ జాయతే'

యుద్ధరంగంలో సైనికులకీ, కవి మండలిలో కవులకీ, దీప్తిగాని, దీప్తిహాని గాని క్షణకాలంలో తేలిపోతుందట!

వాడపల్లి తనతో మద్రాసుకు చంద్రలేఖ అనే గుజరాతీ అమ్మాయినీ, ఆమె సోదరుడు బరోట్, *Mr.and Mrs.* అసద్దీ అనే దంపతులనీ తీసుకు వచ్చాడు. వచ్చిన కొత్తలోనే బరోట్ తన పూలుసూట్లను మూర్‌మార్కెట్ లో అమ్మడమో, తాకట్టుపెట్టడమో చేసి బొంబాయి వెళ్ళిపోయాడు. మిగిలినవాళ్ళని, టెంపోరావుతో మాట్లాడి, మైలాపూరులో అతడు బ్రహ్మచారిగా ఉంటున్న భాగంలో ఉండేటట్టు ఏర్పాటుజరిగింది నావల్లనయితేనేం, వాడపల్లి వాక్చాతుర్యంవల్లనయితేనేం!

చంద్రలేఖ ఏవో హిందీ సినీమాలలో నటించాననో, నాట్యం చేశాననో చెప్పింది. ఆమె చక్కని ఇంగ్లీషు మాట్లాడుతుంది. మంచి కళాహృదయం ఉన్న మనిషి. ఒకరోజు

ఎవరెస్టు హోటల్‌లో రూం ఖాళీచెయ్యాలని నన్ను తోడురమ్మంది. ఇద్దరం కలసి వెళ్ళాం. కాఫీ, టిఫెన్ తీసుకున్నాం. బిల్లు ఆ అమ్మాయే చెల్లించింది. నా దగ్గర డబ్బుల్లేవు.

తన అన్నదమ్ముడు వ్యభిచరించి తన్ను పోషించమంటూ బలవంతం చేస్తూ ఉంటాడని చెప్పింది. తర్వాత, ఇక్కడే ఉండమని స్నానం చెయ్యడానికి బాత్‌రూంలోకి వెళ్ళింది. స్నానం చేసి చీరమార్చుకుని, ''ఉందామా, వెడదామా'' అని అడిగింది ''వెళదాం'' అన్నాన్నేను.

వాడపల్లి తీసుకువచ్చిన మనిషి కాబట్టి ఆమెన్నేను నా సోదరిలాగానే భావించాను.

*Mrs.*అసద్దీ బొంబాయిలోని వ్యభిచారిణి అని నాకు తర్వాత తెలిసింది. *Mr.*అసద్దీ పేరుకు మాత్రమే ఆమెభర్త! కొన్నిరోజులు టెంపోరావ్ ఇంట్లో ఉన్న తర్వాత వాళ్ళని బొంబాయి పంపించేశాడు వాడపల్లి.

చంద్రలేఖ ఒక రెడ్డిగారి అంతఃపురంలోకి అంతర్థానమయింది. దరిమిలాను హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ ఇంట్లో కనిపించింది.

*Mrs.* అసద్దీ గురించి మాట్లాడుతూ టెంపోరావ్ *"I could have that fat girl for mere asking"* అన్నాడు నాతో. *"Did you have her?"* అని నేనడిగాను. ఆ రోజుల్లో కమలాకోట్నీస్‌కి తానంటే ఫంచప్రాణాలట! అందుచేత ఈ దిబ్బదానివేపు చూడడానికే తీరికలేక పోయిందట.

ఆమె వెళ్ళిపోయిన నాటి ఆఖరిరోజు అనుభవం నాకు చెప్పాడు వాడపల్లి. ''ఇన్నాళ్ళు మద్రాసులో నన్ను పోషించావు. ఒక్కనాడూ నన్ను తాకలేదు. ఇవాళ మేం వెళ్ళిపోతున్నాం కాబట్టి...'' అని కోరి, కొసరి తన్ను సంతృప్తి పరిచిందట.

వాడపల్లి లైంగిక సామర్థ్యం గురించి ఒక్కమాట చెప్పి ఇంతటితోఅతని ప్రసక్తి ముగిస్తాను. మా ఇద్దరికీ పరిచితురాలైన ఒక స్త్రీతో అతను పదినిమిషాల లోపు వ్యవధిలో నాలుగుసార్లు సంభోగించాడు. ఇది నాకెలాగు తెలిసిందని ఎవరికేనా అనుమానం కలగవచ్చు. ఆరోజు పగలు నేనడిగితే ఇంట్లోకి రానందామె. ఆ రాత్రి నా పక్కనుండే నాలుగుసార్లు బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది, పడకగదిలో వాడపల్లిని ఉండనిచ్చి.

ప్రజాతంత్ర *14–9–1975*

## ఏడు

1950లో ''ఆహుతి'' డబ్బింగు చిత్రం విడుదల కావడంతో అంతకుముందు నా ఇరవయ్యేళ్ళ దారిద్ర్యదశ అంతమయిందని చెప్పవచ్చు. అంటే దాని అర్థం ఒక్కసారిగా నా ఆర్థిక పరిస్థితి పెరిగిపోయిందని కాదు! నిజానికి ''ఆహుతి'' ఆర్థికంగా గొప్పదెబ్బ తినేసింది. కాని అందులో పాటలనెవరో హెచ్.ఎం.రెడ్డిగారి దృష్టికి తీసుకువచ్చారు. ''అది సరేనబ్బా! పిక్చరు ఊరూపేరూ లేకుండా పోయిందే'' అన్నారట రెడ్డిగారు. అనేక కారణాలవల్ల ఒక చిత్రం ఆకాశాన్నందుకుంటే అందులో పనిచేసిన వాళ్ళంతా గొప్పవాళ్ళనీ, పరాజయం పొందిన చిత్రమైతే అందలి టెక్నీషియన్లను అలక్ష్యం చెయ్యవచ్చుననీ ఈ నాటికీ సినిమా వ్యవస్థలో

చలామణీ అవుతున్న నగ్నసత్యం. అయితే రెడ్డిగారు భావుకుడు కాబట్టి, 'ప్రేమయే జనన మరణలీల' అనే పాట నిజంగానే బాగుందని గ్రహించినవాడు కాబట్టి చూద్దాం, ఈ కొత్తవాడి కొక అవకాశం ఇద్దాం అని నన్ను పిలిపించారు.

అప్పుడు వారు తీస్తున్న నిర్దోషి (తెలుగు), నిరపరాది (తమిళం) ద్విభాషా చిత్రం నాలుగింట మూడువంతులు పూర్తి అయింది. ఇద్దరు ముగ్గురు మ్యూజిక్ డైరెక్టర్లను మార్చినతర్వాత ఘంటసాల వారిలాగ, ఇద్దరు ముగ్గురు రచయితల తర్వాత నేను ఒక సినీ రచయితగా రెడ్డిగారి ఆస్థానంలో ప్రవేశం సంపాదించాను. "నిర్దోషి"లో నేను రాసినవి ఒకటోరెండో పాటలూ, నాలుగో అయిదో సీనులూ మాత్రమే అయినా, తెలుగు, అరవ పిక్చర్లు రెండూబ్రహ్మాండమైన బాక్సాఫీసు హిట్స్ కావడంతో హెచ్.యం.రెడ్డిగారు రోహిణీ స్టూడియో నెలకొల్పడమూ, నన్ను నెలకు 300 రు. జీతం మీద తమ ఆస్థాన కవిగా అగ్రిమెంట్ చెయ్యడమూ ఇంచుమించు ఏకకాలంలో జరిగాయి.

అపేరోజుల్లో యం.హెచ్.యస్.మునాస్ దగ్గర నేను నెలకు రెండువందల రూపాయల జీతంమీద పనిచేస్తూ ఉండేవాణ్ణి. అతడు తీస్తున్న "ఉలగం" (తమిళం), "ప్రపంచం" (తెలుగు) ద్విభాషాచిత్రపు నిర్మాణకాలం రమారమి అయిదేళ్లు సాగింది. ఈ అయిదేళ్ళూ నాకు ప్రతినెలా 7వ తేదీ అయ్యేసరికి (అది ఆదివారమైనా సరే) రెడ్డిగారి చెక్కూ, 21వ తేదీ అయ్యేసరికి మునాస్‌గారి చెక్కూ పుట్టమీద పెట్టినట్టు నాకు అందిపోతూ ఉండేవి. ఆ రోజుల్లో 500 రు. అంటే ఈ రోజుల్లో అయిదువేలకు సమానం అనేది అందరికీ తెలిసిన సంగతే. దీనితో బాటు ఆనాటి అవిభక్త కమ్యూనిస్టు పార్టీ సభ్యులు ఎన్నుకున్న యం.ఎల్.సి.[1]గా ప్రతినెలా 150 రు. ఆదాయం కూడా ఉండేది. ఈ ఆదాయానికి ఇన్‌కమ్‌టాక్సు లేదనుకున్న నేను, పెనాల్టీతో సహా ఆదాయపుపన్ను చెల్లించవలసిన స్థితినుంచి నన్ను ఒక ఆడిటర్ మిత్రుడు రక్షించాడు. నేను సినీమాలో ఉండికూడా ఒక్క పైసా కూడా నల్లడబ్బు తీసుకోక పోవడమే నన్ను కాపాడింది. నాటినుండీ నేటివరకూ నల్ల డబ్బు తీసుకోని వ్యక్తిగా బతికున్న నాకూ, చనిపోయిన చిత్తూరు నాగయ్యగారికి (బహుశా ఇంకా కొందరు కూడా ఉండవచ్చు) ఆ గౌరవం దక్కింది. ఇది నాకో గర్వకారణంగా భావిస్తున్నాను.

చేసిన పాపం చెబితే పోతుందనుకుంటే నిజం చెప్పేస్తున్నాను. నేను నల్లడబ్బు తీసుకున్న సందర్భం ఒకే ఒక్కటుంది. ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్ "భార్యాభర్తలు"[2] చిత్రానికి నన్ను ప్రొడ్యూసర్ ఎ.వి.సుబ్బారావుగారు బుక్‌చేసినప్పుడు ఒక్క రెండువేలు మాత్రం రసీదులేకుండా ఇవ్వండని అడగడమూ, తీసుకోవడమూ జరిగింది. కాని ఆ రోజంతా నా మనస్సు మనస్సులో లేదు. ఏదో ఘోరమైన అపరాధం చేసిన వాడిలాగ క్రుంగిపోయాను. లండన్‌లో మొదటిసారి మేక

*1.ఉమ్మడి మద్రాసు రాష్ట్ర అసెంబ్లీకి 1952లో ఎన్నికలు జరిగాయి. ఆంధ్రప్రాంతంనుంచి 40 మంది కమ్యూనిస్టులు గెలుపొందారు.*

*కమ్యూనిస్టుఎమ్.ఎల్.ఎ లు 1953 ఏప్రిల్‌లో శ్రీశ్రీని కౌన్సిల్ సభ్యుడుగా ఎన్నుకున్నారు.*

*2.ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సు— పి.ఎ.పి— వారి 'భార్యాభర్తలు' చిత్రానికి శ్రీశ్రీ 1960లో మాటలు రాశాడు. ఆ సినిమా 1961 మార్చిలో విడుదలయింది.*

మాంసం తిన్న గాంధీగారు కూడా బహుశా నా అంత బాధపడి ఉండరు.

అయితే ఒక విధంగా నన్ను నేను సమర్థించుకోవాలనుకున్నాను. ఎంచేతంటే అప్పటికి చాలా కాలం కిందట ప్రసాద్ ఆర్ట్స్ "పెంపుడు కొడుకు"కి పాటలు రాశాను. "ఉన్న వారికే అన్ని సుఖాలోరయ్యో, అయ్యో! లేనివారి గతి ఈలోకంలో నుయ్యో గొయ్యో!" ఇత్యాదులు. ఆఖరి రెండు పాటలకి నాకు డబ్బు ముట్టలేదు. పిక్చరు ఫెయిలయింది. సుబ్బారావుగారి కోరికమీద నాకు రావలసిన మొత్తాన్ని రైటాఫ్ చేసుకున్నాను.

"ఆహుతి" తొలిరోజుల్లో నేన్నూ మా ఆవిడా మాత్రమే మద్రాసులో జీవిస్తూ ఉండేవాళ్ళం. (అప్పటికే మా నాన్నగారు మరణించారు, మద్రాస్‌లోనే) మాకు సంతానం లేకపోవడం మా ఇద్దరికీ కష్టంగానే ఉన్నా, వెంకట రమణమ్మ మాత్రం-మూడు నాలుగు కడుపులు పోవడంచేత చాలా దిగులు పడుతూ ఉండేది. నాకు బిడ్డనికనే ఆడది ఈ ప్రపంచంలో లేదని నేను సగం విచారంతోనే సంతోషిస్తూ ఉండేవాణ్ణి. 1959లో సరోజ మొదటి కూతుర్ని కనడంతో సగం విచారం పూర్తిసంతోషంగా మారింది.

1949లో కాబోలు, బిడ్డలులేని మా ఇంటికి మా బంధువురాలొకావిడ పదినెలల పరిపూర్ణ గర్భంతో వచ్చింది. వచ్చిన రెండురోజుల్లోనే ట్రిప్లికేన్ ప్రసూతి ఆసుపత్రిలో ఒక ఆడపిల్లను ప్రసవించింది. పదమూడో రోజున ఆవిడను ట్రాంలో సెంట్రల్ స్టేషనుకి దిగబెట్టి పసిబిడ్డతో మరలి వచ్చాను; ఆ పిల్లపేరు "లెనీనా" అని పెట్టాను.

ఈ పిల్లను మేము పెంచుకోవడం మేం అద్దెకుంటున్న ఇంటి యజమాని సోదరులకు సుతరామూ ఇష్టంలేదు. ఇల్లు ఖాళీచెయ్యవలసిందని ఒకటే గోల చేశారు. మా చెవులకు అమృతప్రాయంగా వినిపించే మా పిల్లయేడుపు వాళ్ళకి కర్ణకఠోరంగా ఉండేది. తమకే కాక, మిగిలిన వాటా వాళ్ళకికూడా రాత్రిళ్ళ నిద్రపట్టడంలేదని సతాయించేవాళ్ళు. ఒకభాగంలో ఉంటున్న రుక్మిణీనాథశాస్త్రి మాత్రం తనకేమీ నిద్రాభంగం కలగలేదని చెప్పేడు.

అయినా మేము నం.10 అరుణగిరి ముదలివీధి (మందపల్లి)కి మారకతప్పలేదు. తర్వాత సొంతయిల్లు వచ్చేదాకా అక్కడేవున్నాం. లెనీనా వచ్చిన తర్వాత మా దశ మారిందని మా ఆవిడా, నం.10 అరుణగిరి ముదలివీధి ఇల్లు మా అదృష్టానికి కారణమని ఆ యింటి యజమానురాలూ వాదించుకునేవాళ్లు. ఒకటిమాత్రం చెప్పకోవాలి. బయలుదేరడానికి బస్సు డబ్బులు లేకపోయినా, లెనీనాకోసం పాలడబ్బా కావాలనుకుంటే ఏదో విధంగా చేతిలో డబ్బు పడేది. గొల్లభామ మార్కు లాక్టోజన్, ఆస్టర్‌మిల్క్ ఇలాంటివే ఎన్నో డబ్బాలు. ఒకరోజు దొరికేవి మరోరోజు దొరికేవి కావు. అవికాక నారింజపళ్ళు, ద్రాక్షపళ్లు ఇలాంటివే ఎన్నో లెనీనాకు తల్లిపాలు లేనిలోపం తొలగించాయి.

చలంగారు నన్ను స్వయంగా చూడడానికి వచ్చింది 10 అరుణగిరికే. ప్రొహిబిషన్ నేరానికి పోలీసు లాకప్‌లో కొన్నిగంటలు పాటు గడపడం ఆ ఇంట్లో ఉండేరోజుల్లోనే.

MSX 138 స్టాండర్డ్‌కారు కొనడం ఆ రోజుల్లోనే. నెం.11 కెనాల్‌బ్యాంకు రోడ్డుకి

మారడం ఆ యింటినించే.

ఆ రోజుల్లో మా ఇంటికి తెల్లారేసరికి నలుగురు అరవ సోదరులు హాజరయేవారు. కాఫీ కోసమే అని నాకు తెలుసు. కాఫీతాగి ఆ కబురూ, ఈ కబురూ చెప్పి వెళ్ళిపోయేవారు. మర్నాడు తెల్లారేసరికి హాజరయేవాళ్ళు. అందరిలో పెద్దవాడు 'కాలచక్రం' చిత్రానికి కెమేరా మాన్. రెండవవాడు గొప్ప డిస్ట్రిబ్యూషన్ కంపెనీకి మాజీ మానేజరు. మూడోవాడూ, నాలుగోవాడూ సినీ కథా రచయిత. లేక ఇద్దరూ రచయితలే కాబోలు. ఇప్పుడు జ్ఞాపకంలేదు. సినీప్రపంచాన్ని తలకిందులు చెయ్యగల సామర్థ్యం ఉండిన్నీ ఒకపూట కాఫీకోసం ఇంకొక పంచకు రావలసి రావడమే విధి విధానమని ఆ నలుగురూ గట్టిగా విశ్వసించేవారు.

నలుగురి పేర్లూ "రామ" శబ్దంతో ప్రారంభమవుతాయి. రామచంద్రన్, రామభద్రన్, రామలింగన్, రామనాథన్ అంటూ! (నాధన్, భద్రన్ ఇత్యాదులు కాకపోచ్చు. ఏవో అట్లాంటివే మొత్తానికి!) రామశబ్దానికొక శ్రీకారం కూడా కలిస్తే ఇక సినీ ప్రపంచాన్ని ఒక ఏలుబడి ఏలుతామని వాళ్ళంటే నేను తక్షణమే అంగీకరించాను. ఆ విధంగా నెం.10 అరుణగిరి ముదలి వీధిలో ఆవిర్భవించింది రామశ్రీ పిక్చర్స్.

అందరికన్నా పెద్దవాడు దీన్నొక ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ చేద్దామని ప్రతిపాదించాడు. దీనికి మేం అయిదుగురమూ డైరెక్టర్ల బోర్డుగా ఉండడానికి అందరికీ సమానంగా రూపాయిలో 20 పైసల వాటా ఉండడానికి ఏకగ్రీవంగా అంగీకారం కుదిరింది. ప్రాథమిక ఖర్చులు భరించవలసిన భారం నామీద పెట్టారు. ఆవిధంగా నాదగ్గర రోజూ అయిదూ పదీ అడుక్కుంటూ పోయేవాళ్లు.

"రామశ్రీ పిక్చర్స్" పతాకం కింద శ్రీశ్రీ రచించిన "కన్నీరు" అనే జాలిగాథ చలనచిత్రంగా రూపొందబోతున్నట్లు సినీ వర్గాలలో ఒక చిన్న సంచలనం రేగింది. ఈ ప్రచారాన్నిశక్తి వంచన లేకుండా సాగించిన వాళ్ళు రామరామసోదరులే అని వేరే చెప్పనక్కరలేదు.

ఈ మాట ఆ నోటా ఈ నోటా రాజ్యం పిక్చర్స్ రంగనాథదాసుగారికి తెలిసింది. "కాలచక్రం"లో నటించిన లక్ష్మీరాజ్యం గారికి రామచంద్రన్ పరిచయస్థుడే. "కన్నీరు" కథ సినిమా హక్కుల విషయం మాట్లాడడానికిగాను రాజ్యం, రంగనాథదాసుగార్లు మా యిద్దరికీ కబురు చేశారు.

వెళ్ళే ముందు రామసోదరులూ నేనూ మాయింట్లో ఒక చిన్న బోర్డు ఆఫ్ డైరెక్టర్స్ మీటింగు పెట్టాము. పదివేలరూపాయల తక్కువయితే అమ్మకూడదనే నిశ్చయానికి వచ్చాము. అంతేకాదు. "సంసారం" చిత్ర విజయంతో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న "రాజ్యం పిక్చర్స్" వారి చేత తెలుగు తమిళభాషల్లో చిత్రాన్ని తీయించడానికి పట్టుబట్టాలని కూడా మాలో మేం కూడబలుక్కున్నాము.

మర్నాడు నేనూ, పెద్ద రాముడూ రాజ్యం పిక్చర్స్ ఆఫీసుకు వెళ్ళాము. తతిమ్మా రామసోదరులు వసారాలో తచ్చాడుతున్నారు. ఒక్క తెలుగువర్షన్ మాత్రమే ప్రస్తుతానికి

తీస్తామని, పిక్చర్ బాగా పోతే అరవం విషయం ఆలొచిస్తామనీ, అభ్యంతరం లేకపోతే ఆ క్షణమే అగ్రిమెంటు చేసి అడ్వాన్సు తీసుకోవచ్చుననీ రంగనాథదాసుగారు అన్నారు. ఉండండి, ఇప్పుడే చెబుతామనిబైటికి వచ్చి మా భాగస్వాములతో సంప్రతించాము. "ఏమిటీ? తెలుగులో మాత్రమే తీస్తారా? వీల్లేదు. నిన్న మనం అనుకున్నదేమిటి? ఇప్పుడు చేస్తున్నదేమిటి?" అన్నారు ముగ్గురు సోదరులూ.

ఒక్క తెలుగు వెర్షనుకి మాత్రమే పదివేలు రావచ్చుననీ, ఒప్పేసుకుందామని నేనెంతో ప్రాధేయపడ్డాను. పెద్దన్నయ్య కూడా నచ్చచెప్పబోయాడు. ససేమిరా అని ముగ్గురూ భీష్మించుకు కూచున్నారు.

*ప్రజాతంత్ర 28–9–1975*

## ఎనిమిది

నేనెప్పుడూ డైరీలు రాస్తూవుంటాను. చదువుకునే రోజులనుంచీ రాస్తూనే ఉన్నాను. అవిప్పుడు పోయాయంటే అది వేరేసంగతి. 1929, 30 సంవత్సరాల డైరీలలో నేను చూసిన మూకీచిత్రాల పేర్లన్నీ ఉన్నాయి. వందలలెక్కలో! కాని ఆ డైరీలిప్పుడు లేవు. నేను చూసిన సైలెంట్ ఫిలింలతో ఇప్పటికీ ఎప్పటికీ చెరిగిపోని ముద్రవేసినవి ఏ ఇరవయి, ఇరవయి అయిదో ఉంటాయి. అందులో కొన్నిటిని మళ్ళీ ఈమధ్య (అమెరికన్ ఫిల్మ్ ఫెస్టివల్ సందర్భంలో) చూశాను. ముఖ్యంగా ఇదివరలో చూడలేకపోయిన *Tole'ble David* కూడా చూశాను. *D.W* గ్రిఫిత్ డైరెక్టుచేసిన ఈ చిత్రాన్ని పుడోవ్‌కిన్ తన "ఫిలిం టెక్నిక్"లో ఆకాశానికెత్తేస్తూ పొగిడాడు. ఒకచిత్రంగాని, కావ్యంగాని ఎందుకు ఎలాగ క్లాసిక్ అనిపించుకుంటాయో ఆ చిత్రాన్ని చూశాక తెలుసుకున్నాను.

ఇప్పుడు నా కాగితాలలో వెదుకుతూ ఉంటే *SCRAP BOOK From 25-11-51 to...*అనే నోట్‌బుక్ దొరికింది. అందులో 14-12-51 మొదలు 22- 12-51 దాకా మొట్టమొదటి భారతీయ చలనచిత్రోత్సవానికిగాను నేను చేసిన బొంబాయి పర్యటన విశేషాలున్నాయి. వెళ్ళడం 14వ తేదీరాత్రి ప్లేన్‌లో వెళ్ళి బహుశా 23వ తేదీనాడు ట్రెయిన్‌లో బొంబాయినుంచి తిరుగుప్రయాణం చేశాను. దారిలో రేణిగుంట స్టేషన్‌లో ఆగి అక్కడినుంచి తిరుపతికి వెళ్లాను. దేవుడి దర్శనం కోసం కాదు.

ఇండియన్ ఫిలిం ఫెస్టివల్‌కి జడ్జీల సంఘంలో ఉండడానికి దక్షిణ భారతదేశం నుంచి నన్నూ, ఆచార్య ఆత్రేయనూ పంపాలని మద్రాసు ఫిలిం ఛేంబర్ నిర్ణయించింది, మా యిద్దరి వీ ఎవరి ఖర్చులు వాళ్ళవే అన్న షరతుమీద! ఇద్దరమూ అంగీకరించాము. ఆత్రేయ ముందుగానే ట్రెయిన్‌లో బయల్దేరిపోయాడు. నాకు ప్లేన్‌లో వెళ్ళాలని ఉబలాటం. ఆ ప్రయత్నాలలో నేనుంటే డైరెక్టర్ రామానందం తన పిక్చరుకి తక్షణం రెండుపాటలు కావాలని 14వ తేదీ ఉదయం భీష్మించుకు కూచున్నాడు. నా మనస్సంతా బొంబాయి ప్రయాణం మీద ఉంది. రెండుకాదు కదా, ఒకపాట కూడా రాయగల స్థితిలో లేనన్నాను. "మీరు తలచుకుంటే అదో

పెద్దపనికాదు. ప్లేన్ ఎక్కించే పూచీ నాది. పదండి వెళ్దాం" అని వాళ్ళ ఆఫీసుకు తీసుకు వెళ్ళాడు. రెండు పాటలూ పూర్తయేదాకా వదలలేదు.(రెండిటికీ కలిపి 400 రు. కాబోలు ఇచ్చాడు. ఇప్పుడు సరీగా జ్ఞాపకంలేదు) అన్న ప్రకారం సాయంత్రం 5 గంటలలోగా వది లేశాడు. తన కంపెనీ కారువాడుకోమన్నాడు. "థాంక్స్!" వద్దన్నాను.

14-12-51

*Enplaned for Bombay, first time in my life to travel by air. It was a very pleasant journey Madras by night seen from above was very beautiful.*

డైరీ అంతా ఇంగ్లీషులోనే ఉంది. దీన్ని మళ్ళీ తెనిగించనక్కరలేదనుకుంటాను. తొలిసారి గా విమానప్రయాణం చేస్తూ మీదనుంచి మద్రాసు దీపాలను చూస్తూవుంటే నాకు చిన్నప్పుడు కొండమీదనుంచి చూసిన విశాఖపట్టణం జ్ఞాపకం వచ్చింది. అప్పుడే కొత్తగా హార్బరు నిర్మాణం జరుగుతోంది. పారిశ్రామికీకరణవల్ల ప్రకృతిమాత స్వరూపమే మారిపోతోంది. కాని ఇందుకు నేను బాధపడలేదు సరికదా ఎంతో ఉప్పొంగిపోయాను. టెలిగ్రాఫు తీగలు నాకు కాలరాక్షసి చికురపాశాలలాగా కనిపించలేదు. అవి చిక్కుముడులుపడ్డ తల వెంట్రుకలు కావు. చక్కని ఛందస్సులో ఉన్న సరికొత్త గీతపాదాలు.

*But could not get sleep. As the plane was gaining altitude, I felt a little afraid, it is true! But at the same time, I was also very happy to watch that part of the world that is visible hazily through the window-pane in the moonlight. Especially the clouds below! Perhaps there was a storm, was there?*

అంతసేపూ ఏ కదలికా లేనట్లు కదిలిపోయే విమానం, మబ్బులను దూసుకుపోయే టప్పుడు అమిత వేగంగా పోతున్న విషయం విమానప్రయాణాలు చేసేవారందరికీ విదితమే!

*Arrived at Nagpur by 2.25 A.M. Had an omelette and tea. It was very chill outside, smoked a Cigarette or two.*

నాగపూరులో చలిబాధ ఒకటి రెండు సిగరెట్లతో తీరిపోయింది గాని 1954 డిసెంబరులో స్టాక్‌హోమ్‌నుండి మాస్కోకు ప్రయాణం చేస్తున్నప్పుడు హెల్సింకీ విమానాశ్రయంలో ప్లేన్ దిగి రెండుమూడు వందల గజాలు నడిచేటప్పుడు విపరీతంగా విహ్వలించిపోయాను. లండన్‌లో కొన్న ఫుల్లైన్ ఓవర్కోటుకూడా నన్ను రక్షించలేకపోయింది. ఆ తర్వాత మాస్కోలో చలి మరీ విపరీతం. నెపోలియన్ పరాజయానికి ముఖ్యకారణం రష్యన్ చలికాలమే అని వేరే చెప్పనక్కరలేదు కదా!

*Plane took off exactly at 3.30 A.M.*

*This time I had some good sleep, woke up at 6 A.M. we were nearing Bombay.*

*Which we reached ultimately at 6.25 A.M.*

*15-12-51*

*Came to Deccan airways Booking office in their Van. Engaged a taxi and*

*went to Sandhurst Road. The FFI office was not yet open. Asked the taximan to drive to the nearest lodging Hotel. He showed me the Hotels near about Lamington Road. I said not that kind!*

అంతకుముందే వాడపల్లి సూర్యనారాయణరావు ధర్మమా అని లామింగ్టన్ రోడ్డు ప్రాంతాల హోటేళ్ళను గురించి నాకు కొంతలో కొంత తెలుసు. కాని నేను బొంబాయికి రావడం అటువంటిచోట బసచెయ్యడానికి కాదు.

*I took room no.11 in the City Hotel.*

*Went again at about 10.30 A.M. to FFI (Film Federation of India). Mr.Menon was very kind and helpful, wired home, Sarvabhowma, wrote several letters.*

*On way back at grant Road post office wired m. to K.*

*K* అంటే కమల, *m* అంటే మనీకాదు *message*.

*Travelled by electric train from grant Road to charin Road.*

*Slept in the afternoon.*

*Saw "Andolan" at 6.15 P.M. Came back and went to sleep.*

ఇదీ బొంబాయిలో మొదటిరోజు కార్యక్రమం. తర్వాత ప్రతిరోజూ పోటీకివచ్చిన సినిమాలు చూడడమే ప్రధానకృత్యం. మొదటి రెండురోజులూ చూసిన చిత్రాలకు బడిపంతులులాగ మార్కులువేశాను.

*ANDOLAN*

| | |
|---|---|
| *1. Story, script and dialogues. V.good* | *-60* |
| *2. Direction, V.good* | *-60* |
| *3. Acting and other artistic merits like music, Dances Etc., V.good* | *-50* |
| *4. Technique V.good* | *-75* |
| *5. General (but the total impressionis not good)* | *-45* |
| | *290* |

*VIDYA SAGAR*

| | |
|---|---|
| *1. -Excellent* | *70* |
| *2. - "* | *75* |
| *3. -not bad* | *50* |
| *4. V.Excellent* | *90* |
| *5. -Satisfying* | *60* |
| | *345* |

తర్వాత ఈ మార్కులూ, రిమార్కులూ మానేశాను.

*ప్రజాతంత్ర 5–10–1975*

## తొమ్మిది

*Mr.Menon's assistant picked me up early in the morning and we went to Famous Cine at MahalaxmiSaw Vidya Sagar.*

16-12-51

విద్యాసాగర్ బెంగాలీ చిత్రం. ఆందోళన్ హిందీచిత్రం. ఈ రెండు భాషల్లోనూ కాక ఒక మరాఠీచిత్రం (శాంతారామ్‌గారి "అమర్ భూపాలీ") రెండు తెలుగుచిత్రాలూ (పాతాళ భైరవి, సంసారం) చలనచిత్రోత్సవానికి వచ్చాయి.

*Saw Vidya Sagar. The Bengalı film. I was introduced to several members of the Panel by Mr. Menon. Among the names I remembered two, Chetan Anand and Jaimini Dewan.*

*Mr.Dewan gave us a lift in his car. Came to Hotel. Had lunch and slept.*

*Woke up at 3 P.M. And writing this, it is now 3-30.*

*Mr.Chandravarkar came at 5-30 and we both went to famous Cine by Electric train. Saw the Documentary "Papermaking in India" and "Khelaghar" a Bengali six-reeler for children. The latter has appealed to me a lot. I wondered if Prakasa Rao would do something as "Khelaghar".*

*Prakash Rao* అంటే (శ్రీ) కోవెలమూడి ప్రకాశ్‌రావు. 'ఖేలాఘర్' అనే బెంగాలీ చిత్రం గురించి నేను చెప్పడంవల్లనే తర్వాత, తర్వాత అతను రెండు బాలలచిత్రాలు తీశాడని గర్వించాను. తీసినమాట మాత్రం నిజం. అవి బాగా పోలేదన్నమాట కూడా నిజమే.

*Had supper at, Purohits"*

17-12-51

*"Sheesh Mahal" in the morning at Central Studio; received letter from Sarvabhowma Rao. Wrote letters to S. and K.Wandered for a while in the streets and went by myself in the evening to famous Cine. "Shokian" was shown but had to be postponed for tomorrow owing to bad projection. Producer Kedar Sarma was visibly worried. Atreya who arrived yesterday, it appears, has come to the show,went to Matunga with him. Both dined at his hotel. Then went to see S.M.Y. Sastri [1]It was 2 O' clock in the night when I returned to City Hotel.*

*S.M.Y.Sastri* మంచి రచయిత, గొప్ప రంగస్థల నటుడు. ఆ రోజుల్లో బొంబాయి నగరపు మున్సిపల్ కమిషనర్‌గా పనిచేస్తుండేవాడు.

18-12-51

*Chandavarkar woke me up in the morning and we went to Mahalaxmi. Rest of the picture "Shokian" was shown, went to FFI. No letters, no T.M.O. upto 12-30 P.M.*

*Came back to the Hotel. Slept a while and went to Mahalaxmi.*

*"Babla" was shown.*

19-12-51

*Saw "Shabistan" in the morning. No letter no T.M.O.*

*Saw Bawrenain in the evening.*

*1.సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారు బొంబాయిలో స్థిరపడ్డ తెలుగురచయిత. విశ్వం పెళ్ళి, వోటు, లోకులు కాకులు, కళ్యాణి, న్యాయం, మొదలైన నాటికలు, నాటకాలు రాశారు.*

20-12-51

*Saw "Samsaram" (only a few reels) in the morning, went to F.F.I. Received letter from K.*

K (అనగా కమల) గురించి రాయడానికి చాలావుంది. కాని ఆమె నాకో సినిమా సరదాకాదు. రమారమి ఒక సంవత్సరంబాటు మేము ఒకరినొకరు చూడకుండానే ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకున్నాము, మా ఆవిడ అనుమతిమీద. కమలను నేను ద్వితీయభార్యగా స్వీకరించడం కొద్దిలో తప్పిపోయింది. తర్వాత ఆమెకు పెళ్ళికావడం, ఒక కొడుకు పుట్టడం-సరే. ఇవన్నీ "హంసతో ఆరునెలలు" అనే శీర్షిక క్రింద.

ఇక్కడ ఒక విషయం చెప్పదలచుకున్నాను. "హంస" అంటే కమల మాత్రమేకాదు. ఆరునెలలంటే ఆరునెలలు మాత్రమేకాదు.

*Saw Mr.Santaram in Company with Atreya. Saw "Amar Bhoopali" at Rajkamal Studios. Mr. Iswar, Shantaram's Secretary showed me round the studio.*

"అమర్ భూపాలీ" హిందీ, మరాఠీ ద్విభాషాచిత్రం. అప్పటికింకా హిందీ వెర్షన్ పూర్తి కాలేదు. మేము చూసింది మరాఠీ చిత్రం మాత్రమే. అదికూడా పూర్తి రూపురేఖలు దిద్దుకో లేదు. కాబట్టి జడ్జీలు రాజకమల్ స్టూడియోలోనే చూస్తే మంచిదన్న శాంతారావ్‌గారి సలహామీద మేము కొంచెం పద్ధతి విరుద్ధంగా రాజకమల్‌కు వెళ్ళవలసి వచ్చింది. (ఇంతకు ముందు చిత్రాలన్నీ *Film Federation of India* ఆధ్వర్యంలో వారు ఏర్పాటుచేసిన చోట్లలో చూశాము. "అమర్ భూపాలీ" అలాగకాదు.)

చిత్రాన్నిచూసిన తర్వాత శాంతారావ్‌గారిని చూడాలన్న కోరికను నేనూ, ఆత్రేయ ఈశ్వర్ గారికి తెలియజేశాము. అప్పుడు శాంతారావ్‌గారు బెంగాలీ డబ్బింగ్‌ను పర్యవేక్షణ చేస్తూ ఎడిటింగ్ రూమ్స్‌లో ఉన్నారు. అక్కడికి మేం వెళ్ళాం. పరిచయాలు జరిగిన తర్వాత శాంతారావ్‌గారు తనచిత్రం ఎలావుందని నన్నడిగేరు. *"Mr.Shantaram you are no director"* అని అరక్షణం ఆగేను. కత్తివేటుకి నెత్తురుచుక్క లేదంటారే అలాగయిపోయింది ఆయన ముఖం. జడ్జీగా వచ్చిన ఇతగాడ్ని అభిప్రాయం అడగడం తప్పనుకున్నాడో, లేక మనిషంత మనిషిని, కుండబద్దలు కొట్టినట్లు "నువ్వు డైరెక్టరువి కా" వనడం ఏమీ బాగులేదనుకున్నాడో యేమో!

అంతే! వెంటనే అందుకొని నేను *"But you are a magician"* అన్నాను. చింకి చేటంత అయిపోయిందంటారే అలాగయింది ఆయనముఖం! **Thank you, thank you** అంటూ నాతో అదేపనిగా కరచాలనం చేశాడు, నిజానికి "అమర్‌భూపాలీ"లోని మరాఠీ జానపదసంగీతం నన్ను మంత్రముగ్ధుణ్ణి చేసింది. ఆ పాటలింకా నామనస్సులో గింగురు మంటూనే ఉన్నాయి. ఆ మైకంలో కాకపోతే శాంతారావ్ లాంటి వాడిమీద నా చిలిపితనం ప్రదర్శించకపోయి ఉందును.

ఇలాంటిదే ఇంకో *split second* చిలిపితనం అనకాపల్లి "గౌరీ గ్రంథాలయం" లో

చేశాను. ఒక వార్షికోత్సవానికి ఆహూతుణ్ణిగా వెళ్లిన నన్ను కార్యక్రమం ముగిసిన తరువాత ఒక పుస్తకంలో నా శుభాశీస్సులు వ్రాయవలసిందిగా కార్యదర్శి కోరేడు. అంతకుముందు సంవత్సరం శుభాకాంక్ష జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారిది. పది పదిహేను పేజీల బరువైన సాహిత్యం. "అంత రాయలేను, ఒకే ఒక వాక్యం రాస్తా"నన్నాను. సరే అన్నాడు సెక్రటరీ.

"ఈ గౌరీ గ్రంథాలయానికి నేను దినదినాభివృద్ధి కోరను" అని వ్రాసి ఫుల్‌స్టాప్ పెట్టి ఒక క్షణం పాటు సెక్రటరీ మొగంవైపు చూశాను. శుభం పలకరా మంకెన్నా అనే సామెత జ్ఞాపకం వచ్చిందో, లేక ఈ నిరీశ్వరుడి (అప్పటికే నేను నిరీశ్వరవాదిని) ఆశీర్వాదాలు కోరడమేమిటనుకున్నాడో యేమో, వెలవెలపోయాడు కార్యదర్శి.

"కోరను" అనేమాట పక్క ఫుల్‌స్టాప్‌కింద ఒక కామాపెట్టి, దాన్ని సెమికోలన్‌గా మార్చి, "...కోరను; మరి నేను కోరేది క్షణక్షణాభివృద్ధి" అని రాసేను. అప్పుడా కార్యదర్శి ముఖవర్చస్సునే తర్వాత చాలాకాలం నాటికి శాంతారామ్ ముఖంలో చూశాను.

*Deferred opinion on the advisability of dubbing A.B. (అమర్ భూపాలి) into Telugu and said I would be writing a letter on going back to Madras.*

*Saw Ratna Deep (Bengali Picture) at Famous Cine in the evening. Wasted 5 Rupees* ని. "5 రూపాయలు వృథా చేశాను" అనే వాక్యం పక్కన" *on a woman whom I did'nt or more correctly could'nt make use of"* అని చేర్చబడి ఉంది.

***21-12-51***

*Saw three pictures in parts.*

ఆ మూడుచిత్రాల పేర్లూ పక్కనే నోట్ చేశాను. అవి, దుర్గేష్ నందిని, మెజ్‌దీదీ, మషాల్. వీటిలో ఏ ఒక్కటీ చూసిన జ్ఞాపకం ఇప్పుడు లేదు.

*Came to F.F.I. T.M.O from Sarvabhowma Rao was received by accountant. Wrote letter home, was told at the Hotel that there is another T.M.O for me addressed to the Hotel. Saw a picture at 2- 30 P.M. Pathala Bhairavi (only upto 15 reels) Saw another picture in the evening and some shorts.*

చిత్రంపేరు మైకేల్ మధుసూదన్. బెంగాలీ భాషలో. *went with Mr. Atreya. He shifted to another Hotel. Came back to Hotel and slept.*

ప్రజాతంత్ర *12–10–1975*

# సెక్సు సరదాలు

## ఒకటి

ఒక స్త్రీతో ఒకేపూట నాలుగు మార్లు రమించడం నా జీవితంలో ఒక్కమారే జరిగింది. ఆ స్త్రీపేరు శ్రీమతి శ్రీరంగం వెంకటరమణమ్మ *The first Mrs. Sri. Sri.*

తర్వాత 1958 ఆఖరినెలల్లోనో, 1959 మొదటి నెలలోనో నేనూ కుమారి ఉపద్రష్ట సరోజా కలిసి విమానంలో బెంగుళూరు వెళ్లాము. ఉడ్‌లాండ్స్ హోటల్‌లో బసచేశాము. నాలుగే నాలుగు రోజులున్నాము. మొదటిరోజు ఒకసారి, రెండోరోజు రెండుసార్లు, మూడవ రోజు మూడుసార్లు, నాలుగవరోజు నాల్గుసార్లు కలుసుకొన్నాము. అయితే నాలుగోసారి నాకు స్ఖలనం కాలేదు.

1959 మే నెలలో కుమారి సరోజ *2nd.Mrs. Sri Sri* అయింది రిజిస్టరు వివాహం ద్వారా. ఆయేడు సెప్టెంబరులో మా మొదటి పుత్రిక మంజుల పుట్టింది. మా ఆడిటర్ సలహా చొప్పున ఆదాయపుపన్ను లెక్కల నిమిత్తం శ్రీమతి శ్రీ శ్రీ నెం.2 మిసెస్ యు.సరోజగానే నేటిదాకా చలామణీ అవుతోంది. నా డబ్బింగు చిత్రాల ఆదాయంలో ఇంచుమించు సగభాగం ఆమె కష్టపడి ఆర్జించింది.

పెళ్ళీ, ప్రేమా, సెంటిమెంట్లూ ఇలాంటి వాటిమీద నాకు ఎప్పుడూ నమ్మకం లేదు. ప్రేమకథలూ, ప్రేమకోసం ప్రేయసీప్రియుల ఆత్మహత్యలూ ఇలాంటివన్నీ రసవిహీనంగా నాకు కనిపిస్తాయి. పుస్తకాలను నిషేధించడం నాకిష్టంలేదుగానీ నిషేధమే అవసరమైతే కాళిదాసునీ, షేక్స్పియర్‌నీ నిషేధిస్తే బాగుండుననేది నా దృఢ అభిప్రాయం. నా ఉద్దేశంలో సెక్సుకూడా తిండితినడం, ఊపిరితీయటం, నిద్రపోవటం లాంటి ఒకానొక శారీరక వ్యాసంగం మాత్రమే. "నీకు జ్ఞానంవచ్చిన దగ్గర నుంచి ఇప్పటిదాకా ఎంత మందితో పోయావని నన్నెవరైనా అడిగితే నవ్వి ఊరుకుంటాను. అన్నప్రాశన జరిగింది లగాయితు ఇవ్వాళదాకా ఎన్నిసార్లు భోజనం చేశావని ఎవరైనా అడిగితే ఏమని చెప్పడం?"

ఇదేమాట ఒక మిలిటరీ డాక్టరమ్మతో[1] అన్నాను. ఇద్దరం చలంగారిని చూడడానికి బస్సులో తిరువణ్ణామలై వెళుతున్నాము. ఇద్దరి మధ్య నా ట్రావెలింగ్ బ్యాగ్ ఉంది. ఆమె

1 ఈ డాక్టరమ్మగారు ఇంకా మిలిటరీలోనే పనిచేస్తున్నారు. ఈమె చలం భక్తురాలు. చలంమీద అపారమైన ప్రేమ, గౌరవం, అభిమానం, వాత్సల్యం. చలాన్ని 'నాన్నా' అని పిలిచేది.
ఉద్యోగరీత్యా ఏ ఊళ్ళోవున్నా 2,3 నెలలకొకసారయినా చలంగారి దర్శనం చేసుకొనేది.
ఈమె శ్రీశ్రీతో కలిసి ప్రయాణం చేసింది 24–5–1970వ తేదీన.

ఒంటిమీద చెయ్యి వెయ్యలేదు. ప్రయాణంలో *A Phoenix Too Frequent* అనే క్రిస్టోఫర్ ఫ్రై నాటిక చదివి వినిపించాను. తిరుగుప్రయాణంలో మా ఇద్దరి మధ్యా సెక్సుగురించీ, దేవుడి గురించీ తీవ్ర వాదోపవాదాలు జరిగాయి. 'శ్రీ శ్రీ గారూ, మీరు ఎన్నైనా చెప్పండి, ప్రేమ లేకుండా ఒక మనిషి దగ్గర ఎలాపడుకుంటారో నా కర్థం కాదు ' అన్నదావిడ. నా దృక్పథం వివరించాను. నా సెక్సుఅనుభవాలు కొన్ని ఉదాహరించాను. 'అంటే మీ దృష్టిలో *sex act* కీ *urination and defecation*కీ ఏమీ భేదంలేదన్న మాట అందావిడ. అంతే అన్నాన్నేను. 'ప్రేమమీద మీకు నమ్మకం లేదా?' అని తర్వాతి ప్రశ్న. 'నాకుదేవుడిమీదనే నమ్మకంలేదు' అని నా జవాబు!

ఆవిడ రోజుకు కనీసం రెండైనా *Caesarian operations* చేస్తుంది. అదంతా దేవుడి మహిమ అని ఆమె నమ్మకం. రతిక్రియ అనేది అన్ని *Physiological functions* లాంటిదే అయినా, అందులో రెండో మనిషి వాటా ఉంది కాబట్టి, మనం మనుష్యులం కాబట్టి, సెక్సుతో ఆర్థిక, సాంఘిక, మానసిక సమస్యలను జోడించవలసి ఉంటుందన్నాను. ఈ విషయంలో మాత్రం ఆమె నాతో ఏకీభవించింది.

"ప్రేమించకుండా మరో మనిషితో పోవడం ఎలాగా అని ఆవిడ అన్నప్పుడు *"Do you love me"?* అనే ప్రశ్న నా నోటిదాకా వచ్చింది. రైలుబండిలో ఇద్దరమే ఉన్నాము. ఒకవేళ ఆమె 'యస్' అంటే? అందుకే అడగలేదు.

ఎవరెస్టు హోటల్ రూమ్‌లో చంద్రలేఖ స్నానం చేస్తున్నంతసేపూ, ఒక చిన్న ప్రశ్న వేద్దామా, వద్దా? అని నాలో నేను చాలా తర్కించుకున్నాను. ఆమె బైటికి రాగానే *Miss chandra can you spare me a wee little kiss?"* అని అడగాలనుకొన్నాను. ఒక వేళ ఆమె తపీమని, *'It's yours. Take it!'* అంటేనో? కథ అక్కడితో ఆగదు. అందుకే అడగలేదు.

ప్రజాతంత్ర 21–9–1975

## రెండు

"ముళ్లపై పరుండబెట్టి తేళ్ల కమ్చీతో కొట్టి
గంధక ద్రావకం నిండిన కాసారంలో ముంచినా సరే!"

నేను చెక్కుచెదరననే ధైర్యం నాది. శారీరకంగానే కాదు. మానసికంగాకూడా నేనెన్నో బాధలు పడ్డాను. దేనికీ నేను చలించలేదు. అన్నిటినీ నాలో ఇముడ్చుకున్నాను.

పొగిడితే పొంగిపోయి, తిడితే క్రుంగిపోయే మనస్తత్వం కాదు నాది. నేనెంతో అమూల్యంగా ఎంచుకునే నా కవిత్వాన్ని తిట్టేవాళ్లని కూడా నేనెప్పుడూ అసహ్యించుకోలేదు. నా సమస్త రచననూ మెచ్చుకునే ఒక పురిపండా, ఒక జనార్థనరావు, ఒక అబ్బూరి రామకృష్ణారావు- అంతేకాదు, ఒక విశ్వనాథ సత్యనారాయణ కూడా ఉండగా ఇక నేనెవరికైనా ఎందుకు భయపడాలి?

చాలా మంది మనస్సుకి తగిలే గాయాలని సులువుగా తుడిచేసుకోగలరు కాని, ఒంటిమీద దెబ్బపడిందంటే తల్లడిల్లిపోతారు. అందుకే కాబోలు ''దెబ్బకు దెయ్యం జడుస్తుం''దనే సామెత పుట్టింది. దొంగలచేతా, పాలకవర్గ ప్రత్యర్థులచేతా నిజం చెప్పించడానికి పోలీసులు ఉపయోగించే ఆయుధం హింస. అటువంటి హింసకు లొంగిపోయిన దుర్బలులనూ నేనెరుగుదును, ఒళ్లంతా ముక్కలు ముక్కలుగా కోస్తున్నా ఆశయాన్ని మాత్రమే ఆరాధించిన అమరజీవులనూ నేనెరుగుదును.

నన్నెవరూ ముళ్లమీద పరుండబెట్టనూ లేదు, తేళ్లకమ్చీతో కొట్టనూ లేదు. కాని, అంతకుమించిన చిత్రహింసలనే అనేకానేకంగా జీవితం నాకు ప్రసాదించింది.

మద్రాసులో చదువుకునే రోజుల్లో మద్రాస్ ఫుట్ అనే కురుపొకటి నాపాదంమీద లేచింది. (కుడికాలిమీదనుకుంటాను. కొంత కాలం తర్వాత రెండో పాదం మీద కూడా లేచింది.) చిన్న కురుపుగా ప్రారంభమై పాదమంతా వాచిపోవడం దీని లక్షణం. నాలుగైదు రోజులు మొండికేసి తిరిగేను. కాని, నడవడమే కష్టమైపోయింది. అప్పుడు డాక్టర్ జయంతి సుబ్బయ్యగారి దగ్గరకు వెళ్లేను. ''ఎందుకు అశ్రద్ధ చేశావు?'' అని అడిగారాయన. ''ఏదో, అదే పోతుందనుకున్నాను'' అన్నాను. ''భయంలేదు. చిన్న ఆపరేషన్ చెయ్యాలి. కానీ ఈ మాత్రానికి క్లోరోఫారంగాని, లోకల్ ఎనీస్థిటిక్ గాని కావాలంటావా? లేక బాధకి తట్టుకోగలవా?'' అని మళ్లీ ప్రశ్న. ''ఏమీ అక్కర్లేదు, కోసెయ్యం''డన్నాను. నేను చూస్తూండగానే అర అంగుళం లోతు గంటుచేసి అయిదు నిమిషాలలో చికిత్స పూర్తి చేశారాయన. కట్టుకూడా కట్టలేదు. గాయం మీద ఏదో ప్లాస్టర్ మాత్రం వేశారు. మామూలుగా నడుచుకుంటూ వెళ్లిపోయాను.

ఇంకోసారి ఇంకో కాలిమీద ఇలాగే కురుపు లేచింది. నిమిషాలమీద పాదం కూడా వాచిపోయింది. క్షణాలమీద డాక్టర్ సుబ్బయ్యగారి దగ్గరికి వెళ్లాను. చిరునవ్వుతో ఆహ్వానించి చికిత్స చేశారు. గాయం కోస్తున్నంతసేపూ బాధపడలేదని కాదుగాని నేనూ చిరునవ్వుతో ఆ బాధను స్వీకరించాను.

మరో ఉదంతం. ఈసారి విశాఖపట్టణంలో, కొన్ని సంవత్సరాల తర్వాత:

''కోకోజం'' దగ్గరకు వెళ్లవద్దని నా మిత్రులు చాలామంది నన్ను హెచ్చరించారు. ఎందుకంటే, ఆమె ముఖంలో ఎంత ఆకర్షణ ఉందో, శరీరంలో అంత భయంకరమైన పచ్చ సెగ ఉందని అందరూ స్వానుభవం వల్ల గ్రహించిన వాళ్లే. నేను వెళ్లడమేమిటి, మర్నాడే కడు తీవ్రంగా గనేరియా కనిపించడమేమిటి సహజంగానే జరిగిపోయాయి. ఆ రోజుల్లో మా చిట్టిపంతులుగాడు కింగ్ జార్జి ఆసుపత్రిలో పని చేసేవాడు. వాడికి నా అవస్థ విన్నవించాను. ''లాభం లేదు బ్రదర్! ఎవరైనా డాక్టరుదగ్గరకు వెళ్లి ఇంజక్షన్లు తీసుకోవాలసిందే'' అన్నాడు.

ఇంజక్షన్లంటే భయంలేదు గాని ఏ డాక్టరు దగ్గరకు వెళ్లడం? వెళ్లినా అతనెంత డబ్బడుగుతాడో? ఇంజక్షన్ మందు కెంత డబ్బు కావాలో? నాకేమీ పాలుపోలేదు.

హాస్పిటల్ నుంచి నడుచుకు వస్తున్నాను. అప్పుడు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. సమీపంలోని మెడికల్ స్టూడెంట్స్ హాస్టలులో మిత్రుడు మూర్తి ఉన్నాడు. అప్పుడు రెండో యేడో, మూడో యేడో మెడిసిన్ చదువుతున్నాడు. ఆ మాత్రం ఇంజక్షన్ ఇవ్వలేక పోతాడా అని అతని రూంకి వెళ్లాను.

కొన్ని సంవత్సరాల తర్వాత మిలిటరీ డాక్టర్ కాబోయే మూర్తి నన్ను పరీక్షించాడు. ''ఇంట్రావీనస్ ఇంజెక్షన్ ఇవ్వా''లన్నాడు. అంటే రక్త నాళంలోకి. ''సరే, కానివ్వ'' మన్నాను. ''ఇక్కడే ఉండు. ఇప్పుడే వస్తాను'' అని (సైకిల్ మీద వెళ్లాడో యేమో కాని) మందులూ, సిరంజీ ఇత్యాదులు తీసుకుని హుటాహుటిగా వచ్చాడు.

ఇంజక్షనివ్వడం అతనికి కొత్త. ముందు నా ఎడంచెయ్యి ట్రైచేశాడు. ఇక్కడ కాదని అక్కడా, అక్కడ కాదని ఇక్కడా నాలుగయిదు చోట్ల తూట్లు పెట్టాడు. ఎక్కడా రక్తనాళం దొరకలేదు. కుడిచేతిమీద కూడా ఇలాగే కొంత కృషి చేస్తే ఆఖరికి సూదిమందు గమ్యం చేరింది. ఇద్దరం విజయగర్వంతో ఒకరిమొగం ఒకరం చూసుకున్నాము.

''ఒక్క ఇంజక్షన్ చాలనుకుంటాను. అయినా అవసరమైతే రేపు మళ్లీ రా'' అన్నాడు మూర్తి. అవసరం లేకపోయింది.

ఈ మిత్రుడే కెప్టెన్ మూర్తిగా, ఢిల్లీలో ఆలిండియా రేడియోలో ఉద్యోగంపోయి నేనల్లాడుతున్నప్పుడు మిలిటరీలో నాకుద్యోగం ఇప్పించి నన్ను లక్నోకి పంపించినవాడు. అక్కడకూడా నాకుద్వాసన జరిగిందిగాని అది వేరే సంగతి.

పెన్సిలిన్‌ను కనిపెట్టడంతో సుఖవ్యాధులు పరాజయం చిత్తగించాయనుకొంటాను. కనీసం నా విషయంలో, నన్ను నేనో పెనిసిలిన్ కోటీశ్వరుడిగా అభివర్ణించుకోగలను. ఎందుకంటే, నూరు లక్షలకు తక్కువ కాకుండా పెనిసిలిన్ యూనిట్లు తీసుకున్నవాణ్ని కాబట్టి.

సరోజతో పరిచయమైన తొలిరోజుల్లో నా శరీరంలోంచి సుఖవ్యాధుల్ని తరిమెయ్యా లనే సంకల్పం కలిగింది. నా రక్తాన్ని పరిశుభ్రం చేసుకుంటే ఈ అమ్మాయివల్ల ఆరోగ్య కరమైన సంతానం కలుగుతుందని నాకనిపించింది.

మద్రాసులో డాక్టర్ కృష్ణన్ క్లినిక్‌కు వెళ్లి, నా కోరిక తెలియజేశాను. ఒక పూర్తి కోర్సు తీసుకోవాలన్నారాయన. ''నేను సిద్ధమే'' అన్నాను. వరుసగా వారంరోజులనుకుంటాను, ఉదయమూ, సాయంత్రమూ ఇంజక్షన్లు తీసుకున్నాను. ''నువ్వు నిజమైన కమ్యూనిస్టువి! బాధకి బాగా తట్టుకున్నావు'' అన్న డాక్టర్ కృష్ణన్ ప్రశంసని నేనెన్నడూ మరిచిపోలేను.

అవి నా ఐశ్వర్యపు రోజులు. అయినా నా మూలవ్యాధిని డాక్టర్ కృష్ణన్ సమూలంగా తొలగించిన విషయాన్ని ఇక్కడే ఉటంకిస్తాను.

సుమారు నా 15వ ఏటి నుంచీ మూలవ్యాధి నన్ను పీడిస్తూనే ఉంది. ఇది ఎంత బాధాకరమైన జబ్బో అనుభవించిన వాళ్లకే తెలుస్తుంది. దాదాపు నలభై సంవత్సరాలు ఈ వ్యాధితో జీవించాను. ఎప్పుడూ రెండుమూడు రోజులకంటే ఎక్కువ బాధపడలేదు.

తరుచుగా జాంబకీ, అప్పుడప్పుడు హేడెన్సా ఉపయోగించేవాణ్ని. తాత్కాలికోపశమనం కలిగేది.

తర్వాత 1965లో అనుకుంటాను. వరుసగా 15పగళ్లూ, 15రాత్రులూ మంచంమీద దొర్లుతూ బాధపడ్డాను. ఆపరేషన్ చేయించుకోక తప్పదనిపించింది. నా శరీరంమీద జరిగిన శస్త్ర చికిత్సలో మొదటిదీ, ఆఖరిదీ అదే. (కాలి కురుపులు కొయ్యడం మినహాయిస్తే!)

ఈ ఆపరేషన్ జరుగుతున్నంతసేపూ నేను డాక్టర్లతో మాట్లాడుతూనే ఉన్నాను. (డాక్టర్ కృష్ణన్‌తో బాటు ఇంకో డాక్టర్ కూడా ఉన్నాడు) నడుముకి దిగువభాగం మాత్రమే మత్తుమందు ఇచ్చారు. నాకు ఒంటిమీద పూర్తిగా స్పృహ ఉంది. అయినా ఆపరేషన్ జరుగుతున్నట్టే నాకనిపించలేదు.

చికిత్స సక్సెస్‌ఫుల్‌గా ముగిసిన తర్వాత డాక్టర్ కృష్ణన్ "మరో 24 గంటలు నొప్పిగా ఉంటుంది. అది నువ్వు భరించగలవని నాకు తెలుసు" అన్నాడు. ఈ 24 గంటల్లో ఇంకో చిన్న కాంప్లికేషన్ వచ్చింది. నాకు మూత్రం స్తంభించింది. కృత్రిమ సాధనం ఉపయోగించవలసి వస్తుందేమో అని ఇద్దరు డాక్టర్లూ భయపడ్డారు.

కాని ఆ మర్నాటి ఉదయం మామూలుగానే మూత్ర విసర్జన చేశాను. సీసాలో అది పరీక్షిస్తూ డాక్టర్ కృష్ణన్ విజయోత్సాహంతో "దిసీజ్ హెవెన్" అన్నాడు.

*ప్రజాతంత్ర 15–2–1976*

# ఏమిటి? ఎందుకు?

## ఒకటి

"సినీమా సరదాలు" రాయడం తాత్కాలికంగా నిలుపుదల చేసి అసలీ అనంతం ఏమిటో, ఎందుకో విశదీకరిస్తాను. ఇది నా జీవిత కథనం. నా జీవితం కనీసం నాకు అమూల్యమైనది కనుక ఈ రచనను కూడా అమూల్యంగానే భావిస్తున్నాను. నా అరవై అయిదేళ్ళ జీవితాన్ని పూర్తిగా బహిర్గతం చేయడం ఎలాగూ సాధ్యం కాదు. అయినా సాధ్యమైనన్ని కోణాల నుంచి చూస్తూ నా సమగ్ర జీవిత చిత్రం లిఖించడమే నా ధ్యేయం.

'అనంతం' రాయడంలో అన్నింటికన్నా ముఖ్య లక్ష్యం మనం జీవిస్తున్న పెట్టుబడిదారీ విధానపుపరువు తీసి బయటపెట్టడం. ఈ ప్రయత్నంలో నా పరువు కూడా బయటపడడం సహజమే. సెక్సు అనేది జీవితంలో ఒక భాగమే కాదు; ప్రధాన భాగం కూడా! మన సమాజంలో ఆడది డబ్బిచ్చే కొనుక్కునే భోగవస్తువు కావడం కన్నా హేయమైన విషయం ఇంకొకటి ఉండబోదు. తతిమ్మా కారణాలన్నీ అటుండగా ఈ ఒక్క కారణం మాత్రమే చాలు, మన సమాజాన్ని గర్హించడానికి, ఖండించడానికీ!

పెట్టుబడిదారీ విధానం ఉన్న ప్రతీచోట ఇదే రీతి. మాస్కో నగరానికి నేను రెండు సార్లు వెళ్ళాను. కాని నాకు స్త్రీ వాంఛ కలుగనే లేదు. తిరుగు ప్రయాణంలో పారిస్‌లో ఒక రాత్రి ఒక నీగ్రో అమ్మాయిని పలకరించాను. నా దగ్గర ఉన్న డబ్బు కన్నా ఎక్కువ డబ్బు అడిగినందువల్ల నా డబ్బు నాకు మిగిలింది.

కిందటి వారం 'ప్రజాతంత్ర'లో పాళీకేళీ ప్రియుని రచనకు నాకేమీ కోపం రాలేదు. *On the other hand I am extremely sorry because he has hopelessly misunderstood me.* నేనో *Sex Fiend*[1]నీ కాను. *Lady Killer*[2]నీ కాను. అంత మంది అనుకున్న పాళాన కేసనోవా[3] లయిపోలేదు. నా సంగతి నాకు బాగా తెలుసు. నాది చాలా *Normal Sex-Life!* చలం గారు సెక్సుకథలు రాసే రోజుల్లో ఆయన మీద పడ్డ అభాండాలు ఇన్ని అన్నీ కావు. మా ఉభయులకూ కావలసిన ఒక మిత్రుడే, చలం గారి జబ్బు *Satyriasis*[4]

*1. సెక్సుఫియండ్:— కామపిశాచం అనే అర్థంలో వాడాడు.*

*2. లేడీకిల్లర్ అంటే నారీ హంతకుడు.*

*3. కాసనోవా (1825—1898) ఇటలీ సాహసవీరుడు తన జీవిత స్మృతులు ఫ్రెంచిభాషలో రాశాడు. ఇతనిలో సెక్సు విశృంఖలత్వం కనిపిస్తుంది.*

*4. సాటెర్ గ్రీకుపురాణంలో వనదేవుడు. మనిషి ముఖం, మేకకాళ్ళు అచ్చోసిన ఆంబోతులాగా తిరిగేవాడు. సాటెరియాసిస్ అనే విచ్చలవిడి సెక్స్‌జబ్బు ఈ మాట నుంచే వచ్చింది.*

అని ఏ వైద్యశాస్త్రమూ చదువుకోకుండానే నిదానించేశాడు. అందుకు నేను అప్పుడూ ఒప్పుకోలేదు ఇప్పుడూ ఒప్పుకోను.

"అనంతం"నేను ఆషామాషీగా కాని, ఉబుసుపోకకుగానీ రాయలేదు. కళాకారుడుగా కూడా రాయలేదు. ఒక సైంటిస్టుగా నా జీవిత వాస్తవికతను సందర్శించే ఉద్దేశంతో రాస్తున్నాను. ఇందువల్ల నా అభిమానులు తమ మనస్సులలో కల్పించుకున్న ఇమేజ్ బద్దలయిపోయే ప్రమాదం ఉంది. కాని నాది సత్యాన్ని పరిశీలించే ప్రయత్నం. నిజం ఎల్లప్పుడూ తియ్యగానే ఉండదు. చేదునిజాలను దాచడమూ, మధురమైన అబద్ధాలను సరఫరా చెయ్యడమూ లాభసాటి వ్యాపారం కావచ్చు. కాని నాకా, లాభమూ వద్దు; ఆ వ్యాపారమూ వద్దు.

యోగులు పారలౌకిక సత్యాన్ని అన్వేషిస్తారు. నేనొక వైజ్ఞానికుడుగా పాంచభౌతిక సత్యాన్నే ఆరాధిస్తాను.

కళలలోగాని, జీవితంలో గానీ వాస్తవికతకు రావలసినంత గౌరవప్రదమైన హోదా వచ్చినట్లు కనిపించదు. ఒక సినిమాలో మెడ కోసిన కోడి పరుగెత్తి పరుగెత్తి పడిపోయే దృశ్యానికి ఎంత మంది తట్టుకోగలరు?

నేను మద్రాసులో *Alliance Francaise* లో సభ్యుడుగా ఉండే రోజుల్లో మంచి మంచి ఫ్రెంచి చిత్రాలను చూశాను. (ఝూ పోల్ సర్త్ రచించిన *The Chips are down* అనే ఫిలిం అప్పుడు చూసిందే) మరో చిత్రం గురించి ఇక్కడ రాస్తాను.

ఒకానొక సముద్ర తీర గ్రామానికి కొత్తగా ఒక డాక్టరమ్మ వస్తుంది. అచ్చట రేవు ఇంజనీర్‌ను ప్రేమిస్తుంది. పెళ్ళి చేసుకోకుండా వాళ్ళిద్దరూ కలిసి మెలసి తిరుగుతూ ఉండడం గ్రామస్థులందరికీ కంటగింపుగా ఉంటుంది. మరో ఊరికి పోయి బతుకుదా మంటాడు ఇంజనీరు.

కాని ఆఖరికి వాళ్ళు విడిపోతారు. ప్రాణాపాయ స్థితి నుంచి ప్రియుణ్ణి కాపాడుకున్న తర్వాత ఆసుపత్రికి తిరిగి వచ్చిన డాక్టరమ్మ అక్కడ రకరకాల రోగాలతో బాధపడుతున్న చిన్న పిల్లలను వారి గతికి వాళ్ళను వదలలేనంటుంది. ఇంజనీరు ఆమెజీవితం నుంచి నిష్క్రమించడంతో కథ ముగుస్తుంది.

ఇక్కడ నేను పేర్కొనదలచిన సంఘటన ఒకటుంది. ఇంజనీరు తీవ్ర అస్వస్థత గురించి తెలుసుకున్న డాక్టరమ్మ తుఫాన్‌లో ఒంటరిగా పడవ మీద అతడున్న చోటు చేరుకుంటుంది. వ్యాధి అంత ప్రమాదించేదేమీ కాదని గ్రహిస్తుంది. సకాలంలో ఆపరేషన్ చేస్తే నయమయే *Appendicitis.* చాలా *Simple operation.*

ఈ ఆపరేషన్ దృశ్యం తెరమీద ఒక నిమిషం కూడా ఉండదు. అయినా పొత్తి కడుపు మీద డాక్టరమ్మ గంటు పెట్టిందో లేదో ప్రేక్షకులలో ఒక అమ్మాయి కుర్చీ నుంచి పడిపోయి మూర్ఛపోయింది. వాస్తవికతను చూసి తట్టుకోలేకపోవడానికి ఉదాహరణగా ఇది ఉటం

కిస్తున్నాను.

ఇంతెందుకూ? గూడూరులో పుచ్చలపల్లి సుందరయ్యగారు ఉపన్యసిస్తున్న ఎలెక్షన్ల సభలో ఒక తలపగిలిన కామ్రేడ్‌ను చూసిన తర్వాతనే నాకు మతిచలించడమూ, సుమారు రెండు నెలల బాటు ఒక *Mental Clinic*లో చికిత్స పొందడమూ జరిగేయి.

అలాగని వాస్తవికతను మరుగుపరచడానికి వీల్లేదు. నిజం చెప్పాలంటేదే. సందేహం లేదు. కాని, దానిమీద చన్నీళ్లు జల్లకూడదు.

పా.కే.ప్రియుడు మున్నూటఅరవై అయిదురోజులూ మనుష్యులకు మేటింగ్ సీజన్ అంటాడు. కాని ఎవ్వరూ మున్నూట అరవై రోజులూ మేటింగ్‌తోనే గడపరనే నిజం ఆయనకు తెలియదు గనుకనా!

''అనంతం''లో మోతాదుకు మించిన సెక్సు ప్రవేశపెట్టానని కూడా నేననుకోను. ఎందువల్లనంటే ఎవరి మోతాదు వాళ్ళది. *Excessive Preoccupation with Sex* అనేది నాకెప్పుడూ లేదు.

పారిశ్రామిక నాగరికతను నేను రెండు చేతుల్తోనూ ఆహ్వానిస్తాను. మన పూర్వులకంటే మనమే బాగా బ్రతుకుతున్నామని నా దృఢ విశ్వాసం. శారీరక సౌఖ్యంతో మానసికానందాన్ని పోటీ పెట్టనక్కరలేదు. మానసిక వ్యాసంగం కూడా *Final Analysis*లో భౌతికమైనదే అని శాస్త్రీయ విజ్ఞానం అంగీకరిస్తుంది.

మంచి భోజనం చెయ్యడంలో మానసికానందం లేదా? చాలాకాలం కిందట బెజవాడ గోపాలరెడ్డిగారి పెళ్ళి సందర్భంలోనూ, ఇటీవల యం.యస్.రెడ్డిగారి పుత్రిక పెళ్ళి సందర్భంలోను చక్కని శాకాహారపు విందారగించాను. ఈ రెండు విందుల్లోనూ భోజన సుఖాన్ని నా మనస్సు కూడా ఆస్వాదించింది. ఈ రెండింటికన్నా మిన్నగా భావిస్తాను ఇంకో సందర్భాన్ని.

చీరాల నుంచి బాపట్ల నడిచివెళ్తున్నాను. పదిమైళ్ళదూరం! ఎండలో నడుస్తు న్నానేమో సగం దారిలో విపరీతంగా ఆకలి వేసింది. ఒక చిన్న టీ దుకాణంలో ఒక వృద్ధురాలు వేడివేడిగా పొంగరాలు పోస్తోంది. అవి తిని అరకప్పు టీ తాగి అద్వితీయానందం అనుభవించడం నాజీవితంలో ఒక మరపురాని సంఘటన.

నా మొదటి సెక్సు అనుభవం నాతోనే అంటే చాలామంది నమ్మలేకపోవచ్చు. కాని ఇది నిజం. *Excuse me! I am not speaking about masturbation.* అప్పుడు నా వయస్సు రమారమి పదేళ్లు. విశాఖపట్టణం జగన్మిత్ర సమాజంలో బాలపాత్రలు ధరించే వాణ్ణి. ''కృష్ణలీలలు'' నాటకంలో నా చేత అశరీరవాణి వేషం వేయించారు. ఆడవేషం! నిలువుటద్దంలో ప్రతిబింబించిన నన్ను నేను మోహించాను. కేవలం నా రెండుకళ్ళతో.

నేను మిక్కిలిగా గౌరవించే కృష్ణాబాయిగారు కూడా చీవాట్లు పెడుతూ ఒక ఉత్తరం రాశారు. అందులో ''వయస్సు ముదిరాక *Sex* కళ్ళలోంచి బయటకొస్తుందట'' అన్నారు.

విన్నా, ఇవాళ కాదు. పదేళ్ళ చిన్నతనంలో నేను కళ్ళతో సెక్సుని చవి చూశాను.

సమాజానికి ఉత్తేజం కలిగించే విధంగా రాయమని ఆవిడ సలహో. ఒప్పుకుంటాను. సమాజానికి పనికిరాని రచన పనికిమాలిన రచన అనే విషయంలో మా యిద్దరికీ భేదాభిప్రాయాలు లేవు. కాని 'అనంతం' వల్ల మన సమాజాన్ని మరమ్మతు చేయగలననే భ్రమలు నాకు లేవు. ఒక విధంగా నా స్వీయచరిత్ర, నిజంకోసం నేను జరుపుతున్న అన్వేషణ. ఇది సమాజానికొక హెచ్చరికగా పని చేస్తే నేను కృతకృత్యుణ్ణి అయినట్లే. నా కవిత్వం చాలా మందిని *Inspire* చేసిందని నాకు తెలుసు. ఆ శక్తి నా జీవితగాథకి లేదేమో? అయినా ఈ అన్వేషణ ఇలా సాగవలసిందే!

'అనంతం' ఒక సృజనాత్మకమైన కళాఖండంగా తయారు కావాలని నేనీ రచనకు ఉద్యమించలేదు. అందుకు వేరే ప్రక్రియలున్నాయి. ఉదాహరణకు సినిమా! ఇప్పుడిప్పుడే నాకు తెలుగుసినిమా గురించి కొంత సదభిప్రాయం ఏర్పడుతోంది. త్వరలోనే మన సినిమా రంగంలో మంచి మార్పులు రాగల సూచనలు కనబడుతున్నాయి. ఇందుకు ఇటీవలనే విడుదల అయిన 'తీర్పు' చిత్రం ఒక నిదర్శనం.

*ప్రజాతంత్ర 19—10—1975*

## రెండు

ఔను మరి! ఏమిటిది? ఎందుకని?

ఉన్నది ఉన్నట్టు చెప్పాలనీ, జరిగింది జరిగినట్టు రాయాలనీ నా తపన. అలా చెబితే, అలా రాస్తే సాహిత్యమవుతుందా, శిల్పమవుతుందా అనే ప్రశ్నలలా వుండగా ప్రస్తుతపు మన సమాజం, మన జీవితాలు, మన మర్యాదలూ, నీతి నియమాలు అందుకు సహిస్తాయా! ఎంత మాత్రమూ సహించవు సరికదా, ఒక పెద్ద గాలిదుమారాన్ని లేవదీస్తాయి. అంతటితో ఆగుతుందా! ఏలిన వారికి సరిపడని సంగతులయితే కారాగారం నుంచి మరణశిక్ష దాకా కావలసినన్ని చట్టాలున్నాయి.

అందుకే ఎందుకీ గొడవని రామాయణాలు రాసుకునే వాళ్లకి పుణ్యమూ, పురుషార్థమూ రెండు దక్కుతూ ఉంటాయి. అంతేకాదు, వాళ్ళెంతో ప్రయోజకులని లోకం కీర్తిస్తూ ఉంటుంది. అదే మన సభ్యత అనీ, సంస్కారమనీ, నాగరికత అనీ సంబరపడుతూ ఉంటుంది.

లోకం అనా అన్నాను? కాదు. అందులో చిన్నభాగం మాత్రమే! అయితేనేం? దానికి నోరుంది. బలముంది. అధికారముంది. అందుకు జడిసిగాని, ప్రలోభపడిగాని నేను ఈ రచనను ఇంకో విధంగా సాగిస్తే నాకు నేను ద్రోహం చేసుకున్న వాణ్ణి అవుతాను. అది చేతకాక కాదు, ఇష్టం లేక - ఇలా రాస్తున్నాను.

పోనీపోనీ పోతేపోనీ సతుల్ సుతుల్ హితుల్ పోనీ పోతేపోనీ...!

ఈ త్యాగం అంతా ఎందుకంటే

కానీ కానీ గానం, ధ్యానం హాసం లాసం —

అనగా ఒకటి రెండు మాటల్లో చెప్పాలంటే కళ కోసం కవిత్వం కోసం.

ఆ రోజుల్లో నేను కన్నూ మిన్నూ తెలియని కవనతాండవం చేస్తూ ఉండేవాణ్ణి. నన్ను కవిగా బతకనిచ్చిన వాడు మా నాన్న. అయితే మళ్ళీ, అసలీ కవిత్వాలన్నీ ఎందుకోసం అనే ప్రశ్న వస్తుంది!

కావ్యం యశసే, అర్థకృతే, వ్యవహారవిదే శివేతర క్షతయే.. అంటూ ఒక పెద్ద లిస్టు ఇచ్చాడు మమ్మటాచార్యుడు. చాలామంది మొదటి రెండిటికోసం కవిత్వం రాస్తూ ఉంటారు, బతుకుతూ ఉంటారు. వీళ్ళందర్నీ వడబోసి సెకండ్ రేట్ కవులుగా కాలం తన చెత్తబుట్టలో పారేస్తుంది.

నేను వ్యవహారవేదిని కావాలని కవిత్వాన్ని చేబట్టలేదు. ''శివేతర క్షతి''! అదీ నాధ్యేయం! అదే ఈ నాటి పరిభాషలో చెప్పాలంటే సమాజ క్షేమం! ఒళ్ళు దగ్గిర పెట్టుకొని రాయడం అంటే సామాజిక స్పృహతో రాయడమన్నమాట. ఈ 'అనంతం' ఒక జిగ్సా పజిల్. ప్రతీ ప్రహేళికకీ దాని పరిష్కార మార్గాలు దానిలోనే ఉంటాయి.

జీవితం ఒక ప్రహేళిక. అయితే ఆ పజిల్‌ని సాల్వ్ చేసే క్లూస్ అందులోనే ఉంటాయి.

నారాయణబాబు అనేవాడు!''ఒరే తమ్ముడూ! బతుకే ఎలా బతకడమో నేర్పుతుందిరా'' అని.

జీవితం అనే సమస్యను పరిష్కరించే మార్గాలను వెదుక్కోవడమే 'అనంతం' అనే ఆత్మ చరిత్రాత్మ చరిత్రాత్మక నవలని రాయడం.

దీన్ని 'నవల' అని కావాలనే అంటున్నాను. ఎందుకంటే ఇందులో వచ్చే పాత్రలన్నీ బతికి ఉన్న వాళ్ళు కాబట్టి!

వెంటనే అందుకుంటాడు నీ విమర్శకుడు ''మమ్మటయ్య బతికున్నాడా? నారాయణ బాబు బతికున్నాడా?'' అని వెధవాయా, నీకన్నా నాకన్నా మిన్నగా ఆ యిద్దరూ బతికే ఉన్నారురా అని జవాబు.

బతకడం అంటే ఏమిటి?

బతకడం అనేది ఎందుకు?

ఈ రెండు ప్రశ్నలకు జవాబే ఈ రచన.

మనం కాలంలో జీవిస్తున్నాం కాని, కాలానికి లోబడి కాదు. కాలాన్ని మన కంట్రోల్‌లో ఉంచుకుని జీవించాలి.

ఇది సాధ్యమా? అయితే ఎలా సాధ్యం. ''కవిత్వం ఒక హ్రస్వలిపి'' అన్నాడు ఒక విమర్శకుడు. అల్పాక్షరముల అనల్పార్థరచన అని అంతకుముందే అన్నాడు మన తెలుగు కవి.

ఒక క్షణాన్ని బ్లోఅప్ చేస్తే అనంతం అవుతుంది. నా జీవితం అనంత కాలంలో ఒక

అర క్షణం. దాన్ని ఊది ఊది ఊది.. అనంతం చేస్తున్నాను.

నాజీవితం క్షణంలో సగం మాత్రమే. రెండో సగం ఆడది.

ఓ చెరిగిపోయిన అక్షరాల్లారా,
పారిపోయిన క్షణాల్లారా
ప్రవహించండి నా కలంలో
సిరాల్లాగా!

రెండో సగం ఆడది అన్నానే ఆ కథలో, "హంసతో ఆరునెలలు" అనే రచనలో చెబుదామనుకున్నాను. అమ్మయ్యో! ఆడదాని ఆసరా లేకుంటే నేను బతగ్గలనా?

17-10-1975.

ఇవాళ ఇది రాస్తున్నాను. ఏమిటి రాస్తున్నాను?

ఎందుకు రాస్తున్నాను?

జీవితం అనేది ఏమిటో ఎందుకో తెలుసుకోవడానికి రాస్తున్నాను.

నా వెనకాతల గడచిపోయిన సంఘటనలు, నా తరవాత రాబోయే క్షణాలు తీసుకురాబోయే నిజాలు ఈ జీవితం అనే అద్దంలో ప్రతిబింబింబిం..చాలని ఇలా రారారా.. రాస్తున్నాను.

ఇదీ అనంతం.

ఇంకా ఉంది. ఎప్పుడూ అయిపోదు.

ప్రజాతంత్ర *26–10–1975*

## మూడు

"అనంతం" నా ఆత్మ చరిత్ర అనడం కన్నా ఆత్మపరీక్ష అంటేనే నిజానికి న్యాయం చేకూర్చినట్టు అవుతుంది. జీవితం అనే పరిశోధనశాలలో దీనినొక ప్రయోగంగా భావిస్తున్నాను. ఒక సైంటిస్టుకూ, లేబరేటరీకి ఉన్న సంబంధమే నాకూ, నా జీవితానికీ ఉంది. శాస్త్రీయ దృక్పథం అనే టార్చిలైటువేసి నా జీవితంలోని చీకటి కోణాలను వెలిగించబోయే ప్రయత్నమే ఈ రచన.

కళ, శిల్పం, సాహిత్యం-చివరికి రాజకీయాలుకూడా ఎన్నో అశాస్త్రీయమైన ప్రభావాలలో పడి గింజుకుంటున్నాయి. మన ఆలోచనల చుట్టూ ఎంతో బూజు పేరుకుపోయి ఉంది. ఎందరెందరో తాత్వికులు ఈ బూజును అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు. ఒక్క మార్క్సు మహాశయుడు మాత్రమే ఈ బూజును తొలగించే మార్గాన్ని సూచించాడు.

అందువల్ల "మార్క్సిజం" కూడా తతిమ్మా అన్ని మతాలలాగే మరో మతం మాత్రమే అంటే నేనంగీకరించను. అన్ని మతాలూ మనిషిని దేవుడిగా మార్చడానికి ప్రయత్నించి విఫలమైనాయి. ఒక్క "మార్క్సిజం" మాత్రమే మనిషిని మనిషిగా గుర్తిస్తుంది. మనిషిగా బ్రతకటం ఎలాగో చెబుతుంది. అలాగ బతకడాన్నే కమ్యూనిజం అంటాన్నేను.

అయితే కమ్యూనిస్టుగా బతకాలనుకుంటున్నానే తప్ప బతకలేకపోతున్నాను. రాయాలను కుంటున్నానే తప్ప రాయలేకపోతున్నాను. కాని అలా రాయగలననీ, అలా బతకగలననీ ఆశతోనే బతుకుతున్నాను.

మానవుడు కమ్యూనిస్టు మానవుడుగా బతకాలంటే ప్రపంచం అంతటా కమ్యూనిజం ఏర్పడినప్పుడే అది సాధ్యం. ఆ దిశగానే ప్రపంచచరిత్ర ప్రయాణం చేస్తున్నదనే వాస్తవం నాకు తెలుసునుకాబట్టి వ్యక్తిగతంగా నేను బతకాలనుకున్న విధంగా బతకలేకపోతున్నా. నా తరువాతి తరాలవారు తప్పకుండా ఈ గమ్యానికి చేరుకుంటారనే విశ్వాసం నాకుంది.

అంతటితో ఈ గమనం ఆగిపోతుందనుకోవడం పొరపాటు. చరిత్ర నిశ్చలమైనది కాదు. నిరంతర గమనశీలమైనది. ఇంకా ముందుముందుకే కదిలిపోతూ ఉంటుంది. కాలం అనే గడియారాన్ని ఎవరూ వెనక్కి తిప్పలేరు. కమ్యూనిస్టు సమాజంలో జీవిస్తున్న మానవుణ్ణి కమ్యూనిజాన్ని మించినమరేదో ఆదర్శమేదో ఆకర్షిస్తూ తనవైపు రారమ్మని ఆహ్వానిస్తూ ఉంటుంది.

అందుకే నా జీవిత పరిశీలనకు ''అనంతం'' అని పేరు పెట్టాను. ఎంతసేపూ గతాన్ని నెమరువేసుకోవడమే ఈ రచన ఉద్దేశం కాదు. పాత సంగతులను తవ్విపోస్తూ నేనేమీ మురిసిపోవడంలేదు. ''ఇదిగిది ఇలా జరిగింది'' అని చెప్పడంలో సంతోషమూ లేదు. దుఃఖమూ లేదు. అలా చెప్పడానికి కావలసిన నిర్లిప్తత కోసం అన్వేషిస్తున్నాను.

ప్రేమ, దేవుడు ఇలాంటి భావాలకు నేను బద్ధశత్రువుని. ఎంచేతంటే ఇవేవీ లేవని నాకు తెలుసుకాబట్టి! మరైతే లేనివాటికోసం పోరాటం దేనికి? అవి ఉన్నాయనుకుంటున్న వాళ్లు ఉండడంవల్ల.

''అమ్మయ్యో, ప్రేమ లేకపోతే బతగ్గలమా?'' అని కొందరు! ఆ దేవుడంటూ ఒకడుండబట్టే మనం ఇంకా ఇలాగ బతగ్గలుగుతున్నాం?'' అని కొందరు.

శిల్పికి ఉలి కావాలి. కవికి కలం కావాలి. మగాడికి ఆడదీ, ఆడదానికి మగాడూ కావాలి. ఇందులో ఏ ఒకటీ రెండోదాన్ని ప్రేమించనక్కరలేదు. అవసరాన్ని గుర్తించవలసిన అవసరం మాత్రం ఉంది. అదే స్వాతంత్ర్యం!

దేవుడిచుట్టూ మనం ఎన్నో మూఢవిశ్వాసాలను పెంచుకున్నాం. ఆ భ్రమలలోంచి బయటపడలేక పోతున్నాం. మన శక్తిమీద నమ్మకంలేక మన జీవితాలకి పూచీ వహించే మరేదో శక్తి ఉందనుకుంటున్నాం. ఇదే బానిస మనస్తత్వం.

ఒకసారి అనకాపల్లిలో నేను ఉపన్యసిస్తున్నాను. సలభై, ఏభై ఏళ్ల కిందట! బైట జోరుగా వానపడుతోంది, ఉరుములతో! మెరుపులతో! ఆ రోజుల్లో నాకు పెద్ద ఉపన్యాస ధోరణి లేదు. అయినా సభలోని వారంతా శ్రద్ధగా వింటున్నారు.

''దేవుడు లేడు'' అన్నాన్నేను. అంతే! హఠాత్తుగా విద్యుద్దీపాలు ఆరిపోయాయి. హాలంతా అంధకారం ఆవరించింది. చాలామంది కుర్రాళ్లు ''ఉన్నాడు'', ''ఉన్నాడు''అని అరుస్తున్నారు.

ఏదో ఒక గొప్పసత్యం ఋజువైనట్టు పొంగిపోతూ!

నిలుచున్నవాణ్ణి నేను కుర్చీమీద కూర్చుండి సిగరెట్టు తీసి అగ్గిపుల్లగీసి వెలిగించాను. మరో రెండు నిమిషాలలో దీపాలు వెలిగాయి. ఈ సంఘటనవల్ల దేవుడు లేనట్టు ఋజువై పోయిందని నేను భావించలేదు. కుర్రాళ్ల గొంతుకల్లో భయాన్ని స్పష్టంగా పసిగట్టాను.

ఇంకో సంఘటన! మర్నాడు స్కూల్ ఫైనల్ పరీక్ష. ఇంగ్లీషు ఫస్టు పేపరు. క్రితం రాత్రంతా షెర్లాక్ హూమ్స్ నవల ఒకటి చదివి ముగించి నిద్రపోయాను. తెల్లారి పరీక్షకు బయలుదేరేసరికి ఎవరిదో తుమ్ము! నేను లక్ష్యం లేకుండా నడిచిపోయాను.

పరీక్ష ప్యాసయ్యాను.

నిన్నగాక మొన్న విజయవాడ బృందావన్ హోటల్ నుండి బయలుదేరేటప్పుడు ఎవరో తుమ్మేరు. నేను సరాసరిగా "విశాలాంధ్ర" మేనేజరు దగ్గరకు వెళ్లి నాకు రావలసిన వెయ్యి రూపాయలు తీసుకున్నాను. ఇలా తుమ్ము విని బయల్దేరడం మొదలు, చెక్కు తీసుకునే దాకా ఒక గుంటూరు మిత్రుని ప్రత్యక్ష సాక్ష్యం ఉంది.

దేవుడి విషయంలో ఈ ఋజువులూ, సాక్ష్యాలూ కేవలం నిష్ప్రయోజనం! మానవ మనస్సులో ఒక బలహీనత ఉంది. అది తాను దేన్నయితే నమ్మదలచుకుంటుందో దాన్ని నమ్మేస్తుంది.

క్రీస్తు మంచినీళ్లను మద్యం చేశాడనీ, చచ్చిపోయిన వాళ్లని బతికించాడనీ, కృష్ణుడు చిటికెడు వేలిమీద గోవర్ధన పర్వతాన్ని నిలబెట్టాడనీ, ఫలానా బాబాగారో మామ్మగారో మంత్రాలకు చింతకాయలను రాలుస్తారనీ నమ్మటానికి కావలసింది ఈ జీవితపు తెలివితేటలు కావు, పూర్వజన్మ సుకృతం!

నాకు మాత్రం ఈ పూర్వజన్మల మీదా ఉత్తర జన్మల మీదా అణులేశమూ నమ్మకంలేదు.

దేవుడున్నాడనే అబద్ధాన్ని నిలబెట్టడానికి అనంతమైన అబద్ధాలు అవసరం! దేవుడు లేడనే నిజాన్ని నిరూపించడానికి అనంతమైన నా జీవితమే నిదర్శనం.

*ప్రజాతంత్ర 2–11–1975*

# కృష్ణశాస్త్రి జ్ఞాపకాలు

ఒకటి

కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవం (1925-1975) సంచికలో మొదటి సారిగా ఈ జ్ఞాపకాలను ప్రచురించడం జరిగింది. అందులో ఇలా రాశాను:

నా చిన్నతనంలో పద్య రచనా వ్యాసంగం ప్రారంభించినప్పుడు నామీద రెండు ప్రభావాలు బలవత్తరంగా పనిచేసేవి. ఒకటి కృష్ణశాస్త్రిది. రెండోది విశ్వనాథది. ఈ ఇనుప పిడికిళ్ళ నుండి బయటపడడానికి నాకు సుమారు పది సంవత్సరాలు పట్టింది. సరే. అది అలావుంచుదాం.

ఆ రోజుల్లో కలంపట్టిన ప్రతి కవీ కృష్ణశాస్త్రి ఆకర్షణకి లోనయినవాడే! అణుబాంబు రేంజి 500 మైళ్ళంటారు. ఆంధ్రదేశం అంతటా కృష్ణశాస్త్రి రేడియో ధార్మికశక్తి ప్రసరించింది. ఈనాటి యువతరంమీద సినిమాతారల ప్రభావం ఎంతవుంటున్నదో ఆరోజుల్లో మాలాంటి వాళ్ళమీద కృ.శా. సమ్మోహనశక్తి అంతగానో, మరింతగానో వుండేది. నేను కృ.శా. కవితాశైలినే అనుకరించేవాణ్ణి. కానీ, మా నారాయణబాబు- కృష్ణశాస్త్రి సింహం జూలును కూడా అనుసరించి, దాన్ని రోజూ సంపెంగనూనెతో సంరక్షించుకునేవాడు. నా కెప్పుడూ పద్యంమీద ఉన్నశ్రద్ధ జుత్తుమీద ఉండేదికాదు. ''మా అక్కౌ జుత్తుకి చవుర్రాసుకోదు'' అని నా గురించి కూడా కన్యాశుల్కంలోని వెంకటేశం అని ఉండవచ్చును.

దాదాపు 50 సంవత్సరాల కృష్ణశాస్త్రి జ్ఞాపకాలను ఈ చిన్నవ్యాసంలో రాయడం అసాధ్యం. నా ఆత్మచరిత్రాత్మ చరిత్రాత్మక నవలలో అవి ధమనుల్లాగ స్పందించగలవు. ఒకానొక పత్రికలో ఆ నవలను ధారావాహికంగా వెయ్యడానికి ఏర్పాట్లుజరిగాయి. (అదే ఇప్పుడు మీరు చదువుతున్న ''ప్రజాతంత్ర'' పత్రిక.)

ఇక్కడ ఒకే ఒక్క విశేషాన్ని రాసి ఊరుకుంటాను.

''అసలు శ్రావణమాస మధ్యమ్మునందు
కురిసితీరాలి వర్షాలు, కొంచె కొంచె
మేని రాలాలి, తుంపరలేని, కాని
ఉక్కమాత్ర మేమాత్రమూ ఉండరాదు''
(జైలులో శ్రావణం)

ఇలా ప్రారంభమైన ఒక ఖండకావ్యాన్ని మారుపేరుతో భారతిలో ప్రకటించడానికి ముందు దీనికొ ఉపోద్ఘాతం నాచేత రాయించడానికి మల్లవరపు విశ్వేశ్వర రావు చేత రాయబారం పంపేరు

కృ శాస్త్రి. స్వయంగా అడిగితే నేను రాయనా? అబ్బే! అది కృ.శా. పద్ధతికాదు. (జైల్లో శ్రావణం, నాముందు మాటతో సహా "భారతి"లో పడింది. తేదీ జ్ఞాపకంలేదు).

ఈ అభినందన సంచికలో నా రచన ఉండితీరాలని కృ.శా. పట్టుదల. ఆ రాయని భాస్కరుడు నన్ను రాయమని అడగలేదు. శ్రీ యం.యస్.రెడ్డి చేత ఫోన్ చేయించారు. ఇదీ ఫలితం!

*కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవ సంచిక మద్రాసు 1975*
*పునర్ముద్రణ: ప్రజాతంత్ర 8–6–1975*

## రెండు

అవి మా ఆవిడ కొత్తగా కాపురానికి వచ్చినరోజులు. అప్పుడే కృ.శా. కొత్తగా విశాఖపట్టణానికి రావడం జరిగింది. నేను ఇల్లూవాకిలీ వదిలి కృ.శా. చుట్టూ ఉపగ్రహం లాగ తిరగడమే కాక ఆయనబృందం విజయనగరం వెళ్ళితే నేనూ వెంటబడ్డాను. విజయనగరంలో కృష్ణశాస్త్రిగారి బస మా నారాయణబాబు ఇంట్లోనే. అలా సుమారొక వారంరోజులు ఇంటినుండి అంతర్ధానమైన నేను తిరిగి వచ్చాక మా నాన్నగారు "కవిత్వాన్నీ, కవుల్నీ మెచ్చుకోవడం బాగానే ఉంది గాని ఇంట్లో నీ పెళ్ళాం గురించి కొంచెం ఆలోచించడం కూడా మంచిదేమో" అని మెత్తగా మందలించారు. మా నాన్న నన్నెప్పుడూ గట్టిగా కోప్పడలేదు. ఆ చిన్నసైజు చివాట్లకే నా మనస్సెంతో చివుక్కుమంది. ఏదో మెస్మరిజం మైకం నుంచి తేరుకున్న వాడిలాగా మళ్ళీ స్మారకంలోకి వచ్చాను. అలా ఆకర్షించేది ఆనాటి యువకుల్ని కృష్ణశాస్త్రి పెర్సనాలిటి!

విజయనగరంలో కృ.శా. కవిత్వాన్ని తాపీ ధర్మారావుగారు[1] ఘాటుగా విమర్శించారు. ఎవరికీ తాపీవారి నెదిరించే దమ్ముల్లేవు. పాత కవిత్వం ఎందుకు బావుండదో, భావ కవిత్వం ఎందుకు నచ్చిందో మాకు మేమే నచ్చజెప్పకోలేక మానసికంగా వాంతులుమాత్రం చేసుకున్నాము.

అప్పటికింకా "ప్రవాసం, ఊర్వశి" గ్రంథరూపంలో రాలేదు. అయితేనేం నారాయణబాబు

నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమాసుధాగాన మంజువాటి,
ఏనొక వియోగ గీతిక

అంటూ ఇల్లెగర గొడుతూ ఉంటే-

కవిత్వం ఇడ్లీలను, సంగీతం సాంబారులో ముంచి వెండిప్లేటులో సప్లయ్ చేసినట్టాండేది. అవి ఈ శతాబ్దపు నాలుగోదశాబ్దపు (*hungry thirties*) ఆకలి రోజులని ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది.

1 *తాపీ ధర్మారావు (1887–1973)గారు ఆంధ్ర విశారద బిరుదాంకితులు. విమర్శలో కొత్తపుంతలు తొక్కారు. బరంపురంలో వేగుచుక్క గ్రంథమాల సంస్థాపకుల్లో ఒకరు. 'పాతపాళి', 'కొత్తపాళి', 'పెళ్లి— దాని పుట్టుపూర్వోత్తరాలు', 'దేవాలయాలమీద బూతు బొమ్మలెందుకు?', 'విజయవిలాస హృదయోల్లాస వ్యాఖ్య', మొదలైన పుస్తకాలు రాశారు. కాగడా, జనవాణి పత్రికలకు సంపాదకత్వం వహించారు.*
*అభ్యుదయ రచయితల సంఘం మొదటి మహాసభ (1943)కు అధ్యక్షత వహించారు.*

మల్లవరపు విశ్వేశ్వరరావు 'మధుకీల'కు వ్రాసిన పీఠికలో కృష్ణశాస్త్రి, ''విశ్వేశ్వరరావూ! నువ్వు కవిత్వం రాయాలయ్యా! బాగారాస్తావు'' అంటూ యోగ్యతాపత్రం ఇచ్చి ''అందరి కష్టాలతోనూ ఈ మాట నేననను. విశ్వేశ్వరరావు కవి, నిజంగా కవికాబట్టి ఇలా అంటున్నాను'' అని రాసినసందర్భంలో పెంకితనానికి పెట్టినపేరయిన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి[2] ''నారాయణబాబూ! నువ్వు క్షవరం చేయించుకోవాలయ్యా! బాగా చేయించు కోవాలి తలమాసిన వాళ్ళందరితోనూ నేనీమాట అనను. నారాయణబాబు తలమాసినవాడు. నిజంగా తలమాసినవాడు'' అంటూ ఆశువుగా పేరడీ చేశాడు. దరిమిలాను ఎక్కడైనా ప్రచురించాడేమో తెలియదు. జరుక్ వాగుడులో ఒక వైభవం ఉండేది. కవిత్వాన్నేకాదు, వచనాన్ని కూడా అవలీలగా తిరగేసి తొడిగేసుకునేవాడు. శివశంకరశాస్త్రి[3] లాంటి హేమాహేమీలు కూడా జలసూత్రం నోటిదురుసుతనానికి జడిసేవాళ్ళు. విశ్వనాధవారిని ''పాషాణ పాకప్రభూ!'' అనగలిగినపాటి అహంత రుక్మిణీనాథ శాస్త్రికి గాక మరెవరికుంది?

*ప్రజాతంత్ర 8–6–1975*

## మూడు

శివశంకరశాస్త్రి గారికి పీఠికా పరమేశ్వరుడన్న బిరుదిచ్చినవాడు జరుక్! ఇదేమిటి, కృష్ణశాస్త్రి జ్ఞాపకాలంటూ రుక్కాయి గురించి రాసేస్తున్నాను! మరేంలేదు. కృష్ణశాస్త్రి అన్నా రుక్మిణీనాథశాస్త్రి అన్నా అవి ఒకదానికొకటి పర్యాయపదాలే కాబట్టి! అందుచేత ''రుక్మిణీనాథ శాస్త్రి జ్ఞాపకాలు'' అంటూ ఒక ప్రత్యేకశీర్షిక ప్రవేశపెట్టనక్కరలేదు. ఇక్కడే బుర్రా శేషగిరిరావుమీద జరుక్ రాసిన ఒక గీతపద్యం ఉదహరిస్తాను. బందరులో జరిగిన నవ్యసాహిత్య పరిషత్తుకి కెవాలియర్‌చేరన్ బుర్రా శేషగిరిరావు అధ్యక్షుడు. దాని పెర్మనెంటు హెడ్‌క్వార్టర్స్ శేషగిరిరావు జేబుమాత్రమే! ఏటేటా బిరుదప్రదానాలు చేస్తూవుంటుంది. ''కవిభూషణ'', ''కవిరత్న'' ఇత్యాదులు. వీటిలో అన్నిటి కన్నా గొప్పది ''కవిశేఖర'' అనే బిరుదం. ఆ రోజుల్లో వీటికోసం కోకొల్లలుగా ఎగబడుతూండేవారు కవిపుంగవులు (కవిగోవులు ఆనాడు కొద్దిగా మాత్రమే ఉండేవి. ఇప్పటికీ కవయిత్రీమణుల సంఖ్య అంతంతమాత్రమే. ఈ 1975 ప్రపంచ మహిళాసంవత్సరంలోనైనా మన ఆంధ్రరచయిత్రీ మణులు కనీసం ఆస్థానకవిత్వాలైనా రాస్తే బాగుండును.)

అధ్యక్షోపన్యాసం పేరుతో బు.శే.రా. గారు సుమారు అరటన్ను (నా అంచనా ప్రకారం) బరువుగల ఉద్గ్రంథం తెచ్చి సభలో చదవడం మొదలు పెట్టాడు. రెండుమూడు పేజీలతోనే సభాసదులకు మొగం మొత్తేసింది. ఇది కనిపెట్టి విశ్వనాథ సత్యనారాయణగారు అధ్యక్షుల్ని అవ

2 జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి (1914– 1968)గారు ప్రసిద్ధ కవుల సుప్రసిద్ధ గేయాలకు పారడీలురాసి జరుక్‌శాస్త్రిగా పేరుపొందారు. సాహితీవేత్తలందరికీ తలలో నాలుకలా వుండేవారు. ఆయనను అందరూ ఆప్యాయంగా రుక్కాయి అనేవారు.

3 తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారు (1892– 1977) సాహితీసమితి వ్యవస్థాపక అధ్యక్షులు. 'హృదయేశ్వరి' 'పద్మావతీ చరణచారణ చక్రవర్తి', కావ్యాలు రాశారు. కథాసరిత్సాగరం తెలుగులోకి అనువాదం చేశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి ఉపాధ్యక్షులు (1964–1968)గా వున్నారు.

తలగా కూర్చోండని తానే అనంతర కార్యక్రమాలన్నీ అత్యంత సమర్థంగా నడిపించారు. అప్పటి కవిసమ్మేళనంలోనే నేను "కవితా, ఓ కవితా" అనే రచన చదివేక కన్నీళ్ళతో, గద్గదస్వరంతో "కవిత్వం అంటే ఇదీ" అన్నారు విశ్వనాథవారు. ఆ సభలోనే చాలామంది సాహితీసమితి కవులను చితగ్గొట్టేశారాయన (భౌతికంగా కాదు లెండి). "ఇరవయ్యేళ్ళనాటి పగ ఇవాళ తీర్చుకుంటున్నా"నని ఆయన అప్పుడే సగర్వంగా ప్రకటించారు. మరి అదెంత పురాణవైరమో ఏమో!

ఇక రుక్కాయిపద్యం! ఇదిగో ఉదహరిస్తున్నాను!

"బుర్రగలవాడు! తలపాగ బోనువాడు!
(బూనువాడుకాదు_అచ్చుతప్పనుకోవద్దు)
నవ్యసాహిత్య పరిషద్వినాయకుండు!
నగవు పాలైన బిరుద పిండప్రదాత!
శ్మశ్రు భీకరుడైన శేషగిరిరావు!"
(బుర్రా శేషగిరిరావుగారికి మాంఛి బుర్రమీసాలుండేవి)

మళ్ళీ కృష్ణశాస్త్రి వద్దకువద్దాం! భావకవిత్వానికి అనన్య ప్రచారం ఇచ్చినవాడు కృష్ణశాస్త్రి! దేశమంతటా తిరుగుతూ, తనవీ ఇతర భావకవులవీ గీతాలు గానంచేస్తూ. ముద్దుకృష్ణ సంపాదించిన "వైతాళికులు" కావ్య సంకలనంలో 99 శాతం ఈ గీతాలే! 99 అని ఎందుకంటున్నానంటే కవికొండల వెంకటరావుగారి "శివరాత్రి ప్రభ"ను నేను పట్టుబట్టి వేయించాను. *"Palgraves Golden Treasury"* ముద్దుకృష్ణకు ఆదర్శం, గోల్డెన్ ట్రెజరీలోని చాలాగీతాలను టెన్నిసన్‌కవి ఎంపికచేశాడని అంటారు. అది నిజమోకాదోగాని "వైతాళికులు"లోని రచనల సెలక్షన్‌కి క్రెడిట్ కృష్ణశాస్త్రిదే అని చెప్పకతప్పదు.

తన పర్యటన సందర్భంలో కృ.శా. "వరూధినీ గ్రంథమాల" అనే ప్రచురణ సంస్థకి విరాళాలనూ, చందాదారులనూ పోగుచెయ్యడం సాహిత్యసేవగానే జమకట్టవచ్చును. ఆ గ్రంథమాల పేరిట వెలువడ్డ మొదటి పుస్తకమే (బహుశా ఆఖరిది కూడా అనుకుంటాను) "ప్రవాసము: ఊర్వశి." విజయనగరంలో ఉన్నప్పుడే దీనికి నేను చందాదారుగా నమోదు అయ్యేను. "ఇప్పుడు డబ్బు పంపనక్కరలేదు, నీ చిరునామా ఇస్తేచాలు. పుస్తకం వి.పి.గా వస్తుంది" అనడం, నేను మద్రాసులో నా హాస్టలు చిరునామా ఇవ్వడం జరిగింది.

తంబుచెట్టి వీధిలోని ఫస్టు స్టూడెంట్స్ హోమ్‌లో ఉండగా ఈ పుస్తకం వచ్చింది. వి.పి విడిపించి పుస్తకాన్ని చూస్తూవుంటే ఏదో పెద్దనిధి దొరికినట్టు పొంగిపోయాను. గాలిలో తేలిపోలేదు కాని కాలినడకనే జార్జిటౌన్ బీచినుంచి శాంథోమ్‌దాకా ఈ పుస్తకాన్ని చదువుకుంటూ వెళ్ళాను. శాంథోమ్ చేరేసరికి పుస్తకం చదవడం ముగిసింది. అసలే పుస్తకం వందపేజీలలోపుది. పైగా ప్రతి పేజీలోనూ గీతం ఆక్రమించిన జాగా కొంచెమూ, కాళీస్థలం బోలెడూనూ! ఈ కాళీజాగాల్లోనే సిసలైన కవితా పదార్థం దొరకుతుందని *Paul Eulvard* (పోల్ ఎల్వార్) అన్నాడు. దరిమిలాను ఆ కాళీజాగాలను నా *Comment* తో నింపివేశాను.

ఇప్పుడాపుస్తకం ఎక్కడుందో తెలియదు, ఎవరో దొంగిలించివుంటారని నా అనుమానం.

కవిత్వాన్ని గుర్తించడానికిదో సులువైనమార్గం అనుకుంటాను. ఈ కాళీ జాగాలు వదలడం! అందుకే ఏ భాషలోనైనా కావ్యగీతాల చుట్టూ బోలెడు *empty space* ఉంటుంది. అదో అనంతాకాశం రోదసీయాత్ర చేసిన మొదటి మానవుడు గగారిన్ అంటాడు. నేనయితే అది కాదనను గాని ఈ పని అనాదినుంచీ అందరుకవులూ చేస్తూనే ఉన్నారని మాత్రమే నేను చెప్పదలచుకున్నాను.

ఒకసారి ఒక గొప్ప ఫ్రెంచికవి కావ్యసంపుటి ఒకటి కొన్నాను. అప్పటికి నాకు ఫ్రెంచిభాషరాదు. (ఇప్పుడు మహావచ్చినట్టు!) కాగితాలను తడుముతూ స్పర్శేంద్రియంతోనే ఆ కవిత్వాన్నంతా ఆస్వాదించాను. తర్వాత ఇంగ్లీషు తర్జుమాసాయంతో దాని సంగతేదో కొంతలో కొంత తెల్సుకున్నాను. కాని మొదటిసారి అనుభవించినంత రసానందం పొందలేక పోయాను. అయితే భాష తెలియడంలో ఒక సదుపాయం ఉంది. ''ప్రవాసము: ఊర్వశి'' ఎన్నిమార్లు చదివానో నాకే తెలియదు. కాని ప్రతిసారీ ఒక కొత్తస్పందన పొందుతూనే వచ్చాను. అలాంటి చైతన్యం కలిగించగలిగేదే కవిత్వం అంటాన్నేను.

ప్రజాతంత్ర 15—6—1975

## నాలుగు

కృష్ణశాస్త్రిగారితో నా మొదటి పరిచయం 1928లో. అనగా ఈ పరిచయం వయస్సు ఏబదేళ్ళు దాటిందన్నమాట.

''నా కుగాదులు లేవు,

నా కుషస్సులు లేవు'' అన్న ఈ కవి (1980) ఉగాది రాకముందే మరణించాడు.

కాలక్రమాన్ని అనుసరించి నా జీవిత చరిత్ర రాయాలనుకున్న నా నిర్ణయానికి కృష్ణశాస్త్రి మరణం మరో ఆటంకం కలిగించింది.

ఇకమీద కృష్ణశాస్త్రిగారు అననక్కరలేదు. ''కృష్ణశాస్త్రి'' అనే పేరు తెలుగు సాహిత్యచరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతుంది.

కృష్ణశాస్త్రి మరణించినప్పుడు నేను మద్రాసులో లేను. నిరీశ్వరాశ్రమం వార్షికోత్సవం నిమిత్తం జిన్నూరులో ఉన్నాను. అప్పుడు కొందరు జర్నలిస్టులు అడిగితే ఒక చిన్నగీతం చెప్పాను. దాన్ని నాలుగుపాదాల మినీ కవితగా ఇక్కడ రాస్తున్నాను.

''అద్దం బద్దలయింది!
రోదసి రోదించింది!
షెల్లీ మళ్ళీ మరణించాడు!
వసంతం వాడిపోయింది!''

కృష్ణశాస్త్రికి షెల్లీకి ఎన్నో పోలికలున్నాయి. ఇద్దరూ కాల్పనికోద్యమపు ఆద్యులలో ముఖ్యులు. వారి

కృష్ణశాస్త్రి జ్ఞాపకాలు 'రెండు' 'నాలుగు'లో కొన్ని సంగతులు రిపీట్ అయ్యాయి. అయినా సంవిధానం వేరుగావుందని అలాగే వుంచేశాం

కవిత్వం ఆకాశంలో విహరించినా వ్యక్తిగత జీవితంలో అన్ని అభ్యుదయోద్యమాలనూ సమర్థించారు. కొన్నిటిలో స్వయంగా పాల్గొన్నారు. ఇద్దరూ స్వదేశానికి దూరంగా జీవించారు. పుట్టని దేశంలో మరణించారు.

ఇలా చెప్పుకుంటూపోతే ఎన్నైనా సామ్యాలు కనిపిస్తాయి. కాని షెల్లీ పిన్నవయస్సులో మరణించాడు, కీట్సులాగే! కీట్సూ, షెల్లీ ఇద్దరివయస్సులూ కూడితే వచ్చే సంఖ్యకన్నా ఎక్కువ సంవత్సరాలు కృష్ణశాస్త్రి జీవించాడు.

ఇంగ్లీషుకాల్పనిక కవిత్వంలో షెల్లీ కీట్సులకున్నంత స్థానం తెలుగులో కృష్ణశాస్త్రికుంది.

కీట్సురాసిన...

*...........Charmed*

*Magic Casements opening on the foam of perilous seas by fairy lands forlorn*

అనే పదాలను ఇంకే భాషలోనూ అనువదించడం అసాధ్యం అంటారు.

అలాగే కృష్ణశాస్త్రి.............

"నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజువాటి"

ఇత్యాది గీతాన్ని ఇంకో భాషలోకి తర్జుమా చేసి నెగ్గుకురావడం కష్టం. ఈ ఒక్కగీతానికే కాదు నేను చెప్పినమాట, కృష్ణశాస్త్రి యావత్కవిత్వానికి అన్వయిస్తుంది. ఆచంట జానకిరామ్, రోణంకి అప్పలస్వామి ప్రభృతులు కృష్ణశాస్త్రిని ఇంగ్లీషులోనికి అనువదించారుగాని కృతార్థులు కాలేదనే నా ఉద్దేశం.

ఆచంటా, రోణంకీ ఇద్దరు కూడా ఇంగ్లీషులో ఉద్దండులే! అయినా వాళ్ళకి కూడా లొంగిరాలేదు కృష్ణశాస్త్రి కవిత్వం!

(చాలాకాలం క్రితం హరీంద్రనాథ ఛటోపాధ్యాయ కృష్ణశాస్త్రి కవితలు కొన్నింటిని ఆంగ్లీకరించాడట. అవి ఎక్కడ పోయాయో ఎలాగ పోయాయో ఎవరికీ తెలియదు).

పాశ్చాత్యదేశాలనుంచి కాల్పనిక కవిత్వాన్ని (*romantic poetry*) భారత దేశానికి రవాణా చేసినవాడు రవీంద్రనాథ్ ఠాకూరు. అతని మీద షెల్లీ, కీట్స్, బోదిలేర్, వెర్లాన్ మొదలైన వారి ప్రభావం ఎంతయినా వుంది. ముఖ్యంగా మోరిస్ మేతర్లింక్ పక్కన నిలబెడితే అంత ఆజానుబాహుడైన ఠాకూరు మరుగుజ్జులా కనబడతాడు.

రాయప్రోలూ, కృష్ణశాస్త్రీ ఇద్దరూ ఠాకూరువల్ల తీవ్రంగా ప్రభావితులయిన వారే. అయితే దాన్ని అధిగమించి తమతమ సొంత గొంతుకలను వినిపించడంలోనే వాళ్ళ గొప్పతనం ఉంది.

నేను కూడా తొలిదినాలలో భావకవిత్వం రాసేటప్పుడు షెల్లీ, కీట్స్, బైరన్ మొదలైన ఇంగ్లీషు కవులనూ, ఫ్రెంచి సింబలిస్ట్ కవులనూ తదేకదీక్షతో చదివినవాణ్ణే! కాని తీరా తెలుగులో రాసేసరికి కృష్ణశాస్త్రి ప్రభావం కొట్టవచ్చినట్టు కనబడేది. ఒకటే కృష్ణశాస్త్రి, లేదు విశ్వనాథ వీరిద్దరి సర్పపరిష్వంగంనుంచి తప్పించుకోవడానికి నేను భావకవిత్వానికే 'వీడ్కోలు' చెప్పవలసి

వచ్చింది.

ఆ రోజుల్లో కలంపట్టిన కుర్రకవులంతా కృష్ణశాస్త్రి ఆకర్షణకు లోనయినవారే! అణుబాంబు రేంజి 5 వందల మైళ్ళ కైవారం అంటారు. కృష్ణశాస్త్రి అణుధార్మిక శక్తి ఆంధ్రదేశం అంతటా వ్యాపించింది. నేను కృష్ణశాస్త్రి కవితాశైలిని మాత్రమే అనుకరించేవాణ్ణి. కానీ మా నారాయణబాబు కృష్ణశాస్త్రి సింహంజూలును కూడా అనుకరించి దాన్ని రోజా సంపెంగ నూనెతో సంరక్షించుకునేవాడు. కాని నారాయణబాబు గిరజాలు కృష్ణశాస్త్రిని కంటే గిరీశాన్నే ఎక్కువ జ్ఞాపకం చేసేవి.

నా కెప్పుడూ పద్యంమీద ఉన్న శ్రద్ధ జుత్తుమీద ఉండేదికాదు. ''మా అక్కో! జుత్తుకి చవుర్రాసుకోదు'' అని నా గురించి కూడా కన్యాశుల్కంలోని వెంకటేశం అని ఉండవచ్చు. కృష్ణశాస్త్రి జ్ఞాపకాలు ఎన్నో, ఎన్నెన్నో! ఇలా రాసుకుంటూపోతే ఎన్ని 'స్వాతి' సంచికలైనా నింపవచ్చు. ఇక్కడ కొన్నిటిని మాత్రమే ఉదహరిస్తాను.

నేను గ్రాంథికభాషను శాశ్వతంగా వదిలిపెట్టి కవిత్వం కూడా వాడుకభాషలోనే రాస్తున్నప్పుడు కృష్ణశాస్త్రి ''జైల్లో శ్రావణం'' అని కొన్ని గీతపద్యాలు రాసి తన పేరుతో కాక వేరే మారుపేరుతో ''భారతి'' పత్రికకు పంపాలనుకున్నాడు.

''అసలు శ్రావణమాసమధ్యమ్మునందు
కురిసితీరాలి వర్షాలు, కొంచె కొంచె
మేనిరాలాలి తుంపరలేని, కాని
ఉక్కమాత్ర మేఘమాత్రమూ ఉండరాదు!''

ఇలా ప్రారంభమవుతుంది ఆ ఖండకావ్యం. దీనికి నా చేత ఒక ముందుమాట రాయించాలని కృష్ణశాస్త్రి సంకల్పం. స్వయంగా అడిగితే నేను రాయనంటానా? అబ్బే! అది కృష్ణశాస్త్రీయం కానేకాదు. మల్లవరపు విశ్వేశ్వరరావు చేత రాయబారం! నేను తక్షణమే నాలుగు ముక్కలు రాసిచ్చాను.

''జైల్లో శ్రావణం'' నా ఉపోద్ఘాతంతో సహా భారతిలో పడింది. తేదీ జ్ఞాపకం లేదు.

అలాగే ఒకసారి కృష్ణశాస్త్రి అభినందనసంచిక వెయ్యాలని కొంతమంది పూనుకున్నారు. అందులో నా రచన ఏదో ఒకటి ఉండాలని కృష్ణశాస్త్రి పట్టుదల. ఇద్దరం మద్రాసులోనే ఉంటున్నాం అయినా ఈ రాయని భాస్కరుడు నన్ను రాయమని నేరుగా అడుగలేదు. యం.యస్.రెడ్డి (కౌముది పిక్చర్స్) చేత ఫోన్ చేయించాడు. నేను రాయడమూ జరిగింది. అది అచ్చుకావడమూ జరిగింది.

కృష్ణశాస్త్రిని రాయని భాస్కరుడనడానికో చిన్న కారణం ఉంది. అవి మనకు స్వాతంత్ర్యం వచ్చిన కొత్తరోజులు. స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంగా రేడియోవారు ఒక కవి సమ్మేళనం ఏర్పాటుచేశారు. చాలామందిమి రేడియోస్టేషన్‌కు టైముకి బాగా ముందుగానే వెళ్ళాం. అప్పటికింకా ముందుగానే టేప్‌రికార్డు చేసేపద్ధతి రాలేదు. ఒకరి కవిత లొకరికి

వినిపించుతున్నాం.

దరిమిలాను నా రచన "ఖడ్గసృష్టి"లో వచ్చింది. అందులోని—

"ఏ స్వాతంత్ర్యం నిమిత్తం ఎవరెవరెవరో ఎందరో దేశసేవా
భాస్వంతుల్ బాలవృద్ధుల్ పతితులధీకుల ప్రాజ్ఞులుత్రృజ్ఞులంతా
ఆస్వాశల్ వీడి లాఠీహతులయి ఉరికొయ్యల్ కవుంగిట చేర్చా
రా స్వాతంత్ర్యం లభించిందని విని హృదయాహ్లాద సంపుష్టమైతే"

అన్న పంక్తులను విశ్వనాథ సత్యనారాయణగారెంతో మెచ్చుకున్నారు. వ్యావహారిక భాషను సంస్కృత ఛందస్సులో ఒప్పించడమే విశ్వనాథవారిని మెప్పించింది.

కవి సమ్మేళనం ఇంకో అయిదునిమిషాలకి ప్రారంభమవుతుందనగా కృష్ణశాస్త్రి వచ్చాడు. ఆయన రాసింది వినాలని మా అందరి ఆకాంక్ష. "ఏదీ! చదవండ"ని ఎవరో అడిగేరు. "నేనేదీ రాయలే"దన్నాడు కృష్ణశాస్త్రి. "ఆయన రాయని భాస్కరుడు లెండి" అని అప్పుడు నేనన్నాను.

అవి కొత్తగా మా ఆవిడ కాపురానికి వచ్చినరోజులు. అప్పుడే కృష్ణశాస్త్రి సరికొత్తగా విశాఖపట్టణానికి రావడం జరిగింది. అంతకుముందంతా కృష్ణశాస్త్రి కవిత్వంతోనే తప్ప వ్యక్తిగతంగా పరిచయంలేదు. ఇనుమును అయస్కాంతంలాగ నన్ను ఆకర్షించాడు కృష్ణశాస్త్రి. నేను ఇల్లూ, వాకిలీ వదలి కృష్ణశాస్త్రి చుట్టు ఉపగ్రహంలాగ తిరగడమే కాక ఆయన బృందం విజయనగరం వెళితే నేనూ వెంటబడ్డాను. విజయనగరంలో ఆయన బస మా నారాయణబాబు ఇంట్లోనే. అలా సుమారొక వారంరోజులు ఇంటినుండి అంతర్ధానమైన నేను తిరిగి వచ్చాక మా నాన్న "కవిత్వాన్నీ, కవుల్నీ మెచ్చుకోవడం బాగానే ఉందిగాని ఇంట్లో నీ పెళ్లాన్ని గురించి కొంచెం ఆలోచించడం కూడా మంచిదేమో" అని మెత్తగా మందలించారు. మా నాన్న నన్నెప్పుడూ గట్టిగా కోప్పడలేదు. ఆ చిన్నసైజు చీవాట్లకే నా మనస్సెంతో చివుక్కుమంది. ఏదో మెస్మరిజం మైకంలోంచి తేరుకున్న వాడిలాగ మళ్లీ స్మారకంలోనికి వచ్చాను. అలా ఆకర్షించేది ఆనాటి యువకుల్ని కృష్ణశాస్త్రి పెర్సనాలిటి.

విశాఖపట్టణంలో స్థానిక కవి ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ (రసపుత్ర విజయ నాటక కర్త) కృష్ణశాస్త్రి మీద ఆశువుగా పద్యం చెప్పాడు. పద్యమైతే జ్ఞాపకంలేదుగాని అది "భావ కవిత్వసంపద లపారముగా గల ఖండకావ్యముల్" అని ప్రారంభమై "కృష్ణశాస్త్రిరో" అని అంతమవుతుంది. "భామరో, కాంతరో" అని స్త్రీలను సంబోధిస్తారని ఒకాయన ఆ పద్యంలో తప్పుపట్టారు. ప్రాచీన కవిత్వం మళ్ళీ రాయాలంటే ఈ తిప్పలు తప్పవని అప్పుడే నేననుకున్నాను.

విజయనగరం సభలో తాపీ ధర్మారావు కృష్ణశాస్త్రి కవిత్వాన్ని ఘాటుగా విమర్శించాడు. (మాకందరికీ వాంతి వచ్చినంత పని అయింది) ఎవరికీ తాపీ వారినెదిరించే దమ్ములేవు. పాత కవిత్వం ఎందుకు బావుండదో, భావ కవిత్వం ఎందుకు వచ్చిందో మాకు మేమే నచ్చజెప్పుకో లేక పోయాము. చేసేదేమీలేక మానసికంగా మాత్రం వాంతులు చేసుకున్నాము.

అప్పటికి కృష్ణపక్షం మాత్రమే అచ్చుపడింది. శివశంకరశాస్త్రిగారి సుదీర్ఘోపోద్ఘాతంతో "కృష్ణపక్షాన్ని" హేళనచేస్తూ అనంతపంతుల రామలింగస్వామి అనే ఆయన "శుక్లపక్షం" అన్నపేరుతో ఒక పుస్తకం రాశాడు. కృష్ణశాస్త్రి అన్నా, భావకవిత్వం అన్నా కిట్టనివాళ్ళు దాన్నో గొప్ప గ్రంథంగా భావించేవారు. వేదుల సత్యనారాయణశాస్త్రి మాత్రం దాన్ని 'సారస్వతారిష్టము అను శుక్లనష్టము' అని సరిగానే అభివర్ణించాడు.......

అప్పటికింకా "ప్రవాసముః ఊర్వశి" గ్రంథరూపంలో రాలేదు, అయితేనేం, నారాయణబాబు—

"వినరా నీ విభావరీ
వేలా శాలల నీ మృదు
వసనాంచలముల గుసగుసలో
మసలు చరణ మంజీరపు
కొసరు జారి పలుకరింతలో"

అంటూ ఇల్లెగరగొడుతూ ఉంటే కవిత్వం ఇడ్లీలను సంగీతం సాంబారులో ముంచి వెండిప్లేటులో సప్లయి చేసినట్టుండేది. "సాంబారు స్నానం చేస్తున్న ఇడ్లీ సుందరి" అన్న రుక్మాయి అభివర్ణన కూడా ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది. త్వరలోనే రాబోయే ఆకలి దశాబ్ది *(hungry thirties)*కిది ప్రతీకలని చెప్పుకోవచ్చు.

మల్లవరపు విశ్వేశ్వరరావు "మధుకీల"కు వ్రాసిన పీఠికలో కృష్ణశాస్త్రి "విశ్వేశ్వరరావూ నువ్వు కవిత్వం బాగా రాస్తావయ్యా! వాటన్నిటిని ఒక సంపుటంగా వెయ్యాలి," అంటూ ఆవెంటనే "పేరడీపద్యాలు రాసే వారందరి గురించీ నేనీమాట అనను! విశ్వేశ్వరరావు కవి. నిజంగా కవి" అని రాసిన సందర్భంలో పేరడీలకు పేరొందిన జరుక్ "నారాయణబాబూ! నువ్వు క్షవరం చేయించుకోవాలయ్యా!" అని "తలమాసిన వాళ్ళందరితోనూ నేనీమాట అనను. నారాయణబాబు తలమాసినవాడు! నిజంగా తలమాసినవాడు" అంటూ ఆశువుగా పేరడీ చేశాడు . జరుక్ వాగుడులో ఒక వైభవం ఉండేది. శివశంకరశాస్త్రికి పీఠికా పరమేశ్వరుడన్న బిరుదిచ్చింది ఇతనే. కవిత్వాన్నే కాదు వచనాన్ని కూడా అవలీలగా తిరగేసి తొడిగేసుకునేవాడు. ఆనాటి హేమాహేమీలంతా రుక్మాయి నోటి దురుసుతనానికి జడిసే వారు. విశ్వనాథ వారినే "పాషాణపాకప్రభు" అనగలిగిన పాటి దమ్ములు రుక్మాయికి తప్ప మరెవ్వరికీ లేవు.

స్వాతి మే *1980*

# నా దరిద్రపు రోజులు

## ఒకటి

ఫలానాతేదీనుంచి నా దరిద్రం ప్రారంభమయిందని చెప్పలేను. కాని 1930 నుంచి 1940 దాకా నేను చాలా అవస్థలుపడ్డాను. ఆ దశాబ్దంలోనే నా మహాప్రస్థానం గీతాలన్నీ (చాలామట్టుకు) రాశాను. అదో భయంకరమైన దశాబ్దం. దాన్ని *Hungry Thirties* అన్నారు చరిత్రకారులు. కొంపెల్ల జనార్ధనరావు మాటల్లో చెప్పాలంటే అవి:

"లోక ప్రవృత్తినంతటినీ కలవరపరిచిన ఆర్థికమాంద్యం రోజులు"(ఆ రోజుల్లోనే కొం.జ. ఉదయిని పత్రికని తీసుకొచ్చాడు)

ఇప్పుడు నేను చాలా అగాధమైన లోతుల్లోకి దిగుతున్నాను. దరిద్రం అనుభవించేటప్పుడు ఎంత భయంకరంగా ఉంటుందో జ్ఞాపకం చేసుకున్నప్పుడు అంత ఆనందమయంగా ఉంటుంది.

ఖరగ్‌పూర్ స్టేషన్‌నుంచి కాలినడకన కలకత్తా వెళ్లాలనుకున్నాను. రైలుపట్టాలమీద నడుస్తూ అలా అలా అలా 20 మైళ్లు నడిచాను. దారిలో ఒక మేక శవం. నా చిరిగిన చెప్పుల్లో గుచ్చుకునే రాళ్లు. ఎక్కడో ఎవరో కనపడ్డారు. ఇది చాలా ప్రమాదకరమైన ప్రదేశం ఇక్కడికెందుకొచ్చావన్నారు. నేనన్నాను "నాదగ్గర 2 అణాలున్నాయి. వాటికోసం నన్నెవరు చంపుతారు?"అని. నువ్వొత్త చవటవి. ఇక్కడ ఒక అణా వున్నవాడు ఐశ్వర్యవంతుడు. నిన్ను రెండుముక్కలు చేస్తారిక్కడివాళ్ళు.

అదో రాక్షస రాత్రి.

నడుస్తున్నాను. నడుస్తున్నాను. నడుస్తున్నాను జేబులో రెండణాల డబ్బులతో ఒక స్టేషను దాటాను. రెండోస్టేషనులో ఆగేను. అక్కడ ఒక కూజానిండా మంచినీళ్ళు అన్నీ తాగేశాను. ఆ స్టేషనుమాస్టరు మంచివాడు. నాకు నిద్రపోవటానికి జాగా ఇచ్చాడు. మర్నాడు మరేదో బండిలో సంత్రగాచీకి వెళ్ళాను.

"చంద్ర ఉదయమాయె" అని ఒక అమ్మాయి పాడుతోంది.

సంఘానికి నువ్వు ఇవ్వగలిగిందంతా ఇచ్చి సంఘంనుంచి నీకు కావలసింది తీసుకో అంటుంది కమ్యూనిజం. నీదగ్గర వున్నది అమ్ముకో నీకు కావలసింది కొనుక్కో అంటుంది కాపిటలిజం. అందుకే ఈ పెట్టుబడిదారీ వ్యవస్థలో సిగరెట్ కాల్చడానికి, ముద్దుపెట్టడానికి ఒకే విలువ వుందంటాన్నేను.

మద్రాసులో చింతాద్రిపేటలో మిసెస్ బాక్స్టర్స్ అనే మేట్రన్ వుండేది. ఆవిడ 5 రు.

మొదలు రు.500 దాకా అమ్మాయిలను సప్లయి చేసేది. నేను పేదవాడ్ని. 5 రు. వాడ్ని. ఎప్పుడైనా 5 రు. వుంటే అక్కడికి వెళ్లేవాడ్ని. 5 రు. అమ్మాయిల వరస నా ఎదుట నిలబడేది. అందులో చర్మం, ఎముకలువున్న అమ్మాయిని నేను ఎంచుకొనేవాడ్ని. నాకు తెలుసు ఆ మాదిరి పిల్లలకి గిరాకి వుండదని. అందుకే నేను కావాలని ఆ అమ్మాయిని అడిగేవాడ్ని. మేం ఇద్దరం ఇంగ్లీషులో మాట్లాడుకునేవాళ్లం. చాలా చాలా కృతజ్ఞత చెప్పేది ఆ అమ్మాయి. ఆ పిల్లపేరు మరిచిపోయాను. అలాంటివాళ్ళకి నా జోహారు.

ఔను మళ్ళీ చెబుతున్నాను, ప్రేమమీద నాకు నమ్మకంలేదు. మనుష్యులమీద నమ్మకం ఉంది.

శ్రీరంగం వెంకటరమణమ్మ నా మొదటి భార్య. నా దరిద్రపు రోజుల్లో ఒకసారి ఆమెను అడిగేను, ఎవడైనా ఒక పెద్ద ఉద్యోగి నాకు నౌఖరి ఇస్తాడుగాని, నువ్వందుకుగాను వాడిదగ్గరకి వెళ్లగలవా? అని. తప్పకుండా వెళ్తానంది మా ఆవిడ. ఈ నిజాయితీని నేను హర్షించాను. నాకు ఉద్యోగం ఇచ్చేవాడూలేడు, వాడి దగ్గరకు మా ఆవిడ వెళ్లనూ లేదు.

సావిత్రి తన భర్తను బ్రతికించుకోవడానికి యముడితో పోయిందని చలంగారు రాస్తే చాలామందికి కోపం వచ్చింది. ఇది చలంగారి అయిడియా కాదు. మోరిస్ మాటర్‌మిక్‌ది. అయినా, ఇటువంటి భావాలకి మన భారతీయాత్మ విరుద్ధం అంటారు. అసలు ఆత్మ అనేదేలేదు. భారతీయ అనేది మరీ విరుద్ధం.

అవును. అవి నా దరిద్రపు రోజులు. రెండేసి రోజులు తిండిలేకుండా బ్రతికాను. ఆ పది సంవత్సరాల్లోనే మహాప్రస్థాన గీతాలు రాశాను. అంత దరిద్రంలోనూ నేనెవ్వరినీ 'దేహి' అని యాచించలేదు. కేరమ్సులో గెలిచిన కప్పుల్ని అమ్ముకున్నాను. కవిత్వాన్ని కూడా అమ్ముకున్నాను. ఇది వ్యభిచారం అని నాకు తెలుసు.

1938లో జర్నలిజంలో ప్రవేశించాను. ఆంధ్రప్రభ సబ్ ఎడిటర్‌గా రాయిటర్ వార్తలు తెలిగించాను. సక్కుబాయి పిండిరుబ్బినట్లు నా దరిద్రం నన్ను కొరుక్కుని తింటున్నదా లేక నేను నా దరిద్రాన్ని కొరుక్కుని తింటున్నానా అని. అదీ సమస్య.

"చింకిగుడ్డల సింహం" అనే అసంపూర్ణ గీతం ఆ రోజుల్లోనే ఆలపించాను. సింహం ఆ రోజుల్లో నా ఆదర్శం. పది సంవత్సరాల దరిద్రం, అందులోంచి ప్రభవించింది నా కవిత్వం.

నేనో కాకిని. ఏకాకిని. తెల్ల కాకిని. కాకిలేని చోటులేదు. అయితే అన్ని కాకులు నల్లగానే ఉంటాయి. నేనొక్కడ్నే తెల్లకాకిని. ఎందుచేతనంటే నా మనస్సు తెల్లనిది. నా హృదయం తెల్లనిది.

నాది తెలుపురంగు. అయినా నేను కాకినే.

*ప్రజాతంత్ర 18–1–1976*

## రెండు

ఆ దరిద్రపు రోజులు నన్ను బాధించిన కన్నా మిన్నగా మా నాన్న గారిని సంక్షోభపరిచి ఉంటాయి. ఎప్పుడూ కళకళలాడుతూ ఉండే ఆయన మొగంలో దరిద్రపు కత్తిపోటు ఎంత

లోతుగా నాటుకుపోయిందో నాకు స్పష్టంగా కనబడేది. జీవితంలో అపారమైన ఐశ్వర్యం అనుభవించి విశాఖపట్టణంలో ఒక ఏలుబడి ఏలిన మా నాన్న క్రమక్రమంగా అగాధంలోనికి కూరుకుపోతూంటే ఆయన బంధువులుగాని, మిత్రులుగాని ఎవ్వరూ పట్టించుకోకుండానే తిరిగేవారు. నేను భయంకరమైన టైఫాయిడ్‌జ్వరంతో వచ్చేప్రాణం పోయేప్రాణంగా ఉంటుండగా మా ఇల్లు వేలంపాటలో అమ్మకమైపోయింది. మా నాన్నే స్వయంగా అమ్మిపారేస్తే మా అప్పులన్నీ తీరిపోవడమేకాక ఒక మంచి మొత్తమే మిగిలి ఉండేది. కాని ఆ ఇంటి పునాదులు మా అమ్మ స్వయంగా తవ్విందట. తట్టలతో రాళ్లు కూడా మోసిందట. అందుచేత ఎట్టి పరిస్థితుల్లోనూ అమ్మకూడదనుకున్నాడు మా నాన్న. అప్పులవాడు వేలం పాడించేశాడంటే అది దేవుడు రాసిన రాత. పూర్వజన్మలో చేసిన పాపాలకు ప్రస్తుత జన్మలో పనిష్మెంటు. మా నాన్న గణితశాస్త్రంలో ఎంత ఘటికుడో సెంటిమెంట్లలో అంత ఛాందసుడు.

"నా కాలంలో నే నెందరికో ఎన్నో ఉపకారాలు చేశాను. అపకారం మాత్రం ఎవ్వరికీ చెయ్యలేదు. అయినా కష్టకాలంలో నన్ను ఆదుకోవడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు"అని ఒకమారు మా నాన్న నాతో అన్నాడు. ఉపకారం చెయ్యడం ఆయన స్వభావం కాబట్టి చేశాడు. హెడ్మాష్టరుగా చదువులు చెప్పించి, మార్కులు వేయించి, పరీక్షలు ప్యాసుచేయించాడు. విద్యార్థులచేత (అందులో నేనొకణ్ణి) కాపీ కొట్టించాడన్న నేరానికి మా నాన్న ఉద్యోగపు హోదాను తగ్గించారు. తనకు కష్టపు రోజులు వస్తాయనీ, అప్పుడు తనకు అంతమందీ చేదోడువాదోడు అవుతారనీ ముందుగానే ఊహించి ఆయన ఉపకారాలు చెయ్యలేదు. మళ్లీ చెబుతున్నాను ఆయన స్వభావమే ఆయన చేత అన్ని పనులూ చేయించింది.

మా నాన్నకు డబ్బు అప్పున్న వాళ్లంతా ఏదో ఒక మిషమీద అప్పులు ఎగవేశారు. మా నాన్న ఎవరికీ అప్పులుగాని, నాకు ఆస్తిగాని మిగల్చలేదు. ఒక మిత్రుడికి మా నాన్న రెండు వందల రూపాయలు అప్పు ఇచ్చాడు. ఆ మిత్రుడు చనిపోయాడు. అతని భార్యని మా నాన్న 'అమ్మా, మీకు కూడా తెలుసు మీ ఆయన నావద్ద రెండువందల రూపాయలు ఋణంగా తీసుకున్న సంగతి. అందులో ఏ కొంచెమైనా ఇప్పిస్తారా?" అని అడిగితే ఆవిడ, "కొంచెమే అన్నమాటేమిటి? అంతా తీర్చేస్తాను. మా వారు రాసిచ్చిన ఋణపత్రం తీసుకురండి" అంది. ఏ పత్రమూ గిత్రమూ లేదని ఆవిడకు బాగా తెలుసు.

మా నాన్నకు అప్పుపెట్టిన ఒకాయన కోర్టుకు వెళ్లి డిక్రీ తెచ్చుకొని జీతంలో నెలకు రు.50లు చొప్పున జీతాలరోజునే వచ్చి పట్టుకుపోతూ ఉండేవాడు. రసీదులు మాత్రం కరెక్టుగా ఇచ్చేవాడు. ఇంక రెండు మూడు నెలల్లో అప్పు పూర్తిగా తీరిపోతుందనే సమయంలో మా నాన్న రసీదులన్నీ పారేసుకున్నాడని ఎలాగో తెలుసుకొని ఆ బుద్ధిశాలి మళ్లీ కొన్ని నెలలపాటు మొత్తం అప్పుకు ఇంచుమించు రెండు రెట్లు వసూలు చేశారు. నాటికీ, నేటికీ సమాజం ఇలాంటి పద్ధతులను అంగీకరిస్తూనే ఉంది. అందుకే కోపం అనేది ఏ

కోశానాలేని నాకు ఈ సమాజం పేరెత్తితే చాలు అరికాలి మంట నెత్తికెక్కుతుంది.

బహుశా మా సుభద్రమ్మ (మా నాన్నగారి రెండో భార్య) చచ్చిపోయిన నాటినుండే మా దరిద్రపు రోజులు ప్రారంభమైనాయనుకుంటాను. ఇది జాతకం రీత్యాగాని, నక్షత్రదోషం రీత్యాగాని జరిగిందని చెప్పను. ఆడదిక్కులేని మా ఇంట్లో అన్ని వస్తువులూ క్రమక్రమంగా మాయమవుతూ ఉండేవి. (సారీ, ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. నా టైఫాయిడు జ్వరానికి ముందే మా ఇల్లు కరారావుడు చుట్టేసింది.) కొంతమంది అదికావాలి, ఇది కావాలి అని అడిగి పట్టుకుపోయేవారు. ఒక చిన్న అద్దె ఇంటిగదిలో ఉండే వాళ్లం. మా నాన్న దగ్గర బంగారపు గొలుసుతో ఒక జేబుగడియారం ఉండేది. ఆయనతో ఉన్న అక్రమ పరిచయం ఆసరా చేసుకొని ఒకావిడ ఆ గడియారాన్ని గొలుసుతో సహా, ఒక కుర్రాడిచేత తెప్పించుకుంది. దరిమిలాను అమ్ముకొంది. గడియారాన్ని ఎవరి ప్రోత్సాహంతో ఎవరు పట్టుకుపోయారో తెలుసును మా నాన్నకి. ''గడియారం ఎలా పోయింది బాబా?'' అని నేనడిగితే, ''ఎలాగో పోయింది పోనిద్దూ! పోయింది పొల్లూ, ఉన్నది గట్టి'' అన్నాడు మా నాన్న.

తేదీల వారీగా నా దరిద్రపు రోజుల జాబితా ఇవ్వలేనుగాని మా సుభద్రమ్మ చచ్చిపోవడమూ (ఆమె నెప్పుడూ నేను సుభద్రమ్మా అనే పిలిచేవాణ్ణి, ఆవిడ నాకు తల్లేగాని సవతి తల్లి కాదు). నాకు పెళ్లి కావడమూ, మా దరిద్రం ప్రారంభంకావడమూ ఇంచుమించు ఒక్కమారే జరిగాయి. అందుకే మా ఆవిడ నష్టజాతకురాలనీ, ఇనుప పాదాల తల్లి అనీ, అదెప్పుడు కాలుపెట్టిందో అప్పుడే మా కష్టకాలం ప్రారంభమైందనీ మా బంధువులంటూ ఉండేవారు. ఇంతకంటే అసందర్భపు ఆరోపణ ఇంకోటి ఉండబోదు. పెళ్లి నాటికి నా వయస్సు 15 ఏళ్లు. వెంకటరమణమ్మ నాకన్నా అయిదేళ్లు చిన్న. (అవి బాల్య వివాహపు రోజులు. అప్పటికింకా శారదాబిల్లు చట్టంకాలేదు). ఈ పదేళ్ల అమ్మాయి తన పూర్వ జన్మల సంచిత కర్మనంతా మోసుకొచ్చి మా ఇంట్లో దరిద్రాన్ని కుమ్మరిస్తోందంటే నా మనస్సు సుతరామూ అంగీకరించలేదు.

మా సుభద్రమ్మ నలుగురు పిల్లల తల్లి. పాతికేళ్లయినా నిండక ముందే పరమపదించింది. మొదటి ఇద్దరూ కొడుకులూ, తర్వాతి ఇద్దరూ కూతుళ్లూ. మొదటివాడు ఒకటిన్నర ఏళ్లకే పోయాడు. నాలుగో పిల్లకానుపులో మా సుభద్రమ్మ చనిపోయింది. ఆ పిల్ల కూడా ఎన్నో రోజులు బతకలేదు. రెండోవాడు శ్రీరంగం వెకటరమణమూర్తి. నూనూగు మీసాల నూత్న యౌవనపు రోజుల్లో ఆత్మహత్య చేసుకున్నాడు. పాలకొండ అనే ఊళ్లో కొలనులో మెడకో రాయి కట్టుకుని దిగిపోయాడు. రాయెందుకంటే, వాడు గొప్ప ఈతగాడు. రమణమూర్తి పేరు చెబితే ఆరుద్ర ఇప్పటికీ కంటతడి పెట్టుకుంటాడు. రావిశాస్త్రికి కూడా రమణమూర్తి గొప్ప మిత్రుడు. కొండా! కొండా! అని మేం ఇంట్లో పిలిచే కొండంత నా తమ్ముడు ఆత్మహత్య చేసుకోవడానికి మా దరిద్రమే కారణం. అప్పుడే నాకు ఆంధ్రప్రభలో సహ సంపాదకుడిగా ఉద్యోగం లభించింది. మా నాన్నా, నేనూ, మా ఆవిడా, మా కొండగాడూ

అందరం కలిసి చెన్నపట్నంలో జీవించే రోజులు అనతిదూరంలోనే ఉన్నాయనుకున్నాను. మా సుభద్రమ్మ సంతానంలో ఇప్పటికీ జీవించి ఉన్న నా ఒకే ఒక చెల్లెలు కొండమ్మ (అప్పల కొండమ్మ అని మా అమ్మపేరు) అప్పటికే భర్తతో కాపురానికి వెళ్లిపోయింది.

కొండబాబు అంత్యక్రియలన్నీ అయిపోయాయనీ, దశాహం నాటికి యలమంచిలి రావలసిందనీ మా నాన్న నాకు ఉత్తరం రాశాడు. యలమంచిలిలోని కొమ్మాయి గుండంలో పదవ రోజు స్నానం చేశాను. అప్పుడో పెద్ద గండం నాకు గడిచింది. స్నానం చేస్తూ చేస్తూ, ఒక రాలిమీద కాలుజారి నీళ్లలో పడిపోయాను. అందరూ దగ్గర్లోనే ఉన్నారు కాబట్టి నాకు ప్రాణప్రమాదమేమీ జరగలేదు. నా ఎడమ మోచేతి వెనుక కాస్త పెద్దదే గాయంతగిలి నెత్తురు బాగా నీళ్లలో కలిసింది. ఆ గాయపు మచ్చ ఇప్పటికీ నా ఒంటిమీదనే ఉంది. నా దరిద్రానికి బలియై చచ్చిపోయిన నా తమ్ముడు శ్రీరంగం వెంకటరమణమూర్తిని జ్ఞాపకం చేస్తూ.

*ప్రజాతంత్ర 25–1–1976*

## మూడు

హైదరాబాదు, లక్నో, విశాఖపట్టణం గల్లీలలో, విశాఖపట్టణం, మద్రాసు, భీమునిపట్టణం సముద్ర బీచీలలో, సంత్రగాచీ నుంచి కలకత్తా వైపు-విశాఖ స్టేషన్ నుంచి వాల్తేరు స్టేషన్‌దాకా రైలుపట్టాల మీదుగా, ఢిల్లీలో కలకత్తాలో మద్రాసులో ట్రాం పట్టాలమీదుగా నడిచేను, నడిచేను, నడిచేను, నడిచేను! జీవితంలోనూ, కవిత్వంలోనూ నడకకే నేను ప్రాధాన్యం ఇస్తాను.

''నడక'' కవిత్వంలో ముఖ్యం కావచ్చుగాని, జీవితంలో ''నడత'' ముఖ్యమని నన్ను హెచ్చరించిన వాళ్లున్నారు. నా పద్యాల నడక బాగుంటుందిగాని బ్రతుకులో నా నడత బాగులేదని వాళ్ల ఆవేదన. అలా బాధపడుతున్న వాళ్ల నడత ఎటువంటిదో నాకు బాగా తెలుసును. కాబట్టి శుష్కమైన వాళ్ల నీతిబోధలేవీ నామీద పనిచెయ్యడంలేదు. నడత విషయం వస్తే వాళ్లకంటే నేనే ఎన్నో రెట్లు నయం అనే విశ్వాసం ఉండబట్టి సూటిగానో వంకరగానో నాకు కనిపించిన దారంట నేను నడుచుకుంటూ పోతాను అప్పుడూ ఇప్పుడు కూడా!

సాధారణంగా ఒంటరిగా నడవడమే నాకిష్టం. అంటే మిత్రులతో కలిసి నడవడం నాకిష్టంలేదని కాదు. నలుగురితో నడుస్తున్నప్పుడు నేనో వ్యక్తినన్న సంగతి మరిచిపోతాను. నలుగురిదాకా ఎందుకు, ఇంకో స్నేహితుడూ నేనూ కలిసి నడుస్తూ ఉంటే మొత్తం నా బాధ్యత అంతా అతనికే వదిలేస్తాను. సొంతంగా ఆలోచించడం అనేది ఉండదు. పక్కనో మిత్రుడున్నాడుగా, నా మంచి చెడ్డలన్నిటికీ పూర్తి జవాబుదారీ వాడిదే.

ఒకమారు నేనూ యర్రమిల్లి రామలింగస్వామీ రాజాంవైపు నడుచుకుంటూ పోతున్నాం. రాంబాబు అప్పటికి ఒక గొప్పవెలుగు వెలిగి ఆరిపోయిన వాడు. యర్రమిల్లి సోదరులు రాంబాబూ, పట్టాభీ ఇద్దరూ నాకు మిత్రులే. ఇంచుమించు సమాన వయస్సూ, ఫుట్‌బాల్

లో సమానమైన ఇంటరెస్టూ మా స్నేహానికి మూలసూత్రాలు. ఒక దీపావళినాడు రామలింగస్వామి కుడిచేతిలో ఒక మందుగుండు 'కాయ'ని వెలిగించి పక్కింటి అమ్మాయిని చూస్తూ నిలబడిపోయాడు. "కాయ" చేతిలో పేలిపోయింది. మోచేతిదాకా ఆపరేషన్ చెయ్యవలసి వస్తుందనుకున్నాము. కాని డాక్టర్ మల్లిక్, చేతినేకాక బొటన వేలితో సహా కొన్ని వేళ్లను కూడా కాపాడాడు. (ఈయనే నా టైఫాయిడుతో పోరాడి జయించిన డాక్టర్.)

రామలింగస్వామి తన అంగవైకల్యం అందరికీ తెలియకుండా కుడిచేతికి ఒక సిల్కు రుమాలు చుట్టేవాడు. అదేదో కొత్తఫేషన్ అనుకొని ఆనాటి యువకులు తాముకూడా కుడి చేతికే (మళ్లీ ఎడమ చేతికి కూడా కాదు) రుమాళ్లు చుట్టుకొని తిరిగేవాళ్లు. ఆ రోజుల్లో యర్రమిల్లి సోదరులు ఆంగ్లో-ఇండియన్ అమ్మాయిలకు నూర్రూపాయల నోట్లమీద ప్రేమ లేఖలు వ్రాసేవారని కట్టుకథలు వ్యాప్తిలోకి వచ్చాయి. ఆ సోదరులతో నాకెంత స్నేహంవున్నా, కలసి కాఫీ ఇత్యాదులు త్రాగడం మినహాయిస్తే ఇద్దరినీ ఎప్పుడూ నేను డబ్బు అర్థించలేదు.

ద్వారం జగన్నాథరావు ఇంకో ధనిక మిత్రుడు. అతడు స్వయంగా కోకో తయారుచేసి నాకిచ్చేవాడు. అతని దగ్గర కూడా నేనెప్పుడూ డబ్బు పుచ్చుకోలేదు.

రాజాంవైపు నడుస్తున్నప్పుడు రాంబాబు దగ్గర చిన్న మొత్తంలో డబ్బుంది. నాదగ్గర అదీ లేదు. రాజాం దగ్గర్లో తమ భూములున్నాయనీ, ఏ కొద్దిగానో రైతులవద్ద శిస్తు వసూలు చెయ్యగలననీ అతను నాతో చెప్పాడు. (భూములమాట నిజమే కాని శిస్తులు మాత్రం వసూలు కాలేదు).

తన దగ్గరున్న డబ్బుతో అతను ఈతకల్లు తీసుకున్నాడు. నన్నుకూడా తీసుకోమన్నాడు. నా ఇష్టానికి విరుద్ధంగా అతని కోరికను, కాదు, ఆజ్ఞను నేను శిరసావహించాను. ఏదో మంచినీళ్లు తాగినట్టే ఉంది. "ఇది పులిసినకల్లు కాదు. చాలా ఆరోగ్యం" అన్నాడు రామలింగస్వామి. "ఏడిచినట్టే ఉంది" అన్నాన్నేను.

రాజాంలో బహుశా వారంరోజులున్నామనుకుంటాను. రాంబాబుకి వస్తుందనుకున్న డబ్బు రాలేదు. కేరమ్సులో ఆ ఊరి కుర్రాళ్లతో పందెంవేసి ఆడుతూ ఉండేవాణ్ని. ఎప్పుడూ గెలుస్తూనే ఉండే వాణ్ని. తక్కువ డబ్బు గెలిచినప్పుడు వేరుసెనగ, కొబ్బరి ఉండలతో కాలక్షేపం చేసేవాళ్లం. ఎక్కువ గెలిచినప్పుడు హోటేల్లో భోజనం చేసేవాళ్లం.

విశాఖపట్టణం వీధుల్లో ఉన్న రాళ్లన్నిటితో నా పాదాలకు పరిచయం అని గర్వపడుతూ ఉండేవాణ్ని. చిన్నసైజు రాళ్లనీ, పెద్దసైజు మామిడి టెంకల్నీ తన్నుకుంటూ నడిచేవాణ్ని. ఈ అలవాటు నా కొకసారి మంచి ఉపకారం చేసింది.

మద్రాసు తంబుచెట్టి వీధిలోని ఫస్ట్స్టూడెంట్స్ హోంలో ఉంటూ బి.ఎ చదువుకునే టప్పుడు ఒక నెలాఖరురోజున వెంటనే ఎంతో కొంత డబ్బు టి.యం.ఓ చెయ్యమని మా నాన్నగారికి ఉత్తరం రాసి, దాన్ని పోస్టు చెయ్యడానికి ఎదురుగా హైకోర్టులో ఉన్న పోస్టాఫీసు వైపు నడుస్తున్నాను.దారిలో నేల మీద ఏదో కాగితపు ఉండలాంటిది ఉంటే దాన్ని కాలితో

తన్నేను. అదో అయిదు రూపాయల నోటు.

ఉత్తరంలోని *TMO*ని యం.ఓగా సవరించి ఆ కార్డును పోస్టులో పడేశాను. అయిదు రూపాయలతో అయిదు రోజులు హాయిగా బతకగల రోజులవి. నోటు మడిచి జేబులో పెట్టుకుంటున్నప్పుడు భగవంతుడికి కృతజ్ఞత చెప్పాలని నాకు తోచలేదు. అప్పటికింకా అధి వాస్తవిక రచనలు చదవకపోయినప్పటికీ స్రియలిస్టులు చెప్పే *Ineritability of chance*కి నా అనుభవమే ఒక ఉదాహరణ అనుకున్నాను. ఆపత్కాలంలో అందర్నీ ఆదుకునే భగవంతుడే ఉంటే, ఆకలిచావులనేవే ఉండనక్కరలేదు.

దందహ్యమానమైన దారిద్ర్యపు రోజుల్లో కూడా నేనెప్పుడూ నాకు సాయపడవలిసిందిగా భగవంతుణ్ని ప్రార్థించలేదు. అత్యున్నతమైన ఐశ్వర్య శిఖరాల నుంచి అతి భయంకరమైన నిప్పచ్చరపు లోయల్లోకి మా కుటుంబం దిగజారిపోతున్నప్పుడు ఎక్కడున్నాడీ కరుణా మయుడు? కష్టకాలంలో భగవంతుణ్ని ధ్యానించడాన్నిమించిన పిరికితనం ఇంకోటి ఉండదనేదే నా అచంచల విశ్వాసం.

నడుస్తున్నాను, నడుస్తున్నాను, నడుస్తున్నాను. ఒంటరిగా నడుస్తూ ఉంటే నన్నెవరో నడిపిస్తున్నారనే ఊహ నా మనస్సు నెప్పుడూ మలినపరచలేదు.

చీరాల నుంచి బాపట్లకు నడుస్తున్నాను. జేబులో తగు మాత్రపు డబ్బు లేకపోలేదు. అయినా ఆ యుద్ధపు రోజుల్లో రైలు బండిగాని, జట్కాబండిగాని ఏదీ దొరకలేదు. అర్జెంటుగా బాపట్లలోని కమర్షియల్ టాక్స్ ఆఫీసుకు వెళ్లాలి ఆ క్రితం రాత్రి చీరాలలో "నటాలి" ఆధ్వర్యంలో నాటక ప్రదర్శనం ఇచ్చాము. అమ్మిన టిక్కెట్టుముక్కలన్నీ ఒక పొట్లంగా కట్టి దాచాను. ఆ పొట్లం ఎక్కడో పోయింది. సాయిబాబా మహాత్మ్యం ఏ పాటిదో చూద్దామని ఒకసారి మనస్సులోనే బాబాకి మొక్కుకున్నాను. ఏదో లంచం ఇస్తానని గాని, షిర్డీకి వస్తానని గాని కాదు. బాపట్లలో *CTO* (కమర్షియల్ టాక్స్ ఆఫీసరు) నాతో ఆప్యాయంగా మాట్లాడాడు. మర్నాడు నాకు 50 రూపాయలు జరిమానా పడింది. నాటకం అయిపోయిన వెంటనే టిక్కెట్ల ఎకౌంట్ ఇవ్వనందుకు "నటాలి" అధ్యక్షుడు అబ్బూరి రామకృష్ణారావు గారు యాభై రూపాయలు చదివించుకున్నారు. నాకు సాయిబాబా మీద నమ్మకం ఎగిరిపోయింది.

*ప్రజాతంత్ర 8—2—1976*

# జనార్దనరావు జ్ఞాపకాలు

ఒకటి

ఒకప్పుడు తంబుచెట్టి వీధిలో 'భారతి' ఆఫీసులో గన్నవరపు సుబ్బరామయ్య[1] గారితో ప్రసంగం ముగించి బైటికి వచ్చాను. అక్కడే ఉన్న ఒక ఆసామి నాతోబాటు తానూ బైటికి వచ్చాడు. ఎలా పోల్చుకున్నానో ఇప్పటికీ నాకు తెలియదు. అతను ఫలానా అని దృఢనిశ్చయం కలిగింది.

సుబ్బరామయ్యగారితో సంభాషణ వల్ల 'అతనికి' నేనెవరినో తెలిసింది. అంతసేపూ అక్కడే కూర్చున్న అతణ్ణి నేను చూసీ చూడనట్లే ఊరుకున్నాను. ఎవడో ఉద్యోగస్థుడు అని మాత్రమే అనుకున్నాను. 'అతను' అని మాత్రం నాకప్పటికి తెలియదు.

తంబుచెట్టినుంచి చైనాబజారు వీధిలోకి వచ్చానో లేదో అతను వెనకనుంచి నా భుజం తట్టి 'మీ పరిచయం చేసుకోవాలని ఉంది' అన్నాడు. అప్పుడే నాకు 'అత'నెవరో ఎవరూ చెప్పకుండా తెలిసింది.

'మీ పేరు కొంపెల్ల జనార్దనరావు కాదా' అన్నాను. జనార్దనరావుతో అదే నా ప్రథమ పరిచయం, ఆ క్షణంలో అతన్ని చూడగానే 'గానము విపంచికను మీరె' అనే పద్యం జ్ఞాపకం వచ్చింది. ఆ పద్యంతో అతణ్ని ముడిపెట్టి 'కొంపెల్ల జనార్దనరావువి నువ్వే' అని కచ్చితంగా అనేశాను.

తర్వాత నేను మద్రాసులో చదువుతున్న రెండేళ్లూ ఎన్నోసార్లు అతనితో కలిసి సంచరించాను. మద్రాసులోనే తొలిసారి నేను, అనేకులు వాఙ్మయవ్యక్తులను కలుసుకున్నాను. బసవరాజు,[2] నండూరి,[3] మల్లంపల్లి,[4] వేటూరి,[5] ముద్దుకృష్ణ,[6] విశ్వేశ్వరరావు ఇత్యాదయః. సోమ శేఖరశర్మ గారి ఇంట్లో నేనూ జనార్దనరావూ మొదటిసారి నండూరిముఖస్థంగా యెంకిపాట విన్నాము. విశ్వనాథ 'కిన్నెరసాని పాటలు' వింటూ మైమరచిపోయాము.

1 గన్నవరపు సుబ్బరామయ్య —1920లలో 'భారతి' పత్రికకు సంపాదకులుగా వుండవారు.

2 బసవరాజు అప్పారావు— మద్రాసులో పై చదువులకోసం ఉండినప్పుడు, ''సెలయేరు''(1916) రచించారు.

3 నండూరి (వెంకట సుబ్బారావు)—మద్రాసులో బి.యల్. చదువుతూ బసవరాజు అప్పారావుతో సాంగత్యం చేశారు. ''ఎంకిపాటలు'' ప్రారంభించడం అప్పుడే.

4 మల్లంపల్లి సోమశేఖరశర్మ — 'భారతి'లో ప్రవేశించకముందు, మద్రాసులో కొమర్రాజు లక్ష్మణరావుకు సహాయకులై పనిచేశారు.

5 వేటూరి ప్రభాకరశాస్త్రి — మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో పరిశోధన చేస్తూ వుండేవారు.

6 'ముద్దుకృష్ణ (1899–1973) కవి, కథకుడు. నాటక కర్త, సాహితీవేత్త, పురోగామి దృక్పథం వున్నవాడు. 'జ్వాల' సాహితీ మాసపత్రికకి సంపాదకత్వం వహించాడు(1934). 'వైతాళికులు' సంకలన కర్త. ఆధునిక తెలుగు కవిత్వానికి అద్దం పట్టిన ఈ సంకలనం తొలి ముద్రణ 1935లో వెలువడింది.

నేమూ, విశ్వేశ్వరరావూ, జనార్దనరావూ కలిసి, హైకోర్టు బీచిలోనూ, రామకృష్ణా లంచిహోములోనూ, అడయారు, కన్నెమరా లైబ్రరీలోనూ, పరశువాకం- ఎగ్మూరు వగైరా వీధుల్లోనూ విశ్వసాహిత్యపు సరిగమపదనిసలు సవరించాము.

జనార్దనరావు 'భుజగభూషణ' అనే కీర్తన పాడుతూ వుంటే నేను తన్మయుణ్ణయ్యాను. అతడు సంగీత విద్వాంసుడనికాదు. అతని గొంతుక బాగుంటుందనీ కాదు. ఆ సాయంత్రం మేము భవిష్యత్తులో పొదగదలచిన కొన్ని బంగారపుగుడ్లకి శంకుస్థాపన చేశాము. ఆ పునాదిమీద లేచిన పొగమంచుభవనం జనార్దనరావు పాట. అది అప్పుడే అదృశ్యమయ్యింది కాని, ఎప్పటికీ అదృశ్యంకాదు.

1928లో మొదటిసారి జనార్దనరావును చూశాను. 1938లో అతని ఆఖరు ఉత్తరం చదువుకున్నాను.

జనార్దనరావుని క్షయరోగం పట్టుకుపోయిన తర్వాత "వీణ"లో అతని కొక తర్పణం విడిచాను. నా "మహాప్రస్థాన" సంపుటం అతనికి అంకితం ఇచ్చాను.

"తలవంచుకు వెళ్ళిపోయావా నేస్తం, సెలవంటూ ఈ లోకాన్నే వదిలి" అంటూ ఒక అంకితపు గీతం వ్రాశాను. ఈ అభినయాలు మినహా ఇంతకంటె నేను జనార్దనరావుకోసం చేసిందేదీలేదు. "ఉదయిని" సంచికలతో ఊరేగడం, చందాలు వసూలుచెయ్యడం మొదలైనవి జనార్దనరావు కోసం కాదు, సాహిత్యంకోసం.

బరంపురంలో మొదటిసారి నవ్యసాహిత్య పరిషత్తు[7] సమావేశమయింది. (అప్పటికది "అఖిలాంధ్ర కవిపండిత సభ") చింతా దీక్షితులు[8]గారితో నా మొదటి పరిచయం అప్పుడే. వాలో పాతరాతియుగం పోయి, కొత్తయుగం ప్రవేశిస్తున్న రోజులు. జనార్దనరావూ, నేనూ కలిసి సాయంకాలం కాగానే ట్రంకురోడ్డుమీద షికారు తిరిగివచ్చేవాళ్ళం. అప్పటికి మా సంభాషణ సారాంశం మాత్రమే నాకు జ్ఞాపకం ఉంది. "ఉదయిని" ప్రారంభిస్తాను. నువ్వూ చెన్నపట్టణం రా అన్నది జనార్దనరావు పాడిన పల్లవి. అతనిపాట పూర్తి అయిపోయేదాకా నేను చెన్నపట్టణానికి వెళ్ళడం పడిందికాదు. ఈ లోపున సుమారు పదేళ్ళపాటు ప్రధానంగా "బీభత్సాలను అనుభవాలలో వడబోస్తూ" జీవితాన్ని కవిత్వంలోకి తర్జుమాచేస్తూ ఆవేశాలకు ఆకారాలు వెదుకుతూ మహాప్రస్థానం సాగించాను. అప్పుడప్పుడు కాకినాడ, బెజవాడ, బందరు మొదలైనచోట్ల జరిగిన సాహిత్యసభలలో, ఒకేసభకి ఇద్దరం వచ్చిన సందర్భంలో, లేదా ఆంధ్ర దేశ పర్యటన సందర్భంలో, జనార్దనరావు విశాఖపట్టణం వచ్చి నేనుకూడా ఊళ్ళోనే ఉన్నప్పుడు, మేము ముఖస్థంగా ముచ్చటించుకొనే వాళ్ళం. తరుచు ఉత్తర ప్రత్యుత్తరాలలో మా గొడవలు వెళ్ళబోసుకొనేవాళ్ళం.

7 *బరంపురం నవ్యసాహిత్య పరిషత్తు —అఖిలాంధ్ర కవిపండిత సభ 1933లో సమావేశమయింది.*

8 *చింతాదీక్షితులు— రాజమండ్రిలో బి.ఎ. మద్రాసులో యల్.టి. చదివి వచ్చాక విద్యాశాఖోద్యోగిగా పనిచేస్తూ "ఏకాదశి" (1924) కథలు, శబరి (1931) నాటిక వగైరా ప్రచురించారు. పత్రికలో సులభసుందర శైలిలో గేయాలు కథలు ప్రకటించారు.*

"ఉదయిని"ని ఉన్నత వీధులలో నడిపించాలనీ, నవ్యాంధ్ర సాహిత్య (కనీసం, కవిత్వ) చరిత్ర రాయాలనీ, యువలోక స్వప్నాలకు ప్రాణప్రతిష్ఠ చెయ్యాలనీ, ఇలాంటివో ఏవో సంకల్పాలు చెప్పుకునేవాళ్ళం.

నాకొకందుకు సంతోషంగావుంది. ద్వితీయ మహాయుద్ధాన్ని చూడకుండా వెళ్ళిపోయాడు జనార్దనరావు. (లేక జనార్దనరావు ఉన్నంతకాలం, భయంవేసి ద్వి.ప్ర.మహాయుద్ధం రావడం మానేసిందేమో) జనార్దనరావు నిష్క్రమించిన తరువాత, 1938లో నేను "ఆంధ్రప్రభ" గొడుగు కిందికి చెన్నపట్టణంలో పునఃప్రవేశించాను. నాతోబాటు అధివాస్తవికతకి సంబంధించి కొన్ని పుకార్లు మోసుకొచ్చాను. "అశాంతి" అనే ప[త్రిక] పెట్టాలనే అభిప్రాయం ఒకటి నా మెదడు పొరుగు అడుగుపొరలలో మెదల్తూ ఉంది.

జనార్దనరావు హత్యలో మొదటి ముద్దాయి చెన్నపట్టణం. మరాఠీకి బొంబాయి, బెంగాలీకి కలకత్తాలాగ తెలుగువాడికి మద్రాసు మాతృస్థానం కాదు. ఇక్కణ్ణుంచి కాకిబంగారం తప్ప ఇంకోసరుకు ఎగుమతి చెయ్యడానికి వీలులేదు. నాది అని చెప్పుకొనే "మహానగరం" లేనంతకాలం, తెలుగువాడు మహాభారతాన్ని ప్రదర్శించలేడు.!

తెలుగువాడు ధారాళంగా తాండవించగల మహానగరాలు రెండే కనబడుతున్నాయి నాకు. ఒకటి చెన్నపట్టణం. రెండు భాగ్యనగరం అనబరగే హైద్రాబాదు. అయితే చెన్నపట్టణానికి అడుగుభాగం అడుసు, హైద్రాబాదుకి పైకప్పు కంటకకిరీటం. అంచేతే ప్రస్తుత పరిస్థితులలో మద్రాసునుంచిగాని, హైద్రాబాదునుంచి గాని మహాకవుల ఆవిర్భావం అసంభవం. తెలుగుదేశం నుంచి ఏదైనా ఒక ప్రతిభాకిరణం ఈ స్థలాలలో ఎదగడానికి వచ్చినా త్వరలోనే అది అపస్వరాలు పలకడమో అసలే మూగపోవడమో జరుగుతుంది. ఇందుకు రెండుదాహరణలు. ఒకటి హైద్రాబాదులోని అపస్వరాలు. రెండు మద్రాసులోని మౌనం.

అయినా చెన్ననగరాన్నీ, భాగ్యనగరాన్నీ తెలుగువాడు వదలిపెట్టకూడదు. వీటిని పూర్తిగా తెనిగించడమే ఆంధ్రుల ప్రధానకర్తవ్యం! ప్రథమ కర్తవ్యం!

జనార్దనరావుని చెన్నపట్టణం ఎలా చంపిందో చెప్పాలా! ఊహూ! నాది స్వీయచరిత్ర, డిటెక్టివునవల కాదు.

*ఆంధ్రశిల్పి అక్టోబర్—నవంబర్ 1948*
*పునర్ముద్రణ: శ్రీ శ్రీ సాహిత్యం ఒకటి కావ్య, వచన విభాగాలు*
*ప్రజాతంత్ర 22-6-1975*

## రెండు

కొంపెల్ల జనార్దనరావుతో నాకు మొట్టమొదటిసారి 1928వ సంవత్సరం మద్రాసులో తంబుచెట్టివీధిలో పరిచయమైంది. ఆయేడే కొత్తగానేను చదువుకోసం మద్రాసులో అడుగుపెట్టాను. మా నాన్న క్రిష్టియన్ కాలేజీలో నాకు బి.ఎ జూనియర్ తరగతిలో సీటు

సంపాదించి తంబుచెట్టి వీధిలోని ఫస్ట్‌స్టూడెంట్సు హోమ్‌లో నన్ను ప్రవేశపెట్టి విశాఖపట్నం వెళ్ళిపోయాడు. హాస్టలులో అందరూ నాకు కొత్త. అసలు మద్రాసు నగరమే ఒక మహా సముద్రం లాగా కనిపించేది. అప్పుడు నా వయస్సు 18 ఏళ్ళు. నాకంటె జనార్దనరావు ఒకటో, రెండో ఏళ్ళ పెద్ద. తంబుడుకాదు అన్నే కాబోలు అని ఒక ఉత్తరం ముగించి సంతకం చేశాడు వస్తున్నా. అప్పటికింకా జనార్దనరావుని ముఖస్థంగా కలుసుకోలేదు. అంతకుముందు ఒకటిరెండుసార్లతని పద్యాలు చదివాను. ఇప్పటికీ తంబుచెట్టి వీధిలో ఉంటున్న ఒక సుప్రసిద్ధ మాసపత్రికలో అప్పుడే ఈ పేరుతో నాకొకానొక భావబాంధవ్యం ఏర్పడింది. జనార్దనరావు నాకన్న బాగా పద్యాలు రాయగలడని నాలో నేనే రహస్యంగా అంగీకరించాను. కాని నేనుకూడా అతనికేమీ తీసిపోనని నాలోని స్వాతిశయం నన్ను హెచ్చరించేది. అవి భావికవిత్వపు రోజులు. సాహిత్యలోకంలో సాహితీసమితి నాయకత్వమూ అందులో మళ్ళీ చీలికలూ, తిరుగుబాట్లూ కొంతమంది తప్పుకోవడమూ ఇవీ ఆనాటి హెడ్‌లైన్ న్యూస్.

అంటే సాహిత్యం కోసమే ప్రత్యేకించిన దినపత్రికలుంటే మాట! ఆనాటి సాహిత్యదోరణు లన్నింటికీ స్థానం ఇస్తున్న ఒకే ఒక పత్రిక ఇందాక నేనుచెప్పిన పత్రిక. అందులో నీ పద్యం పడిందంటే కవిగా నీకు సాహిత్యలోకంలో జాగా దొరికిందన్నమాట. కథ పడిందంటే కథకుడుగా నిన్ను లోకం గుర్తించిందన్నమాట. విమర్శవ్యాసం రాశావంటే, నీ అభిప్రాయాలు విలువయినవన్న మాట. నీ పుస్తకాన్ని ఆ పత్రిక మెచ్చుకున్నదంటే, నువ్వు గొప్ప రచయితవి. అటువంటి ఆ పత్రికలోనే జనార్దనరావు సబ్ ఎడిటరుగా పనిచేస్తున్నాడు. ఉండండి. ఆ సంగతి నా కప్పుడే తెలియలేదు. ఎలా తెలిసిందో ఇప్పుడే చెప్పబోతున్నాను.

నేనూ ఈ మాసపత్రికా ఒకేవీధిలో ఉన్నాం కాబట్టి మద్రాసు రాగానే నేను చేసిన మొదటిపనుల్లో మొదటిది ఈ పత్రికా కార్యాలయంలో అడుగుపెట్టడం. అక్కడ గన్నవరపు సుబ్బరామయ్యగారిని కలుసుకున్నాను. ఎడంగా ఒక కుర్చీమీద ఇంకో కుర్రాడు కూర్చున్నాడు. గంటో గంటన్నరో ఉన్నాను. అవీ ఇవీ మాట్లాడాను సుబ్బరామయ్యగారితో. నా పద్యాలు కూడా ప్రచురణార్థం ఇచ్చానేమో ఇప్పుడు సరిగా జ్ఞాపకంలేదు. తర్వాత నడుచుకుంటూ వచ్చేశాను ఇవతలికి. వీధికొసకి వచ్చేదాకా వెనక్కి తిరిగిచూడలేదు. నా వెనకాతలే వచ్చాడు ఇందాకటి కుర్రాడు. శ్రీనివాసరావుగారూ అని పలకరించాడు. ఒకసారి అతణ్ణి ఎగాదిగా చూశాను. బక్కపలచగా ఉన్నాడు. ఖద్దరులుంగీ, ఖద్దరుచొక్కా వేసుకున్నాడు. ఎర్రటి వొళ్ళు. సూటిముక్కు, సూదుల్లాంటి కళ్ళు. పత్రికా కార్యాలయంలో చూసిందితణ్ణే. మనకెందుకులే అని అప్పుడు మాట్లాడలేదు. కాని ఎందుకో ఇప్పుడితనే కొంపెల్ల జనార్దనరావయి ఉంటాడనిపించింది. మీరు కొంపెల్ల జనార్దనరావుగారనుకుంటాను...అని పుస్తకంలో అచ్చ యిన పూర్తిపేరు చదువుతున్నట్లు అనేశాను...ఔను అతనే. అతని రచనల్లోని గానము విపంచికను మీరె...పద్యపాదాలు మనస్సులో సందడిచేశాయి. ప్రథమ పరిచయం. పక్కనే

లింగిచెట్టివీధిలో ఉంటున్నానని అడ్రెస్ ఇచ్చాడు. తర్వాత ఎన్నోసార్లు అతణ్ణి ఇంటివద్దా పత్రికా కార్యాలయంలోనూ చూశాను. ఎప్పుడూ అతను మా హాస్టలుకి వచ్చినట్లు జ్ఞాపకంలేదు. నేను ఆహ్వానించకపోవడంవల్లనో ఏమో అనిపించుతుందిప్పుడు. అటువంటి సాంఘిక మర్యాదలను పాటించడం అప్పుడూ ఇప్పుడూ కూడా నాకు తెలియదు. నేను పిలిచివుంటే వచ్చేవాడేమో...పిలవకపోవడం నా తప్పేమో! ఎందుకూ, ఎక్కడైతేనేం విధిగా ప్రతిరోజూ మేం కలుసుకుంటూనే ఉండేవాళ్ళం. రెండేళ్ళు ఇలాగడిచాయి. మళ్ళీ మేము దూరం అయిపోయాం. తరచు ఉత్తరప్రత్యుత్తరాలు మాత్రం సాగించేవాళ్ళం. ప్రపంచాన్ని భయానక బీభత్సరసాల్లో ముంచెత్తిన 1930వ దశాబ్దపురోజులు. దరిద్రపు రోజులు. ఆ పది సంవత్సరాలూ నేను బంతిలాగ ఉన్నచోట ఉండకుండా గెంతాను. ఆ పదేళ్ళలోనే నా మహాప్రస్థానం గీతాలన్నీ- అన్నీకాకపోయినా ఆల్మోస్టు అన్నీ- రాశాను. ఆ పదేళ్ళు అంతం కాకముందే జనార్దనరావు మరణించాడు. అతనికే నా మహాప్రస్థానం అంకితం ఇచ్చాను. అది వేరే సంగతి.

ఒక మనిషికి ముప్ఫయియేళ్ళు వచ్చాయంటే మనిషిగా అతని జీవితం ప్రారంభం అవుతోందన్నమాట. పాపం జనార్దనరావు జీవితం ప్రారంభించకముందే మరణించాడు. ఎంతోమంది కాతనిపేరు తెలియదు. ఎలా తెలుస్తుంది? ఎందుకు తెలియాలి? అతను బతికున్నంతకాలం అతనిరాత లెవరికీ అర్థంకావని ఒకటేగోల. పద్యాలమాట సరేసరి. వచనం కూడా అందరికీ కొరకరాని కొయ్యే. ఒక ఉదాహరణ. వైశాఖి సంచికలో జనార్దనరావు తన కవిత్వంమీద రాసిన వ్యాసాన్ని కృష్ణశాస్త్రిగారు ఆసాంతం చదివి, ఆఖరుకి...అయితే ఏమిటయ్యా ఇతనంటాడు? ఇందులో. నన్ను పొగడినట్టా, తిట్టినట్టా? అన్నారు. ఒక ప్రముఖ వారపత్రిక ఆనాటి సాహిత్యకులందరికీ సరదాబిరుదులిస్తూ ఉండేది. జనార్దనరావుని చండప్రచండగండ శిలాభినవకొక్కొండ...అని అభివర్ణించింది. మరి నన్నో...కవిమహోత్పాతావర్త...అని కాబోలు అంది. కాబోలేమిటి...ఔను. జనార్దనరావు మాత్రం తన బిరుదులోని శబ్దగమనం అనుకరిస్తూ నన్ను, దండిపద పదండి మండితాభినవ దండి...అన్నాడు.. సరదాగానే ఉందిగాని ఈ వర్ణన నాకు సరిపోయిందని ఆనాడు అనుకోనూ లేదు. ఈనాడు అంగీకరించనూ లేదు. జనార్దనరావూ నేనూ ఎప్పుడూ వాదించుకొనేవాళ్ళం కాం కాబట్టి, అతని వర్ణనని నేను చిరునవ్వుతో స్వీకరించాను. నాకిచ్చిన బిరుదును జనార్దనరావు తమాషాగా వ్యాఖ్యానించాడు. తొలిదండి తెలుగుపదమనీ, చివరిదండి సంస్కృత పదమనీ వివరించేవాడు. చెప్పొద్దూ, జనార్దనరావులో ఉన్న ఒక గొప్ప సుగుణం ఏమిటంటే, తన అభిప్రాయాలను ఎవరిమీదా బలవంతంగా రుద్దేవాడుకాదు. ఎన్నో పర్యాయాలు మేం ఎన్నోవిషయాలమీద మాట్లాడుకునే వాళ్లం. ఎప్పుడూ మాటమీదమాట అనుకున్నట్లుగాని ఎన్నడూ గొంతుహెచ్చించి కొట్లాడు కున్నట్టుగాని నాకు జ్ఞాపకం లేదు. జనార్దనరావు మొగంమీద నేనెప్పుడూ కోపం అనేది చూడలేదు. నిస్పృహ చూశాను. నిరాశ చూశాను. అందులోనే ఒక అజేయమైన పట్టుదల

కూడా చూశాను. బాధపడడం చూశాను. ఆఖరాఖరి రోజుల్లో ఒక మూడురోజులు కాబోలు జనార్దనరావు మా ఇంట మంచంపట్టాడు. ఎంత బాధపడ్డాడని. నేను నిస్సహాయంగా అతనితో అన్నాను...జనార్దనరావుగారూ, ఆరోగ్యంగా ఉండి కూడా నేను మీరెంత బాధపడుతున్నారో అంత బాధాపడుతున్నానంటే నమ్మండి...అని. కేథలిక్కు ప్రేమను గురించి చెబుతారులెండి. నువ్వు ప్రేమించినవ్యక్తికి కుడికాలు నొప్పిగావుంటే నీ కుడికాలికి కూడా ఆ నొప్పి ఉంటుందని. జనార్దనరావు విషయంలో సరిగ్గా ఈ అనుభవం నాకు కలిగింది...ప్రపంచబాధ శ్రీశ్రీ బాధ...అని నా గురించి చలంగారు రాసిన అభిమానంతో కూడిన అతిశయోక్తికి ఇదే అర్థం అనుకుంటాను. ఎంచేతంటే ప్రపంచంలో ఎంత బాధవుందో ఎవ్వరూ కొలవలేరు. అదంతా ఏ ఒక్కమనిషీ తన ఒక్కడిలోనే అనుభవించగలగడం అసాధ్యం. బుద్ధుడైనా సరే, జీసస్ అయినా సరే, గాంధీ అయినాసరే...మనకంటే మరికొన్ని రెట్లు ఎక్కువ అనుభవిస్తారు. అంతే. మనిషికంటే ప్రపంచం గొప్పది. మనిషికంటె మనుషులు గొప్పవారు. అంతే, సరే ఈ వేదాంతాలకేంకాని జనార్దనరావు గురించి చెప్పకుందాం మళ్ళీ. జనార్దనరావంటే ఉదయిని. ఉదయిని అంటే సాహిత్య స్వరూపాన్ని తీర్చిదిద్దడానికి ప్రతిజ్ఞపట్టిన పత్రిక. ఆ పత్రిక కోసమై బలైపోయాడు జనార్ధనరావు.

...ఎవరికి కావాలి నేస్తం నువ్వు
కాగితంమీద ఒక ఊహకు బలి అయితే
కనబడని ఊహ నిన్ను కబళిస్తే
అందరి రెక్క నిన్ను మంత్రిస్తే, నిమంత్రిస్తే...

అని జనార్ధనరావుకి నా...మహాప్రస్థానం...అంకితం చేసిన గీతంలో రాశాను. ...''ఉదయిని''...పత్రిక ప్రారంభించడానికి తహతహ పడుతున్న రోజుల్లో జనార్ధనరావు నాకు చాలా ఉత్తరాలు రాశాడు. అందులో ఒకటి పూర్తిగా చదువుతాను. కొంచెం దీర్ఘమైన ఉత్తరమే. కాస్త ఓపికగా వినండని ప్రార్థన.

మద్రాసు, 26-6-33.

డియర్ శ్రీశ్రీ,

మీ జాబువల్ల నాకు కలిగిన ధైర్యము ఇంతా అంతాకాదు. నాకు సహజముగా అధీరత ఉంది. దానికి సాయము బాహ్యాపరిసరాలు జడిపిస్తే మరీ ఇదిగా ఉంటుంది. ఒకవేళ ఆ సున్నితమైన మనస్థితిచేతనే కొంచెము అనుకూలమైన వాయువు వీచినా ఎక్కువ పారవశ్యము పొందే వెర్రి ( ॰టే ఉండవచ్చును. కాని ఇట్టి నేను ఒక కేంద్రములో నా తపోమయమైన వాతావృతి చుట్టుకొని సర్వమూ పరికిస్తూ ఉంటానన్నది నాకు తెలిసిన సత్యము. దానినిబట్టి నాలో మిగిలిన మూలగతములైన సంకల్పవికల్పాలు నన్ను చోదించుతాయి. అక్కడ తాకింది మీ అనుకూల్యము, నా సంకల్పములో ఒక మెరుగుచొచ్చింది. అయితే అది మళ్ళీ మీరు అనే ఒక

మూర్తిలో నిలుపుకొని నాకు సాయము చేయండి...నాకు వ్యాసము పంపండి అని ఉద్భావించుకుంటూనే ఉంటాను.

నా మనసులో మీరు రేపిన తేజము వికసించిన రేకులు నేను చూచినంతగా మీకు చూపలేకపోతున్నాను. నేనట పత్రిక నడుపుతానట. ఏమోమరి నడుపుతానట కూడాను. ఎల్లాగో చూచుకొందాములే. నా తేజము నేను చూచుకోవడములోనే అందరికీ చూపుతాను కాబోలు. నేడు ఉపవసిస్తున్నాను. నేనంటే జనార్దనరావు అనే కాస్యపావత్సార నైధ్రువత్ర యార్షేయ ప్రవరాన్వితుడని మాత్రం గుద్దుక కూర్చోకండేం మనస్సులో. సరే ఈ వేదాంతాలకేంలెండి. నేనూ మీకు సమాధానము వ్రాద్దామనుకుంటుంటే అప్పలస్వామిగారి ఉత్తరము వచ్చింది ఇప్పుడే. ఉత్సవ ప్రయత్నాలకు ఉత్సవం పాటించారు. మీరు ఇక్కడకు వచ్చే ఏర్పాటుమాట వెంటనే తెలియజేయండి. మీరు ఇక్కడుంటే చాలాబాగుండును. కాని ఎక్కడ ఉన్నా ఇక్కడ ఉన్నట్లే నర్తించాలి. ఊరుకుంటే వల్లకాదు. ప్రార్థిస్తే కోపపడుతారని నేనే కోపపడుతున్నాను. వెంటనే ఒక సహాయం-వ్యాసాలు శుభ్రమైనవి పంపించేయండి. నేను చూచుకొని పొంగుతూ ఉంటాను. స్టాండర్డు విషయంలో చాలా శ్రద్ధ తీసుకుందాము. నాకూ అదే పెద్ద తాత్పర్యము. నిజానికి డబ్బువిషయంలో కంటె కూడా స్టాండర్డు కంట్రిబ్యూషన్సు వచ్చే అవకాశం విషయంలో ఎక్కువ తలంపు నిలబెట్టాము మొదటినుంచీని. పత్రిక ఉన్నతవీధులలో నడపడానికి సర్వశః ప్రయత్నిద్దాము. నడపగలమని నాకు ధైర్యము కల్గుతూంది. ఈ పత్రిక మన యువలోకమునకు ప్రతినిధులముగా మన కనుబంధించి ఒక దివ్యమైన సాధన అని అనుకుందామని ఉంది నాకు. ఇది నెగ్గిందంటే సారస్వత చరిత్ర మెరుగుతిరిగిందన్నమాట అని మనలను మనమైనా మనస్సులో పొగడుకుందామనీ ఉంది. (... ... ... ?)

ఆ హవిస్సు ఆరగించి నా సిగ్గు తొలగిస్తూంది. కాని నా మౌనమూ నిలుపుతుంది స్తుతిపాఠమంతా నిగ్గులు మూటకట్టిస్తూ.

ఎంతెంత రహస్యాలు చెప్పాననుకున్నారు మీకు? ఆ స్థానములో వైరుధ్యము కోటలుకట్టే బలశాలులు ఇవి. ఇది మీకు ప్రశంసగా ఇస్తున్నాను. మీ మానవత్వానికిన్నీ! మీరు చాలా గొప్పవారు అని నా నమ్మిక. నిజముగా భాషాదేవి సేవచేయడానికి, దేవలోకమంతా కదలిపోయే వినీత దీక్ష ప్రజ్వరిల్లిన మానసము మీది. మీకు తెలుసునా?

మన సోదరులకు నమస్సులివ్వండి. పత్రిక విషయమై సలహాలు ఇవ్వండి. చాలామంది యువమిత్రులు అభయము చూపుతున్నారు. వారంతట వారే నన్ను పత్రికపెట్టమన్నవారు కూడా ఉన్నారు.

అయితే నా ప్రజ్ఞ విషయములో నాకు చాలా భయమువేస్తున్నమాట వాస్తవము. నేనే గొప్ప

రచనలు వ్రాసిపెట్టుకోవలసి ఉన్నది. ఇంకా తగినంత సిద్ధముకాలేదు. ప్రయత్నములో ఉన్నాను. నాకు నేనుగా కూడా. ఎంతో సలహాలు ఇవ్వండి.

తంబుడు, కాదు,
అన్నే కాబోలు
జనార్ధనరావు.

ఇప్పుడు చదవండి జనార్దనరావు గీతాలు. ఎందుకు అర్థంకావో చూద్దాం. కాని అవన్నీ ఎక్కడున్నాయి. గ్రంథరూపంలో ఎప్పుడు బయటపడతాయి? ఈ లోపున నాకు నచ్చిన, నాకు కంఠస్థంగా వచ్చిన ఒకటిరెండు గీతాలు చదువుతాను. ఒక గీతం...

నా భావి పథము పంచల నెందు నొదుగుచు
వేచియుందువొ కాలవిభు చోదనము లెంచి
అవతరింపుమి దేవి ఆవహింపుమి నను
నాగుండె విరియు ఈనాడె ఆ శుభవేళ
ఓ విజయలక్ష్మీ.

ఆకళింతలు మెలగి ఆవేశమయి పొంగి
నీ కమ్ర పద తపోనిరతి పెంపు వెలింగి
ఏ ననంతపథాలకే చాగికొని నిల్చి
అల దివ్యవాణి ఆజ్ఞలు మీటుకున్నాను
అవతరింపుమి.

వింతలౌ నొక స్వప్న వీధి విహాయస
ప్రాభవశ్రీలు శంపలు లోన నిలబోసి
ఇటు మేలుకొల్పి జాగృతినే హరింపవు
విశ్వమ్ము నాస్వప్న విజయమే వరియించు
అవతరింపుమి.

విశ్వయాత్రికు లాత్మవిభు స్వప్న కలశముల్
నీతేజమున కరంగిరి జ్యోతిషాకృతుల్
నామాధురీ ధురీణము భావజగతిని
సోహణింపుమి నీప్రభూత లావణ్యముల్
అవతరింపుమి.

నా మహేచ్ఛా ప్రభానము నాకై ఐక్యమై
విశ్వవారిజము స్వావృతమహా సౌందర్య
పరిధి అంచులుతాక విరిసి భౌతిక భూతి
విరిసిపో, నాలోన విస్మృతి గుణించుకో
అవతరింపుమి.

నే రవిత్వము వెలింగిన రాఫెళుల్ వడి
ప్రకృతి హృత్ప్రణయ వైభవము నెద కుంచించి
పరిమితుల్ వలచు తత్పరవృత్తి తెరవిచ్చి
ప్రళయగర్భ పథాన వరసృష్టి మలచుకో
అవతరింపుమి దేవి ఆవహింపుమి నను
నా గుండె లవియు ఈనాడె ఆ శుభవేళ
ఓ విజయలక్ష్మీ.

ఇంకొక గీతి ఉపేక్షితము

ఉపేక్షితము

ఒక ముసలిదోనె యిది పడియున్నదిచట
ఊడిగముసేత సత్తువ లుడిగియుడిగి
తనకు దా మృతస్మృతులు కల్పనము సేసి
కొనుచు తనపయిఁదా జాలిగొనుచు నిట్లు.

అఖిల జనుల వాత్సల్య సహార్థియగుట
తలపడు స్వకీయ సౌఖ్యసంధాయి యగుటె
అరయడు నరుండు - కట్టికొన్నాడు, తరువు
నరికి, కంకాళమయ మొక నావ తనకు.

కుపితజలరాశి బ్రకృతి సంకుల విఘట్ట
నముల దనకంగరక్షగా నవయజేసె
స్వార్థసంపాదనములకై యడచి దీని
చూచి యోర్వదు చూడనే చూడడిపుడు.

నిరతయాత్రా మిళత్కాలచరణ బహుళ
చిహ్న జీర్ణితసత్త్వమీ సికతరేణు
సముదయమున గాయార్ద్ర దఘ్నముగ నిలిచి
నేర్పుచున్నది యిది ధ్యాననిరతి తాల్మి.

వాయువులు దీన గుప్తభావములు చదువ
గొదగుచున్నవి చెడిన గూడిసొదలు
పోసికొని యేడ్చుచున్నదీ పులుగు జలము
లశ్రువులు బిందుకెలన చిరానురక్తి.

గతకథా గళసారి గాద్గదిక మాధు
రీ గరిమలో నడచుకొన్న పృథులశాంతి
అణువణువునందు నాల్కా విప్పారి, స్వాగ
తము విరాళించి యదుగు, దైన్యము వరించి.

జనార్ధనరావు బతికుంటే ఎలా పరిణమించే వాడని ఊహాగానాలు చెయ్యడం వ్యర్థమైన పని. కాని ఒకటిమాత్రం నిశ్చయం. అతడు కమ్యూనిజాన్ని హర్షించలేదు. అర్థం చేసుకోగలడు. కాని ఆచరణలో అతణ్ణి అనుష్ఠించనీయకుండా ఆటంకపరిచే ఒక ఎరిస్టోక్రాటిక్ తత్వం అతనిలో ఆనాడే నేను పసికట్టాను. కరడుకట్టిన కన్సర్వేటివ్‌గా పరిణమించేవాడా? అదీ సందేహం. ఎంచేతనంటే ఛాందసంలోని చాదస్తాలన్నిటినీ అతను అవహేళన జేసేవాడు. విశాలంగా విప్పారిన మనస్సతనిది. సంకుచితత్వాని కక్కడ జాగాలేదు.

మా యిద్దరిమధ్యా సమానధర్మాలేమిటి. ఒక్కొక్కటే చెప్పకొస్తాను.

1. ఇద్దరం ఇంచుమించు సమవయస్కులం.
2. ఇద్దరికీ ఆడంబరం అంటే ఇష్టంలేదు.
3. ఆరోజుల్లో ఇద్దరం సాహిత్యం అంటే పడి చచ్చేవాళ్ళం.
4. విశ్వనాథ సత్యనారాయణ కవిత్వం అంటే ఇద్దరికీ ఎడతెగని మోజు.
5. సాహిత్యానికొక సాధికారమైన వేదిక ఉండాలనీ, అది పత్రికారూపంలో ఉండాలనీ ఇద్దరం దృఢంగా విశ్వసించాం.
6. పత్రికల నిర్వహణలో పెట్టుబడిదారీ విధానం ప్రత్యక్షంగా పనిచేస్తోందని అతను లోపలనుంచీ, నేను పైనుంచీ (ఆరోజుల్లో) గ్రహించాం.
7. డబ్బులేని పత్రికలు బతకవని ఇద్దరికీ తెలుసు కాని ఆ డబ్బు ఎలా ఆర్జించాలో ఇద్దరికీ తెలియదు. (ఇరవైయేళ్ళ తర్వాత ఇప్పుడిప్పుడే నాకు ఈ టెక్నిక్ తెలుస్తోంది).

8. ఇద్దరి జీవితాలనీ సాహిత్యానికే అంకితం చెయ్యాలని అనుకున్నాం.
9. ఇద్దరిలోనూ మితవాదతత్వం లేదు. ఏ ఎండ కాగొడుగు పట్టడం అంటే ఇద్దరికీ అసహ్యం.

మరి వైరుధ్యాల మాట.

1. అతనికున్నంత క్లాసికల్ లెర్నింగ్ నాకు లేదని నా దిగులు. నాకున్న కాలేజి ఎడ్యుకేషన్ తనకు లేదని అతని బెంగ. కాని స్వయంకృషితో అతను ఆంగ్లసాహిత్యాన్ని అధ్యయనం చేశాడు. సంస్కృతంతో సరాసరి పరిచయం లేకపోయినా మన సంస్కృతిని నేను ఒంటపట్టించుకున్నాను.

2. అతను చచ్చిపోయీ బతికున్నాడు. నేను బతికుండీ చచ్చినట్టు పడివున్నాను. అతను చెయ్యదలచుకున్నంతా చెయ్యలేకపోయాడు. నేను కొంతలో కొంతైనా చేశాను. ఇంకా చేస్తాననే ధైర్యమూ ఉంది. ఈ ధైర్యమే ఇంకా నేను బతికుండడానికి కారణం.

జనార్దనరావు గురించి నేను చెప్పిందీ చెప్పగలిగిందీ ఇంకేముంది. ఈ ప్రసంగం ఎలా ముగించడం? ఏమీ తోచలేదు. కీట్సు[1] చనిపోయినప్పుడు షెల్లీ[2] మూల్గిన మూల్గుతో ముగిస్తా... ఐ వీప్ ఫర్ ఎడోనేస్[3]...

*రేడియో ప్రసంగవ్యాసం*
*ముద్రణ: ఆకాశవాణి ప్రసారిక—జనవరి 1958*
*పునర్ముద్రణ: శ్రీ శ్రీ సాహిత్యం ఒకటి*
*ప్రజాతంత్ర 29—6—1975, 6—7—1975*

## మూడు

కొంత కొంత మందికి కొన్ని కొన్నిపనులు చెయ్యడానికి ధైర్యం చాలదు. ఆ అధైర్యాన్ని ధర్మంకాదనో, నైతికశక్తి అనో సమర్థించుకుంటారు. సమాజంలోని వర్గ వ్యత్యాసాలే మన ప్రవర్తనలన్నింటికీ మూలకారణమని నాకేనాడో తెలుసు.

అందుకే, ''పోనీండి, ఏ దేవుడూ దెయ్యమూ లేదనే ఒప్పుకుందాం. కాని మనందర్నీ నడిపించే ఏదో తెలియని శక్తి ఉందని ఒప్పుకుంటారా?'' అని నన్ను చాలామంది తరుచు అడిగే ప్రశ్నకు జవాబుగా,''ఓ తప్పకుండా ఒప్పుకుంటాను, కాని అది తెలియని శక్తి ఏమీ కాదు, అందరికీ తెలిసిందే. అథవా తెలుసుకోవలసిందే: అదే ధనశక్తి'' అంటాన్నేను.

*1. కీట్సు—జాన్ కీట్స్ (1795—1821) ఇంగ్లీషు 'భావ' కవి.*
*2. షెల్లీ—పెర్సీ బిష్షీ షెల్లీ (1792—1822) ఇంగ్లీషు కవి.*
*3. ఐ వీప్ ఫర్ ఎడోనెస్— కీట్స్ కవి (1821)లో క్షయ వ్యాధివల్ల చనిపోగా షెల్లీ **ADONAIS** అనే విలాప కావ్యం రచించాడు. ప్రాచీన గ్రీక్ మతంలో ఎడోనిస్ అనే యువకుడు అడవిపందివల్ల మృతి బొందినప్పుడు, అతనిని ప్రేమించియుండిన ఆఫ్రోడిటీ దేవత ప్రతి యేడాదిలోనూ ఆరుమాసాల పాటు అతడు జీవించేటట్లు దేవతల నుంచి వరం పొందుతుంది.*

మిత్రుడు ఖాసింఖాన్ యమ్మే ప్యాసైన తర్వాత కొన్నాళ్లు నిరుద్యోగిగా ఉండి తర్వాత హైదరాబాద్‌లో ఒక జాగీర్దారు కూతురుకి ట్యూటరుగా కొలువు సంపాదించాడు. ఆ అమ్మాయి, ఈ అబ్బాయిని విపరీతంగా ''ప్రేమించింది''. కొన్నివేల సిక్కా రూపాయల విలువచేసే బంగారపు నగలతో అతనితో కలిసి కాశ్మీరుకు పారిపోవడానికి అన్ని ఏర్పాట్లూ జరిగిపోయాయి. తుది నిమిషాలలో నా మిత్రుడు తనంతటతానే కొలువుకి గుడ్‌బై చెప్పేశాడు. ఇదంతా అతని నైతిక బలం అనో, పాపభీతి అనో నమ్మేవారు నమ్మవచ్చును. నాకు మాత్రం ఆ నమ్మకం లేదు.

చిట్టిపంతులని నాకో దూరపు బంధువుండేవాడు. వరుసకు అన్నో తమ్ముడో అవుతాడు. వంటలో బాగా ఆరితేరిన చెయ్యి. విశాఖపట్టణంలో ఒక సంపన్నుల ఇంటిలో వంటవాడుగా కుదురుకున్నాడు. ఆ ఇంట్లో ఆడవాళ్లంతా అసూర్యంపశ్యలు. వాళ్లలో ఒక అమ్మాయి అదును చూసుకొని చిట్టిపంతులు వంటచేస్తున్న గదిలోకి వచ్చేస్తూ ఉండేది. ఎందుకో ఇద్దరికీ తెలుసు. ''ధైర్యం చాలింది కాదురా! పనికి నీళ్లధార వదిలేశాను'' అన్నాడు చిట్టిపంతులు! ఈ ధైర్యం చాలక పోవడానికి ఆర్థిక అసమానత్వమే కారణమని వేరే చెప్పాలా?

ఇంతెందుకూ, ఆరోజు నా జేబులో ఒక్క పది రూపాయలుండి ఉంటే రోజంతా గుజరాతీ అమ్మాయితో హోటల్ ఎవరెస్ట్ గదిలో గడిపివేసి ఉందును. పది రూపాయలు కావుకదా, అప్పుడు పది చిల్లిగవ్వలైనా నావద్దలేవు.

ఇప్పుడు మళ్లీ జనార్దనరావు దగ్గరకు వస్తున్నాను. జనార్ధనరావును చంపింది క్షయవ్యాధి కాదు, దారిద్ర్యమే అతని ప్రాణాలు తీసింది. నా సంగతి సరే- నేనా రోజుల్లో మరీ నిప్పచ్చరం భరిస్తూ ఉండేవాణ్ణి. అతను కోరినట్లు నేను మద్రాసు చేరుకోగలిగి ఉంటే జనార్దనరావు తప్పకుండా జీవించేవాడే: ''ఉదయిని'' ఆఖరి సంచికప్రతులు కేసరీ ముద్రణాలయంలో అంతర్థానమైపోయేవి కావు.

ఈ సంచిక రేపరుపేజీ తప్ప అంతా సిద్ధమైంది, ఖరీదైన ఫెదర్ వెయిట్ కాగితం మీద అచ్చు అయింది. ఏం ప్రయోజనం! విడుదలకు డబ్బులేకపోవడం వల్ల వారాల తరబడి, బహుశా నెలల తరబడి కేసరీ కుటీరంలో అజ్ఞాతవాసం చేసింది. ఆ తర్వాత ఏ పకోడీల దుకాణానికి ప్రయాణం కట్టిందో ఎవరికీ తెలియదు. (అన్నట్టు అంతకు ముందు చాలా కాలం కిందట పాత ''సఖి'' సంచికల్ని పకోడీల దుకాణంలోనే పురిపండా అప్పలస్వామి కారుచవకగా కొన్నాడు). ఇది మన వ్యవస్థ! ఇదే మన అవస్థ!

జనార్దనరావులాగే ''ఉదయిని'' ఆఖరు సంచికకూడా కాలగర్భంలో కలిసిపోయింది. కాని ఇంకా నాలో ఒక చిన్న ఆశ మిగిలే ఉంది. ఏ పురిపండా చెత్తకాగితాల్లోనో, ఏ జరుక్కు చిత్తు కాగితాల్లోనో ఇది దొరకావచ్చు. దొరికితే, నా ''పరిణయ రహస్యం'' మళ్లీ దొరికినంతగా సంతోషిస్తాను. ఎందుకో ఆ సంచిక అంటే నాకెంతో ఇష్టం. అది ఆరో సంచిక అనుకుంటాను. అందులో జనార్దనరావు ఆరో ప్రాణం వుంది. ఈ సంచిక పకోడీల

దుకాణంలోకి పోయిన సమయంలోనే జనార్దనరావుశవం చితిలో కాలుతున్న దృశ్యం నేనూహించుకుంటాను.

జ్ఞాపకాల సందుల్లో తిరుగుతూ, ఆలోచనల ఆకాశాలను నలుపుతూ, అనుభవాల సారాలు పిండుతూ అనుమానాల్లోని ఆశ్చర్యాలను వండుతూ నా మనస్సు అట్టడుగుపొరల్లో దాక్కున్న కవిత్వాన్ని ఆహ్వానిస్తున్నాను.

శీర్షిక "చింకిగుడ్డల సింహం". అవి నా దరిద్రపు రోజులు.

అదృష్టవంతుణ్ని నేను
చిన్నప్పుడే మా అమ్మ చచ్చిపోయింది
ఎన్నో వన్నుల పాల్గుడిచాను
ఎన్నో రోజులు గడిపాను
బోగీపండుగలో
దమ్మిడీల వానలో తడిశాను
బంగారపు చెమ్చాతో పుట్టాను
బయాస్కోపులా ఎదిగాను
వింటున్నాన్నేనిప్పుడు నా గుండెల్లో
సిస్టోలీ డయాస్టోలీ చప్పుడు
అదృష్టవంతుణ్ని నేను
ఆకాశం నాకేక వింటోంది

(సశేషం)

1928లో నా మొట్టమొదటి కవితా సంపుటి "ప్రభవ" ముద్రితమైంది. (మా నాన్నగారిచ్చిన డబ్బుతో) అదే సంవత్సరం కొంపెల్ల జనార్ధనరావుతో నా మొట్టమొదటి పరిచయం. "కొం.జ" అనే పొడి అక్షరాలతో జనార్ధనరావు "భారతి"లోనూ, ఇతర పత్రికల్లోనూ చాలా రివ్యూలూ, వ్యాసాలు రాశాడు. ఈ పొడి అక్షరాలు కొందరికి సింహస్వప్నం అనడంలో అతిశయోక్తి లేదు. బసవరాజు అప్పారావంత కవికి ఇవే చిత్తచాంచల్యం కలిగించాయి. అదే అతని అకాల మరణానికి కూడా కారణమైంది.

బసవరాజు ఉబుసుపోకకు రాసిన ఒక సాహిత్య చరిత్ర గ్రంథాన్ని రివ్యూ చేస్తూ "కొం.జ" దాన్ని చీల్చి చెండాడాడు. అతడు పట్టిన తప్పుల్లో మచ్చుకి ఒకే ఒక ఉదాహరణ. ఒథెల్లో డెస్డిమోనాను తలగడతో మోది చంపేను అని రాశాడు. ఏ కాలేజీ కుర్రాడూ ఇలాంటి తప్పు చెయ్యడు. దీన్ని పట్టుకొని "కొం.జ" బాది బాది వదిలాడు. ఇలాంటివే ఎన్నో తప్పులు. అన్నిటినీ తన సహజ భయంకరమైన శైలిలో తూర్పారబట్టాడు జనార్దనరావు. అందుకే అనుకుంటాను మహాపండితుడు వేలూరి శివరామశాస్త్రి "ఈయన శైలి ముంధు నగ్నమైన మా అజ్ఞానాన్ని విన్నవించుకోవడం తప్ప వేరే చెయ్యగలిగిందేదీ లేదు"

అని ఒక దండం పెట్టేశాడు.

జనార్దనరావు ఉత్తరాల్లో కూడా అతని వక్రోక్తి స్పష్టంగా సాక్షాత్కరిస్తుంది. నాకు రాసిన అనేక లేఖల్లో ఒకటి ఇలా ప్రారంభించాడు. ''మీ ఉత్తరం, మీ ముఖం బాగుంది ( మీ ముఖం బాగులేదని ఎవరన్నారు.) ఒక ఉత్తరాన్ని ముగిస్తూ, ''తంబుదు కాదు, అన్నే కాబోలు'' అని రాశాడు.

ఉదయిని సంపాదకీయాలన్నిటికీ అతను ''కిరణాలు'' అని పేరు పెట్టాడు. ఉదయ కిరణాల్లాగా అవి లేత లేతగానే ఉంటూ చదువుతున్నకొద్దీ వేడిని సంతరించుకుంటాయి. అతని సంపూర్ణ సాహిత్యాన్ని ముద్రింపించే బాధ్యత, వాళ్లన్నయ్య కొంపెల్ల సూర్యారావు నా మీద ఉంచాడు. దీన్ని నెరవేర్చే బాధ్యత నన్ను తరుచూ బాధిస్తూ ఉంటుంది. కనీసం అతని కావ్య సంపుటినైనా ప్రచురించగలిగితే బాగుండును. జనార్దనరావు కాగితాలన్నీ నా దగ్గిరే ఉన్నాయి. కాని అందులో కవితలు రాసిన కాగితాలుగాని, నోటు బుక్కుగాని కనిపించటంలేదు. ''మల్లిక పెళ్లి'' అని ఒక నాటకం ఉంది. కాని ప్రాచీనలిపి పరిశోధకులు మాత్రమే దాన్ని డెసిఫర్ చెయ్యాలి.

''ఉదయిని''లో ''నేను సైతం'' అనే నా గీతం అచ్చుకావడం నా కెంతో ధైర్యం కలిగించింది. 'మహా ప్రస్థానం' గ్రూపులోని మొట్టమొదటి గేయాలలో అది మొట్టమొదటిది. కొత్త బాణీలో చేస్తున్న నా రచనలను ఎవరూ అచ్చువెయ్యరేమో అన్న దిగులును తొలగించిన వాడు జనార్దనరావు. వెన్ను తడుతూ, స్తోత్ర పాఠాలు చేస్తూ అతను నా కెప్పుడూ ఉత్తరాలు రాయలేదు. ''అందరూ బాగుందన్న మీ గీతం నేను చదివాను లెండి'' అని మరో ప్రపంచం గీతం గురించి రాశాడు. తాను మాత్రం బాగుందని గాని, బాగులేదని గాని చెప్పలేదు. చాలా మంది అనుకుంటున్నట్లు జనార్దనరావు ప్రభావం ''మహా ప్రస్థానం'' గీతాల మీద లేదు. అతను క్రమక్రమంగా *Classicist* అయిపోతూ ఉంటే నేను అదే క్రమంలో విప్లవిష్టు నవుతూ వచ్చాను. జనార్దనరావు తన కవిత్వాన్ని గ్రాంథిక భాషనుంచి వాడుక భాషలోకి మళ్లించాడు. గణబద్ధ ఛందస్సులు వదలి మాత్రా ఛందస్సులు చేబట్టాడు.

''.......పడగెత్తి పాడు కుంటాను'' , ''అనుకో, తథాస్తు'' ఇత్యాదులు

తాను రాయబోయే కవితలకి 'అబద్ధాలు'' అని పేరు పెడతానన్నాడు. ''ఫ్రీవెర్స్''కి అతనిచ్చిన నిర్వచనం అది!

ప్రజాతంత్ర *16–11–1975*

# నాలుగు

జనార్దనరావు[1] చనిపోయాడు. 'ఉదయిని' కోసం బెంగ పెట్టుకుని చనిపోయాడు. అతనికి చనిపోవాలని లేదు. ఘోరమైన మోసం జరిగింది.

కొంపెల్ల జనార్దనరావు చనిపోయాడు. అసహాయంగా చనిపోయాడు. తెనుగుదేశం వైపు దీనంగా చూచి నిర్గమించాడు. జీవించి ఉన్నప్పుడు అతడి నెవ్వరూ గమనించలేదు. ఎవ్వరికీ తీరుబాటులేదు. ఏమనుకున్నా ఎన్ని చేసినా ఇక నతడు రాడు.

ఆకస్మికంగా, ఆశ్చర్యకరంగా వినిపించింది మాకతని మరణవార్త. ఆంధ్రపత్రికలోని ఈ వార్త ఇతరులకేమీ కాదు. నావంటి వాళ్లను స్తంభీభూతులను చేసిన ఆశనిపాతం ఈ వార్త. ఇది మాకు తీరని నష్టం. దారుణమైన విపత్తు. ఇతరులీవార్త వింటే 'అయ్యో! పాపం, పనికిరావలసిన ఒక యువక వీరుడు మరణించాడే' అని చింతిస్తారేమో. మేము మాత్రం ఇంతట్లో పూర్తికాని మహాగర్తం వదలి జనార్దనరావు చనిపోయాడని ఆక్రోశిస్తాము.

ఉప్పెనగా ఉద్రేకిస్తున్న విషాదాన్ని వశంవదం చేసుకొని, అతిశయోక్తులు విసర్జించి ఒక మాట వ్రాస్తాను. జనార్దనరావుమరణం వలన తెలుగులో సాహిత్యానికి హేమంతం ప్రాప్తించింది. (వైధవ్యమే అందుకు అతిశయంగా చెప్పాలంటే) ఇది నిజం. మన 'ప్రసిద్ధ' విమర్శకుల సత్తువ నాకు తెలుసు. ఎవ్వరికీ జనార్దనరావు తాహతులు లేవు. ఎప్పటికప్పుడే జ్ఞానసంపద హెచ్చించుకొంటూ అతడు సారస్వత రంగంలో అనన్య సామాన్యమైన స్థానానికి చేయి చాచాడు. అచిరకాలంలో అతని కాస్థానం లభించి ఉండును. ఇంతట్లో ఈ దుర్ఘటన సంభవించింది. ఎంత దౌర్భాగ్యులం!

విస్తృత గ్రంథమేదీ వ్రాయకుండా అప్పటప్పటి విమర్శనలతో సాహిత్య లోకపు దృష్టిని అరికట్టినవాడు జనార్దనరావు. ఇవే మనకిప్పుడు మిగిలిన అమూల్య రత్నాలు. విమర్శకుడుగా జనార్దనరావుది మహోన్నత స్థానం. ఆధునిక వాఙ్మయాన్ని సరిగా అర్థం చేసుకున్న కొద్దిమందిలో ముఖ్యుడు. నవీన సాహిత్యరీతులకు రుచిమంతమైన అధ్యయనాలు చూపించడానికి సమర్థుడు.

*1. కొంపెల్ల జనార్దనరావు: జననం: 1906 పరాభవ, చైత్ర బహుళ, 7. తూర్పుగోదావరిజిల్లా కోనసీమ పండిత కుటుంబం, సంస్కృతాధ్యయనం. రాజమండ్రిలోనూ, కాకినాడలోనూ విద్యాభ్యాసం. బంధువైన బులుసు సాంబమూర్తిగారి ప్రోద్బలంతో ఇంగ్లీషు చదువులు మాని కాకినాడలోని జాతీయ పాఠశాలా ప్రవేశం. సహాధ్యాయియైన ప్రతివాది భయంకర రంగాచార్యులతో కలిసి ద్విజేంద్రలాల్ 'ఛత్రపాల్' ఆంధ్రీకరణం (1921–22). సాంబమూర్తి సిఫారసుతో 'భారతి' పత్రికలో ఉపసంపాదక పదవి (1927–28). మల్లంపల్లి సోమశేఖరశర్మ పరిచయం. బరంపురంలో జరిగిన అఖిలాంధ్ర కవిసమ్మేళనంలో (1926) శ్రీశ్రీ పరిచయం, మద్రాసులో శ్రీశ్రీ స్నేహం (1928–30). అభినవాంధ్ర కవిపండిత సభ రాజమండ్రి.కాకినాడ సమావేశాల్లో పాల్గోడం, 'ఉదయిని' పత్రిక స్థాపనం (1933–34), నిర్వహణం (1934–37), కవితా సమితి వార్షికోత్సవంలో ఉపన్యాసం(1935). క్షయవ్యాధితో మరణం ( 1937 జూన్).*

*రచనలు: అనేక పద్యాలు, మల్లిక పెళ్లి (నాటకం) స్వర్గయోగి, వెలుగు (ఏకాంకికలు) అనేక గ్రంథసమీక్షలు, కృష్ణశాస్త్రిగారి 'ప్రవాసము— ఊర్వశి' (సాహిత్య విమర్శ) వంటి అద్భుత విమర్శలు. 'ఉదయిని' పత్రికలో ''కిరణాలు'' శీర్షిక దాని ప్రత్యేకతగా రూపొందించాడు.*

విమర్శకుడిగానే కాకుండా, అనేక 'కిరణాలు'గా అతడు వికసించాడు. అగాధమైన అతని *Personality* ని అవగాహన చేసుకోవాలంటే మనం అతని ఒండు రెండు నాటికలూ భావగీతికలూ శ్రద్ధతో చదవాలి. స్నేహితులకు వ్రాసిన ఉత్తరాలలో అతని ఆత్మ విస్ఫులింగాలు ద్యోతిస్తాయి. అతనిదే ఐన అతని శైలిలోనికికూడా దిగి అన్వేషణ సాగించాలి. అయినా మనకిప్పుడు మిగిలిన సామగ్రి యావత్తూ అతడీయదలచిన, ఈయగలిగిన దానికంటే ఎంతో తక్కువని మరవిపోకూడదు.

సంపుటి రూపంగా అతని రచనలన్నీ వెలువడితేనేగాని, నేటి సాహిత్యంలోని అతని స్థానాన్ని చర్చించడానికి వీలులేదు.

సారస్వతంలో చరితార్థుడు కావడానికి జనార్దనరావు ఆయుధాలకోసం అర్జునుడి లాగు తపస్సు చేశాడు. అతని జీవితమంతా విజ్ఞాన సముపార్జనకైన ఎడతెగని యాత్ర. నాకతడు *a younger example of Browning's*[2] *Grammarian* లాగా కానవస్తాడు.

*Back to his books then: deeper drooped his head. Calculus racked him:*

*Leaden before, his eyes grew dross of lead.*
*Tussis attacked him.*
*Back to his studies, fresher than at first. fierce as a dragon.*

*He (Soul-hydroptic with a sacred thirst) sucked at the flagon.*

*So, with the throttling hands of death at strife,*
*Ground he at grammar;*
*Still, thro' the rattle, parts of speech were rife;*
*While he could stammer He settled Hoti's business- let it be!*
*Properly based oun-*
*Gave us the doctrine of the enclitic De,*
*Dead from the waist down.*

అదీ జనార్దనరావు తపస్సు. సమగ్ర సంకల్పబలం 'ఉదయిని'కి స్వరూపమివ్వడానికి ధారపోశాడు. 'ఉదయిని' ప్రారంభంతోనే జనార్దనరావుకు బాధ్యతలూ, భారాలూ హెచ్చిపోయాయి. సాహాయ్యం దొరకలేదనడం కంటే అది చాలనే లేదనడం యథార్థం. ఉన్నత

*2. బ్రౌనింగ్: రాబర్ట్ బ్రౌనింగ్ (1812–89) ఇంగ్లీషు కవి, మేధా ప్రధానమైన కవిత్వ ధోరణి. నాటకీయస్వగతానికి (**Dramatic monologue**) కవిత్వంలో చోటిచ్చి మానవ మనోభావ నిరూపణలో ఘనత సాధించాడు. **A GRAMMARIAN'S FUNERAL** అనే ఖండికలో, యూరపు పునర్వికాస యుగానంతర కాలంలోని ఒక వైయాకరణిని గూర్చి వర్ణిస్తాడు. శ్రీశ్రీ ఈ ఖండికనుంచి తీసిన చరణాలు వరుసను పాటించలేదు. తొలి చరణంలోని book శ్రీశ్రీ చేత books అయింది. మొదటి రెండు ఖండాల మధ్య నాలుగు చరణాలు ఎగిరిపోయాయి. రెండు మూడు ఖండాల మధ్య 28 చరణాలు లేవు. జనార్దనరావు స్వయంగా బ్రౌనింగ్ మీద ఒక పద్యరచన చేశాడు.*

వాఙ్మయానికి పోషణ ఎప్పుడూ పరిమితంగానే ఉండటం చూస్తున్నాము. ఆంధ్రదేశంలో అది కనిష్ఠంగా కనిపించుతుంది. ఇంతట్లో తెలుగువారు ఈ 'సిగ్గు' తొలగించుకోలేరేమో అని తోస్తోంది.

జనార్దనరావు మరణం అనేకాలోచనలు రేపింది. ఎటు చూచినా అతడు మరణించినాడనే వగపు మాత్రమే మిగిలింది.

స్నిద్రాణులను లేపడానికి అతడు చేసిన ఆఖరు ప్రయత్నం కాబోలు అది. జనార్దనరావు చనిపోయాడని నమ్మలేకుండా ఉన్నాను. ఇంకా అతడు ఎక్కడికో సారస్వత సభలకు కాబోలు వెళ్లాడని నమ్ముకుంటున్నాను. సారస్వతతారకలంతా సమావేశం అవుతారు కాబోలునక్కడ. ఒక శ్రద్ధాళువైన అంతేవాసిగా జనార్దనరావు కూర్చుంటాడు. తిరిగి వచ్చి 'ఉదయిని'లో చక్కని సరియైన వ్యాఖ్యానం ఇస్తాడు. అయ్యో! మధురమైన నా ఈ విశ్వాసం ఒక స్వప్నమే కదా! వ్యర్థాలోచనలు! తిరిగి రాడు జనార్ధనరావు. బర్న్సు[3] గురించి కార్లైల్[4] వ్రాసినట్లు *He Passed not softly but speedily into that still country where the hail storms and fire showers do not reach, and the heaviest laden way-farer at length lays down his load.* బరువు దించుకున్నాడు జనార్దనరావు. సేద దేరుతున్నాడు అఖండశాంతి అనుభవిస్తున్నాడు.

*వీణ సెప్టెంబర్ 1938*
*పునర్ముద్రణ: శ్రీశ్రీ సాహిత్యం ఒకటి*
*ప్రజాతంత్ర 13–7–1975*

*3. బర్న్సు: రాబర్ట్ బర్న్సు (1759–1796) స్కాటిష్ కవి. స్థానిక మాండలిక భాషకు కావ్యగౌరవం కల్పించాడు. హాస్యప్రియుడు. సరళమూ సహజమూ ఉద్రేకభరితమూనైన ఇతని కవిత్వం సుప్రసిద్ధమైనట్టిది.*
*4. కార్లైల్: థామస్ కార్లైల్ (1795–1881) స్కాట్లండులో పుట్టినా ఇంగ్లీషు భాషను సంపన్నంచేసిన రచయిత.*

# జీవితంలో నా గురువులు

## ఒకటి

నిజానికి నా జీవితంలో ఇద్దరే గురువులున్నారు. ఒకరు మా నాన్నగారు. ఇంకొకరు అబ్బూరి రామకృష్ణారావుగారు. ఇద్దరూ గొప్ప అధ్యాపకులూ ఉపాధ్యాయులే అయినా వారిదగ్గర నేను నేర్చిన చదువు కళాశాలల్లోనూ, క్లాసు రూముల్లోనూ కాదు. మావాన్న గారి దగ్గర చిన్నప్పుడు పాఠశాలలో లెక్కలైనా నేర్చుకున్నాను గాని అబ్బూరివారి అధ్యాపకత్వంలో ఏ కాలేజీలోనూ పాఠాలు నేర్చుకోలేదు. నా కాలేజీ విద్యపూర్తి అయిన తర్వాతనే అబ్బూరి కక్ష్యలో నేను ప్రవేశించాను. అప్పుడాయన అధ్యాపకుడు కాదు. ఆంధ్రా యూనివర్సిటీ గ్రంథాలయాధికారి. ఆయన చదివించిన గ్రంథాల వల్లనే కాక వారి సహచర్యం వల్ల కూడా క్షితిజరేఖలు విశాలంగా విస్తరించాయి.

మొదట నా మొదటి గురువు సంగతి. శ్రీరంగం వెంకట రమణయ్య (విశాఖపట్టణం వాళ్లకి రమణయ్య మాష్టారు గారు) నాకు తండ్రి మాత్రమేకాక తల్లికూడాను. తండ్రిగా నా చదువునుగాని, తల్లిగా నా ప్రవర్తనను గాని ఆయనెప్పుడూ కంట్రోల్ చెయ్యలేదు. నేను సాధారణంగా ఇంట్లో ఎప్పుడూ చదివే వాణ్ణికాను. స్కూలు ఎప్పుడూ ఎగవేసేవాణ్ణికాను. స్కూల్లో చెప్పేది నా మనస్సుకి హత్తుకుపోయేది. ఇంటికివచ్చి ఆ పాఠాలను మళ్లీ నెమరు వేసుకోవలసిన అవసరం లేకపోయేది.

ఇక నా ప్రవర్తన విషయం. నేనెప్పుడూ తప్పు చెయ్యనని మా నాన్నకి గట్టి నమ్మకం. అందుకే ఆయన చేతిలో నేనెప్పుడూ దెబ్బలు తినలేదు. (ఇందుకు ఒకే ఒక్క మినహాయింపు ఉంది. అవి బెత్తపు దెబ్బలు. ఎందుకో తర్వాత చెబుతాను) నా జీవితం పొడుగునా ఒక్కసారి కూడా మా నాన్న నామీద చెయ్యిచేసుకోలేదన్న మాట యథార్థం. పైగా, ఒకసారి మా తాతయ్య (రమణయ్య మాస్టరుగారి మామగారు) నన్ను గొడుగుతో కొట్టినప్పుడు మా నాన్న ఉగ్రుడైపోయి మామగారికి నాలుగుతిట్లూ రెండు దెబ్బలు చదివించేడు. అంతకు ముందుగాని ఆ తర్వాత గాని మా నాన్నకంత కోపం వచ్చిన సందర్భమేదీ నాకు జ్ఞాపకం లేదు.

చాలా శాంతమూర్తి మా నాన్న. అయినా హెడ్మాస్టరుగా ఆయనంటే అందరికీ హడలు. అవి గాంధీ గారి సహాయ నిరాకరణం రోజులు. నా వయస్సు పదకొండో, పన్నెండో. గాంధీ గారిని అరెస్టుచేసినందుకు నిరసనగా మా క్లాసు కుర్రాళ్లం సమ్మె చేశాం. సమ్మెకు నాయకత్వం వహించినది నేనే. క్లాసంతా గైరుహాజరై పోయింది. మర్నాడు హెడ్మాస్టరు గారు

కుర్రవాళ్లందరికీ ఒక్కో బెత్తపు దెబ్బ వేశారు. ఎంత సేపటికీ నన్ను పిలవనందుకు, మా వాన్నే కదా, బహుశా నాకు శిక్ష పడదనుకున్నాను. కాని ఆఖరుకి నన్ను పిలిచాడు. ఎడం చెయ్యి చాచాను. ఒక దెబ్బవేసి "సమ్మె చేయించింది నువ్వేనా" అని మానాన్న అడిగేడు. ఔనన్నాను. "అయితే రెండో చెయ్యి పట్టు" అన్నాడు. పట్టేను. చుర్రుమని రెండోదెబ్బ పడింది. రెండు అరచేతులుకందిపోయాయి.

ఆ సాయంత్రం చీకటిపడుతూ ఉంటే మా ఇంట్లో మా నాన్న ఏడుస్తూ నన్ను దగ్గరికి రమ్మన్నాడు. రెండు చేతులూ చూపాడు. మామూలుగానే ఉన్నాయి. కుడిచేతిలో ఒక జార్జి రూపాయి నాణెం పెట్టాడు. మాట్లాడకుండా తీసుకున్నాను. మాట్లాడకుండా మా నాన్న కళ్ళు తుడుచుకుంటూ చిరునవ్వు నవ్వేడు.

అసలు నా కళా జీవితం కవిగా ప్రారంభం కాలేదు. అక్షరాభ్యాసం కాకముందు ( నా అయిదో ఏట అక్షరాభ్యాసం అయింది) నేనో గొప్ప చిత్రకారుణ్ణి. మా ఇంటి నిండా రంగు రంగుల సుద్ద కణికలుండేవి. అవికాక మసి బొగ్గులు కూడా వాడేవాణ్ని. తెల్లటి గోడల నిండా ఏవేవో బొమ్మలూ, సింహం బొమ్మలూ! ఎందువల్లనో పిల్లి బొమ్మా, పులి బొమ్మా వెయ్యాలనిపించేది గాదు. బహుశా అవి దుర్మార్గపు జంతువులనీ, సింహం మృగరాజనీ, నాకో దురభిప్రాయం ఉండేది. సింహం సోమరిపోతనీ, పెద్ద పులే ఉదారమైనదనీ తెలుసుకోడానికి నాకు అరవైయేళ్లు పట్టింది.

గోడ లెందుకు పాడుచేస్తున్నావని మా నాన్న నన్ను కోప్పడనేలేదు. ఆ అలవాటు నా అంతట నేనే మానుకునేటట్లు చేశాడు. మేడమీద గదిలో ఒక గోడ భాగాన్ని నల్లబల్లగా మార్పించాడు. ఒక స్పాంజి డస్టరు కొని పెట్టేడు. తర్వాత నేను వాటర్ కలర్స్ కావాలని అడిగేను. నిమిషాల మీద కలర్ బాక్సూ, కుంచెలూ వచ్చేశాయి. *Oil painting* అనేదొకటి ఉందని అప్పట్లో నాకు తెలియదు. తెలుసుకొనే లోగా నాలో చిత్రకారుడు అంతరించాడు. అక్షరాలతో నా పరిచయం పరిపక్వమవుతున్న కొద్దీ కవిత్వం నాలో మేలుకొంది. దీనికి దోహదం చేసింది మా నాన్నగారే. 'ఆది మధ్యావసానేషు....'' ఇత్యాది ఫార్ములా ఉపదేశించిందీ, సులక్షణసారం కొనిపెట్టిందీ ఆయనే. సంస్కృతం నేర్చుకుంటే మరీ మంచిదని తెలుగు పండితుడు కేతవరపు వెంకటశాస్త్రి గారింటికి రోజూ వెళ్ళమన్నారు. కొన్నాళ్లు వెళ్లడమైతే జరిగింది. శాస్త్రిగారు నాచేత శబ్దమంజరి కంఠ పాఠం చేయించాలనుకున్నారు. నా సంస్కృతం చదువు అకారాంత పుంలింగంతోనే ఆగిపోయింది.

'మీరు దేవనాగరలిపిలో సంస్కృతం చదువుకోలేదా యేమిటి?'' అని ఒకమారు కొంపెల్ల జనార్దనరావు నన్నడిగేడు. "అసలు నేనే లిపిలోనూ ఆ భాష నేర్చుకోలేద''న్నాను.

అబ్బూరి రామకృష్ణారావుగారి[1] సాహచర్యంవల్ల నాకు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారంటే గౌరవ

*అబ్బూరి రామకృష్ణరావుగారు (1896–1979) భావకవుల్లో ఆద్యుడు. రాయప్రోలు, నాయని, నండూరి, కృష్ణశాస్త్రి సమకాలికులు. జలాంజలి (1914) మల్లికాంబ (1915) ఊహాగానము (1918) మొదలైన ఖండకావ్యాలు రాశారు. కన్యాశుల్కం అంటే గొప్ప ఇష్టం. పాశ్చాత్యసాహిత్యంలోతులు తరచినవారు. ఆంధ్రాయూనివర్శిటీ లైబ్రేరియన్‌గా 30 ఏళ్ళపైన పనిచేశారు.*
*లక్నోలో జరిగిన అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం (1933) తొలిసభకు హాజరయ్యారు.*

భావమూ, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారంటే తృణీకారభావమూ ఏర్పడ్డాయి. ఏమాటకామాటే చెప్పకోవాలికదూ. రామకృష్ణరావుగారు చెళ్ళపిళ్ల వారినెంతగా పొగడినా, శ్రీపాదవారి గురించి మాత్రం పల్లెత్తుమాట అనడంలేదు. విశాఖపట్టణం హవామహల్ ఉపన్యాసంలో కృష్ణభారతం మీద చెళ్లపిళ్ల చేసిన వ్యాఖ్యానం నా మీద చెరగని ముద్ర వేసింది. ఆ రోజు ఆయన ఉపన్యసిస్తున్న విషయం "కవిత్వం", కవిత్వం అంటే ఏమిటో నిర్వచిస్తూ ఆయన "రాతిరియున్ బవల్ మరపురాని హొయల్" అన్నారు. 'లోకుల రసనలె.....తాటా కుఌ"గా అనే పద్యం ఉదహరించారు. "సూక్ష్మంగా చెప్పాలంటే, జ్ఞాపకం ఉండేది కవిత్వమూ, మరిచిపోయేది చెత్తా" అన్నారు. మంచి పద్యం ఓ చిన్న కుర్రాడు రాసిందైన సరే విన్ వినగానే తనకు కంఠస్తం అయిపోతుందన్నారు. అలా కవిత్వాన్ని నిర్వచించిన తర్వాత అరగంట, గంటసేపు అనేకానేక విషయాలు ముచ్చటించి కృష్ణమూర్తిశాస్త్రిగారి భారతం ప్రసక్తి తెచ్చారు. అన్నట్టు చెళ్ళపిళ్ల వారు కొన్ని రోజులో, నెలలో శ్రీపాదవారి శిష్యరికం చేశారట. ఆయా మాటలన్నీ చెప్పి, ముగ్గురు తెలుగు మహాకవులు చేసినపని తన గురువు గారొక్కరే చేశారని ఒప్పుకొని, "గురువుగారు రాశారుకదా అని వారి భారతం పద్దెనిమిది పర్వాలూ చాలా ఓపిగ్గా చదివేను. కాని ఒక్క పద్యం కూడా ఇప్పుడు జ్ఞాపకం లేదు" అన్నారు. ఎలా మరిచిపోగలను ఈ మాటల్ని?

*ప్రజాతంత్ర 7–12–1975*

## రెండు

పిన్నప్పుడు నాచేత మా నాన్న సులక్షణసారం చదివిస్తే, నాలో ప్రాపంచిక చైతన్యం వికసిస్తున్న వయస్సులో నా ఆలోచనల్ని కమ్యూనిజం వైపు మళ్లించింది అబ్బూరి రామకృష్ణరావుగారు.

"లెనిన్ ఏమన్నాడో తెలుసా? అక్టోబరు విప్లవం విజయవంతమైన తర్వాత తనకు కనీసం ఇరవైయేళ్లు మరో ప్రపంచ యుద్ధం లేని వ్యవధి కావాలన్నాడు. అంటే ఆ వ్యవధిలో ఒక కొత్తతరం రూపొందుతుంది. యువతరం. అదే కమ్యూనిజాన్ని కాపాడే కవచం!" అన్నారు రామకృష్ణరావుగారు.

అలాగే 1917 తర్వాత 22 ఏళ్లకి గానీ (1939లో) రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కాలేదు. లెనిన్ కోరిన దానికంటే ఎక్కువ వ్యవధే లభించింది. ఫలితం అందరికీ తెలిసిందే!

"ఇవాళ పేపర్లో వొరోషిలోవ్ స్టేట్‌మెంట్ చదివేవూ!" ఇది '37లోనో, 38లోనో అనుకుంటాను. ఫీల్డ్‌మార్షల్ వొరోషిలోవ్ సోవియట్ సర్వసైన్యాధ్యక్షుడు. "ప్రపంచంలోని అన్ని దేశాల సైన్యాలు ఒక్కసారి దండెత్తి వచ్చినా తిప్పికొట్టగల శక్తి మాకుంది" అన్నాడాయన. ఆ రోజుల్లో సోవియట్ యూనియన్ మాత్రమే

సామ్యవాద దేశం.

"ప్రపంచాన్ని కుదిపివేసిన పదిరోజులు" అనే పుస్తకాన్ని, క్రోపోట్కిన్ రచనల్నీ వాచేత చదివించింది అబ్బూరి వారే. వారి సాహచర్యం వల్లనే చాలాకాలం నేను రాయిస్టుగా చెలామణీ అయ్యాను. కాని విచిత్రం ఏమిటంటే *M.N.Roy* గ్రంథాలేవీ చదవమని అబ్బూరివారు నా కివ్వనూ లేదు; నేను స్వయంగాకొని గాని, సంపాదించి గాని చదవనూ లేదు. లెనిన్‌తో భుజం భుజం రాసుకొని తిరిగిన వ్యక్తిగా మానవేంద్ర నాథరాయ్ నా కెప్పుడూ మాననీయుడే!

నా చిన్నతనంలో మా నాన్నకి రెండు గొప్ప సరదాలుండేవి. ఒకటి ఫుట్‌బాల్. రెండు నాటకాలు, ఆయనెప్పుడూ నాటకాల్లో వేషం కట్టనూ లేదు. ఫుట్‌బాల్‌ను ముట్టనూ లేదు. *Morning Star* అనే ఫుట్‌బాల్ క్లబ్బుకి ఆయన మహారాజ పోషకుడు. ఆ క్లబ్బుమీద చాలా డబ్బు ఖర్చుపెట్టినవాడు. నేను శనివారాదివారాలు వచ్చాయంటే మధ్యాహ్నపు మండుటెండలోనైనాసరే ఉప్పుటేటి పరిసరంలో ఫుట్‌బాల్ ఆడడానికి పరుగుతీసే వాణ్ని. నేనో పెద్ద ఆటగాణ్ని కానుకాని, గోల్‌కీపర్ మొదలుసెంటర్ ఫార్వర్డ్ దాకా అన్ని పొజిషన్లలోనూ ఆడినవాణ్ని. కుడి, ఎడమ రెండు కాళ్లతోనూ బంతిని తన్నగలగడం నా ప్రత్యేకత.

"జగన్మిత్ర సమాజం" అనే నాటక కంపెనీలో చాలా చాలా వేషాలు వెయ్యడానికి మా నాన్న అనుమతించాడు. "బాలుర సావిత్రి"లో సత్యవంతుడి వేషం వెయ్యాలని నాకుండేది. నా బాల్యం గతించి పోయిందేగానిఆ కోరిక తీరనే లేదు. "సావిత్రీ సత్యవంతులు" అనే నాటకం ఒకటి రాశానుగాని చాలా పుస్తకాల్లాగే అదీ కాలగర్భంలో కలిసిపోయింది. అందులో, మారుమూల ఛందస్సులతో రాసిన పద్యాలు పాతిక ముప్ఫయికి పైగా ఉండేవని మాత్రం నాకు జ్ఞాపకం.

'కుశలవ"లో కుశుడుగా నేను సీత పాత్రధారిని 'అమ్మా!' అని పిలిచినప్పుడు నాటకం చూస్తున్న బంధువురాలొకావిడ కంటతడి పెట్టింది. నా నోటంట అప్యాయంగా అమ్మా అన్న మాట విన్నందుకు. నేను మాత్రం కంఠస్థం చేసిన పోర్షన్‌ను కరెక్టుగా అప్పగించినందుకు సంతోషించానే తప్ప, నాకో అమ్మ ఉండేదనీ, ఆవిడ చచ్చిపోయిందనీ అప్పుడా స్టేజీమీద అనుకోనేలేదు.

ఆ రోజుల్లోనే నాకు ఇప్పటికీ రంగస్థల నటన అంటే పాటలూ, పద్యాలూ రుబ్బమాయించి "పాడడం" అనే ఒక అభిప్రాయం ఉంది. నేను శంకరాభరణే, తోడి, జంఝూటిలాంటి రాగాల్లో పద్యాలు పాడేవాణ్ని. ఒకమారు నాకు వచ్చిన రాగాల జాబితా తయారుచేశాను. లిస్టు 40 దాకా తేలింది.

సెట్టి మేష్టారుగారు మా నాన్నకి ప్రాణస్నేహితుడు. వాళ్లిద్దరూ ఒక కంచానతిని, ఒక మంచాన పడుకోలేదు కాని ఎందరో నెరజాణల్ని ఉమ్మడిగా అనుభవించారు. బూతు పద్యాలు రాసినందుకు హెడ్మాష్టరు పదవి నుంచి బర్తరఫు చేస్తామంటే సెట్టి మేష్టారుగారు

తానే రాజీనామా ఇచ్చి మద్రాసుకు వెళ్లి ఫస్టుక్లాసులో లా డిగ్రీ సంపాదించుకు వచ్చారు. లాయరుగా, శ్రీ విక్రమ దేవవర్మకు జయపుర సంస్థానాధిపత్యం రావడానికి కారకులయ్యారు. అప్పటినుంచి, చనిపోయేదాకా ఆయనే విక్రమ దేవవర్మ మహారాజులుంగారి ఆస్థాన కవి. "విక్రమ దేవవర్మ పృథివీపతి చంద్రమ! కీర్తి సాంద్రమా!" అన్న మకుటంతో చాలా ఉత్పలమాలలు రాశారు. బహశా ఒక శతకమే రాసి ఉండవచ్చును. "క్ర" ప్రాసతో పద్యాలు నిర్వహించడం కష్టంతో కూడుకున్న పని. దీన్ని సునాయాసంగా సాధించారాయన.

సాహిత్యంలో సెట్టిమేష్టరుగారు నాకెప్పుడూ ఒక హిమాలయ శిఖరం లాగ కనిపించే వారు. మనుచరిత్ర కంటె వసుచరిత్ర గొప్పదని ఆయనే నాకు చెప్పారనుకుంటాను.

వంద బూతుసామెతలు సేకరించి ఆయన రాసిన "కృష్ణ శతకం" ఏ కాలంలోనైనా అండర్‌గ్రౌండ్ సాహిత్యానికి తలమానికం.

బూతుపద్యాల మాటకేంగాని "ప్రభాస శాపవిమోచనము" అనే ఉద్గ్రంథంలో భీష్మ కథ ఆధారంగా మహాభారతం అంతా రాశారు. మత్తకోకిల వృత్తానికి అదనంగా ఒక లఘువును ముందుంచి "ప్రభాస శాపవిమోచనంబను...ఇత్యాది" పద్యం రాశారు. తాను నిర్మించిన ఈ వృత్తానికి " ప్రస్తుత కోకిల" అని పేరుపెట్టారు.

కవిత్వంలో సెట్టిమేష్టరుగారికి చెళ్లపిళ్ల వారు ఆదర్శం. పద్యం చదివీ చదవగానే బోధ పడకపోతే అది కవిత్వమే కాదని సెట్టిమేష్టరుగారి అభిప్రాయం. అయినా వారు,

విమల విభావిభాసిత నవీన మణీ
　　వలయా! లయాంతకో
పమ పటు కోపదీపిత సుపర్వ విపక్ష
　　లయా! లయామయు
క్త మధుర కాకలీ నినదగాన కళా
　　నిలయా! యయాలయా!
అమిత దయామయా! అఘచయక్షణ!
　　అక్షయ! మాయకృష్ణయా!

లాంటి పద్యాలెన్నో రాశారు.

సెట్టిమేష్టరు గారు భీష్మ కావ్యంలో ఒకచోట 'అంతఃపురస్సంచరత్' అని రాశారు. ఈ ప్రయోగం తప్పన్నాను నేను. వెంటనే ఆయన అందుకొప్పుకొని "అంతఃపురాసంచరత్" అని మార్చడమేకాక ఆంధ్రపత్రికకు పంపిన ఏదో ఉత్తరంలో "ఈ తప్పను నాకు చూపించింది చిరంజీవి శ్రీరంగం శ్రీనివాసరావు" అని రాశారు.

నా మహాప్రస్థానంలో "వర్షుకాభ్రముల" అనే ప్రయోగం తప్పన్నాడు ఒక మిత్రుడు. ఔను తప్పే! వార్షుకాభ్రముల అని సులువుగా మార్చవచ్చు, ఏమాత్రమూ ఛందోభంగము లేకుండా! అయినా నేను మార్చలేదు. ఇలాంటిదే "చూర్ణమాన ఘూర్ణమాన దీర్ణమాన" అని

ఉండాలి. కాని ఈ తప్పులను ఇలాగే అన్ని ముద్రణలలోనూ ఉండనిచ్చాను. నాకు సంస్కృత భాష రాదనడానికి అంతర్గత సాక్ష్యంగా ఇవి ఉపకరించాలని ఈ తప్పులు నేను సవరించలేదు.

ప్రజాతంత్ర *14–12–1975*

## మూడు

అందరికీ గాడ్‌ఫాదర్లుంటారు. నాకు ఫాదర్‌గాడ్ మా నాన్న- ఆయనే మా అమ్మ- నా దేవుడూ, పురోహితుడూ, నా జీవితానికి గురువూ, నా జీవిత సామ్రాజ్యానికి సార్వభౌముడూను. ఆయన నన్ను బాబా అని పిలచేవాడు. నేను ఆయన్ని బాబా అని పిలచేవాణ్ని. చిన్నప్పటి నుంచీ నన్ను ఎవరు ఎలాగ పిలిస్తే వాళ్ళని అలాగే పిలవడం నాకు అలవాటు. మిత్రుడు యర్రమిల్లి రామలింగస్వామి "ఒరే శిష్యా!" అని నన్ను పిలిస్తే నేను వాణ్ణి మళ్ళీ "ఒరే శిష్యా!" అని పిలిచేవాణ్ణి. మాలో ఎవరూ ఎవరికీ గురువుకానట్టు వేరే చెప్పనక్కరలేదు. "మొట్టమొదటసారి నీచేత నేను బీరుతాగించలేదా?" అని అతనొకసారి నన్ను అడిగేడు. "అంతకుముందే మద్రాసులో బొసాట్టో హోటేల్లో ఒకే ఒక పెగ్గు విస్కీ సోడాతో తీసుకున్నా" నన్నాను. "అయితే నిన్ను నేను చెడగొట్టలేదన్నమాట" అని అతను, "నేను చెడిపోయానని ఎలా అనగలవు?" అని నేను.

నా పద్దెనిమిదో యేటి దాకా నాకు సిగరెట్టు కాల్చడం కూడా తెలియదు. ఇంటర్మీడియేటు పరీక్ష ప్యాసయినందుకు బహుమతిగా నాచేత మా నాన్నే సిగరెట్ కాల్పించాడు. సిజర్స్ సిగరెట్టు. అప్పటికీ ఇప్పటికీ ఎన్నిరకాల సిగరెట్లు కాల్చినా సిజర్స్ అంటేనే నాకిష్టం. ఈ జీవితంలో ఎందరాడవాళ్ళ దగ్గరకి వెళ్ళినా సరోజ అంటేనే నా ప్రాణం అయినట్లు!

అందరూ తల్లిచాటు బిడ్డలయితే నేను పుత్రచాటు బిడ్డగా పెరిగాను. నాకో సొంత అక్కగాని, అన్నగాని, తమ్ముడుకాని, చెల్లెలుకాని లేకపోయినందువల్ల నాలో ఏదో ఒక ఏకాంతం ఆవహించేది. అదోజబ్బుగా పరిణమించకుండా నన్ను కాపాడిన వాడు మా నాన్నే. ఆయన దగ్గరుంటే ప్రపంచం అంతటినీ కౌగిలించుకుంటున్న భావన నాకు కలిగేది.

నేను బి.ఏ పూర్తిచేసి నిరుద్యోగిగా తిరుగుతున్నప్పుడు అప్పటికే దారిద్ర్యం అనే అంధకారం మా జీవితాలలో నిండిపోయి నిబిడీకృతమయినప్పుడు మా నాన్న చాలాసార్లు సముద్రంలో పడి చచ్చిపోవాలనుకున్నాడట. అయితే తాను లేకపోతే నేనేమయిపోతానో అన్న బెంగకొద్దీ తీరందాకా వెళ్ళి కూడా ఆత్మహత్యా ప్రయత్నాలు విరమించుకునేవాడట! ఈ మాట నాతో మా నాన్నే అనేవాడు. అందుకే అప్పుడప్పుడు నాక్కూడా చచ్చిపోవాలని బుద్ధి పుట్టినా, చచ్చి సాధించేదేముంది కనక? బతికుండే దీని అంతు తేల్చుకోవాలనే పట్టుదల ఒకటి నాలో పరిపక్వమవుతూ వచ్చింది.

విశాఖపట్టణంలో హార్బరూ, విశ్వవిద్యాలయమూ, నాలో యౌవనమూ ఇంచుమించు

ఏకకాలంలోనే ఆవిర్భవించాయి. అప్పుడు అబ్బూరి రామకృష్ణారావుగారే నా హోర్బరూ, విశ్వవిద్యాలయమూను. సగటున రోజుకో కొత్తపుస్తకం చదివించేవారాయన. వాల్తేరుదాకా నడుచుకుపోయేవాణ్ని. అబ్బూరివారిచ్చిన పుస్తకం చదువుతూ సముద్రతీరం మీదుగా పీరాడ కొండదాకా నడుచుకువచ్చేవాణ్ని. చింకిగుడ్డలు, కాళ్ళకి జోళ్ళుండేవికావు.అలలు నా కాళ్ళనీ, షరాయినీ తడుపుతున్నాయనే స్పృహకూడా ఉండేదికాదు.

భావ కవిత్వానికి కడసారిగా గుడ్‌బై కొట్టి "మహాప్రస్థానం" గీతాలు రాస్తున్న రోజులవి. ఒకనాడు అబ్బూరి రామకృష్ణారావుగారు లండన్‌నుంచి వచ్చిన *Progressive writers Manifesto* చదవమని నాకిచ్చారు. అర తావుకంటె ఎక్కువ సైజులేని ఆ పత్రం నామీద చెరగని ముద్రవేసింది. దాని ప్రభావంతోనే "ప్రతిజ్ఞ" అనే గీతం రాశాను. "పొలాలనన్నీ, హలాలదున్నీ" ఇత్యాదిగేయం. *Manifesto* సారాంశం అంతా దించేశావని మెచ్చుకున్నారు అబ్బూరివారు. "ఘర్మజలానికి, ధర్మజలానికి, ఘర్మజలానికి" అన్న చోట ఒక్కక్షణం ఆగేరు. ఘర్మజలం పక్కని ఈ ధర్మజలం ఏమిటన్నట్లు అదేదో పాద పూరణం కోసం వేసిన అర్థంలేని మాట అనుకున్నారో యేమో! కాని మరుక్షణమే తేరుకుని "ఔను. 'ధర్మోదకం' అనే ప్రయోగం మన సంప్రదాయంలోనిదే" అన్నారు. ఒక గీతాన్ని అంతగా స్తనశల్య పరీక్ష చేస్తారాయన.

*Max Nordan* అనే జర్మన్ పండితుడు ఆ నాటి యూరోపియన్ కవితా ధోరణులను దుయ్యబట్టుతూ రాసిన *"De-generation"* అనే గ్రంథాన్ని చదివేను. అందులో ఉదాహరించబడ్డ ఫ్రెంచికవితలు (ఇంగ్లీషు తర్జుమాలో) నన్ను మిక్కిలిగా ఆకర్షించాయి. అందరికన్నా బహుశా ఎక్కువ చివాట్లు తిన్న బోదిలేర్[1] నన్ను అందరికన్నా ఎక్కువ ఆకట్టుకున్నాడు. అతని అభిమానకవి *Edgar Allan Poe*[2] అని తెలుసుకున్న నాకు ఇనుమిక్కిలి సంతోషం కలిగింది. ఈ యిద్దరుకవుల ప్రభావం "మహాప్రస్థానం లోని "ఒకరాత్రి", "కేక", "ఆకాశదీపం" వంటి కవితాఖండికల్లో సుస్పష్టంగా కనిపిస్తుంది.

ఆంధ్రా యూనివర్సిటీ లైబ్రరీలో చదవవలసిన పుస్తకాలన్నీ చదివేశాననుకున్న నేను హిందూ రీడింగు రూమ్ లైబ్రరీచేత కొందరు నోబెల్ బహుమతి గ్రహీతల పుస్తకాలు కొనిపించాను. అప్పుడు రీడింగ్ రూమ్ కార్యనిర్వాహక వర్గానికి ద్వారం జగన్నాథరావు[3]

[1] *చార్లెస్ బొదలేర్ (1821–1867) ప్రముఖ ఫ్రెంచి కవి. ఫ్రెంచి కవిత్వంలో ఎన్నో మార్పులకు ఇతను కారకుడు. ఇతను రాసిన ఫ్లవర్సు ఆఫ్ సిన్ ప్రసిద్ధమైన ఖండకావ్యం.*

[2] *ఎడ్గార్ ఎల్లన్ పో (1809–1849) అమెరికన్ కవి, విమర్శకుడు, కథకుడు, పత్రికా సంపాదకుడు. రావెన్ అనే గేయం మంచి పేరు తెచ్చింది.*

[3] *ద్వారం జగన్నాథరావుగారు విశాఖపట్టణం వాస్తవ్యుడు. శ్రీశ్రీ ప్రాణమిత్రుడు. ఇంటర్‌మీడియట్ వరకు ఇద్దరూ కలిసి చదువుకున్నారు. ఇంగ్లీషు భాషా సాహిత్యాలతో ద్వారం వారికి మంచి పరిచయం వుంది. శ్రీశ్రీ లాగానే క్యారమ్సు ఆటలో అందెవేసిన చేయి. శ్రీశ్రీ మొదటిసారి విదేశాలకు వెళ్లినప్పుడు ద్వారం వారికి జాబులు రాసేవాడు. ద్వారం జగన్నాథరావుగారు 1–7–1972న కన్నుమూశారు. "నా పంచప్రాణాల్లో ఒకటి ఎగిరి పోయింద"ని ఆయన తమ్ముడికి శ్రీశ్రీ జాబురాశాడు.*

అధ్యక్షుడు. నేనొక కమిటీ మెంబర్ని. రెండుమూడు వందల రూపాయలు ఖర్చుపెట్టించి ఇరవై ముప్ఫయ్ పుస్తకాలు మాత్రమే కొనిపించినందుకు ద్వారం నన్ను తెగ చీవాట్లు పెట్టాడు. ఛార్లెస్‌గార్విస్, ఎడ్గార్ వాలెస్ లాంటి వాళ్లవయితే మన లైబ్రరీకి కనీసం రెండువందల పుస్తకాలయినా వచ్చేవని వాపోయాడు. "వచ్చే సంవత్సరం బడ్జెట్‌లో నీ యిష్టం వచ్చిన పుస్తకాలు కొనిపించు, నేనేమీ అడ్డుతగల"నన్నాను. అలాగే అడ్డుతగలలేదు. లైబ్రరీ పుస్తకాల సంఖ్యాబలం బాగా పెరిగింది. గుణం విషయంలో నాకూ జగన్నాథరావుకీ ఎప్పుడూ అభిప్రాయభేదమే. అయినా షెర్లాక్‌హోమ్స్ కథలూ, నవలలూ అన్నా *P.G.* వోడ్ హవుస్ హాస్యరచనలన్నా మా ఇద్దరికీ ఇష్టమే.

*Anatole france*[4] వీ, *Sinclair Lewis*[5] వీ (నేను కొనిపించిన గ్రంథాలు) ఆవురావురుమని నేను చదువుతూ ఉంటే ఇన్నేసి వందల పేజీల పుస్తకాలు చదవడానికి ఎంత ఓపిక ఉంది నీకు, అని జగన్నాథరావు నన్ను గేలిచేసేవాడు. కాని సింక్లేర్ లూయిస్ నవలలు చదువుతూ ఉంటే, అవి ఇంగ్లీషుభాషలోనే ఉన్నా ఏదో ఫారిన్ లాంగ్వేజి చదువుతున్నట్లుండేది నాకు. అది అమెరికన్ ఇంగ్లీషు. అందుకే కాబోలు బెర్నార్డ్‌షా అమెరికన్లకీ బ్రిటిష్‌వాళ్లకీ ఒక్క భాషలో తప్ప మిగిలిన అన్నింటిలోనూ సారూప్యం ఉందని చమత్కరించాడు!

హిందూ రీడింగ్‌రూమ్ః లైబ్రరీలో ఇంగ్లీషు పుస్తకాలేమిటని నన్నీసడించిన వాళ్ళు కూడా లేకపోలేదు. వాళ్లు కేరమ్సు కోసం సభ్యులైనవాళ్లేగాని పుస్తకాల కోసంకాదు. నాకు కేరమ్సుమీదా, పుస్తకాలమీదా సమానమైన అధికారమే ఉండేది. కేరమ్సు, పింగ్‌పాంగ్ లాంటి ఇన్‌డోర్ గేమ్సుగాని, ఫుట్‌బాల్, టెన్నిస్, క్రికెట్ లాంటి ఔట్‌డోర్ గేమ్స్‌గాని విదేశాల నుంచి దిగుమతి అయిన క్రీడలే అని వా విమర్శకులకు జ్ఞాపకం చెయ్యడమనేది అనవసరమైన శ్రమ అని నాకు తెలుసు.

ప్రజాతంత్ర 21–12–1975

4 అనటోల్ ఫ్రాన్సు (1844–1924) మేటి ఫ్రెంచి రచయిత ఎన్నో కథలు, నవలలు రాశాడు. పెంగ్విన్ ఐలండు అనే నవలలో ఫ్రాన్సుచరిత్రను వ్యంగ్యంగా నిశితంగా చిత్రించాడు. థాయిస్, రివోల్టు ఆఫ్ ఏంజిల్సు వగయిరాలు అతని ఇతర రచనలు. బూర్జువావ్యవస్థకి బద్ధవిరోధి తన 75వ ఏట ఎర్రజెండా పుచ్చుకుని పారిస్ నగర వీధుల్లో ఊరేగింపులో పాల్గొన్నాడు.

5 సింక్లయిర్ లూయిస్ (1885–1951) అమెరికన్ రచయిత. అమెరికన్ ధనస్వామ్యపు నాగరికతను ఏవగించుకున్నాడు. ఆ వ్యవస్థలోని నిస్సారపు బ్రతుకులు చిత్రిస్తూ చాలా నవలలు రాశాడు. ఆరోస్మిత్, బాబిట్, డాడ్సువర్తు, ఎల్‌మర్ గాంట్రీ అతని కలంనుంచి వెలువడ్డాయి. అతని రచనల్లో మెయిన్ స్ట్రీట్ బాగా పేరుపొందింది.

# కవిత్వంతో నా ప్రయోగాలు

ఒకటి

"మందః కవియశః ప్రార్థీ" అని కాళిదాసంతవాడు తన్ను తాను కించపరుచుకున్నాడు. తానో మూర్ఖుడట. కవిని కావాలనే కీర్తిని కోరుకుంటున్నాడట! నాకు తెలిసినంత మట్టుకు సంస్కృత కవులెవ్వరూ నేనింతవాణ్ణి, అంతవాణ్ణి అని చెప్పుకోలేదు. ఇది తెలుగు కవులకు మాత్రమే చెల్లింది.

(హొరేస్ అనే లాటిన్ కవి, మహాసముద్రాలింకిపోయినా, మహాపర్వతాలు నేలమట్టమయి పోయినా తన కవిత్వంమాత్రం నిలిచే ఉంటుందన్నాడు. ఆచంద్రతారార్కంగా నిలిచే కవిత్వం రాయడమే తెలుగు కవి ఆశయం.)

అనంతానికి అర్రులుచాస్తూనే ప్రస్తుతాన్ని ప్రస్తుతించడం ఒక్కటే నా కవితాప్రయోగాలన్నిటికీ మూలకేంద్రం.

అంచేతనే నేను ఇరవయ్యోశతాబ్దపు తెలుగు కవిత్వంమీద తిరుగులేని నియంతృత్వం చలాయించాలని నిశ్చయించాను. అందుకుగాను జీవితమంతా కృషిచేశాను, చేస్తున్నాను.

కవిత్వం వాడుకభాషలోనే ఉండాలనే నిర్ణయానికి వచ్చిన తర్వాత అంతకుముందు అవలంబించిన భావకవిత్వ ధోరణికి స్వస్తిచెప్పాను. నామీద అవ్యాహతంగా ప్రసరిస్తున్న కృష్ణశాస్త్రి, విశ్వనాథల ప్రభావం నుంచి ప్రయత్నపూర్వకంగా బయటపడ్డాను.

సెట్టి లక్ష్మీనరసింహం వీరవ్యావహారిక వాది. అయినా అంతటివాడు కూడా పద్యాలు గ్రాంథికభాషలోనే ఉండాలనేవాడు. "నేను సైతం ప్రపంచాగ్నికి" ఇత్యాది గీతాన్ని చదివి వినిపిస్తే "మేము చెప్పింది ఇది కాదు" అన్నారు. "మీరెవరు చెప్పడానికి?" అని నేను ధిక్కరించాను.

ఈ ధిక్కారగుణమే తొలినుంచీ నా కవిత్వానికి ప్రాతిపదిక. కల్పనా ప్రపంచంనుంచి కవిత్వాన్ని వాస్తవలోకానికి మళ్ళించడమే నా ధ్యేయం! అందమైన అబద్ధాలనుగాక నిష్ఠురమైన నిజాన్నే నేను ఆరాధిస్తాను. ఏదో కొత్తదనం కోసమే ఎప్పుడూ నా అన్వేషణ.

అవి ముద్దుకృష్ణ "జ్వాల" ప్రకటిస్తున్నరోజులు. పాతమీద రోతా, కొత్తదనంమీద మోజూ నాకులాగే అతనికికూడా ఉండేవి.

"నాడు టెలిఫోనులో పిల్చి నాటి నావు
ప్రేమ బీజమ్ములే నిరుపేద యెదను"

అని రెండు గీత పద్యపాదాలు రాసి నన్ను కంటిన్యూ చెయ్యమన్నాడు.

"మరుదినాన బొటానికల్ మధువనాన
తలవని తలంపుగా మనం కలిసినాము"

అన్నాన్నేను. కాని ఇది పద్ధతికాదని నాకనిపించింది. భావకవిత్వపు ప్రభావం దీనిలో స్పష్టంగా కనబడుతోంది. అందుచేత అక్కడితో ఆ రచన ఆగిపోయింది. టెలిఫోన్‌లాంటి ఆధునిక పరికరాన్ని వాడినా, కావ్యవస్తువు పాతదేకావడం నాకిష్టంలేక పోయింది. అప్పుడు ముద్దుకృష్ణ- "మలుపు తిరిగాను' అని ప్రారంభించి ఒక మంచిరచన చేశాడు. ఇలాంటివే ముప్ఫయిదాకా రాసి వాటిని "త్రింశతి" అనే పేరుతో అచ్చువేయాలనుకున్నాడు. (కాని, అతని అజాగ్రత్తవల్లనో, నిర్లక్ష్యం వల్లనో అది జరగలేదు. ఇప్పుడా గీతాలుకూడా దొరకవు.)

పాత "జ్వాల" పత్రికలుగాలిస్తే అతడు రాసిన-

"కాయండి యువకులు
కయండి భుజములు
కాష్టంగ వుంటుంది
కాని తప్పదు మనకు!

• • •

"చచ్చిపోయిన తల్లి
స్తన్యమ్ము గుడుపడు"

వంటివి ఒకటీ అరా దొరకవచ్చును.

"ముద్దుకృష్ణ జ్వాల గోల" అని జంసూత్రం ఎకసెక్కెం వేసినా ఆ రోజుల్లో "జ్వాల" పత్రిక గొప్ప సంచలనమే కలిగించింది. ఇప్పుడా సంచికలు ఎక్కడైనా దొరుకుతాయో లేవో కూడా తెలియదు. "జ్వాల" లోనే నా "మహాప్రస్థాన" గేయం మొదటిసారిగా ప్రచురితమయింది.

1932లోనో, 33 లోనో అనుకుంటాను బరంపురంలో "అఖిలాంధ్ర కవిపండిత సభ" జరిగింది. దీనికి నేనూ, జనార్దనరావూ వెళ్ళాము. అప్పుడే నేను కొత్తబాణీలో రాస్తున్న నా గీతాలను చింతా దీక్షితులుగారికి చదివి వినిపించాను. అది విని ఆయన అమితానందభరితుడు కావడమూ, "వచ్చేసిందిదిగో కొత్త కవిత్వపు వరద" అని నన్ను మెచ్చుకోవడమూ ఎన్నటికీ నేను మరిచిపోలేను.

బరంపురంలో పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి[1]గారిని చూడడానికి పనిగట్టుకుని వాళ్ళయింటికి వెళ్ళాను. "ఎంకిపాటల గాలిదుమారం" చెలరేగుతున్నప్పుడు నండూరి వారిని అమోఘంగా సమర్థించినందుకు గాను ఆదినారాయణ శాస్త్రిగారంటే నాకెనలేని గౌరవం. ఎన్నోగంటలసేపు వారు నాతో మాట్లాడారు "నా పుస్తకం ఒకటి మీకు అంకితం చెయ్యాలని ఉంది" అన్నాను. తప్పకుండా చెయ్యమన్నారు. కాని ఇప్పటికీ వారు చనిపోయి చాలాసంవత్సరా లయినప్పటికీ, ఈ వాగ్దానాన్ని నెరవేర్చుకోలేకపోయాను. (బహుశా త్వరలోనే ఇది నెరవేరగల అవకాశం వస్తోందనుకుంటాను.)

"అభినవాంధ్ర కవి పండిత సభ" అనే పేరు నాజూకుగా లేదని దానిని ఆ మరు సంవత్సరమే శివశంకరశాస్త్రిగారు 'నవ్యసాహిత్య పరిషత్తు'గా మార్చారు. పరిషత్తు అధికార పత్రికగా జనార్దనరావు సంపాదకత్వంలో "ఉదయిని"ని వెలువరించడానికి కొన్ని ప్రయత్నాలు జరిగాయి. కాని, అవి ఫలించలేదు. స్వతంత్రంగానే జనార్దనరావు తన పత్రికను తీసుకువచ్చాడు. తరువాత 'నవ్యసాహిత్య పరిషత్తు' ఆధ్వర్యంలో "ప్రతిభ" వెలువడింది. "ఉదయిని", "ప్రతిభ" రెండుకూడా ఉన్నత సాహిత్యప్రమాణాలతో నడిచాయి. అన్ని సాహిత్యపత్రికల లాగే ఇవికూడా ఎంతో కాలం జీవించలేకపోయాయి.

ఏటేటా కాంగ్రెసు ప్రెసిడెంటుగిరీకి ఎంత గొప్పవుండేదో అంతటి గొప్ప నవ్యసాహిత్య పరిషదధ్యక్ష పదవికి కూడా (మా దృష్టిలో) ఉండేది. ఒక యేడు నన్ను అధ్యక్షుణ్ణి చెయ్యాలని సభ్యులంతా పట్టుబట్టారు. కాని నేనింకా చిన్నవాడినని పెద్దవాళ్ళంతా ఆ ప్రతిపాదనను త్రోసిపుచ్చారు. వారందరిలో ఒక్క చింతాదీక్షితులుగారే నన్ను సమర్థించారు. దీక్షితులుగారే అధ్యక్ష పదవికి నా పేరు సూచిస్తూ కృష్ణాపత్రికలో కాబోలు రాశారు.

మద్రాసులోని ఆంధ్రమహాసభలో నవ్యసాహిత్య పరిషత్తు సభ జరుగుతోంది. నేను, శిష్ట్లా, జలసూత్రం, నారాయణబాబు ఇత్యాదులం కొందరం బయటికి వచ్చేశాం. భవనానికి వెలుపల పచ్చిక తివాసీ మీద అందరమూ కూర్చుని "ఈ పరిషత్సభను బహిష్కరిస్తున్నాము" అని ఏకగ్రీవంగా తీర్మానించాము. ఆ తర్వాత సంవత్సరం కాబోలు కనుతుడుపుగా పరిషత్తువారు ఒక కవి సమ్మేళనం ఏర్పాటుచేసి దానికి నన్ను అధ్యక్షుణ్ణి చేశారు. అందులో రాయప్రోలు, కృష్ణశాస్త్రి మొదలైన హేమాహేమీలంతా పాల్గొన్నారు.

"ఉదయిని" ద్వైమాసపత్రిక. అతికష్టంమీద ఏడాదిపాటు జనార్దనరావు దానిని నడి పించాడు. ఆరవ సంచిక కేసరీ ముద్రణాలయం నుంచి బైటికి రానేలేదు. ఆ బెంగతోనే జనార్దనరావు మరణించాడని నా నమ్మకం. "ప్రతిభ"కు ఉండే ప్రాపకాలు "ఉదయిని"కి

[1] *అమెరికాలో వుండగా 1981లో శ్రీశ్రీ సిప్రాలి పుస్తకంగా కూర్చి దాన్ని మిమియోగ్రాఫు చేయించాడు. సిప్రాలి పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారికి అంకితం ఇచ్చాడు. సిప్రాలి అంటే*

*సిరిసిరిమువ్వ*
*ప్రాసక్రీడలు*
*లిమరుక్కులు*

*సిప్రాలి శ్రీశ్రీ 20 సంపుటాల్లో ఒక పుస్తకంగా వస్తుంది.*

ఎప్పుడూ ఉండేవికావు. ఏ సంచిక కాసంచికను అతి ప్రయాసతో తీసుకొస్తూ ఆరవది అచ్చుకిచ్చిన తర్వాత జనార్దనరావు క్షయవ్యాధిగ్రస్తుడయ్యాడు. ఆ వ్యాధితోనే చనిపోయాడు. ఆరవ సంచిక ప్రతులన్నింటినీ ప్రెస్‌బిల్లు నిమిత్తం చెత్తకాగితాల కింద అమ్మేయ్యడం జరిగింది. కనీసం ఒక్క కాపీ అయినా దొరకుతుందేమో అని నేను కేసరి ప్రెస్సుకి వెళ్ళి చాలా ప్రాధేయపడ్డాను. 'అన్నీ అమ్మేశాం' అని జవాబు వచ్చింది.

జనార్దనరావు విరిగిపోయిన మురికి ఖద్దరు దుస్తులు ధరించేవాడు. కాని తన పత్రికను మాత్రం ఫెదర్‌వెయిట్ కాగితం మీదనే అచ్చువేయించేవాడు. అతడే మరికొన్నేళ్ళు బతికివుంటే తెలుగు సాహిత్యానికి పదిహేనంతస్తుల భవనం నిర్మించేవాడేమో!

జనార్దనరావు చనిపోయాడన్న వార్త విన్నవెంటనే నేను నిశ్చయించాను. ఎప్పటికైనా నా "మహాప్రస్థాన" కావ్యసంపుటి అచ్చయితే దాన్ని జనార్దనరావుకే అంకితమియ్యాలని. ఆ సంపుటిలోని ఆఖరి గీతం "తలవంచుకు వెళ్ళిపోయావా నేస్తం! సెలవంటూ ఈ లోకాన్ని వదిలి" అనే అంకితగీతం. ఇది ఆఖర్న రాసిందేకాదు అచ్చుకావడం కూడా చివరిపుటల్లోనే అయింది.

ఒకమిత్రుడు చేసిన ధన సాహాయ్యంతో "మహాప్రస్థానం" 1950లో ముద్రితమైంది. ప్రూఫులన్నీ కనీసం పదిసార్లు నేనే బి.యన్.కె ప్రెస్‌కి వెళ్ళి సరిదిద్దాను. ఒక్క అచ్చుతప్పు కూడా ఉండకూడదని నా ఉద్దేశం. "వర్షుకాభ్రముల" వంటి సాహిత్యదోషాలు నావిగానే అంగీకరిస్తాను. "వార్షుకాభ్రముల" అని దీన్ని సవరించవచ్చు. ఇటువంటిదే "ఘూర్ణమాన." దీన్ని "ఘూర్ణ్యమాన" అనాలట. కాని నేనవలేదు. నాకు సంస్కృత భాష రాదనడానికి అంతర్గత సాక్ష్యంగా ఈ తప్పుల్ని యథాతథంగా ఉండనిచ్చాను.

"మహాప్రస్థానం" మొదటి ముద్రణలో ఒకేఒక్క అచ్చుతప్పు మిగిలిపోయింది. అది విషయ సూచికలో "స్విన్‌బర్న్‌కవికి" అనే చోట ర్‌కింద నకారపు పొల్లు లేకపోవడం. ఇది ప్రూఫు చూసినప్పుడు సరిగానే ఉంది. కాని అచ్చుయంత్రం మీద ఎక్కించేటప్పుడు జారిపోయి ఉండాలి.

"మహాప్రస్థానం" కవరుపేజీలు రెండూ నేనే ప్లానుచేశాను. ముందు పేజీలోని శ్రీ శ్రీ బోర్డరు గ్రాఫు కాగితంమీద రాయించి బ్లాకుచేయించాను. శ్రీరంగం శ్రీనివాసరావు అనే సంతకాన్ని పసుపుపచ్చని కాగితాలమీద నీలిపెన్సిలుతో యాభయిసార్లు రాసి అందులో ఒకదాన్ని ఎంచుకున్నాను. చివరి కవరుపేజీ మీద శ్రీకారపు గుణకారానికి ప్రెస్సులోని శ్రీకారాక్షరాలన్నీ కావలసి వచ్చింది.

"మహాప్రస్థానం మొదలైన గీతాలు" అనే అక్షరాలను రాసినవాడు ఆర్టిస్టు శ్రీ తేజోమూర్తుల కేశవరావు. అతనప్పుడు ఆంధ్రపత్రిక ఆఫీసులో పనిచేస్తుండేవాడు.

*ప్రజాతంత్ర 25–7–1976*

## రెండు

విశాఖపట్టణంలో ఆంధ్రాయూనివర్సిటీ లైబ్రరీ నుంచి ఒకసారి నేను రెండు ఇంగ్లీషు కావ్యసంపుటాలు తీసుకువచ్చాను. వాటిలో ఒకటి రూపర్ట్ బ్రూక్‌ది.[1] రెండోది విల్ఫ్రిడ్ విల్సన్ గిబ్సన్‌వి.[2] ఇద్దరూ యువకవులు. (ఆ పుస్తకాల లోంచి చింపిన వారిద్దరి రూపచిత్రాలనూ చాలాకాలం నేను దాచుకున్నాను) ఇరవయ్యో శతాబ్దపు కీట్స్ అని పేరొందిన రూపర్ట్ బ్రూక్ అప్పటికే మొదటి ప్రపంచయుద్ధపు తుదిమాసాల్లో రణరంగంలో జారపడి మరణించాడు. అతనొకచోట ఇలా అన్నాడు.

*"There are three things worth while in this life. To read poetry, to write poetry, to live poetry"* అని! (ఈ జీవితంలో చెయ్యదగ్గవి మూడున్నాయి. కవిత్వాన్ని చదవడం, కవిత్వాన్ని రాయడం, కవిత్వాన్ని జీవించడం!)

అప్పటికి నాకు కవిత్వాన్ని చదవడం, రాయడం ఎలాగొ తెలుసు. కవిగా జీవించడమెలాగో తెలుసుకోవడానికి చాలాచాలా కవుల రచనలతోబాటు వారివారి జీవితచరిత్రలను కూడా చదివాను. అయినా కవిగా బతకడమెలాగో ఇప్పటికీ నాకు తెలియలేదు. రూపర్ట్ బ్రూక్ కవిగా మరణించాడని మాత్రం అందరూ అంగీకరిస్తారనుకుంటాను.

కవి ధరించవలసినది కలమా? ఖడ్గమా? అనే ప్రశ్నకు కలమే అని జవాబివ్వడం చాలా సులభం. కాని ప్రతిజాతి జీవితంలోనూ ఒక్కొక్క పరీక్షాసమయం వస్తుంది. అప్పుడు కవి అన్నవాడు కలం పారేసి కత్తిని ధరించవలసిందే. ఆ పనే రూపర్ట్ బ్రూక్ చేశాడు.

నేను "మహాప్రస్థానం" గీతాలు రాస్తున్న దశాబ్దం (1930-40) లో స్పెయిన్‌లో ప్రచండమైన అంతర్యుద్ధం సాగింది. దానిప్రభావం నామీద విపరీతంగా పనిచేసింది. జవహర్‌లాల్ నెహ్రూ స్పెయిన్‌కు వెళ్ళాడన్నవార్త, దారిలో ముస్సోలినీ ఆహ్వానాన్ని తిరస్కరించాడన్న వార్త నన్నెంతో ఉద్వేజితుణ్ని చేశాయి. సరేసరి, అబ్బూరి రామకృష్ణరావు గారు స్పెయిన్ అంతర్యుద్ధానికి సంబంధించిన బోలెడు గుప్తజ్ఞానాన్ని నా మెదడులోనికి దట్టించారు.

గిబ్సన్ గీతాలలో ఒకదాని శీర్షిక *"I, even I"*. ఇదే నాచేత "నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను" అని వ్రాయించింది. ఇంతకుమించి ఈ రెండుగీతాల మధ్యా సారూప్యం మరేదీలేదు. అయినా అది చదివి ఉండకపోతే ఇది నేను వ్రాసి ఉండకపోదును. అలాగే శిష్ట్లా ఉమామహేశ ఆనాడు జరిగే లాఠీచార్జీలమీద "మారో మారో" అనే ఒక వచనగీతం రాశాడు.. "మరో ప్రపంచం, మరో ప్రపంచం, మరో

1 *రూపర్ట్ బ్రూక్ (1887–1915) ఇంగ్లీషు కవి. ఆతను మొదటి ప్రపంచ యుద్ధంలో చనిపోయాడు. కవితా సంపుటి 1918లో వెలువడింది.*

2 *విల్‌ఫ్రెడ్ విల్సన్ గిబ్సన్ (1878— 1962) ఆంగ్లకవి. నాటకకర్త. మొదటి ప్రపంచ యుద్ధపు అనుభవాలను బ్లేక్ ఫాస్టు అనే కధలుగా రాశాడు. గిబ్సన్‌ని తన వారసుడుగా రూపర్ట్ బ్రూక్ పేర్కొన్నాడు.*

ప్రపంచం పిలిచింది'' అని నేను రాశానంటే శ్రీశ్రీ ప్రభావం దానిమీద లేదని ఎలా చెప్పడం? (తదితర ప్రభావాలనుకూడా నేను "ఆరంభం ఒక పెద్ద అవస్థ" అనే రచనలో విపులీకరించాను.)

మాత్రాచ్ఛందస్సులో, వాడుకభాషలో నేను మొట్టమొదట రాసినగేయాలలో మొట్ట మొదటిది "నేను సైతం". దీని ఛందస్సు ముత్యాలసరం. ఆ ఛందస్సులోని ఒకటి రెండు పాదాలతోనే ఎంత వైవిధ్యం సాధించవచ్చునో తెలుసుకున్నప్పుడు నాకాశ్చర్యమూ, ఆనందమూ కలిగాయి. వైజ్ఞానికుడు ఒక కొత్తసత్యం కనిపెట్టినప్పుడు పొందే సంతృప్తి అప్పుడు కలిగింది.

"నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధనొక్కటి ఆహుతిచ్చాను"

మూడుపాదాల చరణం ఇది. దీన్నే తిరగేస్తే ఇంకొకచోట

"యముని మహిషపు లోహఘంటలు
మబ్బుచాటున
ఖణేల్మన్నాయి" అనే రూపం దాల్చింది.
"కూటికోసం కూలికోసం
పట్టణంలో బ్రతుకుదామని
తల్లిమాటలు చెవినిపెట్టక
బయలుదేరిన బాటసారికి..."

ఇత్యాదిగీతం *run-on verse*గా రూపుదాల్చింది. జనార్దనరావు పత్రిక "ఉదయిని"లో ప్రచురణార్థం నేను రాసిన "ముత్యాల సరం ఒక కృషి" అనే వ్యాసంలో ఈ ఛందస్సుమీద చాలారాశాను. కాని రాయవలసింది ఇంకా ఉంది.

కవిత్వం రాయడం ప్రారంభించిన తర్వాత చాలా సంవత్సరాలదాకా నేను "సంవిధానమే సమస్తమూ" (*Technique is everything*) అనుకునేవాణ్ని. ఏది చెబుతున్నామనేది ముఖ్యంకాదు. ఎలా చెబుతున్నావనేదే ముఖ్యం అనుకునేవాణ్ని. ఆమేరకు నేను "కళకోసమే కళ"అనే వారి దంతప్రాకారంలోనే జీవిస్తూ వచ్చాను. అందులోనుంచి బయటపడి "ప్రజకోసమే కళ" అనే నికరమైన నిశ్చయానికి రావడం ఎన్నోప్రయత్నాల, ప్రయోగాల తర్వాత సాధ్యమయింది. ఇదే ఈ నాటి నా దృఢవిశ్వాసం.

రకరకాల ఛందస్సులతో సాముగరిడీలు చేస్తూ అదే కవిత్వం అనుకోవడం నాకు *Edgar Allan Poe* నుండి సంక్రమించిన వ్యాధి అనుకుంటాను. *The Poetic principle* (కవితాసూత్రం) అనే ఒక సుదీర్ఘమైన వ్యాసంలో అతడు "మాలకాకి" *(The Raven)* అనే తన గీతాన్ని చక్కగా విశ్లేషించి రుచ్యమైన పదార్థాన్ని వంటగదిలో తయారుచేసినట్లు కవిత్వాన్ని కూడా ఎలా ఆస్వాదయోగ్యంగా

తయారుచేయవచ్చునో విశదం చేశాడు. (అది చదివాకనేను "కవిత్వరచనకు సులభమార్గాలు" అనే వ్యాసం రాయడానికి కొంత నోట్సు తయారుచేసుకొన్నాను. తెలుగువారి అదృష్టం కొద్దీ అవిప్పుడు అంతర్ధానమయిపోయాయి.)

అయినా ఆనాటి మానసికావస్థలో నా ఆశయం విచిత్రమైన సంస్పందనాలను ఆరాధించడమే. *It is my ambition to be called the poet of strange sentiments and shuddering sensations* అని ఒకచోట రాసుకున్నాను. దీని వెనుక ఉన్న ప్రోద్బలశక్తి *Edgar Poe*ది అని వేరే చెప్పనక్కరలేదు. ఈ స్థితిలోనే నేను-

"గగనమంతా నిండి
పొగ లాగుక్రమ్మి
బహుళ పంచమి జ్యోత్స్న
భయపెట్టు నన్ను"

అని ప్రారంభమయే గీతాన్ని రాశాను. అందులోని "కరికళేబరములా కదలదు కొండ" లాంటి ఉపమానములు ఒక్క సంస్కృత కవులకే సాధ్యమని విశ్వనాథ సత్యనారాయణగారు మెచ్చుకున్నారు. ఆయనే ఏదో గీతంలో, మబ్బుల్లోంచి వెలువడుతున్న నెలవంక, గుహలో నిద్రిస్తూ కాలుబైటకు పెట్టిన శ్వాపదముగోరు (పులిగోరు)లా ఉందని రాశారు.

"నిద్రకు వెలియై
నే నొంటరినై
నా గదిలోపల చీకటిలో
నా గదిలో
చీకటిలో"

అని మొదలయ్యే గీతం కూడా కొసదాకా ఈ కోవకు చెందినట్లుగానే సాగుతుంది. 'కోరకికన్నా, కొమ్మకి కన్నా' వంటి అధివాస్తవిక చిత్రాలు కూడా ఈ భావాన్నే బలపరచవచ్చు. కాని ఆఖరి చరణంలోని ఆఖరిపాదంలో ఆకలి అనే మాటతో అంతవరకూ పద్మ భక్షకుడిగా ఉండే నేను వాస్తవ ప్రపంచంలోనికి ప్రవేశించానని ఋజువవుతుంది. "విధానం కాదు, విషయమే ముఖ్యం" అనే నా ధ్యాక్పథానికిదే నాంది అనవచ్చు.

అంటే ఇది, కవిత్వానికి సంవిధానం అనవసరం అని కొట్టి పారెయ్యడం కాదు. అలాగయితే కవిత్వం రాయడమే అనవసరం. ఎలా చెప్పడం అనేదానికన్నా ఏది చెప్పడం అనే దానికే ప్రాధాన్యం ఉండాలి. అప్పుడు కావ్యంలో నాజూకులూ, నగిషీలు కాక వస్తువు ప్రాముఖ్యానికి వస్తుంది.

*ప్రజాతంత్ర 1–8–1976*

## మూడు

నేను చెయ్యాలనుకొని చెయ్యలేకపోయిన పనులలో ఎప్పుడూ నాకు విచారం కలిగించేది 'ధ్వని' అనే కవిత్వపత్రికను తీసుకురాలేక పోవడం! అలాగే "10-40" అనే కవితా సంకలనాన్ని

సంగ్రథనం చెయ్యలేకపోవడం కూడా నాకు కష్టంగానే ఉండేది. 10-40 అంటే 1910 నుంచి 40 దాకా వెలువడ్డ కవిత్వం. ఇందులో మొట్టమొదటి రెండుగీతాలూ యస్.గిరీశం రచనలుగా వెయ్యాలనుకున్నాను.

1. నీ సైటు నా డిలైటు 2. *The Widow*

ఇందులో తెలుగువాళ్ళు వ్రాసిన ఇంగ్లీషు గీతాలు కూడా వెయ్యాలనుకున్నాను. విశ్వనాథ సత్యనారాయణగారిచేత ''కిన్నెరసాని పాటలు'' రాయించడానికి ప్రోద్బలం ఇచ్చిన కవికొండల వెంకటరావు[1] గారి ''విలాసినీవైనతేయ'' ఒక *must.*

'ఓడలరేవులో ఒయ్యారి ఎవరంటే ఓయని పలికింది వొయనతేయం' అని ప్రారంభ మయ్యే ఈ దీర్ఘగీతం భారతిలోనో ఆంధ్రపత్రిక ఉగాది సంచికలోనో చదివాను.

భావకవికుల గురువులైన రాయప్రోలు, అబ్బూరి రచనలు రెండేసి, మూడేసి మాత్రమే వెయ్యాలనుకున్నాను. కవికొండల, బసవరాజు, నండూరి, చింతాదీక్షితులు వంటివారికి ఎక్కువ ప్రాధాన్యం ఇయ్యాలనుకున్నాను.

ముఖ్యంగా ఆనాటి అతి నవ్యకవుల కోసమే ఈ సంకలనాన్ని ఉద్దేశించాను.

ఏమయితేనేం 10-40 వెలువడనే లేదు. ''ధ్వని'' పత్రిక కూడా పుట్టకముందే చచ్చిపో యింది. ఇది ఎలాగూ రాదని తెలిసి, మాగాపురామన్ ''ధ్వని'' పేరుతో ఒక సినిమా పత్రిక తెచ్చి చాలాకాలం సాగించాడు.

ముద్దుకృష్ణ ''వైతాళికులు'' వెలువడిన రోజులలో నారాయణబాబు నాతో అంటూ వుండేవాడు; ''తంబీ మనం 'సుప్తాస్థితులు' అని ఒక *anthology* వెయ్యాలిరా'' అని. ఎలావెయ్యడం? ఎక్కడనుంచి డబ్బొస్తుంది? ఈ సమస్యలను గురించిన ఆలోచనే మాకు కలిగేది కాదు. ఒక పుస్తకం అచ్చువెయ్యడానికి డబ్బు కావాలనే ప్రాథమిక సూత్రం తెలియని అజ్ఞానులం మేము.

''ఆర్థికమే అన్ని సమస్యలకూ మూలం'' అనే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని నేను సరాసరి మార్క్సునుంచి కాక అప్టన్ సింక్లేర్[2] రచించిన *''Money Writes''* అనే

*1 కవికొండల వెంకటరావు(1892—1969) కవి, కథకుడు. కవిత్వంలో ఎన్నో కొత్తపోకడలు పోయాడు. చాలా కథలు రాశాడు. కల, కళ్ళు, డ్యూటీ, బ్యూటీ, ప్రపంచపౌరుడు మొదలైన కథాసంపుటాలు వెలువడ్డాయి.*

*2 అప్టన్ సింక్లేర్ (1878—1968) మేటి అమెరికన్ రచయిత. నూరుపైగా పుస్తకాలు రాశాడు. పారిశ్రామిక, వ్యాపార అమెరికాలోని దోపిడీని కళ్ళకు గడుతూ ఆయిల్, జంగిల్, కింగ్‌కోల్, బోస్టన్, డ్రాగన్ టీత్ మొదలైన నవలలెన్నో రాశాడు. రెండో ప్రపంచ యుద్ధ చరిత్రను కూడా నవలల రూపంలో రాశాడు.*

*ఇవన్నీ ఒక ఎత్తు. మామన్ ఆర్టు (**MAMMON ART An essay in economic interpretation**) ఒక్కటీ ఒక ఎత్తు. ఈ పుస్తకం 1925లో వెలువడింది. కళంతా ప్రచారమేనని, రచయితలమీదా, కళాకారులమీదా ఆర్థిక శక్తుల ప్రభావం బలీయంగా వుంటుందని మొత్తం పాశ్చాత్య సాహిత్య చరిత్రకు అన్వయించి రుజువు చేసి చూపించాడు.*

*అలాగే ఆధునిక అమెరికన్ రచయితలకు అన్వయించి మనీరైట్సు (**MONEY WRITES**)1931లో రాశాడు. ఈ పుస్తకం చదివితే రచయితల నిజస్వరూపాలు తెలుస్తాయి. ''రచయితల జేబులు తనిఖీచేసి ఈడబ్బు మీకెలా వచ్చింద''ని అడిగితే వన బయటపడుతుందని ఈ పుస్తకం ముందుమాటలో సింక్లేర్ రాశాడు.*

*వ్యాపార నాగరికత వ్రేలితలలు వేసి నేటి తెలుగు నవలా రంగాన్ని ఎలా కలుషితం చేసిందో మనం కళ్ళారా చూస్తున్నాం. **MONEY WRITES** లాంటి పుస్తకం ఇవాళ తెలుగు పుస్తక ప్రపంచానికి అన్వయించి రాయవచ్చు.*

గ్రంథంనుంచి తెలుసుకున్నాను. పెట్టుబడిదారీ విధానపు దుర్మార్గాలన్నింటినీ బట్టబయలు చెయ్యడమే కాక సామ్యవాద సమాజం నిర్మించడంలో నిజాయితీపరులయిన రచయితలవలం బించవలసిన విధానాలను కూడా విస్పష్టంగా నిర్దేశించే గ్రంథం ఇది.

ఎప్పటికైనా ఇటువంటి గ్రంథం ఒకటి తెలుగులో రావలసిన అవసరం ఎంతయినా ఉంది. కేవలం ఈ పుస్తకాన్ని తర్జుమాచేస్తే ప్రయోజనం లేదని నా ఉద్దేశం. సింక్లేర్ సూచించిన పద్ధతులతో, ఈనాటి తెలుగు రచయితలను నిలవేసి, వాళ్ళజేబులు తనిఖీచేసి, ఈ డబ్బు మీకెలా వచ్చింది? అని అడగవలసి ఉంటుంది.

ఇక్కడే ఎలారాయడం, ఏమిటి రాయడం అనే ప్రశ్నలతోబాటు ఎందుకు రాయడం అనే మూడోప్రశ్న ఉత్పన్నమవుతుంది.

దీనికి భావకవులు సూటిగానే జవాబు చెప్పేశారు. ''కాకి ఎందుకు ఎగురుతుంది? కోకిల ఎందుకు కూస్తుంది? మేమూ అందుకే రాస్తున్నా'' మన్నారు వాళ్ళు.

''ప్రభవ'' ఖండకావ్యాలు మొదలు ''సుప్తాస్థికలు'' అనే గీతాలురాసేదాకా నా దృక్పథం కూడా ఇదే.

విజయనగరంలో నారాయణబాబు తూగుటుయ్యాలలో ఊగుతూ,

''లోకాలు నాకేలనే- కోకిలా!

బాలకృష్ణుడే చాలునే'' అనే తురగా వెంకటరామయ్య గేయాన్ని రాగయుక్తంగా పాడుతుంటే అదే కవిత్వానికి పరమావధి అనిపించేది నాకు.

1930 నుంచి ప్రపంచమంతటా ఆవరించిన ఆర్థికమాంద్యం నా వ్యక్తిగత జీవితం మీద కూడా తన ప్రభావాన్ని తీక్షణంగా ప్రసరించడంతో, క్రమక్రమంగా మా పరిస్థితులు దిగజారి పోతూండడంతో, 31లో నేను టైఫాయిడ్ జ్వరంతో బతికి బయటపడడంతో నా కవిత్వంలో ఒక కొత్త ప్రస్థానం ప్రారంభమయింది.

నాలుగుచక్రాల బళ్ళూ, నాలుగు పాదాల పద్యాలూ నాకిక అక్కరలేదనుకున్నాను. అవి ఫ్యూడల్‌యుగానికి ప్రతీకలు. ఇప్పుడు మనం పారిశ్రామిక యుగంలో ప్రవేశించాం. ఇప్పుడు మనకు కావలసినవి ధూమశకటాలవంటి మాత్రాచ్ఛందస్సులూ విమానాల లాంటి వచనగేయాలూ!

విశాఖపట్టణంలో హార్బరు నిర్మాణం చురుకుగా సాగిపోతోంది. వెనకటి కవులంతా ఆరాధించిన సహజ ప్రకృతి సౌందర్యంలోని ఆకర్షణ నాలోంచి, నా కవిత్వంలోంచి నిష్క్రమించింది. దరగా కొండమీద నిలబడి, టెలిగ్రాఫు తీగలను చూస్తూవుంటే, ఆ సమానాంతర రేఖలలో ఒక అద్వితీయ అనుభూతి నాకు కలిగేది. ఇవి దేవుడుగారు సృష్టించిన ప్రకృతిగాదు. ప్రకృతిని తన అదుపులోకి తీసుకురావడానికి మానవుడు చేస్తున్న ప్రయత్నం.

ఆ తీగల్లో ప్రసరించే విద్యుచ్ఛక్తి నా కవిత్వానికి ఆవేశం ఇచ్చేది.

దూరాన సముద్రంలో స్టీమర్లు కనిపించేవి. ఆవిరిని తన బానిసను చేసుకున్న మానవుని

మహాత్యం నామనస్సుని పదును పెట్టేది.

జాన్ మేస్‌ఫీల్డ్[3] అనే ఇంగ్లీషుకవి "*Cargoes*" అనే మూడు శ్టాంజాల చిన్న గీతం రాశాడు. మొదటి చరణం ఈ పదాలతో ప్రారంభమవుతుంది: *Quinquereme of Nineveh.*

ప్రాచీనకాలపు నౌక. అందులో ఆనాడు అమూల్యంగా భావించే వ్యాపారపు సరుకులు.

అలాగే రెండవ శ్టాంజా: *Stately Spanish galleon* అందులో మధ్యయుగాల పరిమళ ద్రవ్యాలూ, ఇత్యాదులు.

మూడోది: "*Dirty British Coaster with a salt-Caked smoke stack.* ఇందులో ఇనుమూ, బొగ్గూ!

ఆధునిక యుగస్వభావాన్ని సూచిస్తూ!

విశాఖపట్టణం హార్బరులోకి ఇలాంటి పొగనౌకలెన్నో వచ్చేవి. అవన్నీ నాకు మేస్‌ఫీల్డ్ గీతాన్ని జ్ఞాపకం చేసేవి. అతను రాసిన *Salt water Ballads* నేను ఆవురావురని చదివేవాణ్ణి. బ్రిటిష్ నావికుల, నౌకాయానాల కష్టసుఖాల గీతాలవి. అందులోని భాష మర్యాదస్తుల ఇంగ్లీషుకాదు.

తర్వాత తెలిసింది నాకు, అంతకుముందే రడ్యార్డ్ కిప్లింగ్[4] బ్రిటిష్ సోల్జర్ల భాషలో *Barrack-room Ballads* రాశాడని. అవీ చదివాను నేను. అయినా మేస్‌ఫీల్డ్ మీద నా గౌరవం ఏమాత్రమూ తగ్గలేదు. ఒక కవి ప్రభావం ఇంకొక కవిమీద పడడం అనేది కవితాజగత్తులో సర్వసాధారణమే. అతనిదే *A consecration* అనే గీతం.

*"Not of the princes and prelates*
*with periwigged charioteers*
*Riding Cock-horse to parade*
*when the bugles are blown!*
• • • • •

*Of the halt and the blind,*
*in the rain, in the cold*
*Of these shall my songs be fashioned*
*my tales ice told"*

ఎవరిగురించి రాయనో, ఎవరి గురించి రాస్తానో అని వివరించి చెప్పే గీతం ఇది. నా కవిత్వాన్ని ప్రభావితం చేసిన అనేకానేక రచనల్లో ఇది అత్యంత ముఖ్యమైనది.

3 *జాన్ ఎడ్వర్డు మేస్ ఫీల్డు (1878–1967) చిన్నతనం చాలా హాయిగా గడిచింది. కొన్నాళ్ళకు తల్లి చనిపోయింది. ఇబ్బందుల పాలయ్యాడు. విశేషంగా సముద్రయానం చేశాడు ఆ అనుభవంతో సాల్టువాటర్ బాలడ్స్ రాశాడు. 50 కవితా సంపుటాలు, 20నవలలు వెలువడ్డాయి.*

4 *రడ్‌యార్డు కిప్లింగ్ (1865–1936) బొంబాయిలో పుట్టి, భారతదేశంలో జర్నలిస్టుగా పనిచేసిన ఆంగ్లకవి, రచయిత, కథకుడు, నవలాకారుడు, కన్న తల్లిదండ్రులకు దూరమయి బాబా బ్లాక్‌షీప్ కథ రాశాడు. చిన్నపిల్లల కోసం జంగిల్ బుక్, జస్ట్‌లో స్టోరీస్ విజ్ఞానదాయకంగా రాశాడు లండన్‌వెళ్లాక బారక్‌రూమ్ బాలడ్స్ కవితాసంపుటి (1899) అచ్చువేశాడు నోబెల్ బహుమతి గెల్చుకున్న మొట్టమొదటి ఆంగ్ల రచయిత – 1907.*

దీని ప్రభావం *Progressive writers manifesto* చదివిన తర్వాత నేను రాసిన ''ప్రతిజ్ఞ'' అనే గీతంమీద, ముఖ్యంగా-

కమ్మరి కొలిమీ, కుమ్మరి చక్రం
జాలరి పగ్గం, సాలెల మగ్గం

ఇత్యాది పాదాలమీద సుస్పష్టంగా ముద్రితమయిందని వేరే చెప్పనక్కరలేదు.

ప్రజాతంత్ర *8–8–1976*

## నాలుగు

సాంప్రదాయక కవిత్వం అంటే (అసహ్యం అనను కాని) అనిష్టమూ, కవిత్వంలో ప్రయోగపరత్వం మీద అభీష్టమూ నాలో నానాటికీ పెంపొందడానికి ఒకే ఒక్క కారణం ఉంది. అదే నాలోని వైజ్ఞానిక దృక్పథం ప్రయోగం లేకపోతే సైన్సు లేదు. ఈ సూత్రం కళలకు కూడా వర్తిస్తుంది. అయితే సంప్రదాయానికి అంటిపెట్టుకుపోయిన కళాకారులకు మన సమాజం ఇచ్చే గౌరవమర్యాదలు పరిశోధనాసక్తి ప్రదర్శించే ఆర్టిస్టులకు లభించలేదంటే అందుకు ఇప్పటికీ వేళ్లానుకొని పోయివున్న భూస్వామ్యవ్యవస్థనే నేను నిందిస్తాను. ఇవాళ నేను ఎవడో ఒక దేవుణ్ని ఎన్నుకొని, అతగాడిమీద ఒక దివ్యప్రబంధం రాశానంటే, దాన్ని అంకితం పుచ్చుకోవడానికి నేనంటే నేనని ముందుకొచ్చేవాళ్లూ, దాన్ని చదవడానికి ఆవురావురు మంటూ తహతహలాడేవాళ్లూ ఈ దేశంలో అత్యధికసంఖ్యలో ఉన్నారు. నా స్వప్రయోజనం కోసం వాళ్ళని నేను చక్కగాఉపయోగించుకోగలను. కానిఅటువంటి ఆత్మవంచన చేసుకోవడం కంటే అసలు కవిత్వం వ్రాయడమే మానేస్తే మంచిదని నా అభిప్రాయం.

అయితే వెంటనే ఒక ప్రశ్న బయలుదేరుతుందని నాకు తెలుసు. ఇంతవరకు నేను రాస్తున్న సినీమా పాటల మాటేమిటని? శివుడిమీద, శ్రీరాముడిమీద, షణ్ముఖుడిమీద, వేంకటేశ్వర స్వామిమీద, గురవాయూరప్పమీద, ఇంకా ఆడదేవుళ్ళను కూడా కలుపుకుంటే ఎందరెందరో దేవతలమీద నేనెన్నెన్నో పాటలు రాశాను. మాటలు కూడా పరశ్శతంగా రాశాను. ఇవేవీ కవిత్వం కాదన్నదే ఆ ప్రశ్నకు నా జవాబు. మాటల్లోకూడా కవిత్వం ఉంటుంది. కాని అది సినీమాలోమాత్రం కాదు. కేవలం సాంఘికప్రయోజనాన్ని మాత్రమే ఆశించి తీసిన తెలుగుసినీమా ఒక్కటికూడా ఇంతవరకు రాలేదు. వ్యాపారసరళిలో లాభాపేక్షనాశించి, ఏవో సాంఘిక సమస్యలను తీసుకొని వాటిని కలగాపులగం చేసి, తెలుగు సినీమామార్కు పరిష్కారాలు చూపించే చిత్రాలు మాత్రమే, అవైనా చాలాతక్కువగా వచ్చాయి. ఈ పరిస్థితి ఎప్పుడూ ఇలాగే కొనసాగదనీ, అచిరకాలంలోనే సినీమారంగంలో కూడా మౌలికమయిన మార్పులు వచ్చితీరుతాయనీ అప్పుడే సిసలైన కవిత్వానికి సినీమాలో చోటుదొరుకుతుందనీ నా దృఢవిశ్వాసం.

సినీమాలో సైన్సూ, ఆర్టూ ఒకదానితో ఒకటి పెనవేసుకొని ఉంటాయి. ఇక్కడ

అనేకవిధాల ప్రయోగాలకి అవకాశం ఉంది. అభివృద్ధి చెందిన అన్ని దేశాలకూ తెలిసిన ఈ చిన్న విషయం మనలో పెద్దలనుకున్న వారికి కూడా తెలియదంటే అందుకు మళ్ళీ నేను మన సామాజిక వ్యవస్థనే నిందిస్తాను. దీన్ని మార్చదలచుకున్నవారి ప్రయత్నాలకు నేను హృదయ పూర్వకంగా స్వాగతమిస్తాను.

సినీమాల ప్రభావం నా కవిత్వంమీద అంతర్గతంగానే ఉంది. అయితే అవి తెలుగు, హిందీ సినీమాలు కావు. నేను విశేషంగా హాలీవుడ్ చిత్రాలనే చూశాను. ఇతరదేశాల చిత్రాలను గురించి ఎక్కువగానే చదివాను. కొన్నిటిని చూడడంకూడా జరిగింది. ఇవన్నీ నా ఆలోచనల మీద చెరగనిముద్ర వేశాయి. కాని ఒక సినీమా చూశాకనో, సినీమాల గురించి చదివాకనో నేను కావ్యరచన ఏదీ చెయ్యలేదు. ప్రధానంగా స్వదేశ, విదేశ రచయితల ప్రభావానికే నేనెక్కువగా స్పందించాను. సినీమా ప్రభావం, తదితర జీవితానుభవాలలాగే నన్ను అంతరాంతరాలలో కదిపి, సమాజాన్ని, చరిత్రనీ అర్థంచేసుకోవడానికి ఉపకరించింది. ఒక్కసారి మాత్రం కలకత్తాలో టాల్‌స్టాయ్[1] రాసిన రిసరెక్షన్ (పునర్జన్మ)ను *"We live Again"* అనే సినీమా రూపంలో చూసినతర్వాత-

"మహర్షి టాల్‌స్టాయ్ మనస్సుపూచిన
మంకెనపూతా! మాస్లోవా!"

అని ఏదో రాయాలనుకున్నాను. కాని రాయలేదు. ఈ పై పాదాలను కూడా ఎప్పుడూ కాగితం మీద పెట్టలేదు. జ్ఞాపకాన్నిబట్టి ఇప్పుడు రాస్తున్నాను. కథానాయిక మాస్లోవామీద ఒక సుదీర్ఘ కావ్యమే రాయాలనుకున్నాను. ఎందుకు రాయలేదో చెబితే ఇప్పుడందరూ నవ్వుతారనుకుంటాను. అయినా చెప్పకతప్పదు. ఆరోజుల్లో రష్యాలో టాల్‌స్టాయ్, దోస్తవిస్కీ[2] మొదలైన వారి గ్రంథాలమీద నిషేధం ఉందని ఎక్కడోచదివాను. అందుచేత నేను రాయాలనుకున్న కావ్యం రాయలేదు. అక్కడ రష్యాలో వాన కురుస్తోందని తెలిస్తే ఇక్కడ రష్యాభక్తులు గొడుగులు విప్పుతారనే వేళాకోళపు విమర్శలో కొంతయినా నిజం లేకపోలేదు.

మాక్సింగోర్కీ[3] నవలకన్నా, కథలకన్నా అతని సాహిత్య విమర్శలనే నేనెక్కువ చదివాను. మిత్రుడు చాసో-చాగంటి సోమయాజులు- తన కథల సంపుటి ఒకదానిమీద "శ్రీ శ్రీ గోర్కీ" అని రాసి నాకు బహూకరించాడు. గోర్కీ చాలాకాలం (ఆమరణాంతమూ అనుకుంటాను) రష్యన్ రచయితల సమాఖ్యకు అధ్యక్షుడు. కొత్తగా రూపురేఖలు సంతరించు కున్న సోవియట్ మానవుడిమీద బూర్జువా ప్రభావాలు ప్రసరించకుండా అతడు సుదీర్ఘమైన,

1 టాల్‌స్టాయ్ (1828–1910) రష్యన్ భాషలో రాసిన రిసరెక్షన్– పునరుజ్జీవనం నవలలో కథానాయిక మాస్లోవా. మాస్లోవా యవ్వనాన్ని ఒక సంపన్నుడు దోచుకుంటాడు. ఆనాటినుంచి ఆమె పతనమవుతుంది చివరికి ఆమెను ఒక హత్యకేసులో ముద్దాయిగా ఇరికించి, విచారించి శిక్షవేస్తారు. జడ్జిస్థానంలో కూర్చున్నవాడే ఆనాడు తనను దోచుకున్నవాడు. రిసరెక్షన్ సినిమా తీశారు.

2 దోస్తవిస్కీ. "నేరము–శిక్ష" "బ్రదర్స్ కరమజోవ్", "నోట్స్‌ఫ్రమ్ అండర్‌గ్రౌండ్" లాంటి గ్రంథాల ద్వారా రష్యన్ ఆత్మలో రాజుకున్న తుఫాన్‌లో ప్రపంచసాహిత్యాన్ని ముంచెత్తిన రచయిత.

3 మాక్సిమ్ గోర్కీ (1868– 1936) శ్రామికవర్గ రచయిత. అతని నవల 'అమ్మ' ఎందరినో కమ్యూనిస్టు లుగా మార్చింది.

సుస్పష్టమైన సాహిత్య విమర్శవ్యాసాలు రాశాడు. ఇవి నాలో మిగిలిపోయిన పాతబూజును పూర్తిగా పటాపంచలు చేశాయి. సామ్యవాద వ్యవస్థలో సాహిత్యం క్షీణముఖం పడుతుందనే ప్రగతివిరోధుల చవకబారు విమర్శలకు ఇవి చక్కని జవాబిస్తాయి.

తెలుగునాట సినీమా ప్రేక్షకులలో అధికసంఖ్యాకులు విద్యావిహీనులు కాబట్టి సినీమాపాటలు తక్షణ సుబోధకంగా ఉండాలన్న రహస్యం గ్రహించినవాడు కీ.శే.గూడవల్లి రామబ్రహ్మం.

"నల్లవాడే, గొల్లపిల్లవాడే" అనే బసవరాజు పాట పెద్ద హిట్ కావడంతో ఆయన అప్పుడే అమ్మలో వెలువడ్డ బసవరాజు గీతాల సంపుటి మీద హక్కులను కొనేశాడు. అంతవరకు సంస్కృత భూయిష్ఠమైన పాటలురాసే బలిజేపల్లి, సముద్రాల(సీ) లాంటివారు విధిగా తమ బాణీమార్చుకున్నారు. విశ్వనాథ వారు రాసిన "ఆకాశరాజు" అసందిగ్ధ పరాజయం పొందడానికిలందరి రుద్రాక్షపాకమే ముఖ్యకారణం. శ్రీనివాస రాయప్రోలు ఒక ఇంగ్లీషు పత్రికలో నా గురించి రాస్తూ "మహాప్రస్థానం"లోని నా గీతాల టెక్నిక్ సినిమాలలో నాకు బాగా డబ్బు కూర్చిపెట్టిందని వాస్తవాన్ని రాశాడు.

"ఎంకిపాటల" బాణీ నాకు నచ్చింది కాని అందలి భావకవిత్వానికి నేను బద్ధ విరోధిని. గ్రామికజనం హాయిగా, ఏ చీకూచింతా లేకుండా బతుకుతున్నారనే తప్పుడుభావాన్ని ఈ పాటలు పాఠకులలో కలిగిస్తాయి. "ఎంకిపాటలు" మొదటి ముద్రణలో అడివిబాపిరాజుగారి రేఖాచిత్రాలను కూడా ఇందువల్లనే నేను మెచ్చుకోలేకపోయాను. భావకవులు రాసే ఆకలి పాటల్లాగే ఇవికూడా ఉన్నాయని నా విమర్శ. వేదాంతం రాఘవయ్య భరతనాట్య భంగిమలతో వేసిన ఎంకి నృత్యాలకు ఇలాగే నా అసమ్మతి ప్రకటించాను, "ఆంధ్రప్రభ"లో వాటిని సమీక్షిస్తూ.

"ఎంకిపాటల" తొలిముద్రణ వెలువడిన తర్వాత చాలాకాలందాకా నండూరి సుబ్బారావుగారు మళ్ళీ కలం పట్టుకోలేదు. పిల్లలను కనడంలోనూ, ప్లీడరుగా డబ్బు ఆర్జించడంలోనూ వారి కాలమంతా వృథా అయిపోతోందని వారియెదుటనే నేనన్నాను. ఆ పిమ్మట మరికొన్ని కొత్తగీతాలతో ఇంకో "ఎంకిపాటల" సంపుటి వెలువడింది. ఇందులోని కొత్తగేయాలసలే నాకు నచ్చలేదు. ఎందుచేతనంటే వాటిలోని భాష గ్రాంథికానికి మరీ దగ్గరగా జరిగింది. "ఈమధ్య శ్రీమతి ఎంకి కాలేజీ డిగ్రీ సంపాదించినట్టుంది" అని వాటి మీద నావ్యాఖ్య.

అయినా, "తాసిల్దారు" చిత్రంలో యం.యస్.రామారావు పాడిన ఎంకిపాట మీద "వారం వారం" శీర్షికకింద నేనురాసిన వ్యాసానికి నండూరి వారు అపరిమితానంద భరితులయ్యారు. పాపం! అల్పసంతోషి ఆయన! ఎన్నో పెద్దపెద్ద యోగ్యతాపత్రాలతో పాటు "ఎంకిపాటల" రెండో సంపుటంలో నా మెప్పుదలను గురించి కూడా ఒకటి రెండు వాక్యాలను ముద్రింపించారు.

ఇంగ్లీషు సాహిత్యం మనదేశీయ భాషాకవులందరి మీదా సుస్పష్టమైన ప్రభావాన్ని ప్రసరించిందనడానికి సందేహంలేదు. ముఖ్యంగా ఇది మనందరిలోనూ "స్వేచ్ఛాప్రియత్వం" అనే సద్గుణాన్ని ప్రజ్వరిల్ల జేసింది. బానిసతనంలో మగ్గుతున్న భారతీయులందరిలోనూ స్వాతంత్ర్యభావాలకు ప్రోదికల్పించింది. ఒకవిధంగా బ్రిటిష్‌వాళ్ళు మన జాతీయ సమైక్యానికి బాగా తోడ్పడ్డారని చెప్పవచ్చు. "మనందరమూ ఇక పరాయిదేశానికి బానిసలమే" అన్న భావం ఒక్కటే ఈ సమైక్యానికి మూలం. అందుకే కవిత్వానికి ఆనాటి ప్రధానవస్తువులలో "స్వాతంత్ర్యం" ఒక ప్రముఖస్థానం వహించింది. "రాజకీయ స్వాతంత్ర్యాన్ని కోరడం ఆనాటి బ్రిటిష్ ప్రభువుల దృష్టిలో గొప్ప రాజద్రోహచర్యగా పరిగణించబడింది. వారు నిషేధించిన పాటలు, నాటకాలు అన్నీ ఈ స్వాతంత్ర్య సమరానికి సంబంధించినవే. "మా కొద్దీ తెల్లదొర తనము", "దండాలు దండాలు భారతమాత!" అనేపాటలతోబాటు విశ్వనాథవారి "ఆంధ్ర పౌరుషం" అనే గ్రంథం కూడా ఆనాటి పరిపాలకుల నిషేధాజ్ఞకు గురి అయింది. ఈ నిషేధానికి కారణం ఆ గ్రంథం హింసను ప్రబోధించడమే.

ఈ అన్నిటిలోనూ నన్ను బాగా ఆకర్షించినది కవికొండల వెంకటరావు గారి-

"ఉయ్యాలా జంపాలా! భారత నవజీవన బాలా!
పూరిత సత్యాగ్రహ శీలా! పరిభవ దుఃఖిత పాంచాలా!"

అనేపాట! పంజాబు వధలను పురస్కరించుకొని వ్రాసినపాట యిది!

నీపుట్టు వెప్పోటు? మిన్నోటు, మున్నోటు!
నీ పురుడు ఏ నెలలో? వెన్నెలల క్రొన్నెలలం!
...మొగల్ మరాఠుల్ చేమంతుల్
రసపుత్రల్ చేబంతుల్"

ఇలా నిరాఘాటంగా అది సాగిపోతుంది.

ఇవన్నీ చదువుతున్నా, అటువంటి స్వాతంత్ర్యం మీద నేనేదీ రాయలేదు. కారణం అప్పటికే నా దృష్టి "ఆర్థిక స్వాతంత్ర్యం"మీద కేంద్రీకృతం కావడం!

*ప్రజాతంత్ర 15–8–1976*

## ఐదు

సీనియర్ ఇంటర్మీడియేటు పరీక్షలు జరగడానికి ముందు అప్పుడు నా వయస్సు పదిహేడేళ్ళు. మా కాలేజీలో ఇంగ్లీషు, తెలుగు వ్యాసరచన పోటీలు జరిగాయి. ఇంగ్లీషు వ్యాసానికి హల్దిపూర్ సుమిత్రారావుకి, తెలుగు వ్యాసానికి నాకూ ప్రథమ బహుమతులు వచ్చాయి. సావిత్రీరావుకి (ఈ పేరు మా పార్థసారథి మాస్టారుగారు సుమిత్రారావుకి పెట్టింది) ఏ పుస్తకం బహుమానించారో జ్ఞాపకంలేదు గాని నాకు మాత్రం 'వేమన పద్యాల' సంపుటం లభించింది. యాదృచ్ఛికంగా జరిగిన ఈ సంఘటన భావకవిత్వపు ఊబిలో ఎక్కుకున్న నన్ను

బాగా ప్రభావితం చేసింది.

ఆ సంపుటంలో వెయ్యి పద్యాలున్నాయి (ఇంకా ఎక్కువేనేమో). ఒక్క ఆటవెలదులే కాక, కందపద్యాలూ, గీతపద్యాలూ కూడా ఉన్నాయి. అవన్నీ వేమన రచనలే అన్న భ్రమ నాకు లేదు. అతని తర్వాతివారు చేర్చినవి కూడా ఉన్నాయని నాకు తెలుసును. అంతేకాక వేమనార్యుడు పనికట్టుకుని కూర్చుని తాటాకులమీద గంటంతో తన పద్యాలు వ్రాసి ఉండడు. ఆశువుగా చెప్పేవాడనీ, వాటిని జ్ఞాపకం వుంచుకొని అతని శిష్యప్రశిష్యులు ప్రచారం చేశారనీ నాటికీ నేటికీ కూడా నా నిశ్చితాభిప్రాయం. ఏమయినా వేమ మకుటంతో ఉన్న పద్యాలన్నీ వాస్తవం వైపు నా జీవిత దృక్పథాన్ని మరలించాయి.

నాకు బహుమతిగా వచ్చిన పద్యసంపుటమంతా తప్పులతడక. (ఈ మాట ఒక్క అచ్చుతప్పులను గురించి మాత్రమే నేనసడం లేదు!) కవిత్వంలో ఎన్నిరకాల తప్పులుండకూడ దని పండితులంటారో అన్నీ ఆ సంపుటంలో ఉన్నాయి. పునరుక్తులు, వ్యాకరణ దోషాలు, ఛందస్స్ఖాలిత్యాలు ఇలాంటివే ఎన్నో! కాని ఇవేవీ వేమన మహాకవి కావడానికి అడ్డుపడలేక పోయాయి! వీటన్నిటినీ మించిన మహత్తర గుణం- అదే నిజమైన కవిత్వం- వేమన చెప్పిన పద్యాంలో ఉంది.

వేమన ప్రభావం ఒక్కసారిగా మీదపడి నన్ను హఠాత్తుగా మార్చివెయ్యలేదు. 1927 నుంచి 33 దాకా నేను సాంప్రదాయిక ఛందస్సులలోనే, ముఖ్యంగా భావకవిత్వమే రాస్తూ ఉండేవాణ్ని. గిడుగు పండితుని వ్యావహారిక భాషావాదం భావకవులందరి వలెనే నన్నుకూడా ఆకర్షించింది. అయినా వచనంలో మాత్రమే వాడుకభాష రాస్తూ పద్యాలలో శుద్ధశ్రోత్రియ మైన గ్రాంధికాన్నే ఉపయోగించేవాణ్ని. వాడుకభాషలో కవిత్వం రాయవచ్చునన్న ఊహకూడా అప్పట్లో నాకు తట్టలేదు. ''ప్రభవ'' ఖండకావ్య సంపుటిలో నేను చాలా శ్రద్ధగా అరసున్నాలనూ, బండిరాలనూ పాటించాను. మా కవితా సమితి అధ్యక్షుడు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు వీరగ్రాంధికవాది. శ్రీరంగం అనే నా ఇంటిపేరును శ్రీరంగము అని రాయమన్నారు కాని నేను రాయలేదు.

పూరిపండా అప్పలస్వామి మాత్రం తాను ఒరియానుండి తర్జుమాచేసిన ''కళాపహాడ్'' అనే నాటకానికి శాస్త్రిగారి సలహామీద ''కళాపహాడు'' అని పేరుంచాడు. (తెలుగులో డుమువులు ప్రథమావిభక్తి కాబట్టి!) 'వాటిని' అని మేము రాస్తే మా శాస్త్రిగారికి చాలా కోపం వచ్చేది. 'వానిని' అనాలనే వారాయన. గ్రాంధికభాషతో బాటు వారి ఇంకో ముద్దుబిడ్డ అచ్చ తెలుగు! ''నుడికడలి'' అనే పేరుతో ఆయన ఒక అచ్చతెలుగు నిఘంటువును చాలా పరిశ్రమించి రాశారు. ''దేవుడు'' అనే మాటకు అచ్చతెలుగులో సరియైన పదం లేదని తానే ''ఎల్లిడు'' అనే మాటను (అర్థానుస్వారసమేతంగా) సృష్టించారు. ఆయన ఎవరికి ఎప్పుడు ఉత్తరం రాయడం ప్రారంభించినా, 'శుభం' అనడానికి బదులు 'మేల్' అని రాసేవారు. ఇలా మడికట్టుకొని కూర్చోవడం ఎప్పుడూ నాకు నచ్చేదికాదు.

ఇటువంటి విషయాలలో చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రిగారి[1] దృక్పథమే నాకు సరి అయినదని పించింది. "తెలుగున కున్న వ్యాకరణదీపము చిన్నది" అని వారెప్పుడో అంగీకరించారు. అన్యదేశ్యపదాలను వాడడానికి ఎప్పుడూ వెనుకాడలేదు. "లోకుల రసనలె తాటాకులుగా" కవిత్వాన్ని లిఖించాలన్నారు. జమీందారీ యుగపు కవులుగా జీవించినా ప్రజల్లోనికి కవిత్వాన్ని తీసుకువచ్చిన ఘనత తిరుపతి వెంకటకవులకే చెందుతుంది.

ఒకసారి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు కంటివైద్యం నిమిత్తం విశాఖపట్టణం వచ్చి తన శిష్యుడైన పింగళి లక్ష్మీకాంతం గారింటిలో బసచేశారు. అప్పుడే కొత్తగా శ్రీ విక్రమదేవవర్మ గారికి జయపుర సంస్థానం ఒక పెద్ద వారసత్వపు దావాలో దఖలుపడింది. సెట్టి లక్ష్మీనరసింహం గారు జయపురం ఆస్థానకవి. వారికి చెళ్ళపిళ్ళ అంటే ఎనలేని అభిమానం. నాకు సెట్టిమాస్టారంటే ఇష్టం! ఎలాగయినా శాస్త్రిగారి చేత శతావధానం చేయించాలని మహారాజావారి తరపున ఆహ్వానించారు సెట్టిమాస్టారు. వారితో నేనూ పింగళి వారింటికి వెళ్ళాను. శాస్త్రిగారిని చూడడం అదే నాకు మొదటిసారి. శతావధానం చేసే ధారణాశక్తి తనకు లోపించిందనీ, రాజావారనుగ్రహిస్తే ఒక గంటసేపు ఉపన్యసిస్తానని వారన్నారు. (నిజానికి ఆ సాయంత్రం హవామహల్లో మూడుమొదలు ఎనిమిది గంటలదాకా అయిదు గంటల సేపు అనర్గళంగా ఉపన్యసించారు) తన కంటిజబ్బును గురించి ప్రస్తావిస్తూ "చిన్నప్పుడు చేసిన పాపాలకి ఫలితం ఇప్పుడనుభవిస్తున్నాను" అని నా వైపు చూసి చిరునవ్వుతో అన్నారు.

ఆనాటి ఉపన్యాసం నేనెన్నటికీ మరువలేను. ఉపన్యాస విషయం 'కవిత్వం'. దాన్ని ఆసరా చేసుకొని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు భూమ్యాకాశాలకు నిచ్చెనలు వేశారు. మూడులోకా లంటూ ఉంటే అన్నిటినీ చుట్టబెట్టారు. "కవిత్వం" అంటే ఏమిటో నిర్వచిస్తూ వారు తమ ఉపన్యాసాన్ని ప్రారంభించారు. "రాతిరియున్ పవల్ మరపురాని హొయల్" అనే అల్లసాని కవి పద్యపాదాన్ని ఉదహరిస్తూ ఎప్పుడూ మరపురానిదే కవిత్వం అన్నారు. ఎంత చిన్నకవి అయినా ఒక మంచి పద్యం చెప్పాడంటే అది తనకు కంఠస్థం అయిపోతుందన్నారు. ఇలా చెబుతూ తమ గురువుగారయిన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి మీద కూడా చిన్న విసురు విసిరారు. విసురు చిన్నదే గాని అది ముళ్ళదొంకంత పదునైనది.

"కొన్నిదినాల బాటే శిష్యరికం చేసినా శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారిని నా గురువుగా మన్నిక చేస్తాను" (అసలుసంగతి ఏమిటంటే శ్రీపాద-చెళ్ళపిళ్ళల మధ్య పచ్చగడ్డివేస్తే ఎప్పుడూ భగ్గుమని మండేది) "ముగ్గురు మహాకవులు చేసిన భారతాంధ్రీకరణాన్ని మా గురువుగారొక్కచేతితో చేశారు. గురువుగారు కదా అన్న భక్తితో లేని ఓపిక తెచ్చుకుని

1 చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి (1870–1951)గారు, దివాకర్ల తిరుపతిశాస్త్రి (1872–1920) గారు కలిసి తిరుపతి వెంకటకవులుగా వాసికెక్కినారు. జమీందారీ ఆస్థానాల్లో కవిత్వాన్ని ప్రచారం చేశారు. ప్రబంధాలు, కావ్యాలు రాశారు. పౌరాణిక నాటకాల్లో వీరి పాండవోద్యోగ విజయాలు మంచిపేరు పొందాయి. చాలా తేలిక మాటల్లో పద్యాలు రాశారు.

ఆదిపర్వం మొదలు స్వర్గారోహణ పర్వందాకా ఆసాంతమూ చదివాను. కాని ఏం చెయ్యను? ఇప్పుడొక్క పద్యంకూడా జ్ఞాపకంలేదు'' అన్నారు చెళ్ళపిళ్ళ.

మరపురానిది మాత్రమే కవిత్వమని అంతకుముందే నిర్దేశించడంవల్ల కృష్ణభారతంలో ఒక్క పద్యమూ స్ఫురణలో లేదనడంతో మొత్తం కావ్యాన్నే తుడిచిపెట్టేశారన్న మాట చెళ్ళపిళ్ళ!

అలా సాగిపోయింది ఆనాటి ఉపన్యాసం వ్యంగ్యంతో, హాస్యంతో, అపారమైన లోకానుభవంతో. జయపురం మహారాజావారు బహుశా చెళ్ళపిళ్ళవారిని వెయ్యినూటపదహార్లతో సత్కరించాలనుకున్నారు కాబోలు. ఇది చెళ్ళపిళ్ళవారికి సుతరామూ ఇష్టంలేదు. వారికి కావలసింది మూడువేల రూపాయలు. కాని ఆమాట ఎక్కడా వాచ్యంగా చెప్పనేలేదు. ''నాకు మూడువేలు కావాలి'' అని అడిగితే ఇవ్వనంటారా జయపురాధీశులు? అయినా అలా సూటిగా అడగలేదు చెళ్ళపిళ్ళకవి.

ఆ మాటా ఈ మాటా చెబుతూ కడియం గ్రామంలో అక్కడా ఇక్కడా రెండుచోట్ల విడివిడిగా తనకు రెండు పొలాలున్నాయన్నారు. అంతతో ఆ ప్రసక్తి వదలిపెట్టి మరేవో మరేవో చెబుతూ మళ్ళీ తన పొలాల సంగతి ఎత్తుకొని, ఆ రెండిటిమధ్యా ఉన్న భూమి చాలా చవకలో అమ్మకానికి వచ్చిందనీ, దాన్ని కొంటే తనది మొత్తం ఒకే భూఖండంగా ఉంటుందనీ అన్నారు చెళ్ళపిళ్ళ.

తర్వాత మరో అరగంట గడిచింది. ప్రసంగవశాత్తూ అమ్మకానికి వచ్చిన భూమిగురించి చెబుతూ ''దాని వెల మూడువేల రూపాయలంటున్నాడు ఖామందు'' అన్నాడు చెళ్ళపిళ్ళ.

ఆ విధంగా జయపురం సంస్థానాధీశుని వద్దనుంచి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు మూడు వేల రూపాయలు వసూలుచేశారు. కవిగా బతకనేర్చిన వాడాయన!

*ప్రజాతంత్ర 29–8–1976*

## ఆరు

ఏ కళాకారుడైనా ''సవరించే నియమానికి'' విధేయంగా ఉంటాడన్నాడు ఒక గొప్ప ఆర్టిస్టు. ''నిజమైన కళాకారుడు ఆ నియమాన్నే ప్రశ్నిస్తా''డన్నాడు అంతకన్నా గొప్ప ఆర్టిస్టు.

గొప్ప ఆర్టిస్టు బ్రాక్ *(Braque)*. అంత కన్నగొప్పఆర్టిస్టు పికాసో[1] *(Picasso)*. ఇద్దరి మాటా కాదనలేం. అయినా నియమోల్లంఘనం అంటే (కనీసం సాహిత్యంలో) ఏమిటో కాద్దోగొప్పో తెలిసిన నాకేమనిపిస్తుందంటే నిజమైన కళాకారుని నియమధిక్కారం లోనే ఒకానొక ''సవరించే నియమానికి'' కట్టుబడి ఉండడం కనిపిస్తుందని!

1 పికాసో (1881–1973) ప్రపంచ ప్రసిద్ధ చిత్రకారుడు. కళలో గొప్ప ప్రయోగవాది. మానవ జాతికి కమ్యూనిజమే వసంతం అన్నాడు. స్పెయిన్ అంతర్యుద్ధంలో గెర్నికా అనే చిత్రంగీసి చైతన్యం రగిలించాడు. జార్జి బ్రాక్‌తో కలసి 1920 తరవాత కళారంగంలో క్యూబిస్టు ఉద్యమం మొదలెట్టాడు. క్యూబిజం కవితారంగంలోకి కూడా ప్రవేశించింది. వాస్తవికత నుంచి కళకు స్వతంత్రం కావాలని క్యూబిజం చెబుతుంది.

నా ''కవితా! ఓ కవితా'' అనే వచనగీతంలో ఎన్నెన్నో ఛందోరీతులున్నాయని సి.నారాయణరెడ్డి (తన డాక్టరేట్ థీసిస్‌లో కాబోలు) సోదాహరణంగా నిరూపించాడు.

మా పెద్దబావ మూలావీరభద్రరావు భార్య రోజాపూజచేస్తూ, ''ఓ వాణి నవోజా, సోజారోజా'' (ఇవే మాటలు కావుగాని ఇదే గతిలో నడిచేవి) అని పాడుతూ ఉంటే ఆ రిథమ్ నా ''కవితా! ఓ కవితా''కు ప్రోద్బలకారణమైంది! బ్రాక్, పికాసో లిద్దరూ క్యూబిజం సృజనకు మూలపురుషులు. ఈడిత్‌సిట్వెల్[2] రచనల్ని కవిత్వంలో క్యూబిజం అంటారు. సిట్వెల్ కవిత్వంతో నా తొలిపరిచయం ''త్రివేణి''లో యం.చలపతిరావుగారు[3] వ్రాసిన ఇంగ్లీషు వ్యాసంద్వారా!

సెడ్ ఇల్ మాగ్నిఫికో
ఫుల్లింగ్ ఎ ఫికో
విత్ ఎ స్టాక్కాడో
అండ్ ఎ గంబాడో
మేకింగ్ ఎ రై
ఫేస్: ''దిస్ కొరేసియస్
రౌండ్ ఆర్కిడేసియస్
లేసియస్ పొరేసియస్
ఫ్రూట్ ఇజ్ ఎ లై!

ఇది నేను చదివి ఉండకపోతే-

తురాయి కంటె- ఆ
కురాయికంటె- కీ
చురాయి కంటె- హిమాం
శురాయి గొప్పవాడు!

అని రాసివుండకపోదును.

యం.చలపతిరావుగారిది మా విశాఖపట్టణమే అని తెలిసి ఆయన్ని కలుసుకోవడానికి వెళ్లాను. అప్పుడే నేనురాస్తున్న సింగిల్‌పన్నా గీతాల్ని చదివి వినిపించాను. ఆయన నాకెంతో ప్రోత్సాహం ఇచ్చారు.

''త్రివేణి''లోనే చలపతిరావుగారు యెంకిపాటల మీద ఇంగ్లీషులో సుదీర్ఘమైన వ్యాసం

2 ఈడిత్ సిట్వెల్ (1887–1964) ఆంగ్ల కవయిత్రి. ఆమె మొదటి గేయం డ్రాన్లుసన్. మదర్ అండ్ అదర్‌పోయమ్స్‌అని 1915లో ఆమె మొదటి కవితాసంపుటి వెలువడింది. ఆమె రాసిన వచనరచనలు పేరుపొందలేదు.

3 మానికొండ చలపతిరావు M.C. (1909–1983) ప్రఖ్యాత పాత్రికేయుడు. జవహర్‌లాల్ నెహ్రూగారి కుడిభుజం. నెహ్రూగారి సొంత ఆంగ్ల దినపత్రిక నేషనల్ హెరాల్డుకి 40 ఏళ్ళపాటు సంపాదకుడు
త్రివేణి (ఆంగ్ల ద్వైమాస పత్రిక)లో ఆంగ్ల సాహిత్యంమీద వ్యాసాలు రాస్తూండేవారు. ఎంకి పాటలమీద 1930లోనూ, *Modernists, Imagists & Futurists* అనే వ్యాసం 1931లోనూ రాశారు

రాశారు. చాలా యెంకిపాటలను తర్జుమాచేసి తన వ్యాసంలో ఉదహరించారు. రాబర్ట్ బర్న్స్ కవి హైలండ్‌మేరీతో యెంకికి సారూప్యం ఉందని పేర్కొన్నారు. నా గీతాలను కూడా ఇంగ్లీషులో తర్జుమా చెయ్యండని అడగడానికి వారి దగ్గరకు వెళుతుండేవాడినేమో! కాని ఎప్పుడూ అలా అడగనేలేదు. ఇందుకు ధైర్యం చాలకపోవడంకంటె నిర్లక్ష్యమే కారణమను కుంటాను.

అప్పటికే కృష్ణశాస్త్రిగారి గీతాలను హరీంద్రనాథ్ చటోపాధ్యాయ ఇంగ్లీషులోనికి అనువదించడం, వాటిని శాస్త్రిగారెక్కడో పారవేసుకోవడం కూడా జరిగిపోయాయి.

పురిపండా[4] రాసిన కొన్ని గీతాలు అతని కోరికమీద ఇంగ్లీషు భాషలోనికి నేననువదించాను. వాటిని "సౌదామిని" అనే పేరిట గ్రంథరూపంలో అతను ప్రచురించాడు. అనువాదంతో బాటు ముందుమాట కూడా నేనేరాశాను. తన కవిత్వానికి నోబెల్ బహుమానం వస్తుందని ఎందుకో పురిపండాకి గట్టినమ్మకం. "హఠాత్తుగా ఒకరోజు నాకు నోబెల్‌ప్రైజ్ ఇచ్చారన్న వార్త చదివితే నువ్వు అసూయ చెందుతావా?" అని నన్ను పురిపండా ప్రశ్నించాడు. అసూయ చెందనుగాని బహుమతి ప్రదాతలమీద తప్పకుండా జాలి చెందుతానని నేను జవాబిచ్చాను.

చాలాకాలందాకా కవితాసమితి కార్యదర్శిగా, ఇప్పుడు అధ్యక్షుడుగా పురిపండా అప్పలస్వామి తెలుగుభాషకు చేసిన సేవ అద్వితీయమైనది. అంతేకాక, పనులు చకచకా జరిపించడంలో అతను చూపించే కార్యదీక్ష అకుంఠితమైనది. ఒకసారి కవితాసమితి వార్షికోత్సవ సందర్భంలో అఖిలాంధ్ర కవుల ఛాయాచిత్ర ప్రదర్శనం ఏర్పాటు చెయ్యాలనే ఉద్దేశం అతనికి కలిగింది. ఉన్నవ్యవధి చాలా తక్కువ. కాని ఆ కొద్దిరోజుల్లోనే పురిపండా చాలామందికి ఉత్తరాలు రాసీ, పత్రికాప్రకటనలు చేసీ ప్రదర్శనను విజయవంతం చేశాడు. అయిదారు వందలకు పైగా ఛాయాచిత్రాలు వచ్చాయి. తెలుగు దేశంలో ఇంతమంది కవులున్నందుకు మాకెవ్వరికీ ఆశ్చర్యం కలుగలేదు.

ఆ ప్రదర్శనానికి ప్రారంభకుడుగా మల్లంపల్లి సోమశేఖరశర్మ గారిని మద్రాసునుంచి ఆహ్వానించాము. ఆయన సంతోషపూర్వకంగా మా ఆహ్వానాన్ని అంగీకరించారు.

మరోసారి రవీంద్రనాథ ఠాకూరు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఉపన్యసించడానికి వచ్చినప్పుడు మా కవితాసమితి సభ్యులం ఆయనను సన్మానించాం. మిత్రుడు కాళూరి వెంకట నరసింగరావు ఇంగ్లీషులో ఒక పెద్ద సన్మానపత్రం సంసిద్ధం చేశాడు. *Towering high as the Himalayas* అని ప్రారంభించి.

ఇది మా అధ్యక్షులైన కవిగారికి (మారేపల్లి రామచంద్రశాస్త్రిగారిని విశాఖపట్టణంలో అంతా కవిగారనే అంటారు) ఎంతమాత్రమూ నచ్చలేదు. తానే అచ్చ తెలుగులో సన్మానపత్రం

*4 పురిపండా అప్పలస్వామిగారు (1904–1982) వీర వ్యావహారిక భాషావాది. గిడుగువట్ల అపారమైన గౌరవం భారతం, రామాయణం, భాగవతం వాడుక భాషల్లో రాశారు. పురిపండా ఖండకావ్యం పులిపంజా 1976లో వెలువడింది.*

తయారుచేశారు. అది తానే సభలో స్వయంగా చదివారు. తెలుగుతెలియని రవీంద్రనాథునికి గాని, ఎంతోకొంత తెలుగుతెలిసిన మాకుగాని కవిగారు రాసిందేమీ బోధపడలేదంటే అది వేరేసంగతి.

*"This Kavi has insulted Tagore"* అంటూమండిపడ్డాడు కాళూరి. నిండు సభలోకాదు, లోపాయికారీగా! సమితి నుండి తన సభ్యత్వానికి రాజీనామా ఇచ్చేస్తానన్నాడు. మిక్కిలి చాకచక్యంతో పురిపండా అతన్ని శాంతింపజేశాడు.

కలంపేరుతో నేను నా కవిత్వాన్నెప్పుడూ ప్రకటించలేదు. కానీ ఒకసారి "వైశాఖి" అనే పేరుతో భారతికి ఏదైనా రచన పంపించాలనుకున్నాను. ఈమాట పురిపండాతో చెప్పానోలేదో వెంటనే అతను సిద్ధంగావున్న తన ఖండకావ్యం ఒకదాన్ని "వైశాఖి" అనే కలంపేరుతో భారతికి పంపించేశాడు. మర్నాడు ఈ సంగతి నాతోచెప్పి "పేరుబాగుంది కాబట్టి ముందుగా నీ అనుమతి తీసుకోకుండా ఈ పనిచేశాను. నువ్వు మరేమీ అనుకోవని నాకు తెలుసు" అన్నాడు. నేనేమీ అనుకోలేదు. కాని ఇకమీద "వైశాఖి" అనే పేరు ఎవరూ వాడుకోకూడదనీ, మరు సంవత్సరం కవితాసమితి తరఫున ప్రకటించబోయే "వార్షికసంచిక" కు ఆపేరు పెట్టాలనీ నేను సూచించాను. అలాగే "వైశాఖి" అనే పేరుతో మా వార్షిక సంచిక వెలువడింది. దానిమీద బసవ రాజు అప్పారావుగారి విపులమైన రివ్యూ మా కందరికీ చాలా గర్వకారణమయింది.

అందరిమీదా పేరుపేరునా వరుసలతో వేడివేడి విసుర్లు విసిరినా మొత్తంగా మా ప్రయ త్నాన్ని బసవరాజుగారు బాగా మెచ్చుకున్నారు. ఆ సంచికలోనే కృష్ణశాస్త్రిగారి "ప్రవాసం: ఊర్వశి" మీద జనార్దనరావు రాసిన విమర్శ వ్యాసం ఉంది. "నీ నాట్యమ్ములు నామనస్థలినె కానిమ్మోయి" అని నేను వ్రాసిన భావగీతం ఉంది. వడ్డాది సుబ్బారాయుడు ("భక్త చింతామణి" రచయిత) గారు కొన్నిపద్యాలలో చేసిన దైవప్రార్థన ఉంది.

ఈ ఆఖరి రచనమీద వ్యాఖ్యానిస్తూ బసవరాజు అప్పారావుగారు "తన వృద్ధాప్యంలో వడ్డాది సుబ్బారాయుడు ఆ దైవప్రార్థన ఏదో మనస్సులోనే చేసుకోకూడదూ, పద్యాలు రాసి మనల్ని బాధపెట్టకపోతే!" అని అర్థంవచ్చేటట్టుగా రాశారు.

విశాఖపట్టణంలో ఇంటర్మీడియేటు పూర్తిచేసిన తర్వాత బి.ఎ చదువుకు మా నాన్నగారు మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో ప్రవేశపెట్టారు. అంతకుముందే విశాఖపట్టణంనుంచి, ప్రెసిడెన్సీ కాలేజీలో బి.ఎ(ఆనర్సు) సీటుకు అప్లికేషన్ పెట్టాను, ఆరోజుల్లో జస్టిస్ పార్టీ ప్రముఖుల్లో ఒకాయన సిఫారసుతో సహా! కాని ఎందువల్లనో నాకా సీటురాలేదు! మద్రాసులో చద లను కుంటున్న నాకిది చాలా నిరుత్సాహం కలిగించింది. కాని ఎందుకైనా మంచిదని మా నాన్నగారు క్రిస్టియన్ కాలేజి ప్రిన్సిపాల్‌ను ఆ మధ్యాహ్నం కలుసుకున్నారట. తానూ ఒకప్పుడు మీ కాలేజీ విద్యార్థినే అని చిన్న అబద్ధం ఆడారట. (మా నాన్నగారు పచ్చయ్యప్పాస్‌లో చదివారు.)

పాత విద్యార్థినని చెప్పగానే మెస్టన్ దొరగారు చాలా ఆనందించి, ఆనర్సులో సీట్లు లేవనీ, మీ అబ్బాయికి బి.ఎలో సీటిస్తాననీ అన్నారట. మా నాన్నగారు వెంటనే అంగీకరించారు.

నన్ను కాలేజీలో చేర్పించి ఫస్ట్ స్టూడెంట్స్ హోమ్ అనే హాస్టల్‌లో డబ్బుకట్టి, మా నాన్నగారు విశాఖపట్టణం వెళ్ళిపోయారు.

ఒక మహానగరంలో ఒంటరిగా ఉండడం అదే నాకు మొదటిసారి. అంతా ఏదో వింతగా కనిపించేది. మరో ప్రపంచం అనే ఊహ అప్పుడే నా మనస్సులో ప్రవేశించిందేమో! కాని ఆ 1928లో నా 18వ ఏట ప్రభవ సం.లో నేను రాసిన పద్యాలన్నీ పోగుచేసి "ప్రభవ" అనే పేరుతో ప్రకటించాను. ముద్రణకు కావలసిన డబ్బంతా మా నాన్నగారే ఇచ్చారు. పురిపండా ముద్రణ బాధ్యత పూర్తిగా తీసుకోడమేగాక "ముందుమాట" కూడా తానే రాశాడు. రాజమహేంద్రవరంలోని సరస్వతీ పవర్ ప్రెస్‌లో ఈ పుస్తకం అచ్చయ్యింది. "కవితా సమితి" వారి గ్రంథాలలో ఒకటిగా ప్రకాశితమయింది.

దీన్ని "భారతి"లో కొంపెల్ల జనార్దనరావు రివ్యూ చేశాడు. "ఇందులో సార్థకత కంటె సమాస తత్పరత హెచ్చుగా గోచరిస్తున్నదని" మెత్త మెత్తగా మందలించాడు. అప్పటినుంచి నాలో సమాసాల మీది మోజు సన్నగిల్లిపోయింది.

*ప్రజాతంత్ర 5–9–1976*

## ఏడు

"వివాహో విద్యానాశాయ" అనే సంస్కృత సూక్తి నా విషయంలో విఫలమయింది. పెళ్ళి అయి వారంరోజులు తిరగకముందే నేను స్కూలుఫైనలు పరీక్షకు కూర్చున్నాను. ఉత్తీర్ణుణ్ని అయ్యాను. అప్పుడు నా వయస్సు 15 ఏళ్ళు. శ్రీమతి వెంకటరమణమ్మ వయస్సు తొమ్మిదేళ్ళు. (అవి బాల్యవివాహపు రోజులు! సంవత్సరం 1925) బహుశా పదేళ్ళేమో? ఎంచేతనంటే మా ఆవిడ ఎప్పుడూ తాను నాకంటె అయిదేళ్ళు చిన్నదాన్నని ప్రకటిస్తుండేది. నలభైయేళ్ళకే ఆమె జుత్తు పండిపోవడమూ, నేనందరికీ ఆమె కొడుకులాగా కనిపించడమూ ఇదివరలో రాశాను.

ఇంటర్మీడియెట్ పరీక్షకు కూర్చున్నప్పుడు మా శ్రీమతి పెద్దమనిషయింది. ఒక్క ఇంట్లోనే మసలుతున్నందున నేనేం అఘాయిత్యం తెస్తానో అని మా వాళ్ళు కార్యంచేసేశారు. ఆ శోభనపు రోజుల్లో మూడుపగళ్ళు పరీక్షలకు కూర్చున్నాను. ఉత్తీర్ణుణ్నయ్యాను. వేసవి సెలవులయిపోగానే మద్రాసులో బి.ఎ చదువుకురావడం జరిగింది. ఆ వేసవి రోజుల్లోనే నేను కొత్తగా కాపురానికి వచ్చిన భార్య సంగతి మరచిపోయి కృష్ణశాస్త్రిగారి వెంట తిరిగాను. అప్పటికీ ఇప్పటికీ భార్యకన్నా కవిత్వమే నాకు ఎక్కువ ఆకర్షణీయం.

వాణి నా రాణి[1] అని ఒకపాతకవి అన్నాడు.

Dylan Thomas[2] చనిపోయినప్పుడు అతనికన్న వయస్సులో కొంచెం చిన్నవాడయిన

1 పిల్లలమర్రి పిన వీరభద్రుడు (1450– 1480) వాణి నారాణి అన్నాడు. పరాభి 'కయిత నాదయిత' అన్నాడు 1955 ముందే. పుస్తకం మాత్రం 1977లో వెలువడింది.

2 *DYLAN THOMAS* (1914–1953) ఆంగ్లకవి. చిన్న వయసులోనే మంచి కవిత్వం రాశాడు. *Under the MilkWood Tree* అనే నాటకం కూడా రాశాడు.

*George Barker* [3] ఇలా రాశాడు:

*"For many years, since we were both young, our names have intermittently been put together, his, as it should have been, Foremost, for he goes before me in poems as he does in dying. We managed once to take each other's overcoats as we left a drinking party- and I knew whose coat I had got, from the dog eared Penjuin I found in the pocket with a line of unmistakable poetry written on the back.*

*'The lovers scorched to ashes on the green park grass'*

ఆ తర్వాత బార్కర్ ఇలారాశాడు. (తెనిగింపునాది)

"ఒక గీతం తన కవిత్వమే అనీ, ఏదో ఆ రాత్రికి తెచ్చుకున్న ముండగానీ, ఉంచుకున్నవాడి ఊర్వశిగాని కాదనీ, ఆ గీతంతో వీధిలో నడవడం ఎలాగో అతడు (డిలన్) చూపించాడు. కవితాశిల్పాన్ని అతడు రిజిస్ట్రీ ఆఫీసులోగాని, లైబ్రరీలోగాని, లెక్చర్‌రూమ్‌లో గాని కాక ఒక చర్చిలో పెళ్ళిచేసుకున్నాడు."

*[He showed how to walk along the street with a poem as though it were a wife and not a whore for the night or a keptman's angel. He had married the art of poetry not in a registry office or a library or a lecture room, but in a church]*

నేనుమాత్రం నా కవిత్వాన్ని చేసుకున్న భార్యగాకాని, ఉంచుకున్న ముండగా గాని గాక, నన్ను కన్నతల్లిగానే ఎప్పుడూ భావించాను.

"ఓహో! ఓ రసధుని! మణిఖని! జననీ! కవితా! ఓ కవితా!"

నా ఏణ్ణర్థం వయస్సులో చనిపోయిన మా అమ్మను నేనెప్పుడూ చూడలేదు. ఆవిడకు వైద్యం నిమిత్తం మద్రాసుకు తీసుకువచ్చినప్పుడు మొదటిసారిగా మద్రాసు పట్టణాన్ని చేరాను. అప్పుడు మేము బసచేసిన ఇంటిలోని కొళాయి తిప్పుకొని ఆ నీళ్ళలో తడుస్తూ ఆనందించడం ఒక్కటే నాకు జ్ఞాపకం. ఆ రోజుల్లో విశాఖపట్టణంలో సొంతయిళ్లకు కూడా పైపులులేవు. మా ఇంటిపెరట్లో ఒక బావివుండేది. దానిపక్కనే మరుగుదొడ్డి వుండేది. అందులోకి వెళ్ళేటప్పుడు నన్ను మా అమ్మ తనతోనే తీసుకువెళ్ళేది. అక్కడ ఉన్నంతసేపూ ఎదురు గోడమీద ఆవిడ ఉమ్ముతూ ఉండడం ఒక్కటిమాత్రమే నాకు మా అమ్మని గురించిన జ్ఞాపకం.

అందుకేకాబోలు నా కవిత్వంలో తల్లితనపు పవిత్రతతో బాటు కక్కసులోని కల్మషం కూడా ఉందనుకుంటాను.

*3 జార్జి బార్కర్ (1913— ) ఆంగ్ల రచయిత. అతని థర్టీ ప్రిలిమినరీ పోయమ్సు 1933లో వెలువడ్డాయి. స్పెయిన్ అంతర్యుద్ధం మీద ఎంతో ఆవేశంతో కెలామి టెర్రర్ అనే పెద్ద గేయం రాశాడు—1937లో.*

*శ్రీశ్రీ 1980లో ఇంగ్లండ్ వెళ్లినప్పుడు బార్కర్‌ని కలుసుకున్నాడు. కెలామి టెర్రర్ గేయం మొదటి నుంచి చివరిదాకా శ్రీశ్రీ అప్పజెప్పాడు. వచ్చేముందు చదువుకుని వచ్చారా అని బార్కర్ అడిగితే 40 ఏళ్ల క్రితం చదివింది గుర్తుందన్నాడు శ్రీశ్రీ.*

అయినా నేనెప్పుడూ మాతృత్వాన్ని సెంటిమెంటలైజ్ చేస్తూ కవిత్వం రాయలేదు. నాయని సుబ్బారావుగారి[4] **మాతృగీతాలు** నన్ను గొప్పగా ఆకర్షించకపోలేదు.

"ఎవ్వడా క్రూర కర్మఠుడెవ్వడు? నీల
జలద నిర్ముక్త, శైశిర శర్వరీ ప్ర
శాంత మలవాటు పడిన నిశాంతమందు
అకట! నట్టింటి దీపము నార్పినాడు?"

అయినా నేను నా "ప్రభవ" సంపుటాన్ని తల్లిగారికికాక •సవతి తల్లిగారికే అంకితం ఇచ్చాను.

ఉద్రేకాలను రెచ్చగొట్టడం ఒకటే కవితాధర్మం కాదు. ఈపని చైనాలో పోరాటం జరిగిన రోజుల్లో చాలామంది కవులు చేశారు. మనిషి ఆలోచించే జంతువుకాబట్టి అతని కవిత కూడా ఆలోచనలను రేకెత్తించాలంటాన్నేను. ఈనాడు చైనాతో మనకు మామూలు దౌత్య సంబంధాలు ఏర్పడ్డాయి కాబట్టి ఇప్పుడు స్తిమితంగా మనం ఆలోచించవలసిన అగత్యం ఎంతయినావుంది.

కవిత్వం ఒక సైన్సుకాకపోవచ్చుగాని సైన్సు కవిత్వానికెంతయినా బలం చేకూర్చుతుంది. డిలాన్ థామస్ మరణం సందర్భంలోనే ఇంకో రచయిత ఇలారాశాడు;

*"How delightful it would be if we always recognised genius when we met it, and turned blue or red, like litmus paper."*

"ప్రతిభ మనముందు కనిపించినప్పుడల్లా మనం దాన్ని గుర్తించగలిగి, లిట్మస్ కాగితంలాగ నీలంగానో, ఎర్రగానో మారగలిగితే ఎంత ఆనందకరంగా ఉండేది!" అని.

లిట్మస్ టెస్ట్ లాగ కాకపోయినా, కవిత్వాన్ని తక్షణమే గుర్తించగలిగిన ఒక మంచి చిట్కాను ఒకానొక విమర్శకుడు సూచించాడు. "నిజమైన కవిత్వాన్ని చదువుతూవుంటే నా వెన్నెముకలో విద్యుత్తులు ప్రసరిస్తాయి. కవిత్వం కానిదయితే పొత్తికడుపులో బాధపుట్టి, వాంతిచేసుకునే పర్యంతమవుతుం"దన్నాడతడు. దేన్నయినా సహృదయతతో స్వీకరించే అలవాటున్నవాణ్ని కాబట్టి నాకీ రెండవ అనుభవం ఎప్పుడూ కలుగలేదుకాని లెక్కలేనన్ని సార్లు మంచి కవిత్వాన్ని చదువుతూవుంటే నా వెన్నుపూసలో విద్యుత్ప్రసారాలు జరిగాయి.

మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో నేను స్కాటిష్ ప్రొఫెసర్లవద్ద ఇంగ్లీషు సాహిత్యం అభ్యసించాను. బి.ఎ లో నా గ్రూపు సబ్జెక్టులు జూఆలజీ, బోటనీ. స్కూల్ఫైనల్లో మాథమాటిక్స్, ఫిజిక్స్‌తో ప్రారంభించి, ఇంటర్మీడియెట్‌లో ఫిజిక్స్, కెమిస్ట్రీ, జూఆలజీ తీసుకున్నాను. ఇంటర్మీడియేట్ జూఆలజీలో, బోటనీ, ఫిజియాలజీ కూడా ఉండేవి. అదే నా అభిమానపాత్రం కావడానికి విశాఖకాలేజీలో రామయ్యార్ అనే లెక్చరర్ ముఖ్యకారణం. ఆయనదగ్గర ఎప్పుడూ కాకపోయినా తరచు ఈ సబ్జెక్టులలో ఫస్టుమార్కులు తెచ్చుకునే వాణ్ని. ఆరోజుల్లో మా ఊరికి

[4] నాయని సుబ్బారావు (1899– 1979)గారు తొలి భావకవుల్లోనివారు. సౌభద్రుని ప్రణయయాత్ర వీరికి చాలా కీర్తితెచ్చింది.

దగ్గరలో ఉన్న విజయనగరంలోని మహారాజావారి కాలేజీలో జూఆలజీ, బోటనీలు లేనందువలన నేను మద్రాసులో చదువుతానని మా నాన్న దగ్గర పట్టుబట్టాను. ప్రెసిడెన్సీ కాలేజీలో నాకు సీటురాకపోవడంతో మా నాన్నగారు ''పోనీ కాకినాడలో చదవకూడదా?'' అని అడిగేరు. ''అదీ మనవూరికి దూరమేకదా'' అన్నాన్నేను. నిజానికి మా నాన్నగారికి నన్ను మద్రాస్‌లో చదివించడమే ఇష్టం.

అన్నిగ్రూపులవాళ్ళం వెరసి సుమారు రెండువందల మందిమి ఇంగ్లీషు క్లాసులో కలిసే వాళ్లం. రాష్ట్రం మూలమూలలనుండి వచ్చిన తమిళులు, కన్నడిగులు, మళయాళీలు ఇంత మందిలో నాకు మొదటి మూడునెలల పరీక్షలో షేక్స్పియర్‌లో ఫస్ట్‌మార్కు వచ్చింది. ఇది నాకే నమ్మరానంత ఆశ్చర్యం కలిగించింది.

ప్రొఫెసర్ మేక్‌ఫేల్ ముందుగా నాపేరు చదివేసరికి గ్యాలరీ అంతా కరతాళ ధ్వనులతో నిండిపోయింది. ఎక్కడో నాచోటులో కూర్చున్న నన్నులేచి నిలబడాలని విద్యార్థులంతా గొడవ చేశారు. ఎంతో ఆత్మధైర్యంతో నిలబడినవాడినల్లా తోటి విద్యార్థుల వికారపు వేళాకోళపు ధ్వనులతో కాస్తంత స్వరూపజ్ఞానం కలిగి ''ఆ మహాచెడ్డ ఊడబొడిచావుగాని, ఇక కూర్చోవోయ్'' అని అందరూ అన్నట్లనిపించి, మళ్ళీ యధారీతిని కూర్చున్నాను.

ఏమయినా మొదటి పరీక్షలోనే, అందులోకీ షేక్స్పియర్‌లో అంతమందిని మించినందుకు నన్నునేనే మనస్సులో ఎంతగానో అభినందించుకున్నాను.

మాకు 19వ శతాబ్దపు ఇంగ్లీషు వచనం చెప్పే ప్రొఫెసర్ అలెగ్జాండర్ జె. బాయిడ్. (ఆయన తర్వాత క్రిస్టియన్ కాలేజీకి ప్రిన్సిపాల్ అయ్యారు) ప్రొఫెసర్ బాయిడ్ వద్ద నూటికి 40 మార్కులు తెచ్చుకోవడం అంటే చాలా గొప్పసంగతే. నా కెప్పుడూ 38, 39 మార్కులే వచ్చేవి. ఒక్కమారు కాబోలు 40 వచ్చాయి. 41 ఎప్పుడూ రాలేదు.

ఇరవై సంవత్సరాల తర్వాత ఆయనా, నేనూ హైద్రాబాదునుంచి విమానంలో మద్రాసుకి వస్తున్నప్పుడు ''హల్లో, మిస్టర్ శ్రీనివాసరావ్!'' అంటూ నన్ను గుర్తించి నా పక్కనే వచ్చి కూర్చున్నారు.

వారిదంత జ్ఞాపకశక్తి! తనదగ్గర చదువుకున్న వాళ్ళంటే అంత అభిమానం!

సున్నితమైన హాస్యంకూడా వారిలో ఒక సుగుణం. ఇందుకో ఉదాహరణ...

*ప్రజాతంత్ర 12–9–1976*

## ఎనిమిది

**జూ**నియర్ బి.ఎ తరగతిలో రెండువందలకు పైగా విద్యార్థులం ఉండేవాళ్ళమని చెప్పేనుకదూ? ప్రతి ఉదయం మొదటిపీరీడు ఇంగ్లీషు లెక్చరర్లు రోల్‌కాల్ తీసుకుంటూ ఉంటారు. ఎవరిపేరు పిలిచినప్పుడు వారు నిలబడడం, మొగం చూపించి కూర్చోవడం. ఈ పేర్లు చదువుతున్నంతసేపూ గ్యాలరీ మా జోళ్ళకాళ్ళ చప్పుడుతో అదిరిపోయేది. పేర్లు పిలవ

డం పూర్తి అయ్యేదాకా ప్రొఫెసర్లు మా అల్లరిని సహించేవాళ్ళు. తర్వాత మేమే సద్దుమణిగి పోయేవాళ్ళం.

ఒక ఉదయం ప్రొఫెసర్ అలెగ్జాండర్ జె. బాయిడ్ రోల్‌కాల్ తీసుకుంటున్నారు. మేము రోజూకన్నా ఎక్కువ గొడవచేస్తున్నాము. గ్యాలరీ బల్లలమీద జోళ్ళ చప్పుడుతోబాటు పిల్లి అరుపులూ, కుక్క అరుపులూ, మేక అరుపులూ ఎవరికితోచిన చప్పుడు వాళ్ళం చేస్తున్నాము. అదంతా చివరకంటూ మా ప్రొఫెసర్ సహించాడు.

రోల్‌కాల్ పూర్తి అయింది. మా అరుపులూ సాగిపోతూనేవున్నాయి.

''సైలెన్స్'' అన్నాడాయన. ఎవరూ ఊరుకోలేదు. ''క్వయిట్ ప్లీజ్, జెంటిల్మెన్' అన్నాడు. మా అరుపులింకా ఎక్కువయ్యాయి.

అప్పుడాయన తన చేతిలోవున్న పుస్తకాన్నిమూసి టేబిల్‌మీద పడవేసి, ఒకానొక హేళనతో కూడిన చిరునవ్వుతో–

*"Now I am glad you are speaking in your own mother tongue."*

(''మీరు మీ మాతృభాషలో మాట్లాడుతున్నందుకు నేనిప్పుడు సంతోషిస్తున్నాను'') అన్నారు!

అందరం ఒక్కసారి బిక్కచచ్చి కిక్కురుమనకుండా కూర్చున్నాము. ఏమీ జరగనట్టుగానే పాఠం చెప్పడాని కుపక్రమించారు మా ప్రొఫెసర్‌గారు!

ఇటువంటి ఉదాహరణలను ఎన్నయినా పేర్కొనవచ్చును. కాని, ఒకటిమాత్రం చెప్పాలి. నా కవిత్వానికీ, కాలేజీ జీవితానికి ప్రత్యక్ష సంబంధంలేదు. నేను సైన్సు విద్యార్థిని. బి.ఏ ప్యాసయిన తర్వాత కూడా లక్నో యూనివర్సిటీలో యం.యస్సీ., యల్.యల్.బి చదవాలను కున్నాను. కాని అప్పటికే మా ఆర్థికపరిస్థితి క్షీణించిపోతోంది. ఆ మాత్రం తెలుసుకోలేనంత అజ్ఞానిని కానునేను. కాని, మా నాన్నగారు నన్ను లక్నోకి పంపించాలనే అనుకున్నారు. నేనే విరమించుకున్నాను.

ఇరవైనుంచి ముప్ఫయ్యేళ్ళవయస్సు దాకా అనగా 1930 నుంచి 40 వరకు నేను తీవ్రమైన ఆర్థికక్షోభా, మానసికబాధా అనుభవించాను. ఆ దశాబ్దంలోనే మహాప్రస్థాన గీతాలన్నీ ఇంచుమించు పూర్తిగా రాశాను. ''గర్జించు రష్యా'' అనే రచనా, మరో రెండుమూడు ఖండికలూ 1940 తర్వాత రాయడం జరిగింది.

టైఫాయిడు జ్వరంతోబాటు భావకవిత్వం జబ్బుకూడా వదిలిపోయింది. ఆఖరిసారి అర సున్నాలకి, బండిరాలకీ గుడ్‌బై కొట్టేశాను. మాత్రా ఛందస్సులో వచన గీతాలు తప్ప గణబద్ధ ఛందస్సుల జోలికి పోలేదు. అయితే, కొన్నికొన్ని సినీమాలలో పద్యాలు రాయవలసి వచ్చేది. అప్పుడుమాత్రం అన్ని నియమాలనూ విధిగా పాటించేవాణ్ని.

''హృదయమిదే చలించెను క
దే! సఖిరూపము శక్రచాపమో.

వదనము వారిజాతమొ, సు
    వాసన లీనెడు పారిజాతమో
కుదురు పిరుందు లందమగు
    క్షోణియొ, వేణి చలత్త్రివేణియో
మదనుని దంతియో, చెలియ
    మల్లెదొంతియొ, వైజయంతియో!''

ఇలాంటివే ఏవో ఒకటీ అరా రాయకపోలేదు. కవిగా జీవించాలంటే ఛందస్సుల మీద అధికారం సంపాదించవలసిందే! అందుకనే నేనంటూవుంటాను. వచనగీతాలు రాసే కవి కిశోరాలతో ''క్లాసిక్కులు తప్పకుండా చదవండర్రా, ఎందుకంటే కవిత్వం ఎలా రాయకూడదో మీకు తెలుస్తుంది!'' అని.

చాలా సంవత్సరాలబాటు తెగిన గాలిపటం లాగ తిరిగితిరిగి, ఎగిరి ఎగిరి 1938 లో ''ఆంధ్రప్రభ'' సహాయసంపాదకులలో ఒకడినిగా మళ్ళీ మద్రాసు చేరుకున్నాను. ఇంకో సహాయ సంపాదకుడైన మల్లవరపు విశ్వేశ్వరరావు[1] ద్వారా నాకు 'శ్రీశ్రీ'[2] పరిచయం కలిగింది.

ఇతని పూర్తిపేరు తిక్కవరపు పట్టాభిరామిరెడ్డి. కాని ఆ పేరు తెలిసినవారు అరుదు. కవితాజగతిలో 'పఠాభి' గానే అతడు లబ్ధప్రతిష్ఠుడయ్యాడు.

పఠాభి తాను పాతబాణీలో రాసిన వందపేజీలకు పైగా సాగిన ఖండకావ్య సంపుటి ఒకటీ, ''ఫిడేలు రాగాల డజన్'' ఒకటీ నాకిచ్చి ''ఇందులో ఏది ముందుగా అచ్చువేస్తే బాగుంటుం''దని నన్ను అడిగాడు. రెండూ అటూ ఇటూ తిరగేసి, అక్కడక్కడ చదివి, పద్యాలపుస్తకం అతనికిచ్చేసి, ''దీనిసంగతి మరిచిపో'' అన్నాను. రాగాల డజన్ అచ్చువేయించమన్నాను. ''ఇంట్రో'' నేనే రాస్తానన్నాను. రాసిచ్చాను. దానికింద పుస్తకం కవరుపేజీమీద ఒక ఫిడేలుబొమ్మా, రాగాల అనే అక్షరాలూ, ఆ కింద xii రోమన్ అంకెలూ వెయ్యాలని సలహా ఇచ్చాను. కాని, తీరా అచ్చులోకి వచ్చాక, ఫిడేలుబొమ్మా, దానికింద రాగాల డజన్ అనే అక్షరాలూ సాక్షాత్కరించాయి. అందుకే చాలామంది ఆ పుస్తకాన్ని 'రాగాల డజన్' అంటూ ఉంటారు. ఒకాయన ''ఇది రాగాల డజన్ కాదు, రోగాల డజన్'' అని చమత్కరిస్తూ తన తెలివితేటలు లొలకబోశాడు.

ఏమయినా, ''ఫిడేలు రాగాల డజన్'' ఆధునికాంధ్ర కవిత్వంలో ఒక మైలురాయి.

ఆరుద్ర కవిత్వం రాసే కొత్త దినాలలో 'నా ప్రభావం నుంచి బయటపడాలి నువ్వు' అని

1 మల్లవరపు విశ్వేశ్వరరావు (1904– '86) అచ్చమైన భావకవి. 'మధుకీల', 'కల్యాణ కింకిణి' అనే ఖండకావ్యాలు రచించారు.

2 పఠాభి (1919) తన యిరవయ్యోఏట (1939) ఫిడేలు రాగాల డజన్'లో

భావకవిన్మాత్రము కాన్నే, నే నహంభావ కవిని

అన్నాడు. 'నీలగిరి నీలిమలు' (1950), 'కయిత నా దయిత' (1977), పఠాభి పన్‌చాంగం (1980) వెలువడ్డాయి. ఎమర్జన్సీలో ప్రాణాలు కోల్పోయిన స్నేహలతారెడ్డి ఈయన భార్య. 'సంస్కార' లాంటి కొన్ని సినిమాలు కూడా తీశాడు.

పలహోయిచ్చాను. పఠాభి కవిత్వం చదివిన తర్వాతనే ఆరుద్రకు తనదీ అని చెప్పుకోదగ్గ సొంత గొంతు కుదిరింది. నన్ను ఇమిటేట్ చేసే వాళ్ళనెప్పుడూ నేను మెచ్చుకోలేదు. అసలు చిత్త శుద్ధి గల కవులెవరూ అనుకరణలతో తృప్తిపడిపోరు.

ఎజ్రాపౌండ్[3] ''సెలెక్టెట్ పోయమ్స్''కి ఇంట్రడక్షన్ రాస్తూ టి.యస్.ఈలియట్[4] *"The poem which is absolutely original is absolutely bad"* అని అసలు మౌలికత్వాన్నే కొట్టిపారేశాడు. ఒరిజినాలిటీ అనేది శూన్యంనుంచి ఊడిపడేది కాదనీ, *"True originality is merely development"* అనీ అంటాడు ఈలియట్. పౌండ్ వెనకాతల అతడు చదివిన పూర్వకవులందరి రచనల ప్రోద్బలమూ ఉంది. *"He simply did the next thing"* అంటాడు ఈలియట్.

రెండోరకం కవిత్వం ఎప్పుడూ అనుకరణ ప్రధానంగానే ఉంటుంది. అందుకే నా దృష్టిలో ''మనుచరిత్ర'' రెండోరకం కవిత్వానికి గొప్ప ప్రతినిధి. 'వసు చరిత్ర' మొదటిరకం! అయినా చాలామందికీ సూక్ష్మరహస్యం బోధపడదు. అల్లసాని పెద్దన శ్రీనాథుని పోకడల నెన్నింటినో తస్కరించాడు. పైగా కుకవి నిందలో (భరమైతోచు కుటుంబరక్షణకువై ప్రాల్మాలి అనే పద్యంలో) అటువంటి గ్రంథచోరులనే తిట్టి పోశాడు. తను చేసిందీ అదే పని అని మరిచిపోయి!

కవిత్వం రాసే తొలిరోజుల్లో నేను కృష్ణశాస్త్రినీ, విశ్వనాథనీ విపరీతంగా అనుకరించాను. అయితే నేను రాస్తున్నది మంచి కవిత్వం కాదనే బాధా, ఇతర కవుల ప్రభావం నుంచి బైటపడాలనే తపనా నన్నెప్పుడూ అంటిపెట్టుకుని ఉండేవి. ''ప్రభవ'' తర్వాత చాలాకాలం దాకా నేను అనుకరణ రచనలే చేశాను. అలా చేస్తున్నానన్న వాస్తవాన్నికూడా నేనంగీకరించకపోలేదు. అందుకే వాటన్నిటినీ సంపుటీకరించి ప్రకటిస్తే ఆ గ్రంథానికి ''మూరు మ్రోతలు'' అని పేరు పెట్టాలనుకున్నాను.

వాడుకభాషా, మాత్రాఛందస్సులు, వచన కవిత్వమూ నాకు అనుకరణా పరాయణత్వం నుంచి విమోచనం కలిగించాయి. అందుకు నేను ప్రప్రథమంగా గురజాడ వారికి (ఆయన వచన కవిత రాయకపోయినా) కృతజ్ఞత చెప్పుకోవాలి.

*ప్రజాతంత్ర 26–9–1976*

## తొమ్మిది

గణబద్ధఛందస్సులకు కడసారిగా గుడ్‌బై కొట్టేశాననీ, అందుకు మినహాయింపు అప్పుడప్పుడూ నేను సినిమాలకు రాసిన పద్యాలనీ ఇంతకుముందు చెప్పాను. కాని ఇంకో మినహాయింపును

3 *ఎజ్రాపౌండ్ (1885–1972) అమెరికన్ కవి.*
*విమర్శకుడు: రెండో ప్రపంచ యుద్ధకాలంలో ఫాసిస్టు అనుకూలుడుగా ఉన్నందుకు జైల్లో పెట్టారు.*

4 *టి.ఎస్.ఇలియట్ (1888–1965). పేరుపొందిన ఆంగ్లకవి, విమర్శకుడు. నాటకాలు కూడా రాశాడు. 'వేస్ట్‌లాండ్' కావ్యం ఇతనికి బాగా పేరుతెచ్చింది. 'క్రైటీరియన్' అనే ఆంగ్లసాహిత్య మాసపత్రికను స్థాపించి 1922 అక్టోబరు నుంచి 1939 జనవరి వరకు సంపాదకుడుగా ఉన్నాడు. 1948లో సాహిత్యానికి నోబెల్ ప్రైజు తీసుకున్నాడు. ఎజ్రా పౌండ్, ఇలియట్ మిత్రులు, సాహితీ బంధువులు.*
*విశ్వనాథ సత్యనారాయణను టి.యస్. ఇలియట్‌తో పోల్చాడు శ్రీశ్రీ.*

కూడా ఇక్కడే పేర్కొనవలసి ఉంది.

అదేమిటంటే కందపద్యాలలో నేను రాసిన "సిరిసిరి మువ్వ శతకం". అయినా కంద ఛందస్సును మాత్రాబద్ధంగానే పరిగణిస్తాను నేను.

"తందాన తాన తానన
తందాన తాన తాన తందన తానా" అని!

తెలుగు కందపద్యానికున్నన్ని నియమాలు మరే భాషలోనూ ఏ ఛందస్సుకీ లేవేమో అనుకుంటాను.

ఇంగ్లీషులో (తదితర పాశ్చాత్యభాషల్లో కూడా)సానెట్ అనే ఛందోరూపం ఉంది. దీనికి స్తనితం అని నామకరణం చేశాను. ఒకప్పుడు కొంపెల్ల జనార్దనరావు తాను రాయదలచిన వ చనగీతాలకు "అబద్ధాలు" అని పేరుపెట్టాలనుకున్నాడు. కొన్నిరాశాడు కూడా! కాని, అవి పూర్తిగా అబద్ధాలు కావు. అన్నిట్లోనూ అతడొక విచిత్రమైన నడక సాగించాడు.

"ఎప్పుడో జయము తేగల ముదమె
మెచ్చులే జడివీచి మనసు కదిలించి నా
నా చంచువది పదను
చూచుకో నేమరదు!" లాంటి పదాలు బద్ధాలే కాని అబద్ధాలుకావు.

సానెట్‌కు విధిగా 14 పాదాలుండాలి. అందులో మొదటి ఎనిమిదింటికీ ఒక ప్రాసపద్ధతి. ఆ ఎనిమిదినీ ఆక్టెట్ అంటారు. తర్వాత ఆరింటికి మరోప్రాస పద్ధతి. వాటిని సెస్టెట్ అంటారు. గణాలన్నీ ఇయాంబిక్ పెంటామీటర్‌లో ఉండాలి. (అయితే కొందరు ఫ్రెంచి కవులు హెక్సామీటర్ ఉపయోగించారు).

ఇంగ్లీషులోనే షేక్స్‌పియర్ రాసిన సానెట్లకీ, కీట్సురాసిన సానెట్లకీ ఎంతో భేదం ఉంటు ంది. డిలాన్ థామస్ రాసిన సానెట్ సీక్వెన్స్, *"Altarwise by owl- light in the half-way house"* అని ప్రారంభమయేది ఎన్నెన్నో స్వతంత్రమైన పోకడలు చూపిస్తుంది.

రకరకాల ఛందస్సులతో ప్రయోగాలు చేసిన శ్రీ అబ్బూరి రామకృష్ణరావు సానెట్‌కు కూడా తెలుగులో ఒక రూపం కల్పించారు. నా షష్టిపూర్తికి వారిలా రాశారు.

"అరవై సంవత్సరాల అరుణారుణ వయోరేఖ
తలదాల్చిన చిరంజీవి శ్రీరంగం శ్రీనివాస
రావును దీవించువేళ వ్రాయించిన సుహృల్లేఖ
పరాధీన కారాగత పతితుల స్వేచ్ఛాపిపాస...!"

ఇలాగే వాలుగేసి పాదాలు *a b a b* అనే ప్రాసస్కీముతో మూడు చరణాలుగా సాగి (3x4=12) ఆఖరి రెండుపాదాలూ *cc* అనే ప్రాసతో ముగుస్తాయి. ఇదో పద్ధతి. అబ్బూరి వారు తమ సానెట్లన్నిటిలోనూ ఈ పద్ధతినే స్వీకరించారు.

ఇంగ్లీషులో నేను ఒకే ఒక సానెట్ రాశాను.

*Now Comes the time of nine times nine, the time*
*of time that is a mime of all that's yours and mine*
*Now octet sings unsung in the rime of slime*
*Andwanders wonderstruck in womenandwine..."*

అంటూ! దీనిమీద డిలాన్ థామస్ ప్రభావం స్పష్టంగానే కనబడుతుంది. అయితే థామస్ లాగ నేను అర్ధప్రాసలూ, అనుస్వానాలు *(assonances)* వాడలేదు.

*Creeped and weeped* అనీ *surreptly* అనీ, కావాలనే ప్రయోగించాను. 8 ప్లస్ 6 14 అనే సంప్రదాయ ధోరణిలోనే, పూర్ణప్రాసలతోనే ఈ సానెట్ రాశాను.

*All Wrong orang, said the throng as insults heaped*
*As moon was mapped, as is at last was was."*

అనే ఆఖరిపాదాలలో డిలాన్‌కాక, నేనే కనబడతాననుకుంటాను.

ఇంగ్లీషులో సానెట్ రాసినవాడే కవి అనిపించుకుంటాడట! మన తెలుగులో "కందం రాసినవాడేకవి. పందిని కొట్టినవాడే బంటు" అనే సామెత ఉండనే ఉంది. ఈ రెండుభావాలనూ మిళాయింపుచేసి,

"పందిని కొట్టినవాడే
కందం రాయాలటన్న కవి సూక్తికి నా
చందా యిస్తానా?..." అని సిరిసిరిమువ్వ శతకంలో ఒకచోట చమత్కరించాను.

కవిత్వాన్ని జర్నలిజంలోనికి తీసుకురావాలంటే ఇటువంటి రచనలే అవసరమని నా ఉద్దేశం. ఈ ఉద్దేశంతోనే "ప్రాసక్రీడలూ," "లిమబుక్కులూ" కూడా రాశాను.

కందపద్యానికి లాక్షణికులు పెట్టిన షరతులివి.

త్రిశర గణంబులు (అనగా 3 ప్లస్ 5) ఎనిమిది గణాలుండాలి.

గా,భ,జ,స,నలములనే గణాలుండాలి. (గా అంటే రెండు గురువులు. నలమంటే నగణంమీద లఘువు.)

రెండో పాదపు మూడోగణంమీద యతి ఉండాలి.

ఆఖరిగణం విధిగా గురువుతో అంతంకావాలి. సంస్కృత కందానికీ పట్టింపులేదు. తెలుగులో ఈ నియమాన్ని పాటించి తీరవలసిందే.

ఎనిమిది గణాలలోని బేసిగణాలలో (1,3,5,7 లలో) జగణం ఉండకూడదు. ఆరింట నలంగాని, జగణంగాని ఉండాలి.

లాక్షణికులు ప్రత్యేకంగా చెప్పనవసరం లేకుండానే ప్రథమాక్షరం గురువుతో ప్రారంభమైతే ప్రతి పద్యపాదమూ గురువుతో ప్రారంభంకావాలి. అలాగే లఘువుతో అయితే లఘువుతో

సంస్కృతంలో ప్రాస అక్కరలేదు.

కన్నడంలో యతి అక్కరలేదు. ఈ రెండూ తెలుగులో ఉండితీరాలి.

నాలుగింట జగణం వెయ్యడంలో ఒక అందం ఉంది.

"జగణంతో జగడంకో
రగాదగదు గాని.." అన్నట్టు!
అన్నట్టు దీర్ఘాక్షరంతో ప్రారంభమైన కందంలో నాలుగింట జగణం వాడకూడదు.
"వాజమ్మ వంటి కుకవిని
సజీవ దహనం పొనర్చి..." అంటూ రాయకూడదు.

ఇన్ని నియమాలున్నా, చెయ్యితిరిగిన కవికి రచన చాలా తేలికే! గణయతి ప్రాసలకోసం వెతుక్కునేవాళ్ళు కందమే అన్నమాటేమిటి, ఏపద్యమూ రాయకూడదు. సిరిసిరిమువ్వ శతకాన్ని, "అందముగా మధురస ని
ష్యందముగా.."
అని ప్రారంభించాను. ఇలా గ్రాంథికభాషలో పద్యం సాగడం నాకిష్టం లేదు. రాసేది పద్యమే అయినా వాడుకభాషనే వాడాలని నిశ్చయించాను.

"అందంగా మధురస ని
ష్యందంగా పరితృ హృదయ సంస్పందగా
కందాలొక వంద రచిం
చిందికి మనసయ్యె నాకుసిరిసిరిమువ్వా!"

మనసైంది నాకు అంటే ఇంకా బాగుండేది. అయినా పద్యరచనలో గ్రాంథికరూపాలు అక్కడక్కడ ప్రవేశిస్తూనే ఉంటాయి.

"ఏవేనా కొత్తవి రా
శావా చూపించు మంచు చంపేవాళ్ళం
తా వినడానికి నేనీ
జీవత్కృతి నాలపింతు సిరిసిరిమువ్వా!"

ఇందులో "అంచు", "ఆలపింతు" గ్రాంథికరూపాలు.

"ఛవి మద్రసవద్గతుల, చ
దివెడు సుదారులకు హృదయతృష్ణ శమింపన్
నవనవముగ శతకము వ్రా
సి వేయమని మాయమాయె సిరిసిరిమువ్వా!" అంతా గ్రాంథికమే.

ఈ శతకంలో కందచ్ఛందంతో చాలాప్రయోగాలు చేశాను. అన్ని పద్యాలలోనూ ఏదో ఒక ప్రత్యేకత సాధించడానికే ప్రయత్నించాను.

పైన చెప్పిన "...జగడం కో
రగా దగదుగాని తస్సాదియ్యా"
అన్నచోట యతిభ్రంశం ఉద్దేశపూర్వకమే.

రకారమూ, తకారమూ చూడడానికించుమించు ఒకలాగే ఉంటాయికాబట్టి ఇది కంటి కింపైన యతి అని బుకాయించాను. *ప్రజాతంత్ర 3–10–1976*

పది

అలాగే

"వాగ్నేతవు, నీవె, మహో
గ్రాగ్ర్యుర్వీ ధరము నీవె..."

అన్నచోట ప్రాససరిగాలేదు. రెండో పాదంలో ఒక యకారం ఎక్కువ. కాని, దుష్కరప్రాస సరిగాలేదు. దుష్కరప్రాసల్లో మన కవులందరూ ఇలాంటి స్వేచ్ఛ తీసుకున్నవారే.

ప్రాసస్థానంలో అచ్చును వాడుతూ,

"ఓ అంతా కవులే, అ
ఆ ఇ ఈ లయిన రాని యంబ్రహ్మలె, మే
మూ ఋషులం అంటూ,
ఛీ ఎంతటి సిగ్గుచేటు సిరిసిరిమువ్వా"

అని రాశాను. బిందు పూర్వక లకారాన్ని వాడుతూ,

"ఏం లాభం పెరిగిన గ
డ్డంలా, దట్టంపు కారడవిలా మన దే
శంలో వ్యాపించిన ము
ష్లిం లీగును చూడరాదె..." అని రాశాను.

"పెసలో, బొబ్బర్లో, వే
రుసెనగలో విక్రయించి..."

అనేచోట ప్రాస కుంటుతుంది. అయినా పద్యం మాత్రం పరుగెత్తుతుంది.

సార్థకత ఉన్నప్పుడే ఇటువంటి విరుపులు రాణిస్తాయి.

("నా కఠినపాద శిలల క్రిందబడి నలిగిపోయే నెన్నెన్నియో మల్లెపూలు...")

అని కృష్ణశాస్త్రి రాసినప్పుడు మొదటిపాదం యతిస్థానం వద్ద కుంటుతోందనడం అర్థంలేని విమర్శ. అమాంతంగా మల్లెపువ్వులు పాదాలకిందపడిపోతున్న దృశ్యం అక్కడ మనకు కనబడుతుంది.

"మళ్ళీ ఇన్నాళ్ళకి ఇ
న్నేళ్ళకి పద్యాలు వ్రాయుటిది యెట్లన్నన్
పళ్ళూడిన ముసిలిది కు
చ్చిళ్ళన్ సవరించినట్టు సిరిసిరిమువ్వా!"

అని ఆ రోజుల్లో పద్యరచనకు పునరుద్యమించడం గురించి వ్యాఖ్యానించాను. మొదటి పది పద్యాల లోపున (పైపద్యం నా శతకంలో ఆరవది.)

ఈ మొదటి దశకంలోనే—

"కుర్చీలు విరిగిపోతే
కూర్చోడం మాననట్లు గొప్ప రచనలన్
కూర్చే శక్తి నశిస్తే
చేర్చదగునొకింత చెత్త..." అనికూడా రాశాను.

కవులురోసేదంతా గొప్ప కవిత్వంకాదనీ, అలాగని రచనమాత్రం కవులు ఆపకూడదనీ టి.యస్.ఈలియట్ (ఎజ్రాపౌండ్ సెలెక్టెడ్ పోయమ్స్‌కి రాసిన ఇంట్రడక్షన్‌లో) అన్నాడు.

*"Those who expect that any good poet should proceed by turning out a series of masterpieces, each similar to the last, only more developed in every way, are simply ignorant of the conditions under which the poet must work, especially in our time. The poet's progress is dual. There is the gradual accumulation of experience. In five or ten years that experience accumulates to form a new whole and finds its appropriate expression."*

మహాకావ్యం ఆవిర్భవించే సుముహూర్తం ఎప్పుడొస్తుందో ఎవరికీ తెలియదు. అది వచ్చే దాకా చేతులు ముడుచుకుని కూర్చుంటే తీరా అది వచ్చేసరికి కవి అసంసిద్ధుడుగా ఉండి పోతాడు. అందుచేత కవి అనేవాడు ఎప్పుడూ కవితా ప్రక్రియలను పదును పెడుతూనే ఉండాలి.

*"He must be experimenting and trying his technique, so that it will be ready, like a well- Oiled fireengine, when the moment comes to strain it to its utmost."*

ఈ భావాన్నే రేఖాగణితం నుంచి ఒక ఉదాహరణ తీసుకొని ఇలా వివరించాడు ఈలియట్:

*"...a poet's work may proceed along two lines of an imaginary graph; one of the lines being his conscious and continuous effort in technical excellence, that is, in continually developing his medium for the moment when he really has some thing to say. The other line is just his normal human course of development, his accumulation and digestion of experience..Now and then the two lines may converge at a high peak, so that we get a masterpiece."*

ఒక గ్రాఫ్‌కి, *x-axis, Y-axis* అని రెండుగీతలుంటాయి. ఒక గీత పొడుగు, ఇంకొకటి వెడల్పు. పొడుగు గీత కవియొక్క దైనందిన జీవితానుభవాలు, వ్యాపకాలు, ఆలోచనలు, ఇతర కవులతో పరిచయాలు, కవితారచనలను చదవడాలు, అధ్యయనం చెయ్యడాలు. ఇవన్నీ ఆ గీత పొడుగునా సాగిపోతాయి. రెండోది అతని సాంకేతిక ప్రయోగాల సాధన. ఇదికూడా అనుదినం సాగిపోవలసిందే. అప్పుడే ఆ కవి నిజంగా తానేది చెప్పదలుచుకున్నాడో అది చెప్పవలసిన సమయం వచ్చినప్పుడు, దాన్ని చెప్పవలసిన సంవిధాన సంపత్తికూడా సంసిద్ధంగా ఉంటుంది. అదే ఒక మహాకావ్యం ఆవిర్భవించే సుముహూర్తం. రెండు గీతలూ ఒక ఉన్నత శిఖరంవద్ద కలుసుకుంటాయి. దాని ఫలితమే ఒక *masterpiece.*

వైజ్ఞానిక దృక్పథం ఉన్నవాడెవడూ వాఙ్మయంలో పరిశోధనా వ్యాసంగాన్నీ విస్మరించలేడు. ఫ్రాన్సులో ప్రారంభమైన అధివాస్తవికోద్యమం ప్రపంచంలోని కవులందరిమీదా తన ప్రభా

వాన్ని ప్రసరించింది. ఒక్క కవిత్వమే అన్నమాటేమిటి అన్ని కళారంగాల్లూ అధివాస్తవికత వల్ల ప్రభావితమైనవే. అన్ని కళల్లోనూ ఎన్నోప్రయోగాలు చెయ్యడానికి ఇదివరకెన్నడూ లేనన్ని అవకాశాలను అధివాస్తవికత కళాకారులందరికీ కలిగించింది.

"హిప్పో పొటామ పొక్క బి
షప్పను గని యడిగెనిట్లు, 'స్వామీ! మీరె
ల్లప్పుడు చెప్పిందాన్నే
చెప్పడమెంచేత?' ననుచు సిరిసిరిమువ్వా!"

"ఒకప్రాణం పోయిన పి
ల్లి కూన తోక కొన కౌగలించుకొని, పిపీ
లికలకు దానిని చూపిం
చి కోపముగ నవ్వెనొకడు సిరిసిరిమువ్వా!

ఇత్యాది పద్యాలమీద అధివాస్తవికతా ముద్ర సుస్పష్టమే!

సాహిత్యంలో అధివాస్తవికత ఒక విమోచనోద్యమం. పద్యాలను బానిసతనం నుండి విడిపించి, భావాలకు స్వేచ్ఛను ప్రసాదించిన మహోద్యమం.

"అధివాస్తకుల ప్రవేశం" అనే నా ఖండకావ్యం ఉత్పలమాలావృత్తాలలో సాగింది. గణ యతి ప్రాసల్లో ఎక్కడా స్ఖాలిత్యాలు దొరకని రచనగా దాన్ని నేను పేర్కొంటాను.

"కాసరమా వికారములు కార్చకు
పూసరమా మసారప్పన్?
రాసులలో కపాలములు రాల్చకు
తావళమా విషాదప్పన్
వేసములో కుశాసనము పేర్చకు.."

ఇలాగ ఎన్ని పాదాలయినా రాసుకుంటూ పోవచ్చును. అయినా నాలుగు పాదాలతో ముగించడం కోసం,

"...రాసభమా సమాధిలో
మీసము పెంచి మాతొడలమీద నటించకు పుణ్యమయ్యెడున్" అని రాసి, తర్వాతి పద్యం ప్రారంభించాను.

"విచ్చెనపచ్చి నెత్తురులు నింపి నిలింపుల దుంపత్రెంపికా
ర్చిచ్చులు త్రచ్చుకున్నది శచీపతి పీచుమిఠాయి వేటలో
పచ్చిక మచ్చికై వది క్షపాకర భీకర సూకరాకృతుల్
పిచ్చితవాలు పోయిరి కబీరుని త్రాగిన రోషనారలై"

ఈ విధంగా సాగిన పద్యాలలో ఆఖరిది.

"వచ్చెడివాడు ఫల్గుణుడు
వార్ధితరంగ మృదంగ ఘోషలో
విచ్చెడుమచ్చు మందు పల
వించెడు కించు దుషస్తు షారముల్
పచ్చిక మచ్చికైనది ప్ర
పంచపు నెత్తురుమంటపాటలన్
మెచ్చనివాడ నీ మెడల
మీద నివే ఉదయాద్రి శైద్రముల్."

దీన్ని కవిత్వంగా అంగీకరించనివాణ్ని పిండివంటలలో విషం పెట్టి తినిపించి చంపించాలనిపించుతుంది. అప్పుడు వాడికి కింది పద్యం స్వచ్ఛమైన కవిత్వం అని స్పష్టంగా బోధపడుతుంది.

*ప్రజాతంత్ర 10–10–1976*

## పదకొండు

"మౌనము శంఖమై చెరగు మాయగ నేత్ర పతంగ బింబ ని
ధ్వానము కొంగనెత్తురులు త్రాగెడు నల్ల తురాయిపూవుగా
వేనలి పైననే అయిదువేల కుళీర కుఠార దారుణ
ప్రాణశిలీంధ్రముల్ తిరుగుబాటు తుపాకి తుపానుకానుపుల్".

"శరచ్చంద్రిక" అనే వచన కవితలో

"ఇదిగో జాబిల్లీ నువ్వు సముద్రంమీద సంతకం చేసేటప్పుడు
గాలి దాన్ని చెరిపెయ్యకుండా కాలమే కాపలా కాస్తుందిలే"

అనే పాదాలు అధివాస్తవికతగానే కాకుండా కవిత్వంగా కూడా అర్థమవుతాయి.

ఒడిస్యూస్ ఎవిటిస్ అనే గ్రీక్ కవి వ్రాసిన అధివాస్తవిక గీతం "పిచ్చిదానిమ్మ చెట్టు"[1]లో సమృద్ధిగా కవిత్వం ఉన్నందువల్ల దానిని నేను తెనిగించాను.

"తెల్లగా వెల్లవేసిన వసారాలలో
అనుకూల దక్షిణవాయువులు ప్రసరించే అందమైన గదులవెలుపల
ఇట్టే వెలుతురులోకి ఉరికేది
ఈ పిచ్చి దానిమ్మ చెట్టేవా చెప్పవూ?"

ఈ గీతం అంటే నాకు చాలా ఇష్టం. ఒక కమ్యూనిస్టుకవి మాత్రమే ఇటువంటిది రాయ

1 *పిచ్చిదానిమ్మ చెట్టు అనువాదగీతం తెలుగు స్వతంత్ర వారపత్రిక – 15–4–1949 తేదీ సంచికలో తొలిసారి అచ్చయింది. ఖడ్గసృష్టి (1966 నుంచి విశాలాంధ్ర ప్రచురణాలయం వేస్తున్న శ్రీశ్రీ కావ్య సంపుటి) 118–120 పేజీల్లో రెండోసారి అచ్చయింది. శ్రీశ్రీ సాహిత్యం (శ్రీశ్రీ షష్టిపూర్తికి 1970లో వెలువడ్డ సంపుటాలు) రెండు కావ్య విభాగం 204– 206 పేజీల్లో మూడోసారి అచ్చయింది.*

గలదవి నా ఉద్దేశం. ఎవిటిస్ దానిమ్మ చెట్టులో నేను మాగ్జింగోర్కీ "అమ్మ" ను చూస్తానని ఇదివరలో ఒక చోట రాశాను. ఈ పూర్తిగీతం శ్రీశ్రీ సాహిత్యం, రెండు (కావ్యవిభాగం) లో ఉంటుంది. మధ్యలోని ఒక చిన్న చరణాన్ని మాత్రమే ఇక్కడ ఉదాహరిస్తాను.

ఈ గులాబి దివం తన్ను ఏడు నిగనిగ రెక్కలతో అలంకరించుకొని
అవంత సూర్యబింబంచుట్టూ ఆకాశ సహస్రాలను చుదుతున్నప్పుడు-
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా-
వెయ్యి కొరడాలు పుచ్చుకుని - దౌడుతీసే గుర్రాలను జూలులాగి నిలబెడుతుంది?
ఒకసారి విషాదంతో, ఒకసారి విభ్రమిస్తూ - ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా, చెప్పవూ -
ఏదో నవీన ప్రభాతాన్ని ఎలుగెత్తి చాటుతుంది?

మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత పారిస్‌లో ఆరంభమైన సర్రియలిస్టు ఉద్యమం ప్రపంచంలోని నాగరిక భాషలన్నింటిలోని సాహితీపరులను ఆకర్షించిందనడానికి సందేహం లేదు. మొట్టమొదటిసారిగా కవిత్వానికి సంపూర్ణమైన భావస్వాతంత్ర్యం ప్రసాదించిన ఉద్యమం ఇదే. అంతకుముందు వచ్చిన డాడాయిజం అన్ని విలువలనూ నాశనం చెయ్యడమే ధ్యేయంగా పెట్టుకుంది. అధివాస్తవికత తన లక్ష్యం"నాశనాన్ని నాశనం చెయ్యడం, అనగా ఒక కొత్త సృష్టి చెయ్యడం" అని పేర్కొంటుంది.

1930 తర్వాత ప్రారంభమయిన ఇరవయ్యో శతాబ్దపు నాలుగో దశాబ్దంలో పెట్టుబడిదారీ ప్రపంచాన్నంతటిని భయంకరమైన ఆర్థికమాంద్యం ఆవరించింది. ఆ దశాబ్దంలోనే నా మహాప్రస్థానంలోని గీతాలలో చాలావరకు నేను రాసేను. ఆ రోజుల్లో ఒక ఫ్రెంచి విమర్శక గ్రంథంలోని *"The Dada Revolt and the Surrealist Experiment"* అనే అధ్యాయం చదవడంతో సర్రియలిజం నన్నాకర్షించింది. మద్రాసులోని హిగ్గిన్‌బాదమ్స్‌కు సర్రియలిజంమీద ఇంగ్లీషులో ఏమైనా గ్రంథాలుంటే పంపించ వలసిందిగా రాశాను. వారు లండన్ నుంచి రెండు తెప్పించి నాకు వి.పి.గా పంపించారు. అందులో ఒకటి, సర్రియలిస్టు ఉద్యమనాయకుడు ఆంద్రేబ్రెతా వ్రాసిన ఫ్రెంచి వ్యాసాలకు అనువాదాలు. అందులోనే మొదటి సర్రియలిస్టు మానిఫెస్టో ఉంది. రెండోపుస్తకం ఇంగ్లీషులో డేవిడ్ గాస్కాయిన్[2] వ్రాసిన *A short Survey of Surrealism*".దీనిలో సర్రియలిస్టు చిత్రపటాలతో బాటు చాలామంది అధివాస్తవిక కవుల గీతాలకు చక్కని అనువాదా లున్నాయి. వాటిలో ముఖ్యంగా పోల్ ఎల్వార్ గీతాలు నారాయణబాబును చాలా ప్రభావితం చేశాయి. అయితే నా "మహాప్రస్థానం"గీతాలలో ఎక్కడో సకృత్తుగాతప్ప సర్రియలిస్టు ప్రభావం లేదనే చెప్పాలి. (అక్కడక్కడ కనిపించే "ఫిరంగిలో జ్వరంధ్వనించే మృదంగరావం" వంటి ప్రయోగాలను మినహాయిస్తే).

ఒకసారి విజయనగరంలో చాగంటి సోమయాజులుగారి డాబామీద మేం అయిదుగురం

2 *డేవిడ్ గాస్కాయిన్ (1916— ) ఇంగ్లీషు కవి. ఫ్రెంచి భాషనుంచి సర్రియలిస్టు కవితలెన్నింటినో అనువాదం చేశాడు. నైట్ థాట్సు అనే పెద్ద గేయం రాశాడు.*

కూర్చున్నాము. 1,2,3,4,5, అని అంకెలువేసిన అయిదు కాగితపుముక్కల మీద ఒక్కొక్కరం ఒక్కొక్క అక్షరం రాయాలనుకున్నాం. అందులో ఒకటో నంబరు కాగితం మీద ఆరుద్ర 'స్వ' అని రాశాడు. అయిదో నంబరుమీద నేను 'వ్ః' అని వ్రాశాను. 2,3,4, నంబర్ల మీద 'జే', 'ళ', 'జ', అనే అక్షరాలు చేర్చితే "స్వజేళజవ్ః" అనే మాట ఏర్పడింది. దీన్ని సర్రియలిజానికి పర్యాయపదంగా మేము స్వీకరించాము.'జేళాకంపం' అనే పెద్ద వచనగీతం ఒకటి ఆరుద్ర రాశాడు. కాని అదిప్పుడు కాలగర్భంలో కలిసిపోయింది.

తెలుగుదేశంలోనూ, ఇంగ్లాండులోనూ ఇంచుమించుగా ఏకకాలంలోనే అధివాస్తవికతకు బీజావాపన జరిగిందని చెప్పవచ్చును. అయితే అచిరకాలంలోనే అది ఇంగ్లాండులో *Apocalypse* అనే ఉద్యమానికి దారితీసింది. తెలుగులో సర్రియలిజం వేళ్లూనకముందే అభ్యుదయ సాహిత్యోద్యమం దేశమంతటిని ఉర్రూతలూగించినది.

తెలుగులో అచ్చయిన మొట్టమొదటి అధివాస్తవిక రచన నేను రాసిన "మాటల మూట". దీన్ని మాంబళంలోని ఒక ఆచ్చాఫీసులో కూర్చుని రాశాను. (పఠాభి ఫిడేలు రాగాల డజన్ కూడా ఇక్కడే అచ్చయింది). ఒక్కతుడుపుగాని, కొట్టివేతగాని లేకుండారాసి దీన్ని అప్పుడు ఆంధ్రపత్రిక వారపత్రికలో కొడవటిగంటి కుటుంబరావుతో పనిచేస్తున్న రుక్మిణీనాధశాస్త్రికి ఫోనులో వినిపించాను. అదంతా అతను వ్రాసుకుని ఒక చిన్నవ్యాఖ్యానంతో సహా ఆ వారం పత్రికలోనే ప్రకటించాడు. ఆ తర్వాత కొన్నాళ్ళకి ఆ పత్రికలోనే జలసూత్రం నా "మహాకవి ఆశ్చర్యం" కూడా ముద్రించాడు.

ఈరెండు *automatic writing* (అప్రయత్నరచన)కి మంచి ఉదాహరణలు. "అధివాస్తవికుల ప్రవేశం" ఉత్పలమాలా వృత్తాలలో రాసినా,అందులోకూడా ఎటువంటి మార్పులూ చేర్పులూ లేవు. సుప్తచైతన్యాన్ని మాటల్లోనికి తీసుకువచ్చేటప్పుడు రచయిత తన బుద్ధిబలంతో సవరణలకు యత్నించకపోవడమే సర్రియలిస్టురచనల మూలసూత్రం. ఈ దృష్టిన చూస్తే ఇంగ్లీషుకవుల సర్రియలిస్టు రచనలు పనికట్టుకొని కూర్చినట్లుంటాయిగాని ఆశువుగా రాసినట్లుండవనే విమర్శ ఒకటి వుంది. డిలాన్ థామస్ సర్రియలిస్టుకథలు (కాలిపోతున్న పసిపాప వంటివి) మాత్రమే రాశాడుగానీ కవిత్వంలో అతని కళాకారుని జోక్యం స్పష్టంగా కనబడుతుంది. స్పెయిన్ అంతుర్యుద్ధం రోజులలో జార్జ్ బార్కర్ రాసిన "*Calamiterror*" తొలినుంచి తుదిదాకా అప్రయత్నరచనలాగే సాగిపోతుంది. అయినా అందులో కూడా కవి తన టెక్నిక్ మీద అజమాయిషీ వెరపుతున్నట్లు తెలుస్తూనే ఉంటుంది.

డేవిడ్ గాస్కాయిన్ వ్రాసిన:

*"...for the earth is a kiss on the mouth of the sky*
*And the sky is a fan in the hand of the sun."*

అనే పాదాలకు ఇదమిత్థమని అర్థంచెప్పడం అసాధ్యం కావచ్చు. కాని,

"ఆకాశం పెదవిమీద భూలోకం ఒక ముద్దు
ఆదిత్యుని హస్తంలో ఆకాశం ఒక వీవన"

అనడంలో హృదయాన్ని స్పృశించే కవిత్వం లేదని ఎవరనగలరు?

క్ల్యాపైక్స్ డేవిస్ "పెట్రాన్" అనే పేరుతో ఒక సుదీర్ఘవచన కావ్యం (లేదా, ప్రకరణాలుగా విభజించడంవల్ల సర్రియలిస్టు నవల) రాశాడు. దీన్ని అమెరికానుంచి ఏడాదికొకసారి వెలువడే "న్యూడైరెక్షన్స్ అనే వార్షిక సంచికలలోని ఒకదానిలో చదివాను. అప్పుడే "పాషాన్" అనే పేరుతో ఈ రచనను తెనిగించాలనుకున్నాను. తెలుగులోకి రాదగ్గ అధివాస్తవిక రచనల్లో ఇది చాలా ముఖ్యమైనదని అప్పటికీ ఇప్పటికీ నా ఉద్దేశం.

అందులో ఒకచోట పెట్రాన్ దారంటపోతూ ఉంటే ఒక గడ్డిపోచా, రాతిబెడ్డా మాట్లాడుకుంటూ ఉంటాయి. అక్కడనుంచి అతనొక మహానగరంలో ప్రవేశిస్తాడు. ఎవరో ఎవరినో ఘోరంగా ఆ ఊళ్ళో హత్యచేశారట. "నేనే హంతకుణ్ణ"ని అని పెట్రాన్ నేరం తనమీద వేసుకుంటాడు. సమస్య ఇంత సులువుగా పరిష్కారమైనందుకు జనులంతా సంతోషిస్తారు.

మరోచోట ఒక పీత తనతోతాను హోరాహోరీగా పోరాడుతున్న భయంకర దృశ్యాన్ని పెట్రాన్ చూస్తాడు. పీత డెక్కలు దాని కొక్కను చీల్చి చెండాడుతాయి. తర్వాత రెండు డెక్కలూ కలబడతాయి. వాటిలో ఒకటి గెలుస్తుంది. ఇంకొకటి ఓడిపోతుంది. గెలిచిన డెక్క ఓడిపోయిన దానిని మోసుకుంటూ మిలిటరీ కవాతు చేసుకుంటూ కదిలిపోతుంది, తన వెనక చిన్నచిన్న ధూళిమేఘాలు రేపుతూ!

డేవిస్‌దే ఒక గీతం:

*In the stumps of the old tree, where the heart has rotted out, there is a hole the length of man's arm, and a dark pool at the bottom of it where the rain gathers and the old leaves turn into lazy skeletons. But do not put your hand down to see, because in the stumps of old trees, where the hearts have rotted out, there are holes, the length of the man's arm, and dark pools at the bottom where the rain gathers and old leaves turn to tree, and the beak of a dead bird gapes like a trap. But do not put your hand down to see, because in the stumps..............*

ఇక దీనికి అంతంలేదేమో అనుకుంటాము.

"స్వామీ! దీనికంతమెప్పుడు?

శిష్యా! ఇది అనంతం." (నా "కోయీ హస్‌రహాహై" నుంచి)

ఒకసారి వేవో కార్నివాల్‌లో

"కోయీ హస్ రహాహై, కోఈ రో రహాహై

కోయీ జాగ్ రహాహై, కోఈ సో రహాహై

కోయీ ఆ రహాహై, కోఈ జా రహాహై

అంటూ అనంతంగా సాగిపోతున్నదనిపించే పాటవిన్నాను. అటువంటిదే మన తెలుగులో కూడా ఒక పాట ఉంది.

సదాశివుడు సద్గురుని రూపమై తవ్వెను మూడుచెరువులట!
అందులో రెండు నిండనే నిండవు, ఒకటి ఎండనే ఎండదు!
ఆ నిండని ఎండని చెరువుల వద్దకు వచ్చిరి ముగ్గురు కుమ్మరులు!
వాళ్ళలో ఒకడికి కళ్ళేలేవు, ఇద్దరికి కాళ్ళేలేవు!
ఆ కళ్ళూకాళ్ళూ లేని కుమ్మరులు చేసిరి మూడుకుండలట!
వాటిలో రెండిటికి కప్పేలేదు, ఒకదానికి మట్టే(మట్టు) లేదు!

ఇది ఎవరుపాడారో ఎలా అంతమయిందో నాకు తెలియదు. దీనికి వేదాంతపరంగా అర్థం చెప్పడం వ్యర్థం! ఒక అనామధేయుని అధివాస్తవిక గీతం ఇది.

ప్రజాతంత్ర *17–10–1976*

## పన్నెండు

వ్యక్తులకు అంతం ఉంటుందికాని కవిత్వం అనంతం. అస్తిత్వంలోని అనంతత్వం మీద నాకున్న విశ్వాసం అధివాస్తవిక రచనలతో పరిచయం ఏర్పడ్డమీదట అధికతరమయింది.

"రెండు ఖడ్గాలు,
రెండు ఖంజరీటాలు..." ఇత్యాది గీతంలో నేను,
"రెండువేషాలు విప్పివేసిన తలగడాల కింద
నిద్రమేల్కొన్న నక్షత్రాలు
రెండు నిశ్శబ్దాలు విసిరిన సరిగమపదనిశలమీద
నీడలు పలికించిన విలోల కల్లోలాలు
రెండు యుగాంతాల సందున దిగంతాల మాటున
వసంతాలాడుకునే అనంతాలు
నేనే
నానా" అని రాశాను.

ఇందులో ఆఖరి పాదంలోని "నా" అనే అక్షరాన్ని, అంతకుముందు పాదంలోని"నే" అనే అక్షరాన్ని అనంతంగా సాగించవచ్చును. కాని ఒక గీతం సుదీర్ఘంగా ఉండకూడదనే ఎడ్గార్‌పో అభిప్రాయంతో నేను ఏకీభవిస్తాను. *"A long poem is a Contradiction in terms"* అన్నాడతను. మరి మన ప్రాచీన మహాకావ్యాల మాటేమిటన్న ప్రశ్న వెంటనే ఉదయిస్తుంది. "అవి సుదీర్ఘమైన కథనంతో, వర్ణనలతో కూడుకున్నవి. వాటి స్థానాన్నిప్పుడు మహానవలలు ఆక్రమించాయి" అన్నది జవాబు.

ఫ్రెంచి అధివాస్తవిక కవులలో అగ్రేసరులలో ఒకడుగా పరిగణించబడే పాల్ ఎల్వార్ (నాకు తెలిసినంతమట్టుకు) ఒకే ఒక దీర్ఘకావ్యం రాశాడు. దానిపేరు *"Poesie ininterrompue"* (అడ్డూ, ఆపూ లేని కవిత్వం). రెండో ప్రపంచ యుద్ధ కాలంలో అజ్ఞాతవాసంలో ఉంటూ రాసిన కావ్యం ఇది.

*Nue effac'ee en sommeill'ce* (దిగంబరమైన, తుడుచుకుపోయిన నిద్రిస్తున్న)

ఇలాగ రెండేసి, మూడేసి విశేషణాలున్న పాదాలతో ఇది ప్రారంభమవుతుంది. పుట తిప్పేదాకా ఇక వీటికి అంతం లేదేమో అనిపిస్తుంది. అక్కడ, *Noise humilice' 'ecla blouss'ee* (నల్లగా అవమానం పొందిన చెల్లాచెదరైన) అనే విశేషణాలతో జాబితా పూర్తి అవుతుంది. వాక్యం పూర్తికాకుండానే మరో కొత్త వాక్యం ప్రారంభమవుతుంది.

ఈ కావ్యంమీద వ్యాఖ్యానిస్తూ లూయీ ఆరగో ఇలా అన్నాడు.

"దీనినొక వార్తాపత్రికలాగ చదవండి. కవిత్వం, మన కవిత్వం వార్తాపత్రికలాగే ఉంటుంది. అందులో ముందురాబోయే ప్రపంచపు వార్తలుంటాయి!"

ఇందుకేనేమో కవిని ద్రష్టగా అందరూ అంగీకరించడం. ఏ దేశంలోనయినా, ఏ భాషలోనయినా మాటలు కవిత్వంగా మారినప్పుడు వాటికి రెక్కలు వస్తాయి. అవి వినువీధుల్లో అనంతంగా విహరిస్తుంటాయి. అలాగని వాటికి మన భూమితో సంబంధంలేదని చెప్పడానికి వీల్లేదు. ఒక సందులోనో, ఒక ఊరిలోనో కాక మొత్తం ప్రపంచం అంతటా జరిగే దురాగతాల నవి కనిపెడుతూ ఉంటాయి. ఆ దుర్మార్గాలను బహిర్గతం చెయ్యడమే కాదు, అలాంటివి మళ్ళా జరక్కుండా పరిష్కారాన్ని కూడా సూచిస్తాయి.

రాజుల, మహారాజుల, నిన్నమొన్నటి జమీందారుల కాలం దాకా కవిత్వం ఒక భోగ వస్తువుగా మాత్రమే చలామణీ అవుతూ వచ్చింది. కూడు గుడ్డలకు మొగం వాచిన సామాన్య ప్రజానీకానికి గొప్పవారు గుత్తకు తీసుకున్న ఈ కవిత్వం అందుబాటులోకి రాలేదు. అనుభవయోగ్యం కాలేదు. అయినా సామాన్య జనం అనాదినుంచీ కవిత్వాన్ని తమ కష్టసుఖాలకు ఆలంబనంగా తీసుకుంటూ రావడంవల్ల ఒకానొక విస్తృతమైన జానపద వాఙ్మయం ఎన్నడూ ఇంకిపోని జీవనదుల్లాగ ప్రపంచమంతటా పరిఢవిల్లింది. దీనికి రావలసిన గుర్తింపు ఈ ఇరవయ్యో శతాబ్దంలోనే వచ్చింది. దీని ప్రభావం నా కవితాహృదయం మీద పని చెయ్యడం వల్లనే పాతకాలపు ధోరణుల బారి నుండి నేను బైట పడగలిగాను.

తెలుగులో నిస్సందేహంగా ఈ ఉద్యమానికి నేతృత్వం వహించినవాడు గురజాడ. నేనైతే వారినెప్పుడూ చూడలేదు. అతడు చనిపోయినప్పటికి నావయస్సు అయిదేళ్ళు. ఆ తర్వాత చాలాకాలం దాకా నేను పాత ఫక్కీలోనే కవితాభ్యాసంగం సాగించాను. "అది కాదు దారి. అంతకు మించిన మహత్తర ప్రయోజనంగల మరో దారి ఉంది. అవశ్యం అదే అనుసరణీయం" అని నేను తెలుసుకోవడంతో నా మహాప్రస్థానం ప్రారంభమయింది. అప్పట్లో బసవరాజు, కవికొండల, చింతా దీక్షితులు నా కవితా గురువులు. వీరందరి మీదా తన సుతీక్ష్ణప్రభావం ప్రసరించినవాడు గురజాడ.

అందుకే గురజాడను "గణబద్ధచ్ఛందస్సుల భూస్వామ్యయుగం మంచి మాత్రాచ్ఛందస్సుల

ప్రజాస్వామ్య యుగంలోనికి మార్గం మళ్ళించినవా''డని నేను చాలాచోట్ల, చాలాసార్లు ఉద్ఘాటించాను. మాత్రాచ్ఛందస్సులను స్వీకరించడం మాత్రమే చాలదు, వాటిలో వాడుక భాషను తప్పనిసరిగా ఉపయోగించాలనీ, అప్పుడే కవిత్వం ప్రజాహృదయాలకు చేరువవుతుం దనీ మహాప్రస్థాన గీతాలు రాస్తున్న తొలిరోజుల్లోనే నేను గుర్తించాను.

నవీనుల్లో ప్రాచీనుడైన శ్రీ శివశంకరశాస్త్రిగారు మాత్రాచ్ఛందస్సులలో గ్రాంథిక భాషను వాడి, అలా చేసే రచన ఎందుకు రాణించదో నిరూపించడంలో కృతకృత్యులయారు.

''నీల గళుండీ పూత దివసమున
నిఖిల లోక శశ్వత్
పాలన కొరకై హాలాహలమును
భక్షణ చేసెనుకాదే!'' అంటూ!

మన పాత ప్రబంధాలలో రకరకాల రగడచ్ఛందస్సులున్నాయి. ఉదాహరణకు మను చరిత్ర నుంచి-

''నేర్పుమై నల్లయది
నెరుల దొలి పూదురిమె
దర్పకున కర్పింప
దలపదెంతటి పెరిమె
ఇంతి! పావురపుగొద
యోల వినెదారజము,
వింతయో విరహిణుల
వెల్ చెట్టు చేరజము''

ఇటువంటి గడ్డు గ్రాంథిక భాష ఆనాటి రచనా సంప్రదాయానికి సరిపోయింది. అదే పద్ధతిని ఆధునికులు అవలింబించ కూడదని నా సుస్థిరాభిప్రాయం.

వాడుక భాష జీవద్భాష అనీ, గ్రాంథికం మృతభాష అనీ గిడుగు పండితుడు ఘంటా కంఠంగా ఘోషించాడు. ఈ రెండవది పరిమిత ప్రయోజనం గలది అనీ, మొదటిది అపరి మిత ప్రయోజనం గలది అనీ ఆయనే ఉద్ఘాటించాడు. గ్రాంథిక భాషను వాడిన ప్రాచీన కవులందరూ తమకు తెలియకుండానే ఎన్నో చోట్ల వ్యావహారికాన్ని ఉపయోగించినట్లు సోదాహరణంగా చూపించాడు.

మాత్రాచ్ఛందస్సులకు గ్రాంథిక భాష పనికిరానట్టే వృత్తాలలో వ్యావహారికం వాడితే ఎబ్బెట్టుగా ఉంటుంది. వ్యావహారిక భాషను వాడాలని ప్రయత్నించారు. (గిడుగు సీతాపతి సెట్టి లక్ష్మీ నరసింహం మొదలైన వారు.) సెట్టి మాస్టారు ఒక పండిత సభలో ''నూటపదహార్లు'' అనే శీర్షికలో నూట పదహారు పాదాల శార్దూల మాలికను చదివారు.

"పస్తాయించి వినండి.........
నాస్తే, ఇస్తరఫిస్లియే మగరు మా
ఫక్కించు మీరింక హిం
దూస్తానీ పద సంచయంచె కృతులన్
దూరుస్తురో, లేక, నో
యెస్తేంక్స్ మిస్టరు మైడియర్ మొదలుగా
ఇంగ్లీషు శబ్దాలనే
వేస్తారో తమ చిత్తమండి......

"పదసంచయంచె" వంటి గ్రాంథిక రూపాలను ఈ వృత్త మాలికలో వాడక తప్పలేదంటే పాత వృత్తాలకు పాత భాషమాత్రమే నప్పుతుందని చెప్పక తప్పదు.

పాత వృత్తాలలో ఒక కొత్త సౌలభ్యం సాధించారు భావకవులు. వీరందరికీ ఆద్యులు రాయప్రోలు సుబ్బారావుగారు.

"శ్యామా. శ్యామలతామలమ్మగు ప్రవా
సస్నాన పుణ్యోదక
శ్రీ మద్వాటికలన్ వియోగపత వీ
రేఖా రహస్వార్థినై
ప్రేమారాధన మాచరింతు లలితా
ర్తిస్వన్న లీలా విధుల్
కౌమారార్పణ మంచు బాష్పకణ ము
క్తా మాలికన్ ద్రిప్పచున్"

ప్రజాతంత్ర *31–10–1976*

## పదమూడు

తర్వాత ఒకటి రెండు సంవత్సరాల తేడాలో అబ్బూరి రామకృష్ణారావుగారు "ఊహాగానం" చేశారు. "ఈ బాణి మొట్టమొదట ప్రవేశపెట్టిందెవ"రని నేను అబ్బూరివారి నడిగాను. రాయప్రోలు వారే అన్నారాయన. అయినా వీరిద్దరినీ భావకవిత్వపు మూలపురుషులుగా నేను పరిగణిస్తాను.

భావకవిత్వం రాసే రోజుల్లో కృష్ణశాస్త్రిలాగా ఏడవడమో, విశ్వనాథ లాగ అరవడమో తప్ప రాయప్రోలు,అబ్బూరివారల అంతస్తుకి చేరుకోలేకపోయాను. భావకవిత్వం పట్ల నా అసంతృప్తికి ఇదో ముఖ్యకారణం. నేను ప్రాతినిధ్యంవహించే యువతరానికి ఇటువంటి కవిత్వంఅవాంఛనీయమని నాకనిపించింది. అదే అభ్యుదయకవితవైపు నన్ను మళ్ళించింది. "అశాంతి" అనే పేరిట అప్పుడప్పుడు వెలువరించదలచిన అమాస పత్రికకు "భావకవిత్వం:

ఒక శవ పరీక్ష'' అని ఒక విమర్శ వ్యాసం రాయాలనుకున్నాను కాని ఆ పత్రికారాలేదు. నేను వ్యాసమూరాయలేదు.

మాటలు మాట్లాడుతాయి. మనుస్సులతో కాట్లాడుతాయి. మనుష్యులతో చీట్లాడుతాయి.

మాటలు నిద్రపోతాయి. నిద్రలో కలలు కంటాయి. నిద్రపోతున్న వాళ్లందర్నీ మేలు కొమ్మంటాయి.

నిద్రపోతున్న మాటల్ని నిద్రపోతూనే ఉండండి,అవసరం వస్తే మేలుకొలుపుతానన్నాను. ఇవాళ ఆ అవసరం వచ్చింది.

మేలుకొన్న మాటలు మాత్రమే పాటలు పాడుతాయి.

మహాప్రస్థానం గీతాలు రాస్తున్న దశాబ్దంలో అధివాస్తవికోద్యమం నన్ను తీవ్రంగా ఆకర్షించింది. అయితే అందులో నేను తలమునకలుగా మునిగిపోకుండా అభ్యుదయభావాలు నన్ను అడ్డుకున్నాయి. లండన్‌నుంచి వచ్చిన ప్రోగ్రెసివ్ రైటర్స్ మానిఫెస్టో గురించి ఇదివరకే చెప్పాను. ''అభ్యుదయం'' అనే మాటను ''అభ్యుదయ పరంపరాభివృద్ధిగా'' అనే పాత అర్థంలో కాక నూతనార్థంలో మొట్టమొదటిసారిగా వాడింది నేనే అనుకుంటాను.

''ఏవో,ఏవేవో,ఏవేవో,  
ఘోషలు వినబడుతున్నాయ్,  
గుండెలు నిండిపోతున్నాయ్''

అని ప్రారంభమయే గీతానికి శీర్షిక,''అభ్యుదయం''

''నేడే ఈ వాడే, ఈనాడే-  
జనమంతా బలివికల్లి  
నరజాతికి పరివర్తన!  
నవజీవన శుభ సమయం! అభ్యుదయం!

ఈ గీతాన్ని 1937 ఏప్రిల్లో రాశాను. అచ్చుకావడం మాత్రం ''ప్రతిభ'' సంచికలో. నవ్యసాహిత్య పరిషత్తు అధ్వర్యంలో వెలువడే ఈ పత్రికలోనే

''తురాయికంటే ఆ  
కురాయికంటే - కీ  
చురాయికంటే - హిమాం  
శురాయి గొప్పవాడు''

లాంటి సర్రియలిస్టు గీతాలు కూడా అచ్చయినాయి. వాటికి ''మహాప్రస్థానం'' సంపుటిలో కాక, ఆ తర్వాత చాలాకాలనికి ''ఖడ్గ సృష్టి''లో గ్రంథరూపం ఇచ్చాను.

అధివాస్తవికతలో నేను పూర్తిగా(నారాయణ బాబులాగా) కూరుకుపోకుండా ఉండడానికి ఒక ముఖ్యకారణం ఏమిటంటే-సర్రియలిస్టు టెర్రరిస్టుగా పేరు పొందిన లూయీ ఆరగో[1] ఆ

1 లూయి ఆరగో (1897—1982) ఫ్రెంచికవి, కథకుడు, విమర్శకుడు.

ఉద్యమ నాయకుడైన ఆంద్రే బ్రెతాతో కలహించి కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడయ్యాడు. అధివాస్తవికతను కేవలం ప్రయోగాత్మకంగానే ఉంచాలన్నాడు బ్రెతా. ఆ వాదంతో ఆరగో ఏకీభవించలేదు. "మనకు కావలిసింది అధివాస్తవికుల స్వాతంత్ర్యం కాదు. ఆకలి బాధలతో ఏడుస్తున్న పసిపిల్లలకు పాలు" అన్నాడు లూయీ ఆరగో.

ఈ మాటలు,తొలినించీ కమ్యూనిస్టు పార్టీ సానుభూతిపరుడయిన (నేనెప్పుడూ పార్టీ సభ్యుణ్ని కాను) నన్ను చాలా ఆకర్షించాయని వేరే చెప్పనక్కరలేదు.

అదే ఆరగో ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో అజ్ఞాత జీవితం గడుపుతూ "క్రీర్ క్రీర్" *(creer creer)* వంటి కావ్యగ్రంథాలలో ఫ్రెంచి జానపదచ్ఛందస్సులలో అద్భుతమైన కవిత్వం రాసి ప్రజలనుత్తేజపరిచాడు.

"నా విశా" పట్నపు లల్లీ రోజాల్
మరచిపోలేను నేను
మరచిపోలేను"

అని నేను రాశానంటే దీనికి ప్రోద్బలం,

*"Jen' oubiraijamais*
*Ni lilia ni la rose*

అనే ఆరగో పద్యపాదాలే. పారిస్ నగరం పతనమైనప్పుడు రాసిన గేయం ఇది.

('విశా'పట్నం గేయం ప్రారంభించానే కాని పూర్తి చెయ్యలేదు. అది ఆరగో వ్రాసిన దానికి కేవలం అనువాదం కావడమే ఇందుకు కారణం.)

ఆ కాలంలోనే ఆరగో ప్రచురించిన గ్రంథం *"Les Yemx D'Elsa"*. (ఎల్సా నేత్రాలు) - ఎల్సా అతని భార్య. రష్యన్‌కవి మయకొవిస్కీ[2] సోదరి.

*Give back give back my heaven*
*my music*
*My wife without whom*
*all lacks song and colour*
*Without whom May is*
*only a strectel of desert*
*The sky an insult and*
*she shadow a sorrow*

(నా కిచ్చెయ్ నాకిచ్చెయ్ నా స్వర్గం నా గానం నా భార్యను నాకిచ్చెయ్ ఆమె లేక పాట లేదు

2 వ్లాడిమిర్ మయకొవస్కీ *(1893– 1930)* మొదట్లో ఫ్యూచరిస్టు కవి. తరువాత కమ్యూనిస్టు పార్టీలో చేరి విప్లవ కవిత్వం రాశాడు. లెనిన్‌మీద పెద్ద కావ్యం రాశాడు. అది శ్రీ శ్రీ అనువాదం చేశాడుకూడా.
"కమ్యూనిజం వినా నాకు హృదయం లేదు" అని చెప్పాడు మయకొవస్కీ.

ఆమెలేక రంగు లేదు అంతా శూన్యం ఆమెలేని వైశాఖం అంతులేని ఎడారి ఆకాశం అవమానం నిడ నాకు పీడ!)

వచన గీతాలతో ప్రారంభించిన దిగంబర కవులు విప్లవరచయితల సంఘంలో చేరిన తర్వాత జానపద ఛందస్సులను స్వీకరించడం చాల గమనార్హమైన విశేషం.

నేనుకూడా 1970 (విరసం ఏర్పడ్డ సంవత్సరం) తర్వాత చాలమట్టుకు పాటకజనుల బాణీలలోనే పాటలు రాశాను. "విన్నటి జట్కావాలా" వచన గీతమే అయినా అందులో విశాఖపట్టణపు కార్మికుల భాషను ఉపయోగించాను.

"యిప్లవం యాడుందిరా
ఆడనే నీ కూడుందిరా, నీ గూడుందిరా
గోడుగోడున యేడుస్తుంటే
యాడు నీవొంక రాడింకరా"

అని నా "మరో ప్రస్థానం" గేయం ప్రారంభమవుతుంది.

1970 లో నా షష్టిపూర్తి జరిగిన సందర్భంలో అంతవరకు నేను వ్రాసినదంతా "శ్రీ శ్రీ సాహిత్యం" అనే పేరిట ప్రచురితమయింది. ఆ తర్వాత నేను రాసిన కవిత లన్నింటిని సేకరించి "మరో ప్రస్థానం" అనే సంపుటిగా ముద్రించాలనుకుంటున్నాను.

అత్యవసరపరిస్థితి కారణంగా ఈ ముద్రణ మానుకోలేదు. కనీసం 1980 దాకా ఆగాలని నా ఉద్దేశం. (అంతవరకేకాదు ఆ తర్వాతకూడా అనేక సంవత్సరాలు జీవిస్తానని నా నమ్మకం) అంతేకాక "మహాప్రస్థానం" లో రష్యామీద రాసిన గీతం లాగే ఈ కొత్త సంపుటికోసం చైనామీద రాయాలనుకుంటున్నాను. ఇంకా రాయలేదు కాని రాస్తాను. అది రాయనిదే ఈ సంపుటి పూర్తి కాదు.

"ఆనందవాణి" పత్రికలో ఈ "అనంతం" ప్రారంభించిన తొలి రోజుల్లో, మనిషన్నవాడు యాభైయేళ్ళు బతికితే చాలునని రాశాను. అందుకు గురజాడ జీవితాన్ని ఒక ఉదాహరణగా ఇచ్చాను. కాని ఇప్పుడు నా అభిప్రాయంవేరు. విశ్వనాథసత్యనారాయణ గారిలాగా 82 ఏళ్ళు బ్రతక్కపోయినా మరో 20 ఏళ్ళయినా గురజాడ అప్పారావు గారు బ్రతికివుంటే మన సాహిత్య క్షేత్రం ఎంత సస్యశ్యామలమయ్యేదో అని ఊహించుకుంటే నిజంగానే బాధగా వుంటుంది. ఈ ఊహలో ఒక చిన్న స్వార్థం కూడా మిళితమైవుంది. గురజాడ డెబ్బయి ఏళ్ళయినా జీవించివుంటే వ్యక్తిగతంగా నేను వారిని కలుసుకోగలిగే అవకాశం ఉండేది.

ఒకప్పుడు వేదుల సత్యనారాయణశాస్త్రి ఏడుస్తున్నాడట (కవిత్వంలో కాదు,నిజంగానే!) ఎందుకేడుస్తున్నాడని ఎవరో అడిగితే "ఆంధ్రుడినై పుట్టినందుకు" అని జవాబిచ్చాడుట. మరోసారి అతనే విరగబడి నవ్వుతున్నాడట. ఎందుకంటే "అరవనై పుట్టినందుకు" అన్నాడట.

*ప్రజాతంత్ర 7–11–1976*

## పధ్నాలుగు

గురజాడవారిని స్వయంగా చూడలేకపోయానే అన్న విచారం కంటే కొక్కొండవారిని[1] చూడలేదన్న సంతోషమే నాకెక్కువ.

ఎందువల్లనంటే కొక్కొండవారే అనుకుంటాను, వీరేశలింగంగారి "వివేకవర్ధని" మీద చమత్కారిస్తూ "విర్ధవకవేని" అని అక్షరాలు తల్లకిందులు చేశారు. అభ్యుదయ విరోధుల చమత్కారాన్ని కూడా నేను సహించలేను.

తెలుగు కవిత్వానికి భారతదేశంలోనే కాదు, ప్రపంచమంతటా అత్యున్నత స్థానం ఉందని నా ఉద్దేశ్యం. ఇది ఈనాడే కాదు ఆదినుంచీ అని చెప్పడానికి నేను వెనుదీయను. షేక్స్పియర్ నాటకాలురాస్తే శ్రీనాథుడు మహాకావ్యాలు రాశాడు. వేమనలాంటి కవి ఏభాషకైనా గర్వకారణం. రవీంద్రనాథ ఠాగూరు "గీతాంజలి"కి మన వడ్డాది సుబ్బారాయుడు[2] గారి 'భక్తచింతామణి' ఏమాత్రమూ తీసిపోదు. నిజానికి 'గీతాంజలి' లోనూ 'భక్తచింతామణి' లోనూ కావ్యవస్తువులు ఒకటే. ఠాకూరుకి ఆధునిక ప్రచార సాధనాల నుపయోగించుకోవడం బాగా తెలుసు. (ఆయన తీయించుకున్నన్ని ఫోటోలుఎవరూతీయించుకోలేదనినేననుకుంటాను) గీతాంజలిని ఇంగ్లీషులోనికి తర్జుమా చేయడం ద్వారా మన మెట్ట వేదాంతపు మజా పాశ్చాత్యులకు చూపించాడు. అది వాళ్ళకళ్ళకి మిరుమిట్లు కొల్పింది. బెంగాలీ 'గీతాంజలి'లో ఠాకూరు రకరకాల ఛందస్సులతో ప్రయోగాలు చేశాడు. కాని ఇంగ్లీషులో అది అతనికి సాధ్యంకాకపోయింది. తర్జుమా కతనికి వచన కవిత్వం బాగా పనికివచ్చింది. ఛందస్సులో ఠాకూరు ఒక్క ఆంగ్లగీతం కూడా రాయలేదు. కారణం, అతనికి ఆంగ్ల ఛందస్సుల మీద అధికారం లేకపోవటమే! ఆ మాటకొస్తే హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయకు[3] వాటిమీద గొప్ప మాష్టరీ ఉంది.

*Sweet While we together stand*
*Hand in hand*
*On the painted shore of life*
*Man and wife*
*Full of dreaming and desire*
*Full of fire........*

అంటూ కమలాదేవిని వివాహమాడిన రోజుల్లో రాసుకుపోయాడు. (ఈ ఛందస్సుకి బ్రౌనింగ్ది మాతృక అనేది వేరే సంగతి)

1 కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు (1842–1915) గొప్ప పండితులు. మహామహోపాధ్యాయ బిరుదాంకితులు. వీరగ్రాంధికవాది. వీరేశలింగం గారికి అన్నింటా విరోధి. 'ఆంధ్ర భాషాసంజీవని' 'హాస్యసంజీవని' అనే రెండు పత్రికలు నడిపారు. ఇవి వీరేశలింగం గారి వివేకవర్ధని, హాస్యవర్ధని అనే పత్రికలకు పోటీగా వుండేవి.

2 వడ్డాది సుబ్బారాయుడు (1854– ?) గారు 'భక్తచింతామణి' శతకం రాశాడు. ఆశుకవితలో నేర్పరి.

3 హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ (1898) బెంగాల్లో పుట్టి ఆంగ్లంలో కవిత్వం చెప్పాడు. కొన్నేళ్లపాటు కమ్యూనిస్టు అభిమాని. 1952 ఎన్నికల్లో కమ్యూనిస్టుపార్టీ బలపరిచినందున, విజయవాడనుంచి 'పార్లమెంటు స్థానానికి గెలుపొందారు. ఇప్పుడు బొంబాయిలో వుంటున్నారు. కాంగ్రెస్ అభిమాని.

వచన కవిత్వాన్ని నేనెప్పుడూ చిన్న చూపు చూడలేదు. "మహాప్రస్థానం" రచనకు ముందే వచన గీతాలతో నేను ప్రయోగాలు చేశాను. ఉదాహరణకు "విద్యున్మాలికలు"-

"బారులు బారులు తీరిన
మబ్బుగుబ్బలుల దారుల
దారితప్పి చరించే ఆ రేయి
తరళ సరళ రమ్మదములు......"

అయితే అప్పటికింకా వాడుక భాషలోనే కవిత్వాన్ని రాయాలని నాకు తోచలేదు.

వచన గీతాల్లో ఉన్నంత మాత్రంచేత గీతాంజలిలో కవిత్వం (ఆ రకం కవిత్వం) లోపించిందని నేననను. అయితే మాత్రకలోని ఛందస్సులకు దగ్గరగా ఉన్న రూపాలతో తర్జుమాచేస్తే "గీతాంజలి" ఇంకా ఎంత బాగుండేదో అనే నా తపన. ఇంగ్లీషులో అటువంటి ఛందస్సులు కోకొల్లలు.

బ్రౌనింగ్ గొప్పతనంలో చాలావరకు వాడిన ఛందస్సును మళ్ళీ వాడకపోవడంలోనే ఉంది.

ఛటోపాధ్యాయ గీతాన్ని నేను ఛందస్సులోనే తెనిగించాను.

"జ్వలియించు పూగుత్తి, పరిమళించెను మట్టి
దుఃఖిత ప్రణయినీ! తొలగి చనునన్నియును!
సాంధ్య నిస్తబ్ధ తేజస్సు శాంతించు,
విలపించగా మానివేయును గాలి,
బ్రతుకొక్క కల్పనాకథవోలె ముగియు!

అంటూ యుద్ధకాలంలో ఫ్రెంచికవి ఆరగో ఛందో మార్గంవైపు మళ్ళడం గమనించదగ్గది. *"Plaint for the great eclipse of France"* వచనంలో తర్జుమా అయితే ఈ దిగువ గొప్పతనం ఉండేదా?

*If there could be a quire of viols veiled*
*Within our hearts a fire that nought could quench*
*This malady to tell and our dear love of France*
*Might there be still a night where no stars paled*
*Might there be still.*

*Veiled, Paled* పూర్ణ ప్రాసలు. *Quench, France* అర్ధ ప్రాసలు. దాన్నే ఇంగ్లీషులో ***Assonance*** అంటారు.

"ప్రాసోపదేశం" అనే లిమబుక్కులో నేనిలా రాశాను.

అసమర్థుడి చేతిలో *assonance*
అందించదు సరిగ్గా *resonance*
దానికి కావాలెంతో *vigilance*

అందుకె ఛందో రహస్యం తెలిసిన *veterans Straight rhyme* కే ఇస్తారు *preferance.*

ఇందులో ఏవి పూర్ణ ప్రాసలో, ఎక్కడ అర్ధప్రాస ఉందో అది ఛందో రహస్య విజ్ఞులకు సువిదితమే!

ఇంగ్లీషులో లిమరిక్కు అయిదు పాదాలలో ప్రాసపద్ధతి *a, a, b, b,a*గా ఉంటుంది. *a* పాదాలు ఒక కొలతలోనూ, *b* పాదాలు ఇంకో కొలతలోనూ ఉంటాయి. నా లిమబుక్కు(దీన్ని పంచపాది అనవచ్చును.) కి అయిదు పాదాలదీ ఒకే ప్రాస. పాదాల కొలత అప్పుడప్పుడు సమానం గానూ, తరుచు అసమానంగానూ ఉంటుంది.

"స్వజాతీయ గీతం"

తెలుగువాడి తెలివితేటలకి జై జై
తెలుగువాడు దేనికైనా సై సై
తెలుగువారి నెదురు వారు నై నై
తెలుగునాట కవుల పాట హై ఫై
ప్రస్తుతానికి వస్తామరి నేస్తం బై బై

ఇంచుమించు అన్నీ సమాన పాదాలు (అచ్చులో "హై ఫై" అనడానికి బదులు హై హై అని పడింది.)

నేను
ముసలివాణ్ణి కాను అసలు వాణ్ణి
పడగెత్తిన తాచు పాము బుసల వాణ్ణి
పీడితుల్ని వెంటేసుకు మసలువాణ్ని
అందుకున్న ఆకాశపు కొసల వాణ్ని

1, 2 అసమాన పాదాలు.3, 4, 5 సమాన పాదాలు

రంగు (1)
ఎరుపు
ద్రోహుల గుండెల్లో కురుపు
ఆరాటానికి ఆట విడుపు
పోరాటానికి పిలుపు
దానిదే గెలుపు

అన్నీ అసమాన పాదాలు.

లిమబుక్కుల ఛందస్సు మాత్రాబద్ధమూ కాదు, గణబద్ధమూ కాదు. అలాగని ఇవి వచన గీతాలు కూడా కావు. ముందు ముందు లాక్షణికులు దీనికేదైనా సాంకేతిక పదం వాడవచ్చుకాని నేను మాత్రం దీన్ని "శ్రీ శ్రీయం" అంటాను. ఎంచేతనంటే ఇది నూటికి నూరుపాళ్ళు వాదే కాబట్టి.

అన్నట్టు భావిలాక్షణికుల దాకా ఎందుకు, నేనే దానికి లిమబుక్కు అని పేరు పెట్టాను.

ఒక విధంగా చూస్తే నేను వాడిన ఛందస్సులన్నీ శ్రీశ్రీయాలే. గురజాడవారి ముత్యాల సరాలతో కూడా నేను కొత్త ప్రయోగాలు చేశాను.

సైన్సుకి లాగే, కవిత్వానికి కూడా ప్రయోగాలు లేనిదే అభివృద్ధి లేదు.

ప్రయోగాత్మక కవిగా ప్రారంభించిన టి.ఎస్.ఈలియట్ లబ్ధ ప్రతిష్ఠుడైన తర్వాత సంప్రదాయానికి అంకితమయ్యాడు. బహుశా తుది రోజుల్లో ఆయన కన్సర్వేటివ్ పార్టీలో సభ్యత్వం స్వీకరించాడేమో అని నా అనుమానం.

మన విశ్వనాథ సత్యనారాయణగారు కూడా భావ కవిత్వపు రోజుల్లో ఎన్నో విమాత్ర ప్రయోగాలు చేసి రాను రాను కరడు గట్టిన అభివృద్ధి నిరోధకుడుగా ఘనీభవించడం అందరికీ తెలిసినదే. ఇటీవల సంభవించిన వారి మరణానికి ఎందరో సంతాపం ప్రకటించారు. ఒక (తా నెంచుకున్న మార్గంలో) గొప్ప కవి అస్తమించినందుకు నేను విచారం చెందకపోలేదు. కాని ఆ విచారాన్ని నేనెక్కడా బహిరంగంగా ప్రకటించలేదు. ఇప్పుడు నా స్వీయచరిత్రలో దీన్ని పేర్కొంటున్నాను. వ్యక్తిగతంగా నేనొక మిత్రుణ్ణి కోల్పోయినట్లు బాధపడుతున్నాను. మా ఇద్దరికీ విరోధమని చాలామంది అనుకుంటారు. అది నిజం కాదు. వైరుధ్యమంతా మా అయిడియాలజీలకు మాత్రమే పరిమితం. తన విశ్వాసాలు గొప్పవని ఆయననుకుంటాడు. వ శ్యవాక్కు కాబట్టి తన రచనల ద్వారా ఇతరులు కూడా అలా అనుకునేటట్లు చేస్తాడు. కాని నేను మాత్రం సుతరామూ వారి భావాలను అంగీకరించలేను.

ప్రజాతంత్ర *14–11–1976*

# స్రరియలిజం

## ఒకటి

ప్రమానం రసం అనే దాన్ని పాశ్చాత్యులు సౌందర్యం అంటారు. సౌందర్య వివేచనలో *Surrealist*[1] దృక్పథాన్ని ఈ వ్యాసం సూచిస్తుంది. దీనిని ఫ్రెంచ్ భాషలో *Andre Breton* వ్రాశాడు *"Beauty will be Convulsive"* అనే శీర్షికతో. దీనిని ఇంగ్లీషులోనికి *David Gascoyne* అనువదించాడు. 1936లో లండన్‌లో జరిగిన *International Surrealist Exhibition* కోసం ప్రకటితమైన *"What is surrealism?"* అనే గ్రంథంలోని వ్యాసాలలో ఇదొకటి. *Andre Breton* అధివాస్తవికోద్యమ ప్రవక్త. ఈ ఉద్యమానికి మెదడూ, బాహువూ అతడే. కొందరు అనుకున్నట్లుగా ఈ ఉద్యమం క్షీణించలేదు. అమెరికా, జపాన్ వ ంటి రెండు పరస్పర విభిన్నాశయాలుగల దేశాలలో దీని శాఖలు వ్యాపించివున్నాయి. తెలుగులో అధివాస్తవిక రచనలు ఉన్నప్పటికీ ఉద్యమంలేదు, లేక ఉన్నదో!

మానవ సంసార భవనపు ఏడో అంతస్తులో, పరస్పరం గాఢంగా ప్రేమించుకున్న వారు ఒకరిలో ఒకరు హరించుకుపోయే ఆ అసందర్భపు గాజుమేడలో ఇంద్రనీలమణి మంజూషలు తప్ప ఇంకేవీ కనబడని వరుణుని రాణివాసంలో, మనుష్యుడూ, సూర్యుడూ అడుగు పెట్టడానికి సంకోచించే అలాస్కా ప్రాంతపు అయస్కాంత ద్వీపాలలో అదుగో అక్కడే వెదకమన్నాను సౌందర్యంకోసం.

సామాన్యంగా గ్రంథమాలలు వెలువరించే పుస్తకాలు, చిత్రప్రదర్శనశాలలో చిత్రం ఎక్కడా దొరకని చిత్రాభాసాలు, కమ్చీపట్టి తోలినా కదలిక చూపించని సినీమాలు; ఇది ఆధునికశిల్పం అనుకొని అందరూ పారబడే విరగబడే నీరస సామగ్రులేవీ, ఎంతమాత్రమూ నాకు సుఖం ఇవ్వ వు. వాటి సాన్నిధ్యంలో నాకు తన్మయత్వం కలగదు. అప్పుడు నా నుదుటిమీద ఒక చల్లని గాలికెరటమైనా, వెన్నుపూసమీద విద్యుత్ప్రకంపమైనా ప్రసరించదు.

ఎందువల్లనో రసానందాన్ని రతానుభవంతో జోడించక తప్పదనిపించుతుంది. ఎన్నెన్నో నిషేధాల తెరలు తొలగించిన తరువాత రతానందం వలె రసస్ఫూర్తి కూడా పర్యవసిస్తుందని నిరాక్షేపణీయంగా చెప్పవచ్చును. అన్వయించుకోవడంలో ఏమోగాని అనుభవానంతరం గుర్తించ డంలో ఏమీ కష్టంవుండదు. అకస్మాత్తుగా వేను తప్పిపోతే నన్ను గురించి నాకే ఎవరో

1 స్రరియలిజమ్ (అధివాస్తవికత): మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఫ్రాన్సులో తలెత్తిన సాహిత్య ఉద్యమం. ఆంద్రే బ్రెటన్ దీని వ్యవస్థాపకుడు. నియమాలు, నిబంధనలు, ప్రమాణాలు అన్నింటిని కాలదన్నాలి. వ్యక్తీకరణ అతి నవ్యంగా వుండాలి. కలలోని వాస్తవాన్ని గుర్తించాలి. అధివాస్తవికత లక్ష్యాలివి అని 1924లో ఆంద్రే బ్రెటన్ చెప్పాడు.

జ్ఞప్తిచేసినట్లవుతుంది.

నాకు బాగా జ్ఞాపకం. నా పదిహేడోయేట మహాకవి గారిని సందర్శించాను. "కవిత్వం కడుతున్నావా అబ్బాయీ? ఎందుకేమిటి?" అని ప్రశ్నించాడాయన. అప్పుడు నేనిచ్చిన జవాబుకు అప్పటికే ఇంచుమించు ఈ అర్థం వచ్చింది. "నన్ను సమ్మోగ్ధంచేసిన కొన్నికొన్ని మరీ ప్రత్యేకమైన కావ్యస్పందనాలకు సమానమమకున్న వాటిని (నా కోసమేనా?) సృష్టించు కోవాలని," ఆశ్చర్యం ఏమిటంటే అట్టి స్పందనాలు కాలం గడిచిపోయినా గౌరవం జార్చుకోనివి. రసానికి నిత్యయౌవనంలోని నిత్యసౌందర్యం ఉంది. ఇంతెందుకూ? అపుడాయన సమక్షంలో ఉదాహరించిన పద్యపాదాలే ఇపుడూ నాకు జ్ఞాపకం వస్తున్నవి.

"నీకంఠార్పిత కాలపాశము, శిరోనిర్ఘాత పాతమ్ము, లంకౌక శ్రేణికి కాళరాత్రి..."

"గరళపుముద్ద లోహ మవగాఢ మహాశనికోట్లు సమ్మేటల్ హరు వయనాగ్ని కొల్మి..."

"పంచాస్త్రోపనిషద్రహస్య పరమబ్రహ్మ స్వరూపంబు నీ కాంచీదామ పదమ్ము..."

*"Mais que salubre est le vent"*

*"Alors, commelanuit vieilleissant"*

ఇంతట్లో *Chants de Maldoror* నా కళ్ళబడింది. ఇదివరకు ఎప్పుడెప్పుడో అక్కడక్కడ కనబడే రత్నాలుకాక అనుకోకుండా ఒక అక్షయతూణీరం లభ్యమయింది. అందులోని రకరకాల *Beau Comme* పాదాలు సంక్షుబ్ధ సౌందర్యపు విశ్వరూప ప్రదర్శనం.

*"Beautiful as the Chance Meeting of a Sewing Machine and an umbrella on the dissection table" (...et surtout Comme le rencontre fortuite sur une table dedissection d'une machine a'coudre et d'un parapluie)*

ఓహో! వికసన్నవకైరవ గంధ బంధురోదార సమీర సౌరభము; గంధర్వలోక మధుర మధుర సుధాగాన మంజువాటి. ఏవో విస్ఫారిత నేత్రాలు వీధుల్లోనివో గూళ్ళలోనివో! శృంగారమో, బీభత్సమో, భయమో, కోపమో విస్పష్టంగాతప్ప వేరువిధంగా వీటిలో కనబడదు. కనకదుర్గ కళ్ళు, ఈజిప్టురాణి నెఫర్ టి.టి., అరేబియన్ నిశీధాల శహరజాదీ, సింహాలకు పారవేసే బానిస బాలికల కళ్ళు, జూలియట్, జస్టీవ్ కళ్ళు, మోదో చిత్రించిన నాయికలు కొందరికళ్ళు, మూర్‌మార్కెట్‌లో అప్పుడప్పుడు మాత్రమే కనిపించే కళ్ళు.

కానీ నాకీ అప్రతిహతానందాన్నిచ్చే విశాల సామ్రాజ్యంలో నిరాఘాటంగా పరిపాలించే వాడు *Lautreamont* (మాల్డొరోర్ పాటలు రాసిన *Isidore Ducasse* పెట్టుకున్న మారుపేరు) అయినప్పటికీ మరికొందరు కూడా నన్ను ఇప్పుడూ యెప్పుడూ తమ ఇంద్రజాల గీతికా జాలాలలో నొక్కిపెట్టినమాట వాస్తవమే. *Baudelaire* (ఆ వింతపుష్పాలు), *Cros, Nouveau* అప్పుడప్పుడు కృష్ణశాస్త్రి, ఇప్పుడిప్పుడు పఠాభి, *"Et les vierges postulan tes de la accalmie pour lours seins"* అని వ్రాసినందుకు మాత్రం *michel Feline* మరి *Verlaine* సముద్రం మీద ఇంద్రధనుస్సు, రసదేవత విపంచి.

*Les sanglots longs*

*Du violons*

అంటూ ప్రారంభమయే అతని *Chansen d automne* విషాద మనోహరంగా వినబడుతూ ఉంటుంది.

ఈనాటికి కావలసిన సౌందర్యాన్ని వర్ణించడానికిగాను ఇక్కడ ఇప్పుడు నేను ఉపయోగించిన విశేషణం, చలనంతో ఉన్నప్పుడు కాక, చలనం సరిగా ఆగిపోయే క్షణాన్ని స్ఫురింపజెయ్యక పోయిందా అంటే దాని అర్థమే పూర్తిగా విలుప్తమయిందన్నమాట. నా అభిప్రాయంలో ఒక వస్తువు చలనంలో ఉన్నక్షణాన్ని, అదేవస్తువు సరిగా చలనం ఆగిపోయిన క్షణంతో కలిసేటప్పుడు స్ఫురించే పరస్పర సంబంధాన్ని ప్రదర్శించేదే సంక్షుబ్ధ సౌందర్యం. అది కానిది సౌందర్యమే కాదు. ఈ విషయాన్ని ఇంకా విశదంగా వివరించడానికి ఇక్కడ, ఇదివరలో చాలాకాలం క్రితం నేనుతీసిన ఛాయాపటాన్ని ప్రకటించలేకపోయానుకదా అని తెగ విచారిస్తున్నానంటే నమ్మండి. ఆ బొమ్మ ఏదో తెలుసునా? ఆకొన్న అరణ్యాకన్య దీర్ఘ జ్వరానికి ఆహుతి అయి, సీలజారిన చిత్రమైన ఒంటి గొట్టపుబండి. దీనిని సందర్శించడానికి చేసే తపస్సులోనే నన్నొక ప్రత్యేకమైన పరిధవం ఆవరించి ఆవేశం కలిగిస్తుంది. జయాపజయాలు రెండిటికీ ఒకే ఉదాత్త చిహ్నమైన దీనితోనే మన ఊహలను ఇదమిత్థమని నిర్ణయించాలి.

బలిష్ఠమైన ఈ భావనను వదలి దుర్బలమైన నీరసానికి దిగితే ఇంకొక సంగతి నాకిప్పుడు జ్ఞాపకం వస్తున్నది. కోయంబత్తూరులోని ఒక మిఠాయిదుకాణంలో క్రొవ్వొత్తుల దీపం ఒకటి చూశాను. బొట్లుబొట్లుగా కరిగి కిందపడ్డ కొవ్వు కొత్తరూపం ఏదో ధరించింది. కోయనాయకుల పూసలపేర్లతో పోటీపడడానికి చేసే ప్రయత్నం అది. అందులోకూడా నాకు కనబడ్డది చల చంచల సౌందర్యమే.

కాకతాళీయంగా కల్పించబడ్డ ఈ వస్తువుల మాటకేమిగాని స్ఫటికాల సౌందర్యాన్ని కొంచెం నన్ను పొగడనివ్వండి. ఎంతగొప్పది స్ఫటికం! కళాకారుడు నేర్చుకోదగ్గ గుణపాఠాలన్నీ గూడుకట్టిన వస్తువుకాదా ఇది. అందుకే ఎన్నో ఉపమానాలను తృణీకరించి స్ఫటికాన్నే ఇక్కడ కొనియాడుతున్నాను. ఒక జీవితశకలాన్ని శిల్పంగా రచిస్తున్న కళాకారుని సృష్టికి స్ఫటికంలోని ఛందస్సు, సలక్షణత, కాంతి, కాఠిన్యం అన్ని ఫలకాలలో, వెలుపలా, లోపలా విశదీకృతమయినప్పుడే విలువా, సార్ధకతా! అయితే ఇలా నేనన్నానని నా మాటనుపట్టుకుని మందులలాగే శిల్పాన్నికూడా సులభంగా తయారుచేయవచ్చునని అనుకోకూడదు. సిద్ధంగా ఉంచిపెట్టిన సూత్రాలవల్ల శిల్పం ఏదీ జన్మించదు. లాక్షణికులు పెట్టిన రంగవల్లికలవల్ల లాభంలేదని మరోమారు హెచ్చరిస్తున్నాను. ఇందుకుకూడా స్ఫటికమే గొప్ప నిదర్శనం. అది ఆకృతి ధరించడం ఎంత ఆకస్మికమో, కళాసృష్టి అంతే. జీవితం కూడా అంతే. నేనున్న ఇల్లు, నా బతుకు, నారచనలు- ఇవి భూతద్దాన్ని దగ్గరగా పెట్టుకొని సైంధవలవణ స్ఫటికాలను చూచినట్లుగా నేనెప్పుడూ కలలు కంటాను.

నా మనః ప్రాకారాలను ఆవరించే ఐశ్వర్యం, నా చేతికి అందుబాటులో ఉన్న సూర్యకిరణం లాంటిది. మళ్ళీ మరెక్కడైనా కనబడుతుందా అంటే- మహాసముద్రాలలోని ప్రవాళ

ద్వీపాలలోకే పోవాలి. ఇక్కడ చేతనాచేతనాలు ఒకదానితో ఒకటి ఆడుకునే నాలుగు స్తంభాల ఆటలో నాకు మళ్ళీ స్ఫటికమే కనబడుతుంది. ఇదే మానసిక వ్యాపారం పిట్టగూడూనూ. ఘనీభవించిన జెల్లానాలోంచి బైటికితీసిన ద్రాక్షాగుళుచ్ఛాలను గుర్తించిన సమయాలలో గోచరమవుతుంది. స్వతంత్రరాజ్యాల కోటలు సగంసగం కూలిపోయిన తర్వాత హిమవన్నగ శిఖరాలను పొగమంచులు కప్పినతర్వాత, అప్సరాంగనల చికురపాశాలు కిటికీలోనుండి తొంగిచూస్తున్నప్పుడు, ఈ ప్రాకారాల తర్వాత వచ్చేదే ఉద్యానవనం. అవి కాశీరత్నపు పూలు, గులాబీలు, వీటి కొమ్మలూ, ఆకులూ, ముళ్ళూ అన్నీ ఒక పదార్థమే. ఇవి మంచువీవనలు.

వస్తువుల వాస్తవికత స్ఫటికంలో పారమ్యం పొందితే సర్వశక్తిసంపన్నమైన ఆ వాస్తవికత ప్రవాళంలో ప్రశస్తంగా పరిత్యజించబడుతుంది. అప్పుడు దాన్ని మళ్ళీ నేను నిత్యజీవితంలో వలె సముద్రగర్భంలో కూర్చొని దండ గుచ్చనక్కరలేదు. జీవితం ఎడతెగని కల్పవికల్పాలు, వికాస వినాశనాలు పొందుతూ చెట్ల గూళ్ళలో పిట్టల్లాగా, ధరాగర్భంలో రత్నమాణిక్యాల్లాగా ఆకృతి ధరిస్తూవుంటుంది.

సంక్షుబ్ధ సౌందర్యానికి అవసరమయిన ఈ రెండు పరిస్థితులు కాక ఇంకొక్కటి కూడా ఇక్కడ చెప్పివేస్తే అపార్థాలన్నీ పటాపంచలవుతాయి. ఇందులో మూడో విశేషం ఇది. ఏదో ఒక సత్యం సాక్షాత్కరించినప్పుడు ఉద్గమించే ఉద్రేకపు ఉత్సర్గంలోనే ఇటువంటి సౌందర్యం సంభూతమవుతుంది. హేతువాదం ఆధారంగా ఈ సమస్యకు పరిష్కారం కలగదని వేరే చెప్పనక్కరలేదు. అప్రయత్న రచనలో ఆవిష్కృతమవుతూన్న చిత్రవిచిత్ర వస్తుజాలమే ఇందుకు గొప్ప ఉదాహరణ.

ఒకసారి నేను ఏదో బొమ్మగీయాలనుకున్నాను. ఒకానొక గీతంలోని భావానికి అనుగుణ్యంగా ఆ చిత్రం ఉండాలనుకున్నాను. తీరా బొమ్మ గీసినతర్వాత ఆ భావానికీ, ఈ చిత్రానికీ సరిగా సమన్వయం కుదిరిందోలేదో చెప్పలేనుకాని బొమ్మమాత్రం ఇదివరకు ఎన్నడూ చూడనిది. ఆశించిన వస్తువువలె దొరికిన వస్తువు ఉండకపోవడమే మన ఆనందానికి కొంత కారణం.

శిల్పంలో, శాస్త్రంలో, వేదాంతంలో అలా కొత్తగా కనుక్కున్నవన్నీ వాటిలో లేనిదానివల్లనే మనకు సౌందర్యమయంగా కనబడుతాయి. విశ్వాన్ని విస్తరిల్లజేయగలిగినవీ, లోకాన్ని కప్పిన మాయావరణాన్ని ఓసరిల్లజేయగలిగినవీ ఇవే! ప్రతిదినం అందరూ ఇటువంటి చిన్నచిన్న చిల్లరసంగతులు కనిపెడుతూనే ఉంటారు. ఇవి చప్పన అర్థంకాకపోవడంలోనే కొంతవరకు వీటి ఆకర్షణ ఉందని నేను ఒప్పుకుంటాను; అంతమాత్రం చేత వీటిని హీనంగా చూడడానికి వీలులేదు. మనంచేసే ప్రతి కార్యంలోనూ మన చిక్కులకు పరిష్కారం ఉంది. ఈ పద్మవ్యూహంలో దారి తెలుసుకోవడం ఎలా అన్నదే ప్రశ్న. ఎన్నోదారులు కలిసినచోట ఎటూ వెళ్ళలేనివాడు నిలబడిపోయి భయపడిపోయినప్పుడే వ్యాఖ్యానాల ప్రేలాపనలు ప్రారంభమవుతాయి.

*ప్రజాతంత్ర 9–1–1977*

రెండు

అధివాస్తవికతను అధ్యయనం చేసిన కొద్ది మందిలో నేనొకణ్ణి. అధివాస్తవిక రచనలను నేను తప్పుగా ప్రదర్శించినట్లయితే అది నాకృషిలోపమేగాని, అధివాస్తవికతా సిద్ధాంత లోపం గాదు. అధివాస్తవికతకు, అతివాస్తవికతలాంటి పర్యాయపదాలు వాడుకలోకి వచ్చాయి. అన్నింటికీ అనేక పర్యాయపదాలు ఉంటున్నట్లు గానే అతి వాస్తవికతలో వాస్తవికత గర్భితమై ఉంటుంది. స్రరియలిజం (అధివాస్తవికత) అనే పదం ఫ్రెంచిలో ఒక స్రరియలిస్టు నాటకం వచ్చాక ఏర్పడినది. అంతకుముందే, క్యూబిజం, ఇంప్రెషనిజం, పోస్టుఇంప్రెషనిజం మొదలైనవి ఉన్నాయి. వీటినుండి పరిణమించినదే అధివాస్తవికత.

1914-18 ప్రపంచ మహాయుద్ధం మేధావులను అనేక విధాల కదల్చింది. శ్రామిక జనులకోసం తాము పాటుపడాలనుకొనే సాహితీ సేవకులకు యుద్ధం గొప్పనిరాశ పుట్టించింది. యుద్ధమైపోగానే వీరు నూతన సృష్టి జరుగుతుందని భ్రమిశారు. కాని యుద్ధానంతరం మహా సంక్షోభం రేగింది. తిరుగుబాట్లు, విప్లవం, అంతర్యుద్ధం, నిరుద్యోగం, ఆర్థిక సంక్షోభం మొదలైనవెన్నో ప్రపంచాన్ని కలతపరిచాయి. కొందరు కవులు యుద్ధకాలంలోనే తమకూ యుద్ధానికి సంబంధం లేదని వదిలేశారు. మరికొందరు అహుతియైపోయారు. యుద్ధకాలంలో విలువైన శిల్ప కళాసంపద నశించింది. గ్రంథాలయాలెన్నో నాశనమయ్యాయి.

ఆనాటి (యుద్ధానంతర) పరిస్థితుల్లో కొందరు మేధావులు యుద్ధానికి కారకులు పెట్టుబడిదారులనీ, ఆ పెట్టుబడిదారుల ప్రపంచంపై తిరుగుబాటు చేయాలనీ, వారు నిర్మించిన శిల్పాన్నీ, కళనీ కూడా ధ్వంసం చేయాలనీ పూనుకొన్నారు. యుద్ధంలో పెట్టుబడిదారీ శిల్పమూ, కళా నశించాయి. కాని అవి వీరు తలచిన రీతిలో నాశనం కాలేదు. వీరి ఉద్యమం పేరే "డాడాయిజం".

ట్రిస్టన్ జారా, ఆంద్రేబ్రిటన్ మొదలైన వాళ్లు ఈ ఉద్యమ నిర్మాతలు. జారా ఒక బాధ్యతలేని పేరు పెడదామని, డిక్షనరీ తీయగానే కనపడ్డ "డాడా" పేరును పెట్టాడు. అదే "డాడాయిజం"అయింది. జర్మనీలో "మెర్జ్" (అంటే చెత్త)అనే ఉద్యమం దీని ననుసరించే బయలుదేరింది. అమెరికాలో కూడా ఇలాగే డాడాయిజం మరో పేరుతో వ్యాప్తికి వచ్చింది. ఆంద్రే బ్రిటన్ దీనిని గురించి ఇలా అన్నాడు."ఈ మేధావంతుల కేదో వ్రాయాలని తహతహవుంది. ఏదో వ్రాసి ప్రయోజనంలేదనీ వీరికి తెలుసు. ఈ పరిస్థితుల్లో పుట్టినదే డాడాయిజం." యుద్ధకాలంలో జన్మించిన నిస్పృహ ఫలితమే డాడాయిజం. వీరు పారిస్‌లో ఒక ప్రదర్శనం జరిపి వాస్తవికతపై తిరుగుబాటు లేపారు.

యుద్ధానంతరం పరిస్థితులు కొంత చల్లారాక, డాడాయిస్టులలో విభేదాలు తలచూపాయి. ఆంద్రే బ్రిటన్ మొదట దానిని వదిలివేశాడు. ట్రిస్టాన్ జారా కూడా కొన్నాళ్లు దానిని పట్టుకొని వేలాడినా చివరకు వదిలివేశాడు.

వీరిద్దరూ తర్వాత స్రరియలిస్టు సాహిత్యాన్ని ప్రచారంలోకి తీసుకువచ్చారు. ఫ్రాయిడ్

సిద్ధాంతం ప్రకారం అర్థంలేనిదంటూ ఏదీ ఉండదు. ప్రతిదానికి అర్థం ఉంటుంది. ఫ్రాయిడ్ తన సైకో ఎనాలిసిస్ (మనస్తత్వశాస్త్రం) ద్వారా దీనిని ఋజువు చేయ ప్రయత్నించాడు. సర్రియలిస్టులు ఫ్రాయిడ్ సిద్ధాంతం ఆధారం చేసుకొని తమ రచనలు కొనసాగించారు. ఆంద్రే బ్రిటన్ తనమీద తన మిత్రుల మీద ఫ్రాయిడ్ ననుసరించి కొన్ని ప్రయోగాలు చేసి చూశాడు. తర్వాత కొందరు మిత్రులతో కలిసి అధివాస్తవిక రచనలు రచింపనారంభించాడు.

ప్రతిఫలాపేక్ష లేకుండా ఒకరు అధివాస్తవిక నాటకం ప్రదర్శించారు. మరొకరు ఫోటోగ్రఫీలోకూడా అధివాస్తవికత ప్రవేశపెట్టారు. 1936లో ఇంగ్లండులో అధివాస్తవిక ప్రదర్శనం జరిగింది. దీనితో ఇంగ్లండులో మంచి అలజడి కలిగింది.

హెర్బర్టురీడ్[1] ఇంగ్లండులో ఈ ఉద్యమానికి నాయకత్వం వహించాడు. అతిడిలా చెప్పాడు—

"మానవునికి మానసికంగా ఎన్నో శృంఖలాలు ఉన్నాయి. వాటినిబట్టే ఊహలు కూడా సంకుచితంగా ఉంటాయి. అందుకే ఆ శృంఖలాలను బ్రద్దలుకొట్టడానికి షాక్ నిచ్చే రచనలు కావాలి. అదే అధివాస్తవికత"

1935లో నేను 'డాడా తిరుగుబాటు-అధివాస్తవికత ప్రయోగం' అనే పుస్తకం చదివాను. దాని తర్వాత మరికొన్ని అధివాస్తవిక రచనలు చదివాను. నేను వ్రాసిన మహాప్రస్థాన కావ్యం అంతకు పూర్వం వ్రాసినదే. అప్పటినుంచే మరికొందరు మిత్రులతో అధివాస్తవిక రచనల ప్రయోగం చేసి చూశాను. కొన్ని అధివాస్తవిక రచనలు కొనసాగించాను. ఇదీ క్లుప్తంగా అధివాస్తవిక చరిత్ర.

అధివాస్తవికత ఒక నిర్జీవవాదం అని ఒక మిత్రుడన్నాడు. నిర్జీవవాదమైతే మన మింత చర్చించనవసరం లేదు. సంపూర్ణ స్వాతంత్ర్యంలా, అధివాస్తవికతను నిర్వచించడం కష్టం గావచ్చు. అంతేగాని అధివాస్తవికులు ఉన్మాదులు కారు. లోకాన్నే ఉన్మాదులను కావించారు. అధివాస్తవిక శిల్పంతో చిత్రాలు వేసి డబ్బు సంపాయించుకొన్న వాళ్ళను నేనువిన్నాను. కొంతమంది అధివాస్తవిక ఉద్యమనిర్మాతలు దానిని వదిలి వేసిన మాట నిజమే. మరికొందరు స్వార్థానికై ఫ్రాంకోకు దాసులైన మాటనిజమే అయినా, అశాంతి, ప్రస్తుత వ్యవస్థలు ఉన్నన్నాళ్లు అధివాస్తవిక రచనలకు అవకాశం లేకపోలేదు.

*ప్రజాతంత్ర 16—1—1977*

1 హెర్‌బర్టు రీడ్ (1893—1968) ఆంగ్లకవి, సాహిత్య కళా విమర్శకుడు. కళావిమర్శ గురించి చాలా పుస్తకాలు రాశాడు. నవ్యత, ప్రయోగం అంటే బాగా ఇష్టం.

# కవిత్వ ఆరంభం

## ఒకటి - మథనం

మౌనాన్ని మోసుకుంటూ పేవ్‌మెంట్‌మీద నడుస్తున్నాను. ఒకటీ రెండుచెట్లూ, రెండుమూడు టెలిగ్రాఫుస్తంభాలూ నాకు దారివదలి తప్పుకున్నాయి. నా బద్ధకానికి పుట్టిన మౌనాన్ని మోసుకుంటూ నడుస్తున్నాను. మేకలాంటి మేఘం ఒకటి దూరంగా ఆకాశంలో ఆలోచిస్తూ కనబడింది.

"నేనేదో ఏదో ఆలోచిస్తూ
దారంట వారంట పోతూ ఉంటే"

అని ఎప్పుడో ప్రారంభించి పూర్తిచెయ్యకుండా వదలిన గేయం ఒకటి నా మరపుమడతల మరకలలోంచి తొంగిచూసింది.

'తలలో పుట్టి
కలలో పెరిగి
ఉద్రేకంతో నిండి
ఉన్మాదంలో పండి.....'

మసక మరపుల మరల సందుల్లోంచి నా అసమగ్ర గేయపు పీలికలు వేలాడుతున్నాయి. మేషం వేషంలో ఉన్న మేఘం మారిపోయి పారిపోయింది.

"నేనేదో ఏదో ఆలోకిస్తూ..
కడలిలో కడవలా కదుల్తూ ఉంటే....."

అనూరుడిలాంటి నా అసంపూర్ణగీతం కుంటుకుంటూ నక్కిపోయింది వెనక్కి. అవి నేను బీభత్సాలను అనుభవాలకే వడబోస్తున్న దినాలు.

"కాలకూటపు గాటపు పొగలలో
గంధక ద్రావకపు కాసారంలో
గండభేరుండాల కౌగిలింతలలో"

కాలంవేరు. స్థలంవేరు. కాని తొలిదినాల అనుభవాల పరిమళాల కలరవాల జ్ఞాపకాల పరిసరాలు చేరుకున్నాను. వృషభంలాగ, మిధునంలాగ, కర్కాటకంలాగ నా మేషం రాశులు రాశులుగా ఆకాశంలో ఆకారం ధరించింది.

'కర్కాటక కర్కోటక...
దారుణమారణ దానవభాషలు,
ఫేరవభైరవ భీకర ఘోషలు''
నా చీకటికేక బాకాలోకి ప్రాకిపోయాయి
''నే నంతో ఇంతో సంతోషంతో....''

పాడాలనుకున్న పాట నేటికీ పూర్తికానే లేదు.

కాలం కిందటిదశాబ్దం. స్థలం కలకత్తానగరం. నాటి నా బీభత్సం కేవల వ్యక్తిగతం, ఉద్రేకం, ఉద్వేగం నావే. ఉన్మాదం నాదే. సొంతగొంతుకను వెదుక్కోవడానికి పరిశోధనలు సాగిస్తున్న ఆ రోజులలో ఏవో ఏవేవో ఛందస్సులు సుడులు తిరిగేవి నాలో లోలోపలి లోయల లోతులలో.

''నీ లోపల నీలోత్పల
నీలోపల నిశ్శబ్దం;
నిశ్శబ్దపు చీకటిలో
నీ కేకకు మంగళం....'

అని మరోశకలం, ఇది నావ్యక్తిగత నిర్వేదంకాదని పోల్చుకోవడానికి నాకెంతో కాలం పట్టలేదు. ప్రపంచమే కృంగిపోతూ ఉంటే నేను పందొమ్మిదోశతాబ్దపు ఫ్రెంచిమహాకవుల ప్రభావానికి లొంగిపోతున్నట్లు గుర్తించాను. ఒంటరితనాన్ని ఒదుల్చుకోవడానికి పరుగెత్తుకు వెళ్ళి బజారులో పడ్డాను. కష్టపడి సంపాదించిన సొంతగొంతును బజారులోపారెయ్యడం కాదిది. సార్వజనీనమైన సంగీతాన్ని సాధించేయత్నం. ప్రజల బ్రదుకులో ఇదివరకే మెదులుతూన్న ప్రబలచలనం గమనిస్తూవచ్చాను. అప్పుడు నా పాటల గమకం జీవితగమనం. దాని జవనం నా కవనం.

అనామధేయ మహాకవులకు అభివాదాలు సమర్పించాను. పాటకపుజనుల పాటలలోని ప్రాణవాయువులు పీల్చుకున్నాను. జవికమీద పాడిన జంగం కథలు విన్నాను. రోజురోజుకీ రకరకాల ఛందస్సులు తమ రహస్యాలను నాకుపదేశిస్తూ ఉండేవి. వాటి వాటి గమనంలో సమాజజీవిత జవనం స్ఫురింపజేయాలనే అప్పటికీ ఇప్పటికీ నా మథనం.

*ఈ వ్యాసం మొదటిసారి ఏ పత్రికలో అచ్చయిందో తెలియలేదు.*
*పునర్ముద్రణ: శ్రీశ్రీ సాహిత్యం రెండు వచన విభాగం*
*ప్రజాతంత్ర 3–8–1975*

# రెండు – ఆరంభం పెద్ద అవస్థ

''రావద్దు రావద్దులోనికి
రాస్తున్నానొక గీతం

రావద్దు రావద్దు లోనికి...
నను చూడ, కాదిది వేళ
నా మనః కార్మిక శాల
క్రక్కేది చండాగ్ని సెగలు
క్రమ్మేది......

సరే. ఏమయితేనేం? లోనికి రావద్దని మొదటే చెప్పి తర్వాత లోపల జరుగుతున్నదేమిటో వర్ణించబోవడం. అందుకే ఆరంభించిన గీతం పూర్తికాలేదు. ఈ విధంగా నేను మొదలుపెట్టి వదిలిపెట్టిన గీతాలు చాలా వున్నాయి.

"తలలో పుట్టి
కలలో పెరిగి
ఉద్రేకంతో నిండి
ఉన్మాదంలో పండి
కాలకూటపు గాటపుపొగలలో
గంధక ద్రావక కాసారంలో
గండభేరుండాల కౌగిలింతలలో....'

తర్వాత జ్ఞాపకంలేదు.

"వాకిట్లో చీకట్లో ఎవరా కేక
వేవేలే..వేవేలే..వేవే.."

అసంపూర్ణంగా ఉండిపోయేవి ఒక్క గీతాలే కావు, కథానికలూ! ఉదాహరణకి గురజాడ అప్పారావుగారు ఎన్నో కథలకోసమని నోట్సురాసి పెట్టుకున్నారు. చిత్రకారుని రచనలు మాటవరసకి, "ఈ బొమ్మ చాలాబాగుందండీ. పూర్తి చెయ్యలేక పోయారా?"

ఎలాగైనా ఆరంభం పెద్ద అవస్థ.
"క్షితిజరేఖకు ప్రారంభం ఎక్కడ?" అన్నాడొక కవి.

కాని అసలు ఆరంభమనేది ఉన్నదా అని వేదాంతితోబాటు మనం ప్రశ్నించుకోవాలి. 'సాయంకాలమైంది. పూటకూళ్ళమ్మకు సంతలో సామాను కొనిపెడతానని..' అని ప్రారంభమవుతుంది కన్యాశుల్కం నాటకం. కాని అప్పటికే ఎంతో కథ లయిపోయింది. ఈసంతలో సామాను కొనిపెడతాననడమే ఒక వెలరోజులకిందట! గిరీశం ప్రవేశించడమే బోలెడంత పూర్వకథతో ప్రవేశిస్తాడు. అలాగే ఆ నాటకంలోని ప్రతిపాత్రా కూడా.

అలాగే కావ్యప్రపంచంలోని ప్రతి గీతానికి ప్రారంభానికి ముందే పుష్కలమైన పూర్వ కథ ఉంటుంది. "దూరాన నారాజు కేరాయి డాబో" అని ఎంకి ఆక్రోశించినప్పుడు మొదటి మాటలోనే మనం ఎంకికీ నాయుడుబావకీ మధ్యమున్న దూరాన్ని గ్రహించుకుంటాము.

"మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది.'

ఈ విధంగా ప్రారంభమైన గీతానికిపూర్వం నా మనస్సులో ఏం జరిగింది?

ఈ గీతాన్ని నేను 1934 సంవత్సరం ఏప్రిల్‌నెల 12వ తేదీనాడు రాశాను. దీన్ని రాయడానికి నాకు అయిదునిమిషాలకంటె ఎక్కువ పట్టలేదు. మరో ప్రపంచం అని ప్రారంభించి ఝుగఝుగలు అని ముగించేదాకా పెన్సిలు ఆపలేదు. ఔను. ఈ గీతాన్ని పెన్సిలుతోనే రాశాను. ఒకవ్యాసం రాద్దామని "మరో ప్రపంచం" అనే శీర్షిక కాగితంమీద రాసేసరికి కలంలో సిరా అయిపోయింది. సిరా పోస్తూ ఆలస్యం చేయడమెందుకు అని కాపీయింగ్ ఇంక్ పెన్సిలు తీశాను. నాన్ స్టాప్‌గా నడిచిన పెన్సిలు, ఝుగఝుగలు అనే మాట దగ్గర హఠాత్తుగా ఆగిపోయింది. రాసిందంతా చదివేసరికి ఒక్కడితో ఆ గీతం అయిపోయిందని తెలిసింది. ఒక్క మార్పుకూడా చెయ్యకుండా మర్నాడు ఈ గీతాన్ని ఒక సుప్రసిద్ధ మాసపత్రికకు పంపించాను. పంపిన మూడవరోజుకి "రిటరన్డు విత్ థేంక్స్" అనే వర్తమానంతో గీతం నాదగ్గరికి తిరిగి వచ్చింది. అప్పటికీ గీతానికి 'మహాప్రస్థానం' అనే పేరు పెట్టలేదు. తర్వాత గీతంలో ఒకే ఒక్క మార్పుచేశాను.

"కదం తొక్కుతూ పదం పాడుతూ
కాండ్రు కాండ్రుమని గర్జిస్తూ...." అని తొలిపాఠం..

కాండ్రు కాండ్రుమని పులికేకకి, గర్జించడం సింహంచేసె ధ్వనికి ఉపయోగిస్తాం కాబట్టి ఈ ప్రయోగం నాకు సంతృప్తికరంగా లేకపోయింది. అంచేత—

"కదం తొక్కుతూ పదం పాడుతూ
హృదంతరాళం గర్జిస్తూ" అని మార్చాను.

ఈ గీతం రాసి కొన్ని నెలలయిపోయిన తర్వాత మహాప్రస్థానం అనే శీర్షికతో జ్వాల పత్రికలో ఇది ప్రకటితమయింది. అంతకుముందు సంచికలో వేదులవారి 'కాగడా' అనేగేయం, దాని ముందు సంచికలో అడివిబాపిరాజుగారి "ఎగుర నివ్వండోయ్ జ్వాలల్" అనే గేయమూ పడ్డాయి. అయితే మరోప్రపంచం పాట విశాఖపట్టణం టర్నరుసత్రంలో నేను చదివి వినిపించిన తర్వాతనే తాను జ్వాలకి పాట రాసినట్లు బాపిరాజుగారు ఒప్పుకున్నారు.

ముందుగా అడివి, వేదులవారి పాటలు వెయ్యడమేకాక, మహాప్రస్థానం ప్రకటించిన సంచికలోనే దానికన్న ముందుపుటలో "జ్వాలనా' అనే అనుకరణ రచన ముద్రించడంలో జ్వాలసంపాదకునికిగాని, అప్పట్లో అతనికి సలహాలు చెబుతూ వచ్చిన వారికిగాని దురుద్దేశాలున్నాయని నేనారోపించను. జరిగిన ఈ సంగతులను నేను గుర్తించానని మాత్రం చెబుతున్నాను.

ఈ పాటలోని ఆవేశానికి ప్రధాన ప్రోద్బలాలు లా మర్సెయ్యే, లా ఇంటర్ నేషనాల్,

బరన్స్ కవి రచించిన 'బెన్నాక్ బరన్', అలెగ్జాండర్ బ్లాక్ వ్రాసిన 'ది ట్వెల్వ్'' దరిమిలా.

ఈ ట్వేల్వుని నేను—
'నల్లని రాత్రి
తెల్లని మంచు
ప్రభంజనం, ప్రభంజనం'

అని ప్రారంభించి కొంతవరకు తెనిగించాను. హరీంద్రకవి 'షురూహుఅ హై జంగ్' అనే పాటా నజ్రుల్ ఇస్లామ్‌గీతాలూ నా మనస్సులో ఏవో మారుమూలల్లో మారుమోగుతూ ఉండిఉండాలి. అలాగే కవికొండల కవి కంఠంకూడా. ఫలానా చోట అని చెప్పడానికి లేకుండా మొత్తం నా కవితాభ్యాసంగం అంతటిమీదా ఎడ్గార్ ఎలన్ పో, గురజాడ అప్పారావుల ప్రభావం పనిచేస్తోంది. ఇంచుమించు ఆరోజుల్లోనే వేమన్నని నేనుమహాకవిగా శిరసావహించాను. లేకపోతే —

''తలుపుగొళ్ళెం
హారతి పళ్ళెం
గుర్రపు కళ్ళెం
కాదేదీ కవిత కనర్హం
ఔనౌను శిల్ప మనర్ఘం''

అనగలిగినపాటి ధైర్యం వుండేది కాదు.

మరోప్రపంచం గీతం రాయడానికి ముందు 1934వ సంవత్సరం ఫిబ్రవరి నెల 18వ తేదీన ఎడ్గార్ పో గంటలని అనురణిస్తూ (అనువదిస్తూకాదు) ఒక గేయంరాశాను. అందులో-

''హరోం హరోం హర హర హర హరహర
హరోం హరా అని పలికే గంటలు''

అన్న పాదాలు తతిమ్మా గేయంతో బేలమ్సు కాకపోవడంవల్ల వాటిని ఉపసంహరించాను. రెండునెలల తర్వాత ఆ 'హరోం హరోం హర' నించే మరోప్రపంచం గీతం వెలువడిందని అనవచ్చును.

ఇదే విధంగా ధ్వని సామ్యాన్నే వెతుక్కుంటూ వెళ్ళితే అప్పట్లో బరంపురం నవ్యసాహిత్య పరిషత్తులో శ్రీ శివశంకర శాస్త్రిగారు చదివిన—

మారోమారో, మారోమారో
ఒకటి రెండూ మూడు నాలుగు,
మారో మారో మారో మారో''

అనే శిష్ట్లా ఉమామహేశ రచన కూడా ఒక ప్రోద్బలమే అని చెప్పాలి.

భావకవిత్వపద్ధతులూ, గ్రాంథిక భాషలో పద్యరచనా వదిలిపెట్టి వ్యావహారిక భాషలో నవీన ధోరణిలో సాగించిన నా మొదటిరచన—

"నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను"

అన్నది. దీన్ని 1933 జూన్ 2న రాశాను. అప్పటికే శిష్ట్లా ఉమామహేశ విలక్షణమైన ఒక నవీన ధోరణిలో రచన సాగిస్తున్నాడు. కాని నరాసరిగా అవి నా రచనను ప్రేరేపించలేదు. శిష్ట్లా ప్రభావంతో ముద్దుకృష్ణ వ్రాస్తున్న వచనగీతాలు ఎప్పటికప్పుడు ముద్దుకృష్ణ ముఖతానే నేను వినేవాడిని. వచనగీతాన్ని కళారూపంగా తీర్చిదిద్దడానికి ముమ్మొందుగా నేను కొంత శోధనా, సాధనా సాగించాను. హరీంద్రనాథ్ గీతాలూ, మరికొన్ని ఆంగ్లగీతాలూ తెనిగించడం ద్వారా ఈ పరిశోధన చేశాను. స్వతంత్రంగా రాసిన నా మొట్టమొదటి వచనగీతం విద్యున్మాలికలు.

'' బారులు బారులుగ తీరిన
మబ్బుగుబ్బలుల దారుల
దారి తప్పి చరించె ఆ రేయి
తరళ సరళేరమ్మదములు...'

ఇత్యాది గీతం. ఇది గ్రాంథిక భాషలో ఉండడం ఇక్కడ గుర్తించాలి. ముద్దుకృష్ణనీ శిష్ట్లాని ప్రేరేపిస్తూన్న పాశ్చాత్య కవుల దగ్గరికి నరాసరిగా వెళ్ళాను. ఆంగ్లకవులతో సంతృప్తి కలుగలేదు. ఫ్రాన్సు, జర్మనీ దేశాలకవుల ఆకర్షణకి ముగ్ధుణ్ణయ్యాను. ప్రపంచ విశాలమైన దృష్టితో అంతటా కలయజూస్తేనేగాని కావ్యస్వప్నం సఫలీకృతం కాదని అప్పటికీ, ఇప్పటికీ నా అభిప్రాయం. ప్రపంచం అంతటా అభివృద్ధిని కాంక్షించే కవుల స్వప్నాలు రష్యన్ విప్లవంలో ఆకృతి ధరించడం నాకు కనబడింది. సామాజిక విప్లవానికి పురోగామిగా సాహిత్య విప్లవం సాగాలన్న దృఢనిశ్చయం ఏర్పడింది.

ఒకసారి గురజాడ వర్ధంతిసభలో కొంతమంది విద్యార్థుల ఎదుట ఉపన్యసిస్తూ "ఆడంబరంలో ఆర్భాటంతో కూడుకున్న సంస్కృత ఛందస్సులను నిరాకరించి సాహిత్యలోకంలో గురజాడ మహాకవి ముత్యాలసరాన్ని చేపట్టడం జాతీయజీవితంలో గాంధీ మహాత్ముడు అన్ని రకాల దుస్తులూ మానివేసి అంగవస్త్రాన్ని ధరించడం వంటి" దన్నాను. నిజానికి గాంధీజీ ఈ పనిచేయడానికి అనేక సంవత్సరాలకిందట గురజాడ కావ్యరంగంలో విప్లవమార్గం తెరిచాడు. దేశీయచ్ఛందస్సులలోనే అచ్చమైన తెలుగుతనం ఉందని నిరూపించాడు. అవే ప్రజల జీవితానికి అత్యంత సన్నిహితమైన వాహనాలని మర్చిపోయిన సంగతిని మళ్లీ జ్ఞాపకం చేశాడు.

'ముత్యాలసరం: ఒక కృషి' అని ఆ రోజుల్లో నేను వ్రాసిన వ్యాసం ఒకటి ఉదయిని పత్రికలో వచ్చింది. మరో ప్రపంచం ఛందస్సుమీద కూడా అంతసమగ్రంగానూ చర్చించడానికి వీలుంది. అయితే అదిప్పుడుకాదు. ఇక్కడ సూచనప్రాయంగా మాత్రమే పరిశీలిస్తే చాలుననుకుంటాను.

చతురశ్రగతిలో నడిచే ఎనిమిదిమాత్రల ఛందస్సు మరోప్రపంచం. 'పుత్తడి బొమ్మా పూర్ణమ్మా' అనే పాటలోని ఛందస్సుకూడా ఇదే. బొబ్బిలిపదం కొయ్యోడి పాట ఒకటేమిటి, ఎన్నో జానపదగేయాలూ స్త్రీంపాటలూ ఈ ఛందస్సులోనే వున్నాయి. మహాప్రస్థానం, జ్వాలాతోరణం, నవకవిత, ప్రతిజ్ఞ, శైశవగీతి మొదలైన నా రచనలూ,

'అలసిన కన్నులు కాంచేదేమిటి?
తొణికిన స్వప్నం!
తొలగిన స్వర్గం'

అనే గీతికలోని ప్రశ్నోత్తరపూర్వకమైన విరుపులు ఈ ఛందస్సులో వైవిధ్యం సాధించడానికి నేను చేసిన ప్రయత్నం.

''ఎముకలు క్రుళ్ళిన వయస్సుమళ్ళిన
సోమరులారా చావండి!
నెత్తురు మండే శక్తులు నిండే
సైనికులారా రారండి!''

అన్నచోట అంతఃప్రాసలూ, అంత్యప్రాసలూ "గీత గోవిందం"లోని

''ముఖర మధీరం త్యజ మంజీరం
రిపుమివ కేళిషు లోలం
చల సఖి కుంజం సతిమిరపుంజం
శీలయ నీలనిచోళం''
అన్న పోకడతో పోలికకు వస్తాయి.
''మరోప్రపంచం మరోప్రపంచం
మరోప్రపంచం పిలిచింది.''

అని ప్రారంభంలో ఒకే పద సముచ్చయాన్ని ముమ్మారు పలికించడంలో

'భజగోవిందం భజగోవిందం
గోవిందం భజ మూఢమతే''

అనే శ్రీ శంకర భగవత్పాదుల అమేయగేయం స్ఫురణకొస్తుంది. మూడవసారి కూడా భజగోవిందం అనకుండా గోవిందం భజ అని తిప్పికొట్టడంలో ఆచార్య శంకరుల అసాధారణ ప్రజ్ఞ సుస్పష్టమవుతుంది.

''సముద్రం సముద్రం స్మైర సముద్రం
వినీల విశాల విలోల సముద్రం

అని నేను ప్రారంభించి పూర్తిచెయ్యని ఇంకో గీతం వుంది. ఇంగ్లీషులో సరిగా ఇదే విధంగా "ది సీ ది సీ ది స్మైలింగ్ సీ'' అని ప్రారంభమయే ఒక గీతాన్ని చూసినతర్వాత నాపాట పూర్తిచెయ్యాలనే ధ్యాసపోయింది.

మరో ప్రపంచానికి అంధానుకరణప్రాయంగా "మరో వసంతం" అని ఒకరిద్దరు రాశారు. అంతకన్న

"పొగాకు తోటలు
పొగాకు తోటలు
పొగాకు తోటలు పండింతున్"

అని ఎవరైనా పేరడీ చేస్తే నేను ఎక్కువ సంతోషించి ఉందును.

పద్యాన్ని గద్యంనుంచి వేరుచేసి చూపేది ఛందస్సే అయినా ఛందోనుబద్ధంగా రచన సాగించి కావ్యత్వం సాధించడం సాధ్యమే అని వచనగీతాల సంవిధానం రుజువుచేస్తుంది. సెమాంటిక్స్ అను కావ్యానుశీలన విధానాన్ని పాశ్చాత్యకవితా కళాభిజ్ఞులు ఇటీవల చాలావిస్తరంగా అభివృద్ధిచేశారు. ముఖ్యంగా ఆంగ్లకవయిత్రి ఎడిత్ సిట్‌వెల్ తన గీతాల సంపుటి ఒకదానికి ఉపోద్ఘాతం రాస్తూ ఈ నూతన విమర్శలో కొత్తకొత్తలోతులు చూపించింది. సెమాంటిక్స్ అంటే కవిత్వం చేసే సవ్వడి.

"త్రిభువన శుక దృఢ పంజర
విభవమహితునకు సమస్త విష్టప నిర్మో
కభుజగపతికి, నిఖిలజగ
దభిన్న రూపునకు-

అని ఛందోబద్ధమైన కంద పద్యంలోనే కాక

"ఆ చెంరేగిన కలగా పులగపు
వలయావర్తపు
బలవత్ ఝురవత్ పరివర్తనలో
నే నేయే వీథులలో
చంక్రమణం చేశానో"

అన్న గణబద్ధంకాని పాదాలలో కూడా ఈ సవ్వడి వినిపిస్తుంది. తిక్కన మహాభారతం లోని యెన్నెన్నో వచన గమకాలలో కవన మణిగణరణన గణగణలు వినపడతాయి.

వచనాన్నే పిన్నపెద్ద పాదాలుగా రాసినంత మాత్రంచేత వచనగీతం సిద్ధించదు. లేదా ఏ కందపద్యాన్నో గీతపద్యాన్నో ఇక్కడోమాత్రా, అక్కడోగణం లాగేసి కుంటించినా వచన గీతంకాదు. వచనగీతానికి లక్షణం ఏమిటని అడిగితే నిర్వచించడం కష్టమే. కవిత్వం అంటే ఇదీ అని నిర్ధారణగా చెప్పగలిగినప్పుడే వచనగీతం అంటే ఇదీ అని చెప్పవచ్చును. చాలామంది మాత్రాచ్ఛందస్సులో గేయానికి వచనగీతానికీ ఉన్న తేడాని తెలుసుకోలేరు. కొన్నిమాత్రం ఛందోబద్ధమైన గేయాలు అక్కడక్కడ విరిగిపోయి వచన గీతానికి చేరువగా వస్తాయి.

"ఎగిరించకు లోహవిహంగాలను
కదిలించకు సుప్తభుజంగాలను

ఉండనీ,
మస్తిష్క కులాయంలో
మనో వల్మీకంలో''

అనే గీతంలో మధ్యని పడ్డ ఉండనీ అనేమాట అంతకుముందు వచ్చిన రెండు పాదాలనీ అడ్డగించి నిలబెడుతుంది. స్థూలదృష్టికి ఇది ఇందాకా నేనుచెప్పిన కందపద్యాన్ని కుంటించడం లాంటిదే. కాని ఇక్కడ ఒక ప్రయోజనంతో ఈ పని జరిగింది. ఈ గీతాన్ని మాత్రాచ్ఛందంలోనే చేర్చాలిగాని వచనగీతం అనడానికి వీల్లేదు.

'మహాప్రస్థానం' గీతసంపుటిలోని చాలా రచనలు ఒక్కమాటు ఒక్కచోట ఒక్కపూటలో రాసినవే. కాని నాలుగైదు గీతాలుమాత్రం మొదట ప్రారంభించి తర్వాత కొన్నాళ్ళకు పూర్తిచేసినవి. 'దేశచరిత్రలు' వరుసగా రెండురోజులు కూర్చుని రాశాను. ప్రారంభించిన తేదీకాక పూర్తివేసిన తేదీనే విషయానుక్రమణికలో ఇచ్చాను. మొదట కొంతవరకు రాసి, తర్వాత చాలాకాలానికి పూర్తిచేసిన గీతాలలో ముఖ్యమైనది 'జగన్నాథుని రథచక్రాలు'. ఇది ఎప్పటికీ అసంపూర్ణంగా ఉండిపోతుందేమో అని ఒక్కొక్కప్పుడు నాకే సందేహం కలిగేది. ఇదిలేకుండా మహాప్రస్థానం పూర్తికావడానికి వీల్లేదు. కాని తొందరపడి ఏదోవిధంగా రాసెయ్యడానికి యిష్టంలేదు. మహాప్రస్థానం సంపుటిలో మొట్టమొదటి గీతం మహాప్రస్థానం, చిట్టచివరిగీతం జగన్నాథుని రథచక్రాలు ఉండాలని నా ఉద్దేశం. ఎలాగైతేనేం అనుకున్నవిధంగా 1940లో ఒకరోజు రథచక్రాలు రాయడం పూర్తిఅయింది. కాని తర్వాత పదేళ్ళవరకుగాని గ్రంథం అచ్చుకాలేదు. అందుచేత 40 తర్వాత వ్రాసిన నీడలు, నిజంగానే, గర్జించురష్యా అనే గేయాలు కూడా ఈ సంపుటిలో చేర్చాను. 1930 నుండి 50 దాకా చాలా అధివాస్తవిక గీతాలూ, హాస్యపద్యాలూ వ్రాసినప్పటికీ వాటిని విడివిడిగా అచ్చువెయ్యవల్సి ఉంటుందని మహాప్రస్థానం సంపుటిలో చేర్చలేదు.

ఇదీ నా కవితా ప్రస్థానం కథ. అయితే 1930 కి పూర్వం వ్రాసిన పద్యాలను గురించిగాని, 50 తర్వాత రాస్తున్న రచనలను గురించి గాని ఇక్కడ ప్రస్తావించలేదు. కవిత్వమే కాదు, ఏది రాద్దామనుకున్నా కృత్యాద్యవస్థే. అయిదునిమిషాలలోరాసినా, అయిదేళ్ళలో రాసినా కృత్యాద్యవస్థే. ఒకసారి నేను ఒక్కరోజున పది సినిమాపాటలు రాశాను. పది పదిహేను ఏళ్లనుంచీ రాయాలనుకున్న 'సదసత్సంశయం' కిందటేడే ప్రారంభించాను. ఇంకా పూర్తి చెయ్యలేదేమని కొందరు మిత్రులు విసుగ్గా అడుగుతారు. వారికేమని జవాబు చెప్పడం? మరి కొంచెం వ్యవధి ఇవ్వండని అడగడం తప్పు?

రేడియో ప్రసారితం
*ముద్రణ: పరిశోధన ద్వైమాసపత్రిక జూన్ 1954*
*పునర్ముద్రణ: శ్రీశ్రీ సాహిత్యం రెండు వచన విభాగం*
*ప్రజాతంత్ర 20–7–1975*

# శ్రీరంగంలో శ్రీనివాసరావు

## ఒకటి

ఇవాళ 17-12-75, ఇరవైఆరు సంవత్సరాల కిందట సరిగా ఈ రోజున (17-12-49) నేను తిరుచినాపల్లిలో వున్నాను.

తెలుగుసాహిత్యంమీద ఇంగ్లీషులో ఒక ప్రసంగం చదవడానికి తిరుచినాపల్లి రేడియోవారు నన్నాహ్వానించారు. ఆహ్వానం మూడునెలల క్రితమే అందినా, ప్రసంగం మాత్రం వాయిదాలువేస్తూ వేస్తూ ఆఖరికి డిసెంబరు 16వ తేదీరాత్రికి తయారుచేశాను. ఈ విధంగా నేను "రాయని భాస్కరుడు" అనే బిరుదుకు దూరంగానే వుంటూవచ్చాను. ఆ బిరుదు ఒకప్పుడు నేను కృష్ణశాస్త్రిగారికి ఇచ్చాను. అదీ ఒక రేడియో కార్యక్రమం సందర్భంలోనే.

అది స్వాతంత్ర్యోత్సవ కవి సమ్మేళనం. మద్రాసురేడియోలో చాలామంది కవులు పాల్గొన్నారు. ఇంకా సమ్మేళనం ప్రారంభానికి గంటో, అరగంటో వ్యవధి వుంది. అందరమూ ఒకరి కవితలొకరికి చదివి వినిపిస్తున్నాం. కృష్ణశాస్త్రిగారు వచ్చారు. ఆయనరాసింది వినాలని మా అభిలాష కాని, ఆయన తానేమీ రాయలేదన్నారు. అందుకే మీరు 'రాయని భాస్కరుడంటున్నాను' అన్నాన్నేను. చిరునవ్వుతో బిరుదాన్ని స్వీకరించారాయన.

ఆనాటి కవితాగానంలో కృష్ణశాస్త్రిగారి గేయం ఏదీ లేదని జ్ఞాపకం. లేక రజనీకాంతరావు చేత "జయ జయ జయ ప్రియభారత జనయిత్రీ" లాంటి వెనకటి రచన ఒకటి చదివించారేమో. ఈ విషయంలో నా జ్ఞాపకంమీద నాకే నమ్మకంలేదు.

కాని, నమ్మకంగా ఒకటిమాత్రం జ్ఞాపకం వుంది. రేడియో కవి సమ్మేళనానికి నేను చేసిన రచన "మహా సంకల్పం". దాన్ని 24 గంటల వ్యవధిలోరాశాను. అందులో

"ఏ స్వాతంత్ర్యం నిమిత్తం ఎవరెవ
రెవరో ఎందరో దేశసేవా
భాస్వంతుల్ బాలవృద్ధుల్ పతితులధి
కుల ప్రాజ్ఞులుత్ప్రజ్ఞులంతా
అస్వాశల్ వీడి లాఠీ హతులయి ఉరి
కొయ్యల్ కవుంగింట చేర్చా
రా స్వాతంత్ర్యం లభించిందని విని
హృదయం హ్లాదసంపుష్టమైతే"

అనే పద్యం విశ్వనాథ సత్యనారాయణగారికి బాగా నచ్చింది. అందుకొక కారణం క్లిష్టమైన సంస్కృతచ్ఛందస్సులో స్పష్టమైన వ్యావహారిక భాషని ఒప్పించడం అనుకుంటాను.

తిరుచినాపల్లి రేడియో ప్రసంగం ప్రతి నాదగ్గరలేదు. వాళ్ళ రికార్డులలో ఉందేమో నాకు తెలియదు. బహుశా ఉండివుండదు. ఇలాగే చాలాకాలం కిందట నేను రాసిన "మోహినీ రుక్మాంగద" అనే రేడియోనాటిక కూడా కాలగర్భంలో కలిసిపోయింది.అదో గొప్పనాటిక అని గొప్పలు చెప్పనుగాని దానికో విధమయిన చారిత్రక ప్రాముఖ్యం మాత్రం లేకపోలేదు. అది సాలూరు రాజేశ్వరరావు మొదటిసారిగా మ్యూజిక్ డైరెక్షన్‌చేసిన నాటకం. అందులో కొన్ని పాటలు అతనూ, మరికొన్ని రజనీకాంతరావు పాడేరు. ఆరోజులలో టేప్ రికార్డింగ్ లేదు. అయినా, రమారమి ఒక గంటకాలం సాగిన ఆ నాటకాన్ని డిస్క్ రికార్డింగ్ చేశారు. ఆ డిస్క్‌గాని, నా వ్రాతప్రతిగాని ఇప్పుడెక్కడా దొరకవు.

తిరుచినాపల్లి స్టేషనులో నేను దిగేసరికి ఇంకా తెల్లవారలేదు. ఆ చిరుచీకటిలోనే ఏదో హోటేల్‌కు వెళ్లి నాచేతిపెట్టెను ఓ గదిలోపారేసి వీధుల్లో తిరుగుతున్నాను. ఆ దగ్గరలోనే శ్రీరంగం వుందని ఎవరోచెప్పారు. ఇంతదూరం వచ్చినతర్వాత ఇంతదగ్గరలో వున్న మా ఊరుచూసి తీరవలసిందే అనుకున్నాను. ఉదయం పదిన్నరకి నేను రేడియో స్టేషనుకి వెళ్ళవలసి వుంది. బోలెడంత వ్యవధి. ఈలోగా ఒక్కసారి శ్రీరంగం చూసివద్దామనుకొని ఒక జట్కా లబ్బిసి పిలిచాను. నేను కొత్తవాణ్ణి. పైగా అరవం బాగా రానివాణ్ణి కాబట్టి మూడురూపాయలకు దమ్మిడీ తగ్గదన్నాడు. రానూ, పోనూకూడా కాదు. కేవలం ఈ ఊరినుంచి తీసుకెళ్లి ఆ వూరిలో దించడానికి.

జట్కాలో కూర్చున్నాను. కనీసం అయిదారు మైళ్ళు అయినా ప్రయాణం చెయ్యవలసి వుంటుందేమో అనుకున్నాను. బండి కావేరినది రోడ్డువంతెన మీదుగా పోతోంది. వంతెన దాటగానే "ఇదే శ్రీరంగం! దిగిపొమ్మ"న్నాడు జట్కావాడు. అప్పుడు తెలిసింది. కావేరీనదికి ఇవతలి ఒడ్డున తిరుచినాపల్లి, అవతలి ఒడ్డున శ్రీరంగమూ అని.

మూడు రూపాయలు తీసుకొని జట్కావాడు (ఇంకా పూర్తిగా మాయంగాని చీకట్లో) మాయమైపోయాడు. ఎవరో అడిగారు నన్ను జట్కాకి ఎంత ఇచ్చావని. మూడు రూపాయలన్నాను. "బాగా మోసపోయావు. ఆరుగంటలు దాటిన దగ్గరనుంచి అయిదేసి నిమిషాలకి ఒక బస్సు చొప్పున రెండు ఊళ్ళమధ్యా తిరుగుతూనే వుంటాయి. తిరుచినాపల్లి నుండి శ్రీరంగానికి టిక్కెట్టు ఒక్కణా" అన్నాడు.

కార్మికవర్గమంతా నిజాయితీపరులే అన్న భ్రమ నాకెప్పుడూ లేదు. ఉన్నవారినీ, లేనివారినీ ఒకేవిధంగా మోసకారితనానికీ, దగాకోరుతనానికీ పురికొల్పుతుంది ఈ పెట్టుబడిదారీ విధానం. చెయ్యవలసింది ఈ విధానాన్ని మార్చడంకాదు, పరిమార్చడం. స్వార్థమూ, లాభాపేక్షా అనే పునాదులమీద లేచిన ఈ అందవికారపు భవనాన్ని నేలమట్టం చేసినతర్వాతనే సమసమాజ నిర్మాణం సాధ్యమవుతుంది. ఈ వ్యవస్థ ఇలా సాగుతున్నంత కాలం

వర్తకులూ మోసంచేస్తారు. రిక్షావాళ్ళూ మోసం చేస్తారు. అన్నిరకాల మోసాలకూ పెట్టనికోట లుగా మన దేవాలయాలు ఉండనే ఉన్నాయి.

శ్రీరంగంలో రంగనాథ దేవాలయం సందర్శించాను. దేవుణ్ని మాత్రం చూడలేదు. అతనెక్కడో గర్భగుడిలో శేషతల్పంమీద నిద్రపోతూ ఉంటాడు. అదో పెర్మనెంటుభోజు. ఆ నిద్రపోతున్న దేవుడే అనుదినం భక్తజనులు అనేకవిధాల ఆరాధిస్తూ ఉంటారు. గర్భగుడిలోకి వెళ్లాలనిగాని, శ్రీరంగసాయిని చూడాలనికాని నాకు లేనేలేదు. దేవాలయ శిల్ప సౌందర్యాన్నిమాత్రం ఆస్వాదిస్తూ ఆ పరిసరాల్లోనే తిరుగుతున్నాను. ఇంతలో ఒకతనువచ్చి నన్ను దేవుడిదర్శనం చేసుకొమ్మనీ, అందుకు కావలసిన పూజాద్రవ్యాలన్నీ తనదగ్గర అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయనీ అన్నాడు. "నాకో మంచి అమ్మాయిని చూపించగలవా?" అని అడిగేను. అడిగినందుకు అతనేమీ బాధపడలేదు. తనది టెంపిల్ బిజినెస్ అనీ, నాకు కావలసిన ఏర్పాటు చెయ్యగలవాణ్ని కావలిస్తే చూపిస్తాననీ అన్నాడు. "టెంపిల్ బిజినెస్" అని ఇంగ్లీషుమాటలే అతను వాడాడు. అంత స్పష్టంగా తనవృత్తిని నిర్వచించినందుకు నాకు చాలా సంతోషమనిపించింది. అన్నప్రకారం అతను మరో మనిషిని చూపించాడు. దేవాలయం వదలిపెట్టి ఆ కొత్తవాడివెంట పడ్డాను.

"నువ్వేమీ తొందరపడకు. నాలుగైదు చోట్లు చూపిస్తాను. ఎంచుకోవచ్చు" అన్నాడు. నాకు నిజంగానే తొందరపని ఉంది. వీలయినంత త్వరగా రేడియోస్టేషనుకు వెళ్ళాలి. అందువల్ల మేం ఇద్దరం వెళ్ళిన మొట్టమొదటి ఇంటిలోనే నా పని ముగించుకున్నాను. మళ్ళీ సాయంత్రం వస్తానులే" అన్నాను. "తప్పకుండా రావాలి. దేవాలయం దగ్గరే కాచుకుని ఉంటా"నన్నాడతను.

రేడియో కార్యక్రమం అయిపోయినతర్వాత తిరుచినాపల్లి నుంచి శ్రీరంగానికీ, శ్రీరంగంనుంచి తిరుచినాపల్లికీ నాలుగైదుసార్లు (బస్సుమీద) తిరిగేనుగానీ దేవాలయం వైపుకి మాత్రం పోలేదు.

తిరుచినాపల్లిలో పర్వతదుర్గం చాలా చరిత్ర ప్రసిద్ధమైంది. దాన్ని దూరంనుంచి మాత్రమే చూశాను. చరిత్రాత్మకమయిన కట్టడాలన్నా, శిథిలాలన్నా నాకు అసహ్యమయితే లేదుగాని ఆకర్షణకూడా లేదు. ఢిల్లీ రేడియోలో న్యూస్ ఎనౌన్సర్‌గా ఉండిన రోజుల్లో ఎన్నోసార్లు ఎర్రకోట పక్కనుంచే నడచుకుంటూ వెళ్ళేవాణ్ణి. ఎప్పుడూ లోనికి వెళ్ళి చూడాలనిపించలేదు. మొన్నకాబోలు మా ఆవిడ సరోజని సంతృప్తి పరచడానికి టిక్కెట్లు కొనుక్కొని ఇద్దరమూ వెళ్ళాము. వెళ్ళింది మొదలు ఎంతవేగంగా బైటికిపస్తామా అనే నాకుంది. సరోజమాత్రం సరదాగా కొంత షాపింగ్ చేసింది. అక్కడ చేసిన ఖర్చంతా అనవసరం అనే నాకనిపించింది.

జేమ్స్‌జాయిస్[1] ఒక చోట అన్నాడు. "రోము నగరం తన తాత ముత్తాతల శవాల్ని ప్రదర్శించుకొని బతుకుతోంది" అని! ఈ శవారాధన ఎప్పుడూ నాకిష్టంలేదు.

ఒకమారు నేనూ, శివశంకరశాస్త్రిగారూ, కృష్ణశాస్త్రిగారూ మరి కొందరమూ రాఘవాచార్యులుగారి[2] అతిధులుగా బళ్ళారి వెళ్ళాము. అప్పటికే రాఘవాచార్యులుగారు బాగా ముసలివారై పోయారు. వార్ధక్యపు శైధిల్యం వారిముఖంలో స్పష్టమైన ముద్ర వేసింది. మూడురోజులపాటు వారింట్లో ఉన్న తర్వాత ఇక వెళ్ళిపోదామనుకుంటూ ఉంటే "దగ్గరలోనే హంపీ శిథిలాలున్నాయి. ఒక్కరోజు మాత్రం ఆగి చూసిపొండ"న్నారు ఆచార్యులుగారు. "హంపీ శిథిలాలను వేరే చూడడం ఎందుకూ? మిమ్మల్ని చూస్తూనే ఉన్నాంగా!"అన్నాన్నేను. నామాటల్ని అవమానంగా కాకుండా అభిమానంగా తీసుకోవడంలో ఉంది బళ్ళారిరాఘవ గొప్పతనం.

శ్రీరంగంలో నేను 17-12-49లో వున్నట్టు తేదీతోసహా నాకెలా జ్ఞాపకం వుందని కొందరికయినా ఆశ్చర్యం కలగవచ్చు. మరేంలేదు. ఆరోజు తిరుచినాపల్లిలో ఒక ఫ్రెంచి నిఘంటువూ, ఒక ఫ్రెంచి భాషాబోధిని పుస్తకమూ కొన్నాను. రెండిటిమీదా ఊరుపేరు, కొన్నతేదీ నోట్‌చేసుకున్నాను. ఆశ్చర్యమల్లా ఆ పుస్తకాలింకా నా దగ్గర వుండటమే!

*ప్రజాతంత్ర 4–1–1976*

1 జేమ్సు జాయిస్ (1882– 1941) ఆంగ్ల రచయిత, నవలాకారుడు, యులిసెస్ , ఫినిగాన్సువేక్ కొత్త పద్ధతిలో రాసిన నవలలు. సాహిత్యంలో చైతన్యస్రవంతి ధోరణిని బలంగా ప్రవేశపెట్టాడు జాయిస్. శ్రీశ్రీ చరమరాత్రి కథలమీద జాయిస్ ప్రభావం ప్రబలంగా వుంది.

2 బళ్ళారి రాఘవాచార్యులు (1880– 1946) ప్రఖ్యాత స్టేజినటుడు అంతర్జాతీయ ఖ్యాతి గడించారు. మాలపిల్ల మొదలైన సినిమాల్లో కూడా నటించారు

# నా విదేశీ యాత్రానుభవాలు

## ఒకటి

నా చిన్నతనంలో మా నాన్నగారు అంటూండేవారు, నన్ను ఇంగ్లాండు పంపించి ఐ.సి.యస్ చదివిస్తానని. ఆ రోజుల్లో మాది విశాఖపట్టణంలోని ధనిక కుటుంబాలలో ఒకటి. అందుచేత అప్పుడు నాకు ఇంగ్లాండు ప్రయాణం అసాధ్యమనిపించలేదు. పదిహేను రోజులు స్టీమరులో ప్రయాణం చెయ్యడం విసుగ్గానే వుంటుంది. అయినా తప్పదు. సీసిక్నెస్ (సముద్రపు రుగ్మత)కు తట్టుకోవాలి. ఇలాగే ఏవేవో ఆలోచించేవాణ్ని. తీరా నేను బి.ఏ ప్యాసయిన నాటికి మా ఆర్థిక పరిస్థితి అత్యంత నికృష్టంగా తయారయింది. విదేశీ ప్రయాణం అసంభవం. ఆ విషయం అనుకోవడం కూడా అనవసరం. స్వదేశంలోనే నిరుద్యోగిగానూ, రకరకాల చిన్న చిన్న ఉద్యోగాలలోను ఎన్నో ఊళ్లు తిరిగేను. అప్పుడు నాకు విశాఖపట్టణం తప్ప మిగిలిన ఊళ్ళన్నీ విదేశీయమే అనిపించేవి. ఇప్పటికీ నేను జీవిస్తున్న తమిళనాడులో నేనొక ప్రవాసాంధ్రుణ్నే.

అనుకోనంత ఆశ్చర్యకరంగా 1953లో నాకు చైనా వెళ్ళే అవకాశం వచ్చింది. అప్పుడు నేను ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుణ్ని. రాజగోపాలాచారిగారు ముఖ్యమంత్రి. ప్యాస్‌పోర్టు కోసం అయన్ని కలుసుకున్నాను. చాలా ఆప్యాయంగా మాట్లాడాడు. ''పీకింగ్ నుండి ఆహ్వానం వచ్చిందా? చాలా సంతోషం'' అన్నారు. మరి ప్యాస్‌పోర్టు మాట? ''ఓ దానికేం. తప్పకుండా సిఫారసు చేస్తా''నన్నాడాయన. అన్నాడే కాని ప్యాస్‌పోర్టు ఇవ్వకూడదని లోపాయికారీగా రాశాడు. ఆ విధంగా చైనా ప్రయాణం ఆగిపోయింది.

1954లో మరో అవకాశం. ఈసారి స్టాక్‌హోంలో జరగబోయే ప్రపంచశాంతి సమితి సమావేశానికి ఆహ్వానం. అయినా ప్యాస్‌పోర్టు సమస్య ఉండనేవుంది. అప్పుడే ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కొత్తగా ఏర్పడింది. కర్నూలులో గుడారాల పరిపాలన సాగుతోంది. నేను నా జన్మస్థలమైన విశాఖపట్టణం వెళ్ళి అక్కడ కలక్టరుద్వారా ఆంధ్ర[1]ప్రభుత్వానికి అర్జీ పెట్టుకున్నాను. కలెక్టరు ఇంగ్లీషువాడు. చాలా సానుభూతితో సిఫారసు చేశాడు. అది పట్టుకుని కర్నూలు వెళ్లాను. ఒక్కొక్కరోజే గడిచిపోతోంది. ప్రయాణపు రోజు సమీపిస్తోంది. క్రింది ఉద్యోగులు చెయ్యాలని జాప్యం చేస్తున్నట్లు తర్వాత నాకు తెలిసింది. సరాసరి

[1] *ఆంధ్రరాష్ట్రం 1—10—1953న ఏర్పడింది. కర్నూలు రాజధాని. ముఖ్యమంత్రి టంగుటూరి ప్రకాశం పంతులుగారు. నీలం సంజీవరెడ్డిగారు ఉపముఖ్యమంత్రి.*

ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారిని[2] కలుసుకున్నాను. ఆయన కలుగజేసుకోవడంతో నాకు పాస్‌పోర్టు లభ్యమయింది.

తర్వాత జరగవలసిన లాంఛనాలన్నీ సక్రమంగానే జరిగిపోయాయి. మద్రాసు నుంచి ప్లేనులో బొంబాయివెళ్లి అక్కడ భారతీయ ప్రతినిధివర్గంతో ఎయిర్ ఇండియా విమానంలో కూర్చున్నాను. అరేబియన్ సముద్రం మీదుగా పశ్చిమమాభిముఖంగా ప్లేను పయనిస్తోంది. రాత్రిపూట కాబట్టి కిటికీలోంచి చూస్తే నక్షత్రాలు తప్ప మరేమీ కనబడ లేదు.

రెండో రెండున్నరో అయేసరికి కెయిరో చేరుకున్నాము. అది డిసెంబరు మాసం. ఉన్ని బట్టలు ధరించినందువల్ల అంతగా చలి అనిపించలేదు. కెయిరో విమానాశ్రయంలో టీ తీసుకున్నాము. మర్నాడు ఉదయం రోమునగరం చేరాము. అక్కడ కూడా విమానాశ్రయంలో ఒక గంట సేపు మజిలీ. పగలే అయినా చలి తీవ్రత హెచ్చింది.

సాయంత్రానికి లండన్ చేరుకున్నాము. అక్కడ మరీ చలిగా ఉంది. ఊళ్లోకి వెళ్లగానే నేను చేసిన మొట్టమొదటి పని ఒక ఓవర్‌కోటు కొనడం. లండన్‌లో మేం రెండు రోజులున్నాం. ఒక పెద్ద హోటేల్‌లోని ఒక చిన్న గదిలో నా బస. రోజుకు ఇరవై రూపాయలు బాడుగంటే చవకనే చెప్పాలి. గదిలో ఉన్నంతసేపూ ఎయిర్ కండిషన్ కారణంగా వెచ్చగానే ఉంటుంది. వెలుపలికి వస్తే మాత్రం ఓవర్‌కోటు విధిగా ధరించి తీరాలి.

లండన్‌లో ఆ రెండు రోజులూ ఏం చేశానో జ్ఞాపకం లేదు. దగ్గర్లోనే ఉన్న ట్రెఫాల్గర్ స్క్వేర్‌లో సంచారమూ, ఒకటి రెండు పుస్తకాల షాపుల్లో ప్రవేశమూ గుర్తుకొస్తున్నాయి. ఒక షాపులోఒక నీగ్రో రచయిత తన్ను తాను పరిచయం చేసుకొని కొత్తగా అచ్చయిన తన పుస్తకాన్ని సగర్వంగా నాకు చూపించాడు. సాటి రచయిత కాబట్టి మర్యాదగా ఆతన్ని అభినందించాను. ఎంతో ఆత్మవిశ్వాసంతో అతడు నాతో మాట్లాడాడు.

లండన్‌లోని భారతీయ విద్యార్థులు మా బృందాన్ని ఆహ్వానించారు. అక్కడ ఉత్తరాది విద్యార్థులకొక సంఘం, దక్షిణాది విద్యార్థులకు ఇంకొక సంఘమూ ఉన్నాయి. నేనూ, ప్రొఫెసర్ ముందస్సురీ దక్షిణాది సంఘానికి వెళ్ళాము. మిగిలిన వాళ్లందరూ ఉత్తరాది సంఘానికి వెళ్లారు. ఇక్కడ కూడా ఈ ఉత్తర దక్షిణ భేదాలేమిటా అనుకున్నాను. నేను వెళ్లినచోట చాలా మంది మళయాళీ విద్యార్థులున్నారు. వాళ్లందరూ ప్రొఫెసర్ ముందస్సురీని గుర్తించారు. నేనెవరినో తెలియక పోయినా నన్ను కూడా ఆప్యాయంగా పలుకరించారు. అక్కడ తెలుగువారి

2 ప్రకాశంగారు పేరుకే ముఖ్యమంత్రి. పాలనాధికారం మాత్రం సంజీవరెడ్డిగారి చేతిలోనే వుండేది. అందుకే శ్రీశ్రీ ఇలా అని వుండవచ్చు. ప్రకాశంగారి మంత్రివర్గం 6–11–1954న పతనమయింది. అప్పుడు శ్రీశ్రీ ఇలా రాశాడు.

పడిపోయిన ప్రకాసురుడి పాత్రప్రభుత గుడ్డిది
నిజానికది కాంగిరెద్దు నీలిసంజరెడ్డిది.
విశాలాంధ్ర దినపత్రిక 14–11–1954

నెహ్రూగారి హయాంలో కాంగ్రెస్ ఎన్నికల గుర్తు కాడెద్దులు. ఇందిరాగాంధీహయాంమొదట్లో ఆవు, దూడ చివరలో హస్తం. అందుకే శ్రీశ్రీ 'కాంగిరెద్దు' అన్నాడు.

నెవరినీ కలుసుకున్న జ్ఞాపకం లేదు. బిస్కట్లు తిని టీ త్రాగడం మాత్రమే గుర్తుంది.

లండన్ నుంచి స్టాక్‌హోంకు బయల్దేరాము. ఆమ్‌స్టర్‌డామ్‌లోనూ, కోపెన్‌హాగన్‌లోనూ చిన్న మజిలీ. అక్కడ నేను ధరించిన ఓవర్‌కోట్‌కి కూడా చలి ఆగలేదు. వేళ్లు కొంకర్లు పోతున్నాయి. ఢిల్లీలో కూడా చలికాలం తీవ్రంగా ఉంటుందిగాని ఈ చలిదేశాంలో అది మరీ విపరీతం. కోటు జేబుల్లోనే చేతులు దాచుకున్నాను. మళ్లీ విమానంలో కూర్చునేదాకా చలితో విడతెగని పోరాటమే.

స్టాక్‌హోంలో ఇంకా చలి ఎక్కువగా ఉంది. ఉత్తర ధృవం దగ్గరలోనే ఉందిగదా! అయినా ఉండడం హోటల్ గదిలోనూ, కాన్ఫరెన్స్ హాలుకి టాక్సీలలో ప్రయాణమూ కాబట్టి చలి ఎక్కువ బాధించలేదు. ప్రపంచశాంతి సభలు వారం రోజులపాటు జరిగేయి. మా ప్రతినిధి వర్గంలో పండిట్ సుందర్‌లాల్ వంటి ప్రముఖులున్నా ఫాదర్ విలియమ్స్ అనే జాతీయ క్రిస్టియన్ ఫాదరీని మా నాయకునిగా ఎన్నుకోవడం జరిగింది.

దేశదేశాల నుంచి ప్రతినిధులు వచ్చారు. అందరిలోనూ నన్ను ఎక్కువగా ఆకర్షించిన వాడు పాబ్లోనెరూడా![3] అతనికి ఇంగ్లీషురాదు. నాకు స్పానిష్ రాదు. సంజ్ఞలతోనే నా ఆటోగ్రాఫ్ పుస్తకంలో అతని సంతకం తీసుకున్నాను. అప్పటికింకా అతనికి నోబెల్ బహుమతి రాలేదు. అయినా అప్పటికే అతడు ప్రపంచ కవులలో సుప్రసిద్ధుడు. నిలువెత్తు మనిషి. పొడుగుకి సమతూకంగా ఒడ్డుపొడవూ ఉన్న భారీ విగ్రహం.

శాంతి సభలకు వెళ్లిన మొదటి రోజే ఒక తమాషా జరిగింది. సమావేశ భవనం ఒక కొండమీద ఉంది. దారిలో ఒక విశాలమైన నీటికుంట ఉంది. నీరు గడ్డకట్టుకొని పోయిందేమో, అంతామంచుతో బల్లపరుపుగా ఉంది. మా ప్రతినిధివర్గంలో ఒకడయిన ఆలీ సర్దార్ జాఫ్రీ ఆ మంచుమీద నడవాలనుకున్నాడు. ఒక అడుగు వేశాడోలేదో అద్దపు పెంకుల్లాగ మంచు విరిగిపోయి నీళ్లల్లో పడిపోయాడు. అయితే ఎక్కువ లోతు లేనందున మరే ప్రమాదమూ జరగలేదు. తడిగుడ్డలతోనే హోటల్‌కి పోయి బట్టలు మార్చుకుని వచ్చేశాడు. స్టాక్‌హోం సభలో ఒకనాడు పండిట్ సుందర్‌లాల్ చైనామీద అనర్గళంగా ఉపన్యసించాడు. సభా భవనమంతా కరతాళధ్వనులతో నిండిపోయింది. నేను ఉపన్యాసం చెయ్యలేదుగాని ఒకటి రెండు కమిటీల చర్చలలో పాల్గొన్నాను.

ఆఖరిరోజున మద్య మాంసాదులతో ఒక పెద్ద విందు జరిగింది. ఒక వ్యాన్‌లో తిరుగు ప్రయాణం చేస్తున్నాము. అందరూ తమతమ భాషల్లో పాటలు పాడాలనుకున్నాము. ఇండోచైనా ప్రతినిధి ఒకరు పాడినపాట అర్థంకాకపోయినా నన్ను చాలా ఆకర్షించింది. నేనుకూడా తెలుగులో ఒక జానపద గేయంపాడి తగుమాత్రం చప్పట్లు సంపాదించుకున్నాను.

3 పాబ్లో నెరూడా (1904–1973) చిలి దేశస్థుడు. గొప్పకవి కమ్యూనిస్టు. నాలిక్‌మీద నెరూడా రాసిన గేయం శ్రీశ్రీ అనువాదం చేశారు. 1970లో ఫ్రాన్స్‌కు చిలీ రాయబారిగా పనిచేశాడు. 1971లో నోబెల్ బహుమతి ఇచ్చారు. చిలీ కమ్యూనిస్టు ప్రధాని అలెండీకి మంచి స్నేహితుడు. 1973లో అలెండీని హత్యచేసిన పదిరోజుల తరువాత నెరూడా చనిపోయాడు.

స్టాక్‌హోం సభలయిపోయాక ఇండియాకే ప్రయాణమనుకున్నాను. కాని మా భారతీయ ప్రతినిధి వర్గాన్ని సోవియెట్ శాంతిసంఘం రష్యాకు ఆహ్వానించిందనీ, వారంరోజులు పర్యటననీ తెలుసుకోగానే నా ఆనందానికి అవధిలేకపోయింది.

మాస్కోకు వెళ్లగలిగే
అస్కారం లేకపోయినప్పటికైనన్
విస్కీ సేవిస్తూనే
శ్రీ స్కీవై బ్రతుకగలను సిరిసిరిమువ్వా!

అని నేను రాసిన పద్యం తలుచుకొని మాస్కోకు వెళ్లగలిగే అస్కారం లభించిందని సంతోషించాను.

వాతావరణం అనుకూలంగా లేకపోవడంవల్ల విమాన ప్రయాణం సాధ్యంకాదనీ, స్టీమరు మీద హెల్సింకీకి, అక్కడ నుంచి లెనిన్ గ్రాడ్‌కి వెళ్లవలసి ఉందనీ మొదట అనుకోవడం జరిగింది. కాని ప్రయాణపు రాత్రి వాతావరణం తెరిపి ఇచ్చింది. మా ప్రతినిధులందరం విమానంలోనే మాస్కోకు బయల్దేరాం. హెల్సింకీ విమానాశ్రయంలో అరగంటసేపు విశ్రాంతి. అక్కడనుంచి ఒక గంటసేపు ప్రయాణంతో మాస్కో చేరుకున్నాము.

ప్రజాతంత్ర *11–4–1976*

## రెండు

మాస్కో విమానాశ్రయంలో దిగినది మొదలుకొని మాకు రాజమర్యాదలతో అతిథి సత్కారాలు జరిగాయి. నేను చలికి తట్టుకోలేకపోవడం చూసి అడగకుండానే చేతులకు గ్లవ్‌లూ, కాళ్లకు (మోకాలిదాకావచ్చే) గొలాక్షలూ, తలకు రష్యను ఉన్నిటోపీ ఇచ్చారు. ఈ టోపీతో తలంతా కప్పుకోవచ్చు. లేదా సగానికి మడిచి నెత్తిమీద కుళ్ళాయిగా ధరించవచ్చు.

రెండవ ప్రపంచ యుద్ధపు గాయాలు లండన్‌లో చాలాచోట్ల చూశానుగాని మాస్కో నగరమంతా ఒక సరికొత్త పట్టణంగా కనిపించింది. లండన్ వీధుల్లోనూ, సందుల్లోనూ కనిపించే చెత్తాచెదారం మాస్కో వీధుల్లో ఎక్కడాలేదు. ఈ విషయంలో స్టాక్‌హోం నగరంకూడా చాలా పరిశుభ్రమైనదని చెప్పవచ్చు. మాస్కో అంతటా నివాస భవనాల నిర్మాణం చురుకుగా సాగిపోతుండడం చూశాను. అన్నీ ప్రీ-ఫేబ్రికేటెడ్ కాంక్రీటు భవనాలు. పొడుగాటి క్రేనులు నిర్విరామంగా పనిచేస్తూ ఉంటాయి.

రష్యాలో నిరుద్యోగమూ, అడుక్కోవడమూ, వ్యభిచారమూ లేవని నేను వేరుగా చెప్పనక్కరలేదు. రష్యాలో ఉన్నంతకాలం అచ్చటి ఆడవాళ్లందరూ నాకు తల్లుల్లాగా, చెల్లెళ్ళులాగా కనిపించారు. అందరూ కళ్లలోకి సూటిగా చూసి మాట్లాడుతారు. దొంగ చూపులూ, ముసిముసి నవ్వులూ లేవు. మాకు భాషాంతరీకరణం చేసే వ్యక్తి ఒక స్త్రీ.

మొట్టమొదటిరోజున మేము చేసిన మొట్టమొదటిపని, క్రెమ్లిన్ భవనంలో లెనిన్

సమాధిని సందర్శించి, పుష్పదామాలు వెయ్యడం. సమాధి వెలుపల సుమారు రెండు ఫర్లాంగుల క్యూ ఉంది. మాకు వారందరూ దారి ఇచ్చి ముందుకు పోనిచ్చారు. సమాధిలో లెనిన్ శరీరం ద్రావకాలలో నిక్షిప్తమై ఉంది. ఆ ప్రక్కనే స్టాలిన్ శరీరం ఉంది. (తర్వాత దాన్ని కృశ్చెవ్ తొలగించిన విషయం చరిత్ర ప్రసిద్ధమే) చిన్నప్పుడు తిరుపతిలో వెంకటేశ్వర స్వామిని చూసినప్పటి మహోత్సాహం 1954లో లెనిన్‌ను సందర్శించినప్పుడు నాకు కలిగింది. ప్రప్రథమంగా మానవ జాతికి కమ్యూనిస్టు మార్గాన్ని సుగమం చేసిన విప్లవ విజేత లెనిన్!

రాత్రి ఏడుగంటలకు సోవియెట్ శాంతిసంఘం ఏర్పాటు చేసిన ఆహ్వానసభలో పాల్గొన్నాము. రష్యన్ కవి టిఖనోవ్ ఆ సభకు అధ్యక్షుడు. శాంతి సమితి అధ్యక్షుడు కూడా ఆయనే! క్లుప్తంగా కొందరు ఉపన్యసించిన తర్వాత భారతీయ ప్రతినిధి వర్గం తరుపున మా నాయకుడు ఫాదర్ విలియమ్స్ సముచితంగా సమాధానం ఇచ్చాడు. రష్యన్ ఉపన్యాసాలు ఇంగ్లీషులోనికీ, ఇంగ్లీషు ప్రసంగాలు రష్యన్‌లోనికీ సాఫీగా తర్జుమా అయినాయి.

మాస్కోలో ప్రతిరోజూ రకరకాల సాంస్కృతిక ప్రదర్శనలు అసంఖ్యాకంగా జరుగుతూ వుంటాయి. మేము చూసిన వాటిలో రష్యన్ సర్కస్ ఒకటీ, స్వాన్ లేక్ (*Swan Lake*) అనే బాలే ఒకటీ ముఖ్యంగా చెప్పుకోదగ్గవి. ఈ నృత్య నాటికలోని పాటల రికార్డులు కొన్ని నాకు బహుమతిగా ఇచ్చారు. సర్కస్‌లో సింహాలచేత చేయించిన విద్యలు అమోఘంగా ఉన్నాయి. (కొన్ని సంవత్సరాల కిందట ఇండియా పర్యటనం చేస్తూ రష్యన్ సర్కస్ మద్రాసుకి వచ్చినప్పుడు మరోసారి చూడాలనుకున్నాను. కానీ ఏ కారణం వల్లనో చూడలేదు).

ఒక రాత్రి మాస్కో నుంచి లెనిన్‌గ్రాడ్‌కు రెయిలుబండిలో ప్రయాణం చేశాము. రష్యన్ రైలుపెట్టెలు భారీ ఇనుప మందసాల్లాగ ఉంటాయి. రష్యన్ విమానాలూ అంతే. రైలు పెట్టెలన్నిటినీ కలుపుతూ ఒకే పొడుగాటి వసారా ఉంటుంది. కాని నేను నా కంపార్టుమెంట్ లోంచి బయటికి రావలసిన అవసరమే లేకపోయింది. రష్యాలో ఇది శీతాకాలం అనే సంగతి నాకు గుర్తురాలేదు.

లెనిన్‌గ్రాడ్‌లో మాకు హోటేల్ అస్టోరియాలో బస ఏర్పాటుచేశారు. ఇది జారుచక్రవర్తుల నాటి రాజభవనాలలో ఒకటి. సంవత్సరానికి పైగా నాజీముట్టడికి తట్టుకున్న మహానగరం లెనిన్‌గ్రాడ్. ఆఖరి రోజుల్లో రంపపు పొట్టుతో రొట్టెలు చేసుకుని తిన్నారట ఆ నగర వాసులు. అయినా వారు లొంగిపోలేదు. తన ధాటికి అడ్డులేదని ఎలాగూ లెనిన్‌గ్రాడ్ పతనం తథ్యమనీ భావించిన హిట్లరు ఈ అస్టోరియా హోటేల్లోనే తన సేనా నాయకులకు విక్టరీ విందు ఇవ్వడానికి ఒక తేదీ కూడా నిర్ణయించి ఆహ్వానాలు అచ్చువేయించాడట! "ఇప్పుడు మీరు భోజనం చేస్తూన్న ఈ హోటేల్ పరిసరాలకు కూడా ఆ సేనానులు రాలేకపోయారు. హిట్లర్ కేవలం అస్టోరియా భవనపు ఫోటోగ్రాపుతోనే సరిపెట్టుకోవలసి వచ్చింది" అని

మాతో విందులో పాల్గొన్న ఒక రష్యన్ అన్నాడు. అందరమూ సంతృప్తిగా నవ్వుకున్నాము.

లెనిన్‌గ్రాడ్‌లో మేము బహుశా రెండు మూడు రోజులకన్న ఎక్కువకాలం ఉండకపోయినా ఉన్నంతకాలం ఆసక్తిదాయకంగా గడిచింది. మేము చూసిన వాటిలో లెనిన్ మ్యూజియం ఒక ప్రత్యేకాకర్షణ! చరిత్రను సృష్టించిన వింటర్‌ప్యాలెస్ మరో ఆకర్షణ. లెనిన్ పేరుకు అన్నివిధాలా అఖండ గౌరవం తెచ్చిన మహానగరం లెనిన్‌గ్రాడ్! విప్లవానికి పూర్వం పెట్రోగ్రాడ్ అనీ, సెంట్ పీటర్స్‌బర్గ్ అని పిలువబడే ఈనగరం రష్యా అంతటికీ ముఖ్యపట్టణం. ఎంతో దూరదృష్టితో విప్లవపు తొలిరోజుల్లోనే లెనిన్ మాస్కో నగరానికి రాజధానిని మార్చి ఉండకపోతే విన్‌స్టన్ చర్చిల్ ఆధ్వర్యంలో పధ్నాలుగు దేశాల జోక్యందారీ నౌకాదళాలూ, సైన్యాలూ రష్యన్ విప్లవాన్ని పురిట్లోనే సంధికొట్టించి ఉండేవి.

ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఓరియంటల్ స్టడీస్ అనేసంస్థ ప్రత్యేకంగా నన్నొక్కణ్ణీ ఆహ్వానించి తెలుగు భాషమీదా, సాహిత్యంమీదా, ఒక గోష్ఠి ఏర్పాటు చేసింది. పదిపదిహేనుగురు పండితులు నేను చెప్పిందంతా శ్రద్ధగా నోట్సురాసుకున్నారు. అంతసేపు అనగా రెండు మూడు గంటలసేపు నేనెక్కడా ఎప్పుడూ ఇంగ్లీషులో మాట్లాడలేదు. అయితే విషయం నాకెంతో ఆత్మీయమైనది కాబట్టి మహోత్సాహంతో ప్రసంగించాను. ఆ సభలోనే నా దృష్టిలో తెలుగుభాషకు కవిత్రయం తిక్కన, వేమన, గురజాడలని చెప్పాను. తెలుగు భారతదేశం అంతకీ జాతీయభాష కాగల అర్హతగలదని జే.బి.యస్.హాల్డేన్ చెప్పిన మాటను ఉద్ఘాటించాను. సంస్కృత పదాలను జీర్ణించుకున్న కారణంచేత అటు ఉత్తరాదివారికీ, ద్రావిడ భాషా కుటుంబంలో ఒకటి కావడంవల్ల ఇటు దక్షిణాదివారికి తెలుగు నేర్చుకోవడం చాలా సులభమని హాల్డేన్ పండితుని వాదన!

ఇప్పటికీ తెలుగే మన జాతీయభాష కావాలనేది నా అభిమతం! ఇది భాషా దురభిమానంతో అంటున్న మాటకాదు. దేశంలో హిందీ భాషదే మొదటిస్థానమయినా, ఆ మాట్లాడే వాళ్లంతా కలిపి నలభై శాతానికి మించరు. అంతేకాక హిందీ ఒక చిన్నచెట్టుకు పరిమితం! రెండవ భాష అయిన తెలుగు సుమారు ఆరుకోట్ల మంది ఆంధ్రులకు మాతృభాష! పైగా తెలుగువారు దేశమంతటా, అన్ని రాష్ట్రాలలోనూ వ్యాపించి ఉన్నారు. ముత్యాలలాంటి తెలుగక్షరాలంటూ లిపిమీద లేనిపోని సెంటిమెంట్లు పెట్టుకోవడం మాని రోమన్ లిపిలో (*a,aa,i,ee*ఈ విధంగా) తెలుగును నేర్పితే అప్పుడు మన దేశం ఆధునిక యుగంలోనికి ప్రవేశిస్తుందని నా నిశ్చితాభిప్రాయం. ప్రపంచ తెలుగుమహాసభ వారు ఈ విషయమై ఆలోచించడం మంచిదని నేననుకుంటున్నాను.

ఇవన్నీ ఇప్పుడు నేనముకుంటున్నవి. లెనిన్‌గ్రాడ్ సభలో ఈ విషయమై ఇంత విపులంగా వివరించలేదు. తెలుగుభాష గురించీ, తెలుగు సాహిత్యం- ముఖ్యంగా కవుల గురించీ సుదీర్ఘంగా ప్రసంగించాను. అప్పటికే లెనిన్‌గ్రాడ్‌లోనూ, మాస్కోలోనూ ఆంధ్రభాషాధ్యయనం ప్రారంభమయింది.

మాస్కోకు తిరిగివచ్చిన తర్వాత, అక్కడ తెలుగు నేర్చుకుంటున్న జోరియా పెత్రునిశ్చేవాను కలుసుకున్నాను. ఇప్పుడామె తెలుగు విభాగానికి అధ్యక్షురాలనుకుంటాను.

మాస్కో రేడియోలో అప్పటికింకా తెలుగు ప్రవేశపెట్టబడలేదు. అందుచేత ఇంగ్లీషులోనే మాట్లాడాను. 50 రూబుల్సు ఇచ్చినట్టు జ్ఞాపకం. ఆ డబ్బు ఎలా ఖర్చుపెట్టాలో నాకు తెలియనే లేదు. ఎందుచేతనంటే మేం అడగకుండానే మాకు కావలసినవన్నీ అమర్చి వుండేవి. ఒక టేపు రికార్డరూ, ఒక టైపురైటరూ కొందామనుకున్నాను. కాని అందుకు నా దగ్గర ఉన్న డబ్బు చాలలేదు.

ఒక సగటు రష్యన్ తన ఆదాయంలో 40 శాతం దుస్తుల మీదనే ఖర్చు చేస్తాడట. ఉన్ని వస్తువులేవయినా కొందామనుకున్నాను. కాని మద్రాసులో ఉండేవాణ్ణి, ఇవి నా కెందుకని మానేశాను.

రష్యాలో చాలాకాలం కిందటే ఇంజనీరుగా స్థిరపడిపోయిన తెలుగువాడు శ్రీ కోలాచల సీతారామయ్యగారు నన్ను చూడడానికి మా హోటేల్‌కు వచ్చారు. "మీ చిరునామా చెబితేనేనే వచ్చేవాడినిగా!" అన్నాను. "అలాక్కాదు. మీరు మా అతిథులు" అన్నారాయన.

రేడియో స్టేషన్‌లో పుప్పాల లక్ష్మణరావుగారిని కలుసుకున్నాను. అప్పటికే ఆయన జర్మన్ భార్య మెర్లీ షోరింగర్ చనిపోయిందనుకుంటాను.

లక్ష్మణరావుగారితో మాట్లాడుతున్నంతసేపు విశాఖపట్టణంలోనే ఉన్నట్టనిపించింది.

*ప్రజాతంత్ర 18—4—1976*

## మూడు

ఒక ఉదయం మాస్కోలోని బాల బాలికల ప్రాథమిక పాఠశాలకు వెళ్ళాము. ఎక్కడికి వెళ్ళినా ప్రతినిధి వర్గమంతా కలిసే వెళ్తా ఉంటాము. వ్యక్తిత్వం అనీ, ఏకాంత జీవితమనీ, కనీసం తంసొప్పి అనీ మాలో ఎవ్వరమూ హోటేల్ గదిలో మిగిలిపోలేదు. ఏరోజు కార్యక్రమం ఆరోజుకు ముందే నిర్ణయమవుతుంది. రేపటి మాట రేపు చూసుకోవచ్చుననే మనస్తత్వానికక్కడ తావులేదు.

సోవియట్ విద్యావిధానం గురించి మేమందరమూ విపులమైన నోట్సు తీసుకున్నాము. నేను రాసుకున్న విశేషాలతో ఒక సుదీర్ఘవ్యాసంకాదు, ఒక చిన్న పుస్తకమే రాయాలనుకున్నాను. అయితే నేను చెయ్యాలనుకుని చెయ్యలేకపోయిన చాలా మంచి పనుల్లాగే ఇది కూడా జరగలేదు. జరగలేదని విచారం కూడా లేదు. ఎందుచేతనంటే, ఆలస్యంగానయినా మనదేశం సోవియట్ బోధనా పద్ధతులను గుర్తించింది. అన్నిటిలోనూ బ్రిటిష్ ఒరవళ్ళకు అలవాటు పడిపోయిన మనం ఇప్పుడిప్పుడే స్వతంత్రంగా ఆలోచించడం నేర్చుకుంటున్నాము. ఇది ఎంతైనా ముదావహం.

స్వతంత్రంగా ఆలోచించడం అంటే రష్యన్ పద్ధతులను గుడ్డిగా అనుకరించడం కాదని నేను వేరే చెప్పనక్కరలేదు. శాస్త్రీయ విచారణ, వైజ్ఞానిక దృక్పథం-ఇవే స్వతంత్రాలోచనకు

మూలస్తంభాలు! రష్యన్ విద్యావిధానం ఈ దృష్టిని పెంపొందించడంవల్లనే ఈనాడు సోవియట్ యూనియన్ ప్రపంచంలోని అగ్రరాజ్యాలలో ఒకటిగా రూపొందిందన్న విషయం గుడ్డివాళ్లకు కూడా స్పష్టంగా కనిపించే సత్యం.

రష్యన్ ప్రభుత్వం బాల బాలికల భవిష్యత్తుపట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటుంది. వాళ్ళకోసం ఆర్టెక్‌లో ఒక మహానగరాన్నే నిర్మించింది. లేడి ఆస్టర్ అనే బ్రిటిష్ ప్రభ్వి సోవియట్ యూనియన్ చిన్న పిల్లలకు భూలోక స్వర్గం అని అంగీకరించింది. పెట్టుబడిదారీ విధానం అమలులో వున్న ఏ సుసంపన్నదేశంలోనూ శిశువులకు రష్యాలో ఉన్నంత రక్షణ లేనే లేదు. ఇంగ్లాండులో పేదపిల్లల దుస్థితిని డికెన్సు తన నవలల్లో కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు. అది ఈ శతాబ్దంలో కాదు; కిందటి శతాబ్దంలో అని సరిపెట్టుకోవడానికి వీల్లేదు. ఇంగ్లండు మాట యెలా వున్నా మనపవిత్ర భారతదేశంలో బాల బాలికల గతిని వర్ణించడం డికెన్సుకు కూడా అసాధ్యమే. ఆస్తిహక్కూ, అడుక్కు తినే హక్కూ జన్మహక్కులుగా వలామణి అవుతున్న మనదేశంలో చిన్నపిల్లల కాళ్ళు విరిచి, కళ్ళుపొడిచి భిక్షాటనానికి పెట్టుబడి తీసుకునే తల్లిదండ్రులు కోకొల్లలు.

ఈ వ్యవస్థను యథాతథంగా నిలబెట్టడమే తమ జీవిత ధర్మంగా భావించే పార్టీలు బతికి ఉన్నంతకాలం మనదేశానికి దారిద్ర్యంనుంచి విముక్తిలేదు.

బ్రిటన్‌లాంటి పెట్టుబడిదారీ దేశాల్లో సహా అడుక్కుతినడాన్ని అవమానకరంగా భావిస్తారు. గుడ్డివాడు పాటపాడుతూనో, ఒక వాయిద్యం వాయిస్తూనో టోపిని నేలమీద ఉంచుతాడు. తాను తీసుకుంటున్నదానికి ఏదో ప్రతిఫలం ఇవ్వాలనే కనీసపు ఆత్మగౌరవం అతనికుంటుంది.

రష్యాలో ఒకతను నాదగ్గర ఉన్న అగ్గిపెట్టె కావాలని అడిగాడు. అక్కడకూడా అడుక్కోవడపు అవశేషాలున్నాయేమో అనుకున్నాను నేను. అతడు నాదగ్గర ఖాళీపెట్టె తీసుకున్నాడు. దానిమీద అంటించిన కాగితం తీసి జాగ్రత్త చేసుకున్నాడు. దేశ దేశాల అగ్గిపెట్టెలమీది కాగితాలను సేకరించడం అతని హాబీ! నేను వెళ్ళిపోతున్నప్పుడు నాకో కొత్త అగ్గిపెట్టె బహూకరించాడు. రష్యాలో భిక్షకవృత్తి శాసనాల ద్వారా నిర్మూలం అయిందనడంకంటె అడుక్కోవడం అనవసరమైన వ్యవస్థ ఏర్పడడంద్వారా అదిసాధ్యమయిందని చెప్పవచ్చును.

నేను స్వయంగా చూసిన వ్యవస్థ అది. స్వదేశానికి తిరిగివచ్చిన తర్వాత ఆ విషయాలే విశాలాంధ్ర ఆఫీసులో ముచ్చటించినప్పుడు ఒక ఆంధ్ర పత్రిక నేను గోలకొండ మిరియాలు తాటికాయలంతేసి చేసి అంటున్నానని రాసింది. ముఖ్యంగా, మాస్కో విశ్వవిద్యాలయం 25 అంతస్తులభవనం అని నేనంటే, ఆ పత్రికా సంపాదకుడు నన్ను గేలి చేశాడు. నాతో తీసుకువచ్చిన ఒక ఫోటోగ్రాఫ్‌ను పంపించి అతని నోరు మూయించబోయాను. కాని రష్యాగురించి క్షుణ్ణంగా చదువుకున్న ఆ ప్రబుద్ధుడు తానన్నది 17వ శతాబ్దపు

విశ్వవిద్యాలయం గురించి అని చెప్పి తన్ను తాను సమర్థించుకున్నాడు. ఇటువంటి రష్యన్ ఎక్స్‌పర్ట్‌లు ఇప్పటికీ (1976) మనదేశంలో ఉన్నారు. గుడ్డికమ్యూనిస్టు వ్యతిరేకత ఒక్కటే వీరికున్న అర్హత. ప్రస్తుతం దేశంలో ఉన్న ప్రత్యేక పరిస్థితులను అనుగుణ్యంగా ఆ వ్యతిరేకతను చైనా రిపబ్లిక్ మీద కేంద్రీకరిస్తున్నారు. అందుకే ఈ ఆంధ్రపత్రికల బండారం ఆనాడే నా ప్రాస క్రీడల్లో బయట పెట్టాను.

"అరె యార్! ఇధరావ్, దేఖో
ఆంధ్రుల దినపత్రిక!
పెట్టుబడికి, కట్టుకథకి
పుట్టిన విషపుత్రిక!"

అని. అప్పుడు నేన్నమాట ఇప్పటికి నిజమే!

మొదటిసారి నేను రష్యాకు వెళ్ళినప్పుడు యూనివర్సిటీ భవనం ఒక్కటే మాస్కో లోని స్కైస్క్రేపర్ కట్టడం. దాన్ని నిర్మించిననాటికి అమెరికాకుమాత్రమే అణుబాంబుల మొనాపలీ ఉండేది. అణుయుద్ధ ప్రమాదం ఉన్నప్పుడు అంతస్తులమీద అంతస్తులు కట్టుకుంటూపోవడం అవివేకమని రష్యన్లకు తెలుసు. మేము కూడా ఎత్తయిన భవనాలు నిర్మించగలమని రుజువుచెయ్యడానికి విశ్వవిద్యాలయ భవనం కట్టేరుగాని, వారు ఎక్కువగా మాస్కోలోని భూగర్భ రైలుమార్గం నిర్మించడం మీద శ్రద్ధ చూపించారు. దీన్ని గురించి ఒక పెద్ద గ్రంథమే రాయవచ్చు. అణుయుద్ధంవస్తే మాస్కో జనాభా అంతటికీ ఈ రైలుమార్గపు స్టేషన్లు రక్షణ ఇయ్యగలవు. లండన్ మీద బాంబులు పడుతున్నప్పుడు ఆ నగర పౌరులు ట్యూబు రైల్వే స్టేషన్లలోనే తలదాచుకునే వారు. ఇటువంటి ట్యూబు రైల్వేలు లండన్‌లో, పారిస్‌లో న్యూయార్క్‌లో ఇంకా అనేక పాశ్చాత్య, ప్రాచ్య నగరాల్లోఉన్నాయి. అయితే మాస్కో రైల్వేలోని విశేషం ఏమిటంటే అది నిర్మించిన నాటి నుంచి ఒక్క యాక్సిడెంట్ కూడా జరగలేదు. (జరిగినా పత్రికలదాకా రానియ్యరులే అని మనజర్నలిస్టు సోదరులనవచ్చును) ఇక్కడ మనం గుర్తించవలసిన విషయంఏమిటంటే ప్రమాదాలు జరిగే అవకాశాలు లేకుండా ఆ రైల్వే నిర్మాణాన్ని ప్లాను చేశారు. డ్రైవరు ఉన్నా లేకున్నా, నిద్ర పోతున్నా రైలింజను తన నిర్ణీతస్థలంలో నిలుస్తుంది. దాని పక్క కంపార్టుమెంటు పిల్లలకీ ముసలివాళ్లకీ ప్రత్యేకం. ఇందులోనే మా ప్రతినిధివర్గం ప్రయాణం చేశాము.

దారిలో పట్టాల మీద ఏదయినా అడ్డుగా ఉంటే ఇంజన్ దానంతట అదే ఆగిపోతుంది. ఫలానా చోట ఆగిపోయానని అరుస్తుంది. క్షణాలమీద సహాయం అక్కడకు చేరుకుంటుంది. బహుశా ఇటువంటి ఏర్పాట్లు దేవుడిమీద నమ్మకం లేని వాళ్ళకే సాధ్యమనుకుంటాను.

వర్తులాకారంలో ఉన్న రైలు మార్గాన్ని కేంద్రం నుంచి బయలుదేరే రైలు మార్గాలు కలుపుతాయి. ఒకే టిక్కట్టుతో రోజంతా ఏ బండిలో నయినా ప్రయాణం చెయ్యవచ్చు. గేటు దగ్గర రుసుము కో పెక్కులు వేస్తేనే గేటు తెరుచుకుంటుంది. టిక్కెట్ చేతి కొస్తుంది.

ఇక్కడ మోసానికి ఆస్కారం లేదు.

మాస్కో భూగర్భ మార్గంలోని ఒక్కొక్క రైల్వేస్టేషన్ ఒకొక్క తాజమహల్. ఇవి ఒక్కొక్క రిపబ్లిక్‌కు అంకితమైనవి. అక్కడ ఆయా జాతీయ శిల్పాలూ, జాతీయ నాయకుల ప్రతిమలూ ఉంటాయి. జాతీయ నాయకులంటే ఒక్క రాజకీయవేత్తలే కాదు. జీవితంలోని అనేకానేక రంగాలలో ప్రసిద్ధిచెందిన వారు!

*ప్రజాతంత్ర 25–4–1976*

## నాలుగు

మాస్కోలో మూడు నాలుగు రోజులున్న తర్వాత మాప్రతినిధివర్గం తాష్కెంట్‌కు బయల్దేరాము. తాష్కెంట్‌లో కేవలం వాతావరణ ప్రతికూలతవల్ల అనవసరంగా వారం రోజులు ఉండిపోవలసివచ్చింది. ఏరోజుకారోజు ఇవాళ మంచు తెరిపి ఇస్తుందను కోవడమూ, అలా జరగక పోవడమూ! ఒక రోజు విమానాశ్రయానికి వెళ్లేము. అంతవరకు వాతావరణం బాగానే ఉంది కాని ఆకస్మాత్తుగా మంచు దట్టమయింది. బయలుదేరుతుందను కున్న విమానం బయలు దేరలేదు. నాలుగైదు గంటలపాటు విమానాశ్రయంలోనే కూర్చున్నాము. ఎంత వేచి చూచినా హిమపాతం ఎక్కువవుతున్నదేకాని తగ్గలేదు. ఆరోజు కూడా ప్రయాణం ఆగిపోయింది. మిగిలిన ప్రతినిధుల మాట ఏమోకాని నాకు మాత్రం ఎంతవేగం స్వదేశానికి చేరుకుంటానా అనిపించింది. మాస్కోకు వెళ్ళిపోతే ఇక తిరుగు ప్రయాణమే అని నాకు తెలుసుకాని ఏరోజు కారోజు ప్రయాణం వాయిదా పడిపోతూ వచ్చింది. మరో రెండు రోజులాలస్యం అయితే లయింది, రైలు బండిలో పోతే బాగుండు ననిపించింది. కాని నా ఒక్కడి అవసరం కోసం అందర్ని ఇబ్బంది పెట్టడమా? అది నాకు మనస్కరించలేదు.

తాష్కెంట్‌లో ఉన్న ఆరేడు రోజులూ విసుగ్గానే గడిచాయని చెప్పక తప్పదు. ఇది 1954లో. కాని మళ్ళీ 1967లో రెండవసారి ఇదే తాష్కెంట్‌లో రెండు రోజులు రెండు క్షణాల్లాగా గడచి పోయాయి. 1954లో నేను చూసిన తాష్కెంట్ వేరు. అది ఇంచుమించు మన పాతఢిల్లీలాగ ఉంది. 67లో తాష్కెంట్ నగరస్వరూపమే మారిపోయింది. అందుకు అప్పటి తాష్కెంట్ భూకంపం ఒక పరోక్షకారణమని చెప్పవచ్చు. భూకంపంవల్ల పాత తాష్కెంట్‌లోని మట్టికట్టడాలన్నీ నేల మట్టమయిపోయాయి. తర్వాత సోవియట్ యూనియన్‌లో ఎన్ని రిపబ్లిక్‌లున్నాయో అన్నీ ఆ నగరపు పునర్నిర్మాణానికి రంగంలోనికి ఉరికిపడ్డాయి. పంచుకున్నట్టుగా ఒక్కొక్క పేటను ఒక్కొక్క రిపబ్లిక్ సహాయం చేస్తూ వచ్చింది. మైళ్ళ తరబడి రోడ్లూ, వాటికి ఇరుప్రక్కలా అయిదేసి, ఆరేసి అంతస్తుల నివాస భవనాలూ లేచిపోతున్నాయి. ముందుగా రోడ్లను ప్లానుచేసి తర్వాత ఇళ్ళు కట్టడం ఇందులో విశేషం. మన ఊళ్ళలోనూ, నగరాలలోనూ అయితే వ్యక్తి చొరవతో ఇళ్లు కట్టుకునే వాళ్ళు అందరికీ అవసరమైన రోడ్ల సంగతి ఆలోచించరు.

ఇలా నేను రాస్తున్నందుకు విదేశాల మీద వ్యామోహంతో స్వదేశాన్ని తూలనాడుతున్నానని కొంత మంది నన్ను నిందించవచ్చు. మొదటి సంగతి నాకున్నది విదేశీ వ్యామోహం కాదు. దేశభక్తిలో నేనెవ్వరికీ తీసిపోనని నా గర్వం! కాని మనదేశంలో ఇప్పుడున్న వ్యవస్థను నేను తీవ్రంగా విమర్శించక తప్పదు. రష్యానుంచి మరలి వచ్చిన తొలి రోజుల్లో ఎవరో నన్ను అడిగారు. "రష్యామీద నీ కంతటి మోజుంటే అక్కడికే వెళ్ళిపోకూడదా?" అని. "ఎందుకు వెళ్ళాలి, రష్యానే మనదేశానికి తీసుకురావడానికి కృషి చేస్తాను. అంతేగాని ఎంత అసహ్యంమకుంటున్నా, నా దేశాన్ని వదలిపోయి మరోచోట తలదాచుకోవడం అసంభవం" అని జవాబిచ్చాను.

ఇక, మొదటిసారి తాష్కెంట్‌లో నా అనుభవాలు ఇవి బహువచనంలో చెప్పవలసినన్నిలేవు. ఒకే ఒక్క సంఘటన మాత్రం నాకు జ్ఞాపకం ఉంది. అది, ఒక మసీదులో మేమందరమూ ముస్లిం పద్ధతిలో మోకరిల్లి ప్రార్థన జరపడం. ఇతరుల మనస్సులకు బాధ కలిగించకూడదని నా కిష్టంలేని పనులు కొన్ని కొన్ని చేస్తూ ఉంటానన్నానే, అందుకిదో నిదర్శనం. "ఇటువంటి ప్రార్థనలమీదా-ఆ మాట కొస్తే ఎటువంటి ప్రార్థనల మీదా నాకు నమ్మకం లేదు. నన్ను వదిలెయ్యం"డంటే అక్కడున్న ఎవరూ నన్ను నిర్బంధించరని నాకు తెలుసు. అయినా అప్పటికి నేను పూర్తిగా నాస్తికుణ్ణి కాను ఒక రకంగా అజేయవాదిని. అంటే "ఏపుట్టలో ఏపాముందో అన్నట్టు, ఏ మసీదులో ఏదేవుడున్నాడో, అతగాడితో మనకెందుకులే పేచీ" అన్నదే అప్పట్లో నామతం! తాష్కెంట్ నుంచి ఎలాగయితేనేం ఆఖరికి మాస్కో చేరుకున్నాము. ఓడ్కాలు విందులూ ఉపన్యాసాలూ సమధికోత్సాహంతో సాగిపోయాయి. మాఅందరికీ ఫోటోసంపుటాలూ, తలా ఒక కెమెరా రష్యన్లు బహూకరించారు. చాలాకాలం తర్వాత కాకినాడ గలాటాలో ఒక రౌడీ, లెన్సును చెడగొట్టినదాకా నాకెమెరాను చాలా భద్రంగా దాచుకుంటూ వచ్చాను. అయితే ఏవస్తువుమీద ఎక్కువ మమకారం పెట్టుకోవడమనేది నాస్వభావంలోనే లేదు. కాబట్టి నా కెమెరా పాడయిపోయినందుకు అంతగా బాధపడలేదు. పైగా, నాకు బాధకలిగించాననుకున్న వాడికి ఆశాభంగం కలిగించగలిగానని ఇప్పటికీ నాకు సంతోషమే!

మాస్కో నుంచి స్వదేశానికి తిరుగు ప్రయాణంలో మొట్టమొదట 'మజిలి ప్రాగ్ విమానాశ్రయం. ఇంతవరకు నేను మూడుసార్లు విదేశయాత్రలు చేశాను. ఎప్పుడూ ఒకే ఒక సూట్ కేస్ మాత్రమే నాతో తీసుకువెళ్ళేవాడిని. మొదటిసారి కూడా అంతే. ఓవర్ కోటుమడిచిపెడితే మరి ఇతరవస్తువులకు స్థలమే ఉండదు. అందుచేత ఎప్పుడూ ఓవర్‌కోటును ఒంటిమీదే ధరించాను. చలికాలం కాబట్టి అది అవసరం కూడా.

ప్రాగ్ నుంచి విమానం బయలుదేరే ముందు మా డెలిగేషన్‌వారి లగేజీ యావత్తూ, నా సూట్‌కేసుతో సహా విమానంలో వెయ్యడం నేనుచూశాను. కాని ఆరాత్రి పారిస్‌లో దిగేసరికి మా పంజాబీ ప్రతినిధి లగేజీ గల్లంతయింది. అసలు పారిస్ విమానాశ్రయంలో కాదు

పెట్టింది మొదలు అన్నీ ఆటంకాలే మాకు ఎదురయ్యాయి. రష్యానుంచి వస్తున్నాం కాబట్టి అప్పుడు అధికారంలో ఉన్న ఫ్రెంచి ప్రభుత్వానికి మేము విరోధివర్గానికి చెందినవార మయ్యాము. మేము విమానాశ్రయం దాటి ఊళ్ళోకి వెళ్ళడానికి వీల్లేదన్నారు అక్కడి అధికారులు. ఇంచుమించు ఖయిదీలుగా మాఅందర్నీ చూశారు. నగరంలోని భారతీయ రాయబార కార్యాలయానికి ఫోన్ చేస్తే ఆ అర్ధరాత్రి ఎవరూ పలకలేదు. మర్నాడు మరో విమానం దొరికేదాకా అక్కడే ఉండకతప్పదనిపించింది. సాధారణంగా విమానయానం చేసేటప్పుడు ఒక ప్రయాణానికీ, ఒక ప్రయాణానికీ మధ్యను 48 గంటల వరకు ట్రాన్సిట్ వీసాలు ఇవ్వడం ప్రపంచం అంతటా రివాజు. కాని, జాతీయం చేయబడ్డ ఫ్రెంచి టూరిస్టు విమానశాఖ ఇందుకు నిరాకరించింది.

ఈ సంకటస్థితి నుంచి ఒక విమానాశ్రయోద్యోగి మాకో తరుణోపాయం చూపించాడు. పారిస్ నుంచి రోమ్ దాకానో, జెనీవా దాకానో టిక్కెట్టు కొనుక్కుంటే అప్పుడు మేము ఫ్రెంచి ప్రభుత్వానికి అతిథులమవుతాము. ట్రాన్సిట్ వీసా తక్షణం దొరుకుతుంది. ఇదీ అతడు సూచించిన మార్గం. సరే, మాతర్వాతి మజిలీ జెనీవా కాబట్టిన్నీ, టిక్కెట్టు ఖరీదు 70 రూపాయలే కాబట్టిన్నీ అందరమూ జెనీవాకు టిక్కెట్లు తీసుకున్నాము. తీసుకోవడమే తరువాయి, అన్ని దిక్కుల నుంచీ *"Welcome to France"* అనే ఆహ్వానాల తోనూ, అభినందనలతోనూ మా అందరికీ ఘనమైన అతిథి సత్కారం జరిగింది. ఒక స్పెషల్ వ్యాన్‌లో ఎనిమిదంతస్తుల హోటేల్‌కు తీసుకు వెళ్ళి మాకు బసలు ఏర్పాటు చేశారు.

ఆ రాత్రి మా ప్రతినిధులందరూ ఊరు చూడడానికి బైటకి వెళ్ళిపోయారు. కాని నాకు మాత్రం ఆ హోటేలును వదలి పెట్టాలనిపించలేదు. ఎందుచేతనంటే పారిస్ నగరమంతా ఆహోటేల్లోనే ఉన్నదా అన్నంత సందడిగా ఉంది. నేనున్న గది ఒక పెద్ద సూట్ *(Suite).* మధ్యని నేలకి ఒకే ఒక అడుగు ఎత్తున ఒక తల్పం ఉంది. నాలుగువైపులా నాలుగు గోడలకీ నిలువుటద్దాలున్నాయి, ఎటుచూసినా నన్నే చూపిస్తూ. కొంచెం సేపు పక్కమీద అటూ ఇటూ దొర్లి, నిద్రపట్టక హోటేల్ పర్యవేక్షణకు బయల్దేరాను. లిఫ్టుమీద ఎక్కే అంతస్తూ, దిగే అంతస్తుగా అన్ని అంతస్తులూ చూశాను. ఇంతసేపూ ఓవర్ కోటు తొడుక్కునే ఉన్నానన్న సంగతి అప్పుడు జ్ఞాపకం వచ్చింది. నాఅంతస్తుకి వెళ్ళిగదిలో ఓవర్‌కోటు పారేసి ఇవతలకి వచ్చాను.

అంతా ఒకే ఒక డాన్సుఫ్లోరూ, బార్‌రూము అయిన ఒక అంతస్తులో కాలుపెట్టాను. నాదగ్గర ఎంతో డబ్బు లేదు. కానీ బీరుమాత్రం చవక. అదే ఆస్వాదిస్తూ ఫ్రెంచి జంటల నాట్యవిన్యాసాలకు ఆనందిస్తున్నాను.

కొంతసేపు అలా కూర్చుని, మళ్ళీ నాసూట్ లోకి వెళ్ళిపోయాను. నిద్రపోదామను కున్నానుకాని నిద్ర రాలేదు సరికదా ఆకలికూడా వెయ్యలేదు. సరే, ఒక్క ఆఖరి బీరు తీసుకుందామని మళ్ళీ బయల్దేరాను.

నేను కూర్చున్న చోటికి ఒక అబ్బాయి అమ్మాయి వచ్చారు. ఇద్దరివయస్సూ పాతికేళ్లలోపు. అబ్బాయి ఇంగ్లీషు బాగా మాట్లాడుతాడు. అతనో స్మాల్ చివరు. నేను మాస్కోనుంచి వస్తున్నానంటే అతనికి చెప్పరాని ఆనందం కలిగింది. విస్కీ ఆర్డరు చేస్తానన్నాడు. వద్దన్నాను. ముగ్గురం టీరు తాగుతున్నాము. నేనో కొత్త సిగరెట్టు పెట్టె పైకి తీశాను. అమ్మాయి తనకో సిగరెట్ కావాలంది. పెట్టె ఇచ్చాను. ఒక సిగరెట్ తీసుకుని పరధ్యానంగా పెట్టెను జేబులో వేసుకుంది.

తర్వాత నేను రూముకి పోయి పడుకున్నాను. పాపం వాళ్లిద్దరూ నా కోసం వెదుకుతూనే ఉన్నారోఏమో? తెల్లారేసరికి ఆ అమ్మాయి నన్నెక్కడ మానేందోనని పరుగెత్తుకుంటూ వచ్చి సిగరెట్ పెట్టె నా చేతిలో పెట్టింది.

అందులో తొమ్మిది సిగరెట్లు ఉన్నాయి.

ప్రజాతంత్ర *2–5–1976*

## ఐదు

మర్నాడు ప్రతినిధివర్గం యావన్మందిమీ *Orly*(ఆర్లీ) విమానాశ్రయం చేరుకున్నాము. పంజాబు ప్రతినిధి లగేజి ఏమయిందో ఎవరూ చెప్పలేదు. అతను సిక్కు మతస్థుడు. లెనిన్‌గ్రాడ్‌లో గురుగ్రంథ సాహెబ్ అనువ్రతని చూస్తూఉండగా తీసిన ఫోటోగ్రాఫు ఉందట. మొత్తం లగేజీ పోయినదానికన్నా ఆ ఒక్క ఫోటోగ్రాఫూ పోయినందుకు మహాబాధపడిపోయాడు. మాఅందరి దగ్గర దాని కాపీలున్నాయి. స్వార్థమో, లగేజి తెరవడానికి బద్ధకమోకాని మిగిలిన ప్రతినిధులంతా మౌనంగా ఊరుకుంటే, నేను నా కాపీని సిక్కుమిత్రునికి బహూకరించాను. ఇక అతని సంతోషానికి అంతే లేదు. నిన్న ప్రాగ్‌లో బయలుదేరినప్పటినుండి కట్టుబట్టలతోనే ఉన్నాడు. తనదీ అనుకున్న సమస్తమూ తుడిచిపెట్టుకు పోయింది. అయినా ఒక్కఫోటోగ్రాఫుతో అద్వితీయమైన ఆధ్యాత్మికానందం పొందుతున్నాడు. ఆహా! మతంలో, ఏ మతంలోనైనా-మనుష్యుల మనస్సుల మీద పనిచేసే శక్తి ఎంత ఉంది? శ్రీకృష్ణుని బొమ్మతో ఆడుకుంటూ సక్కుబాయి ప్రపంచాన్నే మరిచిపోయిందంటే విశ్వసించని చవటయెవడుంటాడు.?(ఎవడో నాలాంటి వాడుతప్ప)

రెండు రోజుల తర్వాత సిక్కు మిత్రుని లగేజి బొంబాయి విమానాశ్రయం చేరుకుంది. పంజాబు సరిహద్దురాష్ట్రం కాబట్టి సోదానిమిత్తం 24 గంటలకాలం అతని లగేజీని ఫ్రెంచి ప్రభుత్వం నిలుపుదల చేసింది. జరిగిన సంగతి ఇదీ! బొంబాయిలో కనబడి సిక్కుమిత్రుడు తన లగేజి తనకు దక్కిన శుభవార్తను చెబుతూ నా ఫోటో కాపీ నన్ను తీసుకోమన్నాడు. ''అక్కరలేదు మీదగ్గరనే ఉండనియ్యం''డన్నాను నేను.

ఆర్లీ విమానాశ్రయంలో ఒక వ్యక్తి ఎవరికోసమో తదేకదీక్షగా వెదుకుతున్నాడు. మాకోసమే అని అతడు చెప్పడంవల్ల తెలిసింది. ''మీరు ఇండియాకు చెందిన శాంతి

సంఘప్రతినిధులేనా?'' అని మొత్తం మా అందర్నీ ఉద్దేశించిన ప్రశ్నను కొద్దిగా అర్థంచేసుకున్న నేను ''జానండి''అని జవాబిచ్చాను. అతడు పారిస్‌లోని ఫ్రెంచి శాంతి సంఘం కార్యదర్శి. నిన్నటినుంచి మాకోసం గాలిస్తున్నాడు. మాస్కో నుంచి మేము బయలుదేరామనీ,పారిస్‌లో మాకు కావలసిన సదుపాయాలు చెయ్యవలసిందనీ అతనికో కేబుల్ వచ్చింది. అప్పటినుంచి అదేపనిగా వెతుకుతున్నాడు. గతరాత్రి విమానాశ్రయంలో మమ్మల్ని కలుసుకోవడానికి వీలులేకపోయింది. కాని మేము పారిస్‌లో దిగినట్లుమాత్రం తెలుసుకున్నాడు. ఎట్టకేలకు మేము తిరుగు ప్రయాణం చెయ్యబోయే సమయంలో కలుసుకున్నాడు.

అతని పేరు*G.Ternet Movement dela paix 3 Ruedes Pyramides, Paris* అని అతని చిరునామాను నేను నా ఆటోగ్రాఫ్ పుస్తకంలో నోట్ చేసుకున్నాను. ఈ పుస్తకం నాదగ్గరే ఉందిగాని, నెరూడా సంతకం చేసిన పుటమాత్రం ఎవరో చింపుకు పోయారు. ఆరగో జాన్‌పాల్ సర్త్రల చిరునామాలున్నాయి. వాళ్ళను కలుసుకోవడానికి వ్యవధిలేకపోయింది.

ఫ్రెంచి సంఘం తరఫున మాకాతిథ్యం ఇవ్వలేకపోయినందుకు టెర్నే చాలా బాధపడ్డాడు. ఏవేవో చెబుతున్నాడు. నాకు బోధపడినంత బోధపడింది, మిగిలింది అర్థం కాలేదు. అతనుకూడా నాలాగే! నా ఇంగ్లీషుఅతనికి అర్థమవుతూనే ఉంది. కాని ఇంగ్లీషులో మాట్లాడలేడు. అయితే మొత్తంమీద అతని ఫ్రెంచి నేను అర్థంచేసుకున్న దానికన్నా నా ఇంగ్లీషును అతడే ఎక్కువగాఅర్థంచేసుకున్నాడని మాత్రం స్పష్టమే. యూరప్‌లో ఎక్కడకు వెళ్ళినా ఇంగ్లీషు భాషతో చలామణి కావచ్చు. స్వీడన్‌లో చాలామంది నాతో ఇంగ్లీషులోనే మాట్లాడారు. త్వరలో ఇంగ్లీషు యావత్ప్రపంచభాష అవుతుందనడానికి సందేహం లేదు. ఎవరూ ఒక భాషను బలవంతంగా *lingua franca* చెయ్యలేరు. ఒకప్పుడిందుకు గట్టి ప్రయత్నాలే జరిగాయి. ప్రపంచంలో అత్యధిక సంఖ్యాకులు స్పానిష్‌భాష మాట్లాడుతున్నారన్న ప్రాతిపదిక మీద ఎస్పిరాంటో అనే ఒక కృతక భాషను తయారుచెయ్యడం, దాని ప్రచారం కోసం లక్షలూ, కోట్లూ ఖర్చుపెట్టడం జరిగాయి. ఫలితం మాత్రం శూన్యం. ప్రస్తుతం తెలుగు,కన్నడ భాషలకు ఒకేలిపిని రూపొందించడానికి చేస్తున్న ప్రయత్నాలూ, ఆసియా ఖండం అంతటా నాగర లిపిని ప్రవేశపెట్టాలని వినోబాభావేగారు వేస్తున్న కేకలూ ఈ కోవకు చెందినవే. అందుకే భావేగారిని ఇరవయ్యో శతాబ్దపు డాన్‌క్విజోట్‌గా నేను అభివర్ణించడం మానలేకపోతున్నాను.

ఈ నాటి (1976) ఎమర్జన్సీ ధర్మమాఅని ఇండియా అంతటా అన్ని భాషలకూ రోమన్‌లిపిని వర్తింపజేయాలనే సదుద్దేశం అమల్లోకి వస్తే ఎంత బాగుండును. టైపురైటర్లకనీ, అచ్చు యంత్రాలకనీ వ్యయం చేస్తున్న ఎన్నెన్ని కోట్లరూపాయలను ఆదా చెయ్యవచ్చును? నూటికి 70 శాతం నిరక్షరకుక్షులుగా ఉన్నవారు ఏమిటి నేర్చుకోవాలనేది ముఖ్యంగాని అది ఏలిపిలో నేర్చుకుంటున్నారనేది ముఖ్యంకాదు కదా!

పారిస్ విమానాశ్రయంలో మాకు వీడ్కోలు చెప్పి, ఫ్రెంచి శాంతి సంఘం కార్యదర్శి వెళ్ళిపోవాలనుకుంటున్న సమయంలో, మేము బయలుదేరవలసిన విమానం నాలుగు గంటలు ఆలస్యంగా వస్తుందన్న ప్రకటన వినబడింది. దానితో ఒర్లే ముఖం కళకళ లాడింది. నాలుగుగంటల వ్యవధిమాట మాకు చెప్పి ఈ లోగా మీకు పారిస్‌లోని ముఖ్యప్రదేశాలు చూపిస్తానని మా అందరినీ ఆహ్వానించాడు.అందుకు మేము అంగీకరించాము

ముందుగా శాంతి సంఘ కార్యాలయానికి మమ్మల్ని తీసుకువెళ్ళాడు. చెర్రీ కాఫీంతోనూ, బిస్కెట్లతోనూ, కొంతకాలం గడిచింది. వాహ్యాళిగా పారిస్ అంతా తిప్పి, *Are detriomphe, La tour eiffel* మొదలయినవి చూపించి మమ్మల్ని తిరిగి విమానాశ్రయంలో వదలి పెట్టాడు.

మేము జెనీవాకు బయల్దేరాము. జెనీవాలో మళ్ళీ ఒక మజిలీ వెయ్యవలసి వచ్చింది. ఆ రాత్రి అంతా ఒక పదనహోటల్లో కాలక్షేపం చేశాము. నాదగ్గర డబ్బు బాగా తగ్గిపోడంతో బాటు స్వదేశం చేరుకోవాలనే ఆతుత ఎక్కువవుతోంది. ఈ రెండు కారణాలవలననే, జెనీవా సరస్సు పరిసరాల్లో చార్లీచాప్లిన్ సొంతఎస్టేటు ఉందని తెలిసి కూడా చాప్లిన్‌ను చూడ లేకపోయాను.

పారిస్‌లోకూడా నేను కలుసుకోవాలనుకున్న వారిని కలుసుకోలేకపోయాను.

మాస్కోలో అఖిల సోవియట్ రచయితల సమావేశానికి (టాష్కెంట్‌లో జరిగిన ఆలస్యం కారణంగా) ఒకరోజు ఆలస్యంగా వెళ్ళవలసి వచ్చింది. మొదటిరోజు సమావేశంలో మాలెంకోవ్ (స్టాలిన్ తర్వాతి ప్రధాని) పాల్గొన్నట్లు తెలిసింది. మేం వెళ్ళింది రెండో రోజు.

ఏమయితేనేం జెనీవా నుంచి బయల్దేరి, ఒక గంటసేపు కెయిరోలో ఆగి సాయంత్రానికి బొంబాయి చేరుకున్నాము. బొంబాయి విమానాశ్రయంలో కస్టమ్సు అధికారులు లాంఛన ప్రాయంగా మా లగేజీ పరిశోధించి ఊళ్ళోకి వెళ్ళిపోనిచ్చారు.

ఈ విధంగా నా మొదటి విదేశ పర్యటన ముగిసింది.

ప్రజాతంత్ర *9—5—1976*

## ఆరు

ఈ రోజుల్లో (1976) రష్యా ప్రయాణం అంటే పొరుగూరికి వెళ్ళిరావడమంత సులభమయిందిగాని 1954లో నా సోవియెట్ యాత్ర చంద్రమండలానికి వెళ్లడమంత అసంభవం అనిపించింది. ఆ క్రితం యేడు చైనా సందర్శనకు నాకు కలిగిన అవకాశాన్ని శ్రీమాన్ రాజగోపాలాచారిగారు ఎలా నీళ్ళు కార్పించారో ఇంతకుముందు రాశాను. 'కమ్యూనిస్టులు నా ప్రథమ శత్రువులు'' అని ఆయన సగర్వంగా చేసిన బహిరంగ ప్రకటన దేశమంతటా ఎందరో పెత్తందార్లకు సంతోషదాయకమయింది. ఎన్నికలతో నిమిత్తం లేకుండా నామినేషన్ ద్వారా ముఖ్యమంత్రిత్వం స్వీకరించిన ఈ మహానుభావుడు గొప్ప ప్రజాస్వామ్య

పక్షపాతిగా ప్రశంసలు పొందడంలో అనౌచిత్యమేమీ లేదనే కమ్యూనిస్టు వ్యతిరేకులంతా అనుకున్నారు.

ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడడం రాజాజీకి సుతరామూ ఇష్టంలేదు. అసెంబ్లీ స్పీకరు హోదాలో బులుసు సాంబమూర్తిగారు ఇంగ్లాండుకు వెళ్లబోతే అది సాగకుండా చేసిన ఘనతకూడా వీరిదే అంటారు. నా బోటి వాడికి పాస్‌పోర్టు రాకుండా చెయ్యడం ఆయనగారికి అతి తేలికయిన పని! అయినా ఆంధ్రరాష్ట్రం రానేవచ్చింది. అభివృద్ధి నిరోధకులు ఎన్ని ఆటంకాలు కల్పించబోయినా చరిత్ర పురోగమనం స్తాగిపోతూనే ఉంటుందని ఇంకొకసారి రుజువయింది. మొట్టమొదటి ఆంధ్రప్రభుత్వం ద్వారా నేను పాస్‌పోర్టు సంపాదించ గలిగాను. గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్రా హోం డిపార్టుమెంట్ అనే ముద్రతో 23 అక్టోబరు, 1954 అనే తేదీతో ఈ పాస్‌పోర్టు నాకు కర్నూలులో లభించింది. ఇదే పాస్‌పోర్టుతో మే నెల 1959లో రెండవసారి విదేశ పర్యటన చేశాను. దాని జీవితం అక్టోబరు 59తో ముగిసిపోయింది. మూడవసారి 1967లో సోవియట్ లాండ్ నెహ్రూ బహుమతి గ్రహీతగా రష్యాయాత్ర చేశాను. ఈసారి పాస్‌పోర్టు మద్రాసులోనే సులభంగానే లభించింది. 2 మే 67 తేదీ ఉన్న ఈ పాస్‌పోర్టు మే 72తో ముగిసిపోయింది.

ఈ పాస్‌పోర్టులమీద ఉన్న తేదీలను బట్టి:

మొదటి పర్యటన: 13-11-54న బొంబాయి శాంతాక్రుజ్ విమానాశ్రయం నుండి బయలుదేరి 21-12-54న బొంబాయిలో అదే విమానాశ్రయంలో దిగాను. అనగా అయిదు వారాల బాటు ఈపర్యటన సాగిందన్నమాట. ఈ ప్రయాణంలో 300 రూపాయలు మాత్రమే నాతో తీసుకువెళ్లాను. మా ప్రతినిధివర్గం అందరి ఖర్చులూ ప్రపంచ శాంతిసంఘమే భరించింది.

రెండవ పర్యటన పూర్తిగా నా స్వంత ఖర్చుమీద సాగించాను. అందుకుగాను ఒక మార్వాడీ దగ్గర నా కారు తాకట్టుపెట్టి రూ.6,000లు అప్పుచేశాను. వడ్డీలకిందా, చక్రవడ్డీలకిందా ఏడెనిమిదేళ్లలో 25వేల దాకా మార్వాడీకి చెల్లించినప్పటికీ అసలు అప్పు తీరలేదు. కారు నాకు దక్కలేదు.

5-5-1959న ఢిల్లీలోని పాలం విమానాశ్రయం నుంచి బయల్దేరాను.

14-5-1959నఅదే విమానాశ్రయానికి మరలి వచ్చాను.

ఈసారికూడా ప్రపంచ శాంతి సంఘ ప్రతినిధిగానే ప్రయాణం చేశాను. శాంతిసంఘ దశమ వార్షికోత్సవం జరుగుతున్న రోజులవి. స్టాక్‌హోలమ్‌లో వారంరోజులుండి అక్కడ నుండి మాస్కోకు వెళ్లి తిరిగి రావాలని బయల్దేరినప్పుడనుకున్నాను. మాస్కోకు ఒక వీసాకూడా సంపాదించాను. కానీ అదేమీ జరగలేదు. శాంతిసంఘ కార్యాలయంలో అడుగు పెట్టానో లేదో అప్పుడే నాలుగైదు కేబిల్సు మద్రాసునుంచి వచ్చినాకోసం ఎదురు చూస్తున్నాయి. అన్నీ నా సినిమా ప్రొడ్యూసర్ల నుండి వచ్చినవే. అన్నిటి సారాంశమూ ఒకటే.

"వెంటనే బయల్దేరి మద్రాసుకు వచ్చెయ్యి"అని! నేను లేకపోతే అన్నిపనులూ ఆగిపోతాయని! స్టాక్‌హోమ్ వెళ్లింది మొదలు తిరుగు ప్రయాణానికి సన్నాహాలు చేసుకోవడంలోనే నా కాలమంతా గడిచిపోయింది.

అవేరోజుల్లో నేను నా సొంతానికొక పిక్చర్ డబ్ చేస్తున్నాను. అయితే పాటలూ, మాటలూ రాయడం వరకే నా వంతుగాని పూర్తి బాధ్యత అంతా నా ద్వితీయ భార్య సరోజ(ఈమెను నేను రెండోసారి విదేశాలకు బయల్దేరేముందు రిజిస్టరు మారేజి చేసుకున్నాను.)ది."చెవిలో రహస్యం"అనే ఈ డబ్బింగ్ చిత్రం నాకు మానసికంగా ఎంత ఆనందం కలిగించిందో ఆర్థికంగా అంత నష్టం కలిగించింది.

మూడవ పర్యటన (ఇదే ప్రస్తుతానికి ఆఖరు పర్యటన) యావత్తూ సోవియట్ ఆతిథ్యంతోనే నడచింది. ఇండియా గవర్నమెంట్ 75 రూ. మాత్రమే నాతో తీసుకువెళ్లనిచ్చింది. అవికూడా నేను పూర్తిగా ఖర్చు పెట్టనేలేదు.

పాలమ్ విమానాశ్రయం నుంచి 10-5-67న బయల్దేరినట్టూ 25-5-67న అదే విమానాశ్రయంలో దిగినట్టూ నా పాస్‌పోర్ట్‌లో ఎంట్రీలున్నాయి.

ఈ మూడోయాత్ర గురించి రాసే ముందు అసంతృప్తికరంగాసాగిన నారెండవ పర్యటన విశేషాలను (వాటిని విశేషాలని కూడా అనడానికి వీల్లేదేమో) రాసి ముగిస్తాను.

స్టాక్‌హోమ్ (ఇదే సరియైన ఉచ్చారణ) చాలా పరిశుభ్రమైన నగరం మాత్రమేకాక అచ్చటి ప్రజలంతా మిక్కిలి నిష్కల్మషమైన మనస్సులు కలవారు. రెండు ప్రపంచ యుద్ధాల లోనూ తటస్థంగా ఉన్న దేశాలలో స్వీడన్ ఒకటి. ఇప్పటికీ అక్కడ రాజరికమే అమలులో వున్నా ఆచరణలో అక్కడ సామ్యవాదమే ప్రజల జీవితాలను పరిపాలిస్తుంది. ఇతర సంపన్న దేశాలలో వలె అక్కడ విపరీతమైన ఐశ్వర్యమూ, దుర్భర దారిద్ర్యమూ సహజీవనం గడపడం లేదు.

నా హోటేల్ నుండి శాంతి సభా భవనానికి వెళ్లడానికి రెండు బస్సులు మారాలి. మొదటి బస్సు దిగి అలవాటు చొప్పున టిక్కెట్టును నలిపి కిందపారేశాను. బస్సువెళ్లిపోయింది. నల్లటి అద్దంలాగ మెరుస్తున్న తారురోడ్డుమీద నా బస్సు టిక్కెట్టు ఒక అపస్వరంలాగ కనబడింది. ఆ పక్కనే బస్‌స్టాప్ దాటకు తగిలించి ఒక చిన్నచెత్తబుట్టవుంది. నేను నలిగిపోయిన టిక్కెట్టును తీసి ఆ బుట్టలో పడవేశాను. ఆ నగరాన్ని ప్రజలే పరిశుభ్రంగా ఉంచుకుంటారని అప్పుడు నాకు తెలిసింది.

ఒక టాక్సీ డ్రైవరు చాలా తక్కువ మొత్తం తీసుకొని మాకు పట్టణమంతా చూపించాడు. అతడు తగుమాత్రం ఇంగ్లీషు మాట్లాడగలడు. టాక్సీ తన సొంతమనీ, తనకో సొంతఇల్లు కూడా ఉందనీ మాతో చెప్పాడు. ఎన్నికలలో సోషల్ డెమోక్రాటిక్ పార్టీకి ఓటు చేస్తూ వుంటానన్నాడు.

నా హోటేల్‌కు వెళ్లవలసిన రోడ్డుకు బదులుగా పక్కనే సమానాంతరంగా ఉన్న ఒక

రోడ్డుమీద నడుస్తున్నాను. ఇరవై ముప్ఫయి గజాలు నడిచిన తర్వాత నాకే అనుమానం వేసింది. ఒక ముసలావిడకు నేను వెళ్లవలసిన రోడ్డు పేరు చెప్పాను. ఆవిడ "నేను చూపిస్తాను, రా" అని నాతో రెండో వీధిదాకా నడచి వచ్చి ఇదే నీకు కావలసిన రోడ్డు అని చూపించింది. "సొంతలాభం కొంతమానుకు పొరుగువాడికి తోడు పడడం" అంటే ఇదికాక మరేమిటనుకున్నాను.

రెండోరోజు మళ్లీ ఒకటి రెండు కేబిల్సు మద్రాసునుంచి వచ్చాయి. అయితే అప్పటికే నేను తిరుగు ప్రయాణపు ఏర్పాట్లన్నీ చేసుకున్నాను. నాకున్న లగేజి అంతా ఒక చిన్న సూట్‌కేస్ మాత్రమే. త్వరగా స్వదేశానికి చేరడం తప్ప మరో ధ్యానం నాకు లేకపోయింది. కాని నేను వెళ్లే విమానం పారిస్ వరకు మాత్రమే వెళ్లుతుందని, అక్కడైనా వెంటనే మరో విమానం దొరకక పోవచ్చునని చెప్పాడు. అనుకున్నట్టే పారిస్‌లో 24 గంటలు ఆలస్యమయింది. ఆలస్యం అయిపోతున్నందుకు విసుక్కుంటూ మూడోరోజున ఎయిర్-ఫ్రాన్స్ విమానం ఎక్కాను.

పారిస్‌లో గడిపిన 24 గంటలూ విసుగ్గానే గడిచిపోయాయి. నా ప్రొడ్యూసర్లను కష్టపెట్టకూడదనిగాని మరో నాలుగైదు రోజులు నేను వెళ్లకపోయినా అక్కడి పనులేవీ ఆగిపోవని నాకు తెలుసు. అయినా ప్రతీ ప్రొడ్యూసరూ రేపే తన పిక్చరు విడుదలయి పోతున్నట్టు మాట్లాడుతాడు. అప్పుడూ అంతే! ఇప్పుడూ అంతే. ఆ వ్యవస్థకు మారుపేరు మన సినిమా పరిశ్రమ.

విమానాశ్రయంలోనే 24 గంటలు గడపడం ఎందుకని ఏదైనా ఇంగ్లీషు మాట్లాడే వాళ్లున్న హోటేల్‌కు తీసుకువెళ్లమని టాక్సీ కుదుర్చుకున్నాను. హోటల్ రేట్లు చవగ్గా ఉండాలని కూడా షరతు విధించాను. నగర మధ్యలో ఒక చిన్న వీధిలో ఉన్న *Hotel Anglo — Americaine* చూపించాడు టాక్సీడ్రైవరు. *Merei bean coup* (చాలా కృతజ్ఞత) అని చెప్పి అతణ్ని పంపించేశాను.

హోటేల్లో రిసెప్షన్ క్లార్క్ మాత్రమే ఇంగ్లీషు మాట్లాడగలడు. ఒక చిన్న రూం తీసుకున్నాను. అందులో సూట్‌కేస్ పడేసి బైటికి వచ్చాను. అప్పటికే సాయంకాలం అయిపోయింది. ఒక బస్సుమీద *Mont Martre* అని ఉంది. దీన్ని గురించి పుస్తకాలలో చాలా చదివాను. అక్కడకు వెళ్లితే అంతా నిర్జనంగా వుంది. పారిస్‌లో రాత్రి జీవితం పదిగంటల తర్వాతగాని ప్రారంభం కాదు. అంతవరకు అక్కడా, ఇక్కడా తిరుగుతూ కాలక్షేపం చేశాను.

పదిగంటలు దాటినప్పటినుంచీ ఆ ప్రదేశం అంతా కళకళలాడుతోంది. అక్కడంతా నైట్ క్లబ్బులు జాస్తి. కొన్ని మెంబర్లకు మాత్రమే ప్రత్యేకం. ఒక క్లబ్బు ముందు ఆగి ఒకతణ్నే టిక్కెట్లు ఎక్కడిస్తారవి అడిగేను. ప్రవేశం ఉచితమనీ, అయితే ఏదో ఒక డ్రింకుమాత్రం విధిగా తీసుకోవాలని చెప్పి లోనికి పోనిచ్చాడు. ప్రవేశద్వారం దగ్గరే రకరకాల పానీయాలు

న్నాయి. అయితే బైట రూపాయి ఖరీదుచేసే బీరు బాటిలు అక్కడ పదిరూపాయలు. (ఫ్రెంచి కరెన్సీలో వంద ఫ్రాంకులనుకుంటాను. ఇప్పుడు జ్ఞాపకం లేదు.) ఒక బీరు బాటిల్‌తో రాత్రంతా కూర్చున్నా నిన్నడిగే వాళ్లు లేరు. అరగంటసేపు కూర్చునేసరికే నాకు విసుగనిపించింది. నా దగ్గర ఫ్రెంచి కరెన్సీ (ఎయిర్‌పోర్టులో మార్చినది) చాలా తక్కువగా ఉంది. ఎక్కువ ఖర్చుపెడితే హోటేల్‌కు వెళ్లడానికి డబ్బు మిగలదు. కాబట్టి ఆ రాత్రి చాలాభాగం వీధుల్లోనే గడిపాను.

ఒక నీగ్రో అమ్మాయిని ఎంత తీసుకుంటావని అడిగేను. వెయ్యి ఫ్రాంకులు. అదైనా తన రూంకు వస్తేనే! ఆమె కోరిన మొత్తంలో నాలుగోవంతు కూడా నాదగ్గర లేదు.

తెల్లవారు జామున నాలుగ్గంటలకు హోటేల్ రూంకు వెళ్లి నిద్రపోయాను.

మర్నాడు ఎయిర్-ఫ్రాన్స్ విమానంలో ప్రయాణం చాలా సుఖంగా గడిచింది. పారిస్ నుంచి టోకియో దాకా వెళ్లే విమానం అది.

అరగంటలో రోమ్ చేరుకొంది. అక్కడనుంచి టెహరాన్ దాకా ఆగలేదు. టెహరాన్ నుంచి సరాసరి ఢిల్లీకే. విమానంలో ఒక షాంపేన్ గ్లాసు రూపాయి. అలా షాంపేన్ సేవిస్తూనే పాలం విమానాశ్రయం చేరుకున్నాను. ఫ్రెంచి విమానం కలకత్తాకు వెళ్లిపోయింది. నేను ఇండియన్ ఎయిర్‌లైన్స్ విమానంలో మద్రాసుకు బయల్దేరాను.

మద్రాసులో నేననుకున్నట్లే అన్ని పనులూ మందకొడిగా సాగుతున్నాయి. సరోజ మాత్రం నేనులేని కొద్ది రోజుల వ్యవధిలో మా సొంత పిక్చరు సంభాషణల డబ్బింగు పూర్తిచేసింది. మరిరెండు రోజుల్లో నేను పాటలు రాసిస్తే మ్యూజిక్ డైరెక్షన్ నిర్వహించింది.

ఆ యేడు (1959) సెప్టెంబరు 17వ తారీఖున సరోజ మొదటి పుత్రికను ప్రసవించింది.

ప్రజాతంత్ర *16–5–1976*

## ఏడు

1966వ సంవత్సరం సోవియెట్ లాండ్ నెహ్రూ బహుమతి (సాహిత్యానికి) నాకు వచ్చిందని ఆయేడు ఆగష్టులోనో, సెప్టెంబరులోనో ఒక అర్ధరాత్రి నాకు ఫోనోగ్రామ్ వచ్చింది. అవార్డు ప్రారంభమయింది మొదలు ఇది ప్రతిసంవత్సరమూ నాకు వస్తుందని అనుకోవడమూ, ఏదో ఒకానొక లేక కొన్ని కొన్ని కారణాలవల్ల రాకపోవడమూ జరుగుతూనే ఉండడం వల్ల ఈసారి ఫోనోగ్రామ్ నాకేమీ ఆశ్చర్యం కలిగించలేదు. విశేషం ఏమిటంటే ఈసారికూడా ఈ బహుమతి రాకుండా చెయ్యడానికి గట్టి ప్రయత్నాలే జరిగినట్లు తర్వాత నాకు తెలిసింది. నాకంటే, వ్యక్తిగతంగా నాకనికాదు, ఆ సంవత్సర తెలుగు పుస్తకానికి బహుమతి ఇవ్వడాని కభ్యంతరం వచ్చింది.

నేనెప్పుడూ ఏ బహుమతికోసమూ స్వయంగా ప్రయత్నించలేదు. చిన్నప్పుడు తెలుగు వ్యాసరచన పోటీలో వేమన పద్యాల పుస్తకం మొదలు, నిన్న మొన్నటి కేంద్రసాహిత్య అకాడమీ

బహుమతిదాకా అన్నీ నాకు అప్రయత్నంగానే లభించాయి. ఇందుకు నా అర్హత ఒకటే కారణం అనుకోను. ప్రపంచ ప్రసిద్ధమైన నోబెల్ బహుమానం వెనుక కూడా బోలెడంత 'వ్యవహారం' ఉంటుందన్న విషయం జగద్విదితమే. టాల్‌స్టాయ్ బతికుండగా రడ్యార్డ్ కిప్లింగ్‌కు ఈ బహుమతి రావడంలో బ్రిటిష్ రాజకీయాల ప్రభావం లేదంటే ఎవడు నమ్ముతాడు? నోబెల్ బహుమతి ప్రదాతలకు జేమ్స్‌జాయిస్ పేరుకూడా తెలియకపోవడమనేది ఆశ్చర్యకరమా? విషాదకరమా? సోల్జెనిత్సిన్‌కు కేవలం సాహిత్య విలువలవల్లనే ఈ బహుమతి వచ్చిందా? ఇలాంటివే ఎన్నో ప్రశ్నలు. వీటి జవాబులకు ఎవరూ కష్టపడి రీసెర్చి చెయ్యనక్కర లేదు.

1966 సోవియెట్ లాండ్ బహుమతి నిమిత్తం శుద్ధానంద భారతి అనే స్వామీజీ తమిళంలో "సోవియట్ గీతాంజలి" అనే బృహత్కావ్యాన్ని రాత్రికిరాత్రి పూర్తిచేసి, తన స్వంత ప్రెస్సులో అచ్చువేయించి అవార్డు కమిటీకి పంపించాడు. హిందీలో కిషన్‌చందర్‌కూ, తమిళంలో 'భారతి"కీ బహుమతులివ్వాలన్న నిర్ణయం నిమిషాలమీద జరిగిపోయింది. నా "ఖడ్గసృష్టి" పరిశీలనకు వచ్చినప్పుడు ఒకే సంవత్సరం రెండు దక్షిణాది భాషలకు బహుమతి ఇవ్వవలసిందేనా అన్న మీమాంస వచ్చింది. ఇవ్వకూడదనే ఆంక్ష ఏదీ లేకపోయినా తర్జనభర్జనలు మాత్రం ఘాటుగానే సాగిపోయాయట! తర్వాత ఏ చక్రాలూ, మరలూ, సీలలూ ఎలా తిరిగాయో నాకు తెలియదుకాని, ఎట్టకేలకు "ఖడ్గసృష్టి"ని కూడా ఎన్నిక చెయ్యడం జరిగింది.

ఆ కారణంగా 1967 మే 10వ తేదీన ఢిల్లీ పాలం విమానాశ్రయం నుంచి సోవియట్ టర్బో-జెట్‌లో మాస్కోకు బయల్దేరాను.

ఎక్కడా ఆగకుండా ఈ విమానం అదేరోజున సరాసరిగా మాస్కో చేరింది. హిమాలయ పర్వతాలమీదుగా ప్రయాణం చేస్తున్నప్పుడు దిగువనంతా మంచుతివాచీలు పేర్చినట్లు కనిపించింది. మొత్తం ఏడుగంటల ప్రయాణం అనుకుంటాను. ప్రారంభంలో ఉన్న హుషారు, పోనుపోను విసుగ్గా పరిణమించింది. ఇంకా నాల్గు గంటలు, ఇంకా మూడు గంటలు, ఇంకా రెండుగంటలు ఎప్పుడింకా మాస్కో చేరుతామా అనిపించింది.

మాస్కో విమానాశ్రయంలో దిగగానే విసుగంతా పూర్తిగా పటాపంచలయిపోయింది. అక్కడ మాకు ఘనమైన స్వాగతం లభించింది. ఆక్షణం నుంచీ అంతా ఉత్సాహమే.

నగరంలోనికి వెళ్లే మార్గంలో మాస్కోకు సుమారు 20, 25 కిలోమీటర్ల దూరంలో మా కారు ఆగింది. అక్కడ ఒక బ్రహ్మాండమైన స్మారకశిల్పం ఉంది. రెండవ ప్రపంచ యుద్ధంలో మాస్కో నగరం మీదకు కెరటాలుగా విరుచుకుపడుతున్న నాజీ సేనలను నిలువరించడం మాత్రమే కాక రష్యన్లు తిప్పికొట్టిన సమరరంగం అది. నెపోలియన్ సేనలకు పట్టిన దుర్గతి తన సైన్యానికి కూడా పట్టకూడదని, చలికాలం రాకముందే మాస్కోను పట్టుకోవాలని హిట్లర్ చేసిన విశ్వప్రయత్నం విఫలమైన ప్రదేశం అది. యూరప్ అంతటా

విశృంఖల విహారంచేసి, అప్రతిహతంగా పురోగమించిన జర్మన్‌టాంక్ దళాలకు శృంగభంగం జరిగిన స్థలం అది. *The blitz-Krieg is a wash out"* ("మెరుపు యుద్ధం నీరు కారిపోయింది") అని సోవియట్ ప్రచారశాఖామంత్రి ప్రకటించడానికి ఇచ్చటి విజయమే కారణం.

1967లో రష్యా అంతటా సామ్యవాద విప్లవపు 50వ వార్షికోత్సవం (ఆ సంవత్సరం అంతా) అతివైభవంగా జరుగుతోంది. మాస్కోకు వెళ్లగానే ఆనవాయితీ ప్రకారం క్రెమ్లిన్ భవనానికి వెళ్లి లెనిన్ సమాధిని సందర్శించాము. ఆ సమీపంలోనే స్టాలిన్‌ను ఖననం చేసిన స్థలం ఉందని మా మార్గదర్శి (అతనిపేరు ఇమాన్యుయల్ బోరోవిక్) తెలియజేశాడు. బోరోవిక్ ఇంగ్లీషు, హిందీ భాషలు అనర్గళంగా మాట్లాడగలడు. సోవియట్ యూనియన్‌లో మేము పర్యటన చేసినన్నాళ్లూ మా యోగ క్షేమాలకు బాధ్యత అతనిదే. తర్వాత కొన్నాళ్లకు "సోవియట్ లాండ్" ఇంగ్లీషు పత్రికలో సుదీర్ఘమైన వ్యాసం రాస్తూ నాగురించి మరీ ఉత్సాహపూరితంగా ఉల్లేఖించాడు. తనకు త్వరలోనే న్యూఢిల్లీలోని రష్యన్ రాయబార కార్యాలయంలో ఉద్యోగమవుతుందనీ, ఇండియాలో మళ్లీ కలుసుకుందామనీ నాతో అన్నాడు. అయితే ఏ కారణాలవల్లనో తెలియదుగాని ఇండియాలో మేము మళ్ళీ కలుసుకోవడం జరగలేదు.

రెండవసారి వెళ్లినప్పుడు మాస్కో అంతటా ఆకాశ భవనాలు లేచిపోతున్నాయి. పది అంతస్తుల లోపు భవనమే మాకు కనపడలేదు. అయితే ఇవన్నీ ఒకదానిమీద ఒకటి పడిపోతున్నట్లు కిక్కిరిసి పోకుండా, మధ్యమధ్య ఉద్యానవనాలూ, క్రీడానివేశనాలూ ఇత్యాదులెన్నో ఉన్నాయి. చరిత్ర ప్రసిద్ధి వహించిన రష్యన్ ప్రముఖుల కంచువిగ్రహాలూ, పాలరాతి విగ్రహాలు తదితర శిలావిగ్రహాలూ లెక్కకుమిక్కిలిగా వున్నాయి. పుష్కిన్ ప్రతిమకు సమీపంలోనే మయకోవస్కీ విగ్రహం ఉంది.

మేము బసచేసిన హోటేల్ 25 అంతస్తుల భవనం. అయితే తరుచు లిఫ్టు ఉపయోగించ వలసిన అవసరం లేకుండా మాకు మొదటి అంతస్తులోనే వసతి చూపించారు. నాగదిలో ప్రవేశించగానే నేను చేసిన మొట్టమొదటి పని రష్యన్ కాలమానం ప్రకారం నా చేతి గడియారాన్ని సరిదిద్దుకోవడం. తేదీ అదే అయినా కాలపరిమితిలో అయిదారు గంటల తేడా ఉంటుంది.

మాస్కోలో అది వసంతకాలం కావడంవల్ల నేను ఉన్ని దుస్తులు ధరించలేదు. అక్కడ నుంచి ఎస్తోనియా, లాట్వియాలకు వెళ్లినప్పుడు కూడా చలిబాధ లేనేలేదు. మేము వెళ్లిన అన్నిచోట్లా వాతావరణం అతి ప్రశాంతంగా ఉంది. ఉత్తర ప్రాంతాల్లో చలికి నేను తట్టుకోలేననుకొని బోరోవిక్ నాకొక ఓవర్‌కోటు ఎరువిచ్చాడు. దాన్ని నేను అప్పుడప్పుడు అలంకారప్రాయంగా మాత్రమే ధరించేవాణ్ని. స్వామి శుద్ధానంద భారతి శీతోష్ణస్థితులకతీతుడు కాబట్టి ఎప్పుడూ కాషాయవస్త్రాలనే ధరించేవాడు. ఆయన ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు

అనర్గళంగా మాట్లాడుతాడు. కొంతకాలం అరవిందాశ్రమంలో ఉండేవాడట. జీవాత్మ, పరమాత్మలను గురించి ఆయన మాట్లాడుతూ ఉంటే రష్యనులు నోళ్లు వెళ్లబెట్టి వినేవారు. నాకుమాత్రం ఈ వేదాంతం రుచించకపోయినా, మర్యాదకాదని మనస్సులోనే నా వ్యాఖ్యాలను ఇంకిపోనిచ్చాను. కాని కిషన్‌చందర్ కొంచెం సూటిగానే, మనిషి చచ్చిపోయిన తర్వాత సంపాదించే ఆధ్యాత్మిక సదుపాయాలకన్న బతికుండడానికి కావలసిన అన్నవస్త్రాలే ముఖ్యమని నేను అందామనుకుని అనడం మానేసినమాటలనేశాడు. ఈ వాగ్వాదం తీవ్రరూపం ధరించేలోగా ప్రసంగాన్ని బోరోవిక్ మరో మార్గానికి మళ్లించాడు. శుద్ధానంద భారతి కొన్ని ఫ్రెంచిగీతాలు పాడి మాకందరికీ అర్థంకాని ఆనందం కలిగించాడు.

మర్నాడు మేం అందరమూ యస్నాయా పాల్యానాకు వెళ్లేము. ఇది టాల్‌స్టాయ్ సొంత ఎస్టేటు ఉన్నచోటు. మొత్తం నివేశనాలన్నిటినీ రష్యన్ ప్రభుత్వం విప్లవ విజయానంతరపు తొలిరోజుల్లోనే జాతీయం చేసింది. నాటినుంచి నేటి దాకా ఇది టాల్‌స్టాయ్ భక్తులకేకాక మానవత్వాన్ని మన్నించే ప్రతిఒక్కడికీ తప్పనిసరిగా సందర్శించవలసిన సుప్రసిద్ధ యాత్రాస్థలం.

టాల్‌స్టాయ్ పెద్ద జమీందారీ కుటుంబానికి చెందినవాడు. ఆ జమీందారీ అవశేషాలన్నిటినీ చెక్కు చెదరనియ్యకుండా రష్యన్ ప్రభుత్వం పదిలపరిచింది. రష్యన్ జమీందారులకు బ్రిటిష్ అరిస్టాక్రసీ ఆదర్శప్రాయం అనుకుంటాను. కనీసం టాల్‌స్టాయ్ విషయంలో ఇది నిజమే అని నాకనిపించింది. ఆయన రచనలు సాగించే టేబిల్‌మీద నేనో ఖాళీ శ్వాన్ సిరాబుడ్డి చూశాను. చిన్నతనంలో నాకుకూడా శ్వానింక్ అన్నా, శ్వాన్ ఫౌంటెన్ పెన్నన్నా చాలా ఇష్టం. ఇప్పుడు మాత్రం నేను ఏ పెన్నుతో రాస్తున్నాననేది కాక, ఏమిటి రాస్తున్నాననేది ముఖ్యమని పరిగణిస్తాను.

ప్రజాతంత్ర *23—5—1976*

## ఎనిమిది

'ఇప్పుడు మనం టాల్‌స్టాయ్ సమాధి చూడడానికి వెళ్తున్నాం'' అన్నారు కామ్రేడ్ బోరోవిక్, మేము మోటారువాన్ వైపు వెళ్ళబోయాం. ''కాదు, కాలినడకనే వెళ్తున్నాం. 5 నిమిషాలలోపు ప్రయాణం'' అన్నాడతను. అతనూ మరికొందరూ ముందు నడుస్తూండగా మేము వారి వెంటనువెళ్ళాం.

సోవియట్ నిర్మాణాలన్నీ భారీ ఎత్తున జరిగేవే కాబట్టి టాల్‌స్టాయ్ సమాధి కూడా ఎంత పెద్దదిగా, ఎంత అద్భుతంగా ఉంటుందో అనుకున్నాను. అద్భుతంగానే ఉందిగాని అది ఆరడుగుల నేల మాత్రమే. టాల్‌స్టాయ్ తన కథలలో ఒకదానికి పెట్టిన శీర్షిక నాకప్పుడు జ్ఞాపకం వచ్చింది. ''ఒక మనిషికి ఎంత నేలకావాలి?''

ప్రపంచ నాటక గ్రంథాలలో షేక్స్పియర్ రచించిన ''హామ్లెట్'', ప్రపంచ నవలలలో టాల్‌స్టాయ్ వ్రాసిన ''యుద్ధమూ, శాంతీ'' ప్రథమ గణ్యమైనవని చాలామంది సాహిత్య విమర్శకుల అభిప్రాయం. నాటకాల విషయం నేను ఖచ్చితంగా చెప్పలేనుగాని నవలల్లో టాల్

స్థాయిదే ప్రపంచమంతటిలో ప్రథమస్థానమని నా నిశ్చయాభిప్రాయం.

"*What is Art?*" (కళ అంటే ఏమిటి)? అనే టాల్‌స్టాయ్ వ్యాసం చదివిందాకా నాలో "కళకోసమే కళ" అనే భావం ప్రబలంగానే ఉండేది. ఏది చెబితేనేం? ఒక రచనకు శిల్పసంపద మాత్రమే అతిముఖ్యం అనుకునేవాణ్ణి. "సామాజిక ప్రయోజనం లేనిది కళ కానేకా"దనే గట్టి విశ్వాసం నాలో కలిగించినవాడు టాల్‌స్టాయ్.

అటువంటి టాల్‌స్టాయ్ ఆరడుగుల నేల క్రింద విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఎంత నిరాడంబరంగా ఉందతని సమాధి! అయినా ఒక సాహితీపరుని కోసం అతని దేశప్రజలు నిర్మించిన తాజ్‌మహల్‌గా నాకది కనిపించింది. పగలనక, రేయనక ఆ సమాధిమీద ఎప్పుడూ సరికొత్తగా కోసిన పువ్వులుంచుతూ ఉంటారు అప్పటివాళ్ళు. ధన్యత అంటే ఆ పువ్వులదా? వాటిని వేసిన వాళ్ళదా? ఏమో చెప్పలేను!

యస్నాయా పొల్యానాకు వెళ్ళినప్పుడూ, మాస్కోకు మరలివచ్చినప్పుడూ మధ్యమధ్యను కొన్నికొన్ని గ్రామాల్లో ఆగి కొంతదూరం నడిచాం. అన్ని గ్రామాల్లోనూ నన్ను ఆకర్షించింది అచ్చటివీధుల పరిశుభ్రత. ఆగిన అన్నిచోట్లలోనూ ఒకేరకం (నిషాచెయ్యని) పానీయం సేవించాం. దాని రుచి ఇంచుమించు మన కొబ్బరినీళ్ళలా ఉంటుంది. అది కూడా ఏదో చెట్టునుండి తీసినరసమే. చెట్టుపేరూ, పానీయం పేరూ మరచిపోయాను. ఇది మాదేశపు నీరా అని *Barovik* అభివర్ణించడం మాత్రం నాకు జ్ఞాపకం. ప్రతి చిన్నవిషయంలోనూ ఇండియా గురించి రష్యన్లు సాగించే అధ్యయనం నాకు ఆశ్చర్యం కలిగించింది.

మాస్కోలో రెండోసారి కూడా నేను రష్యన్ రచయితల సమావేశానికి సకాలంలో చేరుకోలేకపోయాను. బయల్దేరడమేమో చాలా పెందరాళే బయల్దేరాము. కాని ఆరోజుల్లో నగరమంతటా మే దినోత్సవాల సంరంభమే. ఒక పలుదారుల కూడలికి కొంతదూరంలో మా వాన్ ఆగిపోయింది. ముందు చాలా ట్రక్కులూ, కార్లూ, బస్సులూ ఇంకా అనేక రకాల శకటాలూ నిలిచిపోయి ఉన్నాయి.

ఇందుకు చాలా అందమైన కారణం ఏమిటంటే అన్ని వీధుల్లోనూ వస్తూపోతున్న కొమ్సొమాల్ (యువకమ్యూనిస్టు) దళాలు. వాటిని ఎర్రని, తెల్లని సముద్రతరంగాలని నేను వర్ణించను. ఎందువల్లనంటే సముద్రతరంగాల ఆటుపోటులలో ఒక క్రమశిక్షణ కనిపించదు కాబట్టి నడుస్తున్న ఎర్రని, తెల్లని గులాబీపూలమాలలని ఆ దళాల గమనాన్ని వర్ణించడంలో వాస్తవానికి కడుసమీపంలో ఉన్న కవిత్వం కనిపించుతుందంటాను.

అలాగ సుమారు రెండుగంటల సేపు నగరమధ్యంలో ట్రాఫిక్కంతా బందయిపోయింది. కాని నాకదేమీ విసుగనిపించలేదు. రచయితల సభలకు వెళ్ళడం అనే అర్జంటు పని లేకపోతే, సాయంత్రం దాకా అక్కడేవుండిపోవచ్చు ననిపించింది. ఇంకొక అరగంటలో ఆ సమావేశం ముగిసిపోతుందనీ, సభాభవనం అక్కడకు చాలాదూరమనీ, కాబట్టి మేము భూగర్భ రైలు మార్గం తీసుకోవడం మంచిదనీ కామ్రేడ్ బోరోవిక్ సూచించి ఒక ఎస్కార్టునిచ్చి మమ్మల్ని

పంపించాడు.

మాస్కోలో అడుగడుగునా అండర్‌గ్రౌండ్ స్టేషన్లే అంటే అతిశయోక్తి అనిపించుకోదు. ఒకటి లేక ఒకటిన్నర నిమిషాలు నడిచి ఒక స్టేషన్ చేరుకున్నాము. ప్లాట్‌ఫారం మీదకు అయిదారువందల గజాలు దిగి వెళ్లామోలేదో, అప్పుడే మేము ఎక్కవలసిన రైలు వస్తోంది.

ఇంత తొందరపడినా తీరామేము గమ్యస్థలం చేరుకున్న సమయానికి సమావేశం ముగిసి పోయింది. అందరూ ఎవరి ఇళ్ళకువాళ్ళు మధ్యాహ్నభోజనానికి వెళ్ళిపోయారు. అప్పుడే ప్రసిద్ధి లోనికి వస్తున్న ఒక యువకవిని మాత్రం పరిచయం చేసుకోవడం జరిగింది. నేను కలుసుకోవా లనుకున్న ఇద్దరు ప్రముఖ యువకవులను (వారిపేర్లు ఎవ్టైషెంకో, వాజ్నోసెంట్‌స్కీ) కలుసుకోవడం పడలేదు.

రష్యన్ రచయితల మీద ప్రభుత్వపు అజమాయిషీ ఎంత ఉందనే విషయం చర్చకు వచ్చింది. రచయితలందరూ ప్రభుత్వాభిమతానికి బానిసలే అనే దురభిప్రాయానికి మన దేశంలోనే కాక అన్ని పెట్టుబడిదారీ దేశాలలోనూ విరివిగా ప్రచారం లభిస్తుందన్న విషయం సోవియట్ రచయితలకు తెలియనది కాదు. సోవియట్ రచయితల సమాఖ్య ఒక స్వయం సంపూర్ణమైన స్వతంత్రసంస్థ అనే సంగతి వారు మాకు జ్ఞాపకం చేశారు. (ఈ విషయం నాకు ఇదివరకే తెలుసు.) ఎటొచ్చీ రచనాస్వాతంత్ర్యం అనే దానికి పెట్టుబడిదారీ దేశాలిచ్చే అర్థం కమ్యూనిస్టుదేశాల రచయితలకు అనర్థంగా కనబడుతుంది. సంఘ చైతన్యానికి, సామాజిక ప్రయోజనానికి సోవియట్ రచయితలు అత్యధిక ప్రాధాన్యమిస్తారు. ఈ దృక్పథంతో ఏకీభవిస్తాను కాబట్టి నన్ను మాస్కో మానసపుత్రుడని అభివర్ణించడం జరిగింది. (ఇది చాలాకాలం కిందట! బహుశా ఇప్పుడు నేను "మావో మానసపుత్రు"ణ్ణయి పోయాననుకుం టాను, కొంతమంది దృష్టిలో!) అసలు నిజం ఏమిటంటే అచ్చంగా నేను తెలుగుబిడ్డని!

*ప్రజాతంత్ర 30—5—1976*

## తొమ్మిది

మాస్కోలో జరిగిన పుష్పప్రదర్శన చూడడం ఒక గొప్ప అనుభూతి. ఈ రాజధాని నగరంలో ఎప్పుడూ ఏవో ప్రదర్శనలు జరుగుతూనే ఉంటాయి. వ్యావసాయిక ప్రదర్శన వంటివి సంవత్సరాల తరబడి సాగుతాయి. వాటిని పెర్మనెంటు ప్రదర్శనలని చెప్పవచ్చును.

54లో నేనుచూసిన రష్యాకూ, 67లో చూసిన అదే దేశానికీ చాలా తేడా కనిపించింది. మొదటిసారి పర్యటనలో రష్యన్ ప్రజల ముఖాలమీద ఏదో గంభీరమైన మౌనముద్రను గుర్తించాను. విదేశీయులందర్నీ (మమ్మల్నిమాత్రం కాదు) అనుమానంతో చూస్తున్నారని పించింది. మరో ప్రపంచయుద్ధ ప్రమాదం ఆనాటి అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులను నీడలా వెన్నాడుతుండడమే ఇందుకు కారణమనుకుంటాను. 67లో మాత్రం అలాకాదు. ప్రమాదం తొలగిపోయిందనడానికి వీల్లేదుకాని, నిశ్చయంగా దూరమైపోయింది. ఈసారి ప్రజల

ముఖాలన్నీ కళకళలాడుతున్నాయి. సొంతమోటారు కారున్న కుటుంబాల సంఖ్య పెరిగింది. పనిగంటలు తగ్గి తీరుబాటు హెచ్చింది. ప్రజల జీవితాలలో భౌతికసుఖాలు పెద్దమార్పు తీసుకొచ్చాయి. అందుకే నేనన్నాను, రష్యన్లది కడుపునిండిన బేరం, చైనీయులది కడుపు మండిన బేరమని. 1967లో ప్రపంచపు అగ్రరాజ్యాలలో ఒకటిగా రష్యాస్థానం స్థిరపడింది.

మాస్కోనుంచి మా నెహ్రూ బహుమతి విజేతలను రీగా, టాలిన్ నగరాలకు తీసుకువెళ్ళడం జరిగింది. ఇవి రెండూ బాల్టిక్ సముద్రతీరాన్ని అంటిపెట్టుకున్నవి. వీటిని చూస్తూ ఉంటే నా జన్మస్థానమైన విశాఖపట్టణం జ్ఞాపకంవచ్చిందనీ, ఈ నగరంలో నేను నా బాల్యాన్ని పునర్జీవించానని ఒకచోట రాశాను ("సోవియట్ లాండ్" ఇంగ్లీషుపత్రిక అక్టోబరు 1967). మొదట టాలిన్, తర్వాత రీగా నగరంను చూశాననుకుంటాను. ఎందుచేతనంటే "రీగా నుంచి మాస్కోకు వచ్చినతర్వాత మాస్కో రేడియోలో తెలుగు ప్రసంగం చేశా"నని అదేవ్యాసంలో రాశాను. *(Returning to Moscow from Riga, I said few words 'in 'Telugu over the Moscow Radio.)*

రీగా, టాలిన్ నగరాలు రెండూ కవలపిల్లలని చెప్పవచ్చు. (కనీసం, పరిమితమైన నా అనుభవంలో). ఇప్పుడు విడివిడిగా వాటిని జ్ఞాపకం తెచ్చుకొని ఎక్కడ ఏది జరిగిందో చెప్ప లేకపోతున్నాను. రెండింటిలోనూ మత్స్యపరిశ్రమ అత్యద్భుతంగా అభివృద్ధి చెందింది. సముద్రంలో ఒక స్టీమరుమీద పదిమైళ్ళ దూరం ప్రయాణం చేశాము. రీగాలో అనుకుంటాను (టాలిన్‌లో అయినాకావచ్చు) మధ్యాహ్న భోజనం స్టీమరులోనే చేశాము. ఆధునిక యంత్రపరికరాలతో చేపలవేట ఎలా సాగిస్తారో తెలుసుకున్నాను. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలాగే మత్స్యపరిశ్రమ కూడా సహకార పద్ధతిలోనే జరుగుతుంది. దీనివల్ల వచ్చే ఆదాయం కోట్లసంఖ్యలో ఉంటుందని తెలుసుకున్నాను.

ఒక మత్స్యపారిశ్రామికుని ఇంటికివెళ్లాము రీగాలో (కాదు టాలిన్‌లోనేమో!) అతనో పిల్లజమీందారులా జీవిస్తున్నాడు. అతనూ, భార్యా, ఇద్దరుపిల్లలు ఆ ఇంట్లో ఉంటున్నారు. అతని వయస్సు పాతికేళ్ళకు లోపు. ఒక చిన్న లైబ్రరీ, రేడియోసెట్టూ మీది అంతస్తులో ఉన్నాయి. ఇంటిచుట్టూ వెల్లడిస్థలం ఉంది. ఈ స్థలంలో కూరగాయలయినా పండించవచ్చు. ఆ దగ్గరలోనే అదేరకం ఇంటిలో అతని తల్లిదండ్రులు జీవిస్తున్నారట. తండ్రి కూడా మత్స్య పారిశ్రామికుడే!

యువకుని ఇంట్లో ఒక పెద్దసైజు చిలక ఉంది. క్రితం సంవత్సరం ఒక ప్రతినిధివర్గంలో క్యూబాకు వెళ్ళినప్పుడు హవానాలో దీన్ని తనకిచ్చారని అతడు చెప్పాడు. క్యూబా విమోచనం జరిగిన కొత్తరోజులవి. పశ్చిమార్ధగోళంలో ఉన్న ఒకే ఒక కమ్యూనిస్టు దేశానికి వెళ్ళగలిగి నందుకతన్ని అభినందించాను.

టాలిన్‌లో (కాదు రీగాలోనా!) ఒక కొత్త నవల కొన్నిరోజుల్లో అమ్మకమైతే, ఒక కొత్త కావ్యగ్రంథం కొన్ని గంటలలో అమ్మకమయిపోతుందన్న వర్తమానం రచయితల క్లబ్బుద్వారా

తెలుసుకొని ఆనందకరమైన ఆశ్చర్యం పొందాను. *(in Tallinn- was it Riga?- I was pleasantly surprised with the information from the writers club that where as a new novel is sold out in a few days, a new book of poems is sold out in a matter of few hours*_ సోవియట్ లాండ్ వ్యాసం).

రీగాలో (టాలిన్‌లో కాదు) లాట్వియన్ కవయిత్రి మీర్‌డ్జా కెంపే (*Mirdza Kempe*)ను కలుసుకున్నాము. ఆమెగురించి *A great experience* (ఒక గొప్ప అనుభవం) అనే వ్యాసంలో ఇలా రాశాను స్వదేశానికి తిరిగి వచ్చిన తరువాత-

*She was like sunshine radiating brilliance all around. She spoke about India as though she had lived all her life here. And then she recited her poems on India in that ringing voice of hers which even now reverberates in my mind. Suddenly like a flash the revelation came to me. Here is my mother whom I lost when I was one and a half years old. The young poets of Latvia like to call her "Mamma Mirdza" I was told. Now I too have a "mamma" who is a poetess in Latvia though I am no longer young.*

(ఆమె సూర్యకాంతిలా ఉంది, చుట్టూ కాంతి వైజ్ఞ్యాన్ని ప్రసరిస్తూ. జీవితమంతా ఇక్కడే గడిపినట్లు ఇండియాగురించి మాట్లాడింది. ఆ పిమ్మట తాను భారతదేశంపై రాసిన గీతాలు పఠించింది. ఖంగున మ్రోగే కంఠధ్వనితో. ఆ ధ్వని ఇప్పటికీ నా మనస్సులో మారుమ్రోగు తుంది. హఠాత్తుగా ఒక మెరుపులాగ నాలో ఒక భావోదయం కలిగింది. ఈవిడే నాయేణ్ణర్థం వయస్సులో నేను కోల్పోయిన అమ్మ. లాట్వియాలోని యువ కవులందరికీ ఈమెను "మమ్మా మీర్‌డ్జా" అని పిలవడం ఇష్టమని విన్నాను. ఇప్పుడు నాకూ ఒక అమ్మవుంది. లాట్వియా దేశపు కవయిత్రి. అయితే నేనుమాత్రం ఇంకా యువకుణ్నికాను.

మా పర్యటన సమాప్తి కాబోతోంది. రీగా నుంచి మాస్కోకు వచ్చినతర్వాత నోవోస్తి వార్తా సంస్థవారు మాకొక గొప్ప వీడ్కోలు విందిచ్చారు. అప్పుడు నేనందుకున్న బహుమతి అన్నిటి కన్నా అమూల్యమైనది.

*On the last day of our stay in Moscow, the Novosthi press Agency gave a banquet in our honour. It was an especially happy occassion for me personally because I heard from some one nearby, whom I could not see, say this about me- "Here is that rare but genuine man, an authentic poet!" During the banquet many toasts were proposed*

*and many fine words exchanged. Perhaps the remark about me is only a kindhearted joke. All the same, I cherish this anonymous utterance as the richest prize I won in the Soviet Union.*

ప్రజాతంత్ర *6–6–1976*

## పది

"మాస్కోలో మేమున్న ఆఖరిరోజున నోవోస్తి వార్తాసంస్థ మా గౌరవార్థం ఒక విందు ఇచ్చింది. వ్యక్తిగతంగా అది నాకు అత్యంత ఆనందకరమైన సందర్భం. ఎందుచేతనంటే నా సమీపంలోనే ఉన్నవ్యక్తి- ఎవరో ఆయన్ని చూడలేకపోయాను- నాగురించి ఇలా అనడం విన్నాను. "చాలా అరుదైన, కాని నికార్సయిన మనిషి; అనగా యథార్థంగా ఒక కవి!" అని: విందులో చాలాసార్లు టోస్టులు (ఆరోగ్యం కోసం తాగుతూ ఉపన్యసించడాలు) జరిగాయి. చాలా చక్కని మాటలు చెప్పడం, వినడం జరిగాయి. బహుశా నాగురించి చెప్పినమాటలు సహృదయంతో తమాషాగా అన్నవే కావచ్చును, అయినా సోవియెట్ యూనియన్‌లో నేను గెలిచిన బహుమతులన్నిటికన్నా మిన్నగా దీనినే ఎన్నికచేస్తాను.)

ఈసారి కూడా మా అందరికీ తలో కెమేరా బహూకరించడం జరిగింది. నా కెమేరాను మా ఆవిడ సరోజ ఎవరికో దానం చేసేసింది. ఇప్పటికీ ఎరువిచ్చాననే అంటుంది. మొదటి కెమేరా దుండగులు పాడుచేసినందుకు చాలా విచారించాను. కాని ఈ రెండో కెమేరా ఎప్పుడూ ఏదో ఇబ్బంది పెడుతూండటంవల్ల పోతేపోయిందిలే అనుకున్నాను. కాని సరోజ మాత్రం తెచ్చేతీరుతానంటూ ఉంటుంది. తెచ్చినా ఏం ప్రయోజనం? అది పాడయి పోయిందట. దాన్ని బాగు చేయించాలంటే మనదేశంలో పరికరాలు పనికిరావు.

మా సోవియెట్ పర్యటన పూర్తికావచ్చింది. మాస్కోనుంచి టాష్కెంట్ వెళ్ళాము. మా బృందంలో గాడ్గిల్ అని ఒకాయన ఉన్నాడు. ఆయనకి ఏ పద్దుకింద సోవియెట్‌లాండ్ బహుమతివచ్చిందో మరిచిపోయానుగాని గాంధేయ ఆర్థిక శాస్త్రవేత్త అని మాత్రం నాకు తెలుసును. ఆ రోజుల్లో అమెరికన్ "టైమ్" పత్రిక సోవియెట్ ఆర్థిక వ్యవస్థలో పగుళ్ళు పొడచూపుతున్నాయని ఒక పెద్దవ్యాసం వ్రాసింది. దాన్ని ఆధారం చేసుకుని గాడ్గిల్ చాలాసార్లు రష్యన్ వ్యవస్థను విమర్శించాడు. రష్యన్ మిత్రుల వద్ద కాదు, మాలోమేము మాట్లాడుకొనే టప్పుడు. కిషన్‌చందర్, నేనూ రష్యన్ విధానాన్ని సమర్థించేవాళ్ళం. పెట్టుబడిదారీ దేశాల పత్రికల రాతలమీద మన ఆలోచనలు ఆధారపడకూడదనే మాయిద్దరి వాదం. చైనాలో సాంస్కృతిక విప్లవం విఫలమయిపోయిందని ఇప్పటికీ ఆ పత్రికలు రాస్తూనే ఉన్నాయి. రష్యాలో పంచవర్ష ప్రణాళికలు ఆశించిన ఫలితాలను ఇవ్వడంలేదని రాయడం వాటికోసరదా! అయినా యాభై సంవత్సరాల వ్యవధిలో సోవియెట్ యూనియన్ ప్రపంచంలోని అగ్రరాజ్యాలలో ఒకటి కావడమే ఈ ప్రణాళికలు సఫలమైనాయనడానికి గొప్ప నిదర్శనం అని చెప్పకతప్పదు.

మొదటిసారి తాష్కెంట్‌ను చూచినప్పుడు దానికీ పాత ఢిల్లీకి ఏమీ భేదం కనబడలేదు. ఇప్పుడా నగర స్వరూపమే మారిపోయింది. విశాలమైన వీధుల్లో మైళ్ళకొద్దీ ప్రయాణం చేశాము. అంతటా గృహనిర్మాణం విరివిగా సాగిపోతోంది. ఆ క్రితం సంవత్సరం టాష్కెంట్‌లో వచ్చిన భూకంపం నగరానికి మేలే చేసిందని ఇదివరకే రాశాను. నగరం పాతరూపం పూర్తిగా మారిపోయింది. ఒక ప్లాను ప్రకారం పునర్నిర్మితం కావడంవల్ల తాష్కెంట్ ఈనాడు ప్రపంచ మహానగరాలలో ఒకటిగా పరిగణించబడుతోంది.

ప్రాచీన భారతీయ పరివ్రాజకుడుగా కనిపించే తమిళకవి శుద్ధానందభారతి తాష్కెంట్‌లో చిన్నపిల్లలను బాగా ఆకర్షించాడు. తెల్లవారేసరికి మా హోటేల్‌ముందు బోలెడుమంది బాలబాలికలు పోగయేవారు. వాళ్ళందరితోనూ ఆయన డాన్సు చేసేవాడు. ఫ్రెంచిలోనూ ఇంగ్లీషులోనూ బాలగీతాలు పాడేవాడు. అర్థమయినా కాకపోయినా పిల్లలందరూ చప్పట్లు చరుస్తూ కేరింతలు కొట్టేవారు. దగ్గరలోనే ఒక సూపర్ మార్కెట్ ఉంది. అక్కడికి వాళ్ళందర్నీ తీసుకువెళ్ళి చాకలెట్లు కొనిపెట్టేవాడు. ఆ మార్కెట్‌లోనే ఒక రిస్టువాచీ కొన్నాను. ఏమంత ఖరీదైనదికాదు. అది ఇప్పటికీ నా దగ్గర ఉంది. కాని ఎప్పుడో పనిచెయ్యడం మానేసింది. మొదటిసారి మరమ్మత్తుకు ఇచ్చినప్పుడే దానిలోని కొన్నిభాగాలు తస్కరించబడ్డాయని నా అనుమానం. ఈ వాచీవల్ల ఇప్పుడు నాకు ఒకే ఒక్క ఉపయోగం ఉంది. ఎప్పుడైనా అర్జంటుగా పాతికా పరకా అవసరమయినప్పుడు దీన్ని మార్వాడీ దగ్గర తాకట్టుపెడుతూ ఉంటాను. నెలా రెండునెలల్లో విడిపిస్తూ ఉంటాను. అందువల్లనే అది తిరగదని తెలిసి కూడా మార్వాడీ నాకు అప్పివ్వడం!

తాష్కెంట్‌కు మాతో బోరోనిక్ రాలేదు. ఒక యువకుణ్నిచ్చి పంపించాడు. ఇతను పోస్టుగ్రాడ్యుయేటు విద్యపూర్తిచేసాడు. ప్రత్యేకంగ ఫ్రెంచిభాషను అధ్యయనం చేశాడు. అయినా మాతో ధారాళంగా ఇంగ్లీషు మాట్లాడేవాడు. "హిందీ మాట్లాడుతావా?" అని నేనడిగాను. ఫ్రెంచిలో 'పార్లేవూ ఇందీ?' అని. నియెట్ అని జవాబిచ్చాడు. రష్యన్ భాషలో "నియెట్" అంటే కాదనీ, "దా" అంటే అవుననీ అర్థం. నాకు వచ్చిన ఈ రెండు మాటల్ని తరుచు ఉపయోగించేవాణ్ని. "మరోసారి రష్యాకు రావడం సంభవిస్తే మీ భాషలోనే మాట్లాడుతా"నన్నాను. వెంటనే అతను రష్యన్‌భాషను నేర్చుకునే రెండు మూడు పుస్తకాలు నాకు బహూకరించాడు. వాటిని శ్రద్ధగా అధ్యయనం చేస్తే ఆరునెలల్లో పుగా, ఎవరి సహాయమూ లేకుండానే రష్యన్ భాష వచ్చేస్తుంది. స్వదేశానికి వచ్చినతర్వాత ఒక వెల్లాళ్లపాటు రష్యన్ నేర్చుకోవడానికి దీక్షగా ప్రయత్నించాను. ఆ తర్వాత అది కూడా నా ఫ్రెంచి చదువులాగే మూలపడిపోయింది.

ఎందువల్లనో ఇప్పుడు జ్ఞాపకం లేదుగాని మా తిరుగు ప్రయాణం తాష్కెంట్ నుంచి ఢిల్లీకి సరాసరిగా జరుగలేదు. కాబూలు మీదుగా వెళ్ళవలసి వచ్చింది. ఆఫ్ఘనిస్తాన్ ముఖ్యపట్టణాన్ని కూడా చూడవచ్చునుకదా అని నేను చాలా సంతోషించాను. మా రష్యన్ కామ్రేడ్

ఒక పూటంతా శ్రమపడి మాస్కోలో అధికారులతోనూ, కాబూల్‌లోని సోవియెట్ రాయబారితోనూ టెలెక్స్‌ద్వారా సంప్రతించి మా అందరికీ వీసాలు సంపాదించాడు. మాతో బాటు తానూ కాబూల్‌కు వచ్చాడు.

కాబూల్‌ను చూస్తే, సంతోషానికి బదులు జాలి కలిగింది. ఆఫ్ఘనిస్తాన్ చాలా బీద దేశమూ, వెనుకబడిన దేశమూను. కాని పఠానుల ముఖాలలో మాత్రం ఆ బీదతనపు ప్రభావం ఎక్కడా కనిపించదు. బ్రిటిష్ వారిని ప్రతిఘటించి తమ స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకోగలిగినట్టిది పఠాన్ జాతి.

రాజధాని నగరమైన కాబూల్‌లో సహోకారుల సంఖ్య చాలాస్వల్పమే. అయినా మాకు అతిథి మర్యాదలు బాగానే జరిగాయి. మేము బసచేసిన హోటల్‌లోని గదులు పంసారపక్షంగా ఉన్నా సదుపాయంగానే ఉన్నాయి. అక్కడ ఒక పనివాడిని నేను హిందీలో పలకరించాను. "ఆప్ పాకిస్తానీ హై" అని అడిగాడు. "కాదు భారతీయుణ్ణన్నాను". ఎందుకో అతను కొంచెం ఆశాభంగం చెందినట్లనిపించింది.

నగరవీధుల్లో చైనీస్ సైనికులు ఇద్దరేసి చొప్పున తిరుగుతున్నారు. మా హోటల్‌లో చాలా మంది పాకిస్తానీయులున్నారు. ఇందుకు మిగతావాళ్ళం ఏమీ పట్టించుకోలేదుగాని మా గాడ్డిల్ గారికి మాత్రం చాలా భయం వేసింది. గదిలో ఉన్నప్పుడు గడియవేసుకొమ్మనీ, బయటికి వచ్చినప్పుడు తలుపు తాళం వేసుకొమ్మనీ సలహా ఇచ్చాడు. "ఎందుకు? దొంగలభయమా?" అని అడిగాను. "అదికాదు, ఇక్కడ చాలామంది పాకిస్తానీయులున్నారు. వాళ్ళు చాలా దుర్మార్గులు! పైగా మనకి శత్రువులు! ఏదైనా వస్తువు మనగదిలో పడవేసి మనమీద నేరం ఆరోపిస్తారు. అనవసరంగా లేనిపోని లిటిగేషన్‌లో పడిపోతాం కాబట్టి జాగ్రత్త" అన్నాడు. నేనుమాత్రం అతని సలహా పాటించలేదు. తలుపు తెరిచి ఉంచే వీధిలోనికి పోయేవాణ్ణి. ఉన్నది ఒక్కరోజే అయినా ఆ రాత్రి పడుకున్నప్పుడు కూడా లోపల గడియపెట్టలేదు. మర్నాడు ఏ ఉపద్రవమూ జరుగలేదు. సరాసరి కాబూల్ విమానాశ్రయం చేరుకున్నాము.

అందరం విమానం ఎక్కేదాకా మా రష్యన్ మిత్రుడు మాతోనే ఉన్నాడు. తాష్కెంట్‌లోనూ, కాబూల్‌లోనూ అతను మాతోనే కలిసి తిరిగేవాడు, మాతోనే భోజనం చేసేవాడు. పాకిస్తానీయులవల్ల మాకు హాని కలుగుతుందని అతనుకూడా అనుమానించాడో యేమో నాకు తెలియదు గాని కాబూల్‌లో మమ్మల్ని కంటికి రెప్పగా కాపాడేడు. వీడ్కోలు చెప్పినప్పుడతనితో నేను "మా కోసం చాలా శ్రమపడ్డావు. ఇందుకెలాగ కృతజ్ఞత చెప్పాలో నాకు తెలియడంలేదు" అన్నాను. *"Don't mention it! It is a great pleasure* (అలా అనొద్దు. నాకది చాలా సంతోషం!)" అన్నాడతను.

స్వదేశానికి మరలిపోతున్నాం. పర్వతాకీర్ణమయిన ఆఫ్ఘనిస్తాన్‌ను దాటిపోతున్నాం. కాబూల్ ఎయిర్‌లైన్స్ విమానంలో VAT 69 చాలా చవక. అయితే నాదగ్గర ఒకటి రెండు రూపాయలకంటె ఎక్కువలేవు. "ఇక్కడ విస్కీ చవగ్గా ఇస్తున్నారు. నాకో ఇరవయి

రూపాయలివ్వండి ఢిల్లీలో తిరిగి ఇచ్చేస్తా'' నని గాడ్గిల్‌గారి నడిగాను. విస్కీ కొనడానికైతే నాదగ్గర డబ్బులేదు. మద్యంతప్ప మరేది కొనడానికైనా నువ్వడిగిన ఇరవయి రూపాయలు ఇస్తాను. అవి మళ్ళీ నాకు రిటర్న్ చెయ్యనక్కరలేదన్నాడాయన. విస్కీ కొనడం కోసం గాంధేయుణ్ని బతిమాలడం పొరపాటే అని తెలుసుకున్నాను. పాలం విమానాశ్రయంలో 25 మే 1967న దిగడంతో నా విదేశపర్యటన ముగిసింది.

*ప్రజాతంత్ర 13–6–1976*

''కమ్యూనిజానికి మాజీ కమ్యూనిస్టులే మొదటి శత్రువులు''

*శ్రీశ్రీ, 18.5.1975 ప్రజాతంత్ర వారపత్రిక*

# మృత్యువుతో నా మూడో యుద్ధం

మొదటిసారి విదేశయాత్ర ముగించుకొని స్వర్గాదపిగరీయసి అయిన జన్మభూమి మీద కాలుపెట్టేనో లేదో అన్ని దిక్కుల నుంచి ఆంధ్రదేశం నా మీద దండయాత్ర సాగించింది. అవి 1955వ సంవత్సరపు ఎలక్షన్ రోజులు. నేను కమ్యూనిస్టు పార్టీ తరఫున ప్రచారానికి బయలుదేరాను. ప్రజాస్వామ్యం పేరుతో ధనస్వామ్యానికి ఊడిగం చేసే పెట్టుబడిదారీ పత్రికలన్నీ తమ విద్వేషాగ్నిని నా మీద కేంద్రీకరించాయి. ఒక్క 'విశాలాంధ్ర' పత్రిక మాత్రమే నన్ను తొలి నుంచీ సమర్థిస్తూ వచ్చింది. ఈ కాగితాల యుద్ధంలో, కురుక్షేత్రాన అభిమన్యుడిలాగా పోరాడిన నార్ల చిరంజీవిని[1] నేను మరిచిపోలేను. హేతువాదానికి, మూఢవిశ్వాసానికి జరిగిన సంకుల సమరంగా పరిగణిస్తాను ఆ నాటి ఎన్నికల సంరంభాన్ని! ''నేను కుక్క చావు చస్తా'' నని ఒక అమ్మాయి రాసిన ఉత్తరం కూడా ఈ సందర్భంలో ప్రచురణ గౌరవం పొందింది. తర్వాత ఆమెనెవరో అడిగారట, అలా ఎందుకు రాశావని! శ్రీశ్రీని తిడితే పత్రికలో తన పేరు పడుతుందని - అంతేగాని నేనెవరో ఆమెకు ముక్కూ మొగమూ తెలియదట.

ఆ రోజుల్లో ఆంధ్రపత్రికకు నేను రాసిన ఉత్తరాలూ, విశాలాంధ్రలో వ్రాసిన 'ప్రజ' అనే ప్రశ్నలూ, జవాబులూ శ్రీశ్రీ సాహిత్యం మూడు (వచన విభాగం)లో అచ్చయి ఉన్నాయి. 1955 జనవరి 7వ తేదీ ఆంధ్రపత్రికలో అమార్క్సిస్టు పండితులకు ఆరాధ్యులవారైన ఒక నాగస్వరంగారు 'ఒక రచయిత' అనే బురఖా తగిలించుకొని నా మీద ఇలా రాశారు.

''శ్రీరంగం శ్రీనివాసరావుగారు స్టాలిన్ స్థాపించిపోయిన సోవియట్ సామ్రాజ్య రక్షణభారం (దీన్నే ఏకాన్వయ దోషం అంటారు వ్యాకరణజ్ఞులు) ఇటీవలనే వెడల్పయిన వారి భుజస్కంధాలపై పడిందని భావిస్తున్నారు...ఇటీవల శాంతిపావురాలను ఎగురవేసు కుంటూ మాస్కో వెళ్ళారు. మాస్కోనదిలో మునిగి (అబద్ధం!) సోవియెట్ నాయకుల సమాధుల వద్ద అనుష్ఠానాలు తీర్చుకుని (పచ్చి అబద్ధం!) మాస్కో విశ్వవిద్యాలయం చూచి మూర్ఛిల్లి (మరీ పచ్చి అబద్ధం) వారికి తెలియకుండానే ఆ భూతల స్వర్గంలో నుంచి ఈ

[1] నార్ల చిరంజీవి (1925–71). కమ్యూనిస్టు ఉద్యమంతో సన్నిహిత సంబంధాలుండేవి. అభ్యుదయ రచయిత. విశాలాంధ్ర దినపత్రికలో 'చిన్నారిలోకం' శీర్షిక నిర్వహించారు. వీరు రాసిన 'తెలుగుపూలు', 'పేనా—పెసరచేనూ' బాలసాహిత్యంలో చెప్పుకోదగినవి. 'భాగ్యనగరం' అనే వీరి గేయనాటిక బాగా పేరుపొందింది.

'యమలోకం'లో పడ్డారు. (ఇది మాత్రం నిజం!). కళ్ళు తెరిచే సరికి ఆ మరో ప్రపంచం కనిపించలేదు. ఆ గంటలు విన్పించలేదు. అంతా అయోమయంగా ఉంది. పాపం!...''(ఇదంతా విషం).

ఈ గాలిదుమారాల మధ్య, ఎన్నికల ప్రచారం ఉధృతంగా సాగుతున్నప్పుడు నాకు మతిభ్రమించి పోయింది.

విజయవాడ నుంచి ఎవరు, ఎలాగ నన్ను మద్రాసు చేర్పించారో తెలియదు. కాని 'మద్రాసు చేరుకున్నాను' అని నా 1955 డైరీలో రాశాను. ( ఆ డైరీ ఇప్పుడెక్కడా కనబడదు) మద్రాసులో ఆరుద్ర నన్నొక మెంటల్ క్లినిక్‌లో ప్రవేశపెట్టాడట.

చిన్నప్పుడే ఒకసారి నేను చనిపోవలసింది. చుట్టచురకలతో బతికాను . ఇరవయ్యోయేట టైఫాయిడ్ జ్వరంతో హోరాహోరీ పోరాడాను. అది నా రెండో యుద్ధం. 'ఇక బతకడు కిందికి దించండి' అని అథశ్శయనం చేయించడం కూడా నాకు జ్ఞాపకం ఉంది. మూడుసార్లు (ప్రతిఇరవై ఒకటో రోజున) జ్వరం తిరగబెట్టింది. 63వ రోజున టెంపరేచర్ నార్మల్‌కు వచ్చింది.

మూడవసారి విజయవాడలో పోయిన స్మారకం అయిదారు వారాల దాకా తిరిగి రాలేదు. ఆ మధ్య కాలంలో ఏమయిందో నాకు స్పృహ లేదు. విజయవాడలో, కమ్యూనిస్టు పార్టీ ఆఫీసులో ఈజీచైర్‌లో విశ్రమించాను. నాకు ఎదురుగా గోడమీద లెనిన్ చిత్రం. వెనుక గోడ మీద స్టాలిన్ చిత్రపటం ఉన్నాయి. వాటిని చూస్తుండటం వరకే నాకు జ్ఞాపకం. తర్వాత కొన్నాళ్ళకు మద్రాసులోని డాక్టర్ ధైర్యం క్లినిక్‌లో నా గది తలుపు తాళం తీస్తూ ఒక వార్డు బోయి''నేనెవరినో తెలుసా! పోలీసువాడిని'' అనడంతో మళ్ళీ నా మనసు తేరుకుంది. ఆ తర్వాత కూడా మరో పదిహేను రోజులు అక్కడే విశ్రాంతి తీసుకున్నాను. ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ చిత్తుగా ఓడిపోయిందని పత్రికల ద్వారా అక్కడే తెలిసింది.

హనుమాన్ జంక్షన్‌లో నా చిత్తచాంచల్యపు మొదటి సూచనలు కనిపించాయని కె.వి.రమణారెడ్డి రాశాడు. అది కొంతవరకే నిజం. మొదటిరోజు గూడూరు ఎలెక్షన్ సభలోనే ఒక సంఘటన నా మనస్సును ప్రగాఢంగా చీకాకు పరిచింది.

గూడూరు రైల్వే స్టేషన్ ఎదుట మైదానంలో ఎన్నికల సభ ఇక ప్రారంభమవుతుందనగా వెనకవైపు నుంచి రాళ్ళు రువ్వడం మొదలయింది. సభా వేదిక నుంచి పుచ్చలపల్లి సుందరయ్య గారు పోలీసులకు తీవ్రంగా హెచ్చరిక చేశారు ''శాసనసభలో ప్రతిపక్ష నాయకుడినైన నేను పోలీసులు వెంటనే కలుగచేసుకోవలసిందని అడుగుతున్నాను. అది వారికి చేతకాకపోయినా యిష్టం లేకపోయినా, పరిస్థితులను మా పార్టీ వాలంటీర్లే అదుపులో పెట్టవలసి వస్తుంది'' అని ! అంతటితో రాళ్ళుపడడం ఆగిపోయింది. సభ సాఫీగా సాగిపోయింది.''పాతిక సంవత్సరాల నుంచి ఎప్పుడూ సీరియస్‌గా ఉండే సుందరయ్యగారి ముఖంలో ఎన్నికల ఫలితాల సూర్యోదయంతో చిరునవ్వులు వికసిస్తాయ''ని ఆయన చేత నవ్వించాను.

సభ పూర్తికావడానికి ముందు, వేదిక వెనుక తట్టును కాపాడుతున్న వాలంటీర్లలో ఒకని తలను పగలగొట్టడం జరిగింది. రక్తం కారుతున్న ఆ యువకుని తలను కట్టుకట్టడం చూశాను. గాంధీగారి అహింసా భావాలకు అలవాటుపడిన నా మనస్సు ఈ కఠోర దృశ్యాన్ని సహించలేక పోయింది. ఆ నిముషంనుండే ప్రారంభమయింది నాలోని చిత్తచాంచల్యం. ఇది హనుమాన్ జంక్షన్ వద్ద పరాకాష్ఠ అందుకుంది. కనీసం లక్షమంది ప్రేక్షకుల ముందు ఉపన్యసించాను. అప్పట్లో నాకున్న ఉపన్యాసధోరణి అంతంత మాత్రమే.

ఎలెక్షన్ ఫలితాలను తారుమారు చెయ్యడం కోసమే పనికట్టుకొని విజయవాడకు వేంచేసిన యస్.కే పాటిల్ మీద నా అక్కసంతా వెలిబుచ్చాను. ఏనుగుల మీద గాడిదల మీద (ఇవి అమెరికాలోని ప్రధాన రాజకీయపార్టీల ఎన్నికల గుర్తులు) తీవ్రంగా విరుచుకు పడ్డాను.ఒక్కొక్క ఉపన్యాసకుడు మాట్లాడుతుంటే, అతణ్ణి తప్పకోమని మైకు ముందుకు వెళ్ళి ఏదో మాట్లాడి మళ్ళీ నా స్థలానికి వెళ్ళిపోయేవాణ్ణి.

మిత్రుడు వల్లం నరసింహారావు నన్ను అహోరాత్రులు కనిపెట్టుకు తిరిగాడు. తణుకు సభలో నేను ఉపన్యసించే ఓపిక లేనివాడినయ్యాను. అక్కడ నుండి నరసింహారావే నన్ను విజయవాడకు చేర్చాడు. ఒక రాత్రి బయలుదేరుతున్న ట్రక్కుమీద నన్ను అనిసెట్టి సుబ్బారావు[2] మద్రాసుకు చేర్చాడట.

విజయవాడలో నా మీద చేతబడి ప్రయోగాలు జరిగినట్లు పుకార్లు బయలుదేరాయి. నేనొక రకం యోగనిద్రలో మునిగిపోయాను. "శ్రీ శ్రీ అనే బీజాక్షరాలు చాలా శక్తివంతమైన వయ్యా! మన మాయలూ, మంత్రాలూ అతని మీద పని చెయ్యవు" అంటూ మంత్రవాదులు నిరుత్సాహం చెందారట. మూడోసారి మృత్యువుతో జరిపిన యుద్ధం అపస్మారకదశలో సాగింది. ఇందులో వాదేగెలుపు అనడానికి ఇంకా నేను బతికి ఉండడమే సాక్ష్యం.

డాక్టర్ మల్లిక్ గారు నన్ను రెండోసారి చావు నోటి నుంచి తప్పిస్తే మూడోమారు నన్ను రక్షించింది డాక్టర్ ధైర్యం, నా నలభై అయిదోఏట మద్రాసులో.

*ప్రజాతంత్ర 20–6–1976*

[2] అనిసెట్టి సుబ్బారావు (1922–79) గారు అభ్యుదయకవి. 'అగ్నివీణ', 'బిచ్చగాళ్ళ పదాలు' వీరి కావ్యాలు. 'గాలిమేడలు', 'మా ఊరు' నాటకాలు కూడా రాశారు.

# మత్తుమాటలు
# *Les Mots Ivres*

ఒకటి

మాటలు, తాగిన మాటలు, మదిరాపానంతోమత్తెక్కిన మాటలు!మేడమీద నేనున్నప్పుడు మెట్లమీంచి బూట్ల చప్పుడుచేసుకుంటూ వస్తాయి. నేలమీద నడుస్తున్నప్పుడు కిటికీలలోంచి తొంగిచూస్తాయి. మెలకువలో వెలుతురుగొంతుకలతో మాట్లాడేమాటలు నిద్రలో నిశ్శబ్దపు తీగెలు అల్లుతాయి. అరె, ఇప్పుడో డిక్టాఫోన్ ఉంటే ఎంత బాగుండును! కనీసం మా ఆవిడ టేప్‌రికార్డరుకూడా లేదు. మార్వాడీ దగ్గర తాకట్టులో ఉంది. మధ్యతరగతివాళ్ళ బతుకులే అంత!

మాటలు! రతికార్యంలో అతివ అనే మాటలు. నువ్వు తాగి అది తాగనప్పుడు,అది తాగి నువ్వు తాగనప్పుడు, ఇద్దరూ తాగివున్నప్పుడు, ఎవ్వరూ తాగనప్పుడు , భావప్రాప్తిసమయం లో, అంతకు ముందు, ఆ తర్వాత! అప్పుడు నువ్వు గెలుస్తున్నప్పుడు, ఓడిపోయినప్పుడు!

మాటలు! మొదటి మానవుడి మాటలు! అమ్మా అనే అన్నాడో ఆకలే అనే అన్నాడో!

తెలుగువాడి జాతీయగుణం ఓర్వలేనితనం. తెలుగువాడి జాతీయకార్యక్రమం కోడిగుడ్డు మీద వెంట్రుకలు లెక్కపెట్టడం. కానీ తెలుగుదేశంలో ఒక గొప్పతనం కూడా వుంది. అదేమిటంటే, తెలుగుదేశంలో అందరూ కవులే.

అనంతం, ఇలాగతప్ప ఇంకోవిధంగా రాయడానికి వీల్లేదు. ఆత్మచరిత్రాత్మక నవల ఇది. అన్ని నవలలూ ఆయా రచయితల ఆత్మకథలే అన్నాడొక రచయిత. నిజం చెప్పాలంటే నాకు నిజంచెప్పాలనే ఉంది. కాని దానికెన్నో అభ్యంతరాలు. పొగిడినంతసేపు అందరూ బాగుందం టారు. తెగడినప్పుడు తిడతారు. అందుకే "ఈ నవలలో పాత్రలన్నీ కల్పితాలే; ఏ వ్యక్తినీ ఉద్దేశించి రాసినవికావు" అని ముందుగానే ఒక నమస్కారబాణం పారెయ్యాలి. ఆ మధ్య విశ్వ నాథ సత్యనారాయణగారిని విదూషకుడన్నందుకు నామీద ఆయనకు బోలెడంత కోపం వచ్చింది. ఈ దిగువ నేనురాసింది పోస్టుచేసి ఉంటే ఆయనెంతో పొంగిపోతారని నాకుతెలుసు! అయినా పోస్టుచేయలేదు.

ఉడుగర

మాటలాడె వెన్నెముక
పాటపాడె సుషుమ్న
నిన్నటి నన్నయభట్టు
ఈనాటి కవిసమ్రాట్టు

గోదావరి పలుకరింత
కృష్ణానది పులకరింత
కొండవీటి పొగమబ్బు
తెలుగువాళ్ళ గోల్డు నిబ్బు
అకారాది క్షకారాంతం
ఆసేతు మిహికావంతం
అతగాడు తెలుగువాడి ఆస్తి
అనవరతం తెలుగునాటి ప్రకాస్తి
ఛందస్సులేని ఈ ద్విపద
సత్యానికి నా ఉపద.

ఇదివరలో 'అనంతం' ప్రారంభించినప్పుడు వ్రాసినవన్నీ ఇందులో కలపడంవల్ల ఇదంతా ఎప్పుడో చదివిందే అని పాఠకులు బాధపడుతున్నారని నాకుతెలుసు! కాని మరోమారు బాధించక తప్పదు. అయితే ఇది ఆఖరుమారని హామీయిస్తాను. ఇప్పుడుమాత్రం 'అనంతం' లో చేరవల్సినవీ ఇదివరకు అచ్చయినవీ ఇక్కడ చేర్చాలి. అవి ఇవి!

*ప్రజాతంత్ర 27–7–1975*

## రెండు

ఈ ప్రపంచంలో జరుగుతూన్న సంఘటనలన్నిటికీ సందర్భశుద్ధి అఘోరించిందా? అలాగే ఇదీన్నీ- తెర ఎత్తగానే నాలుగు ఖాళీకుర్చీలముందు రెండుమేజాబల్లలు ఈడిగిలబడి ఉంటాయి. ఈ అర్థంలేని నాటకంలో ప్రాణంలేని వస్తువులే పాత్రలు. పాత్ర అంటే జ్ఞాపకం వచ్చింది. అవని అంతా జాగ్రఫీ పుస్తకంలోంచి బయటికి వచ్చి మేజాలపక్క వల్లబల్లమీదికి ప్రాకుతుంది. అంతకుముందే అక్కడవున్న గణితశాస్త్రం బ్రాకెట్లలో దాగుని శూన్యంలో హరించిపోతుంది. సమస్యలు పరిష్కారం కాకముందే మరికొన్ని సమస్యలు బయలుదేరుతాయి. వాటికి అర్థంచెప్పాలనే ప్రయత్నం సమూహావేశంలో మైమరచిపోతుంది.

అంతట నవరుచులనూ మోసుకుంటూవచ్చి ఇంద్రధనుస్సు కిటికీ మీద అధ్యక్షత వహిస్తుంది. కరతాళధ్వనులు సొమ్మసిల్లుతాయి, వ్యాకరణంలో కరణం రణం చేస్తున్నట్లు అవి రణగొణధ్వనులు కావు. అవి అల్పాహార విందులుకావు. అవి సూర్యనమస్కారాలు కావు. అయితే మరేవి? సులభమైనదాన్ని కష్టం చేయడం నాయకత్వమా? ఉపాధ్యాయకత్వమా?

ఒక చెట్టు మిగిలిన చెట్లలాంటిదే. కాని కాదు. ఏ ఒకచెట్టు ఇంకొకచెట్టులా వుంటుంది? పైగా ఇది తెరమీద చిత్రించిన చెట్టు . ఏ మాత్రం ప్రాణం ఉన్నా మనకు అవసరంలేదని మొదటే అనుకున్నాం కదూ? ఏం నాటకం? శుభాంతమా? విషాదాంతమా? అనంతం.

ఎంతయినా వాదించవచ్చు. చెట్టు చెట్టుకాదనవచ్చు. చెట్టు చెట్టుగానే వుండి చెట్టు

కాకపోవచ్చు. చెట్టులోవున్న చెట్టుకానిదేదో చెట్టుగామారి కొన్నాళ్ళలో, కొన్నేళ్ళలో, కొన్ని యుగాల్లో చెట్టుకానిదయిందనవచ్చు. ఫలం దక్కకపోవడమే వ్రతం చెడకపోవడం. అరవడం. అరవంలో 'చెడి' అంటే చెట్టు ఒక మెట్టులాంటిదే ఇంకో మెట్టు. కొన్నిమెట్లు ఒక నిచ్చెన, నిచ్చెన ఉన్నతికి దారిచూపిస్తుంది. శ్మశానానికి కూడా. తర్కాన్ని నమ్మకు. అలవాట్లను కూడా. వాట్లనే జయించాలి. మధ్యని కొన్ని మెట్లు వదిలితే కొందరు తడబడిపోతారు. అన్ని మెట్లు ఉండాలంటారు. వాళ్ళనే గొంగళీపురుగులంటాం. ఎంత మందగమనం.

మనం మనోవేగాన్ని కూడా అధిగమనం చేశాం. కృత్రిమంగా నిలబెట్టిన అభ్యంతరాలను తన్నుకుంటూ పోతున్నాం.

అలవాట్లే అభ్యంతరాలు. పరిచితమైనదంటే పదిలమైనదన్నమాట. కొత్తదంటే అనుమానం. సమర్థుల సిఫారసు కావాలి. అయితే సామర్థ్యం కూడా అమ్ముడుపోతుంది. అందుకే ఈ హెచ్చరిక- "ఏయ్, ఆ ప్రకటనల్ని నమ్మకు. అవన్నీ అబద్ధం." ఈ మోతాదు గుణం ఇస్తుందా? ఈ ఫిలిం బాగుంటుందా? ఈ బ్యాంకు దృఢమైనదేనా? ఈ వార్త నిజమేనా?

ధనం ధరించే రూపాలు అనంతం. తెరపై ఈనీడలు వచ్చి నటిస్తాయి. అదిగో మళ్లీ అపార్థం. వాటిక్రమం చప్పున బోధపడదు. వేశ్య, మాత, వ్యాఘ్రం (రక్తంపీల్చే అలవాటు), మేఘం (రక్తం కక్కడం), టోపీ (వేసే శక్తి), త్యాగం (అదీ ఒక ధనమే) ముక్కాలి పీట (ఇదో అవతారం) ఎన్నో ఆకారాలు.

ఒక్కొక్కప్పుడు రివాల్వరు, హత్య, పత్తేదారు; మరోకథ భార్య, భర్త, ఉపభర్త (ముక్కోణం). ఇంకొక కథ పౌరాణిక ధోరణిని పోతుంది. దాని ప్లాటు శాఖోపశాఖలుగా ఉంటుంది.

ఆకస్మికంగా కథ అరమైలుసాగి ఆగిపోతుంది. అప్పుడు విష్ణుమూర్తి ప్రత్యక్షం కాకతప్పదు. డాక్టరు వస్తాడు. పోలీసులు వస్తారు. వస్తాదు వస్తాడు. కవిని రానియ్యరు. టిక్కెట్లు పెడతారు. కొందరు దొంగటిక్కెట్లు సృష్టిస్తారు. గోడలు కడతారు. కొందరవి దాటుకొస్తారు. గందరగోళం అవుతుంది. సంగీతానికదే సమయం.

గాడిద కూస్తూనే ఉంటుంది. మళ్లీ రివాల్వరుచప్పుడు. ఎందుకిన్ని హత్యలు? నిత్యజీవనంలోవలెనే అని జవాబు. రోజూ చావులు. ఒకమారుకాదు. పదిమారులు. రివాల్వరుతో కాదు, చూపులతో.

చిత్రం బాగానేవుంది. చిత్రంగానేవుంది. కథానాయకుని ప్రాముఖ్యం పూర్తిగా బయటపడనివ్వలేదు. కథానాయిక జీతం (అదే) పదివేలు. కొన్నిలోపాలున్నా మొత్తంమీద ఫరవాలేదు. ఛాయాశబ్దగ్రహణం మా గ్రహచారంలా వుంది. డైరెక్టరుకి మా ధన్యవాదాలు. ప్రొడ్యూసరికి మా నమస్కారాలు. తారలకి మా ఆశీర్వాదాలు. ఇది ఫిలిం విమర్శకి నమూనా.

ఈ విధంగా గడుస్తుంది వార్తాపత్రిక జీవితం. మేజాబల్లమీద తెల్లవారుజామున టీ కప్పు పక్కనేవాలి సాయంత్రం పకోడీల దుకాణంలోకి పోతుంది.

తెరపడినా పడకపోయినా రంగం మారిపోతుంది. ఈసారి ఒకే ఒక అద్దం (అర్థమయిందా) నిలువునా నిలబడుతుంది. సౌందర్యాన్నీ, వికారాన్నీ ప్రతిఫలించి కూడా తాను తామగానే మిగిలి పోతుంది. దానిముందు ఎవరికథ వారే చెప్పుకుంటారు. కొన్ని అబద్ధాలున్నాయి. అవి భూత అద్దాలు. వాటికి అతిశయోక్తి ఒక్కటే ఇష్టం. అవి వచ్చినప్పుడు నిజం పారిపోతుంది.

భూకంపం వస్తుందని సీస్మోగ్రాఫ్‌కి తెలుసు, ఏం లాభం? కప్పెడతారు. లేదా లేదని వాదిస్తారు. భూదేవి మధురంగా నిట్టూర్పుతుంది. సెలయేళ్ళలో నవ్వుకుంటుంది. ఏదో తెలియని భాషలో పాడుకుంటుంది. ఆవిడ వొణికినప్పుడు మనం మేలుకుంటాం. పునర్నిర్మాణ సమస్యలు అప్పుడే బయలుదేరుతాయి.

మాటలకి సొంత విలువలేదు. వాటిని పేర్చినప్పుడు కొంతవిలువ వస్తుంది. పేర్చినంత మాత్రంచేత కవిత్వం కాదు. పేర్పు నేర్పులోంచి బయలుదేరే ఒకానొక వేడి- అదే మాటలను క్రియలుగా మార్చగలిగేది- అదేకావాలి. మాటలు మిగలకు.*Poets are the engineers of emotion, not its victims.* కవిత్వం అంటే మాటలా?

ఈ చర్చలోకి కవిత్వం ఎందుకు వచ్చింది? అక్కరలేనప్పుడు వస్తుంది. రమ్మన్నప్పుడు రాదు. తన ఏజెంట్లను తానే ఎన్నుకుంటుంది. కమీషను ఇవ్వదు. ఈర్ష్యాళువు. మోహిని. ఇది విష్కంభం.

అసలుకథ ప్రారంభమైనట్టేనా? మెల్లిగా- చాలా శ్రమపడిపోతున్నట్టు తెర లేస్తుంది. దాని వెనకాతల ఇంకో తెరవుంటుంది. దాన్నీ లెమ్మంటారు. కొంతసేపు మురిపిస్తుంది. ఇంకో తెరకు జాగావదలి లేచిపోవాలని దానికి తెలియదు. కాని అదీ లేస్తుంది! ఆ వెనక ఇంకోతెర వుంటుందని అప్పుడే తేలిపోయింది కాదూ? కాని కాదు. అది మొదటి తెరే, కొత్తగా ఉన్నట్టు కనబడుతుంది. అదీ లేవగా ఇంకొక తెర ఉంటుంది. లెక్కప్రకారం ఇది నాలుగవది. ఇంకొక లెక్కప్రకారం రెండవది.

ఇలా కొన్ని తెరలు తరలిపోవడం, మన లెక్కలు తప్పేళ్ళు కావడం జరిగిన తరువాత ఎప్పుడు ప్రారంభమయిందో తెలియకుండా ఏదో ఒక తెరమీద రెండుఖడ్గాలు దారికోసం యుద్ధంచేస్తున్న కథ (నీతితోసహా) నాట్యంచేస్తుంది.

అందులో కొన్ని ఘట్టాలు ఇది వరకు నడిచినవే. హాస్యరసం కూడా కొంత ఇమిడి వుంటుంది. నటన అమోఘం. కాని అంతా నటనే.

కొన్ని పాత్రలు సజీవంగా ఉండడానికి ప్రయత్నిస్తాయి. తెర చిరిగిపోతుంది.

*ఈ వ్యాసం ఎప్పుడు ఏ పత్రికలో మొదటిసారి అచ్చయిందో తెలియలేదు. బహుశా 1947 ఆనందవాణి కావచ్చు.*

*పునర్ముద్రణ: శ్రీశ్రీ సాహిత్యం రెండు వచన విభాగం ప్రజాతంత్ర 27—7—1975, 3—8—1975, మరో సారి 28—12—1975.*

# 1970-85

## ఒకటి

గుంటూరు,
హోటల్ సుదర్శన్,
రూం నెంబర్:102,
26.9.1979.

ధారావాహికంగానూ, కాలక్రమబద్ధంగానూ వెలువడుతున్న 'అనంతం'లో ఇప్పుడు, కిందటినెల పశేషం తాత్కాలికంగా నిలుపుదంచేసి 1970-85 ప్రారంభిస్తున్నాను.

నా జీవితంలో 1910-25 ఉదయం.

25-40
40-55 } మధ్యాహ్నం
55-70
1970-85 సాయంత్రం.

నా జీవితంలో 1970కి ప్రత్యేక ప్రాముఖ్యం వుంది. అది నా షష్టిపూర్తి సంవత్సరం. అదే ఏడు విప్లవ రచయితల సంఘం కూడా ఆవిర్భవించింది.

ఈ 1979 సెప్టెంబర్ 29, 30, అక్టోబర్ 1వ తేదీల్లో విప్లవ రచయితల సంఘం ఏడో మహాసభలు తిరుపతిలో జరగబోతున్నాయి. ఆ మూడు రోజులూ నేను తిరుపతిలోనే వుంటాను. (లేదా ఉండాలని అనుకుంటున్నాను)

ఇప్పుడు నేను విరసం అధ్యక్షుడ్నికాను. ఒక సామాన్య సభ్యుణ్ణి మాత్రమే. ఒకప్పుడు నేను ఇండియాకు రాష్ట్రపతి కావడంకంటే విరసం అధ్యక్షుడ్ని కావడమే మహత్తర గౌరవంగా భావించాను. ఇప్పుడు నేను అధ్యక్షుడిగా వుండడంకన్నా సాధారణ సభ్యుడిగా వుండడం మహోత్తమ గౌరవమని విశ్వసిస్తున్నాను.

రాజకీయవాదులు స్వప్రయోజనాల నిమిత్తం రోజుకొక పార్టీ మారుస్తున్న ఈ రోజుల్లో సాహిత్యకారులు ఒక సంఘం నుంచి మరో సంఘానికి మారడంలో తప్పేమీలేదని కొందరనవచ్చు. ఒపీనియన్స్ అప్పుడప్పుడు ఛేంజ్ చెయ్యకపోతే పొలిటీషియన్ కాడని గిరీశం ఎప్పుడో చెప్పే ఉన్నాడు.

ఇప్పుడ అన్ని రాజకీయాలకీ, సాహిత్యాలకీ మూలాధారమైన జీవితం నుంచి ఒక ఉదాహరణ ఇస్తాను.

ఒక జంట వుంది. వాళ్ళు భార్యా భర్తలు. అది ప్రేమ వివాహమో, పెద్దలు చేసిన పెళ్ళో ఆ వివరాలకు పోవద్దు. జీవితంలో అనునిత్యం సంభవించే ఆటుపోటులకు తట్టుకుంటూ, వున్నకాడికి కలోగంజో తాగుతూ, లేనప్పుడు పస్తులుంటూ కాలక్షేపం చేస్తూవుంటారు. అప్పుడప్పుడు ఒకళ్ళ మీద ఒకరు విసుక్కుంటూ విరుచుకుపడతారు. అయినా కలిసే ఉంటారు.

మరో జంట వుంది. వాళ్ళూ భార్యా భర్తలే. అగ్నిసాక్షిగానో, రిజిస్ట్రార్ సమక్షంలోనో పెళ్ళి చేసుకున్నవారే. కాని ఆవిడ మొగుడుతో కాపురం చెయ్యదు. తరచు ఐదు చుక్కల అంతఃపురంలోనే వుంటుంది. 'జీవితం జీవించడానికే' అనే సూక్తికి 'సుఖంగా జీవించడానికే' అనే సవరణ కలుపుతుంది. దీన్నే అమెరికన్లు 'పర్స్యూట్ ఆఫ్ హేపినెస్' అంటారు. అలా ఆవిడ ఆనందాన్ని పర్స్యూ చేస్తూనే వుంటుంది. ఆవిడ గురించి రాసినందుకు నా పాఠకురాళ్ళు ఆగ్రహించవచ్చు. ఆగండి, ఈ కథ ఇంతటితో ఆగలేదు. లేడీస్ ఫస్ట్ అంటారు. కాబట్టి ఆవిడకు అగ్రతాంబూలం ఇచ్చాను అంతే. మరి ఆయనా అంతే. పెళ్ళాం మొగం చూడడు. పురుష మహారాజనని సర్వస్వతంత్రంగా ఇష్టమొచ్చినట్టు విచ్చలవిడిగా విహరిస్తూ వుంటాడు. ఇవాళ ఇండియాలో వుంటే రేపు అమెరికాలో వుంటాడు. ఇతని ధ్యేయం కూడా సుఖజీవనమే. కాని ఈ రెండు జంటలలో మొదటి జంటనే ప్రపంచం గౌరవిస్తుందని నేను వేరే చెప్పనక్కరలేదు. రెండో జంటని పైకిమాత్రం గౌరవించినట్లు కనపడవచ్చును. లోలోపల మాత్రం అమితంగా అసహ్యించుకుంటుంది. అదే సమయంలో కాస్త భయపడుతూనూ వుంటుంది.

నాకూ, విరసానికి వున్న సంబంధం మొదటి జంట వంటిదే. 'అయితే నువ్వు ఏకపత్నీవ్రతుడివా?' అని ఎవరైనా నన్ను అడగవచ్చును. 'ఒకప్పుడు అరసం అధ్యక్షుడిగా వుండేవాడివి కావా?' అని నిలదీయవచ్చును.

ఏకపత్నీవ్రతం అంటే నాకెంతైనా ఇష్టం. కాని ఇది త్రేతాయుగం కాదు. రాముడికాలం కాదు. పునర్జన్మలో నాకు నమ్మకంలేకపోబట్టికాని, వుండివుంటే ఈ ఒక్క జన్మకే అన్నమాటేమిటి? ఇటేడు జన్మలకూ, అటేడు జన్మలకూ ఒకే పత్ని కావాలని కోరుకునేవాణ్ణే. నిజంగా అదో గొప్ప ఆదర్శమే. అయినామాత్రం ఎంత గొప్ప ఆదర్శమైనా ఆచరణ సాధ్యం కానప్పుడు దానికి అర్థమేలేదంటాను. నేను 20వ శతాబ్దంలో జీవిస్తున్న వాస్తవికవాదిని. నా జీవితం హేతుబద్ధంగానూ, నీతియుక్తంగానూ కొనసాగాలని ఆశిస్తున్నవాణ్ణి. తీవ్రమైన అభిప్రాయభేదాలు వచ్చినప్పుడు తెగతెంపులొక్కటే మార్గం. అందుకే విడాకుల చట్టాన్ని నేనంగీకరిస్తాను. ఇష్టంలేని కాపురాలు కష్టాలకే కారణం. అటువంటప్పుడు విడిపోవడమే మంచిది. అందుకే అరసం నుంచి బైటపడ్డాను. దిగంబర కవులుకాని, మరెవ్వరుకాని నిర్బంధం చేసి నన్నీ నిశ్చయానికి తరమడంలేదు. పత్రికలవాళ్ళు చిత్తంవచ్చినరీతిలో రాయవచ్చును.

వాలనులు బ"లదన్న దాఖలాలు తయారుచయివచ్చును. వాటన్నటన సర్కారువారు నమ్మి వచ్చును. కాని నేను మాత్రం నా అంతట నేనుగానే విప్లవ రచయితల సంఘాన్ని సంతోషపూర్వకంగా ఆలింగనం చేసుకున్నాను.

ఇదంతా 1970లోనే. నా షష్టిపూర్తి, విరసం ఆవిర్భావమూ, మార్చ్ రాబీ అండ్ రాబీ, ఇప్పుడు వీస్తున్న గాలి, సృజన సంచికలు కొన్ని నిర్దాక్షిణ్యంగా నిషేధానికి గురైనాయి. జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజు మొదలైనవారిని అరెస్ట్ చేయడం జరిగింది. అందరిలోకీ ఎక్కువ చిత్రహింసలకు గురైనవాడు చెరబండరాజు (అందుకే కాబోలు అందరికన్నా అద్భుత కవిత్వం చెప్పగలిగాడు). ఈ మధ్యనే అతని మెదడుకు ఆపరేషన్ జరిగింది. ఇంకా కోలుకుంటున్నాడో లేదో, మళ్ళీ మరో ఆపరేషన్ అవసరమైందని తాజావార్త.

కవికీ, ప్రజలకూ మధ్యగల సంబంధం గురించి Soren kierke gaard రచనలలో ఒకచోట ఇలా వుంది.

"ఎక్కడో ఒకమూల పాడుకుంటున్నాడు ఓ కవి. అతని చుట్టూ కొంత జనం పోగయ్యారు పాట వినడానికి. అప్పుడు జనంలో ఒకడికో చిన్న ఐడియా తోచింది."ఒక కంచుగంగాళంలో కూర్చోబెట్టి పాడిస్తే కవిగారి పాట మరీబాగుంటుంద"ని సలహా ఇచ్చాడు. ఆ సలహా మేరకు కవినొక కంచు గంగాళంలోనికి సాయంపట్టారు. మరో ప్రబుద్ధుడు భద్రంగా ఆ గంగాళం మీద ఒక పళ్ళెం బోర్లించాడు.

కవి పాడుతున్నాడు. ప్రజలు పరవశులై వింటున్నారు. ఆహో, ఓహో, భేష్, సెభాష్ అంటున్నారు. అంతలో మరొకడికి మరో ఆలోచన వచ్చింది. 'ఈ గంగాళం కింద మంటలు కూడా పెడితే ఎంత బాగుంటుంది' అన్నాడతను. అందరూ అందుకు తక్షణమే అంగీకరించారు. క్షణాల మీద మంటలు సిద్ధమైనాయి. మంటల మీద గంగాళం అందులో మన కవి. బాధతో అరుస్తున్నాడు కవి. అవి ప్రజల చెవులకు బ్రహ్మాండమైన కవిత్వంలా వినిపిస్తున్నాయి."

ఇదీ కథ. ఈ కథని తలచుకున్నప్పుడల్లా నాకు చెరబండరాజు గుర్తుకొస్తూవుంటాడు. 'బాధ కవిత్వానికి పర్యాయ పదం' అని నేను రాసినప్పటికింకా 'కిర్క్ గార్డ్'ని చదవలేదు. కాలగాథ తాలూకు చక్రాలు ఒకప్పుడు జోరుగానూ, మరొకప్పుడు మందకొడిగానూ సాగిపోవు. అంతా మనం అనుకోవడంలోనే వుంటుంది.

1970లో ఈ చక్రాలు మహావేగవంతంగా తిరిగాయని నేననుకుంటున్నాను. 2-1-1910 నా జన్మదినంగా పరిగణించి 70లో జనవరి 2వ తేదీన నా షష్టిపూర్తి విశాఖపట్టణంలో జరిపించడానికి చురుగ్గా ఏర్పాట్లు జరిగాయి. తెన్నేటి విశ్వనాథంగారు అధ్యక్షుడుగా సువిస్తృతమైన ఆహ్వాన సంఘం ఏర్పడింది. కాని ఏవేవో కారణాల వల్ల 2-1-70లో జరగవలసిన షష్టిపూర్తి సభ 1-2-70లో జరిగింది. కొద్దిగా అంకెలమార్పు.

అంత పెద్ద తేడా లేదు. అంతకుముందు 69 దీపావళినాడు మద్రాస్‌లో కొందరు మిత్రులు షష్టిపూర్తికి నాందీసభలాంటిదొకటి జరిపించారు. దానికి తాపీ ధర్మారావుగారు అధ్యక్షులు. వెయ్యిమందికిపైగా జనానికి చోటున్న ఆ కర్నాటక సంఘం హాలులో 20 లోపు మంది మాత్రమే వచ్చారు. 70 సంవత్సరం పొడుగునా నా షష్టిపూర్తి సభలు జరుగుతాయని ఆ రోజు నేననుకోనేలేదు.

వియన్నాలో ఫ్రాయిడ్ మొదటిసారి చేసిన సైకో-ఎనాలిసిస్ ఉపన్యాసాలు వినడానికి ఇంకా తక్కువ జనం వచ్చారని మద్రాస్ సభలో నేను చమత్కరించాను.

70 జనవరిలోనే కాబోలు, మద్రాస్‌లోని సోవియట్ కాన్సల్ జనరల్ తమ సమాచార శాఖ కార్యాలయంలో నన్ను సత్కరించడం జరిగింది. అప్పుడాయన ఒక వోడ్కా సీసా, ఒక జిన్ను సీసా, పువ్వులూ, పళ్ళతోపాటు ఒక టేబుల్‌డైరీ కూడా బహూకరించాడు. ఏడాది పొడుగునా జరిగిన సంఘటనలను ఆ 1970 డైరీలోనే నోట్ చేసుకున్నాను. అప్పటికింకా నేను సోవియట్ ప్రభుత్వపు దృష్టిలో persona nongrata కానను కుంటాను. ఇప్పటికీ కాననే అనుకుంటున్నాను. ఎటొచ్చీ ఇక్కడివాళ్ళే నన్ను (ఈ 1979లో) చైనా మనిషిగా పరిగణిస్తారు. అంతర్జాతీయ వ్యవహారాల్లో చైనా అనుసరిస్తున్న విధానాలే సరైనవని నేను భావించడమే ఇందుకు కారణం.

ఇక నా డైరీ ప్రకారం.

జనవరి 70 బుధవారం 28వ తేదీ మద్రాస్ నుంచి విమానంలో హైద్రాబాద్‌కు బయలుదేరి ఉదయం 10 గంటలకు ద్వారకా హోటల్ చేరుకున్నాను. శుక్రవారం 30వ తేదీ సాహిత్య అకాడమీలో విశిష్ట సభ్యత్వం. 60 ఏళ్ళవాడికి ఈ సభ్యత్వం ఇవ్వాలంటే ఈడు చాలదని కొంతమంది అభిప్రాయపడ్డారట. (దరిమిలాను ఈ సభ్యత్వానికి నేను రాజీనామా చేశాను).

శనివారం 31వ తేదీ.

రేపు విశాఖపట్టణంలో షష్టిపూర్తి. ఇంకా నేను హైద్రాబాద్‌లోనే వున్నాను. ఆదరాబాదరాగా ఒక కారు ఏర్పాటుచేసుకుని విజయవాడలో జనతా ఎక్స్‌ప్రెస్‌ను అతికష్టం మీద అందుకున్నాను. నాతో పురిపండా, శ్రీరంగం వెంకటరమణ (నా ఒకేఒక్క కొడుకు) వున్నారు.

ఫిబ్రవరి 1 ఆదివారం.

ఉదయానికే బండి వాల్తేరు స్టేషన్ చేరగలిగింది. కాని అనకాపల్లి దగ్గర మూడు-నాలుగు గంటలు ఆలస్యమైపోయింది. అమ్మవారి పండుగలట. (అనకాపల్లి కాబట్టి తప్పకుండా నూకాలమ్మే అయివుంటుంది.) జనం బండిని కదలనియ్యలేదు. ఎలాగైతేనేం ఉదయం కవితా గోష్ఠికి హాజరుకాలేకపోయినా షష్టిపూర్తి రోజున విశాఖపట్టణంలోనే వుండగలిగాను. (1925లో నా పెళ్ళికి నేను వెళ్ళలేదు. అది వేరే కథ. వేరేచోట రాస్తాను.) కవి

సమ్మేళనానికి వచ్చిన దిగంబర కవులతో ఆ రోజే నాకు మొదటిసారిగా పరిచయమైంది. వరవరరావుతో కూడా అదే మొదటి పరిచయం అనుకుంటాను. కాళీపట్నం రామారావుతో కూడా. (ఈ వివరాలు డైరీలో నోట్ చెయ్యలేదు).

1970 ఫిబ్రవరి 1వ తేదీన మళ్ళీ నేను విశాఖపట్టణంలోనే పుట్టాను. అంచేత ఇవాళ నా వయస్సు తొమ్మిది. ఆ సాయంత్రం తాపీ ధర్మారావు గారి అధ్యక్షతతో షష్టిపూర్తి సభ జరిగింది. ఫిలింస్ డివిజన్ వాళ్ళు దాన్నో డాక్యుమెంటరీగా తీశారు. ఎవరు వస్తే నేనెక్కువ సంతోషిస్తానో ఆ ఆరుద్ర ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడే తప్ప వేదిక మీదకు రాలేదు. తాపీ ధర్మారావు గారు మూడు ముక్కలు చెప్పమని ఆహ్వానించారు. మూడేమూడు మాటలు చెప్పి ఇంతే నా ఉపన్యాసం అన్నాడు ఆరుద్ర.

(లుబ్ధావధాన్లు పెళ్ళిలో కొంకిభట్లు సాక్ష్యం ప్రకారం మధురవాణి పాడినట్లా? పాడనట్లా?)

ఆ రోజంతా ఆరుద్ర గునుస్తూనే వున్నాడు. బహుశా నేననుకుంటాను, శ్రీశ్రీ సాహిత్యం సమీకరించే హక్కు తన ఒక్కడికే వుందనీ, దాన్ని రమణారెడ్డి లాక్కున్నాడని అనుకున్నాడో యేమోనని. నా చిత్రపటం ఆవిష్కరించడానికి రమ్మంటే కూడా రానన్నాడు ఆరుద్ర. అక్కడే వున్న నా కొడుకూ, దౌహిత్రుడూ ఉమ్మడిగా ఈ ఆవిష్కరణ జరిపించారు.

## 1970 ఫిబ్రవరి 2

ఉదయం కవి సమ్మేళనం.

అదేరోజున కారులో విజయనగరం. సాయంత్రం విజయనగరం సభ ముగిసిన తర్వాత అదే రాత్రి అదే కారులో శ్రీకాకుళం.

## 1970 ఫిబ్రవరి 3

Evening function at Srikakulam presided over by the District Collector's wife. A very disciplined gathering.

(సాయంత్రం శ్రీకాకుళంలో సభ జరిగింది. జిల్లా కలెక్టర్ గారి భార్య అధ్యక్షత వహించింది. అత్యంత క్రమబద్ధంగా జరిగిన సమావేశం).

## 1970 ఫిబ్రవరి 4 బుధవారం.

Taxi was arranged. Reached Vizag as guest of D.J.R.

D.J.R. అంటే ద్వారం జగన్నాధరావు. నాకు ఆబాల్యమిత్రుడు. మా నాన్నా, వాళ్ళ నాన్నా ప్రాణస్నేహితులు.

ఆ సాయంత్రం.

మనకి కులతత్వం నరనరాలా జీర్ణించిపోయింది. నేను బాపనోణ్ణి కానుమొర్రో అన్నా

నన్ను వదల్లు. జండెం తెంచిపారేశాను. అయినా ముద్రవదలదు. సాయంత్రం మా కులపోళ్ళ సభ.

Tape recording of my ricitation at a private gathering.

బహుశా ఇది చలసాని ప్రసాద్ ఇంట్లో అనుకుంటాను. బొత్తిగా జ్ఞాపకంలేదు. ఆ తర్వాత నేనూ, బైజా (మా వాడు శ్రీరంగం వెంకటరమణ) మద్రాసుకు మరలివచ్చాము.

1970 ఫిబ్రవరి 8 ఆదివారం.

బెజవాడ వచ్చాను. అక్కడినుండి నూజివీడు, మళ్ళీ షష్టిపూర్తి సభ. నూజివీడు నుంచి కారులో బెజవాడకు తిరుగు ప్రయాణం. అక్కడి నుంచి హౌరా ఎక్స్‌ప్రెస్‌లో మద్రాస్‌కు బయలుదేరాను. ఈలోగా హిందూ పత్రికలో శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర ఒక ఉత్తరం రాసింది. విశాఖపట్టణం సభ యావత్తూ నక్సలైట్ల ఆర్భాటమనీ, ఇంకా యేవోయేవో రాసింది. నన్నో నక్సలైట్‌గా పేర్కొంది.

ఫిబ్రవరి 10 మంగళవారం.

రామలక్ష్మిగారి ఉత్తరానికి జవాబు రాసి స్వయంగా 'హిందూ' ఆఫీసులో అందజేశాను. ఆహ్వాన సంఘం అధ్యక్షుడు తెన్నేటిగానీ, సభాధ్యక్షుడు తాపీగానీ నక్సలైట్లు కాదన్నాను. నన్ను నక్సలైట్‌గా పరిగణించడం నాకు లేనిగౌరవాన్ని ఆపాదించడమే అన్నాను. నేను నక్సలైట్ కవిని కావచ్చుగాని నక్సలైట్‌ని మాత్రం కాదన్నాను. హిందూ పత్రిక నా ఉత్తరాన్ని ప్రకటించలేదు, తన 'విచారం' తెలియజేస్తూ. ఫిబ్రవరి 12 గురువారం రోజున నా ఉత్తరం తిరిగి నాకు పంపించింది. ఇదెక్కడి పాత్రికేయ సంప్రదాయమో నాకు తెలియదు. నీ మీద విమర్శ ప్రకటిస్తే దానికి నీ సమాధానం కూడా ప్రకటించడం పత్రికల ధర్మం. మహోఘనత వహించిన 'హిందూ' పత్రిక మాత్రం ఈ ధర్మం పాటించలేదు.

ఫిబ్రవరి 13 శుక్రవారం

చిత్తూరులో సన్మానసభ.

చిత్తూరునుంచి నేనూ, బైజా ఎక్స్‌ప్రెస్ బస్‌లో మద్రాసుకి తిరిగి వచ్చాము. ఇంటికివచ్చి చూసుకుంటే నా సంచిలో ఉండవలసిన 200 రూపాయలు లేవు.

అవి పోవడానికి ఒక పోలీసువాడు కారణమని మాత్రం తెలుసు. వివరాలలోనికి వెళ్ళదలచుకోలేదు.

ఫిబ్రవరి 15 ఆదివారం

*Wonderful function at Kurnool-*

అని మాత్రమే నా డైరీలో రాశాను. కాని ఆ దినం కర్నూలు మెడికల్ కాలేజీ విద్యార్థుల సాంస్కృతిక ప్రదర్శనలకు నేను మరలిపోలేదు.

తిరుగు ప్రయాణం చాలా ఇబ్బందిగా జరిగింది. *MYH* 1000 కారులో ప్రయాణం. మధ్యాహ్నం 12 గంటలకు.

ఫిబ్రవరి 16

చిత్తూరుకు రెండుమైళ్ళ దూరంలో కారు టైర్లు పాడయిపోయాయి.

కారులో నేనూ బైజా మాత్రమే ఉన్నాము. డ్రైవరు కుర్రాడు మమ్మల్ని యేలాగయినా మద్రాసు చేర్చాలని ఎంతో తాపత్రయపడుతున్నాడు. అందులో అతని స్వార్థం కూడా కొంచెం ఉంది. ఇదివరకెప్పుడూ సముద్రం ఎలా వుంటుందో చూడలేదట. మద్రాసుకు వస్తే సరదా తీరుతుందని ఉబలాటపడుతున్నాడు.

ఎలాగయితేనేం 3 గంటలకి బయల్దేరి 5 గంటలకి మద్రాసు చేరుకున్నాం. ఇంటికి వెళ్ళకుండానే కారును మెరీనా బీచికి మళ్ళించమన్నాను.

డ్రైవరు కుర్రాడు సముద్రాన్ని చూసి చాలా సంతోషించాడు.

ఢిల్లీ ఆలిండియా రేడియోలో వార్తలు తెలుగులో చదివే ఉద్యోగం చేస్తూ త్రిమార్ద్వారులో ఉండేటప్పుడు మా ఇంట్లో ఇంకో వాటాలో సాగర్‌చంద్ అని ఒక పంజాబీ ఆయన ఉండేవారు. అతను కూడా తానెప్పుడూ సముద్రాన్ని చూడలేదని అన్నాడు. పేరు మాత్రం సాగర్‌చంద్! చిత్రంగానే వుంది.

మార్చి 1వ తేదీ ఆదివారం.

నేనూ, సరోజా నెల్లూరు వెళ్ళాము. అనంతరామయ్యగారి ఆతిథ్యం. నెల్లూరు ప్రయాణం నా షష్టిపూర్తికి సంబంధించినది కాదు. తిక్కన జయంతి నిమిత్తం వచ్చాను. పరాభి నాన్నగారు తిక్కవరపు రామిరెడ్డిగారితో అనాడే పరిచయం.

ఆ రోజు తిక్కన గురించి నేను చేసిన ప్రసంగం 'జమీన్ రైతు'' పత్రికలో చాలా విపులంగా ప్రకటితమయింది.

అన్నట్టు అది తిక్కన జయంతి కాదు. కవిత్రయ జయంతి. అంతకు ముందు సంవత్సరాలలో ఒక్క తిక్కనగారికే జరిగేది. ఈ యేటి నుంచి కవిత్రయ జయంతి చేశారు.

ఎర్రాప్రెగడ గురించి మాట్లాడమని ముందుగా ఉత్సవనిర్వాహకులు నాకు రాశారు. తిక్కన నా అభిమాన కవి అనీ, తిక్కన గురించి మాట్లాడుతానని రాస్తే అందుకు వారొప్పుకున్నారు.

సుమారు గంటసేపుదాకా ప్రసంగించినట్లు జ్ఞాపకం! నాకు చాలా సంతృప్తి కలిగించిన ఉపన్యాసాలలో అదొకటి.

*స్వాతి డిసెంబరు 1979*

## రెండు

1970 నా షష్టిపూర్తి సంవత్సరం. విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించిన సంవత్సరంకూడా అదే. ఈ రెండు కారణాలవల్లా, తెలుగు సాహిత్యంలో 1970కి ప్రత్యేక ప్రాముఖ్యం ఉందంటాను. ఆ యేడు విరసం మొదటిసారి, నేను రెండవసారీ జన్మించినట్టు భావిస్తుంటాను. అందుకే ఇది రాస్తున్న ఈ 1979లో నా మనస్సు తొమ్మిదేళ్లే అని చమత్కరించే అవకాశం నాకుంది.

వార్ధక్యాన్ని రెండో బాల్యం అంటారు కాబట్టి 1970 నుంచి సాగుతూ వచ్చిన

సాయంత్రమే నా రెండో ప్రభాతం అనికూడా అనడంలోగాని, వేననుకోవడంలోగాని తప్పులేదు.

మళ్లీ నా 1970వ సంవత్సరపు డైరీని తిరగేస్తున్నాను. ఆ యేడాది పొడుగునా ఆంధ్రదేశంలోని అనేకానేక స్థలాల్లో నాకు షష్టిపూర్తి సభలూ, సన్మాన సభలూ జరిగాయి. రాష్ట్రేతర ప్రాంతాలయిన కటకం, బరంపురం వంటి పట్టణాలలో కూడా జరిగాయి. ఆయా సమయాల్లో నాకు సమర్పించబడిన సన్మాన పత్రాలన్నిటినీ అచ్చువేస్తే ఒక పెద్దగ్రంథమే అవుతుంది. కాని ఆ పత్రాలను జాగ్రత్తపరచాలన్న ధ్యాస నాకు లేకపోయింది.

ఢిల్లీ ఆంధ్ర సంఘంవారు ఎర్రని ముఖమల్ గుడ్డమీద బంగారపు రంగుతో ముద్రించి పంపిన సన్మానపత్రాన్ని మాత్రం ఎప్పటికైనా ముద్రించాలని పదిలపరచాను. దాన్నిక్కడ ఉదహరించాలని వెదికితే మా పిల్లలు 'ఎప్పుడో ఎలుకలు తినేశా'యని చెప్పారు. దాని ప్రతి ఇప్పుడెవరి దగ్గరయినా ఉందేమో నాకు తెలియదు. ఆనాటి ఆంధ్ర సంఘమే ఇప్పుడుకూడా ఢిల్లీలో వుంటున్నదని నేననుకోను. ఒకరిద్దరు వ్యక్తులవద్ద వుండవచ్చువేమోగాని నామట్టుకు నేనది కాలగర్భంలో కలిసిపోయిందనే విచారిస్తున్నాను.

శైలికి సంబంధించిన అంతర్గత సాక్ష్యాన్ని బట్టి చూస్తే ఆ సన్మాన పత్రాన్ని దామోదరం సంజీవయ్యగారు లిఖించారేమో అని నాకుతోస్తుంది.

విశాఖ సభావిశేషాలను ఫిలిప్స్‌డివిజన్‌వారు న్యూస్‌రీల్‌గా తీశారు. దాన్ని ఏప్రిల్ 16వ తారీఖున మద్రాసులోని ప్రివ్యూ థియేటరులో చూసినట్లు నా డైరీలో రాసుకున్నాను.

ఏప్రిల్ 27: చలంగారికి ఉత్తరం రాశాను. అందులో ''ఇంతవరకు నేను దేవుడున్నాడా లేడా అనే సదవత్సంశయంతో కొట్టుమిట్టాడుతున్నాననీ. ఇప్పుడు నాకు దేవుడు లేడనే నమ్మకం కుదిరిం''దనీ రాశాను. ( నా నమ్మకంతో ఏకీభవిస్తున్నట్టు చలంగారి దగ్గరనుంచి జవాబు వచ్చింది. ఆ ఉత్తరం ఎక్కడో పోయింది కాబట్టి నా మాట ఎవరూ నమ్మకపోవచ్చు).

ఆ మర్నాడు (ఏప్రిల్ 28) నా డైరీలో ఇలా రాసుకున్నాను.

శ్రీ శ్రీ ''ఉవాచ'' ఈ సృష్టి అనశ్వరమేకాదు అనీశ్వరం అని కూడా.
(అందులోనే ఒక సవరణ? ''సృష్టి'' అనేమాట కొట్టేసి దానిమీద ''విశ్వం'' అని రాశాను.)

ఆ తర్వాత మే నెల 24వ తేదీని డాక్టరు కామేశ్వరిగారితో తిరువణ్ణామలై వెళ్ళాను. ఆ పగలుమాత్రం చలంగారి వద్దవుండి, తిరిగి అదే రాత్రి మద్రాసుకు బయలుదేరాను.

చలంగారిని అదే ఆఖరుసారి చూడడం!

ఇలా దినచర్య ఫక్కీలో రాసుకుపోవడం నాకిష్టంలేదు. అదీ ఒక పద్ధతే! కాదనను. కాని నేనెప్పుడూ ఏ డైరీలోనూ, ఏదీ విస్తరించి రాయలేదు. అవన్నీ కొన్ని కొండగుర్తులు మాత్రమే! తేదీల విషయంలో ఖచ్చితంగా ఉండడానికిగాను అవి ఉపకరిస్తాయి. ముఖ్యంగా ఏ గీతం ఎప్పుడు రాశాననడానికి ఇవే గొప్ప సాక్ష్యాధారాలు.

ఉదాహరణకి 1970 సెప్టెంబరు 12వ తేదీని ''నిన్నటి జట్కావాలా'' రాసినట్లు నా

Simple chalam.
Sri Ramanasram.
28/4/70

శ్రీ శ్రీ,

[illegible]

[illegible]

[illegible] evidently to save their face. [illegible]

[illegible]

[illegible]

[illegible]

[illegible] Supreme court wash out [illegible] linen [illegible] dirt [illegible] work [illegible]

[illegible] — Something is very wrong with this world" [illegible]

[illegible] saying [illegible] —

Man has made God in His own image [illegible]

[illegible]

Man is always making God in his own changing image.

కృష్ణశాస్త్రి [illegible]

[illegible]

చలం

చలంగారి జవాబు ప్రతి ఇచ్చాం. శ్రీశ్రీ పోయిందనుకున్నాడు, కానీ జాగ్రత్తచేశాం. సుప్రీంకోర్టు చాకిరేవు గురించి చిన్న వివరణ. 1969 ఆగస్టులో భారత అధ్యక్షపదవి కోసం నీలం సంజీవరెడ్డిగారికి, వి.వి.గిరి గారికి మధ్య తీవ్రంగా పోటీ జరిగింది. వి.వి.గిరి గారు గెలిచారు. ఎన్నికల సమయంలో తన మీద కరపత్రాలు వేశారని, నిందా ప్రచారం చేశారని సంజీవరెడ్డిగారి తరఫున సుప్రీంకోర్టులో కేసు దాఖలయింది. వి.వి.గారు కోర్టుకు వచ్చారు. కేసు కొట్టేశారు.

చలంగారిని చూడ్డానికి చాలామంది వెళుతుండేవారు. 'మీతోపాటు నేనూ వస్తానని' అందరితోనూ అనేవారు కృష్ణశాస్త్రిగారు. కాని ఒక్కసారి కూడా వెళ్లలేదు. దాన్ని చలంగారు సున్నితంగా ఎత్తిపొడిచారు.

డైరీలో ఎంట్రీ. ఇది రాయాలని కొన్ని సంవత్సరాలనుండీ అనుకుంటూ వుండేవాణ్ణి. వాడుకభాషలో కవిత్వం తర్వాత పాటక జనుల భాషలో కవిత్వానిదే పై చెయ్యి అని నా దృఢ విశ్వాసం.

"తాను సాలీసాలని గడ్డితిని
నాకు రోజా వణ్ణం యెట్టేదండి నా గుర్రం..."

అని ప్రారంభించి వదిలేశాను. విరసం ఆవిర్భవించిన తర్వాతనే ఈ గీతానికి ప్రాణం రావడం ఒక విశేషం.

ఆ రోజుల్లో నేను "విశాఖపట్టణం" అనే శీర్షికకింద రకరకాల వ్యక్తుల రేఖాచిత్రాల వంటి గీతాలు రాయాలనుకునేవాణ్ణి. ఇందుకు ప్రేరేపణ *Edgar Lee masters* (అమెరికన్ కవి) రాసిన *Spoon river Anthology* .

(ఇక్కడ శిష్ట్లా ఉమామహేశ "ఊళ్లు వెర్రెమ్మ"ను జ్ఞాపకం చేసుకోవచ్చు).

"ఊళ్లు వెర్రెమ్మ
ఊళ్ళో వుందంటే
ఊరందరికీ
ఉబుసుపోక.."

అని ప్రారంభమవుతుంది. "నవమి చిలుక" అనే శిష్ట్లా కావ్యసంపుటిలో ఇది ఉంది. మరి ఆ "నవమి చిలుక" ఎవరిదగ్గరవుందో నాకు తెలియదు.

నారాయణబాబుకి నా విశాఖపట్టణం ఐడియా చెప్పేసరికి మర్నాడే నారాయణబాబు "విశాఖపట్టణం" అనే కావ్య ఖండిక రాసుకొచ్చి చూపించాడు. అదో గొప్ప రచన అని నేను అప్పుడే ఒప్పుకున్నాను.

"వస్తున్నా యొస్తున్నాయి..."

అని జగన్నాధ రథచక్రాలు అసంపూర్ణంగా ఉండగా నేను వినిపించుకోలేదో, వెంటనే జలసూత్రం "వెళ్లిపోయాయ్యెళ్లిపోయాయి" అని పారడీరాసి భారతిలో ప్రచురణకిచ్చాడు. మరుసటి నెల "భారతి"లో నా "జగన్నాథుని రథచక్రాలు" అచ్చయింది.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే ఆ రోజుల్లో మా యువ కవులమీద ఒకరి ప్రభావం ఒకరి మీదపడుతూ ఉండేదనడానికే! గ్రంథ చౌర్యం ఒకటే క్షమించరాని నేరంకాని, కావ్యానుసరణ గర్హ్యం గాదు.

ఇక కవి తాను సాలెపురుగులాగ తనలోంచే దారాలు తీసి పసందైన సాలెగూడు నిర్మిస్తున్నా ననుకుంటాడు. కాని కవులెప్పుడూ తుమ్మెదలలాంటి వాళ్ళు. ఎన్నెన్నో పువ్వులమంచి మధువులు సేకరిస్తారు. ఏ పువ్వునూ జ్ఞాపకం చెయ్యని తియ్యని తేనె ఆ కవులద్వారా మనకు లభిస్తుంది.

మేం వచన గీతాలు రాస్తున్న తొలిరోజుల్లో పూడిపెద్ది వెంకటరమణయ్యగారు ( మా

బంధువుడే) ''అల్పీలూ, సూదులూ'' అని అరవందకు తక్కువగాని ఖండకావ్యాల సంపుటి తయారుచేశారు. వాటిలో కొన్ని ''చిత్రగుప్త'' వంటి పత్రికలలో వెలువడ్డాయి. కొన్నాళ్ళ పాటు శ్రీ శివశంకరశాస్త్రిగారు వచన గీతాలకి ఆద్యుడు పూడిపెద్ది వెంకటరమణయ్యగారే అంటూ ప్రచారం చేశారు. చిత్తశుద్ధిగల వ్యక్తి కాబట్టి రమణయ్యగారు ''మొట్రో నేను శ్రీశ్రీ రచనలు చూసిన తర్వాతనే ''అల్పీలూ, సూదులూ'' రాశానని అంగీకరించారు.

''నిన్నటి జట్కావాలా'' రాసిన రోజే ''జనస్వామ్య వీరుడికో సలహా'' అంటూ ఇలా రాశాను.

''ముష్టి మైథునంలో
సవ్యసాచివిరా నా కొడకా
నాలుగు గోడలమధ్యా
రహస్యంగా ఏమిటాపని
నాలుగు వీధుల కూడలివద్ద నిలబడి
నలుగురి మధ్యా
నిరూపించుకో నీ మగతనం
ప్రదర్శించు నీ వ్యక్తి స్వాతంత్ర్యం
ఆంధ్రుల జాతీయ పత్రికల
సంపాదకీయాలకు
ఆదర్శప్రాయంగా..''

ఇలా రాస్తుంటే కొంతమందికి ఒళ్ళుమండదూ మరి? అయితే ఇలాంటివెందుకు రాస్తానంటే అలాంటి వాళ్లకి ఒళ్ళు మండించడానికే!

విప్లవ రచయితల సంఘం 1970 జూలై నెల 4వ తేదీని హైదరాబాద్‌లోని ఒకానొక మారుమూల హోటేల్‌లో ఆవిర్భవించిందని కేవలం తారీఖులకు మాత్రమే ప్రాధాన్యం ఇచ్చే ప్రామాణికలో రాస్తూవుంటారు. అంతవరకు అది నిజమేకాని నిజమైన చరిత్రకారులు ఒక సంఘటనను దాని పూర్వాపర సందర్భాలతో సమన్వయించి, విశ్లేషణాత్మక చిత్రణతో వ్యాఖ్యానిస్తారు.

(విరసం పుట్టినరోజు అమెరికా స్వాతంత్ర్యదినం కావడం కాకతాళీయమే అనుకోవచ్చు).

ఇది రాస్తున్నానే కాని, ఎక్కడ ప్రారంభించాలో, ఎలా నిర్వహించాలో, ఎప్పుడు ఉపసంహరించాలో నాకేమీ తోచకుండావుంది. ఎన్నో విషయాలు ఒక్కుమ్మడిగా నేనంటే నేనంటూ ముసురుకుంటూ ముందుకొస్తున్నాయి. వాటిన్నిటికీ వెనుక, చీనావారు వసంత మేఘగర్జనం అని అభివర్ణించిన శ్రీకాకుళ విప్లవజ్వాలల వేడిమి వెచ్చగా తగుల్తోంది. అప్పటికే నక్సలిజం అనేమాట ప్రపంచంలోని అన్ని ప్రధాన భాషల్లోకి ప్రాకిపోయింది.

యజ్ఞకుండంలోంచి ద్రౌపది ప్రభవించిందంటారు. ఆ దృశ్యాన్ని వ్యాసులవారెవరైనా చూశారో లేదోగాని విప్లవాగ్నులలోంచి విరసం ప్రభవించడం నేను కళ్ళారా చూశాను.

జూలై 4వ తారీఖున విరసం ఏర్పడక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి. నేనొకవేళ కాసు బ్రహ్మానందరెడ్డి గారి వెయ్యిన్నూటపదార్ల చెక్కుకు ప్రలోభపడి నక్షత్ర సప్తకం వారి వేడుకల్లో పాల్గొన్నా విరసం ఏర్పడితీరేదే! నా అంతట నేనుగానే విరసంలో చేరాను. నన్నెవరూ అటు బలవంతంగా నడిపించనూలేదూ, ప్రలోభపెట్టనూ లేదు. ఆనాటి నా మానసిక పరిస్థితులుకూడా నన్ను విరసంలోనికే నడిపించాయి. ఆర్థిక పరిస్థితులు వద్దంటూనే వున్నాయి. కాని వాటికి నేను లొంగిపోలేదు.

విరసం ఒక కుట్ర అనీ, దాన్ని ప్లాను చేసింది నేనేననీ ఒక పత్రిక (*masterminded by Sri Sri* అని) రాసింది.అందుకు నేను నవ్వుకున్నాను. జాలిపడ్డాను. నవ్వు ఎందుకంటే ఆ రాసింది అబద్ధంకాబట్టి. జాలి దేనికంటే ఆ పత్రిక అవగాహనహీనతపట్ల.

నిజానికి విరసం ఒక ప్లానుప్రకారం రూపొందింది. కాని అది ఏ ఒక్కడివల్లా జరగలేదు. ఏ ఒక్కక్షణంలోనో జరగలేదు. సాహితీ సహజ పరిణామాలే విరసం పుట్టుకకు దారితీశాయి. ఇది కొన్ని సంవత్సరాల, కనీసం కొన్నిమాసాల సమష్టి కృషి ఫలితం. ఈ సంఘానికి అధ్యక్షునిగా "కుట్రదారు"లందరూ నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకోవడం నాకో మహద్భాగ్యంగా పరిగణిస్తున్నాను.

పునర్జన్మలో నమ్మకంలేని నాకు విరసం ఒక పునర్జన్మ ఇచ్చిందననుగాని నిస్సందేహంగా అరవైయ్యేళ్ళ తర్వాత ఆ సంఘం నాకు పునర్యౌవనం ఇచ్చింది. అంతకు ముందు నేను ఏ సభలోనూ పట్టుమని పదినిమిషాలసేపైనా మాట్లాడగలిగే వాణ్ణికాను. కవిత్వం లిమబుక్కుల కూ, ప్రాసక్రీడలకూ, సినీమా పాటలకూ (వీటిలో కవిత్వం లేదనికాదు) పరిమితమై ఉండేది. అంతకు ముందు నాకు ప్రజలతో ప్రత్యక్ష సంబంధం లేదనను కాని విరసం ద్వారా ఆ అనుబంధం మరింత బలిష్టమయింది.

విప్లవ రచయితల సంఘం ప్రథమ సర్వసభ్య సమావేశం ఖమ్మంలో అక్టోబర్ నెల 9, 10 తేదీలలో జరిగింది. నా అధ్యక్షోపన్యాసాన్ని రాసుకువచ్చి చదివాను. ఆ తర్వాత ఎన్నో వేదికల మీద ఆశువుగా ఉపన్యసించినా విరసం అధ్యక్షోపన్యాసాలను మాత్రం ముందుగానే వ్రాసి ఉంచేవాణ్ణి. (ఆఖరి ఉపన్యాసం ఒక్కటే కొన్ని నోట్సుదగ్గర పెట్టుకొని నోటితో చెప్పాను.) వీటన్నిటినీ సేకరించి, ఒక గ్రంథరూపంలో వెలువరించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఖమ్మం సభలు సుబ్బారావు పాణిగ్రాహినగర్‌లో జరిగాయి. ఎంతో సంచలనం కలిగించిన ఈ సభలు మన జాతీయ దిన వారాళి పత్రికల దృష్టిని ఆకర్షించకపోవడం శోచనీయం. పోలీసు గూఢచారులకు మాత్రం చేతినిండా పని దొరికిన మాట వాస్తవం.

బ్రాహ్మణుల్లో కూడా మహానుభావులుంటారని "కన్యాశుల్కం"లోని బైరాగి చెప్పినట్లు పోలీసులలో కూడా· చెయ్యి తిరిగిన జర్నలిస్టులుంటారు. సర్కారు వారికి చక్షుశ్శ్రవణాలుగా పనిచేసే వీళ్లు విరసం గురించి సమగ్ర సమాచారం సేకరించి తెలుగు భాషకు ఏ పత్రికా చెయ్యనంత సేవచేసి ధన్యజీవులవుతున్నారు.

నా ఒక్కడి సంగతే చెప్పాలంటే బ్రిటిష్‌వాడి కాలం నుంచి నేటి దాకా నా గురించిన

బోలెడంత భోగట్టా పోలీసువారిదగ్గరే ఉంటాయి కాబట్టి వివిధ వేదికల మీద నేను చేసిన ఉపన్యాసాలు టేపు రికార్డర్లలో సురక్షితంగా ఉన్నాయనే నేను నమ్ముతున్నాను.

మళ్ళీ ఖమ్మం కథకి వస్తున్నాను. 10వ తేదీ ఉదయం పెద్ద ఊరేగింపు జరిగింది. అందరితోబాటు నేను కూడా కాలినడకతో అందులో పాల్గొన్నాను. . వాన కురుస్తున్నా మేమెవరమూ లక్ష్యపెట్టలేదు. అలాగే నడుస్తూ, అరుస్తూ సభాంగణం చేరుకున్నాము. ఈ మొండిఘటాలతో లాభంలేదనుకొని కాబోలు కురవడం మానేసింది వాన!

ఖమ్మం సభలలో ఆర్టిస్టు చంద్ర లిఖించిన చిత్రాల ప్రదర్శన ఒక హైలెట్. ఆ చిత్రాలలో ఒక దాన్ని విరసం తన ఎంబ్లెంగా స్వీకరించింది.

క్రమశిక్షణాయుతంగా ఒక కవి సమ్మేళనం జరిగింది. మహోద్రేకపూరితంగా నాజర్ బుర్రకథ సాగింది.

1970లో, ఆ విరసం సభల్లో మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం పట్ల నాకున్న విశ్వాసం మరింత పటిష్టమయింది. ఈ విశ్వాసం ఒక్క సాహిత్యాన్నే కాదు, మానవ జీవితపు సకల వ్యాసంగాలనీ సరియైన మార్గంలో నడిపిస్తుంది.

ఈనాటి ఋషిత్రయం మార్క్స్, లెనిన్, మావో!

*స్వాతి నవంబరు 1979*

# రాక్షసరాత్రులు

ఒకటి

ఒకానొక రాత్రి దీన్ని "ఉమ్మయ్యతో గుంటూరు రాత్రి" అనిగాని, "గుంటూరులో ఉమ్మయ్యరాత్రి " అని గాని, "ఉమ్మయ్యా, నేనూ,నాటుసారా" అని గాని, "గడ్డివాముకి మంట పెట్టి, ఉమ్మయ్య నన్నందులో"అని గాని లేదా టూకీగా "హోమో-హోమం" అని గాని అనవచ్చు. ఏమీ అనకుండానే రాయనూవచ్చు. ఉమ్మయ్యంటే శిష్టా ఉమామహేశ![1] అతనే ఉమామహేశ్వర వినాయకం, క్షమాపరాత్పర కృపాకరం, దయారసార్ణవ దవానలం (ఇందులో మొదటిదే అతను పెట్టుకున్న పేరు. మిగిలినవన్నీ ఆ బాణీలో నా సొంత కల్పన) అప్పటికే శివశంకరశాస్త్రి, విశ్వనాథల ఉపోద్ఘాతాలతో అతని "విష్ణుధనువు" అచ్చయి వచ్చేసింది. "నవమి చిలుక" కూడా వెలువడిందనుకొంటాను. అప్పటికింకా నా"మహాప్రస్థానం" గీతాలు పత్రికల్లోనే నిద్రపోతున్నాయని జ్ఞాపకం కవుల వలయాల్లో మాత్రం కల్లోలం పుట్టిస్తూనే ఉన్నాయి. అది వేరే కథ. ఏదో రైల్వే స్టేషన్‌లో జలసూత్రం హరీంద్రనాథ చటోపాధ్యాయను కలుసుకున్నప్పుడు "హరీన్ చట్టో, గిరాంమూర్తీ!" ఇత్యాది నా"ఇటీవలి మాఇన్స్పిరేషన్" గేయపాదాలను తను రాసినవంటూ చదివి వినిపించాడట. ఆమాట నాతో రుక్కాయి స్వయంగా, సగర్వంగా చెప్పేడు. "ఇవినేనే రాశాననిపించేటంత బాగున్నా"యని సమర్థించుకున్నాడు. మద్రాసులో నారాయణబాబు తరచుగా హరీన్‌చట్టోని కలుసుకుంటూ ఉండేవాడు. నన్నతనికి పరిచయం చేస్తాననేవాడు. ఎప్పుడు నేనడిగినా అదుగో,ఇదిగో అనేవాడు. ఆఖరికి ముద్దుకృష్ణద్వారా పరిచయం అయినట్టు జ్ఞాపకం.తేదీ జ్ఞాపకం లేదు. నారాయణబాబు మనస్తత్వంలో మరోవిచిత్రం ఉంది. ఏదైనా కొత్తపుస్తకం నేనిస్తే చదివేవాడు. తాను చదివే కొత్త పుస్తకం నాకిచ్చేవాడుకాదు. "శ్రీశ్రీ బెర్గ్‌సన్‌ని చదవలేదు" అని చెప్పుకోవడం కోసం. ఇప్పటికీ నేను బెర్గ్‌సన్‌ని చదవలేదు. అది మరోకథ. నాకో ఫ్రెండు ఉండేవాడు. ఇద్దరం కలిసి ఒక ముండదగ్గరికి వెళ్ళేవాళ్లం (నాఖర్చుతో). వాడో పనిమనిషిని పట్టేడు. నావాటా అడిగేను. "ఆ అమ్మాయిని నేను ప్రేమించాను. పెళ్ళిచేసుకోబోతున్నాను. దాన్ని కోరడం నీకు న్యాయమేనా?" అన్నాడు. ఔను,న్యాయం కాదన్నాను. అలాగే అతను చాలామందిని ప్రేమించాడు, ఎవరినీ పెళ్ళాడలేదు. నాకుమాత్రం వాటా లేదు. న్యాయానికి కట్టుబడి ఊరుకునేవాణ్ణి.

1 శిష్టా ఉమామహేశ్వరరావుగారు విష్ణుధనువు, నవమి చిలుక ఖండకావ్యాలు రాశారు. సిపాయి కథలు కూడా వెలువడ్డాయి. ఆధునిక కవి అనిపించేలా నూతనత్వం అన్వేషించాడు. చక్కటి ప్రయోగాలుచేశాడు.

ఇక ''విషౌ విషామృత మశూచికం'' దగ్గరికి వద్దాం. ఆ రోజుల్లో అతను ''కాళింగి'' అనే మహాకావ్యం రాస్తున్నానని చెప్పేవాడు. అందులో యుద్ధాలన్నిటినీ ముగించే యుద్ధంలాగ, కవిత్వాన్ని ముగించే కవిత్వం ఉందని మా నమ్మకం. కళ, ఇంగితం కలిపి''కాళింగి'' అనే సమాసం చేశాడట. ఇది ఎలా సాధ్యమో నాకు బోధపడలేదు. నీకు బోధపడదులే అన్నాడు. బాధపడ్డాను, జేమ్సుజాయిస్‌ని ఎందుకు చదివేనా అని! జాయిస్‌లో నానా భాషాపద సముచ్చయాలు కోకొల్లలు. కాని అవి పరిశోధన ద్రావకంలో పరిశీలనకు లొంగుతాయి. ''కాళింగి'' మీద పరిశోధన అనవసరం! నళిని గెస్టుగా నేను గుంటూరు వెళ్ళేను. అతని దగ్గర స్కాచి విస్కీ ఉంది. అది వదులుకొని నాటు సరుకు ఆహ్వానాన్ని అంగీకరించాను.

నాటు సారా విషయంలో నాకు దేశభక్తిలేదు. మనకల్లు, మనసారా అనే వెధవల్ని తంతాను. కనీసం ఇందులోనైనా నాది అంతర్జాతీయ దృక్పథం. అసలైన తెలుగువాడికి సిసలైన పొరుగింటి పుల్లకూర నచ్చుతుంది. అందుకే నేను రూపాయికి నూరుపైసల తెలుగువాణ్ణి. ఆ రాత్రంతా అయ్యో నేను స్కాచికి దూరం అయిపోయానే అని బాధపడుతూ ఉన్నాను.
మళ్ళీ మన ''కళాపరాయణ పలాయనం'' దగ్గరికి వద్దాం. ఉమ్మయ్య ఆజానుబాహుడు. నన్ను తనముందు నిలబెట్టి ఒకే ఒక ప్రశ్న వేశాడు. ఇవాళ తెలుగుదేశంలో నిన్ను కమ్యూనిస్టు పార్టీవాళ్ళు మహాకవి అంటూ దుమారం రేగిస్తున్నారు. నిజమైన మహాకవిని నేను! ఇది నువ్వు ఒప్పుకుంటావా, లేదా అని నిలదీసి అడిగేడు.

''నేను ఒప్పుకున్నాననుకో! నీకేం ఒరిగింది? లోకం ఒప్పుకోవద్దా?'' అన్నాన్నేను. అతనిలో కరడుకట్టిన కమ్యూనిస్టు వ్యతిరేకత ఉంది. అదోసుపీరియారిటీ కాంప్లెక్సు. అది వున్నచోట ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు కూడా వుంటుందని మనస్తత్వవేత్తలంతా ఒప్పుకున్నదే. ఉమ్మయ్య నాముందు ఎంతగా సుపీరియారిటీ( నేనే గొప్ప వాణ్ణనే) ఫోజులు కొడుతున్నా అంతరంతరాల్లో మాత్రం తన దౌర్బల్యానికి తానే కుంగిపోతూండడం నేను పసికట్టేను.

అక్కడే వుంది కమ్యూనిస్టు వ్యతిరేకతలోని కిటుకంతా! సాటివాణ్ణి నీతో సమానుడుగా అంగీకరించలేవు! ఉమ్మయ్య కవే! నేనూ కవినే! నీకంటె నేను గొప్పవాణ్ణని నేనెప్పుడూ వూరేగలేదు. తనకంటే నేను తక్కువ కవినని నాచేత ఒప్పించాలనే శిష్టాతాప్రయత్నం ససేమిరా నేనొప్పుకోనన్నాను.

అప్పుడో ముగ్గురు కుర్రాళ్లు వచ్చారు. 14,15 ఏళ్ళ వయస్సువాళ్ళు. ఉమ్మయ్య హోమో అని అప్పటిదాకా నాకు తెలియదు. కాళ్ళు పట్టించుకోవడానికో ఎందుకో పిలిపించాడనుకున్నాను. కాదు ఏకలింగ సంభోగంలోని ఔన్నత్యం గురించి నాకో లెక్చర్ ఇచ్చాడు శిష్టా. షేక్స్పియరు, మిచిలేంజిలో, ఆస్కార్ వైల్డ్ అంటూ ఏకరువు పెట్టాడు. వీళ్ళంతా గొప్పవాళ్లు కావడానికి వీరిలో ఉన్న ఏకలింగ ప్రియత్వమే అని నన్ను నమ్మించడానికి ప్రయత్నించాడు. వైల్డ్ మాటేమోకాని షేక్స్పియర్ హోమో అని నేను

అంగీకరించలేదు. ఇలా వాదోపవాదాలు పెరిగేయి. శిష్ట్లా నన్ను అమాంతంగా ఎత్తుకొని గిర్రున తిప్పడం మొదలు పెట్టేడు. ఆరడుగుల మనిషేమో, నేను ఆకాశంలో రంగులరాట్నం మీద తిరుగుతున్నట్లు అనిపించింది. ఎదురుగుండా ఒక గడ్డివామును భావించుకొని, తన "ఊహల్లోనే" దానికి నిప్పంటించి అందులో నన్ను పడేశాడు. అక్కడే నన్ను వదిలేసి కుర్రాళ్ళను వెంటపెట్టుకొని ఇంట్లోకి వెళ్లిపోయాడు. తాను నాకంటె గొప్ప కవినని నాచేత అనిపించలేక పోయినందుకు నన్ను గాలిలో తిప్పి గడ్డివాములో తగలేశాననుకున్నాడు.

ప్రజాతంత్ర 4–5–1975

## రెండు

రాక్షస ఉగాది రాత్రి మేము బొలారం లాకప్‌లో ఉన్నప్పుడు చెరబండరాజు నన్నడిగేడు "ఇదేనా మీ మొదటి జైలు అనుభవం?" అని. "కాదు రెండోసారి లాకప్" అన్నాను. జైలు అనుభవం ఇంతవరకు నాకు లేనేలేదు, భారతదేశం అనే పెద్ద జైలులో బతుకుతూన్న అనుభవం తప్ప! లాకప్ విషయం తర్వాత రాస్తాను.

నా మొదటి జైలు అనుభవం నూలువాసిలో తప్పిపోయింది. అవి ఉప్పుసత్యాగ్రహం రోజులు. విశాఖపట్టణంలోని కాంగ్రెసు ముఖ్యులంతా చెరసాలల్లోకి వెళ్ళిపోయారు. సత్యాగ్రహులకు కరువు ఏర్పడింది. ఏమయినా ఉద్యమం ఆగిపోకూడదు. ప్రతిదినం కనీసం ఒకడైనా అరెస్టు కావలసిందే, "వ్యక్తినియంతృత్వం" అంటూ! ఇది గాంధీగారి ఆదేశం. ఆరోజుల్లో నేనో నిరుద్యోగ పట్టభద్రుణ్ణి!రోజు గడవడం కష్టంగా ఉండేది. ఇద్దరు గుడ్డలు ధరిస్తూ ఉండేవాణ్ణి, చవక కాబట్టి! ఒకరోజు తెన్నేటి విశ్వనాథం తమ్ముడు నాదగ్గరకు వచ్చాడు. "ఈ వెధవ దరిద్రం అనుభవించకపోతే, చక్కగా ఒక జాతీయ పతాకం పట్టుకొని సత్యాగ్రహం చెయ్యకూడదా? దేశంకోసం త్యాగం చేసినట్టూ ఉంటుంది; నీ తిండి సమస్యకూడా తీరిపోతుంది అనే అర్థం వచ్చే మాటలన్నాడు. "సరే అలాగే" అనే మాటలు నా నోటిదాకా వచ్చి ఆగిపోయాయి. నేను ఆలోచనలోపడ్డాను. ఆఖరికి అంగీకరించలేదు. ఆనాడు జైల్లోకి వెళ్లివుంటే ఈనాడు రాజకీయ బాధితుడుగా ఎన్నో సదుపాయాలు పొంది ఉండేవాణ్ణేమో! కాని అలా జరగలేదు. ఎందువల్ల? కాంగ్రెస్ అంటే అంతరాంతరాల్లో అప్పటికే నాలో ఒక అసహ్యం ఏర్పడివుండడంవల్లనా?? నాలాంటి గొప్ప సాహితీపరుడు క్షుద్ర రాజకీయాల్లో తలదూర్చకూడదనే అహంభావమా? అన్నిటినీ మించి, బానిసతనంలో బతుకుతున్నా, బయటి ప్రపంచంలో ధారాళంగా ఊపిరి తీసుకుంటూ తిరగాలి కాని కటకటాల వెనుక నిర్బంధంలో క్రుంగిపోకూడదనే స్వేచ్ఛాప్రియత్వమా? బహుశా ఈ ఆఖరిదే ముఖ్యకారణం అనుకుంటాను. ఎంచేతనగా రెండో ప్రపంచయుద్ధకాలంలో ఏడు నెలలపాటు లక్నోస్కంధావారంలో మిలిటరీ జీవితం గడిపేను. అదే ఏడు నెలల జైలు శిక్ష అని ఇప్పటికీ నాకనిపిస్తుంది.సంకెళ్ళు వెయ్యడం లేదుగాని రాత్రి ఎనిమిది గంటలు దాటితే

మేం ఎవళ్లమూ బైటకి వెళ్ళడానికి వీల్లేదు. ఇంతకన్నా నిర్బంధం ఇంకేముంటుంది.

ఇక్కడ "కథావీధి" పత్రిక (1946 నవంబరు)లో అచ్చయిన నా "అనంతం"(2) సహజంగా స్థలం చేసుకుంటుంది. అందులోనే నాస్వీయ చరిత్రలో "రాక్షస రాత్రులు" అనే ఒక ప్రత్యేక విభాగం ఉండాలని మొదటిసారిగా నిశ్చయించాను.

*My retrospective horrors* ఉండనిద్దూ! *One Title is as good as another* గతించిన వాస్తవికతను నెమరువేసుకొని కాగితం మీద ధూపం వెయ్యడంలో ఏ పద్ధతి అవలంబించడం? ఎక్కడ ప్రారంభించడం? మాటవరసకి, ఢిల్లీలో చలికాలంలో ప్రారంభించి లక్నోలో వేసవికాలందాకా ఈడ్చుకొస్తే? సరే తథాస్తు.

"చలికాలం శాఖోపశాఖలతో శవంవలె కఠినాతి కఠినం" ఢిల్లీలో మరీను. కావలిస్తే కాశీపతినీ, రామగోపాలామాత్యుణ్ణి మరికొందరు నర్మసచివుల్నీ అడగవచ్చు, పెంగ్విన్‌లాంటి పేరాజు నాకు సాక్ష్యం.

స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం జరుగుతున్న రోజులు. రాయిటర్ వార్తల్ని తెనిగించి రేడియోలో ఊదుతున్నాను. అంతా అదేదో అపనమ్మకంగా ఉంది. (ఇది నా విషయం. యుద్ధవార్తలను గురించి వ్యాఖ్యానం అనుకోవద్దు)ఇక్కడ నేను ఎంతోకాలం ఉండనని ఎప్పటికప్పుడే నాకు జ్ఞాపకం వస్తోంది. ఇప్పటికీ వాటి చుట్టుకొలతలు, పరిభ్రమణాలు తెలుసుకోవడానికి తగ్గ భోగట్టా నాకు దొరకలేదు. చలి ఒక్కటే నాకు తెలిసిన తక్షణ యథార్థం.

"లాభంలేదు-గాంధీజీ మనకు దక్కడు"అని సర్ తేజ్ బహద్దరు సప్రూ చెప్పిన రోజున నేను రేడియోలోంచి నిష్క్రమించాను. అప్పటినుంచి నేను కాఫ్కా[1]నవలలోని పాత్రనై బతకడం ప్రారంభించాను.

1943 ప్రవేశించింది- నేను చెన్నపట్నంలో ప్రవేశించాను. ఉపయోగకరమైన భోగట్టా ఏదీ తీసుకు వెళ్ళలేదు గాని, ఎవరిదగ్గరో చెప్పనక్కరలేని ఏదో అనారోగ్యాన్ని మళ్ళీ ఢిల్లీకి పట్టుకు వెళ్లాను. కొన్నాళ్ళపాటు నేనొక *Text Book of Pathology* ని.

నాటి నా ప్రధానరోగం మలేరియా. సల్ఫాడగ్గులతో బాటు మేపా మాత్రలు చాలా మేశాను. మలేరియాతో నాపోరాటం మైన్ కాంఫ్‌ని[2] మించిపోయింది. బ్లిట్స్‌క్రీగ్‌కి[3] మరో

1 ఫ్రాంక్ కాఫ్కా (1883–1924) జకోస్లొవెకియాలో పుట్టిపెరిగి జర్మన్ భాషలో నవలలు రాశాడు. అతని జీవిత కాలంలో ఏడునవలలు, చనిపోయినాక నాలుగు నవలలు అచ్చయ్యాయి. ***The Trial, The castle, America***అనే మూడు నవలల్లోనూ ***K*** అనే కుర్రవాడి పాత్రవుంది. ఆ కుర్రవాడిని అరెస్టు చేస్తారు. ఏమిటి తప్పుచేశాడో తెలియదు. ఎప్పుడు విచారణ చేస్తారో తెలియదు.

2 ***MEIN KAMPF***అంటే నా పోరాటం. నాజీ పార్టీ నాయకుడు హిట్లర్ సగం జైలు(1924)లోనూ, సగం బయటా(1925) రాసిన పుస్తకం.

3 ***BLITZ-KRIEG***అంటే మెరుపుదాడి. రెండో ప్రపంచ యుద్ధకాలంలో నాజీ హిట్లర్ అవలంబించిన యుద్ధ వ్యూహం. ఒక నగరం జయించడానికి ఎంత సైన్యం, ఎన్ని టాంకులు, ఎన్ని మారణాయుధాలు కావాలో అంతకన్నా ఎక్కువ వాడి ఆ నగరాన్ని ధ్వంసం చేసుకోవడమే ఈ వ్యూహం. ఈ వ్యూహంలో అఫెన్సుతప్ప డిఫెన్సులేదు.

పర్యాయపదం మలేరియా. అప్పుడు వేసే చలి అదో అనుభవం. ఎముకల మూలుగులోంచి పొడుచుకొస్తుంది. కుండలినీ నాడిచేత పాడిస్తుంది భైరవి.

మలేరియా నన్ను ఢిల్లీనుంచి అలహాబాదు, అలహాబాదునుంచి కలకత్తా, కలకత్తానుంచి విజయనగరం, విజయనగరం నుంచి విశాఖపట్టణం, విశాఖపట్టణం నుంచి లక్నోదాకా వెంటాడింది. లక్నో మిలటరీ హాస్పిటల్‌లో దానికి అంత్యక్రియలు జరిగాయనుకున్నాను. కాని ఏడాది తర్వాత మద్రాసులో ప్రత్యక్షమయింది. దరిమిలాను మేము యుద్ధ విరామసంధి చేసుకున్నాము. అల్లోపతితో నా స్నేహం బలపడ్డకొద్దీ మలేరియా నాజోలికి రావడం మానేసింది. ప్రతి మేఘానికీ ఒక వెండి అంచు ఉంటుంది కదూ!

రైలుబండిలో కలకత్తానించి విజయనగరం వస్తున్నాను. శరీరంలో బాగులేదు.మనస్సులో అంతకన్నా బాగులేదు. త్వరలోనే నారైలు బండి యింకో రైలును ఢీకొంటుందని భయం! కాదు ఆశ, కాదు అనుమానం, కాదు నిశ్చయం! వెళ్లవలసిన వైపు వెళ్ళలేదేమో అని భ్రమ, కాదు సమ్మోహం. ఎటు వెళ్ళినా ఒకటే అని ధీమా. అది నా రాక్షసరాత్రి. నేను పోయింది నిద్రకాదు. కొన్ని జన్మలను సరిపోయిన నరకజ్వాలలు పోగు చేసుకున్నాను. వాటిని మళ్లీ నెమరువేసుకుంటానని నాకు తెలుసు. కాని ఇప్పుడు సరిగా ఆ అనుభవం ఇక్కడ అక్షరాలలోకి తర్జుమా చెయ్యలేక పోతున్నాను. మళ్ళీ ప్రయత్నించవలసి ఉంటుందనుకుంటాను. నాకు మాటలు దొరక్కుండా ఉన్నాయి.

నలభైమంది ఉండవలసిన మూడో తరగతి పెట్టెలో వందమంది ఉన్నారో లక్షమందే ఉన్నారో, నేను మాత్రం అందరిమధ్యా ఒంటరిని. నిద్రపోతున్నానని స్థూలదృష్టికి స్ఫురించవచ్చు . కాని అది నిద్రకాదని నాకు తెలుసు. చీకటిని చీల్చుకుంటూ రైలు బండి తీవ్రవేగంతో వెళ్లిపోతోంది. సరిగ్గా అదే వేగంతో అటు నుంచి ఇంకోబండి వస్తున్నట్టుగా అనుమానం, కాదు భయం,కాదు ఆశ. ఇప్పటికీ నాకు నిశ్చయంగా తెలియదు.ఆ రాత్రి మా రైలు యింకో రైలును ఢీకొన్నదనే నా భ్రమ-లేదా నిశ్చయం.

ఆ రాత్రి రైళ్ళు ఢీకొన్నాయని, నేను చనిపోయానని వ్రాస్తే అబద్ధం అంటుంది ప్రపంచం. కాని ఇప్పటికే నాకు నిశ్చయంగా తెలియదు అది నిజమో అబద్ధమో.ఆ రాత్రి నేను బహుశా చచ్చిపోయేఉంటాను. చాలా రైలుపెట్టెలు పడిపోయాయి. చాలా చక్రాలు నడిచిపోయాయి-భౌతికంగా కాకపోతేనేం ఆధ్యాత్మికంగా, శాశ్వతంగా కాకపోతేనేం క్షణమాత్రం చచ్చిపోయాను నేను. ఒక పెద్ద కేకవేసి ఈ సత్యాన్ని ఆ చీకటిలో ప్రపంచం అంతటికీ ప్రకటించాను.

నాజీవితంలో ఇటువంటి రాక్షసరాత్రులు చాలా గడిచాయి. వాటికోసం ఒక ప్రకరణాన్ని ప్రత్యేకిస్తాను. ఆఖరికి తేలే సారంశం ఇది! మనఊహలోంచి రాత్రిని రద్దుచేసుకోవాలి.

విజయనగరానికి విశాఖపట్టణానికి మధ్య కొన్ని నెలల దూరం వుంది. దాని పేరు డోలాందోళన. ఢిల్లీనుంచి బయల్దేరడానికి ముందే ఒక మిలటరీ డాక్టరు మిత్రుడు నన్ను

ఆర్మీలోకి రిక్రూట్ చేశాడు. మళ్లీ కొన్ని నెలల దాకా జవాబులేదు. మరుక్షణం ఏం చేస్తానో నాకే తెలియని స్థితిలో వున్నాను. ఆత్మహత్య చేసుకోవాలని సరదాగా అనిపించుతూ ఉండేది. కాని ఆ దశ దాటిపోయానని నాకు తెలుసు. అయినా అప్పుడప్పుడు ఆత్మహత్య గురించి సీరియస్‌గా ఆలోచించేవాడిని. ఆలోచన మాత్రమే, ఆచరణకాదు.

ఆత్మహత్య! అది వేరే కథ. దీని కోసం కూడ ఒక అధ్యాయం ప్రత్యేకిస్తాను. ప్రస్తుతం మట్టుకు నేను చెప్పదలచుకున్నదేమిటంటే! ఆత్మహత్య చేసుకోవడపు అనేక పద్ధతులలో ఆత్మ చరిత్ర రాసుకోవడం ఒకటి.

డాక్టరు మిత్రుడి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. ఢిల్లీ వెళ్లాను.నువ్వు లక్నోలో ట్రెయినింగ్‌కి వెళ్ళవలసి ఉంటుందన్నాడు. తొందరలేదు. ఒకవారంరోజులు పోయిన తర్వాత వెళ్ళవచ్చునన్నాడు.

లక్నో! మిలటరీ జీవితం ప్రారంభం. డేరాలో బతుకు.ఎండలు. హఠాత్తుగా ఒక మధ్యాహ్నం మళ్ళీ మలేరియా! ఆ యెండకి నా డేరా ఒక పొయ్యి. ఇద్దరు స్నేహితులు నన్ను మిలటరీ *ambulance* మీద ఆసుపత్రిలో చేర్చారు. రాత్రంతా *Observation ward* లో పీచుపరుపుమీద తిండిలేకుండా గడిపాను తెల్లారేసరికి జ్వరం పోయింది. కళ్ళు మూసుకుని ఏమిటో ఆలోచిస్తున్నాను.

"నా జానె కిదర్ ఆజ్ మేరీ నావ్ చలీరే"[4] అనే పాట ఎవరో పాడుతున్నారు.

లేదా, అప్పటికింకా ఆకాశవాణి కాని ఆలిండియా రేడియోకాబోలు! ఈమధ్య 'భూమికోసం'లో నటించడానికి వచ్చిన అశోక్ కుమార్‌తో ఈ మాటే అన్నాను. అలా అప్పుడప్పుడు,అక్కడక్కడ విన్నపాటలు, చదివిన మాటలు, గడిపిన క్షణాలు ఇవన్నీ నా సాహిత్య జీవితానికి పరిపుష్టి నిచ్చాయనే నా నమ్మకం.

*కథావీథి, 1946 నవంబరు*
*పునర్ముద్రణ: శ్రీశ్రీ సాహిత్యం రెండు వచన విభాగం*
*ప్రజాతంత్ర 11–5–1975*

## మూడు

ఇప్పుడు నా మొదటి లాకప్ సంగతి. అది 1950వ సంవత్సరం. పదిసంవత్సరాలపాటు నా "మహాప్రస్థానా"నికి ప్రచురణకర్త దొరకక దొరకక ఎట్టకేలకు ఒక మిత్రుని ధనసహాయంతో నా గీతాలు గ్రంథరూపం ధరించాయి. 1940లోనే చలంగారి దగ్గరనుంచి రుక్మిణీనాథశాస్త్రి ఉపోద్ఘాతం రాయించి తెచ్చాడు. (దానికి "యోగ్యతా పత్రం"అనే శీర్షిక నేను పెట్టింది). అంతకు ముందు కొంపెల్ల జనార్దనరావు చనిపోవడమూ, అతని కోసం అంకితం గీతం రాయడమూ జరిగిపోయాయి. ఆచారప్పన్ వీధిలోని బి.యన్.కె. ప్రెస్‌లో

4 నాజానె కిదర్ ఆజ్ మేరీ నావ్ చలీరే (ఈరోజు నానావ ఎటు పోతుందో తెలీదు) పాట ఝూలా(ఉయ్యాల) అనే హిందీ సినిమాలో హీరో అశోక్ కుమార్ పాడాడు. ఇందులో హీరోయిన్ లీలా చిట్నిస్. ఈ సినిమా 1941లో విడుదలయింది.

ఒకటికి పదిసార్లు దిద్దిన ప్రూఫులే మళ్ళీ దిద్దుతూ ఒక్క అచ్చు తప్పయినా లేని తెలుగు పుస్తకాన్ని వెలువరించడానికి ఎంతగానో తహ తహ పడ్డాను. అయినా ఒక్క చిన్నతప్పు మాత్రం దొర్లిపోయింది. విషయామృతమణికలో "స్త్రీప్ టీజ్ కవిత" అన్న చోట ర్స్లో నకారపుపొల్లు ఎగిరిపోయింది. ప్రూఫులో ఇది సరిగానే ఉంది. మెషిన్ మీదకి ఎక్కించే సమయంలో జారిపోయి ఉంటుంది. అచ్చయిపోయాక నేను చాలా నొచ్చుకున్నాను. మూడువేల కాపీలలో ఈ చిన్న తప్పును సిరాతో సవరించడమా? సవరించినా అచ్చుతప్పు అచ్చు తప్పే! మరి చేసేదేమీ లేక ఊరుకున్నాను.

"మహాప్రస్థానం" వెలుగు చూడడానికి ధనసహాయం చేసిన నళినీకుమార్‌తో కలిసి "వసంత్ విహార్" హోటల్లో రాత్రి 10,11 గంటల దాకా మద్యం సేవించాను. తర్వాత ఇద్దరం కలిసి టాక్సీలో బయల్దేరాము. నాదగ్గర రెండు కాలుసీసాల ఫ్రెంచి బ్రాందీ, 75 రూపాయల నగదూ ఉన్నాయి. ఒకటి రెండు వేడి వేడి మహాప్రస్థానం మొదటి ముద్రణ కాపీలు కూడా ఉన్నాయేమో? (లేక వాటిని ఆ మధ్యాహ్నం ఇంటి వద్ద వదిలేసి ఉండవచ్చును. అప్పట్లో నా చిరునామా నం.10 అరుణగిరి ముదలి వీధి, మందవెళ్ళి) మద్రాసురాష్ట్రం అంతటా అప్పుడు మద్యనిషేధం చట్టం అమలులో ఉంది. ఈ చట్టం ప్రకారమే నన్ను పోలీసులు పట్టుకున్నారు.

టాక్సీ మెరీనా బీచి మీద జోరుగా పోతోంది. గాలి హోరుతో కలిసి జోరుగా గీతాలు దంచేస్తున్నాను. అప్పుడప్పుడే నేను దారిద్ర్యంలోనుంచి మళ్ళీ ఐశ్వర్యంలోకి అడుగుపెడు తున్నాను. హెచ్.యం.రెడ్డి గారి చలనచిత్ర ఆస్థానంలో ప్రవేశం దొరికింది. ఆయన తెలుగులో "నిర్దోషి", అరవంలో "నిరపరాధి" తీస్తున్న చివరిరోజులు. కాబట్టి "నిర్దోషి" లో ఒకటి రెండు పాటలూ, నాలుగయిదు సీనులూ మాత్రమే రాశాను. అంతకుముందే "ఆహుతి" (నా మొట్టమొదటి డబ్బింగు చిత్రం) విడుదలై విఫలమయింది. కాని అందులోని పాటలబలమే రెడ్డిగారిని ఆకర్షించింది.

పోలీసులు వెంటబడుతున్నట్టు తెలుసుకునే స్థితిలో నేనుగాని, నళినిగాని లేనే లేము. డ్రైవరు ఏవో హెచ్చరికలు చేస్తూనే ఉన్నాడుగాని ఇద్దరమూ అలక్ష్యం చేశాము. టాక్సీ శాంథోమ్ హైరోడ్డులో ఒక సందులోనికి-నళిని ఆజ్ఞానుసారం మళ్ళింది. ఒక ఆంగ్లో - ఇండియన్ అమ్మాయి ఇంటిముందు ఆగింది. ఇల్లు, అమ్మాయి చాలా ఖరీదయినవే. నన్ను జాగ్రత్తగా మాయింట్లో వదలిపెట్టమని డ్రైవరుతో చెప్పి నళినీ కుమార్ ఆ రాత్రి ప్రేయసి ఇంట్లోకి వెళ్ళిపోయాడు, డ్రైవరు ఏదో అనబోతుంటే వినిపించుకోకుండా!

హైరోడ్డులోకి మళ్ళగానే పోలీసులు అటకాయించారు. సబ్‌ఇన్‌స్పెక్టర్ టాక్సీలో కూర్చుని నా నోరువాసన చూశాడు. రెండు కాలుబాటిల్స్, కరెన్సీ నోట్స్‌తీసుకుని ఒక పోలీసుకిచ్చాడు. నన్ను ఆ టాక్సీలోనే రాయపేట హాస్పటల్‌కి తీసుకువెళ్ళాడు. డాక్టర్ దగ్గర ఒక సర్టిఫికెట్ తీసుకున్నాడు. నేను ఇంటికివెళ్ళి తిండితినాలని గొడవచేస్తే 10, అరుణగిరి ముదలివీధికి తీసుకువెళ్లాడు. నా పుస్తకాలన్నీ తిరగవేశాడు. అవి ఏవీ నీకు బోధపడవులే

అన్నాను. సరిగా తిండితిన్నానో లేదో! మా ఆవిడ ఆందోళనకూడా నేను నోటీసు చేయలేదు.

రాత్రి రెండు, రెండున్నర గంటలసమయానికి మైలాపూర్ పోలీస్‌స్టేషన్‌లో ఒక చిన్న లాకప్‌గదిలో పడేశారు. పైన తాళం వేస్తుంటే నా స్వాతంత్ర్యం నాశనమైనట్లు తెలిసింది.

ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. మూడు, నాలుగు గంటలమధ్య మళ్లీ తలుపు తెరుచుకుంది. మరెందుకోకాదు. ఇద్దరు తాగుబోతు కుర్రాళ్ళను లోపల తోసేయడానికి. అందులో ఒకడు ఇన్‌ఫర్మేషన్ కుడుతుట్టా (ఇచ్చేశాడు)అని ఏడుస్తున్నాడు. తలుపు మళ్లీ మూసుకుని తాళంపడింది.

తెల్లారగట్ల 5.30 లేక 6 గంటలకు మా ఆవిడ, నళిని, ఒక పెద్ద పోలీసు ఆఫీసరు వచ్చి నన్నుచూశారు. 11 గంటలకు మేజిస్ట్రేటు కోర్టుకు నన్ను పంపిస్తానని పోలీసు ఉద్యోగితో చెప్పి నన్ను, మా ఆవిడని తానే మా ఇంట వదలిపెట్టి నళినీకుమార్ వెళ్ళిపోయాడు "*It's nothing.* ఫైన్‌మాత్రం వేస్తారు. చెల్లించేయ్"అన్నాడు నాకు కొంచెం డబ్బు ఇస్తూ!

పోలీసులందరూ నళినీకుమార్ చెప్పుచేతల్లో వున్నట్టే అనిపించింది. "ఏ ఊరువెళ్ళినా అక్కడ పెద్ద పోలీసుని ఆకట్టుకోవా" అనేది నళినీ ఫిలాసఫీలోని మూలసూత్రం.

ఎస్.ఐ. పెద్దశిక్ష కోరలేదు. *It is just an accidental catch* అన్నాడు. 50 రూపాయలు జరిమానాచెల్లించి బయటపడ్డాను. సీసాలు జప్తుచేశామని చెప్పి 75 రు.లు నాకిచ్చేశాడు. ఆ సాయంత్రం యధాప్రకారం"నిర్దోషి" షూటింగ్‌కు వెళ్లాను.

ఇదీ నామొదటి లాకప్ కథ. కాని దీని ప్రతిధ్వనులు 1961[1]లో ఒక కాకినాడ హోటేల్‌లో నన్ను ఒక కాంగ్రెస్ పెద్దమనిషి కొట్టిన సందర్భంలో కొద్దిగా గురగుర మన్నాయి. చిత్రమేమిటంటే ఫిర్యాదుచేసిన నన్ను 4 రోజులు 4 సార్లు పోలీసుస్టేషన్‌కు పిలిపించారు. నిందితుడు పోలీసుల నెత్తెక్కి కూచున్నాడు. నన్ను తాను కొట్టనే లేదట. నేను ఇది వరకే పోలీసుచిట్టాలోనికి ఎక్కినవాడినట. సత్యమూ, అహింసాఅంటూ నిత్యమూ జపించే ఈ కొత్త కాంగ్రెస్ పూజారి ఒక మాజీ కమ్యూనిస్టు. కమ్యూనిజానికి మాజీ కమ్యూనిస్టులే మొదటిశత్రువులనే నా అభిప్రాయానికిది ఇంకో మంచి ఉదాహరణ.

అసలు జరిగిందేమిటంటే ఆ క్రితం రోజు నేను, ఒక లాయరుమిత్రుడు తగుమాత్రం మద్యం సేవించి నంబరుప్లేటులేని ఒకజీపులో కూర్చుని భోజనం ఆర్డరు చేశాము నా హోటేల్ ముందు. నా రూంకు పక్కనే ఒక బి.డి.వో. గారున్నారు. వారిది ఆ జీపు. సరికొత్తగా చట్టవిరుద్ధంగా అప్పుడే హైదరాబాద్‌నుంచి వచ్చింది. న్యాయశాస్త్రం క్షుణ్ణంగా

[1] కాకినాడలో శ్రీశ్రీ పైన అత్యాచారం 1961 డిసెంబరులో జరిగింది. లాయరు మిత్రుడి పేరు యం.వి. శాస్త్రిగారు. కృష్ణశాస్త్రి పాలగుమ్మిపద్మరాజు మొదలైన కవులకు, రచయితలకు సన్నిహితుడు. స్వతంత్ర పార్టీ ఎం.ఎల్.సిగా కొన్నాళ్ళున్నాడు. శ్రీశ్రీ పైన అత్యాచారం జరిగిందని హైదరాబాదు ఫోన్‌చేస్తే "శ్రీశ్రీ ఎవరు" అన్నాట్ట ఆనాటి మనరాష్ట్ర హోంమంత్రి కాసుబ్రహ్మానందరెడ్డిగారు. ఎం.వి.శాస్త్రి తక్కున ఫోన్ పెట్టేశారు.

తెలిసిన నా లాయరుమిత్రుడు ఆ జీపుకు తగుమాత్రం హాని కలిగించాడు.

ఆ కోపం మనస్సులోపెట్టుకుని తానే ప్రభుత్వం అనుకునే లాగుడు భ్రమలోపడ్డ మాజీ కమ్యూనిస్టు నేనే లాయరుననుకొని నన్నుకొట్టాడు(నాకూ లాయరుకూ ఒకే రకమైన కళ్ళజోళ్ళు). బాపన బంజాకొడకా అని నన్ను తిట్టాడు. సంతత్వం సాంప్రదాయాలనే ఈ కాంగ్రెస్‌వాది ప్రక్కనే పది, పన్నెండుగురు ఉన్నారు. అందులో ఒక మఫ్టీ సబ్‌ఇన్‌స్పెక్టర్ కూడా ఉన్నట్టు తర్వాత నాకుతెలిసింది. ఇప్పుడునిన్ను చంపేస్తే నీకు దిక్కెవ్వరు? అన్నాడు ఆ సంతం వాళ్ళ చిన్నోడు. నీకు ఒంటిమీద స్మారకంవుందా? ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? అని అడిగాను. ఇంతలో ఇద్దరు, ముగ్గురు నన్ను గుర్తించారు. బలవంతంగా నన్ను గదిలోకి త్రోసి తలుపుగడియవేసి వెళ్ళిపోయారు.

నేను ఏమీ పట్టించుకోకుండా నిద్రపోయాను. పెద్ద దెబ్బ ఏదీ తగలలేదునాకు. తోపుడికి ఏదో తగిలి కొద్దిగా నెత్తురువచ్చింది. మర్నాడు నెత్తురుమరకలున్న నాషర్టుతో నా లాయరుమిత్రుడు పెద్ద హంగామా లేవదీశాడు. నాచేత పోలీసురిపోర్టు ఇప్పించాడు.

అన్నట్లు ఇక్కడ ఇంకోముఖ్యమైన సంగతి. నేను నిద్రపోయిన కొంతసేపటికి తలుపు తెరుచుకొని ఒకతను గదిలోకివచ్చాడు. ఆకబురూ ఈ కబురూ చెప్పి"ఈవేళ మీరు డ్రింకు ఏమీ తీసుకున్నట్లు లేదు. కిందని పెద్దపార్టీ జరుగుతోంది రండి. మీరెవరో మాకు తెలుసు. మీరంటే మాకందరికీ ఎంతో గౌరవం!"అంటూ ఆహ్వానించాడు. నాకేమీ వద్దనిచెప్పి అతనిని సాగనంపి తలుపువేసుకున్నాను. మర్నాడుచూస్తే నారిస్టువాచీ, రష్యన్ కెమేరా టేబుల్‌మీద లేవు. జీపుచెడిపోయిన కక్షకొద్దీ ఈ దొంగతనం చేయించి కెమేరా లెన్స్‌ను గీకివేసి, దాన్నీ, వాచీని నీళ్ళల్లోకి గిరాటువేయడం జరిగింది. దరిమిలాను చోరీ అయిన వస్తువులను నాకు ఇచ్చివేస్తే ఫిర్యాదు ఉపసంహరించుకుంటానని నా మిత్రుడు నాచేత ఒక పత్రం రాయించి నన్ను మద్రాసు పంపించివేశాడు. రెండు వస్తువులు ఆ మర్నాడే వచ్చాయి. కానీ వాచీని మాత్రమే మరమ్మత్తు చేయించుకోగలిగాను. రష్యన్ కెమేరాను ఒక కమ్యూనిస్టు మిత్రుడికి ఇచ్చేశాను. ఇప్పుడది విశాలాంధ్రవారి పురావస్తుప్రదర్శనశాలలో వుందనుకుంటాను.

ప్రజాతంత్ర *18–5–1975*

## నాలుగు

"రుధిరోద్గారి సమాఖ్యవత్సర శరత్ ప్రోజ్జాత సత్కార్తికా
భిధ శుక్ల స్థిరవారయుక్తదశమిన్ భీత్యుగ్ర ఝుంఝా"

పద్యం పూర్తిగా జ్ఞాపకంలేదు. తేదీమాత్రం కరెక్టే అనుకుంటాను. విశాఖపట్టణంలో అది తుఫాన్ రాత్రి. అటువంటి గాలివాన అంతకుముందు అరవైయేళ్ళలో ఎప్పుడూ రాలేదని అప్పటి వయోవృద్ధులు చెప్పుకున్నారు.

వేంకటవీరరాజ కవులు రాసిన ''తుఫాన్ అడావుడి'' అనే చిన్నకావ్యం పై పద్యంతో ప్రారంభమవుతుంది. అదో చిన్న పుస్తకంగా అచ్చు అయింది. అవి గ్రంథమాలల రోజులు. వేగుజుక్క గ్రంథమాల, ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల, సరస్వతీ గ్రంథమాల ఇత్యాదులు. తుఫాన్ కావ్యం ఏ గ్రంథమాల పేరుతో వెయ్యడం జరిగిందోకాని ఆ మాలికలో రెండో పుష్పమే నా ''పరిణయ రహస్యము''(అపరాధ పరిశోధక నవలిక). ఈ పుస్తకం ఇప్పుడెక్కడా దొరకదు. దీనికోసం ఎందరో మిత్రులు గాలిస్తున్నారు. దొరుకుతుందనే ఆశలేదు.

రుధిరోద్గారి[1] 1924 అనుకుంటే అప్పుడు నా వయస్సు 14 ఏళ్ళు. నిప్పర్తివారి వీధిలో మా యింటి మేడమీద ఆ రాక్షసరాత్రి గడిచింది. ఎన్నో ఇళ్ళు కూలిపోయాయి. ఊరంతా మొలబంటి- పొట్టివాళ్ళయితే మెడబంటి నీళ్ళు నిండిపోయాయి. ఆ మధ్యాహ్నం మాచినబావ (ఆరుద్ర చిన్నాన్న) టిఫిన్ కారియర్ నెత్తిమీద పెట్టుకొని హోటేలు భోజనం తీసుకొచ్చాడు. ఇంట్లో ఆడవాళ్ళెవ్వరూ లేరు. మా సుభద్రమ్మ(శ్రీరంగం వెంకటరమణయ్యగారి ద్వితీయ భార్య) పురిటికనుకుంటూను పుట్టింటికి వెళ్ళింది.

అప్పటికయిదారు రోజులనుంచీ ప్రచండమైన గాలివాన విజృంభిస్తూనే ఉంది. ఆ రాత్రి గడుస్తుందా, మళ్ళీ తెల్లవారుతుందా, బతికి బయటపడతామా అన్నదే యావద్విశాఖపట్ట ణాన్నీ పీడించిన సమస్య. నేనుమాత్రం నిశ్చింతగా నిద్రపోయాను. ఏకోశానా భయమన్నది లేనేలేదు.(బహుశా ఇందుకు కారణం మా నాన్నగారు వాదగ్గరనే ఉండటంకావచ్చు) భయమనేది ఒక మానసికరోగం. ఎన్నెన్నో జబ్బులు పడ్డానుగానీ భయమనే ఈ జబ్బు మాత్రం నామీద పడడానికి భయపడుతూనే ఉంటుంది.

ఊరుఊరంతా కుప్పకూలిపోయిన రాత్రి అది! ఎన్నోకొంపలు నేలమట్టమైనాయి. ఎందరో జనం చచ్చిపోయారు. ఉన్న రెండేరెండు నాటకశాలలు- రాజరాజేశ్వరీహాలు, జగన్మిత్ర హాలూ నామమాత్రావశిష్టమయిపోయాయి. సి.బి.మిషన్ హైస్కూలు లైబ్రరీ గోడలు పడిపోయాయి. నా స్నేహితులు చాలామంది మంచిమంచి పుస్తకాలు సొంతం చేసుకున్నారు. వాళ్ళతో నేనూవెళ్ళాను. చేసేది దొంగతనం అని తెలుసు. అయినా వెళ్ళాను. పుస్తకాలను వెతుకుతూ ఉంటే కాలిలో ఒక మేకు గుచ్చుకుపోయింది. కుంటుకుంటూ ఉత్తచేతుల్తో ఇంటికి మరలి పోయాను.

మా వేణుగాడుమాత్రం ఒక చిన్నసైజు లైబ్రరీ సంపాదించాడు. వీడే వేణూమెమోరియల్ బాడ్మింటన్ టోర్నమెంట్ అని ఒకటి పెట్టాడు. మా కుర్రకారంతా అందులో పాల్గొన్నాం. విశేషం ఏమిటంటే యావద్భారతంలో తొలిసారిగా బాల్‌బాడ్మింటన్ సింగిల్స్ పోటీ నడిపిన ఘనత మా వేణుగాడిదే. వాళ్ళింట్లో అంతకన్న స్థలం లేకపోవడమే ఈ కీర్తికి కారణం అనుకునే వాళ్ళు అనుకోవచ్చు.

''ఒరే వేణూ, బతికున్నవాళ్ళ పేరిట మెమోరియల్ పోటీ ఏమిట్రా'' అంటే అప్పుడు

1 *1923* నవంబరులో పెనుతుఫాను వచ్చింది. తెలుగులెక్క ప్రకారం అది రుధిరోద్గారి.

వాడికి తెలిసింది. గొప్పకోసం ఏదో తనపేరు పెట్టుకున్నాడేగాని మెమోరియల్ అనేది చనిపోయిన వాళ్ళకే వర్తిస్తుందని అంతదాకా వాడికి తెలియదు. తెలివయినవాడు కాబట్టి "మా తాతగారు కూడా వేణుగారే! వారి స్మారకార్థం ఈ పోటీ" అని సమర్థించుకున్నాడు.

టెన్నిస్ బంతితో ఫుట్బాల్ ఆడుతూ ఇరువైపులా ముగ్గురేసి చొప్పున మినీపోటీలు నడిపిన ఘనతకూడా మా బృందావిదే. విశాఖజిల్లా ప్రత్యేకత అక్కడేవుంది. ఇమిటేషన్ కన్నా ఇన్వెన్షన్‌కే ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వడంలో.

జీవితంలోనూ, కవిత్వంలోనూ నాకు ఇమిటేషన్ అంటే ఇష్టంలేదు. ఇన్వెన్షన్ కోసమే ఎప్పుడూ అన్వేషిస్తాను. ఇన్వెన్షన్ కాకున్నా కనీసం ఇన్నోవేషన్ కోసం! శాస్త్రీయదృక్పథం ఉన్నవాళ్ళెవ్వరూ కేవలం ఇమిటేషన్‌తో తృప్తిపడి ఊరుకోలేరు. ఇన్వెన్షన్ కోసమే వాళ్ళ తహతహ, వాళ్ళ తపన.

విశాఖపట్టణపు తుఫాన్‌రాత్రిలో హాలుతలుపులన్నీ బిగించివుండగా హాయిగా నిద్రపోయాను. బయట జోరుగా హోరుగాలి, కుండపోతగా వర్షం. అర్థరాత్రివేళ ఎందుకో పరదాపుట్టింది ఒక్కసారి వానలో తడవాలని! తలుపుతెరచి ఒక్కడుగు ముందుకు వేశానో లేదో వెయ్యిసూదులు గుచ్చుకున్నట్టు దెబ్బతీసింది వాన! అవి సూదులు కావని తెలిసినా, ప్రకృతి శక్తులు ప్రకోపించినప్పుడు వానజల్లులు కూడా గుండుసూదులవుతాయని గ్రహించాను. ఈ గ్రహింపుతో చల్లగా తలుపువేసుకుని వెచ్చగా నిద్రపోయాను.

అరవైమూడురోజులు టైఫాయిడు జ్వరంతో హోరాహోరీ పోరాడినప్పుడు కూడా చచ్చిపోతాననే ఊహ నాకు రావేలేదు. ఈ చావుబ్రతుకుల సమరంలో నేనే గెలుస్తాననే నిశ్చయం నన్ను వదిలిపెట్టనేలేదు. అప్పుడు నేనేమాత్రం భయపడివున్నా ఇప్పుడు మహాప్రస్థానం గీతాలు ఉండేవికావు. ఈ గుండెధైర్యం ఒక్కటే నా ఆస్తీ, పాస్తీ!

బతకడంకోసం దైవప్రార్థనలు చెయ్యాలనికూడా నాకనిపించలేదు. ఒకసారి కలలో యమభటులు కనిపించారు. "వెళ్ళిపొండి" అని నెమ్మదిగా, నీరసంగా ఆజ్ఞాపించాను. మళ్ళీ వాళ్లు కనబడలేదు.

విశాఖపట్టణంమీద బాంబులుపడ్డ రాత్రి నేను మద్రాసులో ఉన్నాను. మద్రాసుమీద కూడా బాంబులు పడతాయని పుకార్లు వ్యాపించాయి. సగం మద్రాసు ఖాళీ అయిపోయింది. జపాను వాడు బాంబులువేస్తే, ఏ హార్బరుమీదనో, సెంట్రల్ స్టేషన్‌మీదనో, మరేవయినా పారిశ్రామిక కేంద్రాలమీదనో వేస్తాడుగాని రాయపేటలో నేనుంటున్న అద్దె ఇంటిమీద ఒక్క బాంబుకూడా దండుగపరచడని నా ధైర్యం. అందుకే ఆ రాత్రంతా డాబామీదనే పడుకున్నాను. సైరన్ కూసినా లక్ష్యపెట్టలేదు. మద్రాసుమీద బాంబులు పడనేలేదు.

"మనకెందుకీ మద్రాసు! ఎవరి ఊళ్ళకి వాళ్ళం పోదాం" అన్నాడు కప్పగంతుల సత్యనారాయణ. "ఆంధ్రప్రభ"లో నాతోడి సబ్ఎడిటర్. "మీరంతా పోతే పొండి. నేను మాత్రం మద్రాసు వదల"నన్నాను. "ఎందుచేత" అనడిగేడు సత్యనారాయణ. "సూరజ్‌మల్లు

భవనంమీద బాంబులుపడితే నాలుగయిదు వజ్రాలను ఏరుకునే అవకాశం ఉందికదా!'' అన్నా న్నేను. సూరజ్‌మల్లు సుప్రసిద్ధ నగల వర్తకుడు. అతడిప్పుడు లేడేమోకాని అతని పేరిట భవనం మాత్రం ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉంది.

ఇళ్లు కాలుతూవుంటే చుట్టకాల్చుకుందాం అనే మనస్తత్వం ఈనాటిది కాదు. సులువుగా చుట్ట కాల్చుకోవచ్చుననే ఆశ అందరి అంతరాంతరాల్లో ఏదోమూల దాగే ఉంటుంది. దీన్ని ఆశ అనా అన్నాను. కాదు ప్రలోభం! దీన్ని నేనెదిరిస్తాను. అందరూ ఎదిరించాలంటాను. ఆనాడు కాలికి మేకు గుచ్చుకోకపోయినా లైబ్రరీ పుస్తకాలను నేను దొంగిలించేవాణ్ణికాను. నగల వ్యాపారి భవనం కుప్పకూలిపోయినా, అందులోని వజ్రాలు నాకక్కరలేదు. ఒకసారి ఆంధ్రాయూనివర్సిటీ లైబ్రరీలోని ఒక పుస్తకాన్ని తేరగా సొంతం చేసుకునే అవకాశం నాకు కలిగింది. ఆ పుస్తకం నేనెంతో ఎన్నికచేసే, మన్నికచేసే స్విన్‌బర్న్ కవితల సంపుటి. అయినా దాన్ని నేను తెచ్చుకో లేదు. తెచ్చుకోలేదనే విచారం అప్పుడూ లేదు, ఇప్పుడూ లేదు.

ఎంత రాక్షస రాత్రి అయితే అంతబాగా నాకు నిద్రపడుతుంది. ''చిత్తుగా తాగేసి నిద్ర పోతున్నాడురా!'' అని నా సంగతి తెలియనివాళ్ళనుకోవచ్చును. కాని, చెరబండరాజు అలా అనుకోడు. నగ్నముని అలా అనుకోడు. అది రాక్షస ఉగాది రాత్రి.

అంత క్రితం రెండుమూడు రాత్రులు నాకు సరిగా నిద్ర పట్టలేదు. మోతాదుగా మద్యం సేవించివున్నాకూడా! కారణం, ఆ చుట్టుపక్కల్లో హరేరామ్‌భజన ఏకధాటిగా సాగిపోతోంది. ఇతరులకు నిద్రాభంగం కలిగించకూడదనే ఇంగితజ్ఞానం లేకపోయింది వాళ్లకి.

బాగా తాగేసి సుఖంగా నిద్రపోయిన రాత్రులుకూడా నాజీవితంలో ఎన్నో వున్నాయి. కాని అవి రాక్షసరాత్రులు కావు!

*ప్రజాతంత్ర 9–11–1975*

# అద్దంలో శ్రీశ్రీ

## ఒకటి

అద్దంలో శ్రీశ్రీ ఆదిమధ్యాంతరహితుడు. రెండు నిలువుటద్దాల మధ్య అప్పుడప్పుడు నిలబడాలనుకుంటాను.(సెలూన్‌లో చాలాసార్లు కూర్చున్నాను) ఒక అద్దంముందు నిలుచున్నా, కూర్చున్నా నా ఆదిమధ్యాంతరాహిత్యం ఊహించుకోవడంవరకే పరిమితం. అయినా ఈఊహ అసత్యంకాదు. ఒకే నేను రెండయినప్పుడు ఆ రెండు అనంతంకాక తప్పదు. దీన్నే శ్రీకారపు గుణకారం అన్నాను. మనుష్యుల పేర్లమాట అలావుండగా ఈనాడు పందెపు గుర్రాల్లోకూడా ఈ శ్రీకారం వ్యాపించింది. ప్రస్తుతంమట్టుకు నాకు తెలిసినంతమట్టుకు వాణిశ్రీ, శ్రీశ్రీ అని రెండే గుర్రాలున్నాయి గుర్రప్పందాల్లో పాల్గొంటూ! వాణిశ్రీ ఎప్పుడయినా గెలిచిందో లేదో నాకు తెలియదుగాని శ్రీశ్రీ మీద ఒకేఒక రేస్ టిక్కెట్‌కొని నేను గెలిచాను. ఆరోజు గిండీ రేసుకోర్సులో శ్రీశ్రీ అనే రెండక్షరాలూ శంఖారావంచేశాయి. అయితే ఆ గొప్ప నాదికాదు, గుర్రానిది. అన్నట్టు ఆ గుర్రం ఆడగుర్రం. ఫిల్లీ! మై సిల్లీ సేమ్ సేక్! మద్రాసు గవర్నమెంటు గుర్రపు రేసుల్ని నిషేధించింది కాబట్టి ఇకమీద మళ్ళీ ఈ ఫిల్లీని చూడగలనో లేదో తెలియదు.

గుర్రపు పందాలకు వెళ్ళి గెలిచిన డబ్బుతో మరలివచ్చిన మొదటిరోజు నా జీవితంలో "శ్రీశ్రీ" గెలిచినరోజే. నాకు రేసింగు ఒక వ్యసనంకాదు. ఒక్కొక్క సీజనుకు మహా అయితే డజనుసార్లు వెళ్లేవాడిని. బాగా డబ్బున్నరోజుల్లో కూడా వందరూపాయలకంటే ఎక్కువ తీసుకువెళ్లలేదు. అంతే, ఆ రోజు బడ్జెట్ వందరూపాయలు. ఒక్కొక్కసారి గేటు డబ్బు మాత్రమే చెల్లించి సరదాగా తిరిగేసి మరలివచ్చిన రోజులుకూడా ఉన్నాయి. ఇదెందుకు చెబుతున్నానంటే రేసుల్లో నేను పెద్దగా ఓడిపోయిందీలేదు, గెలిచిందీలేదని చెప్పడానికి.

మా నాన్నగారికి పేకాట ఒక వ్యసనం. నేను బి.ఏ పూర్తిచేసిన నాటికి మా ఆస్తంతా కరిగిపోయింది. దరిద్ర నిరుద్యోగిగాతిరుగుతుండే నేను మానాన్నగారినొకసారి నిందించాను, ఆయన జూదంవల్లనే ఈ పరిస్థితి ఏర్పడిందని. పేకాటలో తాను పోగొట్టింది చాలా స్వల్పమేకాక తరచూ గెలుస్తూనే ఉండేవాడిననే వాస్తవాన్ని ఆయన నాకు చెప్పేరు. అయితే మరి మా దురవస్థలకు కారణమేమిటి? వ్యక్తిగత బలహీనతలుకావు, వ్యవస్థలోని దుర్మార్గం. మధ్యతరగతి కుటుంబాలు పెట్టుబడిదారీ విధానపు ఇనుప చక్రాలక్రింద నలిగిపోతున్నాయి. వ్యక్తుల్ని నిందించి ప్రయోజనంలేదు. వ్యవస్థని మార్చాలి.

అదుగో ఎదురుగా అద్దం. ఇవాళోరేపో నా వెనకాతలకూడా ఒక అద్దం అమర్చుతాను.

మా ఆవిడ సరోజతో ఈ మాట అన్నానంటే ఇప్పుడే ఆపని చేసేస్తానంటుంది. సరోజలో ఉన్న సద్గుణమూ, దుర్గుణమూ అదే! ఒకపని చెయ్యాలనుకుంటే చేసి తీరవలసిందే!

ఎడంచేత్తో సిగరెట్ కాలుస్తున్న శ్రీశ్రీ అద్దంలో కుడిచేత్తో దమ్ములాగుతున్నాడు. నా కుడివైపున ఉన్న టేబులుమీద బ్రాందీసీసా, గ్లాసూ అద్దంలో నా ఎడమని ఉన్నాయి. కుడి ఎడమైతే పొరపాటులేదోయ్ అని ఇందుకేకాబోలు అన్నాడు దేవదాసులో దూరిన కవి. నేను కుడిచేత్తో రాస్తూ ఉంటే అద్దంలో నా కలం ఎడమచేత్తో రాస్తోంది.

వెనకాతలకూడా ఒక అద్దం ఉంటే బ్రాందీ సీసాకికూడా అనంతత్వం సిద్ధిస్తుంది. నా మాటలకి తాగుడునేర్పి అనంతంగా వాగిస్తున్న ఘనత నా ఒక్కడిదేకాదు. మద్యనిషేధం అమలులోవున్న ప్రాంతాలలో సహా మతిమాలిన మాటలకి మహాకవిత్వపు హోదా దానంతట అదే వచ్చేస్తుంది.

అవి రెండవ ప్రపంచ యుద్ధపురోజులు. ఆరుద్ర ఆవడి విమానశాఖలో పనిచేస్తూ ప్రతి ఆదివారమూ మద్రాసుకు వచ్చేవాడు. పట్టాభి నౌకాదళంలో లెఫ్టినెంట్‌గా ఉండేవాడు. ఒక ఆదివారం మేమందరమూ గిండీ రేసెస్‌కి వెళ్ళి పట్టాభి బసకు చేరుకున్నాము. ఏడు గంటల రాత్రి అవుతుంది, బీచీ దగ్గరేవుంది నౌకోద్యోగుల వసతిగృహం. అక్కడ ఒక సీసానిండా రమ్ము ఉందిగాని దురదృష్టవశాత్తు మంచినీళ్లే లేవు. దగ్గరలోనే మహాసముద్రం వుందిగాని, ఏం ప్రయోజనం?

పట్టాభి మగ్గులతో రమ్ము తీస్తూనేవున్నాడు. మేం నీటుగానే వాటిని ఖాళీచేస్తున్నాము. ఒక కుక్కకూడా మాపార్టీలోచేరింది. దానికీ పోస్తూనే ఉన్నాము. దాదాపు పదిగంటలవుతూం డగా నాకు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది- ఆఖరి ట్రెయిన్‌ను అందుకోకపోతే మర్నాడు ఆరుద్ర ఆవడిలో పనిచెయ్యలేడని! ఇద్దరం బయల్దేరాము. ఆ దగ్గరలోనే ఒక హోటేల్ రూమ్‌లో నేనుంటున్నాను. నన్ను జాగ్రత్తగా దిగబెట్టి ఆరుద్ర ట్రాం ఎక్కాడు. ఆరుద్రను ట్రెయిన్‌లో కూర్చోపెట్టాలని నా ఆదుర్దా. నేనూ ట్రాం ఎక్కాను. నన్ను దిగబెట్టడానికి ఆరుద్రా, ఆరుద్రను ట్రెయిన్ ఎక్కించడానికి నేనూ రెండుమూడుసార్లు ట్రాం ప్రయాణం చేశాము. చెమటచేత కాబోలు నా కళ్ళజోడు ఎక్కడో జారిపోయింది. "నా జేబులో దాచానులే" అన్నాడు ఆరుద్ర.

ట్రెయిన్ మించిపోయింది. మర్నాడు ఉదయం ఇద్దరమూ హోటేల్ రూమ్‌లో మేలు కున్నాము. లేచీలేవగానే నా మొదటి ప్రశ్న- "ఏదీ నా కళ్ళజోడు?" అని. ముందుగా జేబూ, తర్వాత గదీ వెదికేడు ఆరుద్ర. ఎక్కడా దొరకలేదు. మా ట్రాం ప్రయాణాల్లో ఎక్కడో పడిపోయింది. తనజేబులో సురక్షితంగానే ఉందనుకున్నాడు ఆరుద్ర.

ఆ సాయంత్రం మూరుమార్కెటంతా చుట్టబెట్టాను, పోయిన నా కళ్ళజోడు దొరుకు తుందేమో అని, దొరకలేదు. తర్వాత ఎలాగో మరో కొత్త జోడు కొనుక్కున్నాను.

మహాప్రస్థానం గీతాలు రాయకముందునుంచీ నేను తాగుతూనే వున్నాను. కాని అందులో

ఒక్క గీతంకూడా తాగుడుమైకంలో రాయలేదు. అవేకాదు, సినీమాకి రాసిన పాటలు కూడా అంతే. ఒకప్పుడు మైసూరులో ఒకేరోజు పదిపాటలు రాశాను. రాసిన తర్వాత ఆ రాత్రి సీసా ఓపెన్‌చేశాను. దేనికదే, అంతే! మహాబలిపురంలో ''భార్యాభర్తలు'' స్క్రిప్టు రాస్తున్నప్పుడు కూడా ఇంతే. ఉదయం తొమ్మిదినించి పండ్రెండుదాకా, సాయంత్రం మూడునించి ఆరు దాకా రాయడం ఆ తర్వాత మద్యం సేవిస్తూ మర్నాటిదాకా అన్నీ మరచిపోవడం. ఉదయం సరిగా పన్నెండు అయేసరికి ఎక్కడి కాగితాలక్కడ వదిలెయ్యడమే. సగం సీసులో ఉన్నాసరే. అలాగే సాయంత్రం ఆరుగంటలతో ఆనాటి పనికి ఆటవిడుపు.

నేను తాగుతాను, పనిచెయ్యను అని నామీద ఒక వాదు ఉంది. ఇది సగం మాత్రమే నిజం. ఇలాంటి అర్ధసత్యాలు నాగురించి ఎన్నో ప్రచారంలో ఉన్నాయి. ఔను నేను తాగుతాను. కాని తాగినప్పుడు పనిచెయ్యను. పనిచేసేటప్పుడు తాగను.

ఇందుకు తాజా ఉదాహరణ యు.విశ్వేశ్వర్రావు గారితో కలిసి సాగించిన ''తీర్పు'' రచన. ఇది పది పదిహేను రోజులు నిర్మద్యంగా సాగింది. రాత్రిళ్ళు ఏంచేశానన్నది నా యిష్టం!

ప్రజాతంత్ర 23–11–1975

## రెండు

భీమునిపట్నం ఒక చాలా మంచి ఊరు. ఒడతకీయుల, ఒలాందలుల కాలంలో కళాకాంతులు వెదజల్లే పడవలరేవు. బ్రిటిష్‌వాళ్ళ హయాంలో ఒక ఇంగ్లీషు దొర ఆగ్రహానికి గురి అయి ఈ రేవు తన ప్రాముఖ్యం కోల్పోయిందట.

నా చిన్నతనంలో ఒక నాలుగయిదు సంవత్సరాలు వేసంగిరోజులు ఈ వూళ్లో గడిచాయి. అప్పుడు మా చిన్నాన్న(పూడిపెద్ది సోమనాథం)గారు అక్కడ పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టరు. అంటే ఆ ప్రాంతానికి సర్వాధికారి అన్నమాట. ఆయనా, మా నాన్నా కవలపిల్లలు కారుకాని, ఇద్దరూ ఒకలాగే ఉండేవారు. ఒకర్నిచూస్తే ఇంకొకర్ని చూడనక్కరలేదు. ఆయన్ని నేను చిన్నప్పుడు ఇంకోనాన్న అని పిలిచేవాణ్ని. అలాగే ఆయన కొడుకు మా నాన్నని ఇంకో నాన్న అని పిలిచేవాడు.

ఆ ఊళ్లో మా అందరికీ ఒక పెదనాన్నగారు ఉండేవారు. ఆరగుడుల ఆజానుబాహువు. సూదిముక్కు, సూదికళ్లు. పెదనాన్నగారు ఊరంతటికీ పెదనాన్నగారు. ఆయనంటే అందరికీ గౌరవం. చాలా నీతిపరుడూ, నిజాయితీపరుడూ అని అందరిలోనూ ఆయనకి మంచి పేరుంది. మా ఇంకోనాన్నకు మాత్రం ఎందువల్లనో ఈ పెదనాన్నగారిమీద సదభిప్రాయం లేదని నేను పసికట్టాను.

తెల్లవారేసరికి ఊళ్లో తగు మనుషులందరూ ఒక కరణం కొట్టులో పోగయేవాళ్లు. అప్పటి నుంచీ మూడుముక్కలాట ప్రారంభం. మధ్యాహ్నం భోజనానికి మాత్రం ఒక గంటసేపు ఆట విడుపు. తర్వాత మళ్ళీ ఆట. నేను పెదనాన్నగారి పక్కన కూచుని ఆట చూస్తూంటాను.

ఒక రోజు జోరుగా ఆట సాగిపోతోంది. మధ్యాహ్నం కావస్తోంది. ఆఖరి ఆట అన్నారు. మేజు రెండింతలు చేశారు. డబ్బు బాగా పోగవుతోంది, బ్లయిండ్‌మీద బ్లయిండ్ కాయడం వల్ల. అంతకుముందు మా పెద్దనాన్నగారు ఎప్పుడు దాచేశాడో, ఎలా దాచేశాడో మూడు ఆసులు ఆఖరి ఆటలో బైటకి తీశాడు. డబ్బంతా నొల్లుకున్నాడు.

ఇంటికి వెళ్ళే దారిలో పెద్దనాన్నగారిని "ఏమండీ, మూడు ముక్కలు దాచెయ్యడం మోసం కాదా"అని అడిగాను. కుర్రాడివి నీకు తెలియదురా! ఇవన్నీ కేవలం *elementary principles of gambling* అని ఇంగ్లీషులో సూత్రీకరించాడు. ప్రాథమికి సూత్రాలే ఇలా ఉంటే *Advanced principles* ఇంకా ఎలావుంటాయో అనుకున్నాను.

20-11-1975

అమ్మయ్య! సరోజ నాకుర్చీవెనకాతల కూడా ఒక అద్దం ప్రతిష్టించింది. ఒక అద్దం ఎదురుగా ఉంటే ఒక రిఫ్లెక్షన్ మాత్రమే ఉంటుంది. ఎదురెదురుగా ఉన్న రెండుఅద్దాల మధ్య కూర్చుంటే అనంతమైన *reflections.* ఇంగ్లీషులో ఏకవచనంలో ఉన్న ఈ మాటకు ఒకటే అర్థం ఉంటే బహువచనంలో రెండుర్థాలున్నాయి. *practices* అనే మాటకు ఏక వచనంలో మంచి అర్థమూ బహువచనంలో చెడు అర్థమూ ఉన్నాయి కదా! ఫలానా ప్లీడరుగారికి మంచి ప్రాక్టీస్ ఉందంటాము అయితే ఆయనగారి *practice* మాటవచ్చి నప్పుడు అర్థం మారిపోతుంది.

ఇప్పుడు మళ్ళీ మా చిట్టి పంతులు జ్ఞాపకం వస్తున్నాడు. "ఒరే, బాబిగా,(విశాఖపట్ట ణంలో అందరూ నన్ను బాబాయి అని పిల్చేవారు. దీనికి కొన్ని ప్రాంతాల్లో లాగ, చిన్నాన్న అని కాదు అర్థం. చిన్నపిల్లల్ని పిల్చేముద్దుపేరు.) మీ నాన్నకి బాగా డబ్బుంది కాబట్టి నువ్వు బి.యే.వి కాగలిగావు. మావాన్న పేదవాడు కాబట్టి నేను ఇంగ్లీషు చదువుకోలేక పోయాను. నేనే ఇంగ్లీషు చదువుకుంటే నీ కన్నా బాగా మాట్లాడేవాడ్ని" అనే వాడు. ఎలాగయినా ఇంగ్లీషు మాట్లాడాలని అప్పుడప్పుడు ప్రయత్నించేవాడు.

ఒక మారు చిట్టి పంతులుకి గనేరియా తగిలింది. విశాఖపట్టణం కింగ్‌జార్జి హాస్పిటల్‌లో డాక్టర్ నాయర్ గొప్ప సుఖవ్యాధుల ఎక్స్‌పర్ట్. ఆయన దగ్గరకి వెళ్ళివచ్చానని చెప్పడం చిట్టి పంతులు ఉద్దేశం

"*I will already examined to the Dr.Govindan Nair*" అని ఒకే గుక్కలో అనేశాడు. "ఒరే, చిట్టి పంతులూ, ఈ వాక్యంలో ఉన్న వ్యాకరణ దోషాలన్నీ తెలుసుకుంటే గొప్ప ఇంగ్లీషుపండితుడివయిపోయినట్టేరా!" అన్నాన్నేను.

*Mrs.A.V.N.College*లో నేను ఉపాధ్యాయుడుగా ఉన్నప్పుడు అప్పటి ఫోర్త్ ఫార్మ్ విద్యార్థుల్లో ఇంగ్లీషు గ్రామరు చాలా బాగా చెబుతానని నాకు మంచి పేరుండేది.

ఇంగ్లీషు ఒక ద్వారం-దీని ద్వారా నాకు ప్రపంచంలోని ఎన్నో భాషల కవిత్వపు భవనాలలోనికి ప్రవేశం లభించింది.

సంస్కృత భాషలోని మృచ్ఛకటికాన్నీ, సూర్యశతకాన్నీ ఇంగ్లీషు తర్జుమాలలో చదివాను. అలాగే చోరపంచశతిని నేను *The Block Marigolds* గా ఎరుగుదును. అయితే ఈ ''అద్యాపి శ్లోకాలు'' తెలుగు బిల్హణీయంలో కూడా మంచి పాకంలో పరివర్తన చెందాయి. మన తెలుగు కవులంతా అనువాదాలలో అందెవేసిన చేతులే కదా!

ప్రాయమింతకు మున్నెకై వ్రాలకుండ
కాశికా ఖండమను మహాగ్రంథమేను
తెనుగు చేసెద కర్ణాట దేశ కటక
పద్మవనహేళి, శ్రీనాథ భట్టసుకవి!

అని శ్రీనాథుడు జబ్బచరచి, లేదా తొడకొట్టి చెప్పుకున్నాడు.

కాని ఇప్పటి కవులు కొందరు ఇతర భాషల అనువాదాలు చేసి వాటివి తమ సొంతంగా చలామణీ చేస్తూండడం మిక్కిలి శోచనీయం.

నా కవిత్వంలో ఇతర కవుల ఛాయలు ఏమాత్రం సోకినా అదినేను ఒప్పుకుంటాను. ''మహాప్రస్థానం'' లోని''అద్వైతం'' మీద స్విన్‌బర్న్ ప్రభావం ఉందని అంగీకరించాను. ''గంటలు'' *Edgar Allan Poe* గంటలకి అనువాదం కాదన్నాను. అంటే, అది చదివిన తర్వాతనే నా ''గంటలు'' రాసినట్టు ఒప్పుకోవడమన్నమాట. సరే, ''పేదలు'' ఒక బెల్జియన్ కవి మూలానికి ముక్కస్యముక్కానువాదమే.

21-11-1975

ఇటీవల ఒక అభిమాని నన్ను ''సదసత్సంశయం'' పూర్తి చెయ్యడం లేదేమని అడిగాడు. ''ఆ సంశయం తీరిపోయింది కాబట్టి'' అని జవాబిచ్చాను. అయితే త్వరలోనే దాన్ని ముగిస్తూరాస్తాను. అందులో ఆఖరి నాలుగుపాదాలు-

సద సత్సంశయ సమస్య
చక్కా తీరిన నాటికి
సామ్యవాద మానవుడే
శాస్త్ర సకల విశ్వానికి!

అదే మిత్రుడు, ''గురజాడ మీ గురువంటారు, నిజమేనా?''అని అడిగాడు. అలాగయితే నేను ఎందరి పుస్తకాల వల్ల ప్రభావితుణ్ణయానో అందరూ నా గురువులే అనవలసివస్తుం దన్నాను. నిజానికి గురజాడని నేనెప్పుడూ చూడలేదు., ఆయన చనిపోయిననాటికి నా వయస్సు అయిదేళ్ళు.

*ప్రజాతంత్ర 30–11–1975*

## మూడు

అద్దం ముందు కూర్చుని ఆవాహన చేస్తున్నాను జ్ఞాపకాలని. (కవిరాసే వచనం ఇలాగే ఉంటుంది. జ్ఞాపకాలని ఆవాహన చేస్తానని అనవచ్చుగదా!)

ఉద్రేకాలను ప్రశమితంగా జ్ఞాపకం చేసుకోవటమే కవిత్వం అన్నాడు వర్డ్సువర్త్. జ్ఞాపకాలను గజిబిజిగా కాగితం మీద పెట్టడమే వచనం అనుకోవచ్చా?

కూడదు. ఈ నాడు వచనం కూడా కవిత్వం కాగలస్థితికి ఎదిగింది. జేమ్సుజాయిస్ రాసింది వచనమో కవిత్వమో ఎవడు చెప్పగలడు?

రాతిరియనక బవల్ మరపురాని హొయల్ అన్నాడు అల్లసాని పెద్దన్న. కలకాలం జ్ఞాపకం ఉండేదే కవిత్వం అన్నాడు చెళ్లపిళ్ల.

ఒకనాడు చెళ్ళపిళ్లకి నన్ను విశ్వనాథవారు పరిచయం చేశారు, ''వీడు మనవాడు'' అంటూ. నన్నేదేనా పద్యం చదవమన్నారు చెళ్ళపిళ్ళ. ఆరోజుల్లో నేను ''సిరిసిరిమువ్వ'' శతకం రాస్తూండేవాణ్ని. అందులోని ''ఇష్టదేవతా ప్రార్థనం'' లోని కవి చౌడప్పమీద పద్యం చదివేను.

''ఏడి కవిగాడీ భువి
గాడిద యేడుపును పాడగలిగిన వాడౌ
చౌడప్ప కీడు? కరని
ష్ఫీడన కర్షుడు లేడు, సిరిసిరి మువ్వా!

ఇది చెళ్ళపిళ్ళవారికి నచ్చింది. కాని పద్యం బాగున్నా కవి చౌడప్పను పొగడడం బాగులేదన్నారాయన.''బూతుకవిత్వం మీకిష్టం లేదా?'' అని అడిగేను. ''నీతిబాహ్యం కాని బూతు నాకిష్టమే'' అన్నారాయన. నీతి ఎప్పటికప్పుడు మారుతూ ఉంటుందనీ, నిన్నటి అవినీతి రేపటి నీతి అవుతుందనీ ఇలా ఎన్నో విధాల వాదించాలనుకున్నాను. విశ్వనాథవారు సంభాషణను మరో మార్గానికి మళ్లించారు.

కేలెండరు సాక్షిగా చెబుతున్నాను, ఇవాళ 1-1-1976. నిన్న కళావాచస్పతి జగ్గయ్య పుట్టిన రోజు. రేపు నేను పుట్టేను (వ్యాకరణమా! నువ్వు సెలవు తీసుకో!)

2-1-1910 అనే తేదీ నా పుట్టిన రోజుగా చలామణీ అవుతోంది కాని ఆరోజు నేను పుట్టలేదు. దీని వెనకాతల ఓ చిన్నకథ ఉంది.

1925 మార్చినెలలో జరిగే స్కూలుఫైనలు పరీక్షలకు నా వయస్సు 15 సంవత్సరాలుండదని మా నాన్నగారికి తెలుసు. ఎందువల్లనంటే నేను 1910 ఏప్రిల్లో పుట్టేను. శ్రీరామనవమి రోజుల్లో పుట్టేనని మాబంధువులు అంటూవుండేవారు.. చైత్రశుద్ధ షష్టి నా పుట్టినరోజని మాఅమ్మమ్మ అంటూ వుండేది. కాని, నేను పుట్టినతేదీ ఏదయినా మానాన్న మాత్రం నా స్కూలుఫైనలు రిజిస్టరులో 2-1-1910 అని రాయించాడు. అదే ఇప్పటికీ ఖాయమయింది.

విశాఖపట్టణం తాలూకా జననమరణాల చిఠాల్లో నా పుట్టిన తేదీ దొరుకుతుందేమో అని నాషష్టిపూర్తి సందర్భంలో చాలామంది మిత్రులు ప్రయత్నించారు గాని ప్రయోజనం లేకపోయింది. (సంస్కృతంలో షష్టి అంటే అరవై షష్ఠి అంటే ఆరు. ఈ చిన్న తేడా

తెలియక పెద్దపెద్దవాళ్ళే షష్టిపూర్తి ఉత్సవాలు జరిపించేసుకుంటూ ఉంటారు!)

మా పెద్దబావగాడికి (ఆరుద్రఫాదరు. భాగవతుల నరసింగరావు అనేది అతని పూర్తి పేరు. ఈ మధ్యనే పరమపదించాడు) జాతకాలపిచ్చి మెండు. ఏవేవో లెక్కలుగుణించి, ఘడియ విఘడియలతో సహా నాపుట్టినతేదీ నిర్ధారణ చేసి ఒక పదిపేజీల జాతక ఫలితాలు తయారుచేసాడు.

అందులో ఒక్కటీ నిజం కాలేదు.

అద్దంలో నారూపం స్పష్టంగా కనబడుతూవుంటే జాతకాలఫలహారీసుకొని భవిష్యత్తును తెలుసుకోవలసిన అవసరం నాకు లేదు. అప్పుడప్పుడు వెర్రివాడి చేతిలోని రాయి బాపతుగా కొన్నికొన్ని ప్రిడిక్షన్లు నిజమయినంతమాత్రంచేత ఎస్ట్రాలజీనీ ఒక సైన్సుగా నేను గుర్తించలేను.

ఇంటర్మీడియేటు పరీక్షాఫలితాలు తెలిసేరోజు ఉదయం ఒకాయన "నువ్వు తప్పకుండా ప్యాసవుతావు" అని జోస్యం చెప్పేడు. అలాగే ఆ సాయంత్రం ఫలితాలు వచ్చాయి. నేను ప్యాసయ్యాను. అయినా జ్యోతిషంమీద నాకు నమ్మకం కుదరలేదు. ఎక్కడకయినా బయల్దేరి నప్పుడు ఎవరయినా తుమ్మితే నేను లక్ష్యం చెయ్యకుండా ముందుకు సాగిపోతాను.

అద్దం ముందు ప్రార్థన.

(శ్రీ)(శ్రీ) ఇలా అన్నాడు: "నేను నీ ప్రతిబింబాన్ని! నువ్వు అద్దం ముందు నిలుచున్నప్పుడు కనిపిస్తాను. గోడముందు నిలబడితే కనబడను. కనబడనుకదా అని లేననుకోకు. ఎప్పుడూ నీవెంటనే వుంటాను. నిన్ను కనిపెడుతూనే వున్నాను. నువ్వు నవ్వితే నవ్వుతాను. ఏడిస్తే ఏడుస్తాను. అద్దంలో నిలబడి నాలో నిన్ను చూసుకో. మురికి కాలువల్లోకి చూసినప్పుడు కనబడే వికృత స్వరూపాన్ని నేననుకొని భయపడకు. ప్రస్తుతం నీకు నేనిచ్చే సలహా, కాలాన్ని జాగ్రత్తగా వాడుకో- ఇలాఇలా అన్నాడు అద్దంలో (శ్రీ)(శ్రీ). ఈరేషన్ దినాలలో సహా ఎవ్వరూ గుర్తించకుండా వున్నారు. ప్రపంచంలో ప్రతీ మనిషికీ కొంచెం కాలమే మంజూరు అయిందని మళ్ళీ హెచ్చరిస్తున్నాను. నీవంతు కొచ్చిన కాలాన్ని పొదుపుగా వాడుకో నేనిచ్చిన రెండో సలహా నాకు బాగా నచ్చింది. కాని కాలాన్ని పొదుపుగా వాడుకోవడం అంటే ఏమిటో నాకు తెలియలేదు. కొంతమంది హైస్కూలు కుర్రాళ్లు మధ్యాహ్నం భోజనానికి ఇళ్లకు పోతున్నారు. ఇళ్లకు వెళ్లి భోజనాలు చేసి మళ్ళీ బడికి రావడానికి ఒక గంట వ్యవధి. ఈ వ్యవధిలోనే కుర్రాళ్ళు అన్ని పనులూ ముగించుకొని, ఇంకా కొంతకాలం మిగుల్చుకునేటట్లు స్కూలుకు చేరుకుంటారు. అనేక సంవత్సరాల కిందట నేనుకూడా- మాఇల్లు పాఠశాలకి దూరమైనా- ఇంటికి వెళ్లి వచ్చి ఇంకా చింతచెట్టుకింద ఆటలాడుకోడానికి కాలాన్ని మిగుల్చుకోలేదూ. అదేనా కాలాన్ని పొదుపుగా వాడుకోవడమంటే-ఇప్పుడా పొదుపంతా పోయింది. గంటలూ- రోజులూ, ఎడారిలో ఒంటెల్లాగ వెళ్ళిపోతూవుండడం చూడడమే నాపని అయిపోయింది. ఇది పనికిరాదని అద్దంముందు నిలబడి ఇలా ప్రార్థించాను. అంతరాత్మచేసే అభినయంతో ప్రసంగించే అద్దంలోని ప్రతిబింబంముందు నేను దాచవలసిన

దేదీ లేదు. అనుక్షణమూ నాకాలం హరించుకుపోతూనే ఉంది. దాన్ని నేను కళ్ళెంవేసి పట్టుకొనే ప్రయత్నం మానేశాను. అందుచేతనే నన్ను ఆవరించిన నిర్వేదం నాకు లొంగకుండా పోతోంది. నా ఒకే ఒక అమూల్యమైన ఆస్తి కాలం. దీన్ని నేను దుర్వినియోగం చేశానన్న నింద నామీద పడకుండునుగాక. అద్దం ముందు నిలబడి నేను చేసే ప్రార్థన ఏమిటంటే స్వర్గానికి తీసికెళ్ళే స్థంభాల సమక్షంలో నాకు ఒక చిన్న పురుగుగానైనా ప్రాకగలిగే శక్తి లభించునుగాక. ఆవరించిన ప్రపంచపు క్రూరత్వం మధ్య నా ఆకుపచ్చని అమాయకత్వానికి భంగం కలుగకుండునుగాక! నా ఆగ్రహం వ్యక్తుల మీదకు కాక, వాళ్ళుపాల్పడే అనాచారాలమీదకి ప్రసరించునుగాక! వాటిని తీక్షణంగా విమర్శించగల శక్తి నావాక్కుకు ప్రసాదింపబడునుగాక-నా అంతరాంతరాలలోని ఆశలను, భయాలనూ వెల్లడించ గలిగిన మాటలు నాకు దొరకలేదు. అద్దం యెదుట నామాటలు క్రమక్రమంగా మౌనంలోకి కరిగిపోయాయి. అద్దం ముందు నిల్చున్నప్పుడు మౌనంగా తప్ప, మరో విధంగా ప్రార్థించ కూడదని నిశ్చయించుకున్నాను.

*ప్రజాతంత్ర 11–1–1976*

## నాలుగు

అద్దం ముందు కూర్చుని మన ఆలోచనలు ఎంత అనాలోచితంగా ఉంటున్నాయా అని ఆలోచిస్తున్నాను. మన ఊహలు అవాస్తవికంగా ఉండడానికి మనలో ఉండవలసిన శాస్త్రీయ క్రమశిక్షణ లేకపోవడమే కారణం. కవిత్వంలోనూ ఇంతే. నిత్య జీవితంలోనూ ఇంతే. ధారాళంగా అబద్ధాలాడెయ్యడం మనజాతికి అలవాటయిపోయింది. ఫలానా సినీతార ముఖం చంద్రబింబం అంటే నేను అర్థం చేసుకోగలనుగాని అంగీకరించలేను. పూర్వ కవులు ఇలాగే అన్నారని బుకాయించి లాభంలేదు, ఇది కేవలం ముఖస్తుతి. పైగా ఒక పెద్ద అబద్ధంతో కూడుకున్నది.

"రవిబింబ పతనదీర్ణ పయోధిని
ర్గత శేష ఫణిఫణా రత్నరుచియొ "

అన్న అల్లసానివారి పద్యపాదాన్ని తాపీ ధర్మారావుగారు ఒక చిన్న వ్యాసంలో చీల్చి చెండాడారు. అల్లసానివారిదే ఒక చాటు పద్యపాదం నాకు జ్ఞాపకం వస్తోంది.

"ఎదురైనచో మద కరీంద్రము డిగ్గి
కేలూత యొసగి యెక్కించు కొనియె!"

దిగిన తర్వాత కేలూతతో ఎక్కించుకోవడం ఏమిటి? మదకరీంద్రము నాపి, అంటే సరిపోయేది.

సరే. మన భావకవులు సరేసరి! వాళ్ళేమిటి రాస్తున్నారో, ఎందుకు రాస్తున్నారో వాళ్ళకే తెలియదు. అవి చదువుకునే, మా చిన్నతనంలో మేం మైమరచిపోతూ ఉండేవాళ్ళం. భావకవులందరికీ ఆద్యుడైన రాయప్రోలు వారు-

"పాయలు పాయలుగా విడిపోయిన నాతెలుగు తల్లి
ముంగురులకు వేణి యోగ్యాభరణముగా నీ యెడ జడకుచ్చు
అల్లి యిచ్చితి" నన్నప్పుడు,

ముంగురులకు జడకుచ్చు లేవిటని అడిగే పాటి దమ్ములు మాకు లేక పోయాయి! ముంగురులనే శబ్దం, కేశంలాగా శిరోజం లాగా జుత్తుకు పర్యాయపదంగా తీసుకోవాలని కొంతమంది సమర్థించారు. దీన్నే అవాస్తవికంగా ఆలోచించడం అంటాన్నేను.

తాను రాసిన ప్రతి పద్యాన్ని ఒకటికి పదిసార్లు తానే విమర్శించుకునే కృష్ణశాస్త్రి కూడా ఒక చోట,

"కరుణ పట్టునకీ బిచ్చగాని చేయి
చాచికొని నాడ మృత్యు
ఘోషమ్మె మరచి!"

అన్నాడు. అంతవరకు బాగానే ఉంది. కాని ఆ తర్వాత ఇంతకు ముందుతానేమి చెప్పిందీ మరచి పోయి-

"వట్టి బయలున నొక మ్రోడు చెట్టు వోలె
ఎత్తినది కర మెత్తినట్లె కృశించె"అన్నాడు.

మొదటి సగంలో చాచిన చెయ్యి రెండో సగంలో ఎత్తినది కావడం అంటే 90 డిగ్రీలు తేడా ఉందన్న మాట!

ఈనాడు కుటుంబ నియంత్రణకన్నా ముఖ్యం కవిత్వ నియంత్రణ అని నాకనిపిస్తుంది. అయితే ఏ కారణాలవల్ల ప్రభుత్వ శాసనాలద్వారా కుటుంబ నియంత్రణ పనికి రాదని నేనంటానో అవే కారణాలు కవిత్వ నియంత్రణకు కూడా అనువర్తిస్తాయి. మద్య నిషేధం (వినోబా భావేగారు క్షమిస్తే) విషయంలో కూడా ఇవే నా కారణాలు. ఏదైనా నిర్బంధంగా కాక స్వచ్ఛందంగా జరగాలంటాను.

ఇది వెలువడుతున్న "ప్రజాతంత్ర" సంచికలో రాక్షసనామ సంవత్సరం ముగిసిపోయి నలనామ సంవత్సరం ప్రారంభమవుతోంది. రాక్షస ఉగాది సంచికతో ప్రారంభించిన "అనంతం" ఇంతటితో (తాత్కాలికంగా) నిలుపుదల చేద్దామనుకున్నాను. ఇతర, ముఖ్యంగా సినిమా వ్యాసంగాలవల్ల నా మనస్సు కొంత గందరగోళంగా ఉన్నమాట నిజమే! కాని "అనంతం" ఆపకూడదు అనేదే ప్రజాభిప్రాయమైనట్టు నాకు తోస్తుంది. ఈ మెజారిటీ అభిప్రాయాన్ని శిరసావహించక తప్పదు. చేసినవేకాక, చేద్దామనుకుని చెయ్యలేకపోయినవి కూడా చెప్పకోవడంలో తప్పులేదనుకుంటాను. జనవరి 2వ తేదీ నాపుట్టిన రోజు. 1975వ సంవత్సరంలో నా వయస్సు 65 ఏళ్ళు. జనవరి రెండవ తారీకున నాపుట్టిన రోజు పండుగ చేసుకుందామనుకున్నాను ఎలాగంటే-

మా ఇంటి (నెం.11 కెనాల్ బ్యాంక్ రోడ్డు) ముందు వరసగా చాలా గుడిసెలున్నాయి. వాటిలో 10, 12 ఏళ్ళ మధ్య వయస్సు ఉన్న పిల్లలు చాలా చాలా మంది ఉన్నారు. వాళ్ళలో 65గురు మగపిల్లలకీ, 65గురు ఆడపిల్లలకీ, మొత్తం 130 కార్డులు పంచి పెట్టాలి.1నుంచి 130దాకా సీరియల్ నంబర్లు ఆ కార్డుల మీద ఉంటాయి. అందరూ ఒక వరసలో నిలబడితే నా పుత్రుడు, పౌత్రుడూ, మగపిల్లలకి ·చాక్‌లేట్లూ, ఆడపిల్లలకి గులాబి పువ్వులు పంచిపెట్టాలి! బాలబాలికల తరంలోని అమాయకత్వానికి నా నివాళిగా దీన్ని ఉద్దేశించాను. కాని జనవరి 1వ తేదీ సాయంకాలానికి నా దగ్గర పది రూపాయలు, కేవలం పది రూపాయలు లేకపోవడం వల్ల నేను చేద్దామనుకున్నది చెయ్యలేకపోయాను.

అప్పుడే అనుకున్నాను. పోనీ 1976 జనవరి 2వ తేదీని ఈ గుడిసెల్లోని పిల్లలచేతనే 66అనే అంకెలు రాసిన అట్టలు పట్టించి ఊరేగుదామని! ఇందులో స్వార్థమనండి, స్వాతిశయమనండి, సూపర్‌స్టిషన్ అనండి. అన్నీ అనండి, అంటున్నదంతా ఉందనే అంటాను. ఎందుచేత అంటే ఈ అట్టలు కొందరిచేతనైనా తిరగేసి పట్టుకొమ్మంటే 66 అనే అంకెలు 99గా మారుతాయి.

తొంభయి తొమ్మిది సంవత్సరాలు బ్రతకడం అంటే ఇరవయి ఒకటో శతాబ్దంలోనికి ప్రవహించడం అన్నమాట. 66 తర్వాత ఇంకా 33 ఏళ్ళు బ్రతకాలన్నమాట! నాకు బ్రతకాలనే ఉంది. తొంభయి తొమ్మిదేళ్ళనే యేమిటి ఆమీద ఎన్నాళ్ళు బొందిలో ప్రాణం ఉంటే అన్నాళ్ళూ బ్రతకాలని ఉంది. "*Grow old along with me! The best is yet to be*" అని బ్రౌనింగ్ నన్ను ఉద్దేశించే రాశాడనుకుంటాను, అది రాసిన సమయానికి నేను పుట్టక పోయినా!

ఒకప్పుడు నేను"ఇక బతకడం అసాధ్యం! చచ్చిపోవడమే మంచిది" అనుకున్నాను. అలా చాలాసార్లు అనుకున్నాను. కాని ప్రతిసారీ నాలో జీవించాలి అనే తీవ్రకాంక్షదే పైచేయి అవుతూ వచ్చింది! ఆ రోజుల్లో ఎలాగయినా బతికి ఉండాలనిపించేది కాని, ఎందుకు బతకాలో తెలిసేది కాదు. ఈ నాడు నేను బ్రతికి ఉండడం నా ఒక్కడికే కాదు, నా జాతికే అవసరం! అందుకే నేను నా ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటూ వస్తున్నాను. చాలామంది నేను జోరుగా సిగరెట్లు కాల్చేస్తాననీ, అంతకన్నా జోరుగా మద్యం సేవిస్తాననీ ఇవి చాలా అపాయకరమని నన్ను హెచ్చరిస్తూ ఉంటారు. నా మంచిని కోరి చెబుతున్న మాటలే ఇవి! ఇందులో ఎంత మాత్రమూ సందేహం లేదు. ఆల్కాహాల్ కన్నా ప్రమాదకరం నికోటిన్. ఈ సంగతి నాకు తెలుసు. కాని ఇవి యేవి యెవరి అదుపులో ఉన్నాయనేది ముఖ్యం. నేను సిగరెట్లకుగాని, మద్యానికిగాని బానిసనుకాను! ఎంతదూరం వెళ్ళినా, ఎక్కడ ఆగేదలచుకుంటే అక్కడనే ఆగగలను. ఇది గర్వంతో చెబుతున్నది కాదు. స్వానుభవంతో రాస్తున్నది!

ప్రధానంగా నేను రచయితని! నేను రాయదలచుకున్న దానితో పోలిస్తే రాసింది చాలా స్వల్పం. ఆ స్వల్పమయినా బాధ్యతారహితంగా మాత్రం రాయలేదు. ఈ బాధ్యత నాలో

ఇప్పుడు రెండింతలు, కాదు-అనేకాంశలు పెరిగింది. ఇది నా పాఠక వర్గం నన్ను హెచ్చరించే బాధ్యత. ఇదే నా సాహిత్యనౌకకు చుక్కాని!

*ప్రజాతంత్ర 4–4–1976*

*"నిజం చెప్పాలంటే విరసం ఆవిర్భావానికి ఏకైక బోధకశక్తి నక్సలైట్ ఉద్యమమే"*

*శ్రీశ్రీ, 7.8.1977 ప్రజాతంత్ర వారపత్రిక*

# ఇవాళనుంచీ

## ఒకటి

నా లాకప్‌లో భద్రంగా దాచిన ఒక "అనంతం" శీర్షిక ఇవాళ నుంచీ. ఇది ఎమర్జెన్సీ కాలంలో రాశాను. సెన్సారుల అభ్యంతరం వల్ల అప్పుడు వెలుగు చూడలేదు. ఇప్పుడు యధాతథంగా ముద్రణ కిస్తున్నాను.

*Here Continues* "ఇవాళ నుంచీ"-

నిద్రపోతున్న మాటల్ని నిద్రపోతూనే ఉంచండి. అవసరం వస్తేమేల్కొలుపుతానన్నాను.

ఇండియాలోని వార్తాపత్రికలన్నీ ఏకగ్రీవంగా మాట్లాడుతున్నాయి. చచ్చిపోతున్న దేవుడు గుళ్లకి ప్రాణం వస్తోంది. ఆకలిని జయించిన యోగిని చూసి తరించండని ఒక ప్రకటన. చూసిన వాళ్ళకి డబ్బు వదిలిపోతుందే తప్ప ఆకలి తీరదు. యోగిగారిదో జబ్బు. అందులో ఆధ్యాత్మిక శక్తులే లేవు. ఆ జబ్బును ప్రదర్శించి డబ్బు చేసుకుంటున్నారు పూజార్లు.

ఇవాళ దేశంలో శాస్త్రగ్రంథాలకు బదులు మతగ్రంథాలు ఎక్కువగా అచ్చవుతున్నాయి. దేశాన్ని పట్టుకున్న జబ్బుకి ఇదో గొప్ప ఉదాహరణ మంత్రి పుంగవుల్లో దైవభక్తి పెచ్చుపెరిగిపోతోంది. అరచేతులూ, జాతకాలూ చూసే వాళ్ళ గిరాకీ జాస్తి అయింది. ఈ చెన్నపట్టణంలో ఊరేగింపులు నిషిద్ధం. అయినా, ఏదో ఒక దేవుడిపేరు చెబితే అన్ని నిషేధాలు సడలిపోతాయి. దేవుడంటే పోలీసువాళ్లకి కూడా భయమే.

ఇటువంటి పరిస్థితుల్లో నాస్తికత్వం మీద నా నమ్మకం మరింత బలపడుతోంది. ఇవాళ రా.వి.శాస్త్రి తన విరసం సభ్యత్వానికి రాజీనామా ఇస్తూ నాకో ఉత్తరం రాశాడు. నాస్తికత్వం మీద ఇంకా తనకు పూర్తినమ్మకం కుదరలేదట. తానో అజ్ఞేయవాది (అగ్నోస్టిక్) అట! రా.వి.శాస్త్రి రాజీనామా ఇవ్వడానికి గల కారణాలన్నింటిలోనూ ఇదే ముఖ్యమైనది. జాతకాలకు కూడా అప్పుడప్పుడో అవకాశమిచ్చే బలహీనతకూడా తన్ను వదిలిపెట్టడం లేదన్నాడు.

విరసం సభ్యులంతా విధిగా నాస్తికవాదులు కావాలని ఎవరన్నారు?. జాతక గ్రంథాలన్నింటిని తగులబెట్టాలని విరసం ఎప్పుడూ తీర్మానం చెయ్యలేదే! విరసం ఎప్పుడూ ఏ రాజకీయ పార్టీకో తోకగా పని చెయ్యలేదు. అరసం ఆవిర్భవించింది లగాయితు ఈ నాటిదాకా ఆ పనే చేస్తోంది. పైగా విరసం రాజకీయాలకే పూర్తిగా అంకితం అయిపోయి సాహిత్యసన్యాసం చేసిందని అభాండాలు వేస్తోంది.

విరసం మీదగానీ, జననాట్యమండలి మీద గాని, సంస్థలుగా ఈ నాటికీ నిషేధం లేదు. విరసంలో, జననాట్యమండలిలో సభ్యత్వం ఒక నేరం కాదు. విరసం సభ్యుల్లో కొందర్నీ, జననాట్యమండలి సభ్యుల్లో(బహుశా) అందర్నీ ప్రభుత్వం నిర్బంధంలో ఉంచినప్పటికీ ఈ రెండుసంస్థలూ నేటికీ సజీవంగానే ఉన్నాయి. భవిష్యత్తులో విరసం కన్నా ప్రయోజనకరమైన సంస్థలు ఏర్పడితే అప్పుడు విరసం అవసరం ఉండదు.

రా.వి.శాస్త్రి ఉత్తరం అందిన తర్వాత కుటుంబరావుగారిని కలుసుకున్నాను. నాకూ, కొకురావుకీ, కె.వి.రమణారెడ్డికీ ఒకే ఉత్తరం ప్రతులు పంపించారు రాచకొండ. రమణారెడ్డికి ఆంధ్రప్రభుత్వపు ప్రధాన కార్యదర్శి ద్వారా పంపించడమయింది. రమణారెడ్డి ఇప్పుడెక్కడ ఉన్నదీ నాకు తెలియదు.

అరసం చేస్తున్న పొరపాటే విరసం కూడా చేస్తోందని కుటుంబరావు ఫిర్యాదు. మొదటి నుంచీ ఈ విషయంలో ఆయనకి ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. వాటితో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. అయినా విరసం ఏ రాజకీయ పార్టీకి తన మెదడు తాకట్టు పెట్టలేదనీ, పెట్టబోదనీ నేను చెప్పగలను. అ.ర.సం. విజృంభించి పని చేస్తున్న రోజుల్లో దానికార్యదర్శి శ్రీ తుమ్మల వెంకటరామయ్య కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు. కాని విరసం ఏర్పడింది మొదలు నేటిదాకా నేనుగానీ, కొకురావు, రావిశాస్త్రిగాని, కార్యదర్శులుగా ఉండిన చెరబండరాజు, నిఖిలేశ్వర్, మధుసూదనరావులు గానీ ప్రస్తుతపు కార్యదర్శి రమణారెడ్డిగానీ ఏ రాజకీయపార్టీలోనూ సభ్యులంకాము. మాది సాహిత్య దృక్పథం! ప్రధానంగానే కాదు, పూర్తిగా ఇదే విరసానికి బలమైన పునాది.

అందుచేత కుటుంబరావుగారూ! ''విరసం ఇంకా బతికే ఉందా'' అని విస్తుపోతూ మీరు వేసిన ప్రశ్నకు ''ఔను బతికే ఉంద''ని జవాబు చెప్పగలుగుతున్నాను. విప్లవ రచనల్లో ఉన్న చైతన్యమే విరసాన్ని సజీవంగా నిలబెడుతుంది.

రా.వి.శాస్త్రీ,మరికొందరు సభ్యులూరాజీనామా ఇచ్చినందుకు నాకు విచారంగానే ఉంది. చాలామందికి సంతోషదాయకమని కూడా నాకు తెలుసు. ఇదెంతో కాలం నిలిచే సంతోషం కాదని వాళ్లకు తెలియదని నాకు తెలుసు. నిద్రపోతున్న మాటలు ఎప్పుడూ నిద్రపోతూనే ఉండవు. ''ఆ నిద్రలోనే ఏవో భయంకరమైనవో, మనోహరమైనవో కలలుకంటూనే ఉంటాయి''.

రెండోసారి అల్లూరిసీతారామరాజులో నాపాటకి బహుమతి వచ్చిందని పేపర్లో చదివాను. బ్రిటిష్‌వాణ్ణి చంపరా, నరకరా అని ఎన్నిమార్లు రాసినా, ఎవ్వరికీ ఏ అభ్యంతరమూ ఉండదు. అటువంటి నరరూపరాక్షసులే ఇప్పటికీ మన మధ్య ఉన్నారనీ, ఉండడమే కాదు బ్రిటిష్‌వాడు కూడా ఆచరించడానికి సాహసించలేని అఘాయిత్యాలు సాగిస్తున్నారనీ అందరికీ తెలిసిన రహస్యం. నెహ్రూ ఆశించినట్లు వీళ్ళని లాంపు స్తంభాలకు ఉరితీయనక్కరలేదు. కనీసం సంకెళ్లు వేసి నడివీధిలో నడిపించినా బాగుండును. అలా జరిగినప్పుడు మహాకవిత్వం

రాసే చెరబండరాజు చేతులకు సంకెళ్ళు వెయ్యవలసిన అవసరం ఉండదు. వరవరరావు స్వేచ్ఛగా మన మధ్యనే మసలుతూ ఉంటాడు.

డి.ఎం.కె.ప్రభుత్వం పడిపోయినందుకు తమిళనాడంతా పండగలు చేసుకుంటోందని ఒక గొప్ప ప్రచారం సాగిపోతోంది. ఇది యెంతవరకూ నిజమో నాకు తెలియదుగానీ ఈ మద్రాసులోని చచ్చుపుచ్చు దేవుళ్లందరికీ ప్రాణప్రతిష్ట జరుగుతోంది. ఏదో ఒక దేవుడి పేరిట కరపత్రాలు అచ్చువేసి చందాలు దండుకోవడం ముమ్మరంగా సాగిపోతోంది. అచిరకాలంలో ఈ.వీ.రామస్వామినాయకర్ విగ్రహాల మీద లారీ ఆక్సిడెంట్లు జరిగినా నేను ఆశ్చర్యపోను. ఈ దైవభక్తులు ఎంత నీచకార్యానికైనా తెగించగలరు. తర్వాత ఒక కొబ్బరికాయ కొట్టి ఇంత కర్పూరం తగలేస్తే తమ పాపాలు పటాపంచలయిపోతాయన్న ధీమా వీళ్లకి ఎప్పుడూ ఉండనే ఉంది.

ఇటువాళ్ళ చర్యలను పేరుపేరు వరసలతో బయటపెట్టి తూర్పారపట్టాలని నాకుంది. కాని మన డిఫమేషన్ చట్టాలు ఇందుకు అంగీకరించవు. వాడు చేసిన దాన్నే వాడి పేరుతో బట్టబయలు చేశానంటే వాడికేదో పరువు నష్టం జరిగిపోయినట్టు గోల చేస్తారు. చట్టం కూడా వాడి కొమ్మే కాస్తుంది.

అలాగే అశ్లీల రచనల మీద చట్టాలు నేను చెప్పదలచుకున్నది చెప్పదలచుకున్నంతా స్పష్టంగా చెప్పడానికి వీలు లేకుండా చేస్తున్నాయి. అందుకే రచయిత అన్నవాడు కథల చాటునా, నవలల చాటునా దాగుండి గెరిల్లా యుద్ధం సాగించవలసివస్తోంది. అనాది నుంచీ కవులు స్వేచ్ఛ మాత్రమే కాదు లైసెన్సును కూడా అనుభవిస్తున్నారు. పాలకవర్గానికి భజన చేస్తున్నంతకాలం కవి ఎంత విశృంఖలంగానైనా ప్రవర్తించవచ్చును. పతితవర్గాల, పీడిత వర్గాల తరపున గొంతు విప్పితే మాత్రం చేతులకు శృంఖలాలు, నివాసానికి చెరసాల.

అందుకే ఎందుకీ గొడవని 20 సూత్రాల ప్రణాళికని ఉగ్గడిస్తూ, ఎవడు అధికారంలో ఉంటే వాడే గొప్పవాడని అంగీకరిస్తూ నిద్రపోతున్న మాటల్లారా, నిద్రపోతూనే ఉండండంటున్నాను.

*శ్రీశ్రీ ఇది 1976 ఫిబ్రవరి మొదటివారంలో రాసి ఉండవచ్చు.*
*అచ్చయింది మాత్రం ప్రజాతంత్ర 23–10–1977 సంచికలో.*

## రెండు

ఇవాళ 12-2-76.-

ఉదయమే లేచాను. నోట్లో వేలుపెట్టుకుని పవుడరుతో పళ్ళు కడుక్కున్నాను. ఆగమంది నా ఆలోచన.

ఎవరిక్కావాలి ఈ వెధవ సంగతులు? కవిత్వం రాయమంటారు.

ఎక్కడ నుంచి వస్తుందది?

అయినా నిజాన్ని మించిన కవిత్వం ఏముంది?

ఇప్పుడు 11 గంటలయింది.

కామధేనులో డ్రింకు(పెర్మిట్ మీద ) కొనుక్కొని బైటికొచ్చి ఒకవార నిలుచుని సిగరెట్టు ముట్టించాను.

"గోవిందా" అంటూ ఒక కుర్రాడొచ్చాడు.

పసుపురాసి పరిశుభ్రం చేసిన ముష్టిచెంబు చూపించాడు. దానిమీద వెంకటేశ్వరస్వామి తిరునామాలున్నాయో? లేవో? ఉంటే నేను చూడలేదో, లేకపోతే ఉన్నాయనుకున్నానో!

ఆరిపోయిన అగ్గిపుల్లను వాడి ముష్టి చెంబులో వెయ్యబోయాను. కుర్రాడు నావేపు చురచురా చూశాడు.తిట్టుకున్నాడేమో లోలోపల!

చీదరించుకుంటూ వెళ్ళిపోయాడు.

చెప్పండి రంగనాయకమ్మగారూ, ఈ కుర్రాడికిగాని, లేని దేవుడికిగాని నేను ద్రోహం చేశానా?

బహుశా, ఇద్దరం మగవెధవలమే కాబట్టి ఇద్దరిమీదా, కాదు మగజాతి మీదనే మీ ఆగ్రహం ప్రజ్వలిస్తుందనుకుంటాను.

లేకపోతే నేనెంత నీచుణ్ణయినా నా రాతలు మీకెంత జుగుప్స కలిగించినా, మొత్తం పురుషజాతినే ద్వేషించడం ఏమి మార్క్సిజమండీ!

కావాలనే అంటున్నాను, మొత్తం పురుషజాతి అని! కాస్త మీరూ ఆలోచించండి. అంతర్విలోకనం చేసుకోండి.

మీలో నిండి నిబిడీకృతమైన పురుషద్వేషాన్ని బైటపెట్టాననే మీ ఆగ్రహం! కృతజ్ఞుణ్ణి.

మళ్ళీ ఇందాకటి కుర్రాడి దగ్గరకొస్తున్నాను. ఆరిపోయిన అగ్గిపుల్లకు బదులు లార్డ్ వెంకటేశ్వరుడి పేరున పదో, వందో, వెయ్యో, నాశక్తికొద్దీ ఒక చెక్కు కాగితం వేసినా, వాడికదో చెత్తకాగితమే. అయిదుపైసలో, పదిపైసలో వేస్తే అప్పుడెంత మెచ్చుకునేవాడో!

చెక్కులూ, నోట్ల కట్టలూ సరాసరి స్వామి వారి హుండీలోనే వెయ్యాలి. ఆ మధ్య ఎవడో పుణ్యాత్ముడు, కాదు పాపాత్ముడు లక్షా నలభైవేల మొత్తం నూర్రూపాయల కట్టలు చదివించుకున్నాడని పేపర్లో చదివాను (ఇది నిజమే అయి ఉండాలి. ఎంచేతనంటే ఇప్పుడు నిజాయితీ బాగా పెరిగిపోయింది).

ఆపమంటోంది నా ఆలోచన.

నా యువకమిత్రమా! కొల్లాపూర్ రాజకమల్.

నీలాంటి యువకుల వల్లనే ఈ దేశం చెడిపోతోందిరా యువకుడా!

నా రచనలు నీకు వచ్చకపోతే చదవడం మానేయ్. రాయొద్దనడానికి నువ్వెవడివి? పైగా మొత్తం యువలోకం తరఫున ఎవడిచ్చాడు నీకు వకాల్తా? నా జీవితాన్ని ఒరవడిగా పెట్టుకుని జీవించడం కోసం నేనీ రచన సాగించడం లేదు. నన్ను అర్థంచేసుకునేవాళ్లు నాబలహీనతల్ని

కూడా అర్థం చేసుకుంటారు. నేనంటే ఇష్టం లేనివాళ్లు నా మంచితనాన్ని కూడా ద్వేషిస్తారు.

ఇప్పుడు, మద్రాసులో నా వాచీ ప్రకారం 11.30. నాకు గొప్ప కీర్తి తెచ్చిపెట్టిన నా మహాప్రస్థానం గీతాలు కూడా నేను డ్రింకు తీసుకొని రాయలేదు. ఇప్పుడిదంతా పాండీ రమ్ మత్తులో రాస్తున్నాను.

పాండీరమ్ - నా ప్రేయసి
చిరునవ్వుల డిండీరం -
ఇది నా గాండీవం!

ఇలాంటి కవిత్వాలకి కాలం చెల్లిపోయింది.

నిన్నటి కవిత్వం లాగ నేటి కవిత్వం ఉండకూడదు. నిన్నటి కంపు నేటి యింపు. ఒరే కుర్రకవీ! మళ్లీ గిరజాలు పెంచుతున్నావా! కృష్ణశాస్త్రి ఇంకా బతికే ఉన్నాడురా!

రాయప్రోలు-
అబ్బూరి-
సిగసంకటి, *Sorry!*
శివశంకరస్వామి
అందరూ బతికే ఉన్నారురా;

ఇది అనంతం;

ఎవడో కుర్రాయన వద్దంటే ఆగదు. నేనుబతికున్నంత కాలం ఇది సాగుతుంది.

*ప్రజాతంత్ర 22–2–1976*

## మూడు

అయిందేదో అయిపోయింది. వెళ్లిన కాలం వెళ్లిపోయింది. ఒక్కొక్క రోజే వస్తూ ఉంటుంది. ఈ జీవితం అనంతం అని రుజువు చేస్తూ ఉంటుంది.

గతించిపోయినవన్నీ నెమరువేసుకోవడం కోసమని ఈ 'అనంతం'' నేను రాయలేదు. రేపేం జరుగుతుందో చెప్పగల జ్యోస్యుణ్ణి కాను కనుక ఇవాళనుంచీ ఏమవుతున్నదీ రాస్తున్నాను.

ఇవాళ 14-2-76.

సాయంత్రం తిరుమతి ఇందిరమ్మాళ్ వస్తున్నారు. మవుంటు రోడ్డు (అన్నట్టు అన్నాసాలై అంతా ఇరువైపులా అయిదేసి గజాలకొకడు చొప్పున పోలీసు బందోబస్తు.

ఇదే సాయంత్రం నేనుంటున్న రాజా అన్నామలైపురానికి హిజ్ హోలినెస్ జగద్గురు శ్రీశ్రీ జయేంద్ర సరస్వతి ఆఫ్‌ది కంచికామకోటి పీటం (పీఠం అని చదువుకోవాలి) వారు వేంచేస్తున్నారంది ''హిందూ'' పత్రిక. ఇక్కడ కూడా దట్టంగా దిట్టంగా వుంది పో.బం.!

ఇవాళ చెన్నపట్టణం మహాకోలాహలంగా వుంది. ఉండదూ మరి? ఆర్థికక్షేమానికి ప్రధానీ, పారమార్థిక క్షేమానికి జగద్గురువూ పూచీ వహించారు. నాకేమో ప్రధాని మీద ఉన్నంత పాటి నమ్మకమైనా జగద్గురువు మీద లేదు. జగత్తుకంతాఈయన గురువు! ఎంత స్వాతిశయం!

తెలుగుదేశంలో ఇందిరమ్మ, తమిళనాట ఇందిరమ్మాళ్, దేశమంతటికీ ఇందిరా ప్రియదర్శిని. ఈమె ఆర్థిక సూత్రాలు నాకు నచ్చాయి. నచ్చబట్టే ఈ మధ్య ఆకాశవాణికి పదిపదిహేను చరణాల పాట రాశాను. అయినా 20 సూత్రాలు చాలవు. మనకింకా కనీసం రెండువందల సూత్రాలయినా కావాలి.

మద్రాసులో ప్రొహిబిషన్ పోలీసులూ, విజిలెన్సు పోలీసులూ అర్థరాత్రి ఏ యింట్లో కయినా జొరబడతారు. నాలుగు సారాబుడ్లనీ, అయిదుగురు అమాయకురాళ్లనీ జప్తుచేస్తారు. అంతేగాని పట్టపగలు వీధుల్లో అడుక్కుతినే వెధవల జోలికిపోరు.

అందుకే నేనంటున్నాను. భిక్షకత్వం నిర్మూలించాలని. అయినా, నా మాట వినేదెవరు? ఆదిభిక్షువు మన దైవం.

హిందూ పేపర్లో ఎవడో ఒక ఉత్తరం రాశాడు. మాంబళంలోని శివవిష్ణు టెంపిల్ ముందున్న ఈ.వీ. రామస్వామి నాయకర్ విగ్రహాన్ని తొలగించాలని. మతభక్తుల సున్నితమయిన మనస్సులకి గాయాలు చేసే రాతలన్నీ ఆ విగ్రహం కింద ఉన్నాయట.

అంటే డి.యం.కె. ప్రభుత్వం మారిన తర్వాత మద్రాసులో దైవభక్తుల రాజ్యం వచ్చేసిందని కొందరు భ్రమపడుతున్నారు. మరేం పర్వాలేదు. మన ఇందిరమ్మకి దేవుడూనై. గురువునై.

తమిళనాడులో దిరావిడ మున్నేట్ర కజగం పరిపాలన పడిపోయినందుకు నేనేమీ చింతించడం లేదు. ఆ వెధవలు కూడా తమ జేబులు నింపుకోవడానికే తాపత్రయపడ్డారు. అందుకే కామరాజు నాడార్ నెత్తీ నోరు మొత్తుకుని ప్రకటనల మీద ప్రకటనలు చేసేవాడు. (తన హయాంలో కాంగ్రెస్ పార్టీ కూడా అదే పని చేసింది గాని అది వేరే సంగతి).

ఇవాళ చచ్చిపోయిన దేవుడు మళ్ళీ బతికినట్లు మద్రాసంతా పండుగ చేసుకుంటోంది.

మళ్లీ చెబుతున్నాను. మాంబళంలో శివవిష్ణు టెంపిల్ దగ్గర ఉన్న ఈ.వీ.రామస్వామి నాయకర్ విగ్రహాన్ని పీకిపారెయ్యాలని ఒక భక్తుడు "హిందూ" పత్రిక్కి ఉత్తరం రాశాడు. ఏమంటే ఆ విగ్రహం కింద అరవంలో పరమనాస్తిక భావాలు రాసి పెట్టి ఉన్నాయట. అవి సున్నితమైన మతభక్తుల మానసాలని గాయం చేస్తాయట.

మరి మెరీనా బీచిలో గాంధీ విగ్రహాన్ని చూస్తూవుంటే నా సున్నితమైన కళాహృదయానికి తగిలే గాయాన్ని గురించి ఎవరితో మొరపెట్టుకోవాలి. అయినా రేపు అక్కడే కదా లక్షలాది జనం ముందు ఇందిరాదేవి ఉపన్యసించేది (ఇవన్నీ ఈ పాటికి పేపర్లలో వచ్చేస్తాయి!)

మెరీనా పేరు కామరాజ్ సాలై అని మార్చారు. నా యింట్లో కక్కసు పేరు "గాంధీ నివాస్".

దక్షిణాన గాంధీ విగ్రహం చెక్కిన దేవీప్రసాద్ రాయ్ చౌదరి ఉత్తరాన "శ్రమవిజయం" అనే శిల్పాన్ని చెక్కారు. అదో ఫోర్జరీ, ఒక పాశ్చాత్య శిల్పానికి కాపీ.

ఈ మద్రాసు మహానగరంలో ఇలాంటివే ఎన్నో అప్రశుతులు. వీటన్నిటినీ సరిదిద్ది సవరించాలని వీ.వీ. గిరిగారి తాపత్రయం.

జగద్గురువు అనగా కూపస్థమండూకం. ఈ మద్రాసు మహాజనాన్ని ఉద్ధరించాలని వచ్చారు. భక్తులు తండోపతండాలుగా ఆయన దర్శనభాగ్యం కోసం పడిగాపులు పడుతున్నారు, ముడుపుల్తో.

ఎంచేతనంటే, గురువుగారి దర్శనం చేసుకునే ముందు పత్రమో పుష్పమో, ఫలమో తోయమో పట్టుకెళ్ళాలట! అందుకోసం ఇంటిలో ఉన్న చెంబూ,తప్పేలా తాకట్టు పెట్టి ఆ గురువుగారికి ముడుపు చెల్లిస్తున్న సంసారులు నా యింటిపక్కనే ఎందరో ఉన్నారు.

అందుకే ఈ దేశంలో కమ్యూనిజం రావడానికి చాలా టైం పడుతుంది. ఈశ్వర తత్వానికి, నిరీశ్వర తత్వానికి జరిగే అంతిమ సమరం ఈ గడ్డ మీదనే సాగుతుంది.

"విపిన బంధుర వృక్షవాటిక
ఉపనిషన్మధు వొలికె నిచ్చట"

చార్వాకులు కూడా(చారువాకులు) అనగా చక్కగా మాట్లాడేవారు, ఇక్కడే తమ గొంతు విప్పారు.

ఆ గొంతుకలను కోసేసినా
నా గొంతుక మాత్రం చార్వాక సిద్ధాంతాన్ని ఉద్ఘోషించడం మానదు.

మరోసారి, రంగనాయకమ్మగారి ప్రసక్తి!

ఒక మిత్రుడు, ప్రజాతంత్ర రెగ్యులర్‌గా చదివేవాడు నా వద్దకు వచ్చి రంగనాయకమ్మని తిట్టేడు. రామాయణ విషవృక్షం ప్రసక్తి తీసుకొచ్చి ఈవిడకి ఏం తెలుసు అన్నాడు. ఎప్పుడో రామానుజులవారు రామాయణ రహస్యం తెలుసుకోవడానికి ఏడుసార్లు ఏడు కొండల వాడిదర్శనం చేసుకున్నారన్నాడు.

రంగనాయకమ్మగారితో నాకెన్ని అభిప్రాయ భేదాలున్నా రామాయణ విషవృక్షం విషయంలో ఆమెతో నేను నూటికి నూరుపాళ్లు ఏకీభవించే వాణ్ణి కాబట్టి నామిత్రుణ్ణి హెచ్చరించాను ఆవిణ్ణి తిట్టవద్దని.

నా రాతలు జుగుప్సాకరంగా ఉంటాయని ఆవిడ అంటే నా ప్రయత్నాలు ఫలించాయన్నమాట. ఎంతఅసహ్యం సృష్టించాలో అంత అసహ్యం నా రాతలు సృష్టిస్తున్నాయన్న మాట.

ఇవాళ కావలసిన రసం శృంగారం కాదు. కరుణ కాదు. ఈ నాడు బీభత్సరసం కావాలి. రంగనాయకమ్మగారికి నా రాతలు జుగుప్సాకరంగా ఉన్నాయంటే నా ప్రయత్నం ఫలించిందనే అనుకుంటున్నాను.

రంగనాయకమ్మగారితో నా పోరాటం స్త్రీత్వానికి, పురుషత్వానికి మధ్య పోరాటం. ఆవిడగారి మనస్సుతో నా మనస్సు- ఆవిడ ఆలోచనల్తో నా ఆలోచనలు- అంతేగాని శారీరక సంబంధం ఏ మాత్రమూ లేదు. ఇంకో విషయం చెప్పదలుచుకున్నాను.

సుఖం అంటే ఏమిటి? సుష్టుగా భోజనంచెయ్యడం ముండలతో పోవడమేనా? కాదు ఇవి అందరూ అనుభవించేవే.

ఒక మంచి పాట వినడం, ఒక మంచి పిక్చర్ కనడం,ఒక మంచి పుస్తకం చదవడం, ఒక మంచి మనిషితో మసలడం.

అంతేకాని, ఎక్కడో ఎవడో దేవుడున్నాడనీ, వాడితో నేను ఐక్యం అయ్యాననీ అదే బ్రహ్మానందమనీ అనుకోవడం ఉత్త భ్రమ! కావలిసింది బ్రహ్మానందం కాదు రసానందం!

*ప్రజాతంత్ర 29–2–1976*

## నాలుగు

ఈ స్వీయ చరిత్రను నా సొంత సంతోషం కోసం రాయలేదు. ఎలా రాయాలనుకున్నానో అలా రాస్తున్నందుకు ఒక సంతృప్తి పొందుతున్నాను గానీ, ముఖ్యంగా ఇది పదిమందీ చదవాలనే రాస్తున్నాను. అలాగే చాలామంది దీన్ని చదువుతున్నారు కూడా. అయితే కొందరు పాఠకులలో ఇదివరకు నామీద ఉన్న సదభిప్రాయం తుడుచుకుపోతే, మరికొందరికి నా నిజాయితీ పట్ల అభిమానం పెంపొందింది. ఇదొక మంచి పరిణామం అని నేననుకుంటున్నాను. రచయితలలో కూడా అభూత కల్పనల మీద మోజు తగ్గి వాస్తవికతను ఎగసనతోసే ఆసక్తి ఏర్పడగలదని ఆశిస్తున్నాను.

ఈ రచనలో ఒక సరళ రేఖగా కాలక్రమాన్ని పాటించకపోవడం కొందరిలో కొంత గందరగోళం పుట్టించుతున్నదన్న విషయం నాకు తెలుసు. ఇది బుద్ధిపూర్వకంగానే, దీన్నొక కొత్త ప్రయోగంగా భావించి చేస్తున్న పని. సినీమాలలో మాంటేజస్‌కీ, ఫ్లాష్ బ్యాక్‌లకీ ఒకే అలవాటు పడినవారికి నా రచన ఏమీ ఇబ్బంది కలిగించదనే నాకు నమ్మకం.

సాహిత్యానికైనా, సైన్సుకైనా ప్రయోగపరత్వమే అభివృద్ధికి రాచబాట వేస్తుంది. నేను నా జీవితంలోనే ఎక్స్పెరిమెంట్ చేస్తున్నాను.

బ్రిటిష్ వాడి బానిసగా ఉన్న రోజుల్లో కూడా నేను స్వతంత్రంగా ఆలోచించాను నిజాన్నే ఆరాధించాను. ఇవాళ నేను చెప్పే నిజాలు కొందరికి వెగటుగా ఉండవచ్చు.

నేను నా బతుకు బతుకుతున్నాను. ఈ బతుకుతో కొందరి బతుకులు అతుక్కుని ఉన్నాయి. ఈ అన్ని జీవితాల మీదా సహేతుక సవిమర్శక వ్యాఖ్యానమే ఈ "అనంతం".

ఇరవయి నాలుగ్గంటలూ దేవుడి సహస్రనామాలు ధ్యానించేవాళ్ళంతా పుణ్యపురుషులు. ఆ దేవుడు అబద్ధం, కవిత్వం నిజం అని నేనుఊపిరి ఉన్నంతదాకా ఉద్ఘోషించడం మానలేను.

నేను నాస్తికుణ్ణి. అనగా దేవుడనే భావానికి బానిసను కాను. అనగా స్వతంత్రుణ్ణి.

దేవుడిమీద నమ్మకం ఉన్న వాళ్లంతా స్వశక్తి మీద విశ్వాసం లేని బానిసలే!

జీర్ణదేవాలయాల పునరుద్ధరణకు కోట్లకొద్దీ ధనం ఖర్చుపెట్టడం కన్నా ఆ డబ్బుతో కుష్ఠురోగ నివారణకు ఉపక్రమించడం మంచిది. అదీ చేస్తాం, ఇదీ చేస్తాం అనేవాళ్ళు దగా కోరులు. ఆ దేవుడు అబద్ధం. ఈ కుష్ఠురోగాన్ని నిర్మూలించే శక్తి సైన్సుకి వుంది. మశూచి లాంటి అమ్మవార్లకి ఈ ప్రపంచం మంచి ఎప్పటికయినా ఉద్వాసన తప్పదు. దేవుడికి ఉద్వాసన చెప్పిన దేశాలన్నీ సుఖంగా బతుకుతున్నాయి.

20 సూత్రాల ప్రణాళికతో నేను (మళ్ళీ చెబుతున్నాను) మనస్ఫూర్తిగా ఏకీభవిస్తున్నాను. నా ఇరవయి ఒకటో సూత్రం దైవాన్ని తగిలేయడం. ఎక్కడ నుంచో కాదు, మన మనస్సులలో నుంచి.

ఇవాళ నేనింత హాయిగా, ఆరోగ్యంగా ఉన్నానంటే అందుకు కారణం నా నాస్తికత్వమే!

నా జీవితాన్ని ఒరవడిగా చేసుకోవాలని యువతరం ఉబలాట పడుతోంది. నా తప్పుల్నీ, పొరపాట్లనీ కూడా మన్నించడానికి వాళ్ళు సిద్ధంగాఉన్నారు. అదే వద్దంటాను నేను. నాలో ఏ కొంచెమైనా మంచితనం ఉంటే దాన్నే అనుకరించండి. నా తప్పుల్ని నిర్దాక్షిణ్యంగా దుయ్యబట్టండి.

ఇన్నాళ్లూ నేను కొంచెం మంచిగానూ, చాలా చెడ్డగానూ బతికేను. ఇక మీద మాత్రం మంచిగా మాత్రమే బతకదలచుకున్నాను. ఇది నా ఒక్కడి వల్లా జరిగే పని కాదు. ఇందుకు అందరి సహకారమూ కావాలి.

బస్సు దిగి నడుచుకుంటూ వస్తున్నాను. ఒక అమ్మాయి తానుగా కలగజేసుకొని, నాలుగో క్రాస్ స్ట్రీట్‌కి దారి ఏదని అడిగింది. "నాకు తెలియదు. అదుగో అదే మా యిల్లు, అక్కడ నీ వయస్సుదే నా కూతురు ఉంటుంది, రా" అన్నాను. బాధపడుతూ నాతో నడిచింది.

ఇంట్లోకి వెళ్ళాం. మంచినీళ్ళు కావాలంది అపరిచితురాలయిన అమ్మాయి. వెంటనే నా కూతురు మంచినీళ్ళు తెచ్చి యిచ్చింది.

నాలుగో క్రాస్ స్ట్రీట్ ఎక్కడుందో నా కూతురికి కూడా తెలియదు. మా యింటి దగ్గరే పోస్టాఫీసు ఉంది. అక్కడ అడిగితే చెబుతారంది.

అపరిచితురాలికి కావలసింది నాలుగో స్ట్రీటు కాదు. నా వైపు జాలిగా చూసింది.

నేను గ్రహించాను.

ఇదేదో సెక్సుకథ అని నా పాఠకులు భ్రమ పడవద్దు. ఆమెకి "కక్కూస్" కావాలి.

బాధపడుతూ నా యింటి కొచ్చిన అమ్మాయి హాయిగా అవతలికి పోయింది.

దీన్నే దేహబాధ అంటారు.

ఈ విషయాలు రాయడం అశ్లీలం రామాయణ భారతాల రంకుబొంకులకు అలవాటు పడ్డ ఈ దేశానికి నా రచనలన్నీ అశ్లీలంగానే ఉంటాయి.

*ప్రజాతంత్ర 14–3–1976*

# ఎవరిష్టం వారిది

## ఒకటి

అచ్చులో వెలువడ్డ నా మొట్టమొదటి పద్యరచన ఒక గీతమాలిక. విశ్వరూప సందర్శనము అని శీర్షిక. ఇది ''స్వశక్తి'' అనే వారపత్రికలో ముద్రితమయింది. కౌరవసభలో శ్రీకృష్ణుడు తన విశ్వరూపం ప్రదర్శించినప్పుడు ధృతరాష్ట్రుడు-

''ఓ మహాత్మ! త్వదీయ మహోన్నత ప్రభావమింతని పలుక నెవ్వాని తరము?

... ... ...

దివ్య లోచనముల ప్రసాదింపుమయ్య!''

అని ప్రార్థిస్తాడు. ఇంతవరకే నాకు జ్ఞాపకం వుంది. కాలగర్భంలో కలిసిపోయిన నా రచనలలో ఇదొకటి.

ఆ రోజుల్లో పురిపండా అప్పలస్వామి ''స్వశక్తి'' పత్రికాసంపాదకుడు. పత్రిక కాకినాడలో అచ్చయి విశాఖపట్టణంలో విడుదల అవుతూ వుండేది. పురిపండాతో నాప్రథమ పరిచయం ఈ గీతమాలిక ద్వారానే. దీన్ని తీసుకువెళ్ళి పురిపండాకు ఇచ్చాను. అప్పుడు నా వయస్సు 15, 16 ఏళ్ళలోపు. చూడ్డానికి ఇంకా చిన్నవాణ్ణిగా కనపడేవాణ్ణి. పురిపండా నన్ను ఒక్కసారి ఎగాదిగా చూసి, చేతిలోని వ్రాతప్రతి చదువుతూ ఆగి, ''శ్రీరంగం శ్రీనివాసరావు అంటే ఎవరు? మీ అన్నయ్యా?'' అని అడిగేడు. ''నేనే'' అంటే ఆశ్చర్యపోయాడు. రాసింది నేనే అని నమ్మలేకపోయాడు. అలా జరిగింది మా తొలి పరిచయం. తర్వాత, తర్వాత నేనేది రాసినా పురిపండాకి చదివి వినిపించేవాడిని. ఈ పరిచయమే ''కవితా సమితి'' స్థాపనకు దారితీసింది.

నామొదటి భార్య శ్రీరంగం వెంకటరమణమ్మ నాకన్న అయిదేళ్ళు చిన్న. నా 15వ ఏట మా పెళ్ళి జరిగినప్పుడు ఆమెవయస్సు పదేళ్ళు. 40వ ఏటనే ఆమెకి జుత్తు పూర్తిగా నెరిసిపోయింది. మేము రైల్లో ప్రయాణం చేసేటప్పుడు తోటి ప్రయాణీకులు ''ఇతను మీ అబ్బాయా?'' అని నన్ను గురించి అడగడం ఆమెకు కష్టంగా ఉండేది. రైలు ప్రయాణాలు చేసేటప్పుడు మాత్రం నా జుత్తుకు తెల్లరంగు రాసుకుంటానన్నానుగాని అందుకామె అంగీకరించలేదు.

నా రెండవభార్య ఉపద్రష్ట సరోజ నాకన్న 30 ఏళ్ళు చిన్న. నలుగురు బిడ్డల్ని కన్న తల్లిలాగ ఇప్పటికీ కనిపించదు. మేము రైలుప్రయాణాలు చేసేటప్పుడు ''ఈ పిల్ల మీ

అమ్మాయా?'' అని సరోజ గురించి నన్ను తోటి ప్రయాణీకులు అడిగేవారు. అందుకు నేనేమాత్రమూ బాధపడేవాణ్నికాను. సరోజ మాత్రం 'ఈయన మావారండీ! శ్రీ శ్రీ గారు! మాకు నలుగురు పిల్లలున్నారు' అని చెప్పేది.

శ్రీరంగం వెంకటరమణమ్మ పెద్దగా చదువుకున్నదికాదు. అయినా కొద్దిపాటి సాహిత్యపరిజ్ఞానం లేకపోలేదు. ''నా హృదయంలో విదురించే చెలీ!'' అని నేను రాసిన పాటలో ''ఎవరా చెలి?''అని అడిగేది. ''మరెవరోకాదు, కమ్యూనిజమే''అని నేనంటే నమ్మేదికాదు. నేనెంత నాస్తికుణ్నో ఆమెదంత దైవభక్తి. ఆవిడ సంతృప్తికోసం నేను కొన్ని పూర్వాచారాలను పాటించక తప్పలేదు. ఆమె అంత్యక్రియలు కూడా వేదోక్తంగా జరిపించి నందుకు నేను విచారించను.

సరోజ నా నాస్తికత్వాన్ని పూర్తిగా అర్థం చేసుకుంది. అయినా ఈమె రోజూ తెల్లారే సరికి స్నానం చేసి దేవుడికి పూజ చేస్తుంది. ఇందుకు నేను అభ్యంతరం చెప్పను. ఇతరులచేత మతాంతరం స్వీకరించేటట్లు చెయ్యాలనే తహతహ నాకు లేదు. ''నీ జీవితంలో సుమారు ఒకగంట కాలం వృథాచేస్తున్నా''వని సరోజను అప్పుడప్పుడు హెచ్చరిస్తూ వుంటాను. కాని తన పూజల వల్లనే సూర్యుడు రోజూ తూర్పున ఉదయిస్తున్నాడని ఆమె మనఃపూర్తిగా నమ్ముతుంది. అదో నమ్మకం మాత్రమే. అక్కడ హేతువాదం ఎంతమాత్రమూ పనిచెయ్యదు.

దేవుడి మహిమలను ప్రచారం చేసే దైవభక్తుల హక్కును మన ప్రభుత్వం గుర్తిస్తోంది. అంతవరకు నా అభ్యంతరం ఏమీలేదు. కథలలో, కవిత్వాలలో, భరతనాట్యాలలో, భజనలలో ఎంత ప్రచారమైనా సాగించవచ్చు. కాని, దేవుడులేడని త్రికరణశుద్ధిగా నమ్ముతున్న నా విశ్వాసానికి ప్రభుత్వం ఏ కొంచెమైనా హామీ ఇస్తుందా? జగద్గురు స్వాముల వారికున్న రక్షణలో పదోవంతయినా ఆశించే హక్కు నాకు లేదా?

సైన్సును సత్యంగా కాకపోతే, కనీసం సత్యాన్వేషణగానయినా అంగీకరించాలా వద్దా? ఒకప్పుడు సైంటిస్టులను మతగురువులూ, మహారాజులూ చిత్రవధలు చేసిన సంఘటనలు మనం చరిత్రలో చదువుకోవడం లేదా? అయినా ఈనాడు మతం ఓడిపోతోంది. సైన్సు గెలుస్తోంది. ఇదే ఈనాటి చారిత్రక పరిణామం. దీన్ని ఏ పూజారీ తన కుంటికాలు అడ్డుపెట్టి అడ్డలేడు.

మొన్నీమధ్య మద్రాసులోని సోవియట్ హౌస్ ఆఫ్ కల్చర్‌లో ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని చూశాను. హెల్సింకీలో జరిగిన యూరోపియన్ శిఖరాగ్ర సమావేశాన్ని చిత్రించే ఫిలిం అది. ఈ చరిత్రాత్మక సంఘటనకు వ్యతిరేకంగా కొన్ని ప్రదర్శనలు జరిగాయి. కొంతమంది కమ్యూనిస్టు వ్యతిరేకులూ, దైవభక్తిపరులూ ఈ సమావేశానికి తమ అసమ్మతి తెలుపుతూ ఊరేగింపులు లేవదీశారు.

ఊరేగింపులో వాళ్ళు మోసుకు తిరిగిన అట్టలమీద ఇలా రాసిఉంది ఇంగ్లీషులో:
*"God Yes! Communism no!"*

ప్రపంచం అంతటా ఒక కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం సాగుతూనే ఉంది. రష్యాలో అక్టోబరు విప్లవం విజయవంతమయిన తర్వాత ఇది మరీ ఉధృతమయింది. ఈ ప్రచారం సాగించే వాళ్ళకి దేవుడే తోడూనీడ! దేవుడిచాటున దాగి వీళ్ళు మానవుడితో పోరాడుతున్నారు. ఈ పోరాటంలో అంతిమ విజయం మానవుడిదే!

కొంతమంది మిత్రులు, నేను నిరీశ్వరవాదాన్ని చేపట్టి మార్క్సిజానికి తిలోదకాలిచ్చానని నిందిస్తూ ఉత్తరాలు రాశారు. ఈ విమర్శను నేను అంగీకరించలేను. మార్క్సిజానికి పునాది నిరీశ్వరవాదం. విజ్ఞాన శాస్త్రాలలో ఎక్కడా దేవుడికి చోటు లేదు. "నేను దేవుణ్ణి నమ్ముతాను మార్క్సిజాన్ని నమ్ముతాను" అనేవారు నా దృష్టిలో దగాకోర్లు.

సర్వమానవ సమానత్వం ఈనాడు ఒక ఆదర్శం మాత్రమే. కాని అది అందుకోవడానికి సాధ్యం కాని ఆదర్శం మాత్రం కాదు. ఎన్నో ఎగుడుదిగుడులున్న నిన్నటి బంజరు భూమి నేటి విమానాశ్రయమయింది. ఈ యెగుడుదిగుడులు భగవంతుడి సృష్టికాదు. వీటిని చదునుచేసే శక్తి మానవుడికి ఉంది.

సరే, దేవుడికి సంబంధించిన ఈ విషయాలన్నింటినీ ప్రస్తుతం మట్టుకు చెత్తబుట్టలో పారేసి, భోజనానికి సంబంధించిన మూడు ముఖ్యవిషయాల్నిక్కడ రాస్తాను.

వాటిలో మొట్టమొదటిది నా ఉప్మావంటకం. ఈ విద్య నాకు శ్రీమతి శ్రీరంగం వెంకటరమణమ్మ నేర్పింది. ఢిల్లీలో నా ఆలిండియా రేడియో ఉద్యోగంపోయిన తర్వాత మేం ఇద్దరమూ అష్టకష్టాలు కాకపోయినా వాటిలో కొన్ని అయినా అనుభవించాము. కాగితాలతో మంట చేసి, నేను ఉప్మా తయారు చేశాను. రెండు రోజులు ఉపవాసం ఉన్న తర్వాత, (ఇంట్లోకి రాని మా ఆవిడ సలహాలు తూచా తప్పకుండా అనుసరిస్తూ) నేను ఉప్మా తయారు చేశాను. ఇద్దరం ఆ చేసింది తిన్నాము.

రెండో సంఘటన. ఢిల్లీలో చలికాలం నాలుగు నెలలపాటు నా మూలుగులు తెగ కొరికింది. అప్పటికింకా నేను రేడియో ఉద్యోగం చేస్తూనే ఉన్నాను. సంక్రాంతి పండుగ వచ్చింది. నా పై అధికారి మా దంపతులిద్దర్నీ భోజనానికి ఆహ్వానించాడు. ఆయన తెలుగువాడే!

ఆయన ఇంట్లో వంటవాడు ఒక ఉత్తరాది మహారాజు. అతనికి పులిహోర చెయ్యడం ఎలాగో సవిస్తరంగా బోధపరిచి, తానే ఆ వంటకం చేసినట్లు గర్విస్తూ దాన్ని మా అరిటాకుల్లో అధికారి వడ్డింపించాడు. నిజంగా ఆ పులిహోర, పసుపు రాసుకున్న ముత్తైదువ ముఖంలాగ కళకళలాడుతోంది. అంత అందంగా కనిపిస్తున్న పులిహోర ఎంతరుచిగా ఉంటుందో అనుకున్నాను. కాని రెండు మెతుకులు నోట్లో వేసుకుంటే అంతా చేదు విషం!

ఇది ఎలా జరిగింది-అంత కష్టపడి అన్నిపాఠ్యా బోధపరిస్తే ఆ మహారాజు ఒకే ఒక చిన్న తప్పు చేశాడు. కరివేపాకుకు బదులు వేపాకు వేశాడు. హిందీలో కాలానీమ్ అంటే కరివేపాకు. నీమ్ అంటే వేపాకు. బజారుకువెళ్ళి కరివేపాకు తీసుకురావడానికి బద్ధకించి

పెరట్లోనే ఉన్న వేపాకు ఉపయోగించాడు. రెండింటికీ పెద్దభేదం లేదనుకున్నాడు. తెలుగు వాళ్ళ అభిరుచి ఇదే కాబోలుననుకున్నాడు.

పాపం, నాపై అధికారి తన ప్రయత్నమంతా ఇలా వృధా అయిపోయినందుకు చాలా బాధపడ్డాడు.

మూడోది పీతలకూరకి సంబంధించినది. ఇది విశాఖపట్టణంలో జరిగిన సంఘటన.

సముద్రతీరంవద్ద పట్టాభి లాడ్జి మా పక్షితీర్థం. రకరకాల కుర్రాళ్ళం అక్కడ పోగవుతూ వుండేవాళ్ళం. ఒక వెన్నెలరాత్రి సముద్రపుటొడ్డున వేల సంఖ్యలో పీతలు తిరుగుతున్నాయి. నేనో గోనెసంచి మూపున వేసుకుని బయలుదేరాను. పీతకన్నంలోకి వేళ్ళుపోనిచ్చి అతిచాకచక్యంతో పీతల్ని పట్టే ఇద్దరు ముగ్గురు నిపుణులు నాతో ఉన్నారు. వాళ్లు పీతల్ని పట్టి బస్తాలో పడేస్తూ ఉంటే నేనదిమోస్తూ రాత్రంతా తిరిగేను. సగానికి పైగా బస్తా నిండిపోయింది. అప్పుడప్పుడు పీతలు కిందనించి మీదకి ప్రాకుతూ ఉండేవి. అప్పుడు బస్తా మూతి పట్టుకొని తిరగేస్తే అవి కిందికి పోయేవి. మళ్ళీ పీతలవేట ప్రారంభం. తెలతెలవారుతూ ఉండగా బస్తాను లాడ్జిలో పడవేశాను. మధ్యాహ్నంవస్తే నాకోసం ప్రశస్తమైన పీతల కూర సిద్ధంగా ఉంటుందన్నారు. అది చాలా రుచిగా ఉంటుందని మా అందరి ఏకగ్రీవాభిప్రాయం.

ఆ మధ్యాహ్నం కొంచెం ఆలస్యంగా లాడ్జికి వెళ్ళాను. పీతలమీద ఆశ పెట్టుకుని ఇంట్లో భోజనం కూడా చెయ్యలేదు.

నేను వెళ్ళేసరికి నా మిత్రబృందం కూరంతా ఖాళీ చేశారు. మచ్చుకొక తునుక కూడా మిగల్చలేదు. అసలు నేను రాననుకుని అలా చేసినట్లు సంజాయిషీ చెప్పారు.

ప్రజాతంత్ర *21–3–1976*

## రెండు

ఓర్వలేనితనాన్ని ఆంధ్రుల జాతీయ గుణంగా పేర్కొన్నాను. అలాగే భారతీయుల జాతీయ గుణం హిపోక్రసీ. మనంత హిపోక్రిట్లు ఈ భూప్రపంచంలో ఎక్కడా లేరు. అందుకు ఓ గొప్ప నిదర్శనం మన ఆధ్యాత్మికత. "అంతా మిథ్య" అంటూనే అన్నీ మింగేస్తాం మనం.

అయితే తెలుగువాడిలో ఓర్వలేనితనం ఎంతగా వుందో ఈ హిపోక్రసీ అంత తక్కువగా ఉంది. మనం కపటం ఎరుగని మనుష్యులం. కర్రవిరిచి పొయ్యిలో పెట్టే మనస్తత్వం మనది. ఎదురుగుండా ఒక మాటా, వెనకాతల ఒక మాటా చెప్పడం మనకి చేతకాదు. (మనలో ఉన్న కొందరు భారతీయులకి ఇంకా ఈ జబ్బు ఉందిగాని అదివేరే సంగతి).

ఏ కోశానా హిపోక్రసీ లేని తెలుగువాళ్లని నేను వందల, వేల సంఖ్యలో పేర్కొనగలను. ఒకటి, రెండుపేర్లు మాత్రమే ఇక్కడ ఇస్తాను.

ఒకటి, సినీ రచయిత డి.వి.నరసరాజు.

రెండు, శ్రీమతి భానుమతీ రామకృష్ణ. ఈమెకు అహంకారం ఉంది అనండి! అతిశయం

ఉంది అనండి! కాని, కాపట్యం ఏ కోశానా లేదు. ఇది నేను స్వానుభవంతో చెబుతున్నాను.

బహుశా, మన ముఖ్యమంత్రి వెంగళరావుకూడా. ఈయనతో నాకు వ్యక్తిగతంగా పరిచయం లేదు. పత్రికల్లో, ఫోటోల్లో చూడడం తప్ప ఈయనెవరో నాకు తెలియదు. కాని *Hon.* వెంగళ్రావ్ గారిలో కూడా హిపోక్రసీ లేదనే నా నమ్మకం.

ఇక నా సంగతి! నా ఒంటెత్తుగుణం జగద్విదితం! నేను నేనే! నాలో ఏమయినా కపటత్వం ఉందా అనే విషయం లోకానికే వదిలేస్తున్నాను. నిన్న మొన్నటి దాకా నేనెన్నడూ మారుపేరుతో రచన సాగించలేదు. (ఈనాడు ఆపని చెయ్యవలసి వచ్చింది).

ఒకప్పుడు నేను 'వైశాఖి' అనే పేరుతో 'భారతి'కి ఒక రచన పంపించదలుచుకున్నానని పురిపండాతో చెప్పాను. ఆ పేరుతో అతను వేరే పద్యం పంపించి నీ పేరు నేను వాడుకున్నావన్నాడు. అప్పుడు ఆ పేరు మనిద్దరికీ వద్దు, మన 'కవితా సమితి' రెండవ వార్షిక సంచికకు సమర్పిద్దామన్నాను. 'వైశాఖి' పేరుతో కవితాసమితి రెండవ వార్షిక సంచిక వచ్చింది.

అదే విధంగా 'వస్తున్నాయొస్తున్నాయ్' అని నేను 'జగన్నాధుని రథచక్రాలు' ప్రారంభించగానే జరుక్ శాస్త్రి

వెళిపోయావ్ వెళిపోయావ్

అంటూ ఒక పెద్దగేయం 'భారతి'కి ఇచ్చాడు. ఆ తర్వాత చాలాకాలానికిగాని నేను 'రథ చక్రాలు' పూర్తిచెయ్యలేదు.

'హరీన్ చట్టో, గిరాం మూర్తి'

ఇటీవల మా ఇన్స్పిరేషన్ అని నేను రాసిన పద్యపాదాలను జరుక్‌శాస్త్రి (విజయవాడ రైల్వే స్టేషన్ ప్లాట్‌ఫారం మీద కాబోలు) హరీంద్రనాథ చటోపాధ్యాయను కలుసుకుని తనవిగా చలామణీ చేశాడు. ఇవి తానే రాసినంత బాగున్నాయని తర్వాత నాకు సంజాయిషీ చెప్పాడు.

''మహాప్రస్థానం'' గేయాలు శ్రీశ్రీ రాయలేదని అబ్బూరి రామకృష్ణరావుగారు రాసి శ్రీశ్రీ పేరుతో చలామణి చేశారని రుక్కాయి ఒక చిన్న పితూరీ లేవదియ్యబోయాడు. (ఆంధ్రపత్రిక వీక్లీ సర్క్యులేషన్ పెంచడం కోసం) దీన్ని అబ్బూరి వారే స్వయంగా మొగ్గలో చిదిమివేశారు.

ఇవన్నీ ఎందుకు చెబుతున్నానంటే రుక్కాయి మీద కోపం చేత కాదు. మా ఇద్దరికీ ఒక అపూర్వమైన స్నేహబంధం వుంది. అతని మనస్తత్వంలోని ఒక పెడ చూపాలని ఇది రాస్తున్నాను. గురజాడ కన్యాశుల్కాన్ని గురజాడ రాయలేదని ఒక పెద్ద కాంట్రవర్సీ పెంచినవాడు రుక్కాయి. ఈ ఆకతాయితనం ఆ రోజుల్లో సాహితీపరుల్ని చాలా కలవరపరిచింది.

సర్రియలిజం కొత్తగా సాహిత్యం లోనికి దిగుమతి అవుతున్నప్పుడు

''ట్రిస్టాన్ జారాను నేను'' అని చెప్పకున్నాడు రుక్కాయి!

మద్రాసులో ఎలెక్ట్రిక్ ట్రెయిన్‌లు వచ్చినపుడు వాటిని రుక్కాయి తెల్లని మెర్క్యూరీ

పాములని వర్ణించాడు. (మెర్క్యూరీ అంటే పాదరసం).

"సంహిత సమాప్తి" అని రుక్కాయి ఒక మంచి రేడియో నాటకం రాశాడు. ఇది ఇప్పుడు దొరుకుతుందో లేదో తెలియదుకాని, ఆ నాటకానికి మూలం అబ్బూరివారి సూచన.

*"Decline & fall of the Roman Empire"* అనే గ్రంథాన్ని ఒక జీవితకాలం అంతా కష్టించి పూర్తి చేసిన తర్వాత గిబ్బన్ ఆ మరునాడు ఏమని ఫీలయి ఉంటాడు అనే ఊహ మీద ఇంగ్లీషులో ఎవరో ఒక చిన్న నాటిక రాశారట.

"మహాభారతం" పద్దెనిమిది పర్వాలూ పూర్తి చేసిన తర్వాత ఆ మరునాడు తిక్కన సోమయాజి ఎలాగ ఫీలయి ఉంటాడు అనే ఊహ మీద రుక్కాయి "సంహిత సమాప్తి" రాశాడు.

రుక్కాయి చాలా కొంటెవాడు. స్త్రియలిస్టు ఉద్యమం గురించి కేవలం పుకార్లు మాత్రం విని "లింగతాడనం" అని ఒక పాతిక, ముప్ఫయి పేజీల కావ్యం రాసేడు. ఇప్పుడు ఈ కావ్యం ఏమయిందో తెలియదు. దీన్ని నారాయణబాబుకి అంకితం చేస్తూ, "బాబూ! దీన్ని నీ చేతిలో పెడుతున్నాను ఏం చేస్తావో మరి" అని రాశాడు.

రుక్కాయి మరణించిన తర్వాత ఒక స్మారక సంచిక వేస్తామనీ, దీనిలో ప్రచురించడానికి నా వ్యాసం ఒకటి కావాలనీ ఎవరో రాశారు. అప్పుడు నేనేమీ రాయలేకపోయాను. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి సంస్మృతికి ఇది నా అశ్రు తర్పణ.

*ప్రజాతంత్ర 28–3–1976*

# నా నాస్తికత్వం

ఒకటి

చిన్నతనంలో నేను దేవుణ్ని ప్రార్థించాను, ప్రేమించాను. కొద్దిగా ఎదిగినతర్వాత దేవుడే నిజం, ప్రపంచం సర్వం అబద్ధం అనుకున్నాను. ముప్ఫయ్యేళ్ళు దాటాక (మహాప్రస్థానం గీతాల రచన పూర్తికావస్తుంటే) దేవుణ్ని గురించి అనుమానాలు ప్రారంభమయ్యాయి. ఈనాడు నేను "దేవుడులేడు, మానవుడున్నాడు" అనే నిశ్చల నిర్ణయానికి వచ్చాను.

మరి ఇన్ని విధాల మారినవాణ్ని రేప్పొద్దుట మళ్ళీనేనొక పరమ దైవభక్తుణ్నిగా పరివర్తన చెందననిహామీ ఏమిటని కొందరైనాఅనుకోవచ్చు. ఒక మిత్రుడు చెప్పనే చెప్పాడు. అయిదేళ్ళ లోపుగానే నాలో ఒక బ్రహ్మాండమైన మార్పు వస్తుందనీ, భారతదేశంలోని ఆస్తిక తత్వవేత్తలలో నాకొక ప్రముఖమైన స్థానం లభిస్తుందనీ! ( ఈ మాట అతడు చెప్పిఇప్పటికే పది సంవత్సరాలవుతోంది. అయినా అది వేరే సంగతి) ఒకటి మాత్రం నిశ్చయం! ఎన్నిసార్లు నా రాజకీయాభిప్రాయాలు మారినా ఎప్పుడూ నేనొక రాజకీయపార్టీలో సాధారణ సభ్యుడిగా నైనా లేనట్లే, ఎన్నివిధాల దేవుని గురించి నా అభిప్రాయాలు మారినా ఎన్నడూ నేను దేవుడి సహాయానికి అర్రులు చాచలేదు. ఇకమీద కూడా నా మంచి చెడ్డలకు తోటి మానవులమీద ఆధారపడతానే తప్ప లేడని ఖచ్చితంగా తేలిపోయిన దేవుణ్ని మాత్రం ప్రసన్నుణ్ని చేసుకోవడానికి ప్రయత్నించను.

ఒకప్పుడు నేను గాంధీజీని దరిద్రనారాయణుని ప్రతీకగా అంగీకరించాను. గాంధీగారు శ్రీమహావిష్ణువు అవతారమే అని మా నాన్న అన్నప్పుడు అది నిజమే అనుకున్నాను. ఇందుకు మా నాన్న ప్రవచించిన హేతువాదం నాకు బాగా నచ్చింది. భగవంతుడు సృష్టించిన చాతుర్వర్ణ్యంలో ఇంతవరకు వామనుడూ, పరశురాముడూ బ్రాహ్మణులు. శ్రీరాముడు క్షత్రియుడు. కృష్ణుడు యాదవుడు. ఒక్క వైశ్యకులానికి మాత్రమే ప్రాతినిధ్యం లేకపోయింది. కాబట్టి ఈసారి మహావిష్ణువు వైశ్యుడుగా అవతారం ధరించాడని మానాన్న చెబితే అది నాకు సమంజసంగా తోచింది. ఈనాడు నేను గాంధీజీని ఒక మానవమాత్రునిగా పరిగణిస్తానే తప్ప అవతార పురుషుడంటే ససేమిరా ఒప్పుకోను.

"దేవుడున్నాడు" అనే ఆస్తిక భావంనుంచి క్రమంగా "ఉన్నాడా లేడా?" అనే సదసత్సంశయంనుంచి "ఉంటే ఉన్నాడు, లేకపోతే లేడు" అనే అజ్ఞేయవాదం నుంచి "దేవుడు లేడు" అనే నాస్తికవాదం దాకా నేను ప్రయాణించాను. మార్క్సిస్టు విజ్ఞానం

నాలోని ఈ నాస్తికత్వం సుస్థిర విశ్వాసంగా పరిణమించడానికి దోహదం చేసింది.

ఈనాడు (1976 లో) సామ్యవాదం అనే మాట మన దేశంలో సర్వత్రా వినబడుతోంది. సామ్యవాదానికి వ్యతిరేకంగా ఎవ్వడూ నోరెత్తడానికి సాహసించలేదు. అయినా సమసమాజస్థాపనింకా జరగలేదంటే అందుకు నేను చూపించేది ఒకే ఒక్క కారణం. ''దేవుడున్నాడు'' అనే అబద్ధపు , అశాస్త్రీయపు మూఢవిశ్వాసం అసంఖ్యాకప్రజలలో ఊడలు పాతుకుని పోవడమే! అందుకే నేనెప్పుడూ అంటూ ఉంటాను, దైవభక్తీ, దారిద్ర్యమూ ఒకే నాణానికే బొమ్మా, బొరుసూ అని! అది ఉన్నంతకాలం ఇదీ ఉంటుంది, రెండింటిలో ఏ ఒక్కటిపోయినా రెండోదీ పోతుంది.

దారిద్ర్య నిర్మూలన అనే నినాదం చాలా అందమైనదీ, ఆకర్షణీయయమైనదీ అనడానికి సందేహం లేదు. కానీ ఈ నినాదాన్ని అచరణసాధ్యం చేయాలంటే, దేవుడనే భావాన్ని ముందుగా మన మనస్సులలో నుంచి తరిమివెయ్యాలి. మతం, అది ఏ మతమైనా సరే మానవ పురోగతికి ఆటంకంగానే నిలుస్తుంది. మరి మార్క్సిజం కూడా ఒక మతమే కదా అని కొందరు వన్నీసడించవచ్చు. కాదని ఖండితంగా చెబుతున్నాను నేను. మొదట, ప్రపంచాన్ని అర్థంచేసుకోవడానికి, తర్వాత దాన్ని మార్చడానికి కొన్ని బోధక సూత్రాలను ప్రతిపాదించేది మార్క్సిజం. ''ప్రపంచాన్ని ఎనిమిది ఏనుగులు మోస్తున్నాయి. నమ్మితే నమ్ము నమ్మకపోతే నరకంలోనికి పోతావు, జాగ్రత్త'' అని బెదిరించదు మార్క్సిజం. ''ఏడు రోజుల్లో దేవుడీ సృష్టికార్యాన్ని ముగించాడు'' అనే అబద్ధాన్ని కోటానుకోట్ల ధనం వెచ్చించి ప్రచారం చెయ్యదు మార్క్సిజం. మార్క్సిజం ఒక మతం కానే కాదు. అదో అలోచనావిధానం. శాస్త్రం సరిఅయినదని ఋజువు చేసిన ఆలోచనా విధానం.

శాస్త్రీయవిజ్ఞానం దేవుడనే భావాన్ని ఏనాడో నిరాకరించింది. గణితశాస్త్రజ్ఞుడు ''రెండు రెళ్ళు నాలుగు'' అంటాడే తప్ప ''దైవసాక్షిగా చెబుతున్నాను'' అనే ఊతపదాన్ని ఉపయోగించడు. రెండు రెళ్ళు నాలుగనే నిజాన్ని చెప్పడానికి దేవుడనే అబద్ధాన్ని సాక్ష్యం చేసుకోవలసిన అవసరం లేనివాడే నాస్తికుడు. ఏ మనిషయినా తానాడుతున్నది అబద్ధం అని తెలిసుండికూడా అవతలివాణ్ని నమ్మించదలచుకున్నప్పుడు ''దైవసాక్షి'' అనే ఈ ఊతపదం అతనికి చక్కగా ఉపకరిస్తుంది.

సామ్యవాదంతో నాస్తికవాదాన్ని కలపడం బోడితలకీ, మోకాలికీ ముడి వెయ్యడం లాంటిదే అని కొందరు నన్ను విమర్శించారు. కాని, నిజమైన సమసమాజ నిర్మాణం (కనీసం,ఆర్థికంగా) జరగాలంటే దానికి నిరీశ్వరత్వమే దృఢమైన పునాది. దేవుని అధీనంలో (హిందూ దేవుడో, తురక దేవుడో, కిరస్తానీ దేవుడో, ఈ విషయంలో అందరు దేవుళ్ళూ ఒక్కటే) లక్షల ఎకరాల భూములూ, కోట్ల విలువచేసే వజ్రవైఢూర్యాది నవరత్నాలూ, వెండి, బంగారాలూ మూలుగుతున్నప్పుడు అధికసంఖ్యాక ప్రజలకు దారిద్ర్యమే మిగులుతుంది. ఈ సంపదనంతటినీ అనుభవించేది పాపం, నోరులేని దేవుడుకాదు. అతని చాటున

బ్రతుకుతున్న నరరూపులైన పందికొక్కులూ, పందికొక్కుల రూపంలో ఉన్న మనుష్యమాత్రులూ మాత్రమే. అందుకే దేవుడి అధికారాన్ని తొలగించి మానవులు తమ భవిష్యత్తును నిర్ణయించుకొనే శక్తిని తమ చేతిలోనికి తీసుకోవలసిన అవసరం ఉంది.

ఇన్ని కబుర్లు చెబుతున్న నేను నా యింటిలోంచి దేవుణ్ని తరిమివేయలేకపోతున్నాను. నా ఒకే ఒక్క కొడుకు తెల్లారగట్టే లేచి కాలకృత్యాలు తీర్చుకుని స్నానం చేసి, నుదిటికి విభూది ధరించి దేవుని ముందు నిలబడి ఏవో గొంతెమ్మ కోరికలు కోరుకుంటాడు. ''నువ్వు చదువుకుని మంచి మార్కులు తెచ్చుకోవాలిగాని, ప్రార్థనల వల్ల ప్రయోజనం లేదం''టాను. ఈ సలహాను మా అమ్మాయిలు చక్కగా పాటిస్తున్నారు. వాళ్ళెప్పుడూ దేవుడి గదిలోకి వెళ్ళడం నేను చూడలేదు. ఎప్పుడూ వాళ్ళకి మంచి మార్కులే వస్తుంటాయి. కిందటేడు తమిళ రాష్ట్రం అంతటికీ మొదటి స్థానం సంపాదించింది కుమారి శ్రీరంగం మంజుల.

మా ఆవిడ సరోజ మాత్రం ఇంత పెద్ద ఇంటిలో ఒక చిన్న గదిని దేవుడికి కేటాయిస్తే తప్పేమిటని అడుగుతుంది. ఆమేరకు కొంత స్థలమూ, చాలాకాలమూ నువ్వు వ్యర్థం చేస్తున్నావంటాను నేను. రెండు మూడేళ్ళుగా తాకట్టులో ఉన్న ఒక వెండి సింహాసనాన్ని మార్వాడీ ఇటీవలనే వేలం పాడించిన తర్వాత శ్రీమతి సరోజకు కొంత జ్ఞానోదయమైంది. వెండి వినాయకుడినైనా, విష్ణుమూర్తినైనా, మరే దేవుడినైనా అవలీలగా కరిగించవచ్చు. మనల్ని బాధించే సెంటిమెంట్లు కరిగించేవాణ్ని కరిగించవు. తెల్లారి లేవగానే స్నానం చెయ్యడం ముఖ్యం. అలా చెయ్యరేమో అని ఉదయించే సూర్యునికి మడి కట్టుకుని నమస్కరించాలనే ఆచారం అమలులోనికి వచ్చింది. కొంతమంది వైద్యులు మంత్రాలతో జబ్బులు పోగొడతామంటారు. కాని మందులివ్వడం మాత్రం మరచిపోరు. అసలు చాలా జబ్బులను ప్రతిఘటించే శక్తి మన శరీరంలోనే ఉంది.

*ప్రజాతంత్ర 27–6–1976*

## రెండు

నా నాస్తికత్వం యావత్ప్రపంచానికీ ఉపయోగపడుతుందనడంలో నాకెటువంటి సందేహమూలేదుగానీ, అది ఋజువుకావడానికికింకా కొంతకాలం - కాదు చాలాకాలమే పట్టవచ్చు. అయినా దేవుడిమీద నమ్మకంపోయిన తర్వాత నా శరీరారోగ్యం ఎంతో బాగుపడింది. దానితోబాటు నా మనోనైర్మల్యంకూడా నా కెంతో ప్రశాంతికరంగా వుంది. కన్నడదేశంలో నేను చూసిన ఒక దైవభక్తుడు తెలిసోతెలియకో, తన ప్రార్థనల బండారాన్ని సుస్పష్టంగా బయటపెట్టేడు. దేవుణ్ని ఏకాగ్రబుద్ధితో ప్రార్థిస్తున్నంతసేపూ ఈ ఇహలోకపు ఈతిబాధలన్నింటిని మరిచిపోతామని, అదే ప్రార్థన మనిషికి కలిగించే గొప్ప సదుపాయమనీ ఆయన అన్నాడు. ఇదో పలాయనవాదం అనే నా దృఢనిశ్చయం మరింత గట్టిపడింది. దేవుడి ముందు ధ్యానిస్తూ కూర్చున్నవాణ్ని ఏ అప్పులవాడూ సతాయించలేదు. ఎందుచేతనంటే అతగాడూ ఒక దైవభక్తుడే కాబట్టి! ఐహికవేదనలనుండి బయటపడడానికి దేవునివైపు పారిపోవడం ఒక

పరిష్కారమార్గం కానేకాదు. పైగా అదో నికృష్టమైన పిరికితనం.

ఈ పిరికితనాన్ని నేను రోజూ చూస్తూనే ఉంటాను. పేవ్‌మెంట్ మీద నడుస్తూనో, బస్సులో ప్రయాణం చేస్తున్నప్పుడో కపాలీశ్వరుడి గుడి వచ్చేసరికి ఆడవాళ్ళూ, మగాళ్ళూ లెంపలు వేసుకుంటూ ఉంటారు. ఒకాయన దైవభక్తి మరీ ముచ్చట గొలిపింది. కపాలీ చెరువు దగ్గర హిందూదేవుడికీ, మౌంట్‌రోడ్ మసీదు దగ్గర అల్లాకీ, సెంట్రల్‌కి వెళ్ళేదారిలో చర్చి రాగానే కిరస్తాని దైవానికీ లెంపలముదుపులు చెల్లించడం చూశాను. "అందరి దేవుళ్ళూ ఒకటే అయితే అందర్నీ కలిపి ఒకచోటనే తగలెయ్యకూడదా?" అన్న గురజాడ సూక్తినిది జ్ఞాపకం చేసింది.

కనీసం అయిదువేల సంవత్సరాల నుంచీ మానవజాతిని ఆవహించిన ఈ జబ్బు ఇవాళా, రేపట్లో కుదరదని నాకు తెలుసు. ఇది చికిత్సకు లొంగని రోగంకాదని కూడా నాకు తెలుసు! ఎందుచేతనంటే ఈ జబ్బునుండి బయటపడ్డ మూడోవంతు ప్రపంచం మూడు పువ్వులు, ఆరుకాయలుగా విభాసిస్తోంది. కొన్ని పత్రికలు పనికట్టుకుని చేస్తున్న ప్రచారం, లెనిన్ జీవించి ఉన్న రోజుల్లోనే పచ్చిఅబద్ధంగా తేలిపోయింది. ఈనాడు ఇండియాను సామ్యవాదం నుంచి ఏ దేవుడూ రక్షించలేడు. పాత అలవాటుప్రకారం దేవుడిగుడి కనిపించగానే చెంపలు స్వయంగా వాయించుకునే జనం ఇంకా అసంఖ్యాకంగా ఉన్నమాట నిజమే, వీధికొక వినాయకుడూ, ఊరికొక పోలేరమ్మా వెలసిన ఈ పవిత్రభారతభూమిలో విప్లవం విజయవంతం కానేరదని వీళ్ళంతా విశ్వసించవచ్చు. కాని రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యానికి నిన్న గాక మొన్న పట్టినగతి వీళ్ళకన్నులు తెరిపించలేకపోతే, ఇటీవలనే ఛిన్నాభిన్నమయిన, అత్యంత ప్రాచీనమయిన బుడతకీచు సామ్రాజ్యవాదమయినా వీళ్ళందరికీ బుద్ధి నేర్పించక పోదు.

అందుకే నానాటికీ నాలో ధనస్వామ్య వ్యతిరేకతతో బాటు నిరీశ్వరభావనకూడా పెల్లుబుకుతోంది. అందుకే హఠాత్తుగా నేనో మంచి శుక్రవారంనాడో, బూడిద బుధవారం నాడో ఒక దైవభక్తుడిగా మారిపోయే అవకాశం లేదని గట్టిగా చెప్పగలుగుతున్నాను.

ఈనాడు ప్రపంచం అంతటా ధనస్వామ్యవ్యవస్థ కొనఊపిరితో కొట్టుమిట్టాడుతోంది. ఏనాడో మార్క్స్ సూత్రీకరించిన ప్రచండ ఆర్థిక సంక్షోభంతో తనతల తానే పగలకొట్టుకుంటోంది. ఎన్నివిధాల ఎందరు ఆర్థిక శాస్త్రవేత్తలు సమర్థించాలనుకున్నా, పెట్టుబడిదారీ విధానం ప్రపంచ నాటకరంగంనుండి నిష్క్రమించక తప్పదు. దాని స్థలాన్ని అంతకన్నా న్యాయసమ్మతమైన సామ్యవాదవ్యవస్థ తీసుకోకనూ తప్పదు. పిడికెడు కుటుంబాలవాళ్ళు కోట్లకొలది ప్రజలను దోచుకునే విధానాన్ని ఏ న్యాయశాస్త్రమూ అంగీకరించబోని చారిత్రక ఘట్టంలో ఇప్పుడు మానవజాతి ప్రవేశించింది.

సామ్యవాద రాజ్యాలలో వ్యక్తిస్వాతంత్ర్యం ఉండదనీ, ప్రజలందరూ అధికారంలో ఉన్న ప్రభుత్వానికి బానిసలనీ, ఇలాగే ఏవోఏవో ప్రచారాలు రష్యాలో మొట్టమొదటిసారి పెట్టుబడిదారీ వ్యతిరేక ప్రభుత్వం ఏర్పడిననాటి నుండి, నేటిదాకా సాగుతూనే ఉన్నాయి. ఒకప్పుడు

గిడుగు రామమూర్తిగారు వాడుకభాషా వాదాన్ని సాహిత్యంలో ప్రవేశపెట్టినప్పుడు కూడా ఎన్నో వ్యతిరేక ప్రచారాలు ఇలాగే జరిగాయి. ఇంకా జరుగుతూనే ఉన్నాయి. మొదట్లో తాపీ ధర్మారావు వంటి ఉద్దండపండితులు కూడా ఈ వాదాన్ని అంగీకరించలేదు. క్రమక్రమంగా వారికే తెలిసివచ్చింది ఈ వాదంలో ఉన్న బలం. సరేసరి! కందుకూరి వీరేశలింగంగారి మాట చెప్పనే అక్కరలేదు. గ్రాంథికభాషవల్ల అశేషప్రజానీకానికి ప్రయోజనం లేదని గుర్తించడానికాయనకెంతో కాలం పట్టలేదు. గుర్తించిన వెంటనే ఆయన వ్యావహారిక భాషావాదానికి హృదయపూర్వకంగా స్వాగతం ఇచ్చారు.

దేవుడనే వాడొకడున్నాడని నమ్మడం మూఢవిశ్వాసంగా గుర్తించడానికి అధిక సంఖ్యాకులు విముఖంగా ఉన్నంత మాత్రంచేత ఒక అబద్ధం అమాంతంగా నిజమయిపోదు. అయితే అందమైన అబద్ధాలను ఆరాధించడానికలవాటు పడిపోయినవాళ్ళు నిష్ఠురమైన నిజమంటే ఎందుకో చాలా బాధపడిపోతారు. దేవుడే సత్యం, తతిమ్మా సమస్తమూ మిథ్య అనేవాదం ఒక ఊహావిధానమే తప్ప అదెప్పుడూ శాస్త్రీయంగా ఋజువుకాలేదు.

గాంధీజీ తన జీవిత చరిత్రను సత్యం గురించి పరిశోధనగా అభివర్ణించడం మనమందరమూ ఎరిగినదే! కాని ఆయన, దేవుడే సత్యమని సత్యాన్ని దేవునితో ఈక్వేట్‌చెయ్యడంతో, నేనేకాదు, మానవేంద్రనాథరాయ్ వంటి మహా మేధావులు కూడా ఏకీభవించడంలేదు. ఆఖరికి అంత గాంధీమహాత్ముడు కూడా ''పేదవాడికి దేవుడు రొట్టెముక్కరూపంలో కనిపిస్తా''డని అంగీకరించక తప్పలేదు. ఈ పేదరికం దైవభక్తి వల్ల నిర్మూలనం కాదనేదే నా దృఢనిశ్చయం. తన జీవితంలో దరిద్ర నారాయణునికి ప్రతీకగా నిలిచిన గాంధీజీ సహా ఈ దారిద్ర్యాన్ని తొలగించలేకపోవడానికి ఒకే ఒక్క పెద్దకారణం దేవుడిమీద ప్రజలకింకా సమసిపోని మూఢవిశ్వాసమే. ఇందుకు తోడు యంత్ర నాగరికతకు గాంధీజీ బద్ధ విరోధి. ఆయనపై థోరో, టాల్‌స్టాయిల ప్రభావమే ఇందుకు కారణం. యంత్రాల సహాయాన్ని నిరాకరించడం మానవుని చరిత్ర గమనాన్ని వెనక్కి మళ్ళించడమే అని నా ఉద్దేశ్యం. యంత్రాలు మన శత్రువులుకావు. వాటిని చేజిక్కించుకుని తోటి మానవులను దోచుకునే దుష్ట విధానమే మన శత్రువు. ఈ శత్రువుకి ఆఖరి రక్షణ దేవుడు, ''దేవుడే మాకీ అధికారాన్ని ప్రసాదించాడు! కాదనడానికి నువ్వెవరివి?''అని అడుగుతారు ఈ దోపిడీదారులు- వారి ఆలోచనలకీ, ఆశయాలికీ మూలకారణమైన ఈ ఆస్తికత్వాన్నే నేను నిలవేసి ప్రశ్నిస్తున్నాను. ధనస్వామ్య విధానపు మూలస్తంభాలలో దైవభక్తికి అత్యంత ప్రాధాన్యం ఉంది. దీని వెనుకనే విపరీతమైన భయంకూడా ఉంటుంది. తిరుపతి వేంకటేశ్వరుని హుండీలో లక్షరూపాయలనోట్లు పడవేసిన అజ్ఞాత దైవభక్తుడి అంతరాంతరాల్లో ఎంత భయం ఉందో నేను సునాయాసంగానే ఊహించుకోగలను.

ఒకసారి నేనో ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుతో నాస్తికత్వం గురించి చర్చించడం జరిగింది. అతనిది కేరళ రాష్ట్రం. దేవుడి మీద తనకి కూడా నమ్మకం లేదు గాని దేవుని అవసరం

తీరిపోలేదంటాడాయన. కోట్లాది అజ్ఞానులూ, నిరక్షరాస్యులూ ఉన్న మన దేశంలో దైవభక్తి ఒక్కటే వాళ్ళని నేరస్తులు కాకుండా నిరోధిస్తున్నదని అతనివాదం. ''బహుశామీరనేది దైవభీతి గురించి అనుకుంటా'' అన్నానేను. ''అలాఅనుకున్నా ఇబ్బందిలేదు. అటువంటి భయం ఒకటి ఉండడం వల్లనే ఈ సమాజం ఇంకా విచ్ఛిన్నంకాకుండా నిలబడి ఉంది''. అన్నాడాయన. ఈ సమాజం ఇలాగే ఉండదనీ, ఇంతకన్నా ఉన్నతమైన నీతిసూత్రాలను పాటించే ఇంకో కొత్త సమాజం ఆవిర్భవించక తప్పదనీ నేనన్నాను.

''అటువంటి సమాజం ఏర్పడినప్పుడు మీ నాస్తికత్వాన్ని నేను అంగీకరించడమే కాక అవలంబిస్తానుకూడా'' అన్నాడాయన! అసలు విషయం ఏమిటంటే, ఖూనీలు చేసే వాళ్ళనీ, మోసాలుచేసేవాళ్ళనీ ఇంతవరకు ఏ దైవభీతీ అటకాయించలేదు. చివరికిది నీతికీ, నిజాయితీకి సంబంధించిన సమస్యగా మిగులుతుంది. దేవుడున్నాడన్న ధీమాతో మానవుడు మానవుల్ని మోసగించగలుగుతున్నాడు. దేవుడు లేడనుకున్నప్పుడు మనిషిపట్ల మనిషికి నమ్మకం కుదిరి తీరుతుంది. లేని దేవుడిమీద పడవేసిన భారం స్వీయ భుజస్కంధాల మీదికి తీసుకుంటాడు మానవుడు. మోసం చెయ్యవలసిన అవసరం అప్పుడతనికుండదు. పైగా సాటి మానవుడి బాధ్యత కూడా తానే స్వీకరించవలసి వస్తుంది. స్వార్థం నుంచి పరార్థంవైపు ప్రయాణించే రేపటి మానవుడు నిజంగా నేటి మానవునికన్నా ఎన్నోరెట్లు నీతిమంతుడు!

*ప్రజాతంత్ర 4—7—1976*

## మూడు

అప్పుడప్పుడు నాకనిపించుతూ వుంటుంది గాంధీగారు నిరీశ్వరవాది అయివుంటే మనదేశ చరిత్ర ఎటువంటి మలుపు తీసుకుని ఉండేదో అని! క్లియోపాత్ర ముక్కు పొడుగుకి సంబంధించిన సమస్యలాంటిదే ఇది! ఆవిడ ముక్కు మాట యెలా వున్నా, గాంధీజీ నాస్తికుడైవుంటే ఆనాటి నలభైకోట్ల భారతీయుల్లో మూగజీవులూ, దైవభక్తులూ అయిన ముప్పయితొమ్మిదికోట్ల ముప్పయి లక్షలమంది భారతీయుల హృదయాలమీద మకుటంలేని మహారాజుగా ఏకచ్ఛత్రాధిపత్యం వహించగలగడం ఆయనకు అసాధ్యమై ఉండేది. ఆయుధాలు లేకుండానే పోరాటం సాగించవచ్చునని రుజువు చేసిన స్వాతంత్ర్య సమరసేనానిగా ఆయన్ని నేనెప్పుడూ గౌరవిస్తాను. అయితే తన ఉద్యమానికి దేవుడి ఆశీర్వాదం వుందని గాంధీజీ నమ్మకం. అసలునిజం ఏమిటంటే భారతీయుల స్వాతంత్ర్యకాంక్ష న్యాయసమ్మతం కావడం! ఈ రాజకీయ సమరాన్ని మతంతో ముడి పెట్టడం బాగులేదని ఆనాడు బ్రిటిష్ వాళ్ళే కాదు, యమ్. ఎన్.రాయ్, సుభాష్ చంద్రబోస్ మొదలైన వాళ్ళెందరో ఆయన్ని విమర్శించారు. *soul force*(ఆత్మశక్తి) అనే సమాసం ఒకటి గాంధీగారి రాతల్లో తరచు కనిపించేది. ఆత్మ అనేది ఉత్త బూటకం అని తెలుసుకున్నవారు ఇప్పటికీ మనదేశంలో చాలా కొద్దిమంది మాత్రమే ఉన్నారు. మనకి స్వరాజ్యం రావడానికి తదితర చారిత్రక కారణాలెన్ని ఉన్నా,

వాటన్నిటినీ మరచి ఈ ఆత్మశక్తివల్లనే అది సాధ్యమయిందని నమ్మేవారు ఇప్పటికీ కోకొల్లలు. బీహారు భూకంపానికి కారణం, సవర్ణ హిందువులు హరిజనులను అస్పృశ్యులుగా పరిగణించడం పట్ల భగవంతుని ఆగ్రహమే అని గాంధీజీ ప్రవచిస్తే, ''ఇదెక్కడి హేతువాదం?'' అని ఎవరూ ప్రశ్నించలేదుసరికదా రాజకీయాలను ఆధ్యాత్మికస్థాయికి తీసుకువెళ్ళిన ఘనునిగా అందరూ ఆయన్ని ఉగ్గడించడమే జరిగింది.

తొలినుంచీ ఈ ఆధ్యాత్మిక వాతావరణం మన దేశమంతటా పొగమంచులాగ దట్టంగా వ్యాపించి ఉన్నదే. చిన్నప్పుడు నేను విశాఖపట్టణంలో శివాలయానికీ, సీతారామస్వామివారి కోవెలకీ, ఆంజనేయస్వామి గుడికీ వెళ్ళుతూండినవాణ్నే. కాని ఎప్పుడూ ఏ దేవుణ్నీ ఏ కోరిక నిమిత్తమూ మొక్కుకోలేదు. అయితే ఒకసారి నా ముఖ్యస్నేహితుడొకడు చింతచెట్టుమీద నుంచి పడి కాలు విరుచుకున్నప్పుడు, అతని కాలు నయమయితే నూరు కొబ్బరికాయలు కొడతానని బురుజుపేట కనకమహాలక్ష్మికి మొక్కుకున్నాను. మిత్రుడికాలు నయమయిందికాని నా మొక్కుబడి మాత్రం తీరలేదు. నూరు కొబ్బరికాయలు కొనగలిగినంతడబ్బు నా దగ్గర ఎప్పుడూ ఉండేది కాదు. మొక్కుబడి తీర్చుకోలేక పోతున్నానని కొంతకాలం నేను బాధపడకపోలేదు. ఆ తర్వాత వాళ్ళ నాన్న చేసిన వైద్యం వల్ల నా మిత్రుడికి విరిగిన కాలెముక అతుక్కుంది గాని, కనకమహాలక్ష్మి మహత్తువల్ల కాదనే జ్ఞానంతో నన్ను నేను రుణవిముక్తుణ్ని చేసుకున్నాను.

నేనెప్పుడూ దేవుణ్ని చూడలేదు. కనీసం కలలోనైనా ''నువ్వు ఏ రూపంలో తలచుకుంటే ఆ రూపంలో ప్రత్యక్షమవుతా'' నంటాడటదేవుడు. ''అచ్చ గిరీశమేనే మూడు మూర్తులా'' అంటాడు కన్యాశుల్కంలో లుబ్ధావధాన్లు మీనాక్షితో. ''ఊరుకోనాన్నా ఎవరైనా వింటే నవ్విపోతారు. చిన్నబాబునే తలచుకుని పడుకున్నావు కాబోలు, కలలోకి వచ్చాడు'' అంటుంది మీనాక్షి. దయ్యపు దంపతుల్ని ఒకే సీసాలోవుంచి బిరడా పెడితే దయ్యపు పిల్లలు పుడతాయేమో అన్న సందేహం ప్రకటించిన సెక్సు విజ్ఞానం కూడా ఈమెదే. దేవుడు కనబడడం లేదుగానీ నా ఆరో యేటనో, యేడో యేటనో, దయ్యం మాత్రం నాకు కనిపించింది. వికృత భయంకర స్వరూపంతో మీదికివచ్చి మింగెయ్యబోతున్నట్టనిపించింది. ఆ సంఘటన వివారాలివి.

విశాఖపట్టణంలో రామనవమి ఉత్సవాలు నా చిన్నతనంలో అత్యంత వైభవోపేతంగా జరుగుతుండేవి. (ఇప్పటికీ జరుగుతూనే ఉంటాయి) నేను సీతారామ లక్ష్మణుల బొమ్మలూ, అంజనేయుడి బొమ్మా ఇలాంటివన్నీ తయారుచేస్తుండేవాడ్ని. ఆ యేడు రామ రావణ యుద్ధంకోసం అట్టముక్కలతోనూ, వెదురు కర్రలతోనూ, ధనుర్బాణాలు ధరించిన రాముల వారినీ , పదితలలూ, ఇరవై చేతులూ ఉన్న రావణాసురుణ్ని సృష్టించాను. మా వీధిలోనే ఉన్న ఒక విశ్వబ్రాహ్మణ మిత్రుడి ఇంటిముందు భాగంలోని చిన్నకొట్టు నా స్టూడియో. సాయంత్రం దాకా కృషిచేసి ఇటు రాముణ్నీ, అటు రావణున్నీ నిలబెట్టి,

కొట్టుతలుపుమూసి, అయిదారిళ్ళ అవతల వున్న మా యింటికి వెళ్ళిపోయాను.

రాత్రి పెందరాళే భోజనం ముగించుకుని అసంతృప్తికరంగా అసంపూర్ణంగా ఉన్న నా కళాఖండాన్ని పూర్తి చేద్దామని కొట్టు తలుపు తీసి చూద్దునుకదా అంతటా ఒక పెద్ద అధి వాస్తవిక రాక్షసాకారం నా మీదకు ఒరుగుతున్నట్లు కనిపించింది. నాకు భయం ముంచు కొచ్చింది. అటువంటి భయానక రూపాన్ని నేనెప్పుడూ చూడలేదు. ధబాలున తలుపుమూసి ఇంటికి ఒకటే పరుగు. మంచం మీద పడుకునేదాకా నా భయం నన్ను వెంటాడుతూనే ఉంది.

ఆ రాత్రి నాకు బాగానే నిద్రపట్టింది. తెల్లవారగానే లేచి వెళ్ళి కొట్టు తలుపు తోసి చూశాను. రాముడూ లేడు రావణుడూ లేడు. కొబ్బరి మట్టలూ, కొబ్బరి పీచూ, కొబ్బరి బొండా ఒలిచిన డిప్పలూ ఒకదానిమీదఒకటిగా పేర్చి వున్నాయి. అవే సర్వత్రా ఆవరించి నాకో పెద్ద దయ్యంలాగా కిందటి రాత్రి కనిపించాయి. నా మిత్రుడి ఇంట్లో ముసలవ్వ నా కళాఖండాన్ని లాగిపారేసి, దాని స్థానే నేను చూసిన వాటిని ప్రతిష్ఠించింది. అవే నాకు మసక చీకటిలో దయ్యం అనే భ్రమ కలిగించాయి. ఈ దేవుళ్ళూ, దయ్యాలూ మనమనస్సుల్లో మనం కల్పించుకునే భ్రాంతి వికారాలే అన్న జ్ఞానోదయం నాకా చిన్నవయసులోనే కలిగింది.

మరికొన్నేళ్ళుగడిచాక నా తొలి యౌవనపు రోజుల్లో నేనూ నా తోటి వయస్యులూ రామనవమి రోజుల్లో రామరావణ యుద్ధపు గుంపుల తోపులాటలో పాల్గొనేవాళ్లం. ఇందులోని పరమార్థం ఏమిటో నేను విశదంగా విపులీకరించనక్కరలేదు. అది దైవభక్తిమాత్రం కాదని వేరే చెప్పనవసరంలేదుకూడా. కొన్ని ప్రాంతాల్లో దీన్ని పిసుకుడుకాయల వేట అంటారు. మేము కాలేజి కుర్రాళ్ళం కాబట్టి, విశాఖపట్టణంలోఇంగ్లీషు రాజ్యంచేస్తోంది కాబట్టి (సోల్జెర్ పేటనిండా ఆంగ్లో - ఇండియన్ లే!) గ్రిప్స్ అనే పారిభాషికపదం వాడుతూవుండే వాళ్ళం. పండుగల తొడతొక్కిడిలో యువతీయువకులు ఒకరిమీద ఒకరు పడిపోతూండడం దైవభక్తిపరులకు కంటగింపుగానే వుండవచ్చుగాని, 'పడుచుదనానికి మాత్రం జడుపులేదు'.

ఒక ఏడాది రామరావణ యుద్ధపు గుంపులలో ఒకమ్మాయి నామీద దురాక్రమణ చేసింది. మగవెధవలెందుకు పనికొస్తారనిపించింది. ఒక బలమైన తోపుకి నేను కిందపడిపోయాను. మళ్ళీ తేరుకుని లేచి నిలబడి ఎదురుదాడికి ఉపక్రమించేసరికి ఆ అమ్మాయి ఎటో గుంపులో కలిసి పోయి అంతర్థానమయ్యింది.

ఉగ్రవాద ఫెమినిస్టులు ఈ అంతర్జాతీయ మహిళా దశాబ్దంలోనేకాదు నా చిన్ననాటి రోజుల్లో కూడా ఉండేవారన్న సంగతి ఇక్కడ జ్ఞాపకం చెయ్యక తప్పదు.

ప్రజాతంత్ర *11–7–1976*

## నాలుగు

చిన్నప్పుడు నేనో పెద్ద స్టేజి ఆర్టిస్టుని. నేనూ, ఉపాధ్యాయుల చిదంబరరావు అనే కుర్రాడూ లవకుశులుగా రంగస్థలంమీద తగుమాత్రం స్థానిక విఖ్యాతి సంపాదించాము. ఒక రాత్రి

ప్రదర్శనంలో ఏమయిందంటే-

రాములవారిమీద నేను బాణం ప్రయోగించాలి. శ్రీరామ పాత్రధారి నీలిమందులో ముంచిన బనియను వేసుకున్నాడు, రాముడు నీలమేఘ శ్యాముడు కాబట్టి. నేనతని గుండెలను గురిచూసి, ''ఓరీ రామా! చచ్చితివి!'' అనో అటువంటిదే ఏదో డైలాగు చెప్పి కొంచెం తీవ్రంగానే బాణం వదిలేను. అది రాములవారికి పొత్తికడుపులో తగిలింది.''హా! సీతా!'' అనో అటువంటిదే ఏదో అరుపు అరిచి రామ వేషధారి నేలని పడిపోయాడు. తెలిసీ తెలియని తప్పేదో చేసినట్టు నేను నేపథ్యంలోకి నిష్క్రమించాను. అక్కడ వున్నందరూ తెగ చివాట్లు పెట్టేరు. ''వెదురు పుల్ల కాబట్టి సరిపోయింది కాని అదే ఇనపబాణమయితే ఏమయేది?'' అని. ''రంగస్థలం మీద బాణం ప్రయోగించినట్లు నటించాలి కాని నిజంగా ప్రయోగిస్తే అది నటన అనిపించుకోదు'' అని ఒకాయన నాకు బోధించాడు.

నేను విశాఖపట్టణంలోని జగన్మిత్ర సమాజంలో ఒక బాలనటుణ్ని. మాకు పోటీగా రాజరాజేశ్వరీ నాటక సమాజంవారు, అంతమందీ చిన్న పిల్లలతో ''బాలుర సావిత్రి'' అనే నాటకం ప్రదర్శించి మార్కులు కొట్టేస్తూ ఉండేవారు. అందులో సావిత్రి వేషం వేస్తూ ఉండే సి.హెచ్.యల్.యన్.మూర్తి నాకు మంచి స్నేహితుడు. వాడి ప్రక్కన సత్యవంతుడు వేషం వెయ్యాలని నాకు చాలా ఆశగా ఉండేది. ఇది ఫలించే ఆశకాదని నాకు తెలుసు. ఎందుచేతనంటే మావి రెండూ రెండు పోటీ నాటక సమాజాలు. ఈ సమాజం మీద కాకి ఆ సమాజం మీద వాలేది కాదు. అయినా ఆ రోజుల్లో నేను ''సావిత్రీ సత్యవంతుడు '' అని ఒక ముప్పయి నలభై పేజీల నాటకం రాశాను. ఛందస్సుమీద అప్పుడప్పుడే కొంత అధికారం సంపాదిస్తున్న రోజులవి. అందుచేత నాటకంలో సగానికి పైగా పద్యాలేరాశాను. నా కోసం రాసుకున్నదయినా అందరి పాత్రలకూ ఔచిత్యాన్ని బట్టి పద్యాలను పంచిపెట్టానే తప్ప సత్యవంతుడికి మరీ ఎక్కువగా పద్యాలు ఇవ్వలేదు. చిన్నప్పటి నా ఎన్నో రచనలలాగే ఈ నాటకం కూడా కాలగర్భంలో కలిసిపోయింది.

మూర్తికి మైనారిటీ తీరుతున్న వయస్సులో మాతాపితరాది సంసారాన్ని పోషించవలసిన బాధ్యత అతని మీద పడింది. మంచి సంగీతజ్ఞానం ఉన్నవాడు కాబట్టి ఒక హరిదాసుగా మారి చుట్టుప్రక్కల గ్రామాలలో హరికథలు చెబుతూ ధనార్జన చేసేవాడు. హరికథా పితామహుడైన ఆదిభట్ల నారాయణదాసుగారి ప్రభావంతో ఆనాడు సర్వత్రా అసంఖ్యాకులైన హరిదాసులు వెల్లివిరిశారు. వాళ్ళకి చిత్రవిచిత్రమైన పేర్లుండేవి. అక్కయ్యదాసు, ఇసకదాసు, దొడ్డమ్మదాసు, చారకన్నుదాసు ఇత్యాదులు. వారి అసలు పేర్లేమో ఎవ్వరికీ తెలియవు. ఒక్క చొప్పల్లి సూర్యనారాయణ భాగవతారుకి మాత్రం చొప్పల్లిదాసు అని పేరుండేది. తెలుగు సినిమా పుట్టిన తొలి రోజుల్లో అతను కొన్ని చలన చిత్రాలలో నటించాడు. కాని రాణించలేదు. అంతిమ దినాలలో అతడు కళావరురింగు అనే వేశ్యతోబాటు విజయనగరంలో ఒక భజనకూటం స్థాపించాడు.

హరిదాసుగా మా మూర్తిగాడు ఏ పేరుతో చలామణి అయాడో నాకు తెలియదుగాని వాడికికూడా మంచి పేరే ఉండేది. చదువుకి స్వస్తిచెప్పి దైవభక్తిని జీవనాధారంగా చేసుకున్న తర్వాత అప్పుడప్పుడు నాకు కనిపించేవాడు. ఒక్కొక్క గ్రామంలో తన అనుభవాలు చెబుతూ నాకు నోరూరించేవాడు, అన్నీ ఆడవాళ్ళకు సంబంధించినవే. అయినా తానో గొప్ప దైవభక్తుడనీ, పరస్త్రీ పరాఙ్ముఖుడనీ అందరూ విశ్వసించేవారట. ఆడవాళ్ళ విషయంలో తనకో ప్రత్యేకమైన టెక్నిక్ ఉందనీ, అదే తన్ను శ్రీరామరక్షగా కాపాడుతోందనీ చెప్పాడు.

తన్మయత్వంతో పాడుతూ, ఆడుతూ హరికథ చెబుతూంటే అందరి కళ్ళూ అతని మీదనే వుంటాయి. అప్పుడు అర్ధ నిమీలిత నేత్రాలతో ఒకసారి ఆడవాళ్ళవైపు చూస్తాడు. తర్వాత చూపు మార్చేస్తాడు. కథలో కూరుకుపోయినట్టే ఉంటాడు. కాని ఒకానొక వనితామణి హావభావాలు అయిదేసి నిమిషాలకొకసారి జాగ్రత్తగా రెండు మూడు క్షణాలు గమనిస్తూ ఉంటాడు. "వయసులో ఉన్న ఆడపిల్లలవైపు నేనెప్పుడూ చూడను, చూపులతో వాళ్ళు నన్ను జుర్రేస్తున్నా విప్రనారాయణుడి తాతలాగ నేనభినయిస్తాను. కొద్దిగా వయస్సు మళ్ళుతూన్న నారీలలామ నా ఆరాధ్య దైవం. ఇదీ నా టెక్నిక్, ఇదే నా విజయ రహస్యం" అంటాడు మూర్తి. "ఎంతమంది హరిదాసులు, ఎన్నెన్ని గ్రామాల్లో- ఆ మాటకొస్తే పట్టణాల్లో కూడా, క్షుద్రమైన కామోద్రేకానికి లొంగిపోయి, బుర్రలు రామకీర్తన పాడించుకోలేదు? నేను మాత్రం అలాంటి వాణ్ణి కాను. ఆంజనేయ భక్తుణ్ణి కాబట్టి నన్నందరూ అస్ఖలిత బ్రహ్మచారిగా అభిమానించి గౌరవిస్తారు!" అంటాడు మూర్తి.

"ఒరే మూర్తీ! నన్ను కూడా ఓ మాటు నీతో తీసుకువెళ్లరా! తంబురా వాయిస్తూనైనా నీ ప్రక్క నిలుచుంటాను" అని నేనంటే, "ఒరేబాబాయ్! (అప్పటికింకా నేను శ్రీశ్రీ ని కాను) నీది విఘ్నేశ్వరుడి మీదిభక్తి కాదురా! ఉండ్రాళ్ళమీది భక్తి! ఓ సంగతి నీకు స్పష్టం చేస్తున్నాను. బాగా గుర్తుంచుకో. ఒక ఆడదాని విషయంలో ఒక మగాడు తన ఏడుపేదో తానేడవ్వలపిందే తప్ప ఇందులో వాటాలబేరం పొసగని వ్యాపారంరా!" అంటాడు మూర్తి.

ఇప్పుడు సెకెండ్ మిసెస్ శ్రీశ్రీ, అప్పుడు ఆదిభట్ల నారాయణదాసుగారి శిష్యురాలు. తన ఎనిమిదో ఏటనే హరికథలు చెప్పడం ప్రారంభించింది. దాసుగారి "రుక్మిణీ కల్యాణం" కొన్ని వందలసార్లు చెప్పింది. అందులోని పాటలు ఇప్పటికీ నేను పాడించుకుంటూ ఉంటాను. సాహిత్యానికి హాని కలగకుండా, లయ రాగ తాళాలకు భంగం కలగకుండా ఒక పాట ఎలా పాడాలో నారాయణదాసుగారే తనకు నేర్పారంటుంది సరోజ. "ఈ సద్గుణా లన్నిటినీ, ఎవరికీ ఎప్పుడూ ఎక్కడా కనిపించని దేవుడి కంకితం చెయ్యడానికి బదులు ప్రజల సమస్యలను తీసుకుని ప్రజల సమక్షంలోనికి వెళ్ళడం నిజమైన కళాకారుల కర్తవ్యం కాదా"? అని అడుగుతుంటావ్నేను.

ఒక్క సంగీత సాహిత్యాలకే కాదు, ఇది సమస్త కళలకూ సంబంధించిన సమస్య. మానవ జీవితాలకే సంబంధించిన సమస్య. దీన్ని మానవులే పరిష్కరించుకోవాలి. దేవుడి

దయాదాక్షిణ్యాలకు వదిలిపెడితే దీన్ని ఎన్నటికీ పరిష్కరించడం సాధ్యంకాదు.

ప్రాచీన భారత శాస్త్ర నియమాలన్నింటినీ పాటిస్తూ ఒక ఆర్టిస్టు ఒంటి కాలిమీద శివతాండవనృత్యం చేస్తూంటే మనం అందరమూ మైమరచిపోతాము. ఇదే నృత్యాన్ని కొందరు ప్రజాకళాకారులు డప్పుల డాన్సు రూపంలో ప్రదర్శిస్తే మనందరికీ మన కర్తవ్యం వైపుకి కనువిప్పు కలుగుతుంది. కళారూపం పాతదే! ప్రయోజనం మాత్రం సరికొత్తది.

మా నారాయణబాబు అంటూ వుండేవాడు! "ఒరే తమ్ముడూ, జీవితమే నేర్పుతుందిరా మనకి జీవించడం ఎలాగో!" అని. అంతే గాని, "పుట్టించిన దేవుడు పూరి మేపుతాడా" ఇత్యాది మాటలెప్పుడూ మా వాడి నోటంటరాగా నేను వినలేదు. అంటే నారాయణబాబు నొక నాస్తికుణ్ణిగా నేను పరిగణిస్తున్నానా అంటే అది వేరు. అంతమందీ తాము దేవుడి చేతిలో ఆటబొమ్మలమనుకుంటే ఒక్క నారాయణబాబు మాత్రం దేవుణ్ణి తన అరచేతిలో పెట్టుకుని ఆటలాడించేవాడు. ఒకసారి తాను చెబుతున్నదే నిజమనీ, నేవాదుతున్నది వచ్చి అబద్ధమనీ కొందరి ఎదుట రుజువు చెయ్యవలసి వచ్చినప్పుడు నారాయణబాబు, "శ్రీశ్రీ పరమ నాస్తికుడు. వాడి మాటలు నమ్మకండి" అని చెప్పి తన మాట నెగ్గించుకున్నాడు, తనేమో గొప్ప దైవభక్తుడైనట్లు.

ఇంత చాకచక్యంతో తన సొంత వాదానికి దేవుణ్ని ఎప్పటికప్పుడుపయోగించుకున్నా అంతరాంతరాలలో మాత్రం నారాయణబాబు ఒక అసాధారణ నాస్తికుడే! అటువంటి వాళ్ళు చాలా అరుదు. ఎందుచేతనంటే ఒక్క దేవుడి మీదనే కాదు, మానవుడి మీద ఆఖరికి తన మీద కూడా సమ్మకం లేనివాడు నారాయణబాబు.

అటువంటివాడు చొప్పల్లి భాగవతార్ భజనకూటంలో చేరాడంటే నాకాశ్చర్యమే కలిగింది. అయ్యకోనేటి వద్ద ఈ సంకీర్తనలలో ప్రతిరోజూ పాల్గొనేవాడట. కాషాయాలు ధరించి రుద్రాక్షపేర్లు కూడా వేసుకున్నాడని విన్నాను. కాని త్వరలోనే ఆ జీవితం విసుగెత్తించింది. మళ్ళీ మద్రాసుకు వచ్చేశాడు.

గిడుగు రామమూర్తి అంత్యక్రియలు జరిగిన మైలాపూర్ శ్మశానంలోనే నారాయణబాబు కి ఆరుద్రా, నేనూ ఆఖరి వీడ్కోలు చెప్పాము. నారాయణబాబు తెలుగు సాహిత్యాకాశంలో ఒక ధూమకేతువు. ఎలా వచ్చాడో, ఎలా వెళ్ళిపోయాడో ఎవరికీ తెలియదు.

మృత కళేబరానికి పురోహితుడు స్నానం చేయిస్తూ ఉంటే ఆరుద్ర గ్రుడ్లనిండా నీళ్ళు క్రుక్కుకుని నావేపు చూస్తూ, "నారాయణబాబు లేడు!" అన్నాడు. నా కళ్ళు పొడిగానే ఉన్నాయి గాని గుండెల్లో బాధగానే ఉంది. ఆరుద్ర మాటలు నా మనస్సులో మౌనంగా ప్రతిధ్వనించాయి గాని పైకి అనడానికి నోరు పెగలలేదు.

మా జేబుల్లోంచి కనిపిస్తున్న కరెన్సీనోట్లను చూసి పురోహితుడు నారాయణబాబు కులగోత్రాదులు చెప్పమన్నాడు.

"ఆయన వాటన్నిటికీ అతీతుడు" అన్నాడు ఆరుద్ర.

నారాయణబాబు అస్థికలను మరునాడు కావేరిలోనో, గోదావరిలోనో కలుపుతానన్నాడు పురోహితుడు.

"ఎదురుగానే మహాసముద్రం ఉంది. అందులో కలపండి" అన్నాన్నేను.

*ప్రజాతంత్ర 18–7–1976*

# మద్రాసులో ఇవాళ

## ఒకటి

ఔను నాగురించి నేను రాసుకోవడానికే ఈ అనంతం. అలాగని నేనంతవాణ్ణి, ఇంతవాణ్ణి అని చాటుకోవడానికి మాత్రం కాదు. ఆ మాటకొస్తే, నా మీద నా మిత్రులూ, భక్తులూ పెట్టుకున్న భ్రమలను తొలగించడానికే ఎక్కువ శ్రమ పడుతున్నాను. నేను పుట్టిననాటి నుంచి నేటిదాకా సుఖదుఃఖాలేవేవో వస్తుంటే తలదాల్చి ప్రపంచ పరిణామంలో ఆహ్వానిస్తున్నాను. ఇది రాస్తుంటే ఎన్నో మరచిపోయిన సంఘటనలు జ్ఞాపకం వస్తున్నాయి. వాటికి ఏ విధమైన రంగులూ పూలూ లేకుండా, ఎలాంటి నగీషీలు చెక్కకుండా యధాతథంగా అక్షర నిబద్ధం చేయాలనే నా ప్రయత్నం.

కొంతమంది శిల్పం అంటే ఇమిటేషన్ అన్నారు. మరికొందరది సృష్టి అన్నారు. నిజమైన కళఅనేది ఈ రెండూ కావేమో అని నా అనుమానం. ఉన్న వాస్తవాన్ని నిశితంగా లోతుగా పరిశీలించి, నిజాయితీతో దాన్ని వివరించాలి. ఇది చాలాకష్టంతో కూడుకున్నపని. ఇది సాధించడానికి ఇంకా నేను కృషిచేస్తూనే ఉన్నాను. పూర్తిగా కృతకృత్యుణ్ణి కాలేదు. కాని ఆకాశపు దారులంట అడావుడిగ వెళ్ళిపోయే "జగన్నాధుని రథచక్రాలను"కొంతలో కొంతయినా భూమార్గానికి మళ్ళించగలిగావనుకుంటున్నాను.

గురజాడ వారిలాగ నేను కూడా, "పెరిగి విరిగితి, విరిగి పెరిగితి"నే కాని కష్టసుఖముల పారం అందుకోలేకపోతున్నాను. బహుశ గురజాడ కూడా అందుకోలేదవే నేనంటాను. అందుకే కుశాగ్ర బుద్ధి అయిన జలసూత్రం రుక్మిణీ నాధశాస్త్రి "కష్టసుఖముల పారమెరిగితి" అని విరిచి చదివేశాడు. అతనే "అమ్మలగన్నయమ్మ" అనే పద్యాన్ని "అ/మ్మల గన్న ( ఆ పర్వతం ప్రసవించిన)యమ్మ" అని చదివేవాడు. ఇలాంటి సందర్భాలలోనే నాకు వాస్తవత్వంలోని అనంతత్వం కనిపించీ కనిపించనట్లుగా కనిపిస్తుంటుంది.

ఇంత విశాల విశ్వంలోని అనంత వాస్తవికత ఎదురుగుండా గోచరిస్తుంటే ఇంకా అభూత కల్పనలతో కవిత్వాలు అల్లే వాళ్ళ మీద నాకు జాలి కలుగుతుంది. ఈ కల్పనలన్నింటికి అగ్రేసరమైనది దేవుడనే అవాస్తవం. "సదసత్సంశయం" ప్రారంభించిన రోజుల్లో నేను అజేయవాదిని. ఉన్నాడా లేడా అని చాలా మథన పడ్డాను. కాని ఈ నాడు లేడు అనే నమ్మకం నాలో స్థిరపడింది. (పోనీ గోరా గారి భాషలో చెప్పాలంటే "దైవంలేదు") "సదసత్సంశయం"రచనను అసంపూర్ణంగా వదలి వేయడానికి ఇదే కారణం. అయితే దాన్ని

త్వరలోనే ముగించాలని వుంది. అందులో ఆఖరి రెండు పాదాలు-

''సామ్యవాద మానవుడే
శాస్త సకల విశ్వానికి!''

ఇక్కడ నేను ''సామ్యవాదం'' అనే మాటకు చెప్పే అర్థం సోషలిజం కాదు, కమ్యూనిజం. అసలైన సిసలైన కమ్యూనిజం ప్రస్తుత ప్రపంచంలో ఎక్కడా లేదన్న మాట నిజమే. రష్యాలో, చైనాలో, ఇండోచైనాలో, క్యూబాలో, తూర్పుయూరప్ దేశాలలో కమ్యూనిజం అనే గమ్యాన్ని చేరడానికి ప్రయత్నాలు మాత్రమే జరుగుతున్నాయి. ఈ గమ్యాన్ని అందుకోవడం అసాధ్యమేమీకాదు. అయితే అందుకు కొంతకాలం పట్టవచ్చు. మావో చెప్పినట్లు వెయ్యి సంవత్సరాలు పట్టినా పట్టవచ్చుకానీ, ఈ అనంతకాలంలో ఒక వెయ్యి సంవత్సరాలు ఒక లిప్తపాటివి కూడా కావు.

అన్నీ సక్రమంగా సాగితే నేనీ నెల 28వ తేదీన (28-11-1976) కలకత్తా నుంచి జైల్దేరి చైనాకు వెళ్ళవచ్చు. ఇందుకు ఆహ్వానం నాకందింది. వెళ్ళాలనే ఉద్దేశ్యం కూడా నాకుంది. తానొకటి తలిస్తే దైవం ఒకటి తలుస్తుందనే పలుకులో నాకు విశ్వాసం లేదు. అయితే ఈ క్షణంలో నేనెదుర్కొనవలసిన అవాంతరాలెన్నో ఉన్నాయి. ఎదుర్కోగలననే అనుకుంటున్నాను.

చైనాలో ఎలుకలూ, ఈగలూ, దోమలూ, దేవుడూ లేడంటారు. అదేదో ప్రత్యక్షంగా చూసే అవకాశం నాకిప్పుడు లభించింది. పూర్తి పర్యటన వివరాలను దినసరి చర్యలుగా వ్రాసి· పెట్టుకోవాలనుకుంటున్నాను. వెనుకటి విదేశ పర్యటన సందర్భాలలో కూడా నేను ఏరోజు సంఘటనలు ఆ రోజే రాసుకున్నాను. కాని అవి విడివిడి కాగితాల మీద ఉండి, ఆరాసిన కాగితాలు ఎక్కడో పోవడం వల్ల చాలా మట్టుకు నాజ్ఞాపకశక్తి మీదనే ఆధారపడవలసి వచ్చింది. ఈ సారి అటువంటి పొరపాటుచెయ్యదలచుకోలేదు. ముమ్ముందు ఈ 'అనంతం'లో గత కాలపు జ్ఞాపకాల కంటే (అవీ ఉంటూనే ఉంటాయి) గడుస్తున్న కాలపు అనుభవాలే ఎక్కువగా ఉంటాయి.

ఈ నెల 12వ తేదీని నేనూ, మా ఆవిడ సరోజా మా అమ్మాయి గౌరి వివాహం జరిపించాము. గౌరి సరోజ చెల్లెలి కూతురు. తల్లిలేని పిల్ల. నన్ను అప్పాఅనీ సరోజనుఅమ్మా అనీ పిలుస్తూంటుంది. పెళ్ళికొడుకు చాలా బుద్ధిమంతుడు, విద్యావంతుడు, ధనవంతుడు. ఒక్కనయాపైసాకూడా వరకట్నం తీసుకోలేదు. వివాహం మాత్రం సంప్రదాయ సిద్ధంగా జరిపించాలన్న మగపెళ్ళివారి కోరికవల్ల నేనూ సరోజ పీటల మీద కూర్చున్నాం. పురోహితుడు మంత్రాలు వదువుతూ ఉంటే, పెళ్ళికొడుక్కి కాళ్ళు కడిగి కన్యాదానం చేశాము. అప్పుడు నాకనిపించింది మన పాతసంప్రదాయాల్లో కొన్నింటిని సంరక్షించుకోవాలని, పెళ్ళిపేరు మీద అప్పుచేసి ఇళ్ళూ వళ్ళూగుల్ల చేసుకునే సంప్రదాయాలను తుడిచి పెట్టాలని.

మాగౌరి నాకొచ్చే ఉత్తరాలన్నీ జాగ్రత్త చేస్తుంది. మిగతా పిల్లలంతా స్కూలుకు పోతే

వాకొచ్చే టెలిఫోన్ కాల్స్ రిసీవ్ చేసుకుని, నేనింటికి రాగానే "అప్పా, తిలక్‌గారు ఫోన్ చేశారు. విశ్వేశ్వరరావుగారు ఫోన్ చేశారు. హైదరాబాద్‌నుంచి ఏ.వి.రావుగారు ట్రంకాల్ చేశారు" అంటూ చెబుతుంది. "రేపొద్దుటికి ఇడ్లీ బియ్యం అయిపోయింది. అయిదు రూపాయలిమ్మ"ని అడుగుతుంది.

12వతేదీరాత్రి లేదా 13వ తేదీ ఉదయం నాలుగ్గంటలకి అప్పగింతల వేళ ఇవన్నీ నాకు జ్ఞాపకం వచ్చి కంటతడిపెట్టాను. కమ్యూనిస్టు కళ్ళంట నీళ్ళా? శ్రీశ్రీ కూడా ఏడుస్తాడన్నమాట. ఏమోకాని ఆ ఏడుపు మాత్రం కేవలం దుఃఖంతో కూడుకున్నది కాదు. దాని వెనకాతల ఎంతో ఆనందం ఉంది.

చాప్లిన్ చలనచిత్రాలు చూస్తుంటే మనం గొల్లున విరగబడి నవ్వుతాము. కాని దాని వెనుక అగాధమైన శోక సముద్రాలుంటాయి. ఇలా ఏకకాలంలోనే అనేక రసాలను, కనీసం పరస్పర విభిన్న రసాలను ఉత్పత్తి చేసే దానికి "రసవ" అనేపేరు పెట్టాను. రావిశాస్త్రి ఆరు సారా కథల ఉపోద్ఘాతంలా!

ప్రజాతంత్ర *28–11–1976*

## రెండు

మద్రాసులో ఇవాళ అంటే 2-9-1977. ఇప్పుడు మద్రాసులో *busmen's holiday*. ఈ సమ్మె నేటికి నాలుగయిదు రోజులనుంచీ సాగుతోంది. బస్సులు కూడా సమ్మె ప్రారంభమయినప్పటి నుంచీ ఏదో ఒక సంఖ్యలో సాగుతూనే ఉన్నాయి. ప్రభుత్వానికీ, పనివారి ప్రతినిధులకూ మధ్య సంప్రతింపులు కూడా సాగుతూ ఆగుతూ సాగుతూనే ఉన్నాయి. ఇంతట్లో ఈ సమ్మె ముగిసేటట్లు కనిపించదు.

ఖరీదయిన కార్లలో, అంతకన్నా ఖరీదయిన మనుష్యులు వస్తూనే ఉన్నారు. పోతూనే ఉన్నారు. బస్సు దొరక్క, దారంట నడుచుకుపోయే నాలాంటి వాళ్ల సంగతిని వాళ్ళెవరూ పట్టించుకోరు. బస్సులకూ, సమ్మెలకూ అతీతంగా తమ తమ పనుల మీద అర్జెంటుగా అటూ ఇటూ పోతూ ఉంటారు. నేనే చొరవ చేసి ఒక ఎంబాసిడరు కారును ఆపేను. స్టీరింగు చక్రం వద్ద ఒక్కడే ఉన్నాడు. అతడే ఆ కారు సొంతదారని నాకనిపించింది. నేను కాస్త మంచి గుడ్డలు ధరించి చెయ్యి ఊపడం వల్ల ఆగేడు. "ఏమిటి సంగతి" అన్నట్లు నావేపు చూశాడు.

"*can you please give me a lift?*"అన్నాను. నావేపు కొరకొర చూశాడు. మీకేమీ ఇబ్బందిఇవ్వను. ఎంతో కొంత దూరం వస్తాను. ఎక్కడో ఒకచోట దిగి పోతాను" అన్నాను ఇంగ్లీషులో.

గద్దించినట్లుగా"*can't oblige*"అనేసి అతను వెళ్ళిపోయాడు. అవును, ఎందుకు ఒబ్లైజ్ చెయ్యాలి. అతని కారు అతని యిష్టం. మనది సర్వతంత్ర స్వతంత్రమైన

భారతదేశం.

అమెరికాలో సాధారణంగా ఎవరైనా చెయ్యి ఊపుతే, కారుని ఆపి ఆ పాదచారికి కారులో లిఫ్టు ఇవ్వడం జరుగుతుంది. కొంతదూరం వెళ్ళేక ఆ ఎక్కినవాడు కారు కామందుని ఖూనీచేసి కారు నడుపుకూంటూ పోవడం కూడా సర్వసాధారణమే. నేనూ అలాంటి వాణ్నే అనుకున్నాడేమో ఎంబాసిడరు కారాయన.

ఇవాళ శుక్రవారం కాదూ! రెండు రోజులు వెనక్కి వెళ్ళి మొన్న బుధవారం రాత్రి ఏమయిందో చెబుతాను. పాండీ బజారులో బస్సుకోసం ఒక చెట్టుకింద నిలబడ్డాను. అప్పుడు టైము ఎనిమిదిన్నర. పదిగంటల దాకా అనగా గంటన్నరసేపు అలాగే బస్సు కోసం కాచుకున్నాను. ఒకటో రెండో బస్సులు వచ్చాయి. కాని మందవల్లికి వెళ్ళే బస్సు ఒక్కటి కూడారాలేదు. పత్రికలలో చూస్తే బస్సు పనివాళ్ళ సమ్మె విఫలమయిందని అన్ని రూట్లలో బస్సులు ధారాళంగా నడుస్తున్నాయనీ ప్రభుత్వం చేస్తోంది ప్రకటనలు. పగలయితే అరగంటకీ ముప్పావుగంటకీ ఒక్కొక్క బస్సు వస్తుందేమో కాని రాత్రి పూట అదీలేదు.

నాకు కొంచెం దూరంలో ఇద్దరు ఆడవాళ్లు నిలుచున్నారు. ఒక సైకిలు రిక్షా ఆ ఇద్దరిలో ఒకామెను రాసుకుంటూ నాదాకా వచ్చింది. ఆడమనిషి తన చీర మకిలయిపోయిందని లబోదిబోమంటోంది. సైకిలు రిక్షావస్తున్నది కుడివైపునుంచి. దానికి నేనుఅడ్డుగా నిలబడి ఏమిటి నువ్వుచేసిన పని? అన్నాను. బండి ఆపి రిక్షావాలా "నేను గంట మోగిస్తూనే వచ్చాను. వాళ్లు తప్పుకోకపోతే నేనేం చెయ్యను"అన్నాడు. ఇదంతా అరవంలో."గంట చప్పుడు చెయ్యడం ముఖ్యం కాదు. నువ్వు వస్తున్నది రాంగ్‌సైడు. పక్కనే ఉన్న పోలీసుస్టేషన్‌లో రిపోర్టు చేస్తే నీ గతి ఏమవుతుంద"న్నాను నాకు వచ్చినపాటి అరవంలో. రిక్షావాలా మాత్రం గంటమోగించడం గురించే చెబుతున్నాడు. రాంగ్‌సైడ్‌లో వచ్చానన్న జ్ఞానమే లేదు. బహుశా అతడు కూడా ఇది అమెరికా దేశమే అనుకున్నాడో ఏమో?

"ఎడమవైపుకి రిక్షా తిప్పు"మని నేనంటున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడతను. దగ్గరలోనే ఒక ట్రాఫిక్ పోలీసు నిలుచున్నాడు. కొంతసేపు ఇదంతా వినోదంగా చూస్తూ రిక్షా వెళ్ళిపోయాక తనుకూడా ఒక సిగరెట్ ముట్టించి దమ్ము పీలుస్తూ వెళ్ళిపోయాడు.

నేనుపాండీ బజారు నుంచి రాజకుమారి టాకీస్ దాకా నడిచాను, అక్కడ ఆటో రిక్షాలు దొరుకుతాయి కాబట్టి. రెండుమూడు రిక్షాలు ఉండడమైతే ఉన్నాయిగాని మౌంట్ రోడ్డుకి పోతున్నానని ఒకడూ, మైలాపూర్ దాకా మాత్రమే తీసుకువెళ్తాననీ ఇంకొకడూ ఇలా యెవరికి తోచినట్లు వాళ్లంటున్నారు. "సరే మైలాపూర్ కెంత" అని ఒకాయన బండి ఎక్కాడు. మరోఇద్దరిని చేర్చుకునే దాకా డ్రైవర్ బండికదల్చలేదు: మీటరువెయ్యలేదు."మనిషి కెంత తీసుకుంటూ"వని నేనడిగి మూడు రూపాయలని తెలుసుకున్నాను. అక్కడకూడా ఒక పోలీసు కానిస్టేబులున్నాడు. ఇదంతా చూస్తూనే ఉన్నాడు. కానీ ఏ మాత్రమూ కలుగజేసుకోలేదు.

దేశమంతటిలోకి గొప్ప రక్షక భటవ్యవస్థ ఉన్న రాష్ట్రంగా ఒకప్పుడు మద్రాసు రాష్ట్రానికి మంచిపేరు ప్రతిష్టలుండేవి. అదంతా బ్రిటిష్ వాడి హయాంలో. ఆరోజులు మళ్ళీరావాలని నేను కోరుకోవడంలేదుగానీ, ఇప్పుడీ తమిళనాడులో అమలుజరుగుతున్న పోలీసు విధానాన్ని చూస్తే"*what a fall my countrymen*"అని అనుకోక తప్పడం లేదు. నిజానికి ఈ పతనం రాజగోపాలాచారిగారు దేశమంతటిలోకి ప్రప్రథమంగా మద్రాసు రాష్ట్రంలో మద్యనిషేధం ప్రవేశపెట్టినప్పుడే ప్రారంభమయింది. ప్రారంభమయిందనా అన్నాను? అవినీతి అంతకుముందు కూడా లేకపోలేదు. కాని అది మద్యనిషేధంతో పరాకాష్ట చెందిందని మాత్రం చెప్పక తప్పదు.

బస్సులెలాగూ రావని రూఢి అయిపోయింది. ఆటోలో మైలాపూరుదాకావెళ్ళి అక్కడ నుంచి ఇంటిదాకా నడుచుకు వెళ్ళడం నాకు మనస్కరించలేదు. అందుచేత ఉన్నచోటినుంచి బయలుదేరి మందవల్లి దాకా నడుచుకుపోయాను. ఇల్లు చేరేసరికి రాత్రి పదకొండున్నర అయింది.

ఇవాళ ఇది రాస్తున్న సమయంలో నా ఊహలు మళ్లీ మద్యనిషేధం వైపు మళ్ళేయి. మనదేశపు రాజకీయ జూదంలో మద్యనిషేధం 'ఒక గిమ్మిక్!ఈ మధ్యనే ఏదో పత్రికలో చదివాను. మొరార్జీదేశాయ్ గారి అధ్యక్షత కింద జనతాపార్టీ కార్యనిర్వాహక వర్గం సమావేశమయిందట. దేశమంతటా మద్యనిషేధం అమలు చెయ్యాలన్న విషయం చర్చకు వచ్చిందట.కొందరు మాత్రం తొందర పడవద్దని ప్రధానమంత్రిని హెచ్చరించారట. వాళ్లు చెప్పిన కారణం, సంపూర్ణ మద్యనిషేధ శాసనం చేస్తే నిర్బంధ కుటుంబనియంత్రణ వల్ల కేంద్రంలో కాంగ్రెస్‌కు ఏగతి పట్టిందో అదేగతి జనతాపార్టీకి కూడా పడుతుందని!

*ప్రజాతంత్ర 18—9—1977*

## మూడు

ఇవాళ (11-9-77) మద్రాసులో 2/10ఎ సౌత్‌బాంక్ రోడ్డు ఇంట్లో కూర్చుని ఇదిరాస్తున్నాను. అన్నీ సక్రమంగా జరిగితే ఇవాళ నేను అనకాపల్లిలో జరిగే కవితాసమితి స్వర్ణోత్సవంలో పాల్గొని ఉండవలసింది. 10వ తేదీ హౌరా మెయిల్లో బయలుదేరుతున్నానని ఉత్తరాలు కూడా పూడిపెద్ది లక్ష్మణమూర్తికీ, మిరియాల రామకృష్ణకీ రాశాను. బహుశా ఇది రాస్తున్న సమయానికి సామర్లకోట స్టేషన్‌లో రామకృష్ణ నాకోసం కాచుకొని, నిరాశతో నామీద విసుక్కుంటూ ఉండాలి.

ఒక చిన్న పొరపాటువల్ల పెద్ద ఉత్సాహానికి భంగం కలిగింది. క్రితం రెండువారాలనుంచీ ఎదురుచూస్తున్న నా అనకాపల్లి ప్రయాణం ఆగిపోయింది. కవితాసమితితో నాకు హృదయ సంబంధమైన దృఢానుబంధం ఉందనీ, నేనూ మా ఆవిడా తప్పకుండా వస్తున్నామనీ లక్ష్మణమూర్తికి రాశాను. అలాగే టిక్కెట్ల రిజర్వేషనుకూడా అయిపోయింది. 10వ తేదీ

మెయిల్‌కి కాదు, ఇవాళ బయలుదేరబోయే మెయిల్‌కి. ఇక్కడే చిన్న పొరపాటు జరిగింది.

సాధారణంగా నా ట్రెయిన్ ప్రయాణపు రిజర్వేషన్లు పద్మాలయా సంస్థలోని ఒక మిత్రుడు చేస్తూవుంటాడు. ఈసారి కూడా అన్ని వివరాలూ అతనికే అందజేశాను. "10వ తేదీరాత్రి" అని స్పష్టంగా చెప్పాను. ఈలోగా లక్ష్మణమూర్తి దగ్గరనుంచి మరో ఉత్తరం వచ్చింది. అందులో *"Our friend Sri Grandhi Ranga Rao wants you to go over here by 10th. Mr.P.V. Ramana Rao, M.L.A. has returned from Russia and Anakapalli people want to felicitate him on 10th evening under your presidentship"* అని వుంది. (మన మిత్రుడు శ్రీ గ్రంధి రంగారావు నువ్విక్కడకు 10వ తేదీని రాగోరుతున్నాడు. యమ్.యల్.ఎ మిస్టర్ పి.వి.రమణ రష్యానుంచి వచ్చారు. ఆయనను అనకాపల్లి ప్రజలు నీ అధ్యక్షతకింద అభినందించాలనుకుంటున్నారు.) అందుచేత నేను 9వ తేదీని బయల్దేరాలనుకొని ఆ సంగతి పద్మాలయా మిత్రుడికి ఫోనులో చెప్పాను. ఒకరోజు ముందుగా అంటే, ఒకరోజు తర్వాత (11వ తేదీకి) అతను టిక్కెట్లు తీసుకున్నాడు!

టెలిఫోన్ సంభాషణలో "9వ తేదీకి వీలుపడ"దని అతను స్పష్టంగా చెప్పాడు. "అయితే, మొదట అనుకున్న ప్రకారం 10వ తారీఖునే టిక్కెట్లు తీసుకో"మ్మని నేను అంతకన్నా స్పష్టంగా చెప్పాను. అయినా జరగవలసిన పొరపాటు (లేక జరగకూడని పొరపాటా?) జరిగిపోయింది.

నేను ఉత్తరాలురాస్తే అదేపనిగా రాస్తుంటాను. లేకపోతే అసలే రాయను. ఎందరెందరో నాకు రిప్లయికార్డులు రాస్తుంటారు. లేదా, తమ చిరునామాలతో కవర్లూ, ఇన్లాండ్ లెటర్లూ పంపుతుంటారు. అవి అందినవెంటనే రాశానాసరి! లేక, రేపు రాయొచ్చునులే అనుకుంటే మరి రాయడమే ఉండదు. నాలోని అనేకానేక బలహీనతలలో ఇదో ముఖ్యమైనది. అవతలివాళ్ళు బాధపడతారని తెలిసి ముందుగానే నేనూ బాధపడుతూ ఉంటాను. నా ఇతర బలహీనతల్ని సహించినట్టుగా క్షమించినట్టుగా దీన్నికూడా సహించండనీ, క్షమించండనీ నా మిత్రులను కోరడం తప్ప నేను చేయగలిగిందేదీ లేదు.

మిరియాల రామకృష్ణ ఈనెల 5వ తేదీని కాకినాడనుంచి ఉత్తరం రాశాడు. అతను నా జీవితంమీదో, నా కవిత్వంమీదో డాక్టరేటునిమిత్తం థీసిస్సు రాస్తున్నాడు."ప్రస్తుతం నా టైప్డ్ థీసిస్‌లో మొదటిపేజీల్లో వేసుకునేందుకు మీతో నాకో ఫోటోగ్రాఫ్ కావాలి. మహాకవితో వ్యాఖ్యాతగా నేను నిలబడాలని తహతహ. ఇందుకు నేనాలోచించిన మార్గం సామర్లకోట స్టేషన్‌లో రైల్వేప్లాట్‌ఫారం మీద ఆ ఫోటో లాగించుకోవడం. నేను ఫోటోగ్రాఫర్‌ను లాక్కొస్తాను. మీరనుమతించాలి...సామర్లకోటలో ఏ ట్రెయినయినా పావుగంటకు తక్కువ ఆగదు. అందువల్ల టైమూ రైమూ బావుంటాయి" అని మి.రా. ఉత్తరంలో ఉంది.

టైమయితే చెప్పాముగాని రైముమాత్రం కుదరలేదు. ఉద్దేశపూర్వకంగా కాకపోయినా

రామకృష్ణకు కష్టం కలిగించినందుకు నాకు కష్టంగానే ఉంది. ఇలాంటి అనుభవాలెన్నెన్నో నాలో జీర్ణించుకుపోయాయి. అన్నింటినీ ఒకానొక అవహేళన అనే చిటికెడు ఉప్పుతో స్వీకరించడం నాకలవాటయి పోయింది.

ఇవాళ అనకాపల్లి అంతా ఎంతో కోలాహలంగా ఉంటుంది. ఆహ్వానపత్రిక ప్రకారం, స్వర్ణోత్సవానికి డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులు. శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు ప్రారంభకులు. సాయంత్రం 4.30కు జరిగే మహాసభలో ప్రధానవక్తగా నాపేరుంది. నేను మాత్రం ఉండను. ఇక్కడే ఉండిపోయాను. ఎందరో బహుకాల మిత్రులను కలుసుకోగలిగిన అవకాశం చెయిజారిపోయింది.

ముఖ్యంగా వడ్డాది సీతారామాంజనేయుల్ని చూడాలనుకున్నాను. అతనూ, నేనూ, పురిపండా కలిసి 1927లో కవితాసమితిని స్థాపించాము. అప్పుడు నా వయస్సు సరిగా 17. ఒకటి రెండేళ్ళ తేడాలతో ముగ్గురమూ ఇంచుమించు సమవయస్కులం.

సీతారామాంజనేయులిది పాతఫక్కీ అయినా అతనిపద్యాలు మంచి పకడ్బందీగా ఉంటాయి. శతావధానాలూ, అష్టావధానాలూ చేసినవాడు. అనర్గళంగా ఆశుకవిత్వం చెప్ప గలిగినవాడు. ఎప్పుడూ ముతకఖద్దరు బట్టలే ధరిస్తాడు. స్వరాజ్యోద్యమ సందర్భంలో బ్రిటిష్ అధికారం అతనికి కారాగారవాసశిక్ష విధించింది. ఇప్పుడతన్ని మన ప్రభుత్వం ఏమయినా ఆదుకొన్నదోలేదో నికరంగా నాకు తెలియదు.

ఈ యాభైయేళ్ళలో పురిపండాను చాలాసార్లు కలుసుకున్నానుగాని వడ్డాది సీతారామాంజనేయుల్ని మాత్రం చాలా నకృత్తుగా చూశాను. పద్ధతులూ, బాణీలు వేరయినా మా పరస్పర సుహృద్భావాని కెప్పుడూ భంగపాటు కలగలేదు.

"కవితాసమితి" స్థాపకులమైన మేం ముగ్గురమూ ఇంకా బతికేవున్నాము. కాని మా మొదటి అధ్యక్షుడయిన మారేపల్లి రామచంద్రశాస్త్రిగారిప్పుడు లేరు. ఒక వార్షికోత్సవానికి అధ్యక్షత వహించవలసిన అచ్చంపేట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారు లేరు. అధ్యక్షత వహించిన గిడుగు వెంకటరామమూర్తి, అఖిలాంధ్ర కవుల ఛాయాచిత్ర ప్రదర్శనాన్ని ఆవిష్కరించిన మల్లంపల్లి సోమశేఖరశర్మ కీర్తిశేషులయ్యారు. ఒక సభలో మేం సన్మానించిన రవీంద్రకవి కూడా కాలధర్మం చెందాడు.

ఇంకా ఎందరో ఎందరో! తాపీ ధర్మారావు, రాళ్లబండి సత్యనారాయణరావు, సున్నం వీర్రాజు ఎవ్వరూ ఇప్పుడులేరు. సున్నం, రాళ్ళబండి, తాపీ ఇంతమంది ఉన్నప్పుడు కవితా సమితికి సొంతభవనం లేకపోయిందే అని ఇప్పటికీ నేను చమత్కారంగా చింత పొందుతూ ఉంటాను.

*ప్రజాతంత్ర 25–9–1977*

## నాలుగు

శ్రీ శ్రీ అంటే ఎవరు? మహా ప్రస్థానం రాశాడే, అతనేనా! అని కొందరు, సినీమాలకు రాస్తూ ఉంటాడే, అతనేనా? అని మరికొందరు, విరసం అధ్యక్షుడేనా? అని ఇంకా కొందరూ!

విజానికిప్పుడు నేనేమీకాను. విరసం అధ్యక్షతకి రాజీనామా ఇచ్చానన్న సంగతి తెలిసిన వాళ్ళకన్న తెలియని వాళ్ళే ఎక్కువ. ఇక సినిమా రచయితగా నా రాతలకెప్పుడూ నేను (సాహిత్యపరంగా) ఇచ్చిన విలువ చాలా తక్కువ. ఆర్థికంగా అంటే అది వేరే విషయం. అక్కడ కూడా నేటి సినీమా ఏకనమిక్సు ప్రకారం నాకు (నాకేకాదు ఇంకా అనేకులకు)పూర్తి న్యాయాలు జరగలేదనే చెప్పాలి. అస్యవ్యస్తంగా వున్న నేటి సామాజిక వ్యవస్థలో ఆర్థిక న్యాయా న్యాయాలు సహా అస్తవ్యస్తంగానే ఉంటున్నాయి. ఇరవై అయిదేళ్ళకు పైగా సినిమా రంగంలో ఉంటూ కూడా నేనో సినిమా రచయితనని గట్టిగా చెప్పుకోగల ధైర్యం నాకిప్పటికీ కలగలేదు.

పోతే, "మహా ప్రస్థానం" రాసిన నాటికీ, నేటికీ నా వయస్సు మూడు దశాబ్దాలకు పైగా పెరిగింది. అప్పటినుండి ఇప్పటిదాకా సాహిత్యంలోనూ, ముఖ్యంగా కవిత్వంలోనూ వస్తున్న మార్పులను గుర్తిస్తూనే వున్నాను. వాటికి నేను అనుక్షణమూ స్పందిస్తూనే ఉన్నాను. రచయితగా ఇప్పుడు నేను "మహాప్రస్థానం"రాసిన శ్రీశ్రీని కాను. "మరో ప్రస్థానం"రాస్తున్న శ్రీశ్రీని.

ఇవాళ నాకు గరికిపాటి అంకమ్మరావు అనే కుర్రవాడి దగ్గర నుంచి ఒక ఉత్తరం వచ్చింది. అతని వయస్సెంతో నాకు తెలియదు. కాని, ఉత్తరంలోని కుర్రతనపు అమాయకత్వాన్ని బట్టి కుర్రవాడంటున్నాను. ఉత్తరాన్ని యధాతథంగా ఇక్కడ ఇస్తున్నాను.

"చినలింగాయపాలెం"
21-9-77.

పూజ్యులు శ్రీశ్రీ గారికి,

శ్రమకు విలువ కట్టలేము. చాలా కాలము నుండి కూడా ఏదోవిధంగా శ్రమ దోపిడి చేయబడుతూనే ఉన్నది గదండి. ఈ విషయము నాకంటే మీకెంతో బాగాతెలుసును. కాని మీరు తెలిసి యుండి కూడా ఒక విధంగా శ్రమ దోపిడికి గురిఅవుతున్నారని నే నను కొంటున్నాను. మీ సాహిత్యాన్ని సినిమావాళ్లు దోచుకుంటున్నారు. అలా మీరెందుకు చేస్తున్నారోనండి. మహాప్రస్థానం వంటి విలువైన రచనలు చేయగలిగిన మీరు ఇంకెన్నో చైతన్యవంతమైన రచనలు తప్పక జేయాలండి. కాని మీరు ప్రస్తుతం రచనలు చురుకుగ జేయకపోవడానికి కారణమేమిటో తెలుపగలరు.

మీ మీద ఉన్న అభిమానంతో నాకున్న అనుమానాలను తీర్చుకోటానికి గాను, ఉత్తరం మీకు రాయగలిగినంత శక్తి లేకపోయినను ఎలాగో వ్రాస్తున్నాను. రెండు నిముషాలు నాకై వినియోగించి సమాధానం వ్రాస్తారని కోరుతున్నాను.

ఇట్లు, మీ విధేయుడు
గరికిపాటి అంకమ్మరావు

ఈ ఉత్తరం నన్ను పరిపరి విధాల ఆలోచించేటట్లు చేసింది. రెండు నిమిషాలలో దీనికి జవాబివ్వడం సాధ్యమా? ఆలోచిస్తున్నాను. సరి అయిన జవాబు తోచటంలేదని రాయడమే సరి అయిన జవాబు!

ఇప్పుడు మనం జీవిస్తున్న సమాజంలో రెండే రెండు వర్గాలున్నాయి. దోపిడిచేస్తున్న వర్గం ఒకటి. ఆ దోపిడికి గురిఅవుతున్న వర్గం ఒకటి. ఇది అందరికి స్పష్టంగా కనిపించే వాస్తవమే అయినా, ఆ వాస్తవాన్ని మొట్టమొదటిసారిగా గుర్తు చేసిన వాడు కార్ల్‌మార్క్స్. దాని కూలంకష, పరిశీలనాత్మక వివరణమే మార్క్సిజం. సవాలక్ష ఇజాలలో మార్క్సిజం కూడా ఒకటని, తనకేయిజంలోనూ నమ్మకం లేదని అనే వాణ్ని నేను నమ్మను.

''ఈ బూడిద తీసుకో! ఇది మీ జబ్బులనన్నింటినీ వదలగొడుతుంది'' అంటే ఆ బూడిదను కళ్ళకద్దుకుని స్వీకరించే ఆస్తికోత్తములున్న దేశం మనది. మార్క్సిజం కూడా అలాంటి మూఢవిశ్వాసమే అనుకునే మూఢుల్ని చూసి నేను జాలిపడతాను.

*ప్రజాతంత్ర 9–10–1977*

## ఐదు

అమ్మయ్యా! అనుకున్నాను. కావలసిన వాళ్ళందరినీ రౌండప్ చేసి లాకప్‌లో వేసిన తర్వాత ప్రభుభక్తిపరుడైన పోలీసుద్యోగి ఇలాగే అనుకుని ఉంటాడు.

పది సంవత్సరాల నుంచీ ఇంట్లో ఆ మూలా ఈ మూలా పారేసిన పాత కాగితాలన్నింటినీ పోగుచేసి వాటిలోంచి ముఖ్యమైన లేదా నేను ముఖ్యమైనవనుకున్న కాగితాలను వేరుచేశాను. ఇవన్నీ ఇప్పుడు నా లాకప్‌లో భద్రంగా ఉన్నాయి.

వీటిలో నేను రాయాలనుకుని ప్రారంభించిన ''కృష్ణా కృష్ణ'' అనే ఏకాంక నాటిక దొరికింది.

''ఖడ్గ సృష్టి'' గీతానికి నేను చేసిన ఆంగ్లానువాదం (అసంపూర్ణం)దొరికింది. జైళ్ళనుంచి విప్లవ రచయితలు రాసిన లేఖలు దొరికాయి. కృష్ణశాస్త్రిగారు స్వహస్తంతో రాసిచ్చిన పద్యాలు *Amnesty international*కి నేను రాసిన ఉత్తరం ఇంకా ఎన్నో ఎన్నో!

మరి నేను అమ్మయ్యా! అని హాయిగా నిట్టూర్చానంటే ఇందులో ఆశ్చర్యం ఏముంది.

కృష్ణశాస్త్రిగారు బూతుపద్యాలు రాశారా అని ఎవరూ ఆశ్చర్యపడనక్కరలేదు. ఆయన ఏది రాసినా అందులో సుస్పష్టమైన కృష్ణశాస్త్రిత్వం తొంగిచూస్తూనే ఉంటుంది. మచ్చుకోపద్యం:

''షోడశ సహస్ర గోపికా సుభగ భగ గు
హ విహార దీక్షా దక్షమైన వ్రజ కు
మార మారధ్వజోగ్ర కంఠీరవంబు
నావహించిన శక్తినే నాశ్రయింతు!''

(ఇది నేను జ్ఞాపకాన్ని బట్టి ఉదహరించాను. కృష్ణశాస్త్రి గారి రాతప్రతిలో ''షోడశ సహస్ర కామినీ-'' అనివుంది)

ఇంకో ఉదాహరణ:

"ఇద్దరు వితంతువులు కోటిఫలి శివరాత్రి
తీర్థానికి వెళ్ళివచ్చి
మొండిఘటాల నెందరనో
మున్ గవగొంటిని మైథున క్రియా
శౌండుల,ఒక్కడున్ హూసెను
సాయిబు ఆతున కీడు రాడు, నే
దండ దడాండ డాండ డడ,
డాండడ డాండ యటంచు మత్త వే
దండమునెక్కి చాటెదను
దాశరథీ! కరుణాపయోనిధీ!

శాస్త్రిగారి అనుమతి లేకుండా ఇలా వారి పద్యాలను ఉదహరించుకుంటూ పోవడం వారిపట్ల అవినయమేమో నాకు తెలియదు కాని నాపట్ల వారికున్న ఆప్యాయం ఈ అవినయాన్ని అనుమతిస్తుందనే ఆశిస్తున్నాను.

"కృష్ణే కృష్ణ" ఏకాంకిక ప్రారంభంలో ప్రయోక్తలకు కొన్ని సూచనలు చేశాను ఈ క్రింది విధంగా,

ప్రయోక్తలు ధనాభావం చేత ప్రదర్శన మానుకోనక్కరలేదు.

పిండికొద్దీరొట్టె. ఈ నాటికను పల్లెటూళ్ళో పనుల కొట్టంలోనైనా, పట్టణాలలో పెద్ద థియేటర్లలోనైనా వెయ్యవచ్చు. ఇందులో ఇద్దరే పాత్రలు: ద్రౌపది, కృష్ణుడు. ఒకటే సెట్టు: ద్రౌపదీదేవీ అంతఃపురం. ఆనాటి *dressing table* ఒక నిలువుటద్దం కలిగి ఉండవచ్చు. లేదా ఒక చిన్న సైజు అద్దంతో సరిపెట్టుకోవచ్చు. ఇలాగే మిగిలినవన్నీ. ఆహార్యం సిల్కు కావచ్చు. చవక దుస్తులూ కావచ్చు. ద్రౌపదీ దేవికి మరో పేరు కృష్ణ. స్త్రీలింగం కాబట్టి సమాసంలో కృష్ణే అవుతుంది. కృష్ణవర్ణం అంటే నలుపు: కాని ద్రౌపది శరీరానిది సువర్ణఛాయ. శ్రీకృష్ణుడు నీలమేఘ శ్యాముడు, ద్రౌపది దుస్తులు తెల్లనివి. కృష్ణుడు పీతాంబరుడు. అనగా అతనివి పసుప్పచ్చని బట్టలు. శిరస్సుకి నెమలి పింఛం. చేతిలో పిల్లనగ్రోవి. ఇవి చాలు కృష్ణుణ్ని గుర్తించడానికి. కృష్ణుడు ఉద్రేకంలో మాట్లాడుతూంటే నెమలి తురాయి పడిపోతుంది. అప్పుడు దాన్ని తీసి ద్రౌపది కృష్ణుని తలకు అలంకరించుతుంది. ఇది ఎప్పుడెప్పుడు జరుగుతుందో సూచించాను. అంతకన్నా ఎక్కువసార్లు చెప్తే ఎబ్బెట్టుగా ఉంటుంది. అలాగే ఏదీ అతిగా నటించవద్దని నటీనటులకు మనవి.

అద్దం ప్రేక్షకులకు సరాసరి ఎదురుగా ఉండకూడదు. కొంచెం ఒక ప్రక్కగా ఉండాలి. అనగా కుడినుండి కృష్ణుడు ప్రవేశిస్తున్నాడంటే అతని ప్రతిబింబం ద్రౌపదికి కనిపించేలాగున

ఎడమవైపు 45డిగ్రీల కోణంలో ఉండాలి. అందులో కృష్ణుని రాకను చూడడం వల్లనే. అన్నయ్యా, కృష్ణా! అంటుంది ద్రౌపది. ఈ మాటలతోనే నాటిక ప్రారంభమవుతుంది.

పౌరాణిక పాత్రలు ఇంగ్లీషు మాటలు వాడడమేమిటని ఎవరూ బాధపడవక్కరలేదు. ఆమాటకొస్తే కృష్ణా కృష్ణలిద్దరూ తెలుగు కూడా మాట్లాడిఉండరు.

ప్రయోక్తకు పరిచయస్తుడైన మంచి చిత్రకారుడు దొరికితే పసుపు, నీలం ఈ రెండు రంగులతో ఒక నైరూప్య చిత్రాన్ని నేపథ్య యవనికగా వాడవచ్చును. ఇవి కలుస్తూ విడిపోతూ ఉంటాయి. కలిసినచోట ఆకుపచ్చరంగు తనంతటగానే ఏర్పడుతుంది. వీటిమీద కాంతి ప్రసారాలు కూడా సమయానుకూలంగా మార్చాలి.ఇదేమీ సాధ్యంకాకపోతే ఎరుపుతప్ప ఇంకేదయినా ఒకేరంగు తెరముందు నాటికను ప్రదర్శించవచ్చు. చివరి మాటగా ఒక ముఖ్యమైన విషయాన్ని ప్రయోక్త లేదా *choreographer*గుర్తుంచుకోవాలి. ఏ తెర అయినా నాటిక క్లయిమాక్సు దశలో ఎర్రరంగుది అయిపోతుంది. సరిగ్గా ఎప్పుడు తెర ఎర్రబడుతుందో నాటికలోనే ఉంది.

ప్రజాతంత్ర *16–10–1977*

# మనలో మనం

## ఒకటి

జాబు:జవాబు.

"ప్రజాతంత్ర" కార్యాలయం నుంచి దేవిప్రియగారు నాకిలాగ ఉత్తరం రాశారు.

1-7-77

గౌరవనీయులు శ్రీ శ్రీ గారికి,

నమస్కారం.

నేను గత మాసం మద్రాసులో కలిసినప్పుడు అనంతం క్రమం తప్పకుండా, ఆలస్యం జరగకుండా పంపిస్తానని మాట యిచ్చారు. అప్పటి మన ఒప్పందం ప్రకారం ప్రతి సోమ, గురువారాలలో మీరు అనంతం పోస్టు చేయాలి. ఇది జరిగిన తర్వాత ఒకసారి మాత్రం అనంతం అందింది. పోయినవారం ప్రజాతంత్ర అనంతం లేకుండానే అచ్చయింది. ఈ వారం కూడా అంతే. టెలిఫోను మీద నేను మాట్లాడిన ప్రతిసారీ యివాళే పోస్టు చేస్తానంటూ వచ్చారు, బిజీగా వున్నానన్నారు. కొంత కాలం వాయిదా వేద్దామన్నట్టు మాట్లాడారు. పాఠకులు డిసప్పాయింటవుతారనీ, సాహితీ ప్రియులు నిరాశపడతారనీ నేను చెప్పిన మీదట మీరు అయితే పంపిస్తున్నానన్నారు. అనంతం వేళకి అందక మేమూ, అచ్చులో కనిపించక ప్రజాతంత్ర పాఠకులూ యెంత విచారిస్తున్నదీ మీకు అర్థం కావడానికే యింతా రాయవలసి వచ్చింది. ఈ ఉత్తరానికి సమాధానంగా అనంతం తక్షణమే పోస్టుచేయండి, లేదా యేదైనా యిబ్బంది వుంటే వివరంగా రాయండి. సినీమా పని వలన మీరు మీ జీవిత కథ రాయలేని దుస్థితి యేర్పడితే - వ్యక్తిగతంగా నా అభిప్రాయం - అంతకంటే తెలుగు సాహిత్యానికి దుస్థితి వుండదు. సమాధానం రాస్తారని ఆశిస్తున్నాను.

అభినందనలతో

భవదీయుడు

దేవిప్రియ

దీనికి నా జవాబు:

మద్రాసు,

5-7-77

దేవిప్రియగారు!

మీరు నాకు ఊపిరి సలపనిచ్చేటట్లు లేరు. చైనా పర్యటన గురించి వ్రాయడం ముగించిన తర్వాత రెండే రెండు వారాలు అనంతం ఆపి ఊపిరి పోసుకుందామనుకున్నాను. కాని అనంతం

ఆగడానికి వీలులేదని మీరూ అంటున్నారు ఏ.వి.రావుగారూ అన్నారు. ఆగిపోవటం అంటే అంతం కావటం కాదని నా ఉద్దేశం. నాజీవితం పొడుగునా అనంతం రచన సాగిపోతూనే ఉంటుంది. చైనా యాత్ర ముగింపుతో నాజీవితంలో ఒక ఘట్టం ముగిసిందనుకుంటున్నాను. ఇందుకు సినీమా పనుల ఒత్తిడి ముఖ్యకారణం కానే కాదు. ఎన్నిపనులున్నా అవి అనంతం రచనకు ఆటంకాలు కావు.

ఆరునెలల నుంచీ హైదరాబాదు రావాలనుకుంటున్నాను. అనంతంలోని వివిధ ఘట్టాలను ఒక క్రమంలోకి తెచ్చి ఒక సంపుటంగానూ, చైనా యాత్రను ఇంకో పుస్తకంగానూ అచ్చు వేయించే పనిమీద అక్కడ కనీసం ఒక వారం రోజులైనా ఉండవలసి ఉంటుంది. రావుగారు రమ్మంటూనే ఉన్నారు. కాని నేను కూరుకుపోయిన ఊబిలోనుంచి బైటికి రాలేకపోతున్నాను. ఇందులోంచి నన్నెవ్వరూ పైకి లాగబోరనీ, నా అంతట నేనే బైటపడాలనీ నాకు బాగా తెలుసును. పడతాను కూడా! ఎలాగయినా ఈ నెలాఖరులోగా హైద్రాబాదులో ఉండగల ననుకుంటున్నాను.

ఏది ఎలా జరిగినా, ఇక మీదనుంచీ అనంతం సక్రమంగా, అవ్యాహతంగా మీకు ప్రతివారం అందజేయగలనని హామీ ఇస్తున్నాను.

మీకు తెలుసును. ప్రస్తుతం పత్రికలలో నామీద (విరసం అధ్యక్ష పదవికి నా రాజీనామాను పురస్కరించుకొని) పెద్ద గాలిదుమారం రేగుతోందని. అన్ని పత్రికలను చూసే అవకాశం నాకులేదు. అందరికి జవాబివ్వడం కూడా అసాధ్యమే. ఒకప్పుడు నేను తొలిసారిగా రష్యాప్రయాణం చేసి తిరిగి వచ్చినప్పుడు చెలరేగిన దుమారం ఇప్పుడు నాకు జ్ఞాపకం వస్తోంది. అప్పుడైతే నన్ను సమర్థిస్తూ, కలంతో పోరాటం సాగించిన నార్ల చిరంజీవి ఇప్పుడు లేడు. ఈనాడు విరసం సభ్యులకే నేను సమాధానం ఇవ్వవలసి ఉంది. వచ్చేవారం అనంతంలో అదే ప్రారంభిస్తాను.

మీ శ్రేయోభిలాషి,
శ్రీ శ్రీ

*ప్రజాతంత్ర 17–7–1977*

## రెండు

**జాబు:జవాబు**

రాజమండ్రి సెంట్రల్ జెయిల్ నుండి డాక్టర్ యం.వి.రమణారెడ్డి[1] ఇలా రాశారు.

1 డాక్టర్ ఎం.వి. రమణారెడ్డిగారు కడపజిల్లా ప్రొద్దుటూరులో కార్మిక నాయకుడు. 1970లో ప్రభంజనం అనే రాజకీయ పక్షపత్రికను నడిపారు. విరసం వ్యవస్థాపకుల్లో ఒకరు. 1975 జనవరి అనంతపురం మహాసభలో విరసం నుంచి రాజీనామా చేశారు.

1979 తరువాత క్రమంగా ప్రజారాజకీయాలకు, పోరాట రాజకీయాలకు దూరమయ్యారు. 1983లో ప్రొద్దుటూరు నియోజకవర్గం నుంచి తెలుగు దేశం ఎం.ఎల్.ఎ గా ఎన్నికయ్యారు. ఆ తర్వాత రాయలసీమ విమోచన సమరసమితి స్థాపించారు.

రాజమండ్రి,
12-6-77

శ్రీ శ్రీ గారికి-

నమస్తే. పత్రికల ద్వారా విరసం సమావేశ వివరాలను కొంతవరకు తెలుసుకోగలిగాను. వాటిలో సంతోషించదగిన విషయం ఒకటి, విచారించవలసిన విషయం మరొకటి నాకు కనిపించాయి. రాజకీయ కార్యాచరణకు, సాంస్కృతిక కార్యాచరణకు చాలా తేడా వుందని; మొదటిది పార్టీ కార్యక్రమం, రెండవది సాంస్కృతిక సంఘాల కార్యక్రమమని, ఒకదానితో ఒకటి గందరగోళపరచటం గాని, కుక్క చేయవలసిన పని గాడిద చేస్తే నష్టం జరగక తప్పనట్లు ఒక రంగం నిర్వహించవలసిన బాధ్యతలు మరో రంగం ద్వారా నిర్వహిస్తే నష్టం తప్పదని అనేక సందర్భాలలో చర్చల ద్వారానూ, ఉత్తరాల ద్వారానూ విరసం బాధ్యులను హెచ్చరిస్తూ వచ్చాను. చివరకు అనంతపురం మహాసభ సమయంలో మా రాజీనామాలతో బాటు చేసిన బహిరంగ ప్రకటన ద్వారానైనా కొంత కన్నులు తెరిపించగలమని ఆశించాను. కాని, కామెర్ల రోగి సామెతగా మీ ముందు నా ప్రయత్నాలన్నీ మరో అర్థానికి దారితీసి, మీ చేత విచక్షణా రహితమైన నిందలు భరించవలసి వచ్చింది. మీలో ఒకడిగా నేను చేయలేకపోయిన పనిని శ్రీమతి ఇందిరాగాంధీ తేలికగా నెరవేర్చగలిగినందుకు ఆమెను అభినందించక తప్పదు. దాదాపు ఉన్మాద పరిస్థితుల్లో కొట్టుకుపోతూండిన విరసంకు ఆమె ఒకదారి చూపించ గలిగింది. నాకు సంతోషం కలిగించిన విషయం ఇది.

విచారం కలిగించిన రెండవ విషయం- మీ ఆత్మ విమర్శ. (మీరిచ్చిన సంజాయిషీని ఆత్మవిమర్శ అనే పేరుతో పిలుస్తున్నందుకు క్షమించండి.) ఇందిరాగాంధీ విధించిన అత్యవసర పరిస్థితిని వామపక్ష నియంతృత్వంగా భ్రమించేటంత అమాయకులా మీరు? అత్యవసర పరిస్థితి కాలంలో జైళ్ళలో పడిన వామపక్ష పార్టీల కార్యకర్తల సంగతి అటుంచి, మీ సహచరులుగా అనేక సంవత్సరాల నుండి విరసంలో సభ్యులైన వ్యక్తుల్లో దాదాపు ప్రతి ఒక్కరూ పెరోళ్ళకు కూడా నోచుకోని దుర్గతిలో జైళ్ళలో మ్రగ్గుతుంటే, మద్రాసు నుంచి చూసే మన కంటికి ఈ అత్యవసర పరిస్థితి వామపక్ష నియంతృత్వంగా కనిపించిందా? అనేక మంది అమాయక ప్రజలను చిత్రహింసలపాలు చేసిన అత్యవసర పరిస్థితి మీ నిషాకళ్ళకు నిజాయితీ గల పరిపాలనగా కనిపించిందా? ప్రజాకవి బిరుదులు తగిలించుకొని ఇంకా ఎంత కాలం ప్రజలను మోసగిద్దామనుకున్నారు? మీరు చేసుకున్నది ఆత్మవిమర్శగాదు, ఆత్మవంచన.

సినిమా రంగపు సుఖజీవితానికి అలవాటు పడిన మీకు జైలు జీవితాన్ని అనుభవించే మనో స్థైర్యం లేక అరెస్టు గాకుండా తప్పుకోటానికి అత్యవసర పరిస్థితిని సమర్థించారు. ఇందిరా సోషలిజం మాటలగారడీగా వివరిస్తూ వచ్చిన మీరు కష్టాలను ఎదుర్కోవలసిన సమయం వచ్చేవేళకు అదే సోషలిజానికి దాసోహమన్నారు. ఆ సోషలిజంలో మాటలగారడీలాగే మీ విప్లవంలో వాచాలత్వం స్పష్టంగా బహిర్గతమైంది. మీరనుకుంటున్నట్లు మీరు విదూషకులు

కారు, అవకాశవాదులు. మీ మనస్సును మీరొకసారి జాగ్రత్తగా పరిశీలించుకోగలిగితే మీకు కీర్తి దాహం ఎంత తీవ్రంగా వుందో అర్థమవుతుంది. సామాజిక చైతన్యం కాదు గదా లౌకిక జ్ఞానమున్న ఏ వ్యక్తీ పాలుబడని ఆత్మస్తుతికి (శ్రీ శ్రీ) వొక్కడే పాలుపడగలడు. ఈ కీర్తి దాహమే మీ ఆలోచనలకు, ప్రవర్తనకు పునాది. ఈ దురదే మీ ఆచరణకు మార్గదర్శి. విరసంలోకి మిమ్మల్నాకర్షించింది ధ్యేయం కాదు, ఈ దురద. ఈనాడు మీ చేత ఆత్మవిమర్శ చేయిస్తున్నది నిజాయితీ కాదు, ఈ కీర్తిదాహం. జైలుకు వచ్చివుంటే కీర్తిమరింత పెరిగి ఉండేదని మీకు తెలుసు, కాని ఈ అత్యవసర పరిస్థితి ఎంత కాలముంటుందో, ఏ రూపం తీసుకుంటుందో మీకు తెలీకపోవడంవల్ల సాహసించలేకపోయారు. మీ పిరికితనం ఆ కీర్తిదాహాన్ని మింగేసింది. మబ్బులు తొలగిపోయాయని నమ్మకం కుదరగానే ఈవేళ మళ్ళీ మీరు తయారయ్యారు. మీ కల్లబొల్లి ఆత్మవిమర్శతో ఇది మాకు మొదటి పరిచయం అని మాత్రం అనుకోకండి.

విరసం నుండి మీరు రాజీనామా చేసిన పరిస్థితులు, మేము చేసిన పరిస్థితులు వొక్కసారి గుర్తుకు తెచ్చుకోండి. విరసం ప్రచారం చేస్తూ వచ్చిన పద్ధతికి నిరసనగా మాకు మేమై ఆనాడు రాజీనామా చేశాము. కాని సంస్థకు చేయరాని అపచారం చేసిన నేరస్థులుగా ఈనాడు మీరు రాజీనామా చేశారు. మీకు అర్హమైన శిక్ష రాజీనామాను ఆమోదించటంగాదు. మిమ్మల్ని సంస్థనుండి బహిష్కరించటం. విచిత్రమేమిటంటె ఆనాడు మా రాజీనామాలను ప్రక్కకు నెట్టి మమ్మ బహిష్కరించినట్లు ప్రకటించారు. ఏ నేరం చేయని మాపైన ద్రోహులనే నిందలు వేశారు. కానీ, ఈనాడు నేరస్థులైన మీతో మర్యాద పూర్వకంగా రాజీనామా స్వీకరించి ఆమోదించారు. దీన్నిబట్టి విరసంలో ఉన్న ఉదారవైఖరి, వ్యక్తి ప్రాధాన్యత ఏమాత్రం తగ్గలేదని అభిప్రాయపడవలసి వస్తోంది. అంతేగాదు, అధ్యక్షులుగా మీరు లేకపోవడంతో అసలు విరసంకు అధ్యక్షస్థానమే లేకుండా ఇదే సమయంలో తొలగించి, మీకు మరింత గౌరవాన్ని చేకూర్చారు. పరోక్షంగా మీ కీర్తి దాహానికి సంతృప్తిని సమకూర్చారు.

ప్రజల ముందు రోజురోజుకూ మరింత వెకిలిగా బయటపడడంకంటే, ఇప్పటికైనా మీ మనోప్రవృత్తిని మార్చుకోవలసిందిగా నేను సలహాయిస్తున్నాను. అంతే గాదు మీకు విమర్శను స్వీకరించగల సాహసమేవుంటే, నా ఈ ఉత్తరాన్ని విరసం ప్రధాన కార్యదర్శికి పంపగలరని ఆశిస్తున్నాను.

ఇట్లు
ఎం.వి.రమణారెడ్డి,
కా.నెం.4051
సెంట్రల్ ప్రిజన్, రాజమండ్రి

ఇదీ జాబు, దీనికి నా జవాబు.

డియర్ రమణారెడ్డిగారూ,

మీరు కోరినట్టు మీ ఉత్తరాన్ని విరసం కార్యదర్శికి పంపించకుండా ఇలా బహిరంగంగా ప్రకటించి జవాబివ్వడంలోనే నేను ఇతరుల విమర్శలను స్వీకరించగలనో లేనో మీకు అర్థమై ఉంటుంది. ఇదికూడా నా కీర్తి దాహానికే నిదర్శనమనుకుంటే, మీ ఉత్తరంలోని పొరపాటు అభిప్రాయాల జాబితాకు మరో అయిటంను కలపడం మాత్రమే అవుతుంది.

కుక్క చెయ్యవలసిన పని గాడిద చేస్తున్నదన్న కోపంతో మీరు బైటికి పోలేదు. విరసంలో చారుమజుందారును సమర్థించే వర్గానిది పైచేయి కావడమే మీ నిష్క్రమణకు కారణం. నేను కూడా తొలినుంచీ (ఇప్పుడు కూడా) విరసం సాంస్కృతిక సంస్థగా పనిచెయ్యాలి గాని రాజకీయ కార్యకలాపాలకి ప్రాముఖ్యం ఇవ్వకూడదని నమ్మేవాడినే. బూర్జువా సంస్కృతికన్నా ప్రోలిటేరియన్ సంస్కృతి గొప్పదని నిరూపించడమే విరసం ప్రథమ కర్తవ్యం కావాలని నేనిప్పటికీ విశ్వసిస్తున్నాను. ఆ ఉద్దేశంతోనే నేను 20 సూత్రాల ప్రణాళికను బలపరిచాను. అవి సరిగా అమలు కాలేదంటే అది వేరే సంగతి.

అత్యవసర పరిస్థితిలో కూడా విరసం నిషిద్ధసంస్థ కాదు. విరసం "అధ్యక్షుడిగానే కాక ఒక వ్యక్తి"గా కూడా నేను అత్యవసర పరిస్థితినెప్పుడూ సమర్థించలేదు. పైగా దాన్ని తీవ్రంగా దుయ్యబడుతూ రాసిన ఒక వ్యంగ్య రచనను 'జయశ్రీ' పత్రికకు పంపించాను. దాని ప్రకటనకు సెన్సార్ల అనుమతి లభించలేదు. నారచనను నాకు తిరిగి పంపించానన్నారు 'జయశ్రీ' పత్రికాధిపతి. కాని అది నాకందలేదు. ఏమయిపోయిందో ఇప్పటికీ నాకు తెలియదు.

అంతకుముందు అదే పత్రికకు, భూమయ్య కిష్టాగౌడ్లను ఉరితీసిన సందర్భంలో ఒక గీతం పంపించాను. సెన్సారు కాలేదని తిరిగి పంపించారు. దరిమిలాను (అత్యవసర పరిస్థితి కాలంలోనే) ఆ గీతాన్ని 'జ్యోతి' మాసపత్రికకిచ్చాను. అచ్చయింది.

మీరు నమ్మినా నమ్మకపోయినా నేను శ్రీమతి ఇందిరాగాంధీది వామపక్ష నియంతృత్వ మనే భావించాను. కుడి యెడమలలోని తీవ్రవాదులను నిర్బంధించడంలో నా సహచరులకు సంభవించిన అవస్థను నేను గుర్తించకపోలేదు. కాని ఇందిరను హిట్లరుతో పోల్చడం భావ్యంకాదు, హిట్లరు కమ్యూనిస్టులను ఊచకోత కోశాడు. సి.పి.ఐ కూడ పోనీయండి. సి.పి.యంను కూడా ఆమె నిషేధించలేదు. ఆనందమార్గీయుల, జనసంఘీయుల ఆట కట్టించడానికి ఆమె నిశ్చయంగా ప్రయత్నించింది. సంజయ్‌గాంధీ రంగప్రవేశంతో పరిస్థితులు తారుమారయిపోయాయి. అప్పుడే ఘోరమైన ట్రాజెడీ ప్రారంభమయింది.

కాంగ్రెసుద్వారా సోషలిజం వస్తుందని గాడిదలు కూడా నమ్మవు. కాస్తో కూస్తో ఆలోచనా శక్తిగల మనిషిగా నాకటువంటి భ్రమలు ఏకోశానాలేవు. సమకాలిక మానవ చరిత్ర సామ్యవాదం దిక్కుగా ప్రయాణిస్తోంది. మనదేశంలో కూడా కర్షక కార్మిక విప్లవం వల్లనే సామ్యవాదం సిద్ధిస్తుంది.

రెడ్డిగారూ! చెరసాలకు జడిసిపోయి నేను అత్యవసర పరిస్థితిని సమర్ధించానని మీరనుకోవడం పెద్ద పొరపాటు. (అసలు నేను ఎమర్జన్సీకి బద్ధవిరోధిని.) అత్యాయిక పరిస్థితి ప్రకటించిన తొలి రోజుల్లో నేను అజ్ఞాతవాసంలో లేను. ఏ క్షణమైనా నా మీద ప్రభుత్వహస్తం పడవచ్చును. అందుకు నేను సిద్ధంగానే ఉంటిని. ఎందువల్లనో వన్నెవరూ అరెస్టుచేయడానికి రాలేదు. ఆ తరువాత రేడియోవారు కోరగా ఇరవై సూత్రాల మీద పాటరాశాను. (ఏదైనా రేడియోనాటిక గానీ, ప్రసంగంగానీ-వారిచ్చే విషయం మీదనే-రాసినట్లు.) అయితే 20 సూత్రాలను సరిగ్గా అమలుచేస్తే దళిత జాతులకు ప్రయోజనకరమని అప్పుడూ నమ్మేను. ఇప్పుడూ నమ్ముతున్నాను. అంతేకాని-విజయవాడలో నామీద పుకార్లు లేవదీసినట్లు-నేను ఏ పోలీసు అధికారికీ లిఖితపూర్వకంగా, ఎమర్జెన్సీని సమర్థిస్తానని రాసి ఇవ్వలేదు. (ఇచ్చి ఉంటే, అది ఇవాళ కాకుంటే రేపయినా బయటపడుతుంది కదా!)

ఇకపోతే, కీర్తిదాహం, అవకాశవాదం, ఆత్మవంచన అంటూ మీరేవేవో రాశారు. అవి మీ అభిప్రాయాలు. నిడివిమీద వాటిని మీ అంతట మీరే మార్చుకోగలరనడం కన్న ఇక్కడ మరేమీ రాయను. పద్మవిభూషణ్ కంటె ప్రజాకవి అనిపించుకోవడమే నాకత్యంత గర్వకారణం. మీకూ నాకూ కూడా ప్రజలే తీర్పరులు. వారితీర్పును నేనెప్పుడూ శిరసావహిస్తాను. మీవరకు మీరెలాగ నిరపరాధులనుకుంటున్నారో నామట్టుకు నేనూ అలాగే నిర్దోషిననుకుంటున్నాను. ఎవరు ఎన్ని అనుకున్నా మనందరిలోనూ విరసం పట్ల అభిమానం మాత్రం ఎన్నటికీ ఇంకిపోదని నొక్కి వక్కాణిస్తూ ఇప్పటి మట్టుకు ఇంతటితో విరమిస్తున్నాను.

ఇట్లు,
అరుణారుణాభివందనలతో, మీ శ్రీ.శ్రీ.
మద్రాసు, 10-7-77

*ప్రజాతంత్ర 24–7–1977*

## మూడు

**జాబు:జవాబు.**

కావలి మంచి విరసం ఆక్టింగ్ జెనరల్ సెక్రటరీ రమణారెడ్డిగారు ఇలా రాశారు.

శ్రీ శ్రీ గారూ,

కార్యవర్గ సమావేశానికి అవశ్యం వస్తున్నానని, తీరా సమయానికి రాలేదు. వచ్చిఉంటే,ఈ ఉత్తరంతో పనిబడేదికాదు. కార్యవర్గం ఆదేశాన్ని అనుసరించి, మీకిది రాస్తున్నాను.

ఎమర్జెన్సీ అమలు జరిగిన 19 లేక 20 మాసాల కాలంలో, విరసం అధ్యక్షులనే విషయాన్ని మరిచి, మీరు చేసిన పనులు గాని, రాసిన రాతలుగాని, మాకు నచ్చలేదు. ప్రైవేటు ఉత్తరాల ద్వారా ఎప్పటికప్పుడు మాలో కొందరం మీకు మా ఆలోచనా సరళిని సూచిస్తూనే వచ్చాం. కాని మీరు "స్వతంత్రం"గానే, అంటే, బాధ్యతారహితంగా, వ్యవహరించారు. దేశ

రాజకీయ పరిణామాల గురించి మౌనమైనాసరే అవలంబించమని హితవు చెప్పాం గాని, మీరు మీ భద్రతనే చూసుకున్నట్టుగా మీ *acts of commission and omission* నిరూపించాయి. వీటన్నిటి మూలంగా, మీరు అధ్యక్షులైన విరసానికి అప్రతిష్ట చేకూర్చడమటుంచి, నలభై ఏళ్ళ క్రితం 1933-34లో మీరే స్థాపించి, మధ్య మధ్య శాఖా చంక్రమణాలను తప్పిస్తే అనన్యంగా అద్భుతంగా నిర్వహించిన విప్లవ సాహిత్య సంప్రదాయానికి స్వయంగా న్యూనత కలిగించుతున్నారు. జీవిత చరమదశలో ఆత్మవినాశనానికే ఉద్యుక్తులయ్యారు. ప్రస్తుతం ఇంకా సాగుతూనే ఉన్న విప్లవోద్యమానికి సరేసరి. మీరు అధ్యక్షులుగా ఉంటూన్న పౌరహక్కుల సంఘానికి కూడా మీరు అపచారం చేశారు. మీ మాటలనే వాడవలసి వస్తే, మీరింత స్వచర్మ పరీవృతులనే విషయం వైయక్తికంగా ఒకరిద్దరికి వెనకటి నుంచీ తెలిసే ఉన్నా, ఇప్పుడు విశాల ప్రజానీకానికి కూడా తెలిసే విధంగా మీరు చాలా వెలితిగా ప్రవర్తించారు.

క్రితంలో అకాడెమీ లవార్డువంటి ధనార్జనకు సంబంధించిన విషయాల్లోనే గాక, సంస్థ విధానాలకు సంబంధించిన విషయాల్లో కూడా, మీ పెద్దరికాన్ని మన్నిస్తూ మేము ఎంతో సర్దుకుపోతూ వచ్చామని, మహా అయితే మందలింపుతో సరిపెట్టుకున్నామని మీకు తెలుసు. అయితే, ఈ 20 లేక 21 మాసాల కాలంలో, మీరు చేసిన పనులు, మా సహనాన్నీ, మీ పట్ల మాకు గల గౌరవభావాన్నీ విషమ పరీక్షకు నిలిపి చివరికి ఈ ఆరోపణ పత్రాన్ని రాసేలా మమ్మల్ని నెడుతున్నాయి. ఇందుకు బాధ్యత మీదేగాని మాది ఏమాత్రమూ కాదు.

''జగద్గురు'' శంకరాచార్యులూ, శ్రీమతి ఇందిరాగాంధీ మద్రాసుకు వచ్చిన సందర్భంగా మీరు రాసిన ఒక వ్యాసంలో, శంకరాచార్యులను నిందించడం మీ నాస్తికవాదానికి అనుగుణంగానే ఉందనుకున్నా, ఇందిరాగాంధీని ప్రశంసించడంలోనూ, కేంద్ర ప్రభుత్వ అక్రమ జోక్యం మూలంగా అధికారం నుంచి పడిపోయిన తర్వాతనే, కరుణానిధి మంత్రివర్గం ''అవినీతి''ని విమర్శించడంలోనూ, మీరు చూపిన అవగాహన, పిరికితనం స్వక్షేమచింత ఫలితం మాత్రమే. ఈ విషయమై నేనొక ప్రైవేటు ఉత్తరంలో మీకు రాశానుకూడా. విరసం సభ్యులు 35 మంది దాకా ఏ మీసా చట్టం మూలాన తమ స్వేచ్ఛను పోగొట్టుకోవలసి వచ్చిందో, ఆ విషయాన్ని అప్పుడూ మరెప్పుడూ మీరు ప్రస్తావించకపోవడం, విరసం అధ్యక్షస్థానానికి మీకు గల యోగ్యతాయోగ్యతలలో రెండవదాన్ని నిరూపిస్తుంది. పౌరహక్కుల విషయం గురించి మీకు చీమ కుట్టినట్టయినా లేకపోవడం, ఆ సంఘాధ్యక్ష పదవికి కూడా మీకుగల యోగ్యతాయోగ్యతలలో రెండవదాన్నే నిరూపిస్తూంది. ఇది లజ్జాకరమని చెప్పక తప్పదు.

విరసం కార్యవర్గ సభ్యుడైన శ్రీ చలసాని ప్రసాద్‌కు మీరు రాసిన ఒక కార్డులో, ఎమర్జన్సీ రోజుల్లో స్వైరవిహారం చేసిన దుష్టపరిపాలన గురించి మీ మాటలు ''ఇండియాలో ఇవాళ *fascism* లేదు. *There is a certain dictatorship, Yes.*

*But that is a left dictatorship''* అనేవి, వ్యక్తి నిరంకుశత్వం వేసుకున్న వామపక్ష నియంతృత్వం ముసుగును కూడా చూడలేని మీ అపరిణత రాజకీయావగాహనకు మాత్రమే సాక్ష్యం కాదు. అంతవరకే అయితే, క్షంతవ్యమే. దుష్ట పరిపాలనను సమర్థించడంలో మీ లౌక్య ప్రజ్ఞ కూడా ఇమిడివుంది. ఇది ద్రోహంకంటే హీన మైన పని.

ఒకవైపు భూమయ్య - కిష్టాగౌడ్ల ఉరితీత గురించి మంచి గేయం రాస్తూనే, సవ్యసాచిలా సవ్యంగానూ అపసవ్యంగా కూడాను, మీరు వెనకటి కేంద్రప్రభుత్వ విధానాలు ''సోషలిస్టు'' విధానాలంటూ ఒక సినిమా సభలో ప్రసంగించగలిగారు. సోషలిజమంటే మీకు అర్థమే కాలేదని మేమెలా అనగలం? ఇందిరాగాంధీ విధానాలు ''పాప్యులిస్టు'' విధానాలే తప్ప సోషలిస్టు విధానాలు కావని, బూర్జువా వర్గంలోని ఒక పక్షం, జనానీకంలో సోషలిజం గురించి ఉన్న ఆశలను భ్రమలుగా పెంచి స్వప్రయోజనం కోసమే వాడుకుంటూ రావడమనేది, ఇందిరాగాంధీ కన్నతండ్రి హయామునుంచీ జరుగుతూనే ఉందని తెలుసుకోజాలనంత అర్భకులా మీరు? ఇందిరాగాంధీ విధానాలే ''సోషలిస్టు'' విధానాలయే పక్షంలో, విప్లవోద్యమం మరి దేనికోసం సాగుతూన్నట్టు? భూమయ్య - కిష్టాగౌడ్‌లు ఎందుకు ఉరికంబమెక్కవలసి వచ్చినట్టు? రామచంద్రయ్య, రామనర్సయ్యలు మొదలు మహాదేవన్, జంపాల ప్రసాద్, జనార్దన్‌ల వరకు దాదాపు 75 మంది ప్రజావీరులు ఈ ఎమర్జన్సీ కాలంలోనే చిత్రవధలకు ఎందుకోసం గురైనట్టు?

వేలాదిగా నక్సలైట్లు ఎందుకోసం ఏళ్ళతరబడి జైళ్ళ పాలైనట్టు? పోనీ, మీ సంస్థ సభ్యులు 53 మంది ఎందుకోసం స్వేచ్ఛను కోల్పోయినట్టు? ఈ విషయాల గురించి శ్రీ మధుసూదనరావు చాలా ఓపికగా ఒక ప్రైవేటు ఉత్తరంలో మీకు రాయడం జరిగింది. అయినా, నాస్తిక వాదానికీ భౌతిక వాదానికీ మధ్య అభేదాన్ని చూపినట్టుగానే మీరు, బూర్జువా పాప్యులిస్టు విధానాలకూ సోషలిస్టు విధానాలకూ మధ్య అభేదం చూడగలిగారు. ఇది భ్రమవల్లనో ప్రమాదంవల్లనో జరిగింది కాదు. బూర్జువా జాతీయవాద ప్రభావం నుంచి ఎన్నడూ మీరు పూర్తిగా బయటపడలేదని మీ రచనలే దాఖలా చూపుతున్నాయనే సంగతి అనేకులకు తెలియదు. పెటీబూర్జువా అరాజకవాదం, ఊగిసలాట, మీ ఆత్మనే అంటివేసిందన్న సత్యం కూడా లోకానికి పూర్తిగా తెలియదు. విప్లవ సాహిత్యోద్యమానికి మహోధ్వజసన్నిభంగా నిలిచిన మీ సాహిత్య వ్యక్తిత్వం మీ అల్ప వ్యక్తిత్వంలో గల లోపాలను కమ్మివేసింది కాబట్టే, ఇంతవరకు కూడా ప్రజలు మీరు ఏ అకార్యకరణకు పూనుకున్నా క్షమిస్తూ వచ్చారు. అది ప్రజల గొప్పదనమే గాని మీదికాదు. మరి, పచ్చి దుష్పరిపాలనను కూడా, మీరు పబ్లిగ్గానే ఒకటికి పదిమార్లు సమర్థించబూనుకున్నప్పుడు కూడా, ప్రజలు పట్టీపట్టనట్లు ఊరుకుంటారని మేమనుకోవడం లేదు. మీ గురించి ప్రజలకు విడమర్చి చెప్పడం మా బాధ్యత అవుతూంది.

ఏ వ్యక్తినైతే గాడిదతో ఉపమిస్తూ ఒక గేయంలో మీరు ఖండించడం జరిగిందో, ఆ వ్యక్తి అత్యయిక పరిస్థితి వీలుగా ముఖ్యమంత్రి హోదాలో చేయించిన అత్యాచారాలను, హత్యాకృత్యాలనూ గమనించనట్టుగా, ''నిష్కపటి'' అని మీరు ప్రశంసించడం కూడా మీ ప్రాప్త కాలజ్ఞతకు, వేరేమాటల్లో చెప్పవలసి వస్తే, అవకాశవాదానికి నిదర్శనం.

20-అంశాల కార్యక్రమం ఏ మౌలిక సమస్యకూ పరిష్కారం చూపలేదు సరికదా, లోక వంచనా శిల్పంలో ఆరితేరిన ఇందిరాగాంధీ ప్రభుత్వం దళిత, దమిత వర్గాల సముద్ధరణ పేరిట వారిని ఎల్లకాలం వశవర్తులను చేసుకునేందుకు, బూర్జువా రాజ్యాధికార రథానికి చక్రరక్షకులనుగా చేసుకునేందుకు వేసిన విప్లవ వ్యతిరేక పథకం. కాగా, ముష్టి పాతిక రూపాయల కోసమేగాక, ముఖ్యంగా మీ భద్రతకోసమే, ఆ కార్యక్రమాన్ని ప్రశంసిస్తూ ఆలిండియా రేడియోకి గేయం రాసి పంపారు. ప్రభుత్వానికీ దాని సాహిత్య దేవిడీకీ కింకరులైన దాశరథిలాంటి కవులకూ, విరసం అధ్యక్షులుగా ధిక్కార శంఖమూది ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో ప్రతికూల ప్రదర్శనకు నాయకత్వం వహించిన మీకూ మధ్య ఏ అంతరం లేకుండా చేసుకున్నారు. లేక, ఆ సందర్భంలో మీకు ప్రాప్తించిన అర్ధచంద్ర ప్రయోగమూ, ఒకే ఒక్కనాటి రిమాండూ తమ రుచిని చూపి, మళ్ళీ తామంటేనే మీకు భయం గొలిపాయా?

ఇక, శ్రీమతి ముప్పాళ్ళ రంగనాయకమ్మ గారితో మీరు పత్రికల్లో సాగించిన వాగ్యుద్ధంలో, పరమ నీచమైన స్థాయికి పతనమై *below the belt* దెబ్బలు తీసేందుకు మీరు సిద్ధమయ్యారు. హేతువాదానికీ భౌతికవాదానికీ అంకితమైన రచనలు చేస్తూ మూఢాచారాల్నీ, అంధవిశ్వాసాల్నీ దెబ్బతీస్తూన్న ఒక వ్యక్తిని గౌరవించడం గాక, ఆ వ్యక్తివాదాలను ఎదిరించే సత్తాలేక, ఘోరమైన వ్యంగ్యానికి దిగి ఎదుర్కొన్నారంటే, అది వ్యక్తిగతంగా మీకూ, సంస్థాపరంగా విరసానికీ తీరని అవమానమే అయింది. ఈ విషయం గురించి ''ప్రజాతంత్ర'' పత్రికలోనే నేను మీకు జవాబివ్వడం కూడా జరిగింది.

అనేక పర్యాయాలు నేను, వరవరరావు, మధుసూదనరావు, చలసాని ప్రసాద్ మీకు ప్రైవేట్ ఉత్తరాలు ఎన్నిరాసీ నిరుపయోగమైపోయింది. సంస్థ సభ్యుల అతీ గతీ మీకు పట్టలేదు. పోనీ, పౌరహక్కుల స్థితీ గతీ పట్టిందా అంటే, అదీలేదు. గుండె గాయం మీద గుప్పెడు కారం చల్లినట్టుగా భూభూ అనే పెద్దమనిషితో కలిసి మీరు ఇందిరాగాంధీకి హితవు చెప్పబూనారు. అక్కడికి తానేదో అమాయకురాలైనట్టూ, చుట్టూమూగినవారు మాత్రమే దుష్టమంత్రులైనట్టూ, వారిని వైదొలగించుకుంటే ఆవిడ బాగుపడి తానే దేశం, దేశమే తానుగా, తన భవిష్యత్తే దేశభవిష్యత్తుగా - బారువాకో, బ్లిట్జ్ కరంజియాకో తగిన పద్ధతిలో మీరు బహిరంగ లేఖ రాశారు. ఇదంతా వ్యంగ్యంగా రాసిందని ఇప్పుడనవచ్చు. నాలుక ఎలా తిరగమంటే అలా తిరిగే మనిషి తన మాటలు తానే తినివెయ్యగలదు కూడా. వెనకటికి మీరే 20 అంశాల ప్రణాళికను, ''ఇందిరాంబాళ్ అవర్గళ్''ను, ''వామపక్ష నియంతృత్వాన్ని''

పొగిడారు. అందుకు తగ్గట్టుగానే ఉన్న బహిరంగ లేఖలో దిక్కుమాలిన వ్యంగ్యమేదో నిక్షిప్తమై ఉన్నదని నేడు అంటున్నారంటే, మీరు ఏమైనా అనగల సమర్థులే.

చలసాని ప్రసాద్‌కు మీరు రాసిన 11-5-76నాటి ఉత్తరంలో విరసం గురించి ప్రస్తావిస్తూ, *But active politics are not our concern. On this basis we have to reorganise* విరసం. *Just when RWA was going to attain outstanding stature, we bungled. We have to make a fresh start* అన్నారు. అంటే అర్థం? రాజకీయాలలో మన సంస్థకు నేరుగా సంబంధం లేదనడం సరేమోగాని, రాజకీయాలను వదిలించుకుని కొత్త ప్రాతిపదికపై సంస్థను పునర్నిర్మించుకోవాలనడం సరైనదేనా? అప్పుడు విరసం మూలధాతువైన విప్లవ నిబద్ధత తుడిచి పెట్టుకుపోదా? *Active politics* లో ఎన్నడూ విరసం పాల్గోలేదు. అట్లని, వాటిపట్ల *concern* చూపకనూ పోలేదు. ఇదే ఈ సంస్థ విశిష్టత. రాజకీయం ప్రజాజీవితంలో ముఖ్యమైన అంతర్భాగం కాబట్టి రచయితల సామాజిక చైతన్యానికి అది దీప్తి. అయినా విరసం రాజకీయాసక్తి ప్రజారాజకీయాలపట్లే. నిజానికి, అధికారవర్గం *active politics* పట్ల ఎక్కువ *concern* చూపిందీ, చివరికి ఎన్నికల్లో పోటీ చేసేందుకు కూడా పూనుకుందీ మీరే. ఇప్పుడేమో మాకు ధర్మపన్నాలు చెబుతున్నారు. *active politics* లోపాల్గొని విరసం *bungle* అయింది ఎన్నడూ లేదు. ఇది అభూత కల్పనేగాక, నిరాధారమైన ఆరోపణ కూడా.

పై వాటన్నిటి అంతరార్థం ఒక్కటే. విరసం ఒకతోవ, మీరొక తోవ అయ్యారు. నిజానికి, దేశప్రజల తోవనుంచి, పోరాట పంథానుంచి, దుష్టాధికార ధిక్కార సంప్రదాయం నుంచి, మీ *better side* నుంచే, మీ అంతట మీరే తప్పుకున్నారు. సంస్థలో ప్రజాస్వామిక నిర్మాణ పద్ధతులు అమలు జరగాలి కాబట్టి, క్రమశిక్షణ విషయంలో సామాన్య సభ్యుడైనా అధ్యక్ష మహాశయుడైనా సమానులే కాబట్టి, ఇంత విపులంగా ఓపికతో నిగ్రహంతో కూడా మీకు ఈ ఉత్తరం రాస్తున్నాను.

1977 జూన్ 11,12 తేదీలలో విజయవాడలో జరగనున్న విరసం సర్వసభ్య సమావేశం ముందు, మీదను పేర్కొన్న అంశాలకు సంజాయిషీ చెప్పుకోవలసిందని మిమ్మల్ని కోరవలసిందిగా కార్యవర్గం నన్ను ఆదేశించింది. ఆ పైన మీ ఇష్టం.

-కె.వి. రమణారెడ్డి

దీనికి ఒక చిన్న కార్డుమీద వెంటనే జవాబు రాసి పంపించాను. రోగి కోరిందీ వైద్యుడిచ్చిందీ ఒకటే మందనీ. నేను విజయవాడ సభలకు వచ్చి నా సంజాయిషీతో బాటు విరసం అధ్యక్షపదవికి రాజీనామా ఇవ్వబోతున్నాననీ రాశాను. మీరంతా ఎమర్జన్సీ కాలంలో

చిన్న చిన్న జైళ్ళలో ఉంటే నేనో పెద్ద జైల్లో ఉన్నాననీ, ఇప్పటికీ అలాగే ఫీలవుతున్నాననీ రాశాను.

అదో చిన్న జవాబు మాత్రమే. ఇప్పుడింకా విపులంగా రాయదలచుకున్నాను.

*ప్రజాతంత్ర 31–7–1977*

## నాలుగు

ఒక విధంగా దీన్ని ఇద్దరు రమణారెడ్డిగార్లకూ ఉమ్మడి జవాబుగా పరిగణించవచ్చును. వారిలో ఒకరు డాక్టరు, ఇంకొకరు అధ్యాపకుడు. డాక్టరుగారిప్పుడు విరసంలో లేరు. కేవీ గారిప్పుడు విరసం కార్యదర్శి, ఇద్దరూ నా మీద తీవ్రమైన నేరాలు ఆరోపించారు. వీరి ఉత్తరాలను మాత్రమే చదివినవారికి నేనొక సాహిత్య సంస్థకు మాత్రమే కాదు, మొత్తం సాహిత్యానికే ద్రోహం చేసినవాణ్ణిగా కనబడతాను. కనబడతానే గాని, కాను.

ఔను. నేను విరసం తనపై తాను విధించుకున్న ఎన్నో నియమాలను ధిక్కరించాను. అన్నిటిలోకీ ముఖ్యమైనది, మొదట ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్నీ, పిదప ప్రత్యేకాంధ్ర రాష్ట్ర ఉద్యమాన్నీ బలపరచకపోవడం. ఇది ఎంతదాక వెళ్ళిందంటే అధ్యక్షతకు నేను రాజీనామా ఇచ్చేదాకా! ఇప్పుడొక్కసారి వెనుక తిరిగిచూస్తే ఈ చీలిక ఉద్యమాల నిజస్వరూపం గుడ్డివాళ్ళకు కూడా స్పష్టంగా కనబడుతుంది.

విరసం గృహచ్ఛిద్రాలను వీధిని పెట్టే ఉద్దేశం నాకులేదు. మనలో మనం కొట్లాడు కుంటూ ఉంటే వెలుపల నిలుచుండి వేడుక చూసేవాళ్ళే అనేకులుంటారు. వాళ్ళకి ఆ వినోదం దక్కనివ్వడం నా అభిమతం కాదు. విరసం మూలసూత్రాలకు నేనెప్పుడూ విభిన్నంగా పోలేదని మాత్రమే నొక్కి చెబుతున్నాను. మనం ఎప్పుడూ ఏ రాజకీయ పార్టీకీ చెందినవాళ్ళం కాకపోయినా తొలినుంచీ నక్సలైట్ ఉద్యమాన్ని సమర్థిస్తూ వచ్చాము. ఇక ముందు కూడా సమర్థిస్తాము. అందులో ఎలాంటి సందేహానికీ ఆస్కారంలేదు. నిజం చెప్పాలంటే విరసం ఆవిర్భావానికి ఏకైక చోదకశక్తి నక్సలైట్ ఉద్యమమే.

ఎమర్జన్సీ కాలంలో స్వచర్మ సంరక్షణార్థం నేనెన్నెన్నో కానిపనులు చేశానన్న ఆరోపణకు సర్వసభ్య సమావేశంలో నేనిచ్చిన సంజాయిషీ ఒక్కటే జవాబు. దాన్ని ఆ సమావేశం ఆమోదించింది. అందుకే ఇప్పటికీ నేను విరసంలో ఒక సామాన్య సభ్యుడుగానైనా ఉంటున్నందుకు గర్విస్తున్నాను.

ప్రపంచ తెలుగు మహాసభలను బహిష్కరించడానికి నేను సుముఖుణ్ణి కాను. అయితే, మెజారిటీ అభిప్రాయాన్ని శిరసావహించి, నా వ్యక్తిగత ఇష్టానిష్టాలను వెనక్కి నెట్టివేశాను. మీకు జ్ఞాపకం ఉండే ఉంటుంది. విరసం తరపున ఒక ప్రతినిధి వర్గానికి (సంఖ్య ఎంతయినా సరే) ప్రభుత్వం నుంచి ఆహ్వానం వస్తే మనం పాల్గొనడం మంచిదని నేను కార్యవర్గసభలో వాదించాను. అలా ఒక తీర్మానం చేస్తే బాగుంటుందని కూడా అన్నాను. కాని కార్యవర్గం

బహిష్కరణకే నిశ్చయించింది. ఆ నిర్ణయానికి నేను కట్టుబడి కారాగృహవాసం (36 గంటలే కావచ్చుగాక) చేశాను. జైలంటే అప్పుడులేని భయం ఎమర్జన్సీ కాలంలో నన్ను పట్టి పీడించిందనుకోవడం మీ పొరపాటు. ఏలాగయినా జైలుశిక్ష-కాదు జైలు నివాసం తప్పించుకోవడానికే ఎన్నో అకార్యకరణాలు చేశానని మీరు ఆరోపిస్తున్నారు. ఎందువల్ల ఆంధ్రప్రభుత్వం లేదా కేంద్రప్రభుత్వం నన్ను అరెస్టు చెయ్యలేదో ఇప్పటికీ నాకు తెలియదు. వెంగళరావు గారిని (వేరే సందర్భంలో) నిష్కాపట్యం అనడంవల్లా, ఇందిరాగాంధీ 20 సూత్రాలమీద పాటరాయడం వల్లా నాకు ప్రభుత్వ నిర్బంధం తప్పిందని మీరెలా అనుకోగలిగారండీ? లేక నేను లోపాయికారీగా ఎవరికైనా క్షమాపణలు చెప్పుకున్నానని ఇప్పటికీ మీరు నమ్ముతున్నారా? ఎందుకు నేనెవరినైనా క్షమించండని కోరాలి, ఏ తప్పూ నేను చెయ్యలేదని దృఢంగా విశ్వసిస్తున్నప్పుడు?

ఒకటి మాత్రం నేను నిష్కర్షగా చెప్పగలను, సాహిత్యరంగంలో సముజ్జ్వలంగా ప్రకాశించగలిగిన విరసం క్షుద్రరాజకీయాల జోలికిపోతూ తన చారిత్రక కర్తవ్యాన్నే విస్మరించిందని; 1970లో విరసం ప్రాదుర్భవించిందిలగాయతు నేటి దాకా మనం చెయ్యగలిగీ చెయ్యడం మానిన పనులెన్నో ఉన్నాయి. ఒక చిన్న ఉదాహరణ. అలనాడు అభ్యుదయ రచయితల సంఘం ప్రజానాట్యమండలితో కలిసి సాధించినదానిలో శతాంశమైనా, విప్లవ రచయితల సంఘం జననాట్య మండలితో కలిసి సాధించలేకపోయింది. ఇదేంతో చిన్న పొరపాటని కొట్టిపారెయ్యగలమా? తిరుగులేని వాస్తవం ఏమిటంటే, విరసం రాజకీయాలకు ఇవ్వకూడనంత ప్రాముఖ్యం ఇచ్చి తాను మాత్రమే నిర్వహించగలిగిన విప్లవ సాహిత్య కర్తవ్యాలను విస్మరించింది. లేకుంటే ఈ పాటికి అఖిలభారత విప్లవ రచయితల సంఘం ఆవిర్భూతమై ఉండేదేమో! ఇప్పుడేమయింది? ఒక్క తెలుగునాటి విప్లవ రచయితలే చీలికలుగా విడివడి చెల్లాచెదరైపోయారు.

మనం జీవిస్తున్న పెట్టుబడిదారీ విధానంలో ఒక క్రమబద్ధమైన మనుగడ సాగించడం ఎవరికయినా సాధ్యమా? అయినా, నాకు జ్ఞానం వచ్చిననాటి నుండీ నేను నమ్ముకున్న ఆశయాలను ముష్టి పాతిక రూపాయలకోసం అమ్ముకున్నట్టు మీరు ఆరోపిస్తున్నారు. జైలు నిర్బంధంలో ఉన్న డాక్టరు రమణారెడ్డిగారికి నేను సినిమా జీవితపు భోగభాగ్యాలలో తులతూగుతూ విరసాన్ని వెన్నుపోటు పొడిచాననిపించింది. ఇవాళ ఈ మద్రాసులో నేనెంత సుఖపడిపోతున్నానో నాకు తెలుసు, నాకు దగ్గరలో ఉన్నవారికి తెలుసు.

నా జీవితంలో ఎప్పుడయినా వరుసగా 21 రోజులు నేను సుఖంగా బతికానంటే, అది కిందటి డిసెంబరులో చైనాలో ఉన్నప్పుడు మాత్రమే. ఒక క్రమబద్ధమయిన జీవితం అది: అటువంటి జీవితాన్ని మన దౌర్భాగ్యపు దేశంలో ఆశించడానికి ఇంకా ఎన్నో మజిలీలు గడవాలి.

*ప్రజాతంత్ర 7–8–1977*

# విరసంలో వీరశైవులు

ఒకటి

విరసంలో మొట్టమొదటి వీరశైవుణ్ణి నేనే.

"అరె ఝూ ఝూ ఝుటక్ ఫటక్.
హింసనచణ
ధ్వంసరచన"

అంటూ 'జగన్నాథుని రథచక్రా'ల్లోనూ

(మహాప్రస్థానం)

"ఆశయాలు సంఘర్షించేటప్పుడు"
ఆయుధం అలీనం కాదు" అని

(ఖడ్గ సృష్టిలోనూ)

"...అలాంటోణ్ణి
గొడ్డళ్లతో తరగాలిరా
కొడవళ్ళతో నరకాలిరా!" అని

(మరోప్రస్థానంలోనూ)

రాసిన వాణ్ని నేను.

ఇవన్నీ, మార్జాల గర్జనలుగా ఒక రచయితకు తోచాయి. బహుశా అతనికి భావకవిత్వం అంటే ఇష్టమనుకుంటాను.

నేను "హింసకోసమే హింస"ను ప్రతిపాదించేవాణ్ణికాను. పాలకవర్గం మితిమీరిన హింసాత్మక చర్యలకు పాల్పడ్డప్పుడు, ప్రజలు ప్రతిహింసను ఆయుధంగా ధరిస్తారు. ఈ ఆయుధాన్నే నేనెప్పుడు సమర్థిస్తూ ఉంటాను. నిజానికి తమ్ము పీడించే ప్రభుత్వంమీద తిరుగుబాటు చేసే హక్కు ప్రజలకుంది. విపరీతమైన బలప్రయోగంతో ఈ తిరుగుబాట్లను ప్రభుత్వాలు తాత్కాలికంగా అణచివెయ్యవచ్చును. కాని అంతిమ విజయం మాత్రం ప్రజలదే. 1905 లో విఫలమైన రష్యన్ విప్లవం 1917లో విజయవంతం కావడం చరిత్ర ప్రసిద్ధమే! నిన్న గాక మొన్న వియత్నాం ప్రజలు సాధించిన విజయం నేను చెబుతున్నదాన్ని నిదర్శించే ఒక సరికొత్త ఉదాహరణ.

విప్లవం అన్నప్పుడల్లా వచ్చేదికాదు. విప్లవాన్ని ఏ ఒక్క వ్యక్తిగాని, కొందరు వ్యక్తులు గాని

సృష్టించలేరు. లెనిన్ వంటి, మావోలాంటి మహానాయకులు విప్లవాన్ని నడిపిస్తారు, కాని దాన్ని సృష్టించేది మాత్రం ప్రజలే!

1970 నా షష్టిపూర్తి సంవత్సరం. ఆ యేడు ఫిబ్రవరి నెలలో మొదటిసారిగా వరవరరావునూ, దిగంబర కవులనూ కలుసుకున్నాను. షష్టిపూర్తి సభకు వీరు రావడం నాకెంతో ఆనందం కలిగించింది. కుటుంబరావును, రా.వి.శాస్త్రిని అంతకుముందే ఎరుగుదును. కాశీపట్నం రామారావు మాష్టారు (*Master*)గారిని కలుసుకోవడం 1970 ఫిబ్రవరిలోనే.

ఆ తర్వాత అదే సంవత్సరం జూలై నెల 4వ తేది అర్ధరాత్రి హైదరాబాదులోని ఒక చిన్న హోటేల్‌లో విరసం అవిర్భవించింది. జూలై నాలుగవ తేదీ అమెరికా స్వాతంత్ర్యదినం కావడం, అదే రోజున విరసం కూడా జన్మించడం చెదురుమదురుగా జరిగిన యాదృచ్ఛిక సంఘటనలని నేను భావించడం లేదు.

విరసంలో వీరశైవులు కానివారెవరైనా ఉన్నారా అనేదే అనుమానం. కొంతమంది దృష్టిలో కొడవటిగంటి కుటుంబరావు చాలా సాత్వికుడుగా కనబడవచ్చును. కాని అది పై చూపులకు మాత్రమే. కుటుంబరావులోని విప్లవాగ్ని నివురుకప్పని నిప్పు. అతణ్ణి తెలుగువారి మాగ్జింగోర్కీగా ఎప్పుడో నేను గుర్తించాను.

వరవరరావు పేరు జ్వాలాముఖి కాదు గాని, అతనెల్లప్పుడు మండిపడుతుండే అగ్నిపర్వతం. అందుకే వెంగళరావుగారి విండిక్టివ్ దమనహస్తం వరవరరావుమీద పడిందంటే ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు. 1975లో వరవరరావునూ, మరికొందరు నిర్బంధితులనూ సికింద్రాబాద్ జైలులో చూశాను. అందరిలోనూ వరవరరావు చేతులకు బేడీలుండడం నేను ప్రత్యేకంగా గుర్తించాను.

వరవరరావు పేరు తలచుకొన్నప్పుడల్లా నాకు కొంపెల్ల జనార్ధనరావు జ్ఞాపకం వస్తూంటాడు. ఒక విధంగా జనార్ధనరావు లేని లోటును తీరుస్తున్నది పెండ్యాల వరవరరావే. ఇంకో గొప్ప విశేషమేమిటంటే జనార్ధనరావు కవిత్వంలో ఉన్న అన్వయ కాఠిన్యం వరవరరావు కవిత్వంలో లేకపోవడం ఇద్దరూ సుశిక్షితులూ, సునిష్ణాతులూ అయిన సాహిత్య విమర్శకులు. ఇక్కడ కూడా వరవరరావుదే పైచేయిగా నాకు గోచరిస్తుంది. ఎందువల్లనంటే అతని వాఙ్మయ పరిశీలనలు మార్క్సిజం వెలుగుతో ప్రదీపితమైనవి.

కవిత్వం ఎలా ఉంటే బాగుంటుందని నేననుకుంటున్నానో అలా వుంటుంది వరవరరావు కవిత్వం.

ఒక క్రమంలో రాస్తున్నాను కాబట్టి విరసంఘీయుల్లో తరతమ భేదాలు పాటిస్తున్నానని ఎవరూ అనుకోనక్కరలేదు. విరసం సభ్యులందరూ అగ్రశ్రేణి రచయితలే! ఒకప్పుడు సాహితీ సమితికి తెలుగు సాహిత్యంలో ఆ ప్రత్యేకత ఉండింది. అభ్యుదయ రచయితల సంఘంలో అ మాంబాపతు వారెందరో ఉన్నారు. ఉత్సాహవంతులైన యువరచయితలకు అరసం తలుపులు

తెరవడం గర్హించదగ్గ విషయం కాదుగాని ఉన్నత ప్రమాణాలనే సంఘ సభ్యత్వానికి అర్హతలుగా భావించే విరసం అభినందనీయమని చెప్పకతప్పదు. నిబద్ధత పేరుతో కొందరు అర్హులైనవారికి సభ్యత్వం నిరాకరించడం జరిగింది. అందుకే ఇప్పుడు విరసంలో ఉన్నవాళ్ళంతా వీరశైవులే అని ఎవరయినా అంగీకరిస్తారనుకుంటాను.

కే.వి.రమణారెడ్డి సాహిత్య జీవితం కవిత్వంతో ప్రారంభమయింది. అభ్యుదయ రచయితల సంఘంలో ఉన్న రోజుల్లోనే అతడు తన కవితా పాటవాన్ని నిరూపించుకున్నాడు. 'అడవి' ''అంగారావల్లరి'' అని కావ్య సంపుటాలలో ఉల్కాపాతం లాంటి అతని ఉగ్రవాదం సాక్షాత్కరిస్తుంది. అటువంటివ్యక్తికి అరసం చాలా ఇరుకయిపోవడమూ, ఆ కారణంగా అతడు విరసంలో ప్రవేశించడమూ సహజంగానే జరిగిన పరిణామాలు.

గురజాడ జీవిత చరిత్రను ఒక బృహద్గ్రంథంగా రూపొందించి, తన చారిత్రక దృక్పథంతో సాహిత్య విమర్శను జోడించడంలో కృతకృత్యుడైనాడు. *german thoroughness* అంటామే దాన్ని రమణారెడ్డిలోనే చూస్తాము. శ్రీశ్రీ సాహిత్య సంపాదకత్వంలో కూడా ఇదేగుణం ప్రదర్శితమయింది. నా సమస్త సంపుటాలకూ సంపాదకత్వం వహించగల సామర్థ్యం తన కొక్కడికే ఉందని ఆరుద్ర గర్వం. అది గాయపడినందువల్ల నా షష్టి పూర్తి సభలో విశాఖపట్టణంలో ఒక చిన్న టీ కప్పులో తుఫాను లేవదీశాడు ఆరుద్ర. ఎందరెన్ని విధాల కోరినా నా చిత్రపటాన్ని ఆవిష్కరించడానికి నిరాకరించాడు. అప్పటికి ఎనిమిదేళ్ళయినా నిండని నా పుత్రుడూ, అంతకన్నా చిన్నవాడైన దౌహిత్రుడూ కలిసి ఆ చిత్రపటావిష్కరణ జరిపించారు. వాళ్లిద్దరిచేతా అలా జరిపించాలని సూచించింది నేనే.

*ప్రజాతంత్ర 14–8–1977, 21–8–1977*
*(రెండూ కలిపి ఒకటే వేశారు)*

## రెండు

విరసం అంటే దిగంబర కవులే అన్న పొరపాటు అభిప్రాయాన్ని సవరించక తప్పదు. దిగంబర కవులంతా కలిసి, ఆరుగురు. వారిలో 'మహాస్వప్న' విరసం ఆవిర్భావానికి ముందే దిగంబరోద్యమం నుంచి తప్పుకున్నాడు. భైరవయ్య విరసం సభ్యుడో, కాదో ఇప్పటికీ నాకు తెలియదు. అతనో చిరునామా లేని మేఘం. ఎప్పుడో ఎక్కడినుంచో కాస్త కనిపిస్తాడు. జడివాన లాంటి ఒక వచన గీతాన్ని కురిపించి మాయమవుతాడు. హైదరాబాదులో ఒకసారి ఇలాగే జరిగింది. నాకు సరిగా జ్ఞాపకం లేదు గాని భైరవయ్యను కలుసుకోవడం అదే మొదటి పర్యాయమేమో? లేక, అంతకుముందు నాషష్టిపూర్తి సందర్భంలో కలుసుకున్నానేమో? ఒక చిన్న గీతం చదివి పెద్దగా కరతాళధ్వనులు పుట్టించి మళ్ళీ చూసేసరికి మాయమైపోయాడు.

నేను ఇంగ్లీషులోకి తర్జుమా చేసిన దిగంబరుల గీతాలలో భైరవయ్య రచించిన ''చెరచబడ్డ గీతాన్ని'' అనేది ఒకటి. దాని తెలుగుమూలం, నా ఇంగ్లీషు అనువాదం ఇక్కడ ఉదహరిస్తున్నాను.

నేను చెరచబడ్డ గీతాన్ని
నగ్నంగా నడివీధిలో కాటేసిన భూతాన్ని
స్వార్థపు కాంక్రీటు తొడల మధ్య
నలిపివేయబడ్డ రాగాన్ని
కీర్తి రతి తీరని బాబాకారుల
భయంకర
నఖక్షతాలకి దంతక్షతాలకి
పుళ్ళుపడి కుళ్ళిపోయిన వక్షాన్ని
నేను గీతాన్ని
కేరింతలు కొట్టి
పరుల కైత తమదని భరి మ్రోగించి చలామణీ చేయించే
చాపల్యాల చవకబారు కామోద్రేకానికి
చచ్చి పుచ్చిపోయిన పిండాన్ని
ముద్రాక్షతలతో తమ రాక్షసత్వాన్ని
లిఖించుకోవాలని
తాపత్రయపడే తుచ్ఛులు
స్వైర విహారం చేసిన శరీరాన్ని
రసాన్ని వదిలి
రాక్షసత్వాన్ని ప్రతిబింబించిన రూపాన్ని
నేను గీతాన్ని
అసహ్యంగా అసభ్యంగా
బహిరంగంగా బాహాటంగా
సిగ్గులేక - వాకచక్యం లేక - చాతకాక
నీచంగా వంధాలంగా
చెరచబడ్డ గీతాన్ని
చిత్రించబడ్డ భూతాన్ని.

*I AM A RAVISHED POEM*
*I am a ravished Poem*
*I am a nude ghost who rode the mid-road*
*I am the song stifled*

*between the concrete*
*thighs of selfishness*
*I am the breast cancered*
*and lancered*
*by nail cuts and tooth*
*bits terrific of BABAKARS*
*unsatisfied with the sex*
*of fame, I am a Poem*
*Croaking and crowing*
*Trumpeting their plagiarising*
*I am the mis carraige and abortion of*
*libidinous eratomaiacs, Claimers of other*
*people's poetry*
*I am the body*
*Rolled by, Unruled by*
*Sullied and mullified by*
*The scoundrels anxious to prep⁄ rate*
*their rascality*
*In desecrated indecent print*
*I am the form*
*Reflecting the satanity and demoniacidity*
*Deflected and denegarated*
*Useless, Juiceless, Lifeless,*
*I am a poem*
*I am a poem ravished*
*unbearably and improperly*
*publicly, overwhelmingly*
*and oh so very freely*
*ravished unashamed*
*Without technique, without ability*
*Rapscallionly and horrendiferously*
*Ravished Poem*
*Painted ghost*

ఒక్కొక్క దిగంబర కవి గీతాలు కనీసం నాలుగేసి అనువదించి పుస్తక రూపంలో ప్రకటించాలనుకున్నాను.అలాగే కొందరివి ఆంగ్లీకరించాను. జ్వాలాముఖి దాకా వచ్చేసరికి ఏ ఒక్క గీతమూ ఒకే ఊపున అనువదించలేకపోయాను. అందుకు కారణం అవన్నీ సుదీర్ఘమైనవి కావడం. అన్నీ ప్రస్తుతం సగం సగంలో ఆగిపోయాయి. త్వరలోనే పూర్తిచేసి ప్రచురించాలని ఉంది. పత్రికలలో కాదు, గ్రంథరూపంగా.

విరసం సభ్యుడు కాకపోయినా ''మహాస్వప్న''ను నేను వీరశైవుడిగా గుర్తిస్తాను. అతనిలోని అరాజకత్వం నాకు నచ్చింది. అరాజకత్వం అంటే అల్లరిచిల్లరితనం కాదు. గొప్పకవీ, విమర్శకుడూ అయిన హెర్బర్ట్ రీడ్ ప్రవచించిన అనార్కిజం. అరాజకత్వం అంటే ప్రభుత్వం లేకపోవడమన్న మాట. ప్రస్తుతం మట్టుకిది కవులు కలగంటున్న యుటోపియా మాత్రమే.

అయినా - ఈ స్వప్నం నిజమవుతుంది

అందుకే షెల్లీ -

*Poets are the unacknowledged legislators of the world* అన్నాడు. అనార్కిస్టు వ్యవస్థ రూపొందినప్పుడు కవులే *acknowledged legislators* అవుతారు. అప్పుడే టెన్నిసన్ ఆశించిన *Parliament of man*(మానవుని శాసనసభ) ప్రపంచ మహారాజ్యంలో పనిచెయ్యడం ప్రారంభిస్తుంది.

ప్రజాతంత్ర *28–8–1977*

## మూడు

చెరబండరాజు! విరసం వీరశైవుల్లో వీరశైవుడు! కాని అలా కనబడడు. వినబడడు. దిగంబరకవిగా ఉన్నప్పుడు అతనిలోని కవితా హృదయం నన్నాకర్షించింది. అతని ''నన్నెక్కనివ్వండి బోను'' అనే కవితా ఖండిక చదివిన తర్వాత చెరబండరాజు వృత్తిరీత్యా ప్లీడరేమో అనుకున్నాను. ఐక్యరాజ్య సమితిని కూడా ప్రశ్నించగలిగినంత తీవ్రంగా అతని ఆగ్రహం ప్రజ్వరిల్లింది.

తర్వాత తెలిసింది నాకు అతను కూడా ఒక ఉపాధ్యాయుడే అని. సున్నితమైన యువ మనస్సులను విరసం కవులు విరిచేస్తున్నారన్నది, ఓ పెద్ద బూర్జువా ఆరోపణ. సోక్రటీసుకు విషపాత్ర అందించడానికి ముందు ఆనాటి ప్రబుద్ధులు అతని మీద చేసిన ఆరోపణ కూడా సరిగ్గా ఇదే! యువతరాన్ని చెడగొట్టేస్తున్నాడని! విరసంలోని ప్రతి ఒక్క సభ్యుడూ ఈ ఆరోపణను సగర్వంగా స్వీకరిస్తాడనడానికి సందేహం లేదు.

''బోను'' గీతం నేను ఇంగ్లీషులోనికి అనువదించాను. అది సుదీర్ఘమైనది కాబట్టి ఇక్కడ ఉదహరించను. ఘాటయిన చెరబండరాజు ''వందేమాతరం'' గీతాన్నీ, దానికి నా ఆంగ్లాను వాదాన్ని ఇక్కడ ఉటంకిస్తాను.

వందేమాతరం

ఓ నా ప్రియమైన మాతృ దేశమా తల్లివి తండ్రివి దైవానివి నీవేనమ్మా
దుండగులతో పక్కమీద కులుకుతున్న శీలం నీది
అంతర్జాతీయ విపణిలో అంగాంగం తాకట్టు పెట్టిన అందం నీది
సంపన్నుల చేతుల్లో మైమరచి నిద్రిస్తున్న యవ్వనం నీది

ఊసినా దుమ్మెత్తిపోసినా చలనం లేని మైకం నీది
కోత కొచ్చిన చేనులో కలుగులు తవ్వుతున్న
ఎలకల్నీ పందికొక్కుల్నీ భరిస్తూ నిలుచున్న "భారతి"వమ్మా
నోటికందని సస్యశ్యామల సీమవమ్మా  వందేమాతరం వందేమాతరం
ఒంటిమీది గుడ్డల్తో జండాలు కుట్టించి వివస్త్రవై ఊరేగుతున్న ధైర్యం నీది
అప్పతెచ్చి వేసిన మిద్దెల్లో కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్న దీనత్వం నీది
ఎండిన స్తనాలమీదికి ఎగబడ్డ బిడ్డల్ని ఓదార్చలేని శోకం నీది
ఆకలికి ఎండి మాడి ఎరువు సొమ్ములతో  వీధిన బడ్డ సింగారం నీది
అమ్మా భారతీ నీ గమ్యం ఏమిటి తల్లీ వందేమాతరం వందేమాతరం

*Oh My dear Mother*
*You are the mother Father and God*
*Yours is the character that delights in going to bed with bad characters*
*Yours is the Beauty that is pledged*
*limb by limb in the international market*
*Yours is the Youth*
*asleep in the arms of the affluent*
*yours is the intoxication unruffled*
*even when mind is slung*
*Mother You are "Bharat"*
*tolerating all the rats and hand wots*
*that are digging deep holes*
*in our fields ready for harvesting*
*Mother you are the green earth*
*Where produce never reaches*
*the mother of hungry*
*Vande Mataram*
*Salute Oh mother.*
*Yours is the and ability that unables you to go forth naked*
*Converting the stripped clothes in to coloured flags*
*yours is the misery that limps like a cat*
*that has stepped on fire s*
*a home t hat is built on loaned money*
*Yours is the sorrow that cannot console*
*the children who reach up to the dried up breasts*
*Yours is the glory of walking the streets in borrowed feathers purchased and Scorched by hunger*

*Mother Bharathi*
*Where is there your destination Oh, Mother, salute*
*vande Mataram.*

ఇందులో చెరబండరాజుపడుతున్నది బాధా, ప్రదర్శిస్తున్నది ఆగ్రహమా,లేక ఈ రెండూనా. అయితే ఈ రెండు ఉద్రేకాలూ ఏ పాళ్ళలో మేళవింపు పొందాయి? ఈ ఛందస్సులేని గీతాన్ని సభల్లో అతను చదువుతూ ఉంటే, ఎందుకా దిక్కులు పిక్కటిల్లే కరతాళధ్వనులు? విరసంలో ఇంతటి వీరశైవుడు కాబట్టే చెరబండరాజు అందరి కవులకన్నా ఎక్కువ కాలం స్వదేశీ చెరసాలలలో జీవితం గడపవలసి వచ్చింది! అన్నట్టు ఎక్కువ మంది కవులను చెరసాలల్లో నిర్బంధించిన కీర్తిగాని, అపకీర్తిగాని మన మహోఘనత వహించిన ఆంధ్రప్రభుత్వానిదే. అందుకే కాబోలు ఏనాడో రద్దు చేయవలసిన ఆస్థానకవి పదవిని ఈనాటికీ సుస్థిరంగా నిలబెడుతోంది ఈ ప్రభుత?

విరసం ఏర్పడ్డ తరువాత చెరబండరాజు కవిత్వం వచనగీత ప్రక్రియలో కాకుండా జానపద గేయ ఛందస్సులలో రూపొందడం అందరూ ఆహ్వానించదగ్గ ఒక గొప్ప పరిణామం!

విప్లవానికి వెన్నెముకగా చెప్పకోవలసిన కర్షక, కార్మిక లోకానికి ఉత్తేజం కలిగించాలంటే, రచయితలూ, కవులూ జానపద రూపాలనే చేపట్టవలసి ఉంటుంది. ఇది గద్దర్, జనసేన, వంగపండు మొదలైన విప్లవకవులు విస్పష్టంగా ఋజువు చేస్తున్నారు. ఒక సభలో సుమారు మూడు గంటలసేపు జనసేన తన గేయాలతోనూ, మధ్య మధ్య ఘాటయిన వ్యంగ్యపు విసురులతోనూ ప్రేక్షకులను ఉద్రూత లూగించాడు.

పైన చెప్పిన ముగ్గురూ (గద్దర్, జనసేన, వంగపండు) స్వయంగా పాడగలిగిన కవులు. చెరబండరాజుకి పాడడం చేతకాదు. అయినా అతని పాటల్ని సంగీత జ్ఞానం ఉన్నవాళ్ళు పాడినప్పటికన్నా స్వయంగా అతనే ఏదో ఒక వరస పెట్టుకుని పాడుతూ ఉంటేనే నాకెక్కువ ఆనందకరంగా ఉంటుంది.

*ప్రజాతంత్ర 11–9–1977*

# ఇంతవరకు అచ్చయిన శ్రీశ్రీ పుస్తకాలు

1. ప్రభవ, కవితాసమితి, విశాఖపట్టణం 1928
2. వారం, వారం, ప్రతిమాబుక్స్, ఏలూరు 1946
3. సంపెంగతోట, ప్రజాసాహిత్యపరిషత్తు, తెనాలి.
   అనువాదం Chekhov Cherry Orchard 1947
4. మహాప్రస్థానం, నళినికుమార్, మచిలీపట్నం 1950
   విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ దాదాపు 20 ముద్రణలు 1952 to 1984
   శ్రీశ్రీ స్వంతదస్తూరి స్వంతగొంతుక విదేశాంధ్ర ప్రచురణ, లండన్ 1981
5. అమ్మా, (కారల్ చాపెక్ Mother నాటకం అనువాదం)
   అరుణరేఖ ప్రచురణలు, నెల్లూరు సోషలిస్టు పబ్లికేషన్స్, విజయవాడ 1952 1967
6. మేమే, త్రిలింగ పబ్లిషర్స్, విజయవాడ 1954
7. మరోప్రపంచం, రేడియో నాటికలు, అరుణరేఖ ప్రచురణలు, నెల్లూరు 1956
8. 1 ప్లస్ 1=1 (అదే పుస్తకం పేరుమార్పు) రేడియో నాటికలు, 1964 1968
   విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 1979 1984
9. Three Cheers for man Abhyudaya Prachuranalu, Madras 1956
10. చరమరాత్రి కథలు, గుప్తాబ్రదర్స్, విశాఖపట్నం 1957
11. మానవుడిపాట్లు (మైఖేల్ షోలఖోవ్ అనువాదనవల)
    విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 1958
12. Soudamini Puripanda's Poems translated into English,
    Addepally & co రాజమండ్రి 1958
13. గురజాడ, మనసాహితి, హైదరాబాద్ 1959
14. మూడుయాభయిలు, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 1964
15. ఖడ్గసృష్టి, విశాలాంధ్ర ప్రచురణాలయం 1966, 1984
16. వ్యూలు, రివ్యూలు, ఎమ్వీయల్, మినర్వాప్రెస్, మచిలీపట్నం 1969
17. శ్రీశ్రీ సాహిత్యం, 5 సంపుటాలు, షష్టిపూర్తి సన్మానసంఘం, విశాఖపట్నం 1970
18. Sri Sri's miscellany, English Volumes
    షష్టిపూర్తి సన్మానసంఘం, విశాఖపట్నం 1970
19. లెనిన్, (మయకోవిస్కీ కావ్యం అనువాదం) ప్రగతి ప్రచురణ, మాస్కో 1971
20. రెక్కవిప్పిన రివల్యూషన్ Beginning of the End అనువాదం
    ఉద్యమసాహితి, కరీంనగర్ 1971
21. వ్యాసక్రీడలు, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ 1973
22. మరోమూడు యాభయిలు, ఎమెస్కో, సికింద్రాబాద్ 1974
23. చైనాయానం, స్వాతిప్రచురణలు, విజయవాడ 1980
24. మరోప్రస్థానం, విరసం 1980
25. సిప్రాలి, అమెరికాలో ఫోటోకాపీ 1981
26. పాడవోయి భారతీయుడా, శ్రీశ్రీ ప్రచురణలు, మద్రాసు 1983
27. శ్రీశ్రీ వ్యాసాలు, విరసం 1983
28. New Frontiers, విరసం 1983

ఇవేకాక ఎక్కడా అచ్చుకాని శ్రీశ్రీ రాతప్రతులూ, ఉదాహరణకు "చెందయ్యగారిగది", కృష్ణ, కృష్ణ నాటకాలూ— పత్రికల్లో అచ్చయి, పుస్తకరూపంలోరాని రచనలు చాలావున్నవి.

అన్నీ కలిపి మళ్ళీ వర్గీకరించి శ్రీశ్రీ సంపూర్ణ సాహిత్యం మొత్తం 20 సంపుటాలుగా విరసం ప్రచురిస్తుంది. అనంతం 20వది. సిప్రాలి 14 వది.